| | | |
|---|---|---|
| కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి | 16 |
| కవిరాజమనోరంజనము | కనుపర్తి అబ్బయామాత్యుఁడు | 18 |
| కవిజనరంజనము | అడిదము సూరకవి | 18 |
| కవిచకోరచంద్రోదయము | అల్లమరాజు రామకృష్ణకవి | 19 |
| కవిజనచకోరచంద్రోదయము | నారపరాజు కాంతకవి | 19 |
| కార్తికమాహాత్మ్యము | కుందుర్తి వేంకటాచలకవి | 18 |
| కార్తికమాసమాహాత్మ్యము | మండపాక కామేశ్వరకవి | 19 |
| కాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటికవి | 16 |
| కాళిందీపరిణయము | శొంఠి భద్రాద్రిరామకవి | 19 |
| కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన్న | 14 |
| కాశీఖండము | శ్రీనాథకవి | 14 |
| కిరాతార్జునీయము | గోపాలునిసింగయ్య | 18 |
| కుచేలోపాఖ్యానము | గట్టుప్రభువు | 18 |
| కుబ్జాకృష్ణవిలాసము | అక్కినప్రగడ హరిదాసు | 18 |
| కుమారనృసింహము | కొక్కొండ వేంకటరత్నశర్మ | 19 |
| కుమారసంభవము | నన్నెచోడ దేవకవి [కుఁడు | 12 |
| కువలయాశ్వచరిత్రము | నవరము చిననారాయణనాయ | 16 |
| కృష్ణకళ్యాణము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 19 |
| కృష్ణభూపాలీయము | చంద్రకవి | 19 |
| కృష్ణరాయవిజయము | కుమారధూర్జటి | 16 |
| కృష్ణజన్మఖండము | గోపీనాథ వేంకటకవి [ధాని | 19 |
| కృష్ణార్జునసంవాదము | వెలిచెరుకుల వేంకటరామప్ర | 19 |
| కృష్ణార్జునచరిత్రము | మంత్రిప్రెగడసూర్యప్రకాశకవి | 19 |
| కృష్ణామాహాత్మ్యము | తాతంభట్టుగురుమూర్తిశాస్త్రి | 19 |
| కృష్ణాభ్యుదయము | మండపాక పార్వతీశ్వరకవి | 19 |
| కేయూరబాహుచరిత్రము | మంచనకవి | 13 |
| కొక్కోకము | ఎఱ్ఱనకవి | 16 |
| కౌసల్యాపరిణయము | శ్రీపాద వేంకటాచలకవి | 19 |

| | | |
|---|---|---|
| క్రీడాభిరామము | వల్లభరాయకవి | 15 |
| గణోదయము | చిలకమర్తి నారాయణకవి | 19 |
| గయోపాఖ్యానము | రామనామాత్యుఁడు | 18 |
| గాధేయోపాఖ్యానము | అనంతనార్యుఁడు | 18 |
| గంగాగౌరీవిలాసము | వీరనార్యుఁడు | 17 |
| ఘటికాచలమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| చంద్రభానుచరిత్రము | తరిగొప్పుల మల్లనమంత్రి | 16 |
| చంద్రరేఖావిలాపము | కూచిమంచి జగ్గకవి | 16 |
| చంద్రదేవోపాఖ్యానము | ధూళిపాళ కృష్ణకవి | ... |
| చంద్రాంగదచరిత్రము | పైడిమర్తి వేంకటపతి | 17 |
| చంద్రికాపరిణయము | సురభిమాధవరాయప్రభువు | 18 |
| చంపూరామాయణము | ఋగ్వేదకవి వేంకటాచలకవి | 17 |
| చమత్కారమంజరి | సింహాద్రి వేంకటాచార్యుఁడు | 17 |
| చారుచర్య | మంత్రి యప్పన్న | 13 |
| చారుచంద్రోదయము | చెన్నమరాజు చెన్నమరాజు | 16 |
| చిత్రభారతము | చరిగొండ ధర్మన్న | 16 |
| చిత్రసీమ | కొండి భద్రాద్రిరామకవి | 19 |
| చెన్నపురీవిలాసము | మతుకుమల్లి నృసింహకవి | 19 |
| చెన్నబసవపురాణము | అన్నూరి పాపయకవి | 18 |
| చౌడేశ్వరీవిలాసము | నన్నయభట్టు | 11 |
| జానకీరాఘవము | బేతెపూడి కృష్ణయ్య | 18 |
| జాహ్నవీమాహాత్మ్యము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |
| జైమినిభారతము | పిల్లలమర్రి పినవీరభద్రకవి | 14 |
| తపతీసంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి | 16 |
| తారకబ్రహ్మరాజము ✓ | చింతగుంట రాఘామాధవకవి | 16 |
| తారాశశాంకవిజయము | శేషము వేంకటపతి | 18 |
| తాలాంకనందనీపరిణయము | మరింగంటి సింగరాచార్యులు | 17 |
| దశకుమారచరిత్రము ✓ | కేతనకవి | 13 |

| | | |
|---|---|---|
| దశరథరాజనందనచరిత్రము | మరింగంటి సింగరాచార్యులు | 17 |
| దశావతారచరిత్రము | ధరణిదేవుల నాగయామాత్యు( | 18 |
| ద్వాత్రింశత్సాలభంజికాకథలు | కోవెల గోపరాజు [డు | 17 |
| దిలీపచరిత్రము | కొటికలపూడి కృష్ణకవి | 18 |
| ద్రౌపదీపరిణయము | తిరుమలరాజ సూరపరాజకవి | 18 |
| ధనాభిరామము | నూతనకవి సూరన | 17 |
| ధరాత్మజాపరిణయము | క్రొత్తలంక మృత్యుంజయకవి | 19 |
| ధర్మఖండము | ఈదురుపల్లి భవానిశంకరుఁడు | 18 |
| ధర్మాంగదచరిత్రము | దాసరాజు | ... |
| ధీరజనమనోవిరాజితము | తెనాలి రామలింగకవి | 17 |
| నయనోల్లాసము | దేవులపల్లి వేంకటకృష్ణకవి | 19 |
| నరసభూపాలీయము | మూర్తికవి | 16 |
| నరసభూపాలరాజీయము | సోమశేఖరకవి | 19 |
| నలచరిత్రము | సిరిప్రగడ ధర్మయామాత్యుఁడు | 17 |
| నలచరిత్రము (ద్విపద) | చక్రపురి రాఘవాచారి | 17 |
| నాగరఖండము | తుర్కారాజకవి, అయ్యంకిబా | 16 |
| నాగ్నజితీపరిణయము | వల్లూరి నరసింహకవి[లసరస్వతి | 18 |
| నాచికేతోపాఖ్యానము | మిక్కిలి మల్లికార్జునుఁడు | 17 |
| నారసింహపురాణము | హరిభట్టు | 17 |
| నాసికేతూపాఖ్యానము | దగ్గుపల్లి దుగ్గయ్య | 15 |
| నారాయణాచలమాహాత్మ్యము | అల్లమరాజు [illegible]ంగధామకవి | 18 |
| నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి | 16 |
| నిర్వచనోత్తరరామాయణము | తిక్కన | 13 |
| నిర్వచనవిచిత్రరామాయణము | వేల్పూరి వేంకటకవి | 19 |
| నీతిసారము | ప్రతాపరుద్రకవి | [illegible] |
| నీతిశాస్త్రముక్తావళి | బద్దెనకవి | 11 |
| నీలకుంతలావిలాసము | తులగాన నీలకంఠకవి | ... |
| నీలకుంతలీవిలాసము | మావూరి పట్టియ్య | ... |

| | | |
|---|---|---|
| నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| నృసింహపురాణము | ఎఱ్ఱాప్రెగడ | 13 |
| నృసింహవిలాసము | పైడిపాటి వేంకటనృసింహకవి | 17 |
| పంచతంత్రము | బైచరాజు వేంకటనాథుఁడు | 15 |
| పంచతంత్రము | దూబగుంట నారాయణకవి | 15 |
| పండితారాధ్యచరిత్రము | పాలకురికి సోమనాథుఁడు | 15 |
| పట్టాభిరామాయణము | ఘట్టు వేంకటరామకృష్ణకవి | 18 |
| పద్మపురాణము | మడికి సింగన్న | 15 |
| పద్మినీపరిణయము | ఉన్నవ యోగానందసూరి | ... |
| పరమయోగివిలాసము | తిమ్మనృపాలుఁడు | 16 |
| పర్వతపురాణము | శేషనాథార్యుఁడు | 18 |
| పలునాటివీరచరిత్రము | శ్రీనాథకవి | 14 |
| పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| పాంచాలీపరిణయము | కాకమాని మూర్తికవి | 17 |
| పారిజాతాపహరణము | నంది తిమ్మన్న | 15 |
| పార్వతీపరిణయము | కోటి రఘునాథతొండమాఁ | 18 |
| ప్రద్యుమ్నచరిత్రము [విలాసము | పొన్నాడ పెద్దిరాజు | ... |
| ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ | గణపవరపు వేంకటకవి | 17 |
| ప్రబంధరాజశిరోభూషణపరీక్ష్య<br>కృష్ణబలరామచరిత్ర. | గుడాగు వేంకటదాసకవి | 18 |
| ప్రబోధచంద్రోదయము | [illegible], ఘంటసింగన్న | 15 |
| [illegible] | [illegible] | 16 |
| [illegible] | [illegible] బసవప్ప | ... |
| [illegible] (ద్విపద) | [illegible] సోమనాథుఁడు | 16 |
| [illegible] | [illegible] సోమేశ్వరశర్మ | 19 |
| బసవపురాణము (ద్విపద) | పాలకురికి సోమనాథుఁడు | 12 |
| బసవపురాణము | పిడుపర్తి సోమనాథుఁడు | 16 |
| బహుళాశ్వచరిత్రము | దామెరల వేంగళభూపాలుఁడు | 16 |

| | | |
|---|---|---|
| బిల్వేశ్వరీయము | కొక్కొండ వేంకటరత్నశర్మ | 19 |
| బిల్హణీయము | చిత్రకవి సింగరార్యుఁడు | 18 |
| బృందావనవిహారము | దామరాజు లక్ష్మీనారాయణ | 19 |
| బ్రహ్మోత్తరఖండము | శ్రీధరమల్లె వేంకటరామకవి | 19 |
| భద్రాపరిణయము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 19 |
| భరతాభ్యుదయము | మాడభూషి వేంకటాచార్యుఁడు | 19 |
| భర్తృహరిసుభాషితము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |
| భర్తృహరిసుభాషితము | ఎలకూచి బాలసరస్వతి | 16 |
| భల్లాణచరిత్రము | పోచిరాజు వీరన్న | 18 |
| భాగవతము | బమ్మెర పోతనామాత్యుఁడు | 14 |
| భానుమతీపరిణయము | రెంటూరి రంగరాజు | 16 |
| భారతము | నన్నయభట్టాదులు | 11 |
| భారతము | అథర్వణాచార్యులు | 13 |
| భార్గవపురాణము | కాండూరి వేంకటదాసకవి | 18 |
| భీమేశ్వరపురాణము | శ్రీనాథకవి | 14 |
| భోజరాజీయము | అనంతామాత్యుఁడు | 15 |
| భోజసుతాపరిణయము | కోటీశ్వరకవి | 18 |
| మత్స్యపురాణము | హరిభట్టు | 17 |
| మదనసాయకవిలాసము | చదువుల సోమలింగయ్య | 18 |
| మనుచరిత్రము | అల్లసాని పెద్దన | 15 |
| మహేంద్రవిజయము | దేవులపల్లి సుబ్బరాయకవి | 19 |
| మార్కండేయపురాణము | మారన | 13 |
| మిత్రవిందాపరిణయము | కుందుర్తి వేంకటాచలకవి | 17 |
| మిత్రవిందాపరిణయము | రావుజనార్దనరంగారావుగారు | 19 |
| ముకుందవిలాసము | కాణాద పెద్దనసోమయాజి | 17 |
| మూర్తిత్రయోపాఖ్యానము | దంతులూరి బాపరాజు | 18 |
| మైరావణచరిత్రము | మాడయకవి | 19 |
| యతిరాజవిజయము | దేవులపల్లి సుబ్బరాయకవి | 19 |

| | | |
|---|---|---|
| యయాతిచరిత్రము | పొన్నికంటి తెలగనార్యుఁడు | 16 |
| యాజ్ఞవల్క్యచరిత్రము | గట్టుప్రభువు | 18 |
| యాదవరాఘవపాండవీయము | నెల్లూరి వీరరాఘవకవి | 18 |
| యామినీపూర్ణతిలకావిలాసము | చన్నపిళ్ళ ఎరసకవి | 18 |
| రంగరాయచరిత్రము పద) | దిట్టకవి నారాయణకవి | 18 |
| రంగనాథరామాయణము (ద్వి | రంగనాథుఁడు | 13 |
| రంగనాథరామాయణము ,, | కాచభూపతి, విఠ్ఠలరాజు | 13 |
| రంభాకలకూబరవిలాసము | బండి వెంకటస్వామినాయనికవి | 19 |
| రఘురామచరిత్రము | కృష్ణగిరి కృష్ణకవి | 19 |
| రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రసికజనమనోరంజనము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| రాఘవపాండవీయము | పింగళి సూరన్న | 16 |
| రాఘవపాండవయాదవీయము | అయ్యగారి వీరభద్రకవి | 19 |
| రాజశేఖరచరిత్రము | మాదయగారి మల్లన | 16 |
| రాజవాహనవిజయము | కాకమాని మూర్తికవి | 17 |
| రాజశేఖరవిలాసము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రాధామాధవసంవాదము | వెలిదండ్ల వేంకటపతి | 18 |
| రాధాకృష్ణసంవాదము | మండపాక పార్వతీశ్వరకవి | 19 |
| రాధికాసాంత్వనము | ముద్దుపళని | 18 |
| రామచంద్రోపాఖ్యానము | వారణాసి వేంకటకవి | 19 |
| రామచంద్రోపాఖ్యానము | మిక్కిలి మల్లికార్జునుఁడు | 19 |
| రామవిలాసము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |
| రామరాయవిలాసము | దేవులపల్లి సుబ్బరాయకవి | 19 |
| రామాయణము | భాస్కరాదులు | 14 |
| రామాయణము | మొల్ల | 16 |
| రామాయణము | గోపీనాథ వేంకటకవి | 19 |
| రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రకవి | 16 |
| రామేశ్వరమాహాత్మ్యము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |

| | | |
|---|---|---|
| రావువంశముక్తావళి | దేవులపల్లి వేంకటకృష్ణకవి | 19 |
| రుక్మాంగదచరిత్రము | ప్రౌఢకవి మల్లనార్యుఁడు [డు | 14 |
| రుక్మిణీకళ్యాణము | జన్నాడ వేంకటరంగాచార్యుఁ | 19 |
| రుక్మిణీపరిణయము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రుక్మిణీపరిణయము | సత్యవోలు భగవత్కవి [రులు | 18 |
| రేఖామతశాస్త్రము | అయ్యలరాజు, అయ్యలభాస్క | 18 |
| లంకావిజయము | పిండిప్రోలు లక్ష్మణకవి | 18 |
| లక్ష్మీవిలాసము | రాయసము వేంకటపతి | 16 |
| లక్ష్మీనారాయణపరిణయము | శివపల్లి సర్వోత్తమకవి | 18 |
| వరాహపురాణము | నందిమల్లయ్య, ఘంటసింగన్న | 15 |
| వరాహపురాణము | హరిభట్టు | 17 |
| వల్లీవల్లభోల్లాసము | మాడభూషినృసింహాచార్యుడు | 19 |
| వసుచరిత్రము | రామరాజభూషణుఁడు | 16 |
| వాల్మీకిచరిత్రము | రఘునాథభూపాలుఁడు | 17 |
| వాసవదత్తాపరిణయము | వక్కలంక వీరభద్రకవి | 18 |
| వాసవదత్తాపరిణయము | ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణ | 19 |
| విక్రమసేనము | చిమ్మపూడి యమరేశ్వరుఁడు | 13 |
| విక్రమార్కచరిత్రము | జక్కనకవి | 14 |
| విజయసేనము | తిక్కనసోమయాజి (?) | 13 |
| విజయవిలాసము | చేమకూర వేంకటకవి | 17 |
| విజయనందనవిలాసము | మంగళగిరి ఆనందకవి | 18 |
| విజ్ఞానేశ్వరము | కేతన | 13 |
| విజ్ఞానప్రదీపిక | చెన్నవీరయ | 19 |
| విప్రనారాయణచరిత్రము | చదలువాడ మల్లయకవి | 16 |
| విశ్వకర్మపురాణము | వీపూరి వేంకటాచార్యుఁడు | ... |
| విశ్వగుణాదర్శనము | తిరుమలబుక్కపట్టనచినతాతా | 19 |
| విష్ణుపురాణము | వెన్నెలకంటిసూరన్న [చార్యుడు | 15 |
| విష్ణుమాయావిలాసము | రోసనూరి వేంకటపతి | 17 |

| | | |
|---|---|---|
| వీథినాటకము | శ్రీనాథకవి | 14 |
| వీరభద్రవిజయము | బమ్మెర పోతనామాత్యుఁడు | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము | దామెర చినవేంకటరాయకవి | 18 |
| వేంకటాచలమాహాత్మ్యము | తరిగొండ వెంకమాంబ | 18 |
| వేంకటేశ్వరవిలాసము | చళ్ళపిళ్ళ నరసకవి | 19 |
| వేదాంతరసాయనము | మంగళగిరి ఆనందకవి | 18 |
| వైజయంతీవిలాసము | సారంగు తమ్మయ్య | 16 |
| వైశ్యపురాణము | శ్రీగురు భాస్కరాచార్యులు | 18 |
| శంకరవిజయము | ఆలూరు కుప్పనకవి | 19 |
| శంతనువిలాసము | అల్లమరాజు రామకృష్ణకవి | 19 |
| శంతనూపాఖ్యానము | శొంఠి భద్రాద్రిరామశాస్త్రి | 19 |
| శకుంతలాపరిణయము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి | 14 |
| శకుంతలాపరిణయము | రేవుణూరి వేంకటార్యుఁడు | 18 |
| శకుంతలాపరిణయము | కృష్ణకవి | 18 |
| శకుంతలాపరిణయము | పెద్దాడ నాగయామాత్యుఁడు | 18 |
| శకుంతలాపరిణయము | ఫక్కి వేంకటనరసయ్య | 19 |
| శతకంఠరామాయణము | లింగకవి, గంగకవి | 17 |
| శశిరేఖాపరిణయము | అప్పప్పకవి | 19 |
| శివజ్ఞానదీపిక | పెదపాటి సోమనకవి | ... |
| శివరాత్రిమాహాత్మ్యము | శ్రీనాథకవి | 14 |
| శివరాత్రిమాహాత్మ్యము | లోకేరావు సోమనాథార్యుఁడు | ... |
| శివయోగసారము | ఆనియాది గణపతిదేవుఁడు | 17 |
| శివలీలావిలాసము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| శిశుపాలవధ | గోపీనాథ వేంకటకవి | 19 |
| శుకసప్తతి | పాలవేకరి కదరీపతినాయకుఁడు | 18 |
| శుద్ధాంధ్రోత్తరరామాయణము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| శుద్ధాంధ్రభారతసంగ్రహము | కందుకూరి వీరేశలింగకవి | 20 |

---

N. B—ఈగ్రంథములలోని పద్యములే గాక మఱియు ననేకగ్రంథములలోని పద్యములు గూడఁ జేర్పఁబడుచున్నవి.



# వర్ణనానుక్రమణిక.





# విన్నపము.

ఈగ్రంథముద్రణంబునఁ బ్రమాదవశమునఁ గలిగిన స్ఖాలిత్యంబుల సవరించికొని, చదువఁ జదువరులు ప్రార్థితులు.

గ్రంథకర్త.

శ్రీ

పరమేశ్వరాయనమః.

# వర్ణనరత్నాకరము.

## పురవర్ణనము.



గుతరహర్మ్యమాలికల♦నొప్పునగిరిప్రజ మున్ను నంబుఁ గాం
చిరి నవసౌరభప్రసవ♦చిత్రవనావళి గల్గుదాని నె
వ్వరికి దురాసదంబు లగు♦వప్రజమయోన్నతవప్రచారుగో
పురములదాని నయ్యలకఁ♦బోలెడుదాని మహార్థసంపదన్. 1

భారతము సభాపర్వము, ఆశ్వాసము 1 పద్యము 172.

సీ. మొలఁగులఁ గన్నులు ♦ మిఱుమిట్లు వోయెడు, నవుల చింతామణి♦హర్మ్యములను
పళ్ళతళ్ళ వెలిఁగెడు♦తిరల ప్రభాస్పర్శ, వేదికుట్టిమతల♦వీథికలను
దేదీప్యమాన మై ♦ తేజరిల్లెడుసిద్ధ, ఘుటికాదినవవప్ర♦గోపురముల
భాభాసితానూన♦పరిఘాఘటీలతా, చారుతరానేక♦తోరణములఁ
*గీ. జితత్రివర్గాతిశయరత్న♦చిత్రితాంగ, రంగవల్లి(క)బహుమరం♦గాంగణములఁ
గలిగి విశ్వంబునకుఁ బస♦వెలుఁగువెలుఁగు, నేయము తేజోమయంబగు♦శివపురంబు.

కుమారసంభవము ఆ. 7 పద్య. 987

సీ. రాజమండలపూర్ణ♦ రాజమండలవీథి, రత్నగర్భముల♦రత్నగర్భ
గంధర్వగంధర్వ♦గంధర్వనగరంబు, నాగపున్నాగనా♦పున్నాగవనము
మార్గణమార్గణ♦మార్గణపేటము, భృంగిభుజంగభు♦జంగిభూమి
కాంచనకాంతారాతి♦కాంచనకుంతస్థలి, మీనకుమారకమ♦మారసరసి

---

* "జితత్రివర్గాతిశయమూర్త్న♦రత్నచిత్రి, తాంగ్రరంగ్రవల్లీమరాం♦గ్గాంగ్గణము
లఁ, గలిగి..." అని పాఠాంతరము.

ఆ.వె. యనఁగఁ*బొగడుకెక్కు♦నలకాపురంబు దే, వేంద్రుపురము దాన♦వేంద్రుపురము
శ్రేణిసేయు లలిత♦శోణాంశుమణిబద్ధ, గోపురంబు హస్తి♦నాపురంబు. 3

అథర్వణభారతము.

సీ. పరపు లోఁతును గల ♦ పరిఖతోఁ బొడువును, ఘనమును గలకోట♦ గలిగి తగిన
వాకిళ్లు బలుపుఁగా ♦ వలి నొప్ప రమ్యగృ,హవ్రాతములు గోము♦రారు వీథు
లందంబు లగు మేటి♦యంగళ్లు నెల్లవ,స్తువులును శోభిల్ల ♦ సుజనబహుళ
మైధాన్యములును ఘృ♦తాదిరసద్రవ్య,ములును నానాయంత్ర♦ములును బహువి
ఆ.వె. ధాయుధములు బిరుదు♦లగు యోధులును బండి,తులు విలాసినులును♦ద్యూతముఖ్య
ప్రజనములు నెఱయఁ♦బర మోత్సవంబులు, మెఱయఁ బురము చెలువు♦మిగుల వలయు.

భారతము శాంతిపర్వము, ఆశ్వా. 2 పద్య 383.

సీ. అఖిలభోగములకు ♦ నాస్పదం బగుట భో,గీంద్రుపట్టనమున ♦ కీడ యనియు
ధనసమృద్ధుల కెల్లఁ ♦ దల్లియై యగుటఁ గు,బేరునివీటికిఁ ♦ బెద్ద యనియు
వైభవంబులకు నా♦వాసంబగుట సము,రాధీశుపురమున ♦ కధిక మనియు
నిర్మలస్ఫూర్తికి ♦ నెల వగుటను భార,తీశ్వరుపోలికి ♦ నెక్కు డనియు
ఆ.వె. వినుతి సేయఁ జాలి♦వివిధోత్సవంబుల, నతిశయిల్లి సజ్జ♦నాభిరామ
మై కరంబు వొలుచు♦నన్నగరంబు వి,స్ఫురితసకలవస్తు♦పూర్ణ మగుచు. 5

నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 46.

సీ. ఎందులపరిఖ భో♦గీంద్రబృందమునకు, భానుగకేళిని♦వాస మయ్యె
నెందులకోట ది♦నేంద్రునశ్వములకు, సముచితవిశ్రమ♦స్థాన మయ్యె
నెందులసౌధంబు ♦ లిందిరాదేవికి, నెసకంపుఁబుట్టిన♦యిండ్లు లయ్యె
నెందులజనులస♦మృద్ధవర్తనములు, పరుల కుత్తమకృత్య♦భంగులయ్యె
ఆ. నట్టికుసుమపురము ♦ నందు విశ్వంభరా,భారభరణపరిణ ♦ తోరుభుజుఁడు
రాజవంశజుండు ♦ రాజహంసుం డను, రాజు గలఁడు దిగిభ♦రాజనిభుఁడు. 6

దశకుమారచరిత్రము, ఆ 2 పద్య 3.

సీ. జనపాలనుతసింహ ♦ నకరినాలంబు సా,మంతనిర్మలరత్న ♦ మండనంబు
రాజత్తురంగత♦రంగపయోనిధి, భద్రేభమేఘన♦భస్స్థలంబు
భూదేవదేవతాం♦బూనదాచలము వ,దాన్యకల్పకదేవ♦తాపురంబు
బహుకళాకర్యాగ♦భాసికరండంబు, సుజనముక్తాఫల♦శుక్తిచయము

(2) * “అనఁ బొగడ్త కెక్కు” అని పాఠాంతరము.

తే. చతురకాంతాప్రసూనవ◆సంతవేళ, రసికవిటజనమధుకరా◆రామలక్ష్మి
మధురకవిరాజనవహంస◆మానసంబు, నాఁగ ధనదపురంబు వ◆ర్ణనలఁ బెనఁచు. 7
కేయూరబాహుచరిత్రము, ఆ 1 పద్య 16.

సీ. కనకంపుఁ బెనుఁగోట◆ కనుపట్టఁ గడవంగ, మణిగోపురములు స◆మగ్రములుగ
బంధుర ప్రాసాద◆పంక్తులు నుత్తుంగ, హర్మ్యరేఖలు మనో◆హరత నలర
రాజమార్గం బభి◆రామంబుగాఁ బణ్య,పదము లుజ్జ్వలశిల్ప◆భంగి సమర
నమరసద్మములుఁ జై◆త్యంబులు సభలును, బ్రపలు సత్త్రాళ్వఁపు◆రచన మెఱయఁ
తే. నానశాస్త్రాలకంబులు ◆ నారములుగఁ, గూఢదుర్ఘకాసారములు ◆ గొమరుమిగుల
గృహకపర్వతోద్యానంబు◆లతులములుగఁ, బరగు పురము నిర్మించె న◆చ్చెరువు గాఁగ.
హరివంశము, ఉత్తరభాగము, ఆ 2 పద్య 16.

సీ. దిగ్గజోపమమద◆ద్విపదానవిర్ఘర, దుర్దినాయితభూమి ◆ దోహలంబు
హరితురంగోపమ ◆ హరిఖురక్షుణ్ణ హేమ, కుట్టిమోత్థితరేణు ◆ గుంఠితంబు
జలధిమనోజవహయో◆ద్ధతమణిస్యందన, విస్తారితాదిత్య◆విపులరథము
సన్యోగ్రవిభవాప◆హాసమహాయోధ, ఘనభటఘటానన ◆ సంకులంబు
తే. సురవధూపమయోషిత్సు◆శోభితంబుఁ, గనకమందిరగమ్యత మేరు◆గౌరవంబు
నిప్పురోత్తము మెంతయు◆నొప్పు ననుచుఁ, జూచి సంతస మందిరి◆ చూడ్కు లలరఁ.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2515.

సీ. గంభీరపరిఖ నా◆గస్త్రీల కశ్రాంత, కేళీవిహారదీ◆ర్ఘిక యనంగ
నుత్తాలసాల మ◆న్యూలకుబ్జి దివిఁ బ్రాఁకఁ, జేసినదిగ్గని◆శ్రేణి యనఁగఁ
జనుల చాతుర్వర్గ్య◆సంఘ మర్థులపాలి, రాజితకల్పకా◆రామ మనఁగఁ
బ్రాంతసుస్థిత యైన ◆ భవజూటవాహిని, భుక్తిముక్తిప్రద◆మూర్తి యనఁగ
తే. నెప్పుడును నొప్పు రాజమ◆హేంద్రపురము, ధరణిఁ గల్పించె నేరాజు◆ దనదు పేర
నట్టి రాజమహేంద్రుని◆ యనుఁగు మనుమ, డెసఁగుఁ జాళుక్యవిశ్వన◆రేశ్వరుండు.
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస 3 పద్య 94.

సీ. పద్మరాగవిరచనాతి ◆ భాసురప్రాసాద, నిర్జితగోత్రప◆నీధరంబు
ప్రాకారశిఖరాగ్ర◆బంధురమణిగణ, ద్విగుణితతారకా◆విభ్రమంబు
పరిఖాంతరాంతర◆ప్రతిబింబితద్రుమ, స్మారితపాతాళ◆భూరుహంబు
వనపుష్పసౌరభా◆వర్జితమధుపశ్రీ, స్వీకృతాశావార◆ణేంద్రగండ
తే. మప్సరస్సదృశాణీయలీ◆లాతిశయవి, లాసినీజననేత్రవి◆లాసజనిత

కుసుమశరబాణ*నైహర్త్య ♦ మసదృశార్ఘ, నిర్జితాలక ముజ్జయి♦నీపురంబు. 11

అమరేశ్వరుని విక్రమసేనము.

గీ. పరిఖ గుడివోలెఁ దనచుట్టుఁ♦దిరిగియుండఁ, బరుల కేరికి గ్రహణగో♦చరము గాక
విషధరాధీశభాషిత♦విషమభాష్య, భక్తికయుఁబోలె నొప్పె న♦వ్వట్టణంబు. 12

శృంగారనైషధము, ఆ 2 పద్య 38.

సీ. శ్రీకలితానూన♦చిత్రరేఖాయుక్తి, గొమ్మలందును గోట♦కొమ్మలందు
నవరసపదయుక్తి ♦ నానార్థ¶గరిమలు, రాజులందును గవి♦రాజులందు
గవిలోకసంతోష♦కరజీవనస్థితి, సరసులందును గేళి♦సరసులందు
నవనవశ్రీ సుమ♦నఃప్రవాళవిభూతి, మావులందును సెల♦మావులందు
గీ. గలిగి సముదగ్రసౌధాగ్ర♦తలసమగ్ర, శాతకుంభమహాకుంభ♦జాతగుంభి
తోరురత్నవినూత్నశృం♦గార మగుచు, సిరుల నొప్పారు విక్రమ♦సింహపురము.

విక్రమార్కచరిత్రము, ఆ 7 పద్య 133.

సీ. పద్మరాగోపల♦ప్రాకారరుచిజాల, గండూషితవ్యోమ♦మండలంబు
పాతాళజలఝరీ♦పర్యాప్తకల్లోల, సుకుమారపరిఖోప♦శోభితంబు
శక్రనీలశిలావి♦శాలగోపురరోచి, రసమయజనితమి♦థ్యాతమంబు
కనకగోపానసీ♦ఖచితముక్తాఫల, రాజీవిలగ్నతా♦రాగణంబు
గీ. రాజసదనాగ్రదేశవి♦రాజమాన, తోరణాలీనమణిగణ♦ద్యుతివితాన
విభవలక్ష్మీవిలంబిత ♦ విలసదింద్ర, చాపరుచిచాపలము హాస్తి♦నాపురంబు. 14

శకుంతలాపరిణయము (పి. పిన వీ.), ఆ 1 పద్య 69.

ఉ. సారకవీంద్రచాతకవి♦శాలవిలోకమయవృష్టిధార ని
స్సారదరిద్రభారతము♦ఖండనికారకరాంతధార సం
సారకృశానుతప్తజన♦శైత్యకరామృతధార గాక యా
ధార దలంప నన్యపసు♦ధారమణీశపురోపవాసమే. 15

భోజరాజీయము, ఆ 2 పద్య 45.

సీ. వేదశాస్త్రపురాణ♦విద్యావిజృంభిత, కలితధాత్రీసుర ♦ కలకలంబు
గజహయారోహణ♦కౌశలసంచార, మహితరాజకుమార♦మండలంబు
వజ్రముక్తాఫల♦వస్త్రసువర్ణాది, సకలవిక్రయవైశ్య♦సంకులంబు
నానాయుధాభ్యాస♦నైపుణ్యధౌరేయ, విశ్రుతసచ్ఛూద్ర♦విభ్రమంబు
గీ. కల్పితానల్పదేవతా♦గారభూమి, రత్నకీలితఘనసౌధ♦రాజితంబు

* "నైపుణ్యము" అని పాఠాంతరము. ¶ ([illegible] ?)

నగుచునమరేంద్రునగరంబు♦నగుచుధాత్రిఁ, బొలుచుఁ బాటలీపుత్త్రిమ♦న్పురవరంబు.

పంచతంత్రము (దూ. నా.), ఆ 1 ప 48.

సీ. వనజగర్భకటాహ♦వర్తిష్ణువరణంబు, బలిబహూకృత పుణ్య♦సలిలఖేయ
మరుణాంశుకలశభా♦సురరత్నసౌధంబు, మఘరభిద్గృహచుంబి ♦ గోపురంబు
ధనదధామక్రీడ సం♦ద్ధాత్రనిష్కుటకంబు, బ్రహ్మనిష్ఠద్విజ♦ప్రాంజలంబు
భార్గవశౌర్యవై♦భవయుతక్షత్త్రంబు, పౌలస్త్యనిభవణి♦గ్భాసురంబు
గీ. పద్మనాయకశుభవిభా♦భర్త్స్యమాన, విద్యదావాసమండలీ♦విహరమాణ
భూరిసంతాపతిమిరంబు♦ పొగడనెగడుఁ, బూర్ణగరిమంబు పాటలీ♦పురవరంబు.

పంచతంత్రము బై. వేం. ఆ 1.

సీ. ఏవీటిసతుల పా♦లిండ్లపైఁ గంబూర, నవహారములచిప్ప♦కప్పుఁ చు మాన్చు
మలయజం బేవీటఁ ♦ దొలిచెక్కుడులిచి మే, డలకిడ్డ మిగులుభూ♦ములకు డిగ్గఁ
గలఁచు నేవీటిసిం♦హళగజంబులగాలి, చైత్రవేళ నుదగ్ధి♦శాగజంబుఁ
దాల్చు నేవీటఁ బ్రా♦క్తనభూపనిర్మాల్య, మరకతంబులు వెల♦ధరణిపతులు
గీ. కపివరనియుక్త గిరిసదృ♦గ్గృహనిలయ, గాత్రగాహితకనక ము♦క్తాకవాట
గోపురావేదితోచ్చతా♦క్షోభ్యవప్ర, జనరు దక్షిణమధుర సాం♦ద్రద్రుమధుర.

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 3.

మ. వరుణాద్వీపవతీతటాంచలమునన్ ♦ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళిత♦ప్రాలేయ రుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నా♦ర్యావర్తదేశంబునం
బుర మొప్పు న్మహికంఠహార తరళ♦స్ఫూర్తి న్విడంబించుచున్. 19

మనుచరిత్రము, ఆ 1 పద్య 49.

సీ. సౌధచర ద్వధూ♦జన దర్పణీభవ, ద్దివ్యలోకస్రవం♦తీజలంబు
రజతవప్రస్థాణు ♦ గజచర్మశాటీభ, వత్పరిఖావారి ♦ వలయితంబు
శాతమన్యవశిలా♦స్థగితకాంచీధామ, భాసురోపవనాళి♦పరివృతంబు
పౌరప్రతాప వి♦భ్రాంతికృ త్కుముదినీ, [illegible]♦[illegible]స్ఫురితతంబు
గీ. బహువిధామోదమోదితా♦ప్తసలకలభ, [illegible]♦[illegible] నినద
[illegible]♦[illegible], [illegible]♦[illegible]పురము. 20

రాజశేఖరచరిత్రము, ఆ 1 పద్య 44.

సీ. కమలాకరములెల్లఁ ♦ గమలాకరములౌట, [illegible] ♦ తెలియఁబడక
[illegible] ♦ [illegible], కువలయప్రియావృత్తి ♦ వివరపడక

మాణిక్యచయమాట ♦ మాణిక్యచయమాటఁ, గ్రొత్తడాలు సెలంగ♦గుఱుతుపడక
యమరదీర్ఘిక లౌట ♦ నమరదీర్ఘిక లౌట, ఘనసువర్ణాబ్జత ♦ గానఁబడక
గీ. గోపురము లౌట మణిమయ♦గోపురంబు,లౌట గురుసమున్నతి మెయిఁ♦దేటపడక
ద్వాపరంబున విలసిల్లు ♦ ద్వాపరంబు, గరిమఁ దనరారు మాణిక్య♦పురవరంబు.
నిరంకుశోపాఖ్యానము, ఆ 1 పద్య 43.

సీ. జాతరూపమనోజ్ఞ♦జాతరూపం బైన, కోటచే పలయాద్రి ♦ నోటుపఱచి
మధుసుధారసపూర ♦ మధురనీరం బైన, పరిఖచే వారాశి ♦ భంగపఱచి
నవరత్నచిత్రాభి ♦ నవయత్నకము లైన, యిండ్లచేఁ గనకాద్రి ♦ యేపుగఱచి
కాంతనిర్మలచంద్ర♦కాంతబద్ధము లైన, కుట్టిమంబుల ధాత్రిఁ ♦ గొంచెపఱచి
గీ. కమలగర్భుండు దనసృష్టి ♦ గాని భువన, కోశగర్వంబు నణఁగింపఁ ♦ గోరి దీని
వేడ్క నిర్మించె ననఁ బొల్చు ♦ విమతహృదయ, ఘట్టనం బైన సాకేత♦పట్టనంబు.
కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 103.

సీ. శ్రీరమారమణవి♦హారహారిగృహంబు, బహుశోభనాన్విత ♦ ప్రత్యహంబు
సతతపౌరజనాచ ♦ రితవిస్మృతిమహంబు, దుర్వారచతురంగ ♦ ధూర్వహంబు
శ్రీమహారత్నమగంధ♦సహితగంధవహంబు, దీపితారాతిగ♦ర్వాపహంబు
నాయికానాయకో♦న్నతరహఃకలహంబు, సర్వవస్తువ్రాత♦సంగ్రహంబు
గీ. మహిని రహిమీరు నౌర పం♦పానదీత, రంగసంఘుఘుమంఘుమా♦రవవిధూత
బాహ్యవీనిమ్నగాసుధా♦సాగరంబు, విజయనగరంబు సుజనసం♦విత్కరంబు. 2
కృష్ణరాయవిజయము, ఆ 1 పద్య 43.

సీ. అతులితశ్రీమనో♦హరవాసమై సర్వ, మంగళాన్వితమహో♦మహిమ నెనసి
సూనితవాక్ఛతు♦రాననస్థితిఁ జెంది, విబుధాధినాథస♦ద్విభూతి నెనసి
ధర్మపాలనశుభో♦దయరీతిఁ జెలువొంది, భువనైకవైభవ♦స్ఫురణ నలరి
ధనదాత్తనవనిధా♦ననదానగతి మించి, పరిబలపున్నాగసం♦పద వహించి
గీ. జగతి వైకుంఠకైలాస♦సత్యలోక, దిగ్వరపురాధిరాజము♦దిరనిభప్రి
భావభాసిత మగుచుసం♦పదలఁ బొదలు, నఖిలవిద్యాకరం బయో♦ధ్యాపురంబు
ఇందుమతీపరిణయము, (కుమా. ధూర్జ.) ఆ 1 పద్య 141.

సీ. శ్రీభావిశేషమి♦శ్రీభావిభవనంబు, సారసకలితకా♦సారసమితి
ప్రాకారవ్రజదీ♦ప్రాకారహర్మ్యంబు, కుంజరంజితభద్ర♦కుంజరంబు
రమణీయతావాస♦రమణీయుతవిలాసి, కాంచనసౌధాధి♦కాంచనంబు
రాజహంసకులీన♦రాజహంసకులంబు, బంధురమ్యగృహస్థ♦బంధురంబు

గీ. కల్పకానల్పశోభనా♦కల్పకంబు, గోపురద్వారమండిత♦గోపురంబు
సింధుజన్మాశ్వదేశీయా♦సింధుజంబు, గజపురం బొప్పు జితమరు♦ద్గజపురంబు. 25

తపతీసంవరణోపాఖ్యానము, ఆ 1 పద్య 43.

సీ. ఆతరు లమరలో♦కాలోకమున కెక్క, జగతి గాఁగల దేమొ♦గగనభాగ
మాదంతులు కులాచ♦లాలానముం గొన్నఁ, గుమ్మించు నేమొ ది♦క్కుంజరమ్ము
లామాపు లాత్రోవ♦కలఁతి దాఁటులు దాఁట, సరివీథి గను నేమొ♦తరణిహయము
లావీరభటులు సా♦హసపుసాములఁ బూయఁ, బైపూఁతయగు నేమొ ♦ బలపరాగ
గీ. మాచకోరాక్షులకటాక్ష♦మందు నేమొ, సాంగముగఁ జూడ సామ్రాజ్య♦మంగభువన
కాపురమ కాణయాచిగై♦యమరు నేమొ, కాఁపురము సేయ వీరశృం♦గారములకు.

కకుత్స్థవిజయము, ఆ 1 పద్య 123

సీ. వరసుమనోభవ్య♦తరుల కావాల మ,త్యలఘుకలాపాలి ♦ కలరు భరణి
సరిలేని తెలిముత్తె♦సరులకొట్టారు క, ళ్యాణపరంపర♦లతోలుదీవి
సురుచిరమణుల కా♦కరసీమ శ్రుతిహిత,భాషివద్విజకోటి♦పట్టుఁగొమ్మ
సగసుల కారామ ♦ సరణి శ్రీరంగగే, హక్రోడవాసిని ♦ కాటపట్టు
గీ. వెలయు నావరణాంబుసం♦వీతహాట, కాండమోహదపరిఖావృ♦తాంఘ్రివజ్రి
దంతురప్రాంతగంగాని♦రంతరాగ్రి, భూరివరణం బధస్థాన♦పురవరంబు. 27

వసుచరిత్రము, ఆ 1 పద్య 94.

సీ. శూలశయాభీల♦శూలదుర్వారంబు, భూరిమాయుగతి ప్ర♦భూషితంబు
రాజితనానాక్షి♦రాజిపరికరంబు, నవతిరసాతినం♦దద్విజంబు
ఘననాట్యభూతాళి♦కారవనాచాల, మధిక రక్తాశ్వదీ♦ప్తాజిరంబు
పాత్రిజ్యధూమనిరంత♦రచితానలవితాన, మనవధికార్తస్వ♦రాభిపూర్ణ
గీ. మలఘుభూతియగణ్యపు♦ణ్యజనపాళి, కాసమసనం బయోధ్య దై♦ర్వాసమాన
మంత్రికృత్యాస్పద మనూన♦మానసాబ్జ,గుంభితాశ్చర్యఁ దైకనుం♦గొనుచువచ్చి.

హరిశ్చంద్రనళోపాఖ్యానము, ఆ 5 పద్య 6.

సీ. ధాత్రిమహాదేవి ♦ తాల్చినమున్నీటి, మొలనూలిరత్నంపు♦మొగ పనంగ
జలధిపేరిటిపాప♦తలచుట్టు గలధరి, తీర్మూర్తిశివుచిత్రి♦తిలక మనఁగ
నలురదిక్సతి కట్టి♦నట్టిసాగరమను, పుట్టంపుఁదుది వ్రాఁత♦మొగడ యనఁగ
వరుణగోపురబద్ధ♦నాద్ధితోరణమాగ్య, గుంభితనవపుష్ప♦గుచ్ఛ మనఁగ
గీ. వివిధమణిమయగృహపఙ్క్తి♦విసరవిసర, శోభశోభిత మగుగ్వార♦కాపురంబు

దవులఁ గాన్పించెడునుఁ జూడ♦ దైవవిభుఁడు, వేయికన్నులుఁ జాలక♦ వెంగుపడఁగ.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 1 పద్య 54.

చ. అగణితలీల నప్పురము ♦ నందు విరాజిలుచుండు నెంతయున్
మృగమదలేపపంకముల ♦ మేలిమికోటలు పుష్పఁదోఁటలున్
నిగనిగమన్విటంకములు ♦ నీలపుమేడలు పైడిగోడలుం
బగడపుటంచుపొంకములఁ ♦ బచ్చలతిన్నెలు వింతవన్నెలున్. 30

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 114.

సీ. శ్రీకరోదయ వధూ♦లోకాననప్రభా, నాటితబహుచంద్ర♦నాటనంబు
సమ్మర్దగళితభూ♦షారత్నమంజరీ, యోజితరథ్యాప్ర♦పూజనంబు
కైలాసశైలసం♦కాశసౌధనివేశ, కౌముదీకవచిత♦గగనతలము
విస్తీర్ణవిపణివి♦న్యస్తవస్తువ్రజ, ప్రకటితరత్నగ♦ర్భాజఠరము
గీ. విపులపవమానతాండవ♦వేపమాన, లాంఛనధ్వజపట్టప♦ల్లవలలామ
మౌళిరచితకశాకృత్య♦హేళిహయము, దీపితం బగుశ్రీకాశి♦కాపురంబు. 31

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 103.

సీ. శ్రీకరానేకర♦త్నాకరప్రాకార, గోపురప్రాసాద♦దీపితంబు
సౌధాగ్రసంచర♦జ్జలజముఖీముఖ, మణిదర్పణితచంద్ర♦మండలంబు
కనకనికేతనా♦కలితకేతనపటీ, పల్లవాంకితదిశా♦పతిపురంబు
ప్రతిమందిరాళింద♦భాగముక్తాఫల, రంగవల్లీవిభా♦రాజితంబు
గీ. నీలమణిరాగకీలితో♦న్మీలదభ్ర, చుంబిహర్మ్యకదంబనీ♦లాంబుదభ్ర
మప్రదాలోకవర్తితా♦మరవనాహి, భుగ్వితానంబు కాంచికా♦పురవరంబు. 32

ఘటికాచలమాహాత్మ్యము, ఆ 2 పద్య 161.

సీ. మదనాగయూథస♦మగ్రదేశము గాని, కుటిలవర్తనశేష♦కులము గాదు
ఆహవోర్వీజయ♦హరినివాసము గాని, కీశసముత్కరాం♦కితము గాదు
సుందరస్యందన♦మందిరం బగుఁ గాని, సంతతమంజులా♦శ్రమము గాదు
మోహనగణికాస♦మూహగేయము గాని, యూథికానికరసం♦యుతము గాదు
గీ. సరససత్పుణ్యజననివా♦సమ్ము గాని, కఠిననిర్దయదైత్యసం♦ఘమ్ము గాదు
కాదు కాదని కొనియాడఁ♦గలిగినట్టి, పురవరాగ్రమ్ము సాకేత♦పురవరమ్ము. 33

మొల్లరామాయణము, బాల పద్య 2.

చ. కల దొక పట్టణంబు మహి♦కౌశరసాలినివాసహాసిపే
[illegible]కాంతసౌధ[illegible]♦[illegible]గగ[illegible]

జలరుహామిత్రవంశనృప♦చంద్రయశోలతికాలవాలమున్
బలెఁ బ్రభూతవజ్రసాలము సంఘం బొరయంగ నయోధ్య నా మహిన్. 34

సుదక్షిణాపరిణయము, ఆ 1 పద్య 63.

సీ. తగఁ గోటఁ దాచిన ♦ మగమానికంబుల, తెలిరంగు లెపుడు వె♦న్నెలలు గాయ
మేడలపై నాడు మెలఁతలుఁ దెఱఁగంటి, కొమ్మలు నేప్రొద్దుఁ ♦ గూడి తిరుగఁ
జిలువచాను లగడ్త ♦ వలినీటిపైఁ దేలి, యొరిమతో నవయంబు ♦ నోల లాడ
మేలిమిబంగారు♦ మేలిపచ్చలడాలు, మిసిమి మింటికి నెల్లఁ ♦ బసిమి యొసఁగఁ
గీ. జదల రాసినకొమ్మల♦చాలుకతన, మీఁద రారాకయలప్రొద్దు♦ మెఱుఁగుదేఱు
గవనులనె రాకపోకలు♦ గా మెలంగఁ, దనరుఁ బాడమిఁ బ్రతిష్ఠాన♦మనఁగ వీడు.

యయాతిచరిత్రము, ఆ 1.

సీ. గోపుర గోపుర ♦ గోపురప్రతిమంబు, కల్పద్రు కల్పద్రు♦ గౌరవంబు
మానవ మానవ ♦ మానవాధిశయంబు, మణిజాల మణిజాల ♦ మంజిమంబు
సారంగ సారంగ ♦ సారంగ నయనంబు, సుమనోజ్ఞ సుమనోజ్ఞ ♦ శోభితంబు
బహుధామ బహుధామ ♦ బహుధామ చిత్రంబు, ఘనసార ఘనసార♦గంధిలంబు
గీ. భవ్య కాసార కాసార ♦ బంధురంబు, జనన సైంధవ సైంధవ ♦ సంకులంబు
బహుళ కేతన కేతన♦భవ్యలంబు, నై విజృంభించె నిరి నయో♦ధ్యాపురంబు.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 15.

సీ. రమణీయ తేజోవి♦రాజులు రాజులు, పటుపరాక్రమ సము♦ద్భటులు భటులు
నిజబలాధరిత ది♦గ్గజములు గజములు, హరిణవేగజితాశ్వ ♦ హయలు హయలు
వివిధకవిపుష్పిత ♦ విబుధులు విబుధులు, కవితాభినుత మను♦ష్యకవులు కవులు
రతిరాజ కంఠహా♦రమణులు రమణులు, వసుధాభ్ర వర్తకుల్ ♦ వర్తకులును
గీ. గలిగి కైవల్యఫలదాయ♦కత్వ మెంచి, భూమిరుహవల్లి యైన యా♦పురిమహల్లి
కలయమున నశ్వరముగాక ♦ వెలయ నరసి, శాశ్వతంబుగ నేలు న♦భీశ్వరుండు.

కైవల్యవిలాసము ఆ 1 పద్య 48.

సీ. ఆకాశవాహినీ ♦ నీకాశపర్యంత, భూ[illegible]రయమానగ♦ భాసురంబు
పవనభుగ్భామినీ ♦ పాథోవిహార యో, గ్యానేక పరిఖాజి ♦ తాన్వితంబు
సౌధ శృంగన్యస్త ♦ జలదరాగప్రభా, పాటలీకృత దిగ్వి♦భాగకలంబు
నికట లీలారామ ♦ వికచనానావిధ, ప్రసవ సౌరభ్య వి♦భ్రాజితంబు
గీ. కరముఁ గొనియాడఁ దగు నమ♦రావతికిని, ధారుణీధరజలద స♦మాకలంబు

ప్రబల విభవాకరము వీర♦భటనికాయ, కేసరిక్షోణిధరము సా♦కేతపురము.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంకర. ఆ 1 పద్య 84.

సీ. మదపుశేనుఁగులీల ♦ మాపంసులఁ బసర్చి, తమ్మిపై శిఖరిఁ జెక్కు♦దళములఁ దగి
కనకాద్రికరణిఁ గాం♦చనకూటములమించి, మహిజమ్ముమాడ్కిఁ గో♦మ్ములఁ జెలంగి
కమలాకరముగతిఁ ♦ గలువడంబుల మీఱి, దివిరీతి విబుధాళిఁ ♦ దేజరిల్లి
పలుకుఁగప్రపుఁజాయ ♦ చలువతావులమించి,నముఁగుఁదొల్కరిమాడ్కి ♦ఘనులనలరి
గీ. గాంగగాంగేయజలజాత ♦ భృంగభావ, జీవమణిసౌధపాళి కే♦ళీవిలోల
లోల మృగశాబలోచనా♦లోచనప్రి, భాళి యగుద్వారకాపుర♦మాళి మెఱయు.

భానుమతీపరిణయము, ఆ 1 పద్య 4.

క. ఆవీడు దనకు వేలుపు, డావీడు ధరాపురాళిఁ ♦ దలఁతురె యనుచుం
డావీడు భోగవతిని ను, దావీడున్నతయశఃప్ర♦తాపోజ్జ్వలమై. 40

బహులాశ్వచరిత్రము ఆ 1 పద్య 78.

సీ. వినుత సపత్న మే♦రునగాయమాన కే, తన సమాకలిత ర♦థవ్రజంబు
ప్రబల నిర్జరసాను♦భాను శైలోపమ, ధారాళ దానవే♦దండకులము
పవమాన మానస ♦ జవజిగీషునిరర్గ, ళోన్నతతురఁగ స♦ముత్కరంబు
పరవాహినీశ ని♦ర్భరసీరసాగణ్య, విలయాగ్నిసంకాశ ♦ బలచయంబు
గీ. మహిత గంభీర పరిమాయ♦(ఖ్యా)?..., కన్యకాభయదాహినీ ♦ ధన్యతరసుల
కేళికా దీర్ఘికాయుతో ♦ నెలప్రన్యా, పుష్కరిణి రంగధామంబుఁ ♦బొగడఁదరము.

శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 6.

శా. చంద్రప్రస్తర సౌధఖేలనపర♦శ్యామా కుచద్వంద్వని
స్తంద్రప్రత్యహలిప్తగంధకలనా ♦ సంతోషితద్యోగినీ
సాంద్రప్రస్ఫుటహాటకాంబురుహ సం♦చచ్చంచరీకోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమా♦హేలాకళావాసమై. 42

విజయవిలాసము, ఆ 1 పద్య 86

సీ. శ్రీకరంబు రమావ♦శీకరంబు శుభప్రి, జాకరం బనఁగఁ జెం♦పొందమించి
సుందరంబు సువర్ణ♦మందిరంబు శుభాద్రి, కందరంబనఁగఁ బ్ర♦ఖ్యాతిఁ గాంచి
పావనంబు మహార్థ♦భావనంబు జనాళి, జీవనంబనఁగఁ బ్ర♦సిద్ధి మించి
భాసురంబు విశిష్ట♦ భూసురంబు హృతార్తి, నీసరంబనఁగ వ♦న్నియ ఘటించి
గీ. కాంక్ష వణిజాళి స్యాతపాక విభవపాక, సైక నృపలోక సుకీర్తిక ♦ సాకేతక

శాకలిత నాకసమసంప♦దాకరంబు, కైకయపురంబు తెనరు భో♦గైకపురము. 43
ముకుందవిలాసము, ఆ 2 పద్య 41.

ఉ. ఆపురమందుఁ గెంపుఁజిగి♦యుండఁపుఁగోట పయోధికన్యకుం
బ్రాపయి తమ్మికోలికను ♦ భాసిలెఁ గొమ్మలు కేకులట్లు చా
లై పరగెం దదంతర గ♦ళన్నవహాటకలీల నబ్ధిపీ
శీపృథుశీకరమ్ము లెసఁ♦గెన్ హరి సేసలు చల్లు కైవడిన్.
సత్యభామాసాంత్వనము. ఆ 1.

సీ. జవజితపవనమై ♦ జయశేషురంగిక, మిందుపాణింధమ♦హేమవరుణ
మభ్రంలిహోద్భ్ర♦విభ్రమసౌధంబు, పరలోలుపన్నృపాల ♦ భాసితంబు
నాగేశయప్రియా♦భోగగేహము కోర, కర్తారకోద్యాన ♦ కలితశాఖి
ఉరరీకృతాధికా ♦ మరపురీసఖ్యంబు, † పరిమరిమృజమనః ♦ పండితంబు
గీ. ఘటదశీఘటాసముత్కటకటకటాహ, జటిలమదఘురీకృతవటీ♦విటపటుత్వ
నటదహార్యదవార్య శుం♦డాలజాల, మోదనంబగు నప్పుట ♦ భేదనంబు. 45
చంద్రాంగదచరిత్రము ఆ 1 పద్య 2.

సీ. సింధురచితపాద ♦ బంధురాభ్రవితాన, సింధురకటదాన ♦ గంధలీన
మారవపవమాన ♦ సారవజ్జవమాన, గౌరవహయమాన ♦ సారమాన
మసమానశరమాన ♦ లసమానతేజోన, లసమాన ధరణీన♦రసనిధాన
మమరనాథవిమాన ♦ సమరజయనిధాన, సమరథాత్యుత్థాన ♦ కమనయాన
గీ. మమిత గోపుర ఘనగోపు♦రాగ్రభాగ, నిరతరమణీయ హీరమ♦ణీకదంబ
కశదకాంతవినిర్మిల ♦ దశదిశాంత, ఘట్టనము వేంకటాచల♦పట్టనంబు. 46

సీ. రసరసాధకసంత ♦ మసమసారగవిహా, యసమసాధూన్నతి ♦ హర్మ్యకంబు
ధరధరార్చకమహీ♦సురనురాజకవైశ్య, వరవరావరవర్ణ ♦ గురుతరంబు
మదమదావళిబలా♦స్పదపదాత్యాజికో, విదవిదాశ్వరతాంగ ♦ విలసితంబు
నవనవామోద సూ♦నవనవాప్యక్తక్రై, రవరవాన్విత బంధ♦రవత్రిజంబు
గీ. వెలయుఁ బారావతారావ ♦ కలితలలిత, భావసంభవ కేళికా♦ప్రౌఢమూఢ
వార వారణయానాంఘ్రి ♦ వనజరణిత, వితతమణినూపురంబు తి♦రుపతిపురంబు.
పరిబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము. ఆ 1 పద్య 1-606.

సీ. పాదగయాక్షేత్రి ♦ పరమపవిత్రంబు, పురుహూతికాంబకుఁ ♦ బుట్టినిల్లు
యేలానదీజలా♦పృతతటాకానీక, మఖిలశక్తులకు వి♦హారభూమి

† (పరిమారి ?)

తోరంపులవణ పాథోనిధితీరంబు, నిర్మల గౌతమీ ♦ నికటసీమ
కుంతిమాధవదేవు ♦ గురుతరస్థానంబు, విలసిత భీమమం♦డలతలంబు
గీ. సేతు కాశీ ప్రయాగా ద్య♦శేషదివ్య, తీర్థరాజంబులందుఁ బ్ర♦తిష్ఠఁగాంచి
సకల దోషాపనోదక ♦ శక్తినలరు, పుణ్యసారంబు పీఠికా♦పురవరంబు. 48

రుక్మిణీపరిణయము. కూచి. తి. ఆ 1 పద్య 23.

వ్యపద. అవనిపై భోగమో♦త్సాకరంబగుచు, దివిజేంద్రునగరి నెం♦తేనగఁజాలి
కొత్తడంబులపంబు ♦ కోటలలంబు, కత్తలానులకోపు ♦ గజములయేపు
కేతనంబులసంచు ♦ గీములమించు, నాతిమిన్నలసౌరు ♦ నగరులతీరు
పసిఁడి మేడలచెల్వు ♦ పరిఖలనల్వు, కుసుమవాటులసొంపు ♦ కొలఁకులపెంపు
చప్పరంబులవిప్పు ♦ జగిలెలయొప్పు, కప్పురంబులతావి ♦ గాణాలఠీవి
యాపణంబులపేర్మి ♦ యనుఁగులకూర్మి, గోపురంబులయంగు ♦ గోడలరంగు
పుడమివేల్పులపెల్లు ♦ బొజుఁగులగ్రుల్లు, పడకటిళ్ళహొరంగు ♦ పనులమెఱుంగు
రాచమొత్తము టెక్కు ♦ రాణువయుక్కు, గోచయంబులదిండు ♦ కోమట్లమెండు
రంగవల్లులగచ్చు రసికులహెచ్చు, రంగస్థలులపట్టు ♦ రచ్చలమట్టు
మణికదంబముకల్మి ♦ మాన్యులబల్మి, గణికలపోఁడి లెం♦కలనెఱవాఁడి
వనములసొంపు దే♦వళములమంపు, పెనువజీరులనేటు ♦ ప్రెగడలనీటు
కాపుగేస్తులబోజు ♦ గడితలతేజు, ధూపవాసనమేలు ♦ తోడవ్రులవీలు
గలిగి లోకాతీత ♦ గరిమఁ జెన్నొంది, తిలకింప గౌతమీ♦తీరదేశమున
సేతు కాశీ ముఖ♦క్షేత్రంబులట్లు, ఘనతలఖ్యాతి చేఁ ♦ బొదలుచుఁ గోటి
లింగతీర్థస్నాన ♦ లీలలఁ బెంపొ, సంగి మార్కండేయ ♦ శంభుపదాబ్జ
పూజావిధప్రాప్తి ♦ పొసఁగ నెసంగు, రాజమహేంద్రపు♦రంబను వీడు. 49

సారంగధరచరిత్ర కూ. తి. ఆ 1.

మ. శశికాంతోపలజాలనిర్మిత, మహా♦సౌధాగ్రభాగోల్లస
ద్విశదాబ్జారిముఖీ జనాంచితముఖా ♦ విర్భూతమందస్మితా
తిశయప్రస్ఫుటకౌముదీముదిత హృ♦ద్దేశానిశోద్యచ్చకో
రశకుంతావళియై తనర్చుఁ జెలువా ♦ రం దత్పురం బెంతయున్. 50

రాజశేఖరవిలాసము ఆ 1 పద్య 41.

సీ. వెలలేని పలుఁదకొ♦న్నెలరాలమాడువుల్, దట్టంపుఁ దరఁగ మొ♦త్తములు గాఁగ
రంగుబంగరువు మె♦ఱుంగుటరుంగులు, నిద్దంపుటెనుకతి♦న్నియలు గాఁగఁ
గులుకుకెంజాయపురాచ ♦ తలిరాకుఁబోఁడులు, పగడంపుఁదీవజొం♦పములు గాఁగ

మేటపల్గొమ్మల ♦ మెకపురాతుటుములు, బలితంపు బఱపు గు♦బ్బలులు గాఁగ
గీ. వన్నియలుమీఱి చెలువారు♦వారువములు కొమరుఁదళుకొత్తుబలుమాని♦కములు గాఁగ
బొంకముగ నెల్లసిరులకుఁ ♦ డెంకియగుచుఁ, బాలమున్నీటిపగిది నా♦ప్రోలుదనరు.
నీలాసుందరీపరిణయము ఆ 1 పద్య 27

సీ. పెనురాచముంగిళ్లఁ ♦ బెంపుడుతోఁటల, మావులు మావులు ♦ ప్రోవుమీఱ
నాడెంపుఁ గోటల ♦ నాగవాసమ్ములఁ, గొమ్మలుఁ గొమ్మలు ♦ గొనబుఁ జూప
గరితలబొమ్మల ♦ గడితంపుగోడలఁ, బట్టును బట్టును ♦ బసఁబొసంగ
దొడ్డిపట్టులదొడ్డ ♦ దొరసానులయొడళ్ల, సొమ్ములు సొమ్ములు ♦ సొంపు నెఱప
గీ. నంగడులఁ జేలఁ దద్దయు ♦ రంగసంగి, ముత్తెసరులును బరుపంపు ♦ ముత్తెసరులు
వఱలఁ దరలనిసిరులఁ బ♦ల్కములను మెఱసి, పీడలరు వేల్పురానెల♦వీడు గాఁగ. 52
అచ్చతెలుఁగు రామాయణము బాల. పద్య 33.

సీ. ప్రాకారములడంబు ♦ పరిఖలచెలువంబు, వనముల పెంపు జ♦వ్వనులసొంపు
బావులకీవి క♦ప్రపుధూపముల తావి, జగితెలరంగు ర♦చ్చలహొరంగు
గణికలయొప్పు బం♦గరుమాడువులవిప్పు, గోపురంబులమించు ♦ కోట్లసంచు
తేరులతీరు ము♦త్తెపుఁబందిరులసౌరు, నగరులకల్మి యే♦నుఁగులబల్మి
గీ. కత్తలానులయేపు మే♦ల్కట్లకొప్పు, మదురుగోడల మెఱపు వా♦ల్కగలయొఱపు
తలుపుగమిపీలు నిలువుట♦ద్దముల మేలు, దనర వెలుఁగొందు నా ప్రోలు♦ధరణియందు.
రసికజనమనోభిరామము ఆ 1 పద్య 36.

మ. వెలయున్ సర్వపురాధరాజములలో ♦ విఖ్యాతమై యొక్కప్రోల్
బలభిద్రత్నవినూత్నకాంచనకన♦త్ప్రాసావకేళీకళా
కలనాకౌశలకామినీముకురశం♦కాకారిరాకానిశా
త్పలినీబాంధవమండలం బవని నిం♦ద్రప్రస్థనామంబునన్. 54
సుభద్రాపరిణయము ఆ 1 పద్య 27.

సీ. జలధరాధికనత♦చ్ఛాయలఁ దనరిన, గంధగంధిలదంతి ♦ ఘటలచేత
ననిలచిత్తాతీత ♦ ఘనరయక్రియలచేఁ, జాలరంజిలిన తే♦జీలచేత
రణధాత్రినంగజా ♦ రాతియె తెంచిన, నెలిఁజేసెడి యుక్కు♦డీలచేత
కనకాద్రిశృంగరే♦ఖలనీసడించిన, దండినిండిన యగ♦దాల[illegible]
గీ. గణనకెక్కు ధరాసుర ♦ క్షత్రియార్య, చరణజాఖిల[illegible] ♦ శాలిశయ
ఘంటనాగలోకటక రా♦జగృహకదంబ, రాజసంస్థాని సాకేత ♦ రాజధాని. 55
దశరథరాజనందనచరిత్రము ఆ 1 పద్య 42

సీ. శ్రీకరపాత్రసాద ◆ జితదేవసాలంబు, రత్నశృంగోచ్చల◆ద్రథరథంబు
ధ్వజపటపల్లవో◆ద్ధతదివ్యమేఘంబు, రథగతిచలితాహి◆రాట్ఫణంబు
కరిపుష్కరహృతాభ్రి ◆ గంగాసరోజంబు, సప్తివల్గితపత◆త్స్వర్గణంబు
ప్రత్యట్టహాస ని◆ర్భగ్నాబ్జజాండంబు, గృహవినిర్జితమేరు ◆ మహీధరంబు
గీ. భూపురంధ్రీమణీరత్న ◆ నూపురంబు, సతతనైపుణ్య కలితా ◆ శాపురంబు
ధర్మకామార్థములకును ◆ దాఁపురంబు, తేజరిలుచుండు నెపుడమ◆తీపురంబు. 56

మిత్రవిందాపరిణయము. సం. వెం. ఆ1 పద్య 4.

మ. ఘనజాంబూనదరత్నసౌధవిచర◆త్కాంతాకచాబద్ధ నూ
తననూనప్రజవాసనాగత సుధాం ◆ ధస్సింధుకల్లోలినీ
వనజాతాంతరసంభ్రమన్మధుకర ◆ వ్రాతస్వనోదగ్రతం
జినబల్లాపురమొప్పు నెప్పుడు రమా◆సీమంతినీవాసమై. 57
ఉ. కోటల మేల్పసిండిజిగి◆గోడల మేడల జాతికెంపు టా
నీ టలరారు వాకిసుల ◆ నీటికొలంకులఁ గమ్మతావిపూఁ
దోఁటల భూరివైభవము◆తో నమరావతిఁ గేలిసేయు న
వ్వీటికి సాటిఁజెప్పఁగ భు◆వింగలవే నగరంబులెన్నఁగన్. 58

వేదాంతరసాయనము. ఆ 1 పద్య 12–16.

మ. విలసత్సాలవిశాలకేతనపటా◆విర్భూతవాతాహతో
చ్ఛలితాంభోధరగర్భనిర్గళిత చం◆చచ్చంచలాశేముషీ
కలనాకర్మదధర్మహర్మ్యవిచర◆త్కాంతానితాంతప్రభా
కలితంబై యిలనొప్పు ద్వారవతినాఁ◆గాఁ బట్టణం బెంతయున్. 59

భోజసుతాపరిణయము. ఆ 1 పద్య 55.

సీ. పద్మ్యాస్థలము లెల్లఁ ◆ బద్మాకరములు ప, ద్మాకరవితతులు మ◆హావనంబు
లావనంబులు వినో◆దాగంబు లావినో, దాగముల్ గోపురా◆గ్రాంచితములు
గోపురాగ్రింబులు ◆ గురుసభావళులు స, భావళుల్ దైవాల◆యములు చూడ
దైవాలయంబులు ◆ ధామస్థితుల్మతి, ధామస్థితుల్గడు ◆ ధర్మ్యలరయ
గీ. ధర్మ్యలతిభద్రికరులు త◆ల్భద్రికరులు, యూథముల నెన్నఁగాఁ బ్రమ◆దోత్కరంబు
లచటఁ బ్రమదోత్కరములు ప్ర◆భాసమాన, లనఁ బ్రభాసమానంబగు◆నప్పురంబు.
సీ. ప్రాకారమమరేంద్ర◆లోకాంతమన్నచో, హర్మ్యజాలోన్నతు◆లడుగ నేల
ధామంబులెల్ల ర◆త్నమయంబులన్నచో, నొడలి సొమ్ముల వింత ◆ లడుగ నేల
ప్రతివీథియు సుగంధ◆రససిక్తమన్నచో, సంగరాగముల మే ◆ లడుగ నేల

భాగ్యంబు లధికో♦త్త్యధికంబు లన్నచో, నైశ్వర్య విభవంబు ♦ లడుగ నేల
గీ. శుకపికాదులు సరసవ♦చోవిలాస, కృతపురాణప్రసంగ మో♦దితజనాళు
లన్నచో విద్యదధికార ♦ మడుగ నేల, జగదలంకారమైన య♦న్నగరమునను. 61
కవిరాజమనోరంజనము ఆ 1

సీ. హారముక్తామయ ♦ సౌధశోభావళి, క్షితనభశ్చరదబ్జ ♦ హితహయంబు
పాండురగ్రావ ♦ ప్రస్థతోరణవిభా, శ్యామితామరధునీ ♦ సారసంబు
పృథుశోణమణిగవాక్ష ♦ కృపకాద్రిభా నిరం, తరసాంధ్యరాగితాం♦బరతలంబు
మరకతస్థాపిత ♦ వరసాలలోలప్ర, భాపలాశీకృత ♦ భవ్రిజంబు
గీ. రంగదుత్తుంగ గోపుర ♦ రజత సింహ, దర్శనాగతభీపున♦ర్థావదంబ
గాపగానీరపానస్పృ♦హాగతేంద్ర, భద్రగజమొప్పు సాకేత♦పట్టనంబు. 62
సమీరకుమారవిజయము ఆ 1 పద్య 43

చ. స్థిరసుమనోవితానముల♦చే నని మేషవిలోలలోచనో
త్కరములచే ననర్ఘమణి♦కామయకూటచయంబుచే సిరిం
గరము పొసంగు పీటి నవ♦కాంచనసౌధపరంపరల్ మరు
త్పరివరవైఖరిం బోలుచు ♦ దివ్యపథం బధరీకృతంబుగాన్. 63
చంద్రికాపరిణయము ఆ 1 పద్య 98.

సీ. సత్కళాపూర్ణ రా♦జప్రకాశం బయ్యు, రాజిల్లఁ బద్మాభి ♦ రామ మగుచు
పీతకంఠీరవ ♦ విభవభూషిత మయ్యు, రహిఁ బూను మత్తసా♦రంగగతుల
నఘదైన్యహారి సూ♦ర్యాలోకనంబయ్యు, హరినీలఘనతమ♦స్స్ఫురణఁ దాల్చు
భువనాద్భుతోదార ♦ భూరివత్సంబయ్యుఁ, గోకిలవాణల ♦ కోమరు నెరపు
గీ. జవన హరిరథ సముచిత♦చరితమయ్యు, భోగి సౌఖ్య నివాసమై ♦ పొగడుగాంచుఁ
బలుకు చెలువకు నలువకుఁ♦బలుక నలవి, గాని సిరిఁబూని యారాజ♦ధాని వెలయు.
రామవిలాసము. ఆ 1.

సీ. రంభోర్వశీముఖ్య♦రమణీవిలాసంబు, లంగనారత్నంబు♦లందుఁ గూర్చి
ఘనవైజయంత వి♦ఖ్యాతసౌభాగ్యంబు, ప్రాసాదపంక్తులఁ ♦ బదిల పఱిచి
కమనీయ సురదీర్ఘి♦కా కభీరత్వంబు, పరిఖాపయోరాశిఁ ♦ దిరముఁ జేసి
దివిషద్ద్రుమాణిక్య♦ధేనుదానవినోద, శైలి రాజులయందు ♦ సంగ్రహించి
గీ. పద్మభవుఁ డమరావతీ♦పట్టనంబు, సారము హరించి యమ్మహేం♦ద్రాగపురము
కాశలంబొప్ప నిర్మించెఁ♦గాక యున్నఁ, గలదె తాదృక్ప్రసిద్ధ శృం♦గారలక్ష్మి.
[illegible] ఆ 5 పద్య 7.

సీ. ప్రాకారరత్నశా♦ఖాకాంతు లుడువీథిఁ, గంకణగ్రహణ నై♦ఖరులు పూన
సౌధాగ్రనిహిత కాం♦చనకుంభరుచిమిన్న, వాకతమ్ములకుఁ బై♦వన్నె యొసఁగఁ
జలదురుధ్వజపటీ♦నిలమునందనఖేల, నమరదంపతుల కా♦హ్లాదమొసఁగ
గోపురాగ్రస్థ వ♦జ్రోపలచ్ఛవు లభ్ర, కరిమేనికాంతులు ♦ గలసి మెలఁగ
గీ. చైత్రరథ సన్నిభారామ ♦ సరస కుసుమ, సమితి సౌలభ్యలహరిని♦ర్జరమహీజ
చరదళులవిందునకుఁ బిల్వఁ♦బరఁగుపుష్ప, పురము నేత్రోత్సవముఁ జేసె♦భూమిపతికి.

దిలీపచరిత్రము. ఆ 2 పద్య 233.

సీ. హరిబింబరనూ పి♦హారకేళిశ్రాంతి, హరికేతనమనో♦హరి రథము
గంధనాగ ధుతాభ్ర♦గంధవతీజాత, గంధప్రసూన స♦గంధపథము
వాహసైకగతిప్ర♦వాహపాంసులగంధ, వాహ ధూసరితాంబు♦వాహఘటము
వీరరసోన్నిద్ర♦వీరభద్రహసద్గ, వీరమూహావమహా♦వీరభటము
గీ. ధర్మ పరధర్మ సాధర్మ్య♦ధర్మ విశ్వ, కర్మ నిర్మిత శర్మద♦నర్మ హర్మ్య
నిర్మలాభోర్మి దృశిధాతు♦ కర్మి విద్యు, త్తోభ్రమధ్యాపురం బయో♦ధ్యాపురంబు.

దశావతారచరిత్రము. ఆ 7 పద్య 3.

సీ. మంజుల మాణిక్య♦పుంజరంజిత ఘన, ప్రాకార చుంబితా♦భ్రస్థలంబు
చంద్రికాంతోపల♦సౌధపాండురకళా, మేడిత ప్రాలేయ♦ఘృణికరంబు
రత్నకుడ్యావళీ♦రమ్యాంశుసందోహ, బహుళీకృతార్క ప్ర♦భాచయంబు
గంభీరపరిఖా సి♦తాంభశ్ఛటా తమో, లోకీకృతాధర♦లోకవితతి
గీ. యామికాహతిజాత ది♦శాధనాథ, పురభయంకర భేరికా♦భూరిధంధ
ణంధణధణధ్వనిప్రతి♦నాదదాయి, గోపురంబొప్పు నుజ్జయి♦నీపురంబు. 68

హంసవింశతి. ఆ 1 పద్య 40.

సీ. ఋభుసరిత్కోక♦ఘృణిసంశయాపాది, జలజరాగచ్ఛవి♦చ్ఛన్న సౌధ
మవితబహ్విసవిద్యు♦దభ్ర ఇభ్రమద సు, భ్రూయుక్త నీలశి♦రోగృహౌఘ
మైందవ మృగతృణ♦బృందసందేహకృ, ద్గారుడాశ్మప్రభా♦గారచయము
సారాగ మధుపాళి♦శంకాకృదురు నీల, జలఖేయమధురసా♦కలితవరణ
గీ. మనుదినచకోరనికరస♦మగ్రచంద్ర, చంద్రికాభ్రాంతికారి వి♦శాలహీర
మణి గభస్తిపరిభ్రాజ♦మానగోపు, రం బధిష్ఠానపుటభేద♦నంబు పసరు. 70

శకుంతలాపరిణయము. పె. నా. ఆ 1 పద్య 69.

సీ. సౌధాగ్రతలకేళి♦జాగ్రన్మృగేక్షణా, స్ఫుటనృత్యమానేంద్ర♦పురపరంబు
జగతీ [illegible]

మద్భినీకాంతకు♦ద్భాంతిభవత్ప్రింత, సంతతోదార కా♦సారవార
మిందిరానుతభవ్య♦మందురానీక ర,మ్యామోదకారణా♦రామసీమ
గీ. యందమగు మేరుమందరా♦హార్యమధ్య,తల మహీమండలమున ను♦ద్దామశోభ
మేదురోద్భటభటసింహ♦నాదచలిత,దిగ్గజవరంబు పద్మాన♦తీపురంబు. శుకస.ఆ1.
మ. కల దుర్వీన్ బలగర్వితాహితకచ♦గ్రాహోగ్రహోద్యద్భుజా
ర్గళ రాజద్విజరాజగోత్రశిఖర♦రాజన్య సౌజన్యపు
ష్కలసద్వస్తుసమస్త హస్తినగరా♦ఖ్యాపరిఖ్యా రాజన్యతీ
తిలకం బంగకళింగవంగముఖ దిగ్దేశాధిపాశాస్యమై. 72
శకుంతలాపరిణయము, (కృష్ణకవి.) ఆ 1 పద్య 105.
సీ. శ్రీకంఠ శైకుంఠ♦సేనావికుంఠ వం,దారుమందిరము బం♦దారుపురము
నిరతోత్సవైశ్వర్య♦నికరాభిభూత బృం,దారకపురము బం♦దారుపురము
సంతతాయాత యా♦చకజనవాఞ్ఛిత ము౦,దారభాసురము బం♦దారుపురము
సకలవర్ణాశ్రమా♦చారసంపత్త్వమం,దారతిభరము బం♦దారుపురము
గీ. శిల్పి వర్తక వర్తక ♦ చిత్రకార, సూత్రకారాది వివిధవి♦చిత్రకృత్య
దాన ధర్మ పరప్రజో♦త్కరచకోర, కారవిందారికరము బం♦దారుపురము. 73
భల్లాణచరిత్రము, ఆ 1 పద్య 100.
సీ. పద్మాకరములీల ♦ బ్రమదాళులఁ జెలంగి, వనరాశి కనణి వా♦హినులఁ బెనఁగి
హారాళిపగిది నా♦యకరత్నములమీఱి, పుష్పమంజరిభాతి♦భూతి వెలసి
విష్ణుచక్రములీల ♦ విశిఖావళుల మించి, దివిమాడ్కి విబుధసం♦స్థితుల నలరి
కలభంబులీవి పు♦ష్కరసంపదలఁ గుల్కి, కులగిరిగతి దుర్గ♦ములఁ దనర్చి
గీ. తరుణ రాజీవమణిగణ♦స్థగిత హేమ,కుంభసంభరితాగ్ర వి♦శ్వంభరాది
నాథసౌధనిధాన ర♦థ్యాదివసతిఁ, దనరి చెలువొందు నా ప్రోలు♦ ధరణియందు.
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.
సీ. సకలకళాపూర్ణ♦చక్రిమ్మనకు ధాత్రి, భువనత్రయాబ్జకుఁ ♦ బుట్టినిల్లు
భానురనిగమాళి♦పాళికి దొరసాని, పరమసౌభాగ్యంపుఁ♦బట్టుఁగొమ్మ
నిఖిలప్రపంచస♦న్నిధికి నిధానంబు, మానసంపదలకు ♦ మందసంబు
పావనక్షేత్రక♦ల్పకలతానాలంబు, మహిమాతిశయముల ♦ మనుపుఁదల్లి
గీ. మహితగుణవిశ్వకర్మని♦ర్మాణనర్మ,సూత్రకౌశలమునకుఁ దొ♦లూచ్చలనంగ
వరధరణియందు సకలమై♦పరని తాన,నుట్టినము వేంకటాచల♦పట్టనంబు. 75
వేంకటేశ్వరవిలాసము, ఆ 1 పద్య 1.

సీ. బంగారుకోటల ♦ రంగుపూఁదోఁటలఁ, బూచినమావు లిం♦పులు ఘటించు
నూటిమేడలయందు ♦ నాటచేడియలందు, వెలిచవు లెంతయున్ ♦ వింతగుల్కు
సుజనగేహములందు ♦ గజదేహములయందు, దానధారాపాని♦జాని మీఱు
బలుమందసంబుల ♦ లలితకావ్యంబుల, బహుసువర్ణాచ్ఛవి♦భ్రమము మెఱయు
గీ. ధీరులందును రణరంగ♦వీరులందు, ధర్మగుణశక్తిమహిమంబు ♦ దనరియుండు
నహహ యీరాజధానియం♦దగుసొగసులు, వర్ణనలుసేయఁ జిత్రమి♦వ్వసుధలోన.
సీ. పద్మరాగారుణ♦ప్రతిభచేఁ జెలువొంది, ఘనచంద్రమండల♦కాంతి మించి
వరమంగళప్రౌఢి ♦ నిరవొంది సద్బుధస్థితిఁ గాంచి గురుకళా♦సిద్ధి మించి
సుకవివిస్ఫురదుక్తిఁ ♦ జూపట్టి ఘనగతి, నీలాసితద్యుతిఁ ♦ బాల మీఱి
రహిమీఱఁగను సుధీ♦రతమస్థితి వహించి, కర్పూరకేతు స♦త్కాంతి నూని
గీ. గగనమండలగతిఁ జెలం♦గంగ ననూన, గరిమ పిలసిల్లు ధనధాన్య♦కలితలలిత
వైభవంబుల మించియు ♦ వసుధ వసుధ,రాజపురమున నలరు నా♦రాజధాని. 77

కవిచకోరచంద్రోదయము, ఆ 1.

సీ. శ్రీలీల రత్నాక♦రాలయోన్నతిఁ గాంచి, హరితెఱంగున లక్ష్మి ♦ కాస్పదమయి
వాణిరీతి సువర్ణ♦వైఖరి నింపొంది, శతధృతిగతి సర♦స్వతి నెసంగి
కాళికైవడి రాజ♦మౌళిసంగతి గల్గి, హరునిచందమున నా♦ర్యాప్తి నొంది
కైలాసమట్లు దు♦ర్గవిలాసమున మించి, వైకుంఠమట్లు ము♦క్తాకరమయి
గీ. సత్యపదమట్లు పరమహం♦సప్రచార, చారుతరమయి బ్రహ్మాంబు♦సరణిఁ బరగు
రూపమై మీఱు నిత్యేంది♦రాపదాబ్జ,ఘట్టనంబు వేంకటగిరి♦పట్టనంబు. 78

రాధాకృష్ణసంవాదము, ఆ 1 పద్య 149.

గీ. కలిత సద్రాజహంసమం♦డలము గాన, రమ్యపుష్కరకమలాక♦రప్రదంబు
మఱియుఁ గాదేని గురుకవి♦మకరమిథున,పరివృతముగాఁగ జేల స♦త్పురవరంబు.

ఇందుమతీపరిణయము, నృసిం. ఆ 1 పద్య 14.

సీ. గారుత్మతవితర్ది♦కలు సైకతములుగా, సౌధముల్ గర్భస్థ♦శైలములుగ
శశికాంతకృతచతు♦ష్పథములు ఝురులుగాఁ, గరిఘట ల్మకరసం♦ఘాతములుగ
నుత్తాలసాలంబు ♦ లుల్లోలతతులుగాఁ, దతపతాకములు మ♦త్స్యములు గాఁగ
సఖిలాంగనాజనం ♦ బప్సరోగణముగాఁ, బురలక్ష్మి కల్మిపూఁ♦బోఁడి గాఁగ
గీ. సతతమంగళతూర్యని♦స్వనము లెల్ల, ఘనతరంగరవంబులై ♦ కడలు కొనఁగ
శ్రీనగారాశియో యనఁ ♦ జెలువు మిగిలె, సాంకికి శుభకరమైయొప్పు♦నప్పురంబు.

[illegible], ఆ 1 పద్య 100.

మ. చతురంబై చతురశ్రిఖండలసమ♦స్థానస్థితంబై మహో
ద్భుతశోభాస్పదమై యభూతచరమై ♦ పొల్పారి కోశద్వయా-
యతవిస్తారము నాపురిన్ సపరిణా♦హస్ఫూర్తి రాణించు నం
చితపార్శ్వద్వయ సాంద్ర సౌధ నివహ♦శ్రీవీథికాశ్రేణికల్. 81

మ. వరవప్రావృతమై యుదగ్దిశ నుద♦న్వత్స్నేయదుర్ధర్ష దు
స్తరమై తూర్పున దక్షిణంబున సము♦ద్యద్వ్యంత్రకుద్గర్భ దు
ర్గిరమాదుర్గమమై ప్రతీచిని మహా♦గాఢాద్రిశాఖా ప్రవా-
హాదియాఢ్యం బయి యొప్పు నప్పురి మ♦భేద్యంబై యశేయస్థితిన్. 82

చెన్నపురీవిలాసము, ప్రథమ స్వ.

సీ. కమలాప్తబింబంబుఁ ♦ గలశంబుగాఁ జేసి, కొనఁజాలు పడగలఁ ♦ దనరు రథము
లటు కరంబులు సాఁచి♦యమరధునీసరో,జములఁ ద్రుంపఁగఁజాలు♦సామజములు
హరితేజిబాబాల ♦ కర్థపులాయిత,క్రమముఁ జెప్పఁగఁ జాలు ♦ ఘనహయములు
పిడికిటిపోటుల ♦ బిరుదుకొండల నైనఁ, బిండిచేయఁగ నోపు ♦ వీరభటులు

గీ. కనకరౌప్యవినిర్మిత♦గగనచుంబి, మేరు కైలాస సన్నిభా♦గారములను
నందనోపమోద్యానవ♦నములు గలిగి, పొలుచు వేంకటగిరినామ♦పురవరంబు. 83

గోపీనాథరామాయణము, పీఠిక. పద్య 55.

గీ. భవ్యగుణరత్నబహుసుధా♦భవనరాజ,మండలోదయసదనంత♦మహితభోగ
లసితపురుషోత్తమశ్రీవి♦లాసలలిత,మగుచు విలసిల్లె నప్పుర ♦ మబ్ధికరణి. 84

వల్లభీపల్లవోల్లాసము, ఆ 1 పద్య 53.

సీ. చదలేటిదరఁగల ♦ జాలుచిన్కులనాను, గడుసెత్తుగురుఁజులు♦గల్గుగోట
లలరు నత్తెలిచెట్ల ♦ నలములఁ గేరెడు, నవలీను చెల్లెను ♦ దనరుదోఁట
లలచందుమినిసింక♦తేల గన్గియను నాన, లేమ చందుకొడుకుతో♦లెనఁగు నగరు
లెన్నిక గలయింట్ల♦పకొన్నగిండులఁ గ్రాలు,తోగదాయరలనాలఁ♦దోఁచుతోగరు

గీ. తోనద పెండాలకోనల♦చుట్టుగాలి, కచ్చవలకొంద నలయిక ♦ లిచ్చ నడఁచి
సిరుల సలకో న్నెనేస్తుల♦చేరెలంగి, చక్కఁదనను నయోధ్యనా♦నొక్కయూరు.

శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, ఆ 1 పద్య 4

సీ. ప్రాకారములు సుధీ♦ప్రాకారములు బహి,ర్గోపురంబు లతీత♦గోపురములు
కాసారములు సూర్మి♦కాసారములు సౌధ,జాలకంబులు రత్న♦జాలకములు
చతురంగములు మహో♦చ్చతురంగములు రాజ్ఞి,కేతనంబులు బద్ధ♦కేతనంబు
లారామములు సత్ఫ♦లారామములు లతా,భాజనములు ధర్మ♦భాజనములు

గీ. జగతి నలసప్తనగరరా◆జగతి మిగుల, నెన్నిపురు లొప్పు నన్నిటి◆నెన్ని తనరు
భావనాతీతదివ్యప్ర◆భావనాళి, నౌపురంబు జయేందిర◆కాపురంబు. 86

రామరాయవిలాసము, ఆ 1 పద్య 80.

ఉ. శ్రీమహితేందుకాంతమణి◆చిత్రిత నిర్మలహర్మ్యరాజి శో
భామలితాఖిలాంబుజభ◆వాండము గావున వార్ధికన్యకున్
నేమపుసద్మమైన సిత◆నీరజమో యన విశ్వకర్మ తాఁ
గామ మెలర్పఁ జేసెఁ దగఁ◆గన్నుల కింపగు ద్వారకాపురిన్. 87

కాళిందీపరిణయము, ఆ 1 పద్య 52.

సీ. నారికేళులసౌరు◆నారికేళులరీతి, సరసజన్మఫలాప్తి◆సంఘటించుఁ
గమలాకరంబులు◆కమలాకరములట్లఁ, బటుసారసముల శో◆భలవహించు
రాజమార్గంబులు◆రాజమార్గంబుల,భంగి సద్రత్నసం◆పదలఁ జెలఁగు
వాహినీవరములు◆వాహినీవరముల,గతి సింధుకాండసం◆గతిని మించు
గీ. రామ లారామలాలిత◆సీమలవలె, నిత్యసుమనఃప్రమోదత◆నెరయ మెఱయు
నహహా తత్పురి వర్ణింప◆నలవియగునె, ధాతకైనను గోకర్ణ◆నేతకైన. 88

నరసభూపాలరాజీయము, ఆ 1.

సీ. మగటాల జిగితూల◆నగఁజాలునగఁ గ్రాలు, తెలిడాలుగల మేలు◆తిన్నెలమరఁ
జెనుగట్టులను రట్టు◆లను బెట్టునునుగుట్టుఁ, గొని తిట్టఁగనుపట్టు◆కోట లడర
నలరమ్మ చెలువమ్మ◆లలిఁగ్రమ్మ వెలిగ్రుమ్మ, మురిపెమ్మ నెఱవమ్మ◆ముగుద లలర
నెనలేని గొనబూని◆పెనుకోనలను దేనె, తెరలానుదొరలేని◆తేఁటు లొలయ
గీ. నెచటఁ గనుఁగొన్న నేనుంగు◆లేపుచూప, నెల్లచోటుల గుఱ్ఱంబు◆లెసక మెసఁగ
ముజ్జగంబులఁగల ప్రోల్ల◆మురువు నవ్వి, యలరుచుండు నింద్రప్రస్థ◆మనెడు వీడు.

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 29.



# సౌధవర్ణనము.



చ. అలఘుతరంబులై తుహినహారిసుధారుచి నిందురోచిరా
కులశశికాంతవేదిపృథుకుంజగళజ్జలనిర్ఘరంబులన్
విలసితజాహ్నవీవిమలవీచివిలోలలసత్పతాకలం
బొలుపగుc దత్పురీభవనముల్ హిమశైలముcబోలి యున్నతిన్. 90

భారతము, ఆది. ఆ 8 పద్య 72.

ఉ. తోరణగండ్లc రాcగోడమ చుక్కలు పట్టి సతుల్ కవాటముల్
చేరుప మౌక్తికంబు లని చిల్లులు వుత్తురు దమ్మటంచుcబో
ల్వారు వితానహారముల యందొకహారత వ్రేలి పొద్దువోc
గా రతి డస్సి గాడ్పులకుcగాc దెరువ న్గను విచ్చిమేడలన్. 91

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 13.

సీ. పాండురప్రభc గ్రిందుపడిన చీcకటివోలె, జిగినొప్పు నీలంపు జగతి మెఱసి
యౌన్నత్యమున మిన్నంగినట్టినింగులుగ్రిక్కు, కరణి ధూపము గవాక్షముల వెడలc
ధారణీపతి సుగంధద్రవ్యములు దాcచు, నరలపేటికవోలె బరిమళములc
నెలవులై చెలువారునిలువుల విలసిల్లి, కొణిగcబారావత కులము వదరc
గీ. బసిcడినీటలిఖించిన పత్రమలమర, నీcగవాలిననందండయొలుcగులొనcగు
నట్టి సకినలమంచములాదిగాcగ, మెఱయు పరికరములనొప్పుమేడమీcదc 92

మనుచరిత్రము, ఆ 6 పద్య 3.

క. పురి రాకొమరులగీర్వాం, బరవాహిని భుజగపురికి బలువిడిc జని యం
దిరవుకొన నెడముచాలమి, మగలినతరి బుగ్గలన నమరు సౌధంబుల్. 93

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 107.

మ. శ్రవణోదంచితశబ్దవిస్ఫురణమై శయ్యావిశేషాలసం
లవినోదాస్పదమై సముజ్జ్వలతరాలంకారమై చిత్రబం
ధవితానస్ఫుటమై, సువర్ణరుచియుక్తంబై విజృంభించు స
త్కవికావ్యంబును బోలి చూపcదగు దంగత్కేళిసౌధంబులన్. 94

విష్ణుకవర్తి చరిత్రము, ఆ 5 పద్య 97.

ఉ. పున్నమ రేలఁ దత్పురము♦పొంతనె పో శిఖరాళిఁ దాకి వి
చ్ఛిన్నగతిన్ సుధారసము♦చిందిపయిం దిగువాఱ నంతనుం
డి న్నెల సన్నగిల్లు నది♦నిక్కము గాదని రేని యా పదా
ర్వన్నెపసిండిమేడలకు♦రాఁ జని యే మిల సౌధనామముల్. 95

విజయవిలాసము, ఆ 1 పద్య 72.

శా. చానల్ మించులు గాఁగఁ జిత్రిజయుచుల్ ♦ చకాత్రియుధశ్రీలుగా
నానారత్ననిబద్ధభూమితల మం♦తర్వారిపూరంబుగా
నానందధ్వనితంబు గర్జితముగా ♦ నభ్రింకషాగ్రంబులై
శ్రీనిండారెడు వీటిమేడలు ఘన♦శ్రేణిన్ విడంబింపవే. 96

రామవిలాసము, ఆ 1.

సీ. శశికాంతమణిగణ♦స్థగితభూములతోడ, నీలపురాల తి♦న్నియలతోడ
నిలువుటద్దములు ప♦న్నినకుడ్యములతోడఁ, బటికపు గుంద్రకం♦బములతోడ
పన్నెలీనెడు జాళు♦వాదూలములతోడఁ, గలధౌతమయవిటం♦కములతోడఁ
దీర్ఘనకెంపుల♦చూరుమొగ్గలతోడ, మరకతంబులగుజ్జ♦పరుపుతోడఁ
గీ. దగడుమెఱుఁగులద్వారబం♦ధములతోడఁ, బచ్చపగడపుదలుపుల♦బారుతోడఁ
గళలలరు ప్రాఁతపనుల మే♦ల్కట్లతోడఁ, జూడఁదగు నంతరంబుల ♦ మేడలొప్ప.

వాసవదత్తాపరిణయము, పక్క. వీ. ఆ 1 పద్య 179.

ఉ. మేడలఁ బువ్వుఁబోఁడులు స♦మేలముతోడ విపంచిగీతముల్
పాడఁగ గోత్రవైరివిని♦పంబినవేడుక నింద్రనీలముల్
పాడినిబంబునాఁగ మధు♦పంబులు వేలుపుటేటినుండి యా
గోడల చూరుపట్టెలను ♦ గూర్చినతమ్మిల ప్రాలవచ్చెడున్. 98

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 57.

క. ఆనగరి సౌధయూథము, లా నగరిపు నగరి దెంత♦యనినగు రుచిరం
బైన గురుత్వమున సుధా, శ్రీనగు రుచికొలిమిఁ గ్రిందు♦సేయుచు నెపుడున్. 99

రామరాయవిలాసము, ఆ 1 పద్య 63.

ఉ. చక్కని రాచకన్నియలు ♦ సౌధములన్ శ్రవణామృతంబుగా
మక్కువఁబాడుచున్ లయ స♦మానగతింబడఁ జెండుఁగొట్టుచోఁ
జిక్కుల సోఁడు మైమఱచి ♦ చూచుచు నిల్వఁగ నప్పురంబునం
దక్కటి కెంపుతో కునతి ♦ పాతని మేనికిఁ గందుగల్గెఁగా. 100

శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 27.

గీ. భాగ్యరాజ్యాధిపతుల సం♦బంధమునను, ఊరసౌధంబులకు రాజ♦యోగమొప్పె
భాగ్యరాజ్యాధిపతులసం♦బంధమునను, రాజయోగం బొనర్పఁ జి♦త్రంబెపుడమి.

సావిత్రిపరిణయము, ఆ 1 పద్య 105.

చ. కువలయపత్రలోచనలఁ♦గూడి సుఖించుచుఁ గేళికారస
ప్రవణనిజాంతరంగులు ప♦రంగులు నిల్వఁగ సప్తభూమికా
భవనము లొప్పు భూరిబిల♦వారచరత్సురసిద్ధదంప(తీ?)
నివహములైన తారధర♦ణీధరమందరశైలముల్బలెన్. 102

చెన్నపురీవిలాసము, ప్రథమ స్వ.

ఉ. చొక్కపుఁబైడిమేడలను ♦ సొంపగు పచ్చలచూయపట్టెలం
జెక్కినకప్పుటాలపని ♦ చిత్తరుఁబ్రాఁతలపారువంబులన్
డక్కనటంచుఁ బట్టుకొన ♦ డగ్గఱుబ్రాఁకుల నుండుడేగచాల్
నిక్కుచు నంతట న్వేగయ ♦ నేరక క్రమ్మఱవచ్చు నిచ్చలున్. 103

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 31,

# పరిఖావర్ణనము.



మ. పరిఖం బత్పురకామినీజనము లం♦భఃకేళి సల్పంగఁ ద
ద్గురువక్షోరుహలిప్తసంకుమద క♦స్తూరీమిళచ్చందనా
గురు పంకంబుల సౌరభంబులఁ జుమీ ♦ కుంభీనసావాస ని
ర్జరకల్లోలినికందు భోగవతినాఁ♦జన్ సంజ్ఞ గల్గె న్దగన్. 104

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 6,

చ. తనమణులన్నియు న్మను ము♦దంబలరార నురల్హరించి రం
చును బరికించి మేరుగిరి♦చుట్టును జుట్టిక యాక్రమించెనో
వననిధి కాండముల్మొఱయ♦వచ్చి యనం గననొప్పు నప్పురిం
గనకపుఁగోడచుట్టును బొ♦గడ్తకునెక్కు యగడ్తచక్కఁగన్. 105

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 25.

ఉ. లోకము లన్నియుం దనకు ♦ లోనుగ నుండఁగ దన్ను లోనుగా
జైకొనెఁ జక్రివాళి మని♦పావక సన్నిధిఁ దాఁ దపంబు ర

త్నాకరమాన నగ్గిరి త♦దావరణావృతిఁజేసినిల్పెనో
కాక యజుండు చుట్టు నవఁగాఁ ♦ దగు నబ్ధి యగడ్త రూపమై. 106

అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 54.

మ. హరిదశ్వస్ఫురదశ్వఘోరఖురభి♦న్నారామభూనారికే
రరసారుట్ఫలనిర్గళద్విమల నీ♦రస్ఫారధారాధరాం
తర వర్తిష్ణుతఁ దోయపూర్తిఁ గని దా♦నన్ మబ్బుధారాధరా
ళ్య రహింపన్ జలరాశివ్యర్థమయి ఖే♦యన్మూర్తిఁ గొల్చెం బురిన్. 107

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 55.

క. పురిపరిఖయొప్పునహితా, మరసాక్షీజలవిహార♦మంగళమహిమా
కరరుచిపరిపూర్ణాంభ, స్సరోలలామంబనంగ ♦ సత్కావి హితమై. 108

కౌసల్యాపరిణయము, ఆ 1.

ఉ. శైవలనీలముం గమల♦శాలియునైన యగడ్తనీరు ప
దస్త్రవళివ్రాఁతతోడి కర♦కంచుగ నొప్పుచుఁ గోట శాటిలా
గై వఱలంగ హర్మ్యకన♦కాంశునికాయము పేరఁ దత్పుర
శ్రీవిలసిల్లు నభ్రచర♦సింధువు మాళికి మల్లెదండగన్. 109

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 112.

క. నరవరమణిహర్మ్యవిభా, కరబంధురకనకవరణ♦కైతవజాగ్ర
త్పరిధియుతమధ్యతలమై, పరిఖాపుష్కరము తేట♦పడు నవ్వీటన్. 110

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 61.

సీ. మారుతోద్ధూతవి♦స్మయ తరంగంబులు, మిన్నేటితోడుత ♦ మేల మాడఁ
గమలనీలోత్పల♦కైరవకల్హార, పుష్పవాసనలుర్వి ♦ బుగులు కొనఁగ
మహాదద్భుతగ్రాహ♦మత్స్యకచ్ఛపములు, సంతత విశ్రాంతి ♦ సంచరింప
బకచక్రవాక ష♦ట్పదమరాళంబుల, నాదంబు చెవుల కా♦నంద మొసఁగఁ
గీ. బంగ మొప్పఁగబడబాగ్ని♦బాధఁబట్టి,యుదధి యందుండితావచ్చి♦యున్నదనఁగఁ
బరపు నిడుపును లోఁతును ♦ బరగఁగలిగి, పరిఖయొప్పును సాకేత♦పురమునందు.

మైరావణచరిత్రము, ఆ 1 పద్య 42.

చ. తనపయి నొక్క పర్వతము ♦ దాపయి యుండఁగ లోన నుండున
వ్వననిధికెంత గొప్పయని ♦ వారక యున్నతమైన కోటచు
ట్టును తనునిల్చి యాస్యన♦ధుల్యధినాథ విహారయోగ్య కో

భీన సవిలాశయంబగుచు ♦ భాసిలు చుండును ఖేయమప్పురిన్. 112

రుక్మిణీకళ్యాణము, జ. వేం. ఆ 1 పద్య 50.

క. నూత్నముగఁ బరిఖ యొప్పెఁ బ్ర, యత్నముగా నచట తటయు♦గాబద్ధమహా
రత్నాకరఘనసంపద, రత్నాకర మన గభీర♦రచితాంతరమై. 113

ముకుందవిలాసము, ఆ 1 పద్య 100.

చ. సురుచిరమాధురీజలము ♦ చొప్పడెనేని పరిఫుల్లహల్లకాం
బురుహ సితోత్పలప్రభవ♦పుష్పమరందరసానులుబ్ధ బం
భరములు కల్గెనేని, తన♦భంగగుణంబు లడంచెనేని, యా
శరనిధి తత్పురీపరిఖ♦సాటియొనర్పఁగ వచ్చునెన్నఁగన్. 114

పద్మినీపరిణయము, ఆ 1 పద్య 61.

చ. అతులమహాగభీరపరి♦ఖాంబువిహార భుజంగమాంగనా
ప్రతతి మహాఘనద్యుతులు♦పల్కులు నారసి పుష్పలావికల్
మతినరుణోత్పలాబ్జకుసు♦మభ్రమ డాసి తదీయ భీకరా
కృతి పరికించి తత్తటిలి♦త్రిమ్మరుచుందురు రప్పురంబునన్. 115

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 1 పద్య 54.

గీ. నల్లగలువలు దొగలు కెం♦దామరలును, నీలమణిశుక్తి విద్రుమ♦లీలఁదనర
శీకరంబులు మౌక్తిక♦శ్రీవహింపఁ, బరగు రత్నాకరముఁబోలెఁ♦బురము పరిఖ.

హరిశ్చంద్రోపాఖ్యానము, శం. క. ఆ 1 పద్య 89.

ఉ. ఆనగరంబువప్రమున♦కావృతియైన యగడ్త తీరు నం
భోనిధిసారు నేర్పులుపఁ♦బొంకము గామిఁ బ్రజల్ భ్రమింపగా,
నానలినోద్భవుండు సహ♦జాంబునిధిన్ వెలసిల్కొమషిన్,
బూనిచి ముద్రవేయఁగ స♦ముద్రము నాఁజను వార్ధియుప్పుడున్. 117

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 58.

క. పసమటియదిసాగరమని, యొపు లన గ్లులమాటఁదక్క♦నేతత్పురి స
ద్దపలందుఁ బరిఖలెవ్వియు, జడనిధిరొయ్యారియొ♦ తెలియశక్యమె ప్రజకున్. 118

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 1 పద్య 65.



జెనుచు మదమున ననలమ్ము • కొనుచు మనుచుఁ, బుష్పలావికలుందురు • పుర మునందు.

రుక్మిణీపరిణయము కూచి. తి. ఆ 1 పద్య 54.

సీ. సరసిజంబులు సారె • సారెకు స్నానయించి
యంబుజంబులు ప్రియం • బలరఁ జేర్చి
చంపకమాలికల్ • సొంపెసంగ నమర్చి
విచికిలస్తబకముల్ • విస్తరించి
యుత్పలమాలిక • లొప్పుగాఁ బొసఁగించి
కడు సుకేసరము ల • క్కజము జెనంచి
లలితెలయు మపజా • తులు నాడెముగ నిల్పి
మఱియుఁ బేరగు వన • మంజరులును

గీ. గరము మెఱయించి సుకవుల • కరణిఁ బెక్కు, చందములనీటుఁ జూపుచు • సగనులను బ
బంధలీలల నలరింతురి • పటువిలాస, భాజనము లందు పుష్పలా • వీజనములు 311

రసికజనమనోభిరామము ఆ 1 పద్య 49.

చ. ఎనసినతమ్మిమొగ్గలవి • యేగతివిచ్చెను విచ్చు టబ్బ్రిమా
యినకరసంగతంబయిన • నీతొవలో యివి రాజవీక్షణం
బునకును లంకెలంచుఁ బురిఁ • బువ్వులు విల్చును బుష్పలావికా
జనతతి పల్లవోక్తుల ర • సంబు లెఱింగి చమత్కృతుల్దగన్. 312

మిత్రవిందాపరిణయము కుం. వేం. ఆ 1 పద్య 24

చ. కలువలకేమి నీవిపుడు • కన్గొనినంతనె తెప్పతెప్పలా
నలినము లెన్ని రావు లల • నామణి నీవిటు మోముఁ ద్రిప్పినన్
వలసినసంపెఁగల్ గలుగ • నా మఱి నీ మెయిచాయ డాయ నం
చెలమి విటాళిపల్క విరు • లిత్తురు నప్పురి పుష్పలావికల్. 313

తారాశశాంకవిజయము ఆ 2 పద్య 29

సీ. నెత్తమ్మి కొప్పునఁ జెద • నీవింత వదలించు, నీవింత వదలక • నేవిధంబు
నీకుఁ జెండ్లేని • పైకమ్ముఁ దప్పించు, పైకమ్ము దప్పునే • పేకొ వంగ
కని కై దండ • నిచ్చెదవటె మేలు, కై దండ యిత్తురే • కర మెడలక
సి మొ • బంధుజీవం బేది, యీ బంధుజీవనం • బెందుగలుగు
ననుకూల, వచనరచనల మెలఁగుచు • వఱలు విటుల

ఉ. మా ముఖనేత్రబాహుకుచ♦మంజిమ లిట్టివియంచుఁ బేర్మితోఁ
గామకకోటికిం దెలుపఁ♦గైకడిఁ దమ్ములు నల్లఁగల్వలున్
గోమలపుష్పదామములు ♦ గుచ్ఛము లంగిటఁ బెట్టి యమ్మెదు
ర్శ్యామలుఁ బుష్పలావికలు ♦ వీటను నర్మవచఃప్రవీణతన్. కవిజనరం. ఆ1పద్య15.

ఉ. వాడని పూలచెండ్లు గొన♦వచ్చితి నెచ్చెలి నీదుపజ్జకున్
వాడని పూలచెండ్లకిన♦వచ్చిన పొమ్ము సువర్ణశైలమే
వేడుక నంతకెక్కుడగు♦విత్తము నిత్తు మటంచుఁ బల్కు మా
టాడక క్రొన్ననల్ విటుల♦కమ్మెదు రప్పురిఁ బుష్పలావికల్. రామవిలా. ఆ 1.

సీ. పొగడవిరుల్ లేవె ♦ మృగరాజమధ్యమ, విటరాజ చెంగల్వ ♦ విరులు గావె
జాతులే మైనను ♦ సంతరించి తెకొమ్మ, నేర్చుకోవలసిన ♦ నీటుకాఁడ
వగలాఁడి యిచట సు♦వర్ణముల్ గల్గునే, కలయింపఁ గలుగును ♦ జెలువరాయ
తమ్ములఁ జూపవే ♦ తరుణీశిరోమణి, యూడఁ గాఁజనిరి రే♦పాడి రమ్మ
గీ. వలయు పున్నాగతతులేవె♦ పన్నెలాఁడి, యేల యడిగెద వీయూర♦నేమి కొదవ
యని విటుల జాణతనముల ♦నపహసించి, పుష్పలమ్మెదురవ్వీటఁ♦బుష్పఁబోండ్లు.
ఉత్తరరామాయణము ఆ 1 పద్య 72.

చ. కరకలితారుణద్యుతులు ♦ గ్రమ్మిన పాండుసరోరుహోత్కరం
బరుణసరోరుహంబులని ♦ యంచితపాంగవిలోకనోత్కరం
బొరసిన తెల్లగల్వలసి♦తోత్పలపాళియటంచు డాయున
ప్పురి విటకోటి నవ్వెదరు♦ పోచముగోస్తులఁ బుష్పలావికల్. 323
శమంతకాపరిణయము, వె. నా. ఆ 1 పద్య 90.

సీ. కొనఁగోరెదను నాటి ♦ కుసుమమియ్యావె బోటి, యాభావసంబునను గో♦రంట లేదు
కొమ్మ పల్లవపాళి ♦ నమ్మవేల నెకొంచు, నమ్మ్క లాసంగక ♦ నమ్మరాదు
సుదతి యిచ్చనుగుత్తు♦లోడవ్రుమీనీవ సి, కిచ్చెద నెప్పుడైన ♦ నిప్పుడు నిలువు
బాల నీవలన వ♦సాలసత్త్వము గంటి, మా విహారములందు ♦ మనను గలదె
గీ. యనుచుఁ బమాతమాలఁ మిఁ చెప్పి♦కొనుచువచ్చు, విటులనిటులలితోక్తిసం♦ఘటనపటిమ
నాదరించుచుఁ గులుకుటో♦య్యారములను, పొలఁతులమ్మెదురంగశ్రీఁ♦బుష్పలచట.
అచలాత్మజాపరిణయము, ఆ 1.

ఉ. అంగన నీవు పుష్పగటు ♦ లాపెవె యహా మగవారు లేరె తే
కంగడిఁ జేరినావె వగ ♦ లా వెలకుం గొను మోవితేనె బం
తిం గనకుంపె దాఁచురఁ చె ♦ తేరకు చూపుదురా కటుండ కొ

న్నలగడి మారుబేరములె ♦ యంచు వచింతురు పుష్పలావికల్. 325

రాధామాధవసంవాదము, ఆ 2.

సీ. ఆలికుచంబు లే ♦ నంటి చూడఁగ నౌనె, కొనగోరు మాటి పై ♦ కొనకు జాఱ
పెదవింతమొగ్గజా ♦ పినఁ గొందు వగలాడి, నునుపంట నొక్కకు ♦ ననుపుకాఁడ
సొబగొందునీదండ ♦ జోడుగావలె బాల, పైకమ్ముఁ జూపి చే ♦ పట్టు దిట్ట
వెలదింపు నీపొందు ♦ గలువ నెమ్మదివచ్చు, నీ విమ్ముఁ జేర మ ♦ న్నించుదాన
గీ. ననుచుననిచిన నెఱిజాణ ♦ తెనపువచనరచన లలరించి మోహంపు ♦ రుచుల నించి
మంచివిరులంచు పలుకుల ♦ మచ్చుఁగొలిపి, విలుపఁగొందురు పుష్పలా ♦ వికలు పురిని.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

సీ. వెలయ నీసరులేటి ♦ చెలియ నవిపు డిమ్ము, వేరయిఁ గనుయిందు(?) ♦ గోరఁదగునె
కొనఁగోరెదను బట్టు ♦ కొనని మ్ము ననుబంతి, చనుబంతు లంటెచూ ♦ చినను గందు
ముద్దియ లేతమ్మి ♦ మొగ్గ లానఁగనీనె, పలుగెంపు లిడి గొను ♦ వలసి తేని
కన్నిమల్లియలతో ♦ వెన్న నెన్నఁడుగల్గు, సంపె నుండిసఁ గల్గి ♦ యుండు నెపుడు
గీ. ననుచుమృదువాక్యరచనల ♦ ననుచు వేడ్క, నలరియాలరమ్మ పనులనె ♦ య్యములఁజూపి
సరసవిటులకు నెరిఁబూవు ♦ సరము లీడుచుఁ, బుష్పలావిక లుండురి ♦ ప్పురమునందు.

కవిచకోరచంద్రోదయము, ఆ 1.

గీ. లలితఘనపుష్పగుచ్ఛవి ♦ లాస లగుచు, భువనమోహనకాంతిచేఁ ♦ బొలుపు మీఱ
సత్పథస్థిత లగుచుఁ జం ♦ చలలరీతి, నెలయుచుందురు పుష్పలా ♦ వికలు పురిని. 328

మిత్రవిందాపరిణయము, (రావు. జ. రం.) ఆ 1.

చ. వలఘుల నిచ్చు కుందముల ♦ పంకను గొంకపు ముంగసన్ రసో
జ్జ్వల మగు హేమమాలికల ♦ చక్కని సొక్కపుఁ బూవుబంతు లే
వలయునటంచుఁ బల్లవులు ♦ వల్కఁ బ్రివాళిమణుల్ సుచంద్రరే
ఖల నిడికొం డటంచు సుమ ♦ కాండము విల్తురు పుష్పలావికల్. 329

సుమనోమనోభిరంజనము, ఉల్లాస 1 పద్య 71.

ఉ. కాముఁడు తత్పురిన్ బహుళ ♦ కాముకరూపములం జరింపఁ ద
ద్భామినియుం బహుత్వమును ♦ దాలిచి యాతనికై తదీయసం
గ్రామసహాయతన్ శరప ♦ రంపర లిచ్చునన న్విటాళికిం
దామరసాదులైన విరి ♦ తండము లిత్తురు పుష్పలావికల్. 330

కృష్ణకల్యాణము, ఆ 1.

# శాలిపాలికలు.

సీ. శిరులు దారౌట సా♦శ్రితపద్మకర్ణికా,కృతిఁ జెవుల్ కమలక♦ర్ణికల మెఱయ
నతనుసారథ్యకృ♦ద్రతిరేఖ మంచపై, నదలించు రొదఁ జిల్క ♦ పదుపు పర్వఁ
దొగలమొగ్గల వైవ ♦ దూర మేగమిఁ గొట్టు,చప్పట్లఁ జన్నులు ♦ జడలు గదల
వెడ్రత్రోవ మును చెప్పి♦పడిసవ్వఁదిరుగున,ధ్వగులకొలఁది యప♦త్రపయు మరల
గీ. నధరరదనపరిసాదంబు♦నడుగ నొరు, దెఱచనో యన వ్రీలి ము♦త్తెములు తోఁచు
చెఱకుజంఘులఁ బోలమి♦శిరనువాంచు, రాజనముఁ గాచు గోపికా♦రాజిపొలిచె.

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 164.

సీ. బలుగుత్తు లేపాటి ♦ ఫలియించెనో భామ, చెప్పినఁ గనరావు ♦ చేలచాటు
బంగారుతీఁగెలో ♦ యంగన తెల్పవే, తసుకులు గనవచ్చుఁ♦ దారసిలిన
కలికి మహాదేవి ♦ కాటుక లేపాటి, తెల్లనివస్త్రముల్ ♦ నల్ల నౌను
బొలఁతి మహారాజ♦భోగముల్ గనరావు, లోపలి కరుదేరఁ ♦ జూపు గలుగు
గీ. ననుచు నవ్వారిపొలముల ♦ ననుదినంబు, లీల లెసఁగంగ శాలిపా♦లికలు పాంథ
వరులతో నీళ్లు వాకోవ్య♦వాక్యములను, బలుకుచుందురు సర్వభా♦వము లెసంగ.

భార్గవపురాణము, ఆ 1.

సీ. బలుముత్తెసరులసొం♦పులు చూపుమన నవి, కంచెలమీఁదుగాఁ ♦ గానరాదె
రాజభోగంబు లే♦యోజనుండునో యన, పరులచాటునఁ జూడ ♦ వాట మగునె
నూఁగారుఁ గన్న వి♦నోద మయ్యోను చెలి, గంటె వేమఱుఁ జెప్పఁ♦గా దరంబె
అరయఁగ నువుచూపు♦మనిన నవ్వుచును చా,మలలోనఁ జూపుట ♦కలవి యగునె
గీ. యనుచుఁబాంథజనాళితో♦డను తమదు చ,తురవచనములుబల్కుచుఁ♦బరఁగుచుందు
రఖిలజనఘనమానసా♦హ్లాదగరిమ, పొలముకాపరిబోటు ల♦ప్పురవరమున. 333

కౌసల్యాపరిణయము, అ 1.

సీ. కలికిరో! నీయూరు♦గంటినదే కాదు, వాడెను జనుమల♦వనజనయన
పథికేంద్ర! ఋతు వేఁగి♦పరికింప నెలడప్పె, నటుగాన వాఁడెఁ బ♦యన్ను తేక
పికవాణి! యెదఁ బండు♦టకుఁ గాల మెయ్యది, మాకెఱిఁగింపుము♦ప్రాకటముగ
యీనినపిమ్మట♦యెదఁ బండుటకుఁ గాల, మనియెఱుంగవె రసి♦కాగ్రిగణ్య
గీ. యనుచుఁబాంథజనులతోడ♦ననుదినంబు, హేతుగర్భోక్తు లాడుచు♦ నెదలఁ గరఁగ
మధురగానంబుచే యుప♦మనముఁగొనుచు, శాలిపాలికలుందు రా♦ప్రోలియందు.

నాచికేతోపాఖ్యానము, (మిక్కి.. మల్లి.) ఆ 2.

చ. సారిదిని బిట్టలం పెఱుము♦చొప్పనఁ గేకలు వేసి తమ్ముఁ బ
ల్కులు గను చేఁగు పాతులను ♦ మాటికిఁ బిల్చుచుఁ జూపుఁ గొమ్మల
న్నెరయురతిన్ ఫలంబులను ♦ నేతురె యందుటకంచుఁ బల్కుచుం
దురు చిఱునవ్వు మోములకుఁ ♦ దోరముఁ గూర్పఁగ శాలిపాలికల్. 335

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 73.

సీ. అక్కులసన్నిలి ♦ నలరారుచున్నవి, బలుగుత్తులా యవి ♦ జలజపాణి
సరసుఁడు వౌదుర ♦ నెరజాణ వెలుఁగవే, గౌరికుంకుమరేఖఁ ♦ గప్పుకొనియె
గౌరికుంకుమములోఁ♦గాంచినఁ గనరాదె, నెఱిరత్నసరులందు♦నిండి యుండె
రత్నసరంబుల ♦ రహిలోనఁ గనరాద, బలరామభోగంబు♦ నెలవు చెప్పుమ
గీ. సామి బంగారుతీఁగల♦ చాలులఁ గడ, నిశలఁ దోఁటలవాటున♦ నెమ్మిఁ జెలఁగు
ననుచు సరసోక్తు లాడుదు♦రనుదినంబు, రసికవిటశాలిపాలికా♦రమణు లచట.

నరసభూపాలరాజీయము, బాల–ఆ 1.

సీ. ఊవిదరో యెటులుండె♦నూరు దల్పుమటన్న, ననఁటితోఁటకుదగ్గ♦ఱనుచుఁ బలుకు
మార్గంబుఁ జూపవే♦మదిరాక్షిరో యన, రెండుకొంపలదండ♦నుండు నను
నడబావిఁ జూపవే♦నళినాక్షిరో యన, సోపానముల చెంత♦జరుగు మనును
లలన కొమ్మలచెంత♦నిలిచిపోయెద మన్న, నిచ్చఁదీఱఁగ నుండ♦వచ్చు ననును
గీ. ఇటుల రసగర్భనిర్భర♦చటులవాక్య,గరిమఁ బాంథులమనములఁ♦గరఁగఁ జేయఁ
జాలి యుద్యానసీమల♦ నెలుచుండు, శాలిపాలిక లప్పాటఁ♦జాలఁగలరు. 337

కాళిందీపరిణయము, ఆ 1 పద్య 66.

# హాలికులు.

మ. బలిచూడామణి తండ్రి వియ్యముఁ బలం♦బన్ లచ్చిఁగన్నయ్య ని
ర్మల తోఁబుట్టినవాఁడుఁగంటి యన స♦ర్వజ్ఞావతంసంబు ని
శ్చలదానైకధురంధరుండు బుధర♦క్షాదక్షుఁ డల్లుండు ధ
న్యులు గారే పుర హాలికాగ్రవరు లెం♦దున్ శ్రీనాపాత్రియుల్. 338

ఉ. అల విబుధాలయాహినిల♦యంబుల నెప్పుడుఁ దోడఁబుట్టువుల్
దలఁకొని యుండఁగా గరిసె♦లన్ గణజంబుల నెత్తరాదు చే
నిలిచినకుప్పకావలికి ♦ నిల్పుదు రప్పురిఁ గొంగుబత్తెపుం
గొలువున కీయకొల్పి హలి♦కుల్ బికిరంబు పొసంగువేలుపున్. 339

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 24-25.

# సస్యవర్ణనము.

ఉ. అలపికి మీఱఁ బండి పురి ♦ హాళికసస్యాలు నైచికొల్చి తి
ప్పలతుద ధాన్యము ల్వెలసఁ ♦ బర్వఁగ భాసుపోతిఁ జిట్లి త్రి
వలఁ జెదరు న్వసుంధర న♦వగ్రహదోషహతాద్విరామముం
దెలుపఁగఁజాలి సాటెనలు ♦ దిక్కుల రాలు నుదువ్రిజం బనన్. 340

చంద్రప్రభాచరిత్రము, ఆ 1 పద్య 73.

ఉ. కనుఁగొనయ్యెఁ బండి యొఱ♦గంబడి యుండెడు రాజనంబు చ
య్యన హాలికు ల్క్రమముం గనిన♦యట్టిమహీమహిళ న్మదస్థనై
ఖననముఁ జేయఁజూచెదరు♦గా యని యాంతరకైరవాళిసం
జనితమరందబాష్పములు ♦జాఱఁగ మూర్ఛిలి వ్రాలుకైవడిన్. 341

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 39.

మ. నగరాధీశుని సద్గుణంబులకు నా♦నందించి దేవేంద్రుఁ డు
న్నగరీరత్నముచుట్టునుం గురియు స్వ♦ర్ణగాత్రపచూర్ణంబునాఁ
దగు సంవత్సరయానదీనికటకే♦దారంబులం బండి సో
యగమై యెన్నలవ్రేఁగునన్ ధరణివ్రా♦యన్ వ్రాలి సస్యావళుల్. 342

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 74.

# సాలభంజికలు.

సీ. బందీకృతాన్యరా◆డ్భవనలక్ష్మీపరంపరలు నిష్ఠూరయుపు ◆ ల్వాలుపుకరణిఁ
బుంజీకృతస్నేహ◆భూరిమోహనశక్తు, లనురాగకళికలఁ ◆ బెనఁచుకరణి
నంగీకృతాంగమై◆తా్రిధిదేవత లాత్మ,సుమనోరుమచ్చంబు◆చూపుకరణిఁ
బ్రికటీకృతానంత◆రతిమూర్తులు లతాంత,శరశాస్త్రసంచిక◆జాఁచుకరణి
గీ.యంత్రపాంచాలికలుగొన్ని◆యగురుధూప,ఘతతిపెదలింపఁగొన్నిదీ◆వియలు వాల్పఁ
గొన్నివిరివీవనలువీవఁ◆గొన్నిపసిఁడి,తమకుఁజిలనాకులొసఁగ సం◆తసము లెసఁగ.

వసుచరిత్రము, ఆ 6 పద్య 78.

చ. ఘనపరణావలింసమున ◆ భోగ్యతరాకృతివజ్రకల్పకో
సరులసమూహము న్నిజగ◆జంబు గనుంగొని సేలక్రింద డాఁ
గ రయము వానిఁ జ్ఞఁ జని ◆ కయ్యములో సుర లోటుసెంది బ
హ్మపడి నిల్చె నా సొబగు◆మీఱి వెలుంగును సాలభంజికల్. 344

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 54.

# ఏనుఁగులు.

ఉ. చాయబలాకమాలికల◆చాఁడ్పున దంతము లొప్ప గర్జిత
స్ఫారరవంబులట్లుగ స◆నంగురతం బటుబృంహితంబు లా
సారముమాడ్కి దానజల◆సంతతి గ్రిమ్మఁగఁ గాలమేఘమా
లారుచిరంబులై మదచ◆లద్విపసంఘము లొప్పు సప్పురిన్. 345

నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 53.

చ. తరళితదంతకాంతి సము◆దంచితబృంహితనీలదేహము
ల్పరగఁ దటిల్లతాస్తనిత◆భాసురవారిధరంబులో యనన్
బోరిఁబోరి నేనుఁగు ల్దిరిగి ◆ పుష్కరశీకరదానధార ల
ప్పురమునఁ బెల్లుగాఁ గురియు ◆ భూతలమంతయుఁ బంకిలంబుగన్. 346

భాస్కరరామాయణము, బాల-పద్య 24.

సీ. ఉపరిస్థజనవార♦హొక్కిక్కికిఁ జెవిఁదార్చి, యమ్మొగంబై బయ ♦ ల్చిమ్మి చిమ్మి
గవనివె న్నొరయ మి♦న్నవియ దట్టించుతో,త్రిభరుబంధపుదాంట్లఁ♦దతిమితతిమి
చలువచే ద్వారవే♦దులెతింగి నిల్చి త,జ్జనజిఘృక్షుకుఁ గేలు ♦ సాఁచి సాఁచి
డిండిమంబుల కుబ్బి♦గండాల్పదానమే,ఉలుగ దద్వహుతాల♦ఉవ్వియువ్వి
గీ. వేణుకాహతులకు వీడు♦వెడలివెడలి, చరపథగజధ్వనికిఁ బోక ♦ తిరిగి తిరిగి
దృక్పుటలు వైరులకుఁ బంపు♦కృత్యలనవ,శానుగతిఁ జేరు వెలిఁ గరు♦లగ్గలికల.

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 24.

మ. అరగంటం గనుఁగొంట మందగతిఁ బూ♦ర్ణాహంకృతిం బ్రార్థనా
కరభుక్తిస్థితి ముక్తలోకభయశం♦కావృత్తి నున్మత్తన
స్ఫురణి న్సాత్త్వసమగ్రత న్మృదితప♦ద్మాభ్యున్నతి స్గంధమం
థరదంతావళకోటి యొప్పు నవధూ♦తప్రక్రియన్ దత్పురిన్. 348

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 1 పద్య 25.

మ. వరుసన్ బృంహితహేషగర్జలెసఁగన్ ♦ వర్షాంబుధారాగతిన్
వరగండద్వితయీగళత్పృథుఝరీ♦వారంబు లుప్పొంగ న
స్ఫురమందున్ గజబృందముల్ దనరు నం♦భోధిస్థలోత్థాపితసం
చరదద్రిందద్రిములో యనంగ నవరా♦జన్నీలమేఘోన్నతిన్. 349

కృష్ణరాయవిజయము, ఆ 1.

చ. పరబలభంగసంగము ల♦భంగురతుంగమతంగజంబు ల
ప్పురిఁ బరికీర్ణకర్ణపుట♦పూరితభూరితరానిలాహతి
న్విరియఁగఁదోల మేఘములు ♦ నింగిఁ దొలంగి తదంఘ్రిమూలముల్
శరణము నండఁబోలు నని♦శంబు పదంబు మదంబు పేరిటన్. 350

వసుచరిత్రము, ఆ 1 పద్య 101.

ఉ. ఘనమహిమ న్మహాప్రతిభఁ ♦ గాంచి లసత్కటకప్రభూతి యిం
పొనరఁగ దాల్చి పుష్కరస♦ముత్కటపుష్కలలీల మించి పై
నెనయు రజోగుణంబున న♦నేకపరాజము లప్పురంబులో
ననిశముఁ జూడనొప్పు నడ♦యాడుచునుండెడి కొండలో యనన్. 351

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 20.

ఉ. చుట్టునుగిట్టియుండు నొక♦చో నెడ మించుక లేకయుండఁ ద
ప్పట్టినబాహ్యభూములమ♦దావళిమండల మేమిచెప్ప ని
ట్టట్టనరాని కరిభ♦యంకరశైల దిపి తోడ రాయురున్

బెట్టనికోటగాదె గజ♦బృందము లెందును రాజధానికిన్. 352

విజయవిలాసము, ఆ 1 పద్య 74.

మ. పరిఖావారిధి మేరమీఱి తము ముం♦పన్ ధారుణిన్ దాల్చు దు
స్తరమంచున్ రవి మధ్యవర్తి యగు నా ♦ సర్వంసహాభర్తకున్
హరికొప్పింపఁగవచ్చు దిగ్గజములో ♦ నాభానుపాణింధమో
పరిభాగస్థపరాగము ల్వేలయఁ గ♦న్పట్టున్పురీనాగముల్. 353

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 28.

సీ. కేలెత్తి సురదంతి ♦ నాలంబునకుఁబిల్చు, పగిదితుండంబులు ♦ పైకిసాఁచు
కలశభవాచాంత ♦ జలధినించఁగఁజాలు, నివెయన్నగతి వమ♦థువులఁజల్లు
నొంటినెత్తఁగరావె ♦ యుర్వినాగాధిప, త్రియధృతిననుమాడ్కిఁ♦దాల్చుమట్టి
పుడమియెల్లను నాలు♦గడుగుల నడుగునం, చనుగతి ముందటి ♦ కడుగు లిడును
గీ. కీలుపేలును మదభరో♦ద్వేలధార, లోలిఁగురియంగ సెలయేర్లఁ ♦జాల మెఱయు
శైలముల లీల నాలాన♦జాలబద్ధ, లైన మత్తేభఘటలొప్పు ♦ నప్పురమున. 354

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 23.

మ. పటుదంతప్రచురప్రభాప్రకటశం♦పాజాలముల్ ఘీంకృతా
ర్భటగర్జారవముల్ సమగ్రమదధా♦రాసారవర్షంబు లు
త్కటఘాటిన్నటియింప భూవిహరణో♦ద్యత్ప్రావృషేణ్యాంబుభృ
త్పటిమన్ దత్పుటభేదనద్విరదయూ♦థంబొప్పు సక్రోధమై. 355

అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 69.

మ. జగతీధ్రంబులు దేవపాపగతసం♦చారంబులై నిశ్చలం
బగువృత్తిం దపమాచరించి తతఘం♦టారావనిర్భీకయా
నగుణోదగ్రత విగ్రహాంతరము లె♦న్నం దాల్చుటం గల్గెనో
నగసంబంధగతాదివృత్తియునఁగా ♦ నాగంబు లొప్పుం బురిన్. 356

కవిరాజమనోరంజనము, ఆ 1,

చ. ప్రతిగజశంకనభ్రనిక♦రమ్ము రదమ్ములఁ గ్రమ్ము దిక్కరి
ప్రతతుల మార్కొనంబిలుచు ♦ భంగిని బృంహితముల్ ఘటించు న
భ్రతటినిఁ బద్మముల్ పెనఁచి ♦ పట్టి పెకల్చుటకుం బలెన్ సము
న్నతకరముల్ నిగుడ్చు గగ♦నమ్మున కప్పురి మత్తవేనుఁగుల్. 357

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 67.

మ. పరనీలాభ్రచయంబుఁ గన్గొని మహా♦వాలాది విక్షేపణన్

స్థిరతుండంబుపిదుర్చు ఫూత్కారములం ♦ దేదీప్యమా వాతవే
గరయంబుద్ధతిఁదాకి మింటఁ జననా♦యభ్రింబులంగాంచియుం
ద్వీపదానీకము గాదటంచు మదిలోఁ ♦ దేహ్వోందు నాయేనుఁగుల్. 358

ధర్మాంగదచరిత్రము, ఆ 1.

గీ. తప్పయును వేలుపుల తేని ♦ దాడికోడి, గుంపులనుగూడి పఱతెంచి♦కోర్కులలరఁ
గడలిడాఁగవచ్చిన కొండ♦గమి యనంగఁ, గదిసితిరుగు సేనుంగు ల♦గడ్తయందు.

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 34.

# గుఱ్ఱములు.

గీ. మనముశిల్పియె తనమ ఓ♦న్నమవు మెఱసి, గాలినశ్వరూపంబులు♦గాఁదరించెఁ
గాకయీజవసత్త్వముల్ ♦గలవెఘోటక, కములకెందునాఁబురిఁదురం♦గములులుచు.

నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 54.

శా. మానిక్రోధవిధూతపత్త్రిములమా ♦ మాతో సపత్నిత్రిదా
కానింపంచును సేకరాత్తిరుచిమెు♦ల్కుల్పిక్కలన్ శాస్త్రతూ
నాసల్పాహీసకల్పసంపతతాలం ♦ దాఅన్నరింబోల్చు నా
జానేయంబులు ఫేనహాసమిషప్రౌ ♦ జావెూరిల్లార్చుచున్. 361

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 26.

సీ. కట్టడిఁజెలియలి ♦ కట్టయెకట్టగా, మిగుల్రమైఁ బేరంబు ♦ పెట్టకుండ
లంఘనలాఘవో♦ల్లసనంబుమైమెుక్క, లించి వాగ్ధులు చొక♦లింపకుండ
బిట్టుదిగంతముల్ ♦ ముట్టఁజూపినవిధి, పవమానుగడ తెగఁ♦బాఱకుండ
భరతాభినయముల ♦ నిరపేక్షగా లోక, దృష్టులువనియ న♦ర్తింపకుండ

గీ. రయముచేఁ జిత్తగతులగె♦ల్చియును బతుల, మతులలోనన వర్తింప♦మానువలసె
ననుచుసిగ్గునఁదలవంచు♦కొనినకైటుఁలొ,యనఁగఁదగియుచ్ఛుఁబరనుత్త♦మాశ్వతతులు.

కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 14.

మ. జగతీజానికృతాపరోహ మఖిలా♦శాలంఘనస్ఫూర్తియున్
గగనోడ్డీనగతంబహీనబలదు♦ర్గర్వాపహాపాంథియుక్
దిగధీశస్తవనీయసంతతలస♦ద్విఖ్యాతిఁ జెన్నొందఁగా
ఖగరాజస్థితిఁ బోల్చుఁ దత్పురమునన్ ♦ గంఖాణసంఘంబొగిన్. 363

ఇందుమతీపరిణయము, కుమారధూ. ఆ 1 పద్య 151.

శా. ఘాతిన్చాయఁ బరిభ్రమించు ననిల♦స్కంధస్వరాసంగతిన్
జైత్రిత్వంబునఁగొంచ చేపమణిబా♦స్వద్భోగసద్భావనై
చిత్రిన పస్తో సాధులన్ మనిచి మిం♦చెం బంచకళ్యాణులై
ధాత్రీమండలిఁ బట్టభద్రులగతిం ♦ పద్పట్టణాశ్వనముల్. 364

తపతీసంవరణోపాఖ్యానము, ఆ 1

మహాస్రగ్ధర. పరభూభృత్ప్రస్థిమధ్యం♦బడు రవిహరులం♦బ్రాథిఁ బాటింపనెందున్
నరగాఁ పర్వేక్షణస్ఫూర్తిఁ♦చక రవిహరియై♦చాయకున్ రానడంచున్
జరణోద్యద్ఘ్రాళిఁ దద్వా♦సతఁదగు హరియున్♦సప్తగాఁ బౌదధారా
స్ఫురణం బేవింతయంచుం♦ బరిహరులునగుం♦బూర్ణధారాసమృద్ధిన్.

వసుచరిత్రము, ఆ 1 పద్య 102.

సీ. అడుగంటఁద్రొక్కి-న♦యహితపరితాపకీ, లములునాఁబసిఁడిలా♦శములు మెఱయ
జవభీతనిజమృగ ♦ సంరక్షణకుఁ బొద, మొందినశశియన ♦ నందె సెలఁగ
మహనీయగళ దేవ ♦ మణిపార్శ్వసుటితము, స్తాపాళియనగవ్వ♦దండ దనర
ఘనతార్క్ష్యతాదష్ట ♦ కవికాహినిర్మోకక, ఖండంబులన ఫేన ♦ కణిక లొలుక
గీ. బట్టుపల్లంబుఁ గేడెంబుఁ ♦ బట్టెయంబుఁ, దరకసంబును సింగిణి♦సిరిమిరఱటు
జిగిదొలఁకుశేవపాలాసి♦మొగసరియును, బూనిసాహిణి యొకకత్తి♦లానిఁదెచ్చె.

చంద్రభానుచరిత్రము, ఆ 2 పద్య 16.

ఉ. వేడుకనప్పురీహయుల ♦ వేగముఁ గన్గొని తేజు గాడ్పుతోఁ
గూడి చన న్వలె న్మనము ♦ కూడఁగనోపక యోడినట్టివా
రోడనివారి మోచు టని ♦ యొద్దికఁ బందెము వైచి కూడలే
కోడెనుగాక మోయఁగ బ♦యోజన మే మనిలుం గురంగములే. 367

విజయవిలాసము, ఆ 1 పద్య 73.

శా. ధారారీతిసవిారపంచకము పా♦త్రశ్రేణికం బట్టఁగా
నారాచంబులునోడి పార్శ్వముల సం♦టంగొల్వఁగా నాత్మవే
గావేగాస్తి సమాన దేవమణిమా♦స్వత్ప్రభాసార్వలం

కారంబుల్ బిరుదుల్ ధరించి బురిలోఁ ♦ గన్పట్టు ఘోట్టాణముల్. 368

ముకుందవిలాసము, ఆ 1 పద్య 120.

మ. అకటా తమ్ముల కాలివేగమున డా♦యన్ లేని పక్షీంద్రుకా
లికిలో నామిడినాగుకూనలకు జా♦లింబొందు గాలి న్లకా
పికలై వచ్చు మనోజభల్లములకు♦న్నీతిల్లు చిత్తంబుసా
టికి రానేరని హేష పేరఁబురఘో♦టీఘోటకవ్రాతముల్. 369

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 29.

ఉ. అందలికత్తలానిగమి♦నందఁగ గాడుపుతేట్టువాలు వే
పందెము వైచి పర్వులిడుపట్టున ♦ నోడియకాడె లేళ్లుబల్
గొందలమంది పూరిఁదిను♦కొంచును రిత్తయ జంకిచూచుచున్
బందతనంబుమీఱఁ గడుఁ ♦ బాఱఁదొడంగెను నాఁటనుండియున్. 370

అచ్చతెనుగురామాయణము, ఆ 1.

సీ. కసవుమోపరిగాలి ♦ గఱుతియే మాకంచు, నగినట్లు వదనఫే♦నములు రాల్చ
ధర సరి లేదు పా♦తాళమందేనియుఁ, గంపమస్తతి ఖురా♦గ్రమునఁ ద్రవ్వ
ఇనరథాశ్వములట్లు ♦ మునుఁగుదు మేపూఁడ్తు, మబ్బులన్గతి రేఁచు ♦ నంఘ్రి రజము
తముఁగూడివచ్చుచి♦త్తమ్ములనల్కఁజే, సదలించుకరణి న ♦ ల్లార్చు శిరము
గీ. లురము లందంబు పలు కంద ♦ముదుటికన్ను, లరిదివెన్నులు తగనంద♦మైయొసంగ
సింధు కాంభోజ శక పార♦సీకధట్టి, బాహ్లికారట్టఘోటక ♦ పంక్తులచట. 371

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 25.

చ. అరివిజయప్రతాపఘన♦యాన మహీభృదుపాశ్రియంబులం
బరగినవౌటఁ గైటభవి♦భంజనజంభమదాపహారకుం
జరరిపువిక్రమానుగుణ♦సారతఁ జొప్పడు నప్పురీహరుల్
హరులనునామధేయములు ♦ సార్థకమై యనువొందునట్లుగన్. 372

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. సతతమానసగతి♦స్తుతవైభవముఁ గాంచెఁ, బ్రకటింప రాజమ♦రాళ మేమొ
దేవమణిప్రభా♦దీపితంబై యొప్పెఁ, దర్కింప నభ్రమా♦తంగ మేమొ
జవసమాహృతతీవ్ర♦పవనమై యలరారె, దర్వీకరకులావ♦తంస మేమొ
తేజోనిధిత్వసం♦స్థితిఁ బ్రకాశముఁ గాంచె, డంబైనతీవ్రాంశు♦బింబ మేమొ
గీ. ఘనఁగఁదనరుమనోజవం♦బనుతురంగ,మంబుపై నెక్కి నుగువతో♦ననుజవిభుఁడు

తత్పురమ్మున నుండుట♦తగదటంచు, విక్రమక్రియశక్తిని♦వెడలె నపుడు. 373

వాసవదత్తాపరిణయము, (వక్క. వీర.) ఆ 4 పద్య 17.

క. వీటిపటుఘోటకనిరా,ఘాటత్వర కోడి పూరిఁ♦గఱచు హరిణముల్
మాటికిని దదారోహకుఁ, డాటం బవమానుఁ డోడు♦టబ్బుర మగునే. 374

కవిజనరంజనము, ఆ 1 పద్య 8.

సీ. రవగాలునకు సాటి♦రాక గాడ్పుపటాణి, పొడలుసిగ్గునఁబోయి♦పొదలఁజొచ్చె
జోడనల కొకింత♦జోడు గానేరక, వేల్పురాయని తేజి♦వెల్ల నయ్యెఁ
బలునిబ్బరమునకుఁ♦బ్రిలిగాక గరుడి య,నామధేయునివాహ♦నం బనఁదగె
జుట్టుఁబర్వులకు నిం♦చుకయు నీడొందలే, కినుహరుల్ పిచ్చుకుం♦టునకగపడె
గీ. నింకనీవాహముల కెద్ది♦యెన యటంచు, జనులు వొగడ మనోవేగ♦మెనసి ధార
లొలసి లోకప్రసిద్ధుల♦నూని మేటి,సాహిణులశిక్ష నలరు న♦చ్చటిహయములు.

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 68.

సీ. జాబిల్లిచిన్నంపు♦బాబాహుమారంపు,సగదారుని యుదార♦తరజవంబు
శతకోటినరువీటి♦కతిఘాటిఁ జని సుధా, ఘుమ్మఁ దెచ్చిన మేటి♦ఘనజవంబు
పలిజక్కవల కించు♦విలుకానియలసంబు, దెలుపు వేల్పుతురంగ♦ములజవంబు
బవరంబుభువివింటి♦డవిలించి విడునంట, యరాతిఁ దురించుక♦ట్టియజవంబు
గీ. నెంచకనె సంచరించుచు♦నింద్రహయము, పుట్టినట్టితలం బెల్ల♦భూరిఘాళిఁ
దార్చనో నాఖురమ్ముల♦ధరణిఁ ద్రవ్వి,కొనుచు విలసిల్లు నప్పురీ♦ఘోటకములు.

అచలాత్మజాపరిణయము, ఆ 1.

క. వీటను గల గుఱ్ఱంబుల, గాటపువడి కోడి గడ్డి♦కతిచెను లేడుల్
మాటికి వడఁకుచు గాలియుఁ, బోటరితన ముడిగి యొక్క♦మూలం బడియెన్.

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 35.

# వీరభటులు.

చ. కులగిరులెత్తనైన పడిఁ♦గుంభినిఁ గ్రుంగఁగఁ ద్రొక్కనైన వా
ర్ధులఁ గలఁగంగనైన బహు♦[illegible]

గ్వాలయామదేభకుంభములు ♦ వ్రక్కలుసేయఁగ నైనఁ జాలు దో
ర్బలముల గెల్తురాజిఁ బరి♦పంథుల నందుల వీరసద్భటుల్. 378

భాస్కరరామాయణము, బాల. పద్య 32.

క. ఫ్రితివర్షంబును ధరను, ద్ధతిఁ బడియెడు పిడుగులెల్లఁ ♦ దగఁ గూర్చి నరా
కృతులుగ నొనఁగూర్చెనో కో, శతధృతియనవీటసుభట ♦ సంఘము వోలుచున్.

కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 12.

సీ. బేసికొండలుపట్టి ♦ పిండిపిండిగఁ గొట్టి, జలధిలో వేదచల్లఁ ♦ గలబలంబు
యమకింకరులనైన ♦ గమకంబుననణఁగించి, క్రిమ్మరింపఁగశక్తి ♦గలబలంబు
నెదిరించు కరినైన ♦ బెదరించు హరినైన, గండడంపఁగఁజాలు ♦ గుండెదిటము
అలమహాబలునైన ♦ నండజాధిపునైనఁ, బరిహసింపఁగఁజాలు ♦ పటుజవంబు
గీ. బళిబళీయనితమదొరల్ ♦ ప్రస్తుతింప, బిరుదుపంతంబులాడుచు ♦ భీకరగతిఁ
జటులతరశౌర్యులై భుజ♦సారదళిత, పరభటుల్ భటు లుందు ర♦ప్పట్టనమున.

ఇందుమతీపరిణయము, కుమా. ధూ. ఆ 1 పద్య 152.

సీ. జల్లులతోడి పెం♦స్బల్లెంబు లెగవైచి, పట్టుచుఁబేరముల్ ♦పాఱువారు
మెఱుఁగులు మాడ్కల♦మిఱుమిట్లు గొలుపంగఁ, జేకటారులబయల్ ♦చిమ్మువారు
*బెడిదంపుటరిగెలు ♦ బిఱబిఱఁద్రిప్పుచు, వడిబిల్లుమిరములు ♦ వైచువారు
తెగనిండఁదిగిచి స♦ద్దైసలకు బొట్టెకో, లలు జూపి పల్లటీల్ ♦ దాఁటువారు
గీ. నొండొరులకభిముఖులైన ♦ నుబ్బువారుఁ, గడలుచాఁపుచు వేడుక♦ కయ్యమునను
జెలఁగి తమదొరలకు నింపు♦సలుపువారు, నగుచువీరభటుల్ మించి♦రతిశయమున.

(*చూ. శ. ర. అరిగ) కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 41.

సీ. ధర్మగుణస్ఫూర్తిఁ ♦ దనరారుచున్నప్ర, చేతులై యుండియు ♦ జిష్ణులగుచుఁ
బరదానరూఢి నె♦ప్పటి సుపర్తీకులై, మహిమమించియు నప♦మత్తులగుచుఁ
బురుషోత్తమసమాఖ్యఁ ♦ బొసఁగినుదర్శనో, ద్యుక్తులై యుండియ♦త్యుగ్రులగుచుఁ
దేజంబుగల కుల♦దీపకులైయుండి, చెలువంపు వర్ధిత ♦ స్నేహులగుచు [తు
గీ. మాధవసహాయసంపత్తి♦మలయుచున్న, యసమశరులయ్యుబలభద్రు♦లగుచుఁబోలు
రతులసాహసవిగ్రహో♦దగ్రశక్ర, విక్రమోద్భటు లప్పురీ ♦ వీరభటులు. 382

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 23.

ఉ. గాళికు లాపురీభటశి♦ఖామణు లెక్కటి యుక్కుతున్క లా
భీలతరాశనుల్ చిదిమి♦వెట్టినబంటులు వైరికెల్ల బే
తాళుఁడు పచ్చి దగ్గతిన ♦ దబ్బర గా దొక దెబ్బ దీయఁగాఁ

జాలుదు రేమిచెప్ప మఱి ♦ సాదన నేటును సాహసమ్మునన్. 383

విజయవిలాసము, ఆ 1 పద్య 75.

ఉ. బాహుబలోద్ధతుల్ సమర♦భాగనట ద్రిపుచాతురంగిక
వ్యూహవిభేదనక్రమ స♦ముజ్జ్వల విక్రమవిస్ఫురన్మహా
సాహసికుల్ ధనుఃప్రముఖ ♦ సాధనధారణకౌశలాల్ సము
త్సాహరసాకృతుల్ సుభట♦సంఘము లప్పరమం దసంఖ్యముల్. 384

అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 72.

క. వాసవవాసవదీప్త న, వాసిని వాసినిజయించు ♦ నయ్యాయుధముల్
కేసరికేసరివర్తురు, భాసుర భాసురవు లచటి ♦ భటు లుద్వృత్తిన్. 385

కవిరాజమనోరంజనము, ఆ 1.

చ. గిరినికరమ్ము లైనఁ బిడి♦కిళ్ళను వ్రయ్యలొనర్తు రుగ్రికే
సరిసటలైనఁ జేకొని పె♦సం బెకలింపుదు రత్యయాభ్రిపి
స్ఫురదశనివ్రజంబయిన♦చోఁ నఱచేతన ద్రిప్పివైతు రా
పరు హరుఁడైనఁ బోరులకుఁ ♦ డాసిన యప్పుడు వీరు లప్పురిన్. 386

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 70.

ఉ. భల్లవివేల్లనంబు కర ♦ పల్లవపాళిని మల్లిపల్లరీ
వేల్లనతుల్యమై యనులఁ♦ బెల్లుగ నెల్లెడ నుల్లసిల్లుచున్
ఝల్లకభూమివల్లభుల ♦ కోటలకున్ శతకోటికోటిరై
యుల్లసిలన్ సమీకపటు♦లొప్పుదు రప్పురి నుద్భటుల్ భటుల్. 387

అచలాత్మజాపరిణయము, ఆ 1.

గీ. శూలములు కేలఁగీలించి ♦ కాలునైన, నోలిఁ గూలంగఁ జేసెదు ♦ లీలగలిగి
భూతిదసరాగ సద్వ్రజ ♦ మూర్తు లగుచు, నుగ్రభటులనఁదగుదురం♦దుగ్రభటులు.

కలిచకోరచంద్రోదయము, ఆ 1.

చ. పటిమఁబుర్గోపకంఠతట♦వాటికల న్వడిబార్లుదీఱి యు
ద్భటసుభటచ్ఛటాపటల♦ధాటులు రేపును మాపు బాహుసం
ఘటితములౌ తుపాకుల చ♦కచ్ఛకలొప్పఁ గవాతుసేయ ని
ష్కుటకుటజప్రతిధ్వనిగ♦ఘూర్ణిలు ఫైర్ల ఫెళ ఫ్ఫెళధ్వనుల్. 388

చ. కుదురుగ సందు సందుఁ బురిఁ♦గుప్తికి నిల్పఁగ వీరరౌద్రిసం
పదల నెసంగు పోలిసుల ♦ బంటులొగింబడునిద్దరల్పపుం(?)
గుదియలు పూని లాగులును ♦ గుత్త పుఁగంచుకముల్ ధరించువా

రదయతఁ గాలకింకర భ♦యంకరవృత్తిఁ జరింతు రెంతయున్. 390

చెన్నపురీవిలాసము, ప్రథమస్వర్గ.

క. చటులతరశస్త్రవిద్యన్, బటువగుపిడుగుకున్నతునియ♦లకుఁ గూరిచి య
చ్చట విధి నరులుగఁ జేసిన, యటులుందురు బలసమగ్రు♦లగు వీరభటుల్. 391

కృష్ణకల్యాణము, అ 1.

ఉ. పిడుగులతున్క లన్నగరి ♦ వీరభటచ్ఛట లట్లు కానిచో
బెడిదము గా నిజేంద్రిశర♦వృష్టికి మున్నగ శత్రుగోత్రముల్
పొడిపొడి గాఁ గడు న్వడి గు♦భుల్లుభులంచును గర్జితధ్వనుల్
గడలుకొనం బయింబడి జ♦గద్భయదార్భటి నేపుఁ జూపునే. 392

రామరాయవిలాసము, ఆ 1 పద్య 78.

---

# వేశ్యలు.

సీ. చూపులకట్టు పూఁ♦దూపులచేపట్టు, నబలలచూడ్కుల ♦ యాయుధములు
తాయంబునకుఁ గండుఁ ♦ గోయిలఁ గూయించు, బాలలపలుకులు♦మూలమంత్ర
మైదిరికిఁ దేఁటుల ♦ నెడయాటలాడించు, నబలలయలకల ♦ యాప్తబలము
సవరణలకుఁ జంద్రుఁ ♦ జాలించుమగువల, మొగములసేనకుఁ ♦ దగిన మొగము
గీ. భావభవునకు నటుగాక ♦బలమె బలము, గాఁగఁ దిరిగెనె పెట్లచే♦గాసిఁబడఁడె
యనఁగ సౌందర్యసంపద ♦ లభినవముగ, వఱలుదురు తత్పురంబున♦ వారసతులు.

విక్రమసేనము.

సీ. శుకమంజులాలాప ♦ శుభకరస్థితిమించి, పల్లవసందోహ ♦ భాతిఁ దనరి
కలకంఠకూజిత ♦ విలసనంబులనొంది, రంభానురేఖల ♦ రమణ మెఱసి
హరిచందనస్ఫూర్తి ♦ ననిశంబుఁ దనరారి, పుష్పసౌరభములఁ ♦ బొలుపు మిగిలి
సరసాలిమాలికా ♦ సంసక్తి విలసిల్లి, విషమబాణాసన ♦ వృత్తిఁ జెంది
గీ. లలిత మాకందవైభవం♦బులఁ దనర్చి, యతిమనోహరాకారత ♦ నతిశయిల్లి
యుద్యదుద్యానవాటిక ♦ లుల్లసిల్లు, వారవనితలు నాపుర♦వరము నందు. 394

విక్రమార్కచరిత్రము, ఆ 1 పద్య 88.

సీ. ముడివిప్పనడుగుఁద◆మ్ముల పైనెవ్రాలుపె, న్నెఱులు దేంట్లగుటసం◆దియము గలదె
కన నెంతవానిలోఁ ◆ గొనుట నాదర్శంబు, నెమ్మొగంబగుట సం◆దియము గలదె
ఇఱిగొను మింటిపై◆ మెఱయుటఁ జక్రద్వి, తయిచన్నులగుట సం◆దియము గలదె
పొలుసుదోర్లఁగ జూచు ◆ కలికిచూపుల మీలు, తెలిగన్నులగుట సం◆దియము గలదె
గీ. పొలసినవె తావి బుగులుకో◆నలరుఁదీగ, తిన్నని శరీరమగుట సం◆దియము గలదె
యనఁగఁ జెలువొంది సురతవై◆యాత్యనిధులు, పణ్యయువతులు పొలుతుర◆ప్పట్ట
ణమున. 395

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 30.

సీ. మొలకచీకటి జల◆జలరాల్పఁగా రాదె, నెఱులు మించినవీరి ◆ కురులయందు
కెరలించి యమృతంబు ◆ గిలకొట్టఁగా రాదె, ముద్దుమాపెడివీరి ◆ మోవులందు
పచ్చబంగారుకు◆ప్పలు సేయఁగా రాదె, గబ్బిమీఱినవీరి ◆ గుబ్బలందు
పండువెన్నెల తేటఁ ◆ బరిఢవింపఁగ రాదె, నగవుగుల్కెడివీరి ◆ మొగములందు
గీ. నార కరవాఁడిచూపుల ◆ యాఘళంబు, బాపురే భూరికటితటీ ◆ భార మహిమ
చాగు మదమందగమనల ◆ తుణములనఁగ, నేరుపులమింతు రప్పురి◆వారసతులు.

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 117.

క. కాదంబరి స్వాదించియు, మోదంబునఁ గౌముదీస◆ముత్సేషము సం
పాదించియుఁ దబ్బిబ్బుగ, వాదింతురు రేలు వార◆వనితలు వీటన్. 397

కువలయాశ్వచరిత్రము, ఆ 1 పద్య 87.

సీ. తొడనిగ్గులకు రంభ ◆ తోడ్తోడఁ దలవంప, శశిరేఖ నొసలికి ◆ సగముగాఁగ
దరహాసమునకుఁ జం◆ద్రికళ వెల్వెలఁబాఱ, నెమ్మోమునకుఁ గలా◆నిధి కృశింప
మునుతిలోత్తమ మించు◆ముక్కుతేటకు వాడ, హేమ మెచ్చగనెమ్మె◆యికిఁ గర్దంగఁ
చెలబాహుల కనంగ ◆ లతిక కొండలువ్రాక, నరిదిచూపులకెంత ◆ హరిణి బెదర
గీ. ఫలముఁ గొని పల్లవావలిఁ ◆ బాసిపోక, యలఁతిగాక పలుకఁబాఱ◆కెలమి విడక
పడకవన్నియ దఱుగక ◆ పచ్చఁదనము, వీగక వలం దగులకుండ్రు ◆ వేశ్యలచట.

బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 88.

సీ. పలుకులు మత్తకో◆కిలవైఖరుల గొల్పఁ, గురులు చామరముల◆సరణిఁ దెల్పఁ
తనువుక్రొత్తావు లు◆త్పలమాలికల నీనఁ, జెవులు మంగళమహా◆శ్రీలఁ బూనఁ
చంపకమ్ముల సునా◆సలతీరుఁ దలపించ, గమనముల్ వనమయూ◆రములనిరచ
దరలభావములు నే◆త్రింబులఁ గనిపించ, నాస్యంబు లంబురు◆హముల మించ
గీ. హృద్యసూక్తి ప్రవీణత ◆ నెసఁగి రౌర, చతురనవరసలసదలం◆కృతులు మీఱి

వర్ణనాకారమైన కా♦వ్యంబువోలె, నగరి వెలయాండ్రిపిండు మ♦న్మథునిదండు.

నలచరిత్రము, ఆ 1 పద్య 196.

గీ. సాటిగాఁజూచి మెచ్చర♦చ్చరలఁదలిరుఁ, బ్రియమునఁనాటపాటల♦గాయకమున
నలరు జాగవయోన్నృప♦భాళి వర్ణ, తాత్రిటిదాఁటులు పురి వెల♦బోటు లరయ.

వేదాంతరసాయనము, ఆ 1 పద్య 21.

గీ. పల్లవానందరూఢిచేఁ ♦ బరిఢవిల్లి, పరభృతాంచితలీలచేఁ ♦ బ్రౌఢిఁ గాంచి
మధురకలకంఠమహిమచే ♦ మహినిమీఱి, నలఘుకరమైనపురవార♦యౌవతంబు.

ఒడయనంబివిలాసము, ఆ 1 పద్య 23.

సీ. రంజితాధరసుధా♦రససమేతంబులై, ముఖచంద్రబింబముల్♦ముద్దు గులుక
నవతంసకుసుమతా♦రావళీయుతములై, కచభారతమసముల్♦గరిమఁ జూపఁ
గమనీయమణిమారి♦కాఘురాంచితములై, కుచకుంభశైలముల్♦కొమరు మిగులఁ
గంకణేంద్రోపలాం♦కమిళిండచణములై, పాణిపద్మంబులు♦పరిఢవిల్లఁ
గీ. గలిత మోహనరూపరే♦ఖావిలాస, విభ్రమంబులు జగమెల్ల♦వినుతిసేయ
నతులగతి వారశృంగార♦వతులు వేన, వేలు విహరింతు రెపుడు న♦వీ్వటియందు.

అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 67.

శా. ఆవీటంగల వారకామినులు రం♦భాద్యప్సరఃకన్యకా
పాళీణ్యాంబులు మెచ్చ రెన్నఁడును ని♦ద్రాహారవీటీలస
ద్భ్రూవిక్షేప సుఖంబులేదనెడు సం♦తోషంబునంజేసి రా
జీవాస్త్రప్రసవాశుగంబులగతిన్♦జెన్నొందితారుండుటన్. 403

పద్మినీపరిణయము, ఆ 1 పద్య 65.

సీ. లోకమోహనకళల్♦చేకొనియుండంగ, నతను బాణములంట♦ యబ్బురంబె
మహనీయలీలల♦మానసంబలరింప, నంచబోద లనంగ♦ననువుపడదె
గగనమధ్యమనోజ్ఞ♦గతులు శోభిల్లుటఁ, జుక్కలంచు వచింప♦నూటిపడదె
వలపులుగొలుపు చె♦ల్వములు రాజిల్లుటఁ, బుష్పమంజరులని♦పోల్పఁ దగదె
గీ. వీరినన నూరు విలసన♦విజితరంభ, లంచితేక్షావధీరిత♦హరిణలగుచు
నచ్చరలమీఱఁజాలు నొ♦య్యారములను, నెలనెలందుక లుందు ర♦వీ్వటియందు.

కవిజనరంజనము, ఆ 1 పద్య 14.

శా. భవ్యార్థాగమమంత్రతంత్రవిధులన్♦భావంబుదీపింపఁగా
స్తవ్యశ్రీకరహోమయాగమహిత♦చ్ఛందస్స్ఫురద్వృత్తితో
నవ్యాజోన్నతమైన దద్వాగహిత♦వ్యాపారము ల్మీఱ వా

స్వచ్ఛ ల్వారసతుల్ పురిం బొలుతు రెం♦చన్ యజ్ఞసత్వ్రు ల్వాలెన్. 405.

అచలాత్మజాపరిణయము, ఆ 1.

చ. ఘలుఘలుఘల్లుఘల్లుఘలు♦ఘల్లని ఘంటలచేతఁ గాలిపై
గొలుసులమండపున్నడలఁ♦గుల్కు లహంకరణంబు లొప్ప మా
పులవిడివాటు వారజపుఁ♦బూనిక లానికలున్ మదోద్ధతుల్
దొలుకఁగ గంధసింధురము♦లోయనఁ బొల్తురు వారకామినుల్. 406.

రాధామాధవసంవాదము, ఆ 2.

మ. అతులాగ్రాశ్రితవృత్తి నిస్తిమితశం♦కాస్వాత లంచత్పదాం
కిత లబ్ధాంతరభావగోపన లస♦ద్రీతిప్రభూతబంధాద్యలం
కృత లక్ష్మీణకళాప్రవీణ లతిచ♦త్రీభూతపద్మాభిశో
భితలై కావ్యవధూవిధంబుగ ణికా♦బృందంబు లొందుం బురిన్. 407

మిత్రవిందాపరిణయము, రా పు. జ. రం. ఆ 1.

సీ. భమ నఖంబున కోడి♦నిమురమై నిర్వికా, రత వాదగా మర్ద♦గతికి నోడి
వినతమై ముఖకలా♦విహీనయి గతికోడి, సకలతఁ గరమ్మూరి♦వెలఁది తొడల
సిరికోడి కరబహి♦ష్కృతమై కువృత్తి చే, నడుము మిన్నంది ......
శాతముఖంబయి♦సారసాయుతలోచ, నావయవద్యుతి♦కవల నోడి
గీ. విపుల శుచివృత్తి దుర్వర్ణ♦వికృతి విడిచి, యాశుగతినంతమునఁ గ్ర♦హంబుఁ దాల్చి
వెదఁ దియనిపించుకొనియు న♦వ్వేలవెలంది, కుద్ధయానరానికి నెవ్వఁ బో♦యుక్తి లేక.

రాధాకృష్ణసంవాదము.

సీ. పెదవి మెదల్చిరా♦మృదులపల్లవరాగ, సాంద్రిమాధుర్యని♦స్యంద మొలుకఁ
గేలుమలంచిరా♦కిసలయాంబుజకోశ, లీలాభినయసమ♦న్వేఖఁ లరఁ
గన్నులల్లార్చిరా♦కమలకాండాళికో, త్పలవివిధానుభా♦వములు గురియఁ
గాలుగదల్చిరా♦కలహంసకాకల్ప, కమనీయలాస్యనై♦పుణులు వఱలు
గీ. మేను మెలగించి రానగు♦ణానుబంధ, రతమనోజ్ఞోజ్జ్వలాంగహా♦రములు వెలయ
సిరులనీ వొందుతత్పురీ♦నరమునందు, చెలఁగ వెలయా[illegible]రిస్తురజయ♦శ్రీలు గా[illegible]

ఇందుమతీపరిణయము, మతు. నృసిం. ఆ 1 పద్య 19.

చ. పొగరుమిటారి......♦భూవరపంక్తివసించి కన్బొమల్
జిగిఁదగు కార్ముకంబులుగఁ♦జేసి మనోహరమైన యాస్యు నా
ర్ణగతి నొనర్చి చంచల వి♦లోకనబాణము లందముర్చి కెం[illegible]

జిగురుకటారిదారిఁగని చీవ గలంతురు వారిజాక్షిమినుల్. 410

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 1.

సీ. అమితరసప్రౌఢిఁ నలరెడు సరసుల,
నేవయుంటవలనఁ బద్మినులనంగ
లలితబంధవిశేషముల మహాభోగులఁ
దనుపుటవలన భోగినులనంగ
ఘనతరాగముల మెండెనసి పల్లవలాభ
గరిమఁ దాల్చుటఁ గలకంఠులనఁగఁ
దత్జ్ఞులు వినుతింపఁ దగు చెలులందము
మనుటచే సురుచిరమణు లనంగఁ
గీ. బ్రిజలి తతమంజులాస్యవిభ్రమసమృద్ధు
లలరఁబ్రీతిభరతరహాస్యములను వలఁతు
లగుచు రంభాదులనుగెల్చుసొగసునఁ బరి
వెలుఁచుందురువారముదదులు భళిర.

భద్రాపరిణయము, ఆ 1 పద్య 144.

---

## అభిసారికలు

సీ. శంపాలతికఁ బెంపెసంగు నెమ్మేనులఁ, గస్తూరివాల్లకోకలు చెలంగ
రంగుబంగరుబొంగరాలఁ గేర్ ......, రహివిహారిఁ దగు కప్పు రైక లలర
దరముమందరముఁ జిందరనొందఁజేయుగ, కస్తురి నిండ్రినీలకులు గాలి
వదనైనఁ బ్రియుల గాఢాలింగనములొప్ప, నెదలగుంపులమృగమదము తెసఁగ
గీ. శ్యామసుందరవితతి నెంచంగనైన, విరులు తురుములునఁ దుటిమిత్రతరముదోఁప
ననుపుఁగాంద్రహితమ్ముఁ గనంగఁ జనిరి, ప్రకటముతులై నిశాభిసారికలగుంపు.

సత్యభామాపరిణయము, ఆ 3 పద్య 64.

ఉ. నల్లనిచీరఁగట్టి కడు ♦ నల్లనికాటుకఁ గంటఁబెట్టి ధ
మ్మిల్లముఁ జక్కఁబెట్టి మది ♦ మెప్పుగుకస్తురి బొట్టుఁబెట్టి రా
జిల్లెడు నల్లఁగల్వగమి ♦ చేతనుబట్టి మనోజ్ఞజారిణీ
ఫల్లవపాణులుం జనిరి ♦ పల్లవకోటి నివాసభూమికిన్. 415

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 3.

---

# విటులు.

సీ. అతివినోదముగాఁగ ♦ రతుల మెప్పించు నీ,
పచ్చలకడియాల ♦ పద్మగంధి
చక్కెరమోవి ఇచ్చి ♦ చవులఁ దేలించు నీ
ముత్యాలకమ్మల ♦ ముద్దులాఁడి
తృణముగా లోఁజేయు ♦ నెంతటివాని నీ
నీలాలముంగఱ ♦ నీలవేణి
వెలలేనిపొందిక ♦ విడివడ మెఱయు నీ
కెంపులబాగడాల ♦ కీరవాణి

గీ. యనుచుఁ దమలోన సెఱజాణ ♦ తనము మీఱ, వారకాంతామణులు మేలు ♦ వార్తలెల్లఁ
దెలుపుచును వెన్నెలబయళ్లఁ ♦ గలసి నగుచు, విటులు విహరింతురప్పురి ♦ వీథులందు.

విజయవిలాసము, ఆ 1 పద్య 81.

ఉ. వాటపు కూసముల్విడిచి ♦ వాటుకఁ దోఁటలఁ దాము నిల్చి వ
ల్గాటులు సేయఁగోరి తగు ♦ లాటపు బోటుల రాక గాంచుచున్
బాటలు నిక్కిచూచుచును ♦ పాంథులయుల్కిడి గాఁగ నుక్కుచున్
జాటులఁ బొంచియుండిరి భు ♦ జంగులపోల్కి భుజంగవర్గముల్. 417

మ. సొగసుల్గుల్కెడు తెల్లపట్టువలువల్ ♦ సొంపొప్పఁగాఁగట్టి బల్
మగరాల్చెక్కినసొమ్ముఁబెట్టి సిగలన్ ♦ మందారమాలావళుల్
మిగులంజుట్టి విలాసవైఖరిఁదగన్ ♦ మేల్వెండిబెత్తంబుఁ జెం

పుగఁ జేపట్టి భుజంగులేగిరి విటీ♦పుంజంబులం గూడఁగాన్. 418

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 3.

సీ. సారసదళనేత్రి ♦ చంపకమాలికల్, గూర్చియిచ్చెదనీకుఁ ♦ గోర్కెదీఱ
సమదేభగామిని ♦ సరసిజంబుల నీదు, పేరునఁ గూర్చెదఁ ♦ బెంపు దనర
నుత్పలమాలికల్ ♦ హారాయలు మీఱ రచించి, యిచ్చెద నీకు నో ♦ యింపులాఁడి
మంజుభాషిణి మణి♦మాలాదులను నీకు, నొసగెద నొగిఁ జేర్చి ♦ పస దలిర్చ
గీ. నమచు నతినర్మగర్భవా♦క్యముల నాడి, జారులగు కోవిదులు రేయి♦జారని
తంబినులఁగూడి వేకువ♦దంబుమీఱ, మునుఁగులిడిపోవుచుందురు♦ పొసఁగఁగాఁగని.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 70.

---

# వనవర్ణనము.

మాలిని. ఏచి తనర్చి తలిర్చిన క్రొవ్విరుల ♦ నిమ్మగు తావుల జొంపములన్
బూచిన మంచి యశోకములన్ సుర♦పొన్నలఁ బొన్నల గేదఁగులన్
గాచి బెడంగుగఁ బండిన యా సహ♦కారముల న్గదళీతతులన్
జూచుచు వీనుల కింపెసఁగన్ విన♦మున్ శుకకోకిలసుస్వరముల్. 420

భాగతము ఆది ఆ 4 పద్య 19.

సీ. చంచలఁజిగురాకుఁ ♦ జించి కూడుచునలి, నెలుఁగించుగండుఁగో♦యిలలసొంపు
నలరుఁ దేనియఁ గ్రోలి♦ యెలయుపోలంబున, మఱియు తేఁటులనును♦ప్రమోఁతయింపుఁ
దనిపండ్లరసమాని ♦ తమలోనఁ జెలఁగుచుఁ, బలికెడు రాచిల్క♦ దదువుగంగు
గోలఁకుల కెలఁకులఁ ♦ గూడి క్రీడించుచుం, డెడు నంచతండంబు ♦ నడ బెడంగుఁ
గీ. దరఁగఁ దేలుచుఁ బూఁదీవ♦దగులఁబడుచు, వచ్చుచిఱుగాలిసోఁకును♦ మెచ్చిమెచ్చి
తగిలి కొనియాడుచును విన♦తయును గద్రు,వయును మున్నీటిచేరువ♦వనమునందు.

భారతము అను. ఆ 1 పద్య 181.

సీ. ఎనసి యొండొంటితో ♦ ననఁగి పెనంగెడు, నవలతాతరు మిథు♦నముల సొగసు
సహకారపల్లవా♦స్వాదనక్రీడలు, సలుపు కోకిలదంప♦తుల బెడంగు
పొలయాలుకలను దె♦ల్పులనటించుచుఁ గ్రాలు, విటకులటాసుల ♦ విలసనంబు

సరసదాడిమఫలా♦స్వాదనలీలలఁ, గిరమొప్పు శుకవధూ♦వరులచెన్ను

గీ. హంసవరటామనోజ్ఞవి♦హారవిభ్రమములఁ గొమరారు కమలషం♦డములభాతి
నర్థిఁ జూచుచు హలధరుం♦డల్లనల్ల, నేఁగి యొక్కెడ నొకపొద♦రింటి లోన. 422

మార్కండేయపురాణము, ఆ 1 పద్య 180.

చ. దళముగ నెల్లప్రొద్దును ల♦తానిచయంబుల రాలు పుప్పొడుల్
పులినతలంబులై చెలువుఁ ♦ బూనఁగ మీఁదటఁ దేలు కేతకీ
దళముల మొత్తె మోడలు వి♦ధంబునఁ దేలఁగఁ బాఱుఁ బెద్దనై
ఫలరసవాహినుల్ పురియు♦పాంతవనంబులఁ గొన్నిచోటులన్. 423

కేయూరబాహుచరిత్రము, ఆ 1 పద్య 60.

సీ. సరసపుష్పపరాగ♦సైకతంబులుదీర్చి, తేనియకాలువల్ ♦ తెరలిపాఱ
రమ్యమయూరగ సం♦భ్రమలీలఁ గల్పించి, ఘన తమాలాంబుద♦కాంతిదనర
లతికావిలాసినీ♦లాస్యంబు ఘటియించి, చతురమారుతనట♦స్వామివోలెయఁ
జారుపల్లవరాగ♦సంధ్యామహిమఁ జూపి, విమలకోరక తార♦కములు మెఱయ

గీ. సతతవిహరణదంపతి♦చారుదేహ, రత్నభూషారుచిస్తోమ♦రమ్య మగుచుఁ
బొలుచు నారామసమితిత♦త్పురమునందుఁ, గల్పకావలిభువిమీఁదఁ♦గలిగెననఁగ.

విక్రమార్కచరిత్రము, ఆ 1 పద్య 89.

సీ. మదషట్పదంబుల♦మధుపానభూములు, రాజకీరంబుల♦రచ్చపట్లు
పుంస్కోకిలంబుల♦భోజనశాలలు, మలయానిలంబులు♦మలయు నెడలు
నవమయూరంబుల♦నాట్యరంగంబులు, మకరకేతనుసభా♦మండపములు
విటవిటీజనముల♦విరులచప్పరములు, ఘనులక్ష్మికైవాస♦మందిరములు

గీ. అలవసంతునిలీలావి♦హారసీమ, లిప్పలంబనువలపుల♦పుట్టినిండ్లు
చిరపరిశ్రాంతపథికసం♦జీవనములు, పావనము లప్పురంబున♦బాహ్యవనులు. 425

శ్రీరంగమహాత్మ్యము, భైర. క. ఆ 4 పద్య 1013.

సీ. ఊరగపూతాంకరధూ♦మోగ్రగంధముఁ బాసి, సొలయుఁ బోయీ తావి♦మలయపవనుఁ
డనలాక్షుపెడబొబ్బ♦నలమిన తలదిమ్ముఁ, బాయుఁ బోయీ తేంట్ల♦పాటమరుఁడు
ఘస్రసామీప్యసం♦కలితదాహస్ఫూర్తి, నాఁగుఁ బో యీనీడ♦నల్లమధుఁడు
గరళసోదర్యత్త♦కర సుధాకటుకత్వ, ముడుపుఁ బో యీతేనె♦నోషధీశుఁ

గీ. డనఁగఁ జంపక కురువక♦పనస తినిశ, నిచుల వంజులదాడిమీ♦విచికి లామ్ర
పాటలీ పూగ కేసర♦ప్రముఖతరుల, సొబగుమీఱు నుద్యానంబుఁ♦జొచ్చియచట.

మనుచరిత్రము, ఆ 3 పద్య 73.

లయగ్రాహి.

ఈయిలఁగలద్రుమములీ♦యెడనకూడెనని, పాయకనుతింపనను♦వైయిరులుగ్రిమ్మన్
ధాయకులకర్ణతతు♦లేయములుగానభులు,క్రోయుచుగుళుచ్ఛముల♦చాయలనటింపం
గాయజునివాజులకు♦దాయములనందగిన,యాయతరసాలముల♦తోయములఁగ్రాలన్
శ్రీయెదలియూఅటకు♦పాయమయిచెన్నలరు, నాయుపవనంబుజగ♦నాయకుఁడు
సొచ్చెన్.427

బసవపురాణము, పి. సో. ఆ 4 పద్య 224.

సీ. విరహిరక్తముతోడి♦మరునిబల్లెము లన, నెల్లెడ విలసిల్లు♦పల్లవములు
బాంధమేదస్స్నేహ♦భరితకామాస్త్రాళి, నా నొప్పు సరస ప్ర♦సూనములును
భావజుమిడివింటఁ♦బొలు నీలపు గుండ్ల, భంగిఁ జరించు పు♦ష్పంధయములుఁ
జేతోజబలసము♦ద్ధూతధూళియనంగ, రాజిల్లు సుమనఃప♦రాగములును
గీ. వసమసాయకజయబిరు♦దావళీని, పాఠవరవందిజనఘనా♦ర్భటి యనంగఁ
గడు విజృంభించు శుకపిక♦కలకలములు, నెలఁతకును గుండెదిగులుజ♦నింపఁజేసె.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 3 పద్య 35.

లయభాతి.

అలికులము నీలముల♦చెలువమువహింపనవ, దళములు హరిన్మణుల♦పొలుపునఁదలిర్పం
దలిరుగమికెంపులుగఁ♦బలుదెఱఁగుక్రొవ్విరుల,విలసనముముత్తియపు♦గుళికలకుఁదక్కం
గలమణులకుం బసిఁడి♦తళుకులకు నీడగుచు, వెలయఁగఁబరాగములు♦లలితపువితానం
బులుగ గృహముఖ్యముల♦చెలువుప్రతిబింబములుఁ, బరెఁ బురమునద్దెసలఁ♦బొలుచు
ను వసంబుల్.429

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 115.

ద్విపద.

నసుచు కందములకం♦దములకుందముల, ఘనలవంగముల లుం♦గములఁ దుంగములఁ
దరులఁ గేళీశైల♦దరుల నిర్ఝరుల, సరసకుంజములఁ గం♦జముల పుంజముల
లలితసాలములఁగో♦లములఁనుమాధ, వులను మాధవులను రా♦వులను దావులను
గాలి భృంగాళితోఁ♦గ్రాలి సూనాళి, ధూళిమైఁ బోలి మ♦ధూళిమైఁ దేలి
మించి యెంతయు సంభ్ర♦మించి రమించి, పంచబాణునివెన్న♦బలమైచలింపఁ
గమ్మవిల్తుఁడు దాడి♦గదలంగ నెగయు, దుమ్ములోయనఁ బుప్పొ♦దుమ్ములు నెఱయ
కాడవిల్తు కత్తుల♦విరహిరక్తములు, వడియు జాడఁ జిగుళ్ళ♦వడిఁ దేనె లురుల
[illegible]ప్రసృష్టిశో♦నగునిందుప్రవింటి, సరణిఁ బికశ్రేణి♦చదలఁ జూపట్ట
[illegible]చల♦శ్శ్వగంభౌఘు, మాలోలభోగభో♦గాళిఁ గేళింప

గగనంబునొరయుశా♦ఖల మోగగుత్తు, లగణింపదాతల♦కణకింపుచుఁ దఁ
గనకపునదిపిల్ల♦కాలువలనఁగ, ఘనచూతరసములు♦త్కటములై నిగుడ
సతులమోవులఁ గ్రోలు♦సరసులు బోలె, లతలబింబములు చి♦లుకలు గ్రోలు చుండఁ
దరులక్ష్మిమాలికతు♦తములిచ్చె ననఁగఁ, గరికబీజములు శా♦ఖల నొప్ప నొప్పు
సందీప్తసవనంబు♦సకలయోగీంద్ర, బృందైకభవనంబు♦బృందావనంబు. 430

అష్టమహిషీకళ్యాణము, ఆ 1.

ఉ. వాడినదేహపల్లులును♦వక్రిములైన నఖవ్రణంబులున్
గూడిన పత్రిజాలములు♦కుల్కెడి ఘర్మమరందబిందువుల్
వీడినకేశభృంగములు♦వింతలుగా విలసిల్లుచుండఁగాఁ
జూడఁదగెన్ రతాంతసతి♦చొప్పున నవ్వని యప్పు డొప్పుగన్. 431

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 8 పద్య 29.

సీ. అనిమిషాధీశునం♦దనవనంబునుఁబోలె, మందారకల్పద్రు♦మహితమగుచు
బాణవైరికుమారు♦తూణీరమునుఁబోలె, నవపుష్పకాండన♦నాథమగుచు
వనజనాభునిసుద♦ర్శనచక్రమునుఁబోలె, దివ్యబృందావనో♦ద్దీప్త మగుచు
గగనగంగాతరం♦గ ప్రవాహమువోలె, నవిరళామృతఫలో♦దారమగుచుఁ
గీ. బౌద్ధదివ్యవధూముఖా♦బ్జమునుఁ బోలె, జారుతరకీరమధువాక్ప్ర♦చార మగుచు
నలరు నవ్విప్రనారాయ♦ణార్యపుష్ప, వాటి సంకల్పభవపట♦వాసపేటి. 432

వైజయంతీవిలాసము, ఆ 2 పద్య 3.

సీ. తరుణచందనలతా♦తనుసౌరభముతోడఁ, బద్మినీజాతి సై♦భవముతోడ
సందీప్తకుంజరా♦శన మధ్యమముతోడ, నవపుంజుకుచపాట♦నంబుతోడ
మన్మథబాణ ని♦ర్మలరూపస్థితితోడఁ, బున్నాగకలనాభి♦పూర్తి తోడ
దుర్వారకాంచన♦ద్యుతివిశేషముతోడఁ, బటుదంతకోరక♦పంక్తితోడఁ
గీ. దనరి తరుణియుఁబోలె ని♦స్తంద్రసాంద్ర, చంద్రకాంతాలవాలవి♦శాలలీల
బాల సురసాల సాల♦సాల వక్షశ్రీ, తాల హింతాల ముద్యాన♦జాలమలరు.

భానుమతీపరిణయము, ఆ 1 పద్య 18.

శా. ఆమోదాన్వితపల్లవైకగణికా♦శ్యామాంకమున్ బ్రస్ఫుర
ద్దామోద్యద్దళమున్ ప్రఫుల్లకుసుమ♦ద్వారోజ్జ్వలత్సాలజా
లామేయోన్నతమున్ బ్రిత్రప్రియదశా♦గ్రాంచద్ద్విజంబున్ వర
శ్రీమంతంబుగ శౌరి వ్వారము [illegible] పట్టణశ్రీయుసన్. 434

[illegible]విలాసము, ఆ 1 పద్య 272.

సీ. కలకంఠసముదాయ♦ములకు భోజనశాల, జగహజారంబు వ♦సంతమునకు
నబ్జాలయాసూతి♦కాయుధాగారంబు, గరిడి మందసమీర♦కాండమునకు
నళిపోతసమితికి♦నాపానసదనంబు, సంకేతభవనంబు♦శైత్యమునకు
శుకముఖద్విజరాజు♦లకు ధర్మసత్త్రము, నృత్యగేహము బర్హి♦నికరమునకు
గీ. మానినీజాతసంజాయ♦మానమాన, దానకలనాధురీణ వ♦చోనిదాన
శారికానూనవివిధచే♦ష్టావితాన, జీవనం బనఁదగుఁ దత్పు♦రీవనంబు. 435

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 37.

సీ. రమణీయతరపత్త్ర♦రథవిహారములంది, ఘనమత్తసారంగ♦గతుల నలరి
పటుగంధవద్ధరి♦వలనాప్తిఁ జెలువొంది, మొనమించుమదళిముల♦వినుతిఁ గాంచి
శ్రీవిలసిల్లు నా♦నావర్ణములమీఱి, కదళికాచలనవై♦ఖరులఁ దనరి
యురుతరసాలశీ♦ఖరములమిన్నంది, పల్లవామోదసం♦పదలఁ బొదలి
గీ. పరిబలు మల్లులయుద్ధతిఁ♦బరిఢవిల్లి, చంద్రకాంతస్థలీవిలా♦సముల నమరి
చారుమహిళాభిశోభియై♦చంద్రవదన, యీవనముఁ గంటె పట్టన♦శ్రీవహించె.

మిత్రవిందాపరిణయము, కుం. వెం. ఆ 2 పద్య 85.

సీ. సురసాలసంతతి♦సురసాలసంతతి, గతి ఖగాళికి ఫలో♦న్నతి యొసంగు
మహితకాంచనములు♦మహితకాంచనముల, పోలిక నామోద♦ములు ఘటించుఁ
గలితపున్నాగముల్♦కలితపున్నాగము, లట్ల కొమ్మలతోడ♦నమరియుండు
రంభాదినటనము♦రంభాదినటనము, కరణి మరుత్ప్రసం♦గములఁ బొదలుఁ
గీ. బనసలెంతయు బనసల♦భాతి ద్విజుల, కును బదక్రమసంయుక్తిఁ♦గొమరుమీఱు
నగము లున్నతినగముల♦పగిది వనుల, నలరుచుండు పవిత్రంబు♦లగుచుఁ బురిని.

బిల్హణీయము, ఆ 1 పద్య 27.

సీ. చెలువంపుఁ జిగురుటా♦కులు పాదములు గాఁగ, నవకంపురంభ లూ♦రువులు గాఁగ
సూనవాసనలు నె♦మ్మేని తావులు గాఁగ, నొప్పైన లతలు బా♦హువులు గాఁగ
గజనిమ్మపండ్లు చొ♦క్కపుఁ గుచంబులు గాఁగఁ, గలకంఠరుతులు వా♦క్యములు గాఁగఁ
దులలేని మల్లెమొ♦గ్గలు దంతములు గాఁగ, సుమిళిందమాలికల్♦చూపు గాఁగఁ
ఆ. బల్లవితతమాల♦పాదపచ్ఛాయలు, సరసమైన వేణి♦భరము గాఁగ
నెన్నఁ దగియె నప్పు♦డిందుబింబానన, యౌవనంబు బోలి♦యవ్వనంబు. 438

అనిరుద్ధచరిత్రము, ఆ 2 పద్య 45.

మ. నవసూనాంచితశాఖలాయె డనెడన్♦రత్నాంకసానుప్రభం
దవులంబై గుమిఁగూడు కోయిలలు చెం♦త న్మేఘబృందంబుగాఁ

బరివేషం బ్రాఁకు లతాంగు లచ్చరలుగా♦భాసిల్లెడున్ గంటె యా
చివురుంజొంపపుమావి మేరుగిరినాఁ♦జెన్నొందుఁ జందాద్రిననా. 439

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 3 పద్య 18.

సీ. బాలాంబుజతమాల♦మాలాభినవజాల, జాలామృతోల్లోల♦షట్పదౌఘ
రాగాదిపరిమాగ♦మాగాంతసుపరాగ, రాగావరణభాగ♦రాశిపవన
కేళీగృహన్మాలి♦మాలిస్థితపికాలి, కాలీనగవలోలి♦తాధ్వగాత్మ
రాజీవశరవాజి♦వాజీసనిరతాజి, తాజీజనకరాజ♦తామ్రఫలిక
గీ. భవ్యబుతుకాంతకాంతతా♦త్వర్యసృష్ట, ఘనవిషమబాణ బాణసం♦ఘాత కలిత
తిలక మధుగంధ గంధసం♦చులుకితాశ, కనదచిరధామధామ యి♦వ్వనికఁ గంటె.

చంద్రికాపరిణయము, ఆ 4 పద్య 53.

క. ఫలపుష్పలపాణింధమములు, ఫలయానిలముల విహార♦మందిరములు పూ
విలుతుని యాయుధశాలలు, చలువలజన్మస్థలము ల♦చటిపూఁదోఁటల్. 441

కవిజనరంజనము, ఆ 1 పద్య 17.

సీ. భ్రమరాలినిపహుంకృతి ♦ బాలాల ఘంఁగిని, లతలపైనిలిచియా ♦ లతులు సేయ
కోయిలజవ్వనుల్ ♦ గూడి కుహూకార, కాహళధ్వనులు చో♦క్కముగఁ బూన
రాయంచలేమలు ♦ రవిం నిల్వఁబోగడంగ, రాచిల్కజవరాలు ♦ రాగ మనఁగ
మలయానిలుండును ♦ మందమారుతమును, నలతాళకునిరీతి ♦ నాటఁ జూప
గీ. సంభ్రమంబున మంజరీ ♦ స్తనము లూరగ, వైభవంబునఁగిరపల్ల♦వములుసాఁచి
తరులతాంగవిటతులు న♦ర్తనలు సలుప, నంతకంతకు వనలక్ష్మి ♦ యతిశయిల్లె.

పర్వతపురాణము, ఆ 4.

సీ. గురుతరోజ్జ్వలపుష్ప ♦ గుచ్ఛవక్షోరుహ, కోమలవల్లికా ♦ భూరిమనోజ్ఞ
కుందకోరకదంత ♦ బృందబింబాధర, శోభిత శాఖాభు♦జాభిరామ
ఫుల్లసముల్లస♦త్పుష్పసంహతిహాస, చంపకకుసుమాతి ♦ చారు హాస
శుకపికకలనాద ♦ సురుచిరషట్పద, చయవేణి కిసలయ ♦ చారుపాణి
గీ. కదలికాసక్థికమనీయ ♦ కనకకలిత, వేదికాజఘనానూన ♦ విలసమాన
యనఁగఁ దనరెడు వనలక్ష్మి♦కెనగలాదె, మాధవునిపొందుగలదిందు♦మనకుఁజూడ.

ఉషాకళ్యాణము, ఆ 4 పద్య 111.

సీ. కలమాబ్జబిసదళ ♦ కాంతిసమ్మిశ్రిత, వరపిశంగారుణ ♦ హరిత రుచులు
నెరయఁగాఁగిలిగిన ♦ చరదింద్రచాప ఖం, డాభంబులైనతో♦యములుగాంచి
యేడాకుటనఁటుల♦నెగయుపుప్పొడి జాలు, పైఁటఁబోలెనుసారె♦మాటుకొనుచుఁ

గాటుకల్దీర్చిన ♦ కన్నులల్లార్చెడు, గతి నెల్లఁగెంటెనల్ ♦ గదలుచుండ

గీ. వెలయుకుసుమంబులనునవ్వు♦లొలుకుచుండ, గురుకుచంబులగతిఁబువ్వు♦గుత్తులమర
నలరుకచలీలఁబుష్పంధ♦యములుదనర, వనితలనుబోలువనపంక్తు♦ లొనరఁజూచి.

కిరాతార్జునీయము, ఆ 2 పద్య 18.

సీ. మోహనాకార స♦న్ముఖవిలాసములొప్పఁ, గాంచనద్యుతులు స♦ల్లవలఁ బర్వ
పల్లవాలంకార ♦ పత్త్రిరేఖలు చేర, జిల్గుకంచెలతీవి ♦ చిందులాడ
వెలలేని మురిపెంపు ♦ వలపులు నిండార, మన్మథసహకార ♦ మహిమ మెఱయ
జిలిబిలిముద్దుచి♦ల్కపలుకు లలరింపఁ, గలకంఠు లెలమిని ♦ గలసి మెలఁగ
గీ. నిగనిగల్పలపండ్లు వ♦న్నియలుగులుక, తమిని సరసాళు లమిత గీ♦తములు పాడ
నలరు పురలక్ష్మితోడ నె♦చ్చెలులవంగిఁ, బొల్చె నెల్లెడనుద్యాన♦భూములందు.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

ఉ. కందములందమై తగు సు♦గంధములంగనుపట్టి సుందరీ
బృందవినోదమై దళస♦మృద్ధిఁ దనర్చి మయూరసేవ్యమై
సుందరచంపకాది పరి♦శోభితమై ఘనమొప్పకోకిలా
నందకరాప్తి నాంధ్రికస♦నమ్ములు పొల్పుగనమ్ము లొప్పఁగన్. 446

వేంకటేశ్వరవిలాసము, ఆ 1 పద్య 17.

గీ. ఒనరె శాండిల్య ధారేయ♦యుక్తమగుచు, భవ్యకలితజటావాహ♦సేవ్యమగుచు
శారదామోదవిలసన్ని♦శాంత మగుచు. వనము జీవనజానవా♦వాస మట్లు. 447

ఓఘువతీపరిణయము, ఆ 3 పద్య 150.

సీ. ఘనతరశ్యామా ము♦ఖవికాసములుగానఁ, బల్లవరాగ సం♦పత్ప్రదములు
మధురసామోదస♦మ్మదకరంబులుగాన, మధుపగుణోన్మేష ♦ మండితములు
సకలాధికద్విజా♦స్పదశాఖములుగాన, బహులాగమాఘవి♦భాస్వరములు
ఫలవద్వితానసం♦బంధంబులగుఁగాన, వరసుమనోలోక ♦ వైభవములు
గీ. మఱియు సజ్జాతివిలసన♦మంజులంబు, లతనుసహకారములు మహా♦మృతఘనంబు
లధికరంభావినోదంబు♦లగుచు నలరు, నప్పురోపవనాంతంబు♦లభినుతింప. 448

ఇందుమతీపరిణయము, మ. స్వ. ఆ 1 పద్య 14.

సీ. ఒప్పెడిపుప్పొడి♦తిప్ప పీఠముగాఁగ, నలరుఁదేనియలు పా♦ద్యములుగాఁగ
సుమపరాగములు ధూ♦పములుగాసుమనోవ్ర,జములుపూజాపదా♦ర్థములుగాఁగఁ
గెందలిరులుదీప♦సందోహములుగాఁగ, భ్రమరనాదములు మం♦త్రములుగాఁగ
గలకంఠరవములు♦కలగానములుగాఁగఁ, వీవియల్ సొగసు జం♦దెములుగాఁగఁ

గీ. జిగురుజొంపము కెంబట్టు◆చేలగాఁగ, ఫలము లుపహారములుగాఁగ◆నెలకొలిపి వ
నేందిర యొసంగు నీకు స◆మందభక్తి, గన్నులారంగ మాధవ◆గనుదె యిచట. 448

సుమనోమనోభిరంజనము, ఉల్లాస 2 పద్య 41

మ. సురసాంద్రఘనపుష్పపూరితములై◆సొంపొంది దృష్టాండజో
త్కరసంచారపటుత్వముల్ గలిగి రం◆గద్భృంగసంగీతముల్
పరగన్ సారససౌరభానిలసగా◆ఘంగాగమంబుల్ దగన్ 450
బురి నుద్యానములున్ సరోవరములుం◆బొల్చున్ సమత్వంబునన్.

భద్రాద్రిపరిణయము, ఆ 1 పద్య 116.

శా. కామోత్సాహముఁగూర్చు సౌరభములు◆న్గ్రాంతంబులౌ పత్త్రిముల్
స్వాముల్ మెచ్చఁగ జాలు జాతితిలక◆స్వారస్యముల్ దీరలో
కామోదప్రదపుష్పముల్ శుకమనోజ్ఞాలాపము ల్గల్గి యా
రామారత్నములట్టు లెన్నఁ దగి యా◆రామంబు లొప్పుం బురిన్. 451

భరతాభ్యుదయము, ఆ 1 పద్య 54.

# వనవిహారము—పుష్పాపచయము.

సీ. మావిలేమొకల◆మవ్వంపుఁదీవలఁ, జెన్నొందఁ బెండ్లిండ్లు◆సేసి చేసి
పలుదెఱంగుల క్రొవ్వి◆రుల నేర్పునాటించి, తొడవులు గావించి◆తొడివి తొడివి
పతులను బ్రియులుగా◆భావించి పొదరిండ్ల, నిక్కలుగాఁజేసి◆యేఁగి యేఁగి
చెట్టుపల్ నెఱయని◆చిలుకబోదలఁ బట్టి, తెచ్చి బిడ్డలుగఁ జ◆న్నిచ్చి యిచ్చి
గీ. పొదివి పుష్పాళ్లుసల్లియుఁ◆బువ్వుదేనె, యలఁ బదింపడి తడిపియు◆నలివసంత
మాడి యాడి యుద్యాన వి◆హారలీల, సలిపి రంభోరుహానన◆లెలమి మిగుల. 452

నిర్వచనోత్తరరామాయణము, ఆ 8 పద్య 35.

సీ. మానినీగండూష◆మధువులఁబూఁచిన, పొగడను సొబగొప్పఁ◆బొగడి పొగడి
నారీపదాహతి◆ననిచిన కంకేలి, పరువంబునగ్గించి◆పలికి పలికి
లలనావలోకనం◆బులఁబుష్పితంబగు, తిలకంబుపైఁజూడ్కి◆ద్రిప్పి త్రిప్పి
వనితోపగూహనం◆బునఁ జేర్చు సురపొన్న, మేలిపుణ్యమునకు◆మెచ్చి మెచ్చి

గీ. మన్మథారామములపొంత♦మలసిమలసి, శుకపికాళివిహారంబు♦సూచిచూచి
సతులుఁ దాను జరించు వ♦సంతవేళఁ, బ్రమదవనమున విశ్వభూ♦పాలవరుఁడు.
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 116.

సీ. కిసలయంబులతోడఁ♦గెంగేలుదడపెట్టి, విరులపై నఖకాంతి♦విజ్జరాల్చి
లేఁదీగలకుఁ దనూ♦లీలఁ గానుకయిచ్చి, గుత్తులుఁ బాలిండ్లు♦గొలిచి చూచి
చలిగాలినిశ్వాస♦సౌరభంబులనాఁగి, యళిపంక్తిఁ గురులతో♦నలుకఁదీర్చి
పుష్పాళ్లు నెలగంద♦ములువియ్యమందించి, పూఁదేనెఁజెమటల♦బుజ్జగించి
గీ. తొడలునఁటికంబంబులు♦మొదలుఁబోక, బోదెలు నెలుంగులును బర♦పుష్టరుతులు
మాటలనుగీరభాషలు♦మక్కళించి, చిగురుఁబోఁడులు వనకేళి♦చేయఁజేయ. 454
ఉత్తరహరివంశము, ఆ 5 పద్య 50.

మ. సహకారాధిపుఁగౌఁగిలించుకొని వా♦సంతీలతాకాంతసా
రహరిద్రారసగౌరకేసరములన్♦రంజిల్లుమాధ్వీకవా
గ్లహరీస్వేదముచూపఁబట్టపగలే♦లాయింతటన్ సిగ్గుతే
దహహా యంచుఁ దొలంగి నవ్వెఁ జెలిమా♦ధైముద్దరాలయ్యెడన్. 455
మ. ఒకరామాతిలకంబు రత్నరుచితో♦నొప్పారు మందారకో
రకముం గర్ణవతంసత న్నిలుపుచున్♦రాఁగా లతాసక్తచూ
చుకచేలాంచలయై మెలంగి విడుమం♦మం గేలు సాఁచె న్నసా
యకమూర్ధ్వం దెగగొన్న మన్మథుని ప్ర♦త్యాలీఢపాదంబునాన్. 456
,, ,, ,, ఆ 4 పద్య 52,;53.

సీ. సుదతి మొల్లలుదెచ్చి♦సూడిదెయిచ్చినఁ, బలుతెఱంగులనవ్వఁ♦బాడి యగునె
కొమ్మసంపఁగిమొగ్గ♦కొమ్మురమ్మనిపిల్చి, న్యాయంబె యిదినాకు♦నాసఁజూపఁ
బూఁబోఁడి యిపుడునా♦పూబంతులింక నీ, పాలింటిననుమ డా♦పంగ దగునె
కనులమొక్కటి నేను♦గాన్కగానిచ్చినఁ, గనుసన్నఁ గ్రేణింపఁ♦జనునె సకియ
గీ. యనుచు విభ్రమాల మేలంబు♦లాడుకొనుచు, నంగసౌందర్యసంసూచ♦నాభిరామ
చాటువాచాచమత్క్రియా♦సరణి మీఱ, గిల్లి రప్పుడు సతులు రా♦గిల్లి విరులు.
రామాభ్యుదయము, ఆ 1 పద్య 188.

సీ. అలరులకెత్తుచో ♦ నఱచేతికెంజాయ, లాదవికోయిలల నో♦రూరఁ జేయ
నునుమేను లలసి భ్రమ♦నులమీఁదనొఱఁగుటల్, తీవలుబ్రాఁకిన♦తెఱఁగుఁదెలుపఁ
జెక్కకత్తియలలీలఁ ♦ బిలుచునున్పలుకులు, మదకీరములముద్దు ♦ మాటలార్ప
బాగబాగనలమునా♦న్పలతాప్రతెనఁగి క్రొ, న్ననఁకు వింతవా♦సనలొపంగ

గీ. నిక్కి కొనగొమ్మలందుఁ గో ♦ సీవిజాతి, బయలువడియెఁ బుష్పనాభికా ♦ సుమలసొబగు
లంగలతలకు నరవిరు ♦ లై చెలంగ, సతులు పుష్పాపచయకేళి ♦ సలిపి రర్థి. 458
కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 21.

సీ. కుసుమవాసనలెల్లఁ ♦ గొల్లలాడితిమింకఁ, బఱచుటామనియెంత ♦ పర్వులిడునొ
చివురుజొంపములెల్లఁ ♦ జిదిమివైచితిమింకఁ, బగఱకోయిలయెంత ♦ యెగసిపడునొ
ఫలపరంపరలెల్ల ♦ నులిచివైచితిమింకఁ, గొదమచిల్కలవెంత ♦ వదరుకొనునొ
కమ్మఁదేనియలెల్లఁ ♦ గుమ్మరించితిమింకఁ, గట్టల్కనళులెంత ♦ చుట్టుకొనునొ
గీ. యెఱుఁగరాదింతులారయీ ♦ తెఱవనిచట, మసలఁగానీకతోతెండు ♦ మనముగొనిన
కుసుమకిసలయఫలనవ ♦ పరిసవరసము, లసమశరునకు నర్పింత ♦ మనుచు వెడలి.
వసుచరిత్రము, ఆ 3 పద్య 151.

సీ. అరవీడుకొప్పుల ♦ విరులవాసనకుఁ దో, రపుటూర్పుఁదావులు ♦ ప్రాపు గాఁగ
నడలమందతఁ బెంచు ♦ బడలికలకుఁ బిఱుం, దులవ్రేఁగుచనువ్రేఁగు ♦ తోడుపడఁగఁ
జెమటచిత్తడిఁ గ్రొత్త ♦ చెలువుగాంచినవళుల్, మొలనూళ్ళకాంతికి ♦ బలిమి నొసఁగఁ
బయ్యెద లాడింపఁ ♦ బరిభవించుకంకణ, నాదమందెలమ్రోఁత ♦ ప్రోది సేయ
గీ. మిగులరొదగాఁ గికాకిక ♦ నగుచు రతుల, యాయములుసోఁక నెద్దియే ♦ నాడుకొనుచు
సందడింపుచుఁ బుష్పాప ♦ చయము సలిపి, యంతఁ గడఁగిరి డోలావి ♦ హారములకు.
కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 145.

ఉ. పుష్పాడి చల్లుతీవల క ♦ పూర్వగతిం గరమూలదీధితుల్
కప్పమొసంగుచున్ వలపు ♦ కానుక సేయుచునున్న పూవుబల్
గుప్పకు నూర్పుసంపదలు ♦ గూర్చుచు నేర్పున సంచరించిరా
కప్పురగంధులెందుఁ దగుఁ ♦ గా యితరేతరబంధుకృత్యముల్. 461
సుదక్షిణాపరిణయము, ఆ 3 పద్య 63.

సీ. బొట్టుగు లేఁపూవిఁ ♦ బొదలించె నొక్కర్తు, చూచియుఁ జేనంటి ♦ సొబగుమీఱ
బొన్నఁ బేరింకణమును ♦ బూయించె నొక్కర్తు, చిఱునవ్వునుఁ బాట ♦ దుఱఁగలింపఁ
బొగడను గంకేళిఁ ♦ దగవిరుల్ గలిగించె, నెమ్మిఁ గల్లుమిసి త ♦ న్వియునొకర్తు
కొసరివావిలిఁ గొండ ♦ గోఁగును ననిపించె, మూర్కొని మాటాడి ♦ ముదితయోర్తు
గీ. కోరివిఁ బూవులు నిండించెఁ ♦ గొమ్మయోర్తు, కదిసికూరిమితో డుతఁ ♦ గౌఁగిలించి
చనుపకంబునఁ గొన్నినల్ ♦ దనియనించె, ముదితయొక్కతె తనముద్దు ♦ మోము జూపి.
యయాతిచరిత్రము, ఆ 4.

సీ. అల భారతీదేవి ♦ నగదు నే నని నలు, వలరుపంతలు చూపెఁ ♦ జెలువయొకతె

యల రమాలలన నే♦నని హరిసన్నిధిఁ, జేరి వర్తించె మి♦టారి యొకతె
యల గట్టుపట్టి నే♦నని నవ్వుచును శివా, లింగనం బొనరించె ♦ లేమ యొకతె
యల వహ్నికాంత నే♦నని బర్హిసంగతి, నలరి వినోదించె ♦ నతివ యొకతె
గీ. యల మృగాక్షిని, నేనని♦యతిముదమున, మన్మథాలోకనము చేసె♦మగువయొకతె
యల యరుంధతి నే నని♦ కెలనిమౌని, గదిసి వేడుక రంజిల్లె ♦ ముదితయొకతె.

నలచరిత్రము, సి. ధ. ఆ 3 పద్య 227.

చ. గురుకుచలెల్లఁ జూడ నొక ♦ కోమలి సంపెఁగఁ జూడఁ జూపులన్
నెరపిన నల్లనయ్యెఁ జెలి ♦ నివ్వెఱయై కన హాసచంద్రికం
గరముగఁ దెల్లనయ్యె నది♦గాంచి యిదేమియటంచుఁ బట్టఁ ద
త్కరరుచి నెఱ్ఱనయ్యె నది ♦ గారడియంచుఁ దలంచి రందఱున్. 464

,, ,, ఆ 3 పద్య 240.

సీ. కలవు లే వనఁజాలు ♦ గొఁదీవలు చలింప, వల్లిమతల్లికల్ ♦ వంచి వంచి
సమపీనకుచగుళు♦చ్ఛములు కంపముఁజెందఁ, గొ్రివ్విరిగుత్తులు ♦ గోసి కోసి
లలితాంఘ్రిపల్లవాం♦ఘ్రులుదొట్రుపాటొంపఁ, జిగురుటాకులబారుఁ♦జిదిమిచిదిమి
భుజమూలరుచిహేమ♦రజముబయల్ప్రాఁక, పలుపుఁబుప్పొడుల్లెల్ల♦డులిచిదులిచి
గీ. బాహునాళోత్థబిం♦బశరశిపల, వదనజలజంబులకుమూఁగు ♦ వరమరాళ
శుకపికాలిమాలికి ♦జుణిఁగి జుణిఁగి, సఖులు పుష్పాపచయకేళి♦సలుపునపుడు.

చంద్రాంగదచరిత్రము, ఆ 4 పద్య 199.

గీ. కురులు జడయల్లి మందార♦కుసుమ ముంచి, కప్పురపుబూది మైఁబూసి♦గొప్పమల్లె
విరిసరు ల్దాల్చి తా మహే♦శ్వరుఁడనంచు, దానినదలించెనొకమత్త♦దంతియాన.

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 62.

సీ. పొన్నగున్న♦నీడఁ♦గన్నెమావులజాడ, మురియుచు డాఁగిలి♦మూఁత లాడు
వృక్షపుంజంబుల♦వివిధకుంజంబుల, నలరుఁ దీవియల నుయ్యాలలూఁగుఁ
బుప్పొడులపెరంట్లఁ♦గప్పురంపుటనంట్లు, నొప్పుగా వెన్నెల♦కుప్పలాడుఁ
బొదరింటిపట్టులఁ♦జదరంపునట్టులఁ, బంతుగాగోరింట♦బంతులాడు
గీ. వెదకిపువ్వులఁజిదుముఁదు♦మ్మెదలఁగదుము, ఫలరసంబులఁబిల్చుఁజి♦ల్కలనుబిల్చు
సిరులునలుదిక్కులనుదీడి♦చెలులఁగూడి, బాలినుప్పొంగి చంద్రిమ♦తీలతాంగి. 467

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 3 పద్య 15.

సీ. అలరుతావులఁగూడు♦నలరుతావులఁజూడు, కోరకమ్ములయాస♦కోర కమ్మ
చాలమేలగుపొన్న♦చాలుమోిలగనున్న, మావికొమ్మలపండ్లు♦మావి కొమ్మ

బాలబిల్వముఁ జూడ♦బాలబిల్వపుష్పోద్ధృత, రేఁగుమానుల కేదు♦రేఁగుమాను
పచ్చపూఁతలమించు♦పచ్చపూఁతలనించు, రేఁతికొమ్మల జూడ♦రేఁతికొమ్మ
గీ. లార కదసులపైఁ గోర్కు♦లారఁ గదలి, నారికేళీవనాళిఁ జె♦న్నారి కేళి
కింపుదులకింపుసనితమ♦కింపు మేలయ, నాడి రతివలు మరుఁడు వె♦న్నాడికొనఁగ.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 3.

సీ. చిగురుటాకులఁ గేలఁ♦జిదిమితి మదిగాన, గండుఁగోయిల లెంత♦గనలునొక్కొ
ఫలసమూహములు సం♦దులు వాపితిమి గానఁ, గీరముల్మఱి యెంత♦గినియునొక్కొ
తేనెవాఁకలు గల్లఁ♦ద్రిమ్మరితిమి గాన, భృంగంబులెంత కో♦పించునొక్కొ
యొదలు వొంగఁగ విరుల్♦గడపితిమది గాన, మరుఁడు కక్కసమెంత♦సెరపునొక్కొ
గీ. చూడబలవద్విరోధంబు♦గూడదెందుఁ, బూతవృక్షులఁ గడుభక్తిఁ♦బుష్పశరుని
సపరివారంబుగాఁ బూజ♦సలుప వలయు, వన నొకకొలంకునకు వారు♦చనిరి దనరి.

ఓషువతీపరిణయము, ఆ 3 పద్య 172.

సీ. చరియించు నొకకేళి♦సరసరావమున భావ, మానలీలఁ గొను తేంట్ల♦నరసికొనుచుఁ
గురియించు నొకచోట♦నుగవాటమున వాట, మునదిటుకోనలఁ♦బుష్పవృష్టి
స్మరియించు నొకయోర♦పరసౌరనదితీర, మున మును గాంచిన♦భోగములను
దరియించు నొకవంకఁ♦దమిఁ బొంకమగు వంక, దరివిరిగొమ్మకై♦దండ యొసఁగ
గీ. నొక్కచో నిల్చు నొకయిక్క♦నెక్కి చూచు
నొకట సచివుని కేల్వట్టు♦నొక్క చెంత
నుచితసల్లాపములు సల్పు♦నొక్క దరిని
బూవుఁదేనియలాను నా♦భూపిభుండు.

శంతనూపాఖ్యానము, ఆ 2 పద్య 29.

సీ. సాంద్రమానీలతా♦సౌకర్య మెల్లను
జూచితివే మె యో♦సుందరాంగి
పుష్పసమృద్ధిచేఁ♦బొదలెడియిండ్లపైఁ
గాంక్షించియున్నావె♦కంబుకంఠి
సహకారభూరుహ♦చారుఫలములి
చ్చటను నపేక్షించు♦చంచలాక్షి
శాఖోన్నతవిశాల♦సాలవృక్షశ్రేణి
నిర్మితంబులు నివే♦నీలవేణి
గీ. పులినతలచిత్రవేదికా♦సనసమును, గదళికాపూరకర్పూర♦గంధములును

... ... ... తలఁచితివో లేదో యీ వేళఁ♦దలిరుబోణి.

ఉ. జానకిఁగూడి రామబల♦జాన్వితుఁడుండు సమృద్ధిఁ జెందె యు
ద్యానముఁ జేరి పాదపవి♦తానతలంబుల మల్లికాలతా
సూనవిశేషము ల్గనుచు♦సౌఖ్యముఁ గోరకగుచ్ఛపంక్తిసం
ధానములైన చంపకవి♦తానములం బరితృప్తినొందుచున్. 473

పట్టాభిరామాయణము, ఆ 2.

సీ. ఒకకుందరదన చం♦పకమును వీక్షించి, ముసముసన్నని కోప♦మును వహించె
నొకపద్మనేత్రి వే♦డుకకుందములు గోసి, చటచటపటనాని♦పండ్లు గొఱికె
నొకరాజబింబము♦ఖి కసితాంబుజములఁ, గనుఁగొని విసువక♦ కాలు ద్రొక్కె
నొకమత్తగజయాన♦యుత్ఫుల్లనుమాళి, పొలిని దిలకించి♦ బార సాఁచెఁ
గీ. సరసభాషిణి యొకర్తె♦ చక్కనైన, తమలపాకుల తీగ నె♦త్తంబుఁ జూచి
విడనిరోషంబుచే నొళ్లు♦విఱుచుచు సాగె, సహజవైరంబుఁ బూని య♦చ్చటఁ గరంబు.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 3.

సీ. పడఁతి పొన్నవిరిఁ గోసి♦ముడిఁ బెట్టె నొకర్తె, పక్కిలితో సరి♦పోల్చుకరణి
వెసఁ గోసి సంపంగి♦విరిని మూర్కొనె నొకర్తు, ముక్కుతోడను సరి♦పోల్చుకరణి
చిగురుజొంపము ద్రుంచి♦ చేతఁ దాల్చె నొకర్తు, పాణిఁ గేలితో సరి♦పోల్చుకరణి
మొగలిరేకులు గోట♦ముట్టి గిల్లె నొకర్తు, మిగిగోళ్లతో సరి♦పోల్చుకరణి
గీ. దొండపండును గొఱికె వా♦ల్చూపులొకర్తు, పొసఁగఁ గెమ్మోవితో సరి♦పోల్చుకరణి
తీవ మెయి నంటఁ జేయెత్తి♦తిగిచె నొకతె, పూవి నెమ్మేనితో సరి♦పోల్చుకరణి. 475

రసికజనమనోరంజనము, ఆ 3 పద్య 26.

---

## మలయమారుతము.



సీ. ఘనసారకస్తూరి♦కాగంధము ననన్య, గంధబంధంబులు ♦ గలపి కలపి
కుసుమితవల్లికా♦లసితవీథులఁ జొచ్చి, గని సరోగృహముల ♦ మునిఁగి మునిఁగి
సమధికాహార్యంగ ♦ సంగీతములతోన, కన్నెతీగల కాట ♦ కలపి కలపి
కుముదకుట్మలకుటీ♦కోరకంబులు దూఱి, యలిదంపతుల నిద్రఁ ♦ దెలిపి తెలిపి
ఆ. [illegible] రాంతిక[illegible] గట్టి, చాలుపోలె విప్ర♦వరుఁడు పోలె

నట్టువోలెఁ దాను♦నచ్చినచెలివోలె, మలయుచుండు మంద♦మారుతంబు. 476

విజయసేనము.

ఉ. గంధపుఁగొండనెత్తముల ♦ కందువ నేలకితీవయిండ్లలోఁ
గొందలిరాకుఁబాన్పుల సు♦ఖించి నితాంతరతిశ్రమంబులన్
జెందినచెంచుగుబ్బెతల ♦ చెక్కులఁ జిమ్ము జవాదివాసనల్
విందులుసేయుచు న్మెలఁగె ♦ వేమఱుఁ గోమల గంధవాహముల్. 477

శ్రీరంగమాహాత్మ్యము, భైర. క. ఆ 2 పద్య 258.

చ. సురనదిఁదోఁగినీరజర♦జోభసితంబు ధరించి రాలుక్రొ
వ్విరుల శివార్చనల్ సలిపి♦వెంబడివచ్చు మధువ్రతాళి ఝుం
కరణము చేతఁబాడి లతి♦కాభుజముల్ కదలంగనాడెడున్
బరిసరభృష్టిశోపవన♦బంధురమంథరగంధవాహముల్. 478

ప్రబోధచంద్రోదయము, ఆ 4 పద్య 43.

సీ. విరహచింతాగ్ని యి♦వ్విధిఁగెరల్పుదునన్న, పగిదిఁ బద్మపరాగ♦పొగయఁ గొట్టి
కామునిపడవాలు ♦ గానఁ బౌజులుసేయు, గతిమధుపంబులఁ ♦ గదలఁ దోలి
తీవెలేమలచేత ♦ నీవిధిఁగలయంపి, చల్లించుక్రియఁ దేనె ♦ సడలనుడిసి
తనపగసాధింపఁ ♦ గని మెచ్చి బుజ్జగిం, చినరీతి శిఖులపిం♦చెములు నిమిరి
గీ. తెఱవునడచినదాహంబు ♦ దీర గిరిఝ, రాంబువులుగ్రోలుకరణిర♦తాంతతాంత
పనితలకుచాగ్రముల ఘర్మ♦వారిపూర, మడఁగవిహరింపఁదొడఁగెమం♦దానిలంబు.

వరాహపురాణము, నంది. మ. ఆ 3 పద్య 75.

సీ. మదగంధతారత♦మ్యము యామ్యకరికిఁ ద, త్కరులకుం గనబలెఁ♦గటములొఱసి
సురతశ్రమజమాటఁ ♦ జూపోపకయొబలెఁ, గామినీమృదుగండ ♦ ఘర్మ ముడిపి
పరిమళనాహేచ్ఛఁ ♦ బ్రాణమీబలెఁజించు, మృగనాభిచర్మభ♦స్త్రికలుమాటి
యహితపన్నగభేదు♦లనిబలె గృహవిటం, కపుఁగలాఁపులనొయ్య♦ గఱులఁ నిమిరి
గీ. వీటిసామగ్రిఁగనుఁగొన ♦ వేగ పడక, నడవఁ దనదిక్కు పుష్పదం♦తద్విపంబు
నెక్కినో యనజడగతి ♦ నెపుడుఁబోలయు, నందుఁజందనశిఖరిమం♦దానిలుండు.

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 29.

సీ. ప్రణయవాదములు దం♦పతులందు నుదయించి, రంజిల్లుమానాంకు♦రములు మేసి
సురతాంతవిశ్రాంత ♦ సుందరీజనముల, వక్షోజతటఘర్మ ♦ వారిఁ గ్రోలి
వనములు మధుగర్భ♦వతులుగాఁ బూమొగ్గ, మొదవులకౌమార♦ములు హరించి
విషయానుభవకథా♦విముఖవిరక్తుల, పటుతరస్థైర్యవ♦ప్రములుగూల్చి

గీ. గంధలోభానుబంధిపు♦ష్పంధయముల, ఝుంకృతులచే ఘణిల్లన ♦ అంకె లిడుచు
విషమశరుపేర జన్నియ♦విడిచి రనఁగఁ, గ్రొవ్విచరియించునవ్వీటఁ♦గోడెగాడ్పు.

కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 25.

ఉ. చెన్నగునన్నదీపులిన ♦ సీమల దాఁగిలి మూఁతలాడుచున్
వెన్నెలరేలు కప్పురపు ♦ విప్పుటనంటులసీడనీఁగు రా
కన్నెలరోయునన్నులకుఁ ♦ గన్నులుమూయుఁ దదీయవాసనల్
మన్ననఁగాంచి కపళ్రపు చు♦మారము రేఁచు సమీర డింభముల్. 482

వసుచరిత్రము, ఆ 1 పద్య 112.

చ. తెలతెలవాఱనొయ్యనరు♦దెంచినిశాంతరతాంతతాంతలా
చెలువలకింపుగా మెలఁగి♦చెక్కులఁ గూరిన చూర్ణకుంతలా
వళి సరళంబుగాజడిసి♦వాడినసెజ్జలమీఁదిపాపివిరుల్
దొలఁగఁ బ్రిఘాతవాయువులు♦దోఁచుఁబురిం బరిచారికాకృతిన్. 483

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 119.

ఉ. బింకపుగబ్బిగుబ్బెతల♦బిత్తరిచూపులు మేనితావులున్
గొంకకగాంచి లీల మెలఁ♦గున్ మలయానిలుఁ డన్వనిన్ నిరా
తంకమరందసారణుల♦దాఁటుచుఁ దన్నెద మీఱిచన్నయా
జింకపడావుమావిచటఁ♦జిక్కుడుగాయని చూచు కైవడిన్. 484

లక్ష్మీవిలాసము, ఆ 3 పద్య 57.

ఉ. సోరణగండ్లకన్నముల♦చొప్పుల నొయ్యనఁదూఱి తావిచొ
క్కారసి చల్లి తత్పురిని♦యామినులన్ సురతాంతతాంతకాం
తారుచిరాంగఘర్మకణ♦నవ్యవిచిత్రమణుల్ హరించుచుం
జోరులకైవడి న్మెలఁగుఁ♦జోద్యముగా మలయానిలౌఘముల్. 485

ఇట్చుకవివర్తిచరిత్రము, ఆ 1 పద్య 31.

సీ. గంధసారమహీజ♦ బంధురోరగరాజ, ఘుక్తముక్తంబులై♦పొదలి పొదలి
భూసారజలపూర♦కాసారకుముదార, విందబృందంబులై♦విడిచి విడిచి
కోమలమాకంద♦కుసుమగుచ్ఛమరంద, కణగణంబులసొంపు♦గమిచి కమిచి
భామినీసురతాంత♦భవఘర్మజలతాంత, గండమండలముల♦గదిసి కదిసి

గీ. చిన్నివెన్నెలలేఁగొనల్ ♦చిదిమిచిదిమి, పరువుమరువంపుతావుల♦బలసి బలసి
ఘునులతనువునకింపుగా♦మొనసి మొనసి, మందమందానిలమువీచె♦ మలసి మలసి.

పరాహపురాణము, హరిభట్టు.

మ. వలపుంగొజ్జఁగినీటి శీతలహతి♦వార్బిందువుల్ చిమ్ముచుం
గలయం గప్పురపుం దుమారము మెయిన్ ♦ గాటంబుగా గప్పుచుం
బలవద్దర్పక బాణపంక్తులకు బ్రియన్ ♦ మైపై విరుల్గుప్పుచుం
జెలఁగెన్ మందసమీరణుండు దితిజ ♦ శ్రీప్రాగ్రభాగంబునన్. 487

సింహశైలమాహాత్మ్యము, ఆ 2.

సీ. లలితచందనలేప ♦ కలితసుందరవక్షఁ, సోపానములజంగఁ♦జూఁపి యెక్క
ఘనతారహారసు♦స్తనభారగిరినితం, బములపై జీరుకు ♦ బంట లాడు
ఘనసమానవీటికా ♦ రసమానితాధరా, మృతదీర్ఘికలను జే♦యీఁత లీఁదు
హేలారచితపుష్ప ♦ మాలానిచితకేశ, భృంగమల్లములతోఁ ♦ బెనఁగు లాడు
గీ. సురతనాట్యకళాంశుకీ♦కరణకామ, కమలజాతావసరతీవ్ర ♦ గాఢకేళి
భవపరిశ్రమలాలస ♦ పౌరయువతి, జాలతనుసీమల సమీర ♦ బాలకుండు. 488

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. సవిధోపవనమంజు♦లవిశాలసాలంబు, లుత్కటలీలతో ♦ నొరసి యొరసి
సంఫుల్లకమలకా♦సారనీరంబుల, లాలితక్రీడలన్ ♦ దేలి తేలి
వల్లీమతల్లికా ♦ స్వచ్ఛగుచ్ఛములలో, నొయ్యన రజముల ♦ నూఁచి యూఁచి
విపణివిన్యస్తార ♦ విందకుందాదికా, మ్లానమాల్యంబులు ♦ మట్టి మట్టి
గీ. పరిణయకలహాపరాజ్యశ్రీ♦పరిమదహృదయ, కూలములు పెల్లగిల్లంగఁ♦ గ్రుమ్మిక్రుమ్మి
మలయు నప్పురవీథుల ♦ మందమంద, గతుల మలయాచలానిల ♦ గంధగజము.

ద్రౌపదీపరిణయము.

చ. పురనికటాంచితోపవన ♦ పుష్పితసాలములం గదల్చుచున్
సరసులఁ దేలుచున్ సుమర♦జఃపటలంబులఁ జల్లలాడుచున్
సురుచిరకుంజపుంజములఁ ♦ జొచ్చి నటించుచు మందగామియై
కరులవలెం జరించుఁ జలి♦గాడ్పులు షట్పదశృంఖలల్ పగన్. 490

కవిజనరంజనము, ఆ 1 పద్య 16.

సీ. తొలుతదక్షిణదిగ్వ♦ధూటికిజనియించి, రహిలతాసతుల గా♦రాము వడసి
కుసుమరససంపుటు♦గ్గులుద్రాగి వర్ధిల్లి, తలిరాకుపాన్పుల ♦ నెలమి నుండి
తేఁటిబోటులజోల♦పాటలచేఁ జొక్కి, లీలఁ బూఁదీవయు♦య్యాల లూఁగి
మురిపెంపునడకల ♦ ముద్దులు చూపించి, యెల్లతావుల విల♦సిల్లి మెలఁగి
గీ. సరణిఁ బసనుఁ గౌఁగిలించుభూజ♦ములఁ బొదలి, కొలఁకులనుఁ గోఁగి క్రొవ్వారి♦కొనలఁ

మల్లులఁజెనంగి విరహులమడమడంచి, మరునిజోడయి పవనకుమారుఁ డెసఁగె.
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 2 పద్య 110.

గీ. చిలుకతేజీలపౌఁజులఁ జిగురుతిండి, పులుఁగుటేనుంగులను తేఁటి బోటుబంట్ల
బలము గాఁజేసిమరునకునలువయిడిన, తేరులనఁబొల్చుమలయాద్రిమారుతములు.
రామవిలాసము, ఆ 1.

ద్విపద. కలయంపిచల్లిన గందంపునీటి, చలువసెత్తావు లెచ్చట హెచ్చియుండి
మలయజామోదంబు మచ్చికఁ దాల్చి, అలరుసెత్తావుల నంగీకరించి
చల్లఁగాఁ గొలఁకులఁ జాడలువట్టి, మెల్లమెల్లనవచ్చి మీనలోచనల
యుల్లంబు జల్లన నోరయుచుఁబైఁట, లల్లనఁదొలఁగించి యలకలల్లార్చి
యెల్లతావులముట్టి యింపుఁ బుట్టించి, పల్లవులీలనా పట్టనంబంపు
సల్లలితోత్సాహ సంపద మెరసి, మల్లడిఁగొనుచుండు మలయమారుతము.
పల్లభులింగలీల, పిడు. ఐ. ఆ 1 గతి 3.

చ. అలసగతుల్ సుశైకరతు లంగఘనోద్ధరణపరిచాగముల్
మలయజసౌరభంబులు సుమదపగంధము దక్షిణాగతుల్
దొడ రెడు పద్మినీపరిచితుల్యతధరిమణంబు లొప్పఁగా
మలయసమీరణుండు పిటుమాడ్కిఁ బురి న్విహరించు నిచ్చలున్. 494
భరతాభ్యుదయము, ఆ 1 పద్య 55.

---

# రాజవర్ణనము.

సీ. తేజంబుగలఁడు సాధించుశత్రులనాజ్ఞ, వెండినిండకుఁ జాల వేఁచుఁ గాని
యరి నొవ్వఁగొనఁడు తప్పరయు ధర్మరతుండు, భృత్యులంజెఱపఁడుసత్యవాది
కలకయుబ్బుటభీతి కలుష మేమఱుట మొ, క్కలము వెఱఁగుపాటుచలము లేదు
కామినీలోలుండు గాఁడు సేవకుచేఁత, మఱవఁడిచ్చినయీఁగిమగుడఁగొనఁడు

ఆ. క్రౌర్యలోభజాడ్య కపటవ్యసనముల, పొంతఁ బోవఁ డాయమునువ్యయంబు
తెలుఁగు నాఁడునాఁటి కింద్రియవశ్యుండు, గాక సుజనవినుతికలితుఁడయ్యె.
కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 200.

సీ. తపనీయదండైక ♦ ధవళాతపత్త్రితో, ద్దండతేజఃకీర్తి ♦ మండలుండు
నిర్మలనిజకథా ♦ నిమిషకల్లోలినీ, క్షాళితాఖిలజగ♦త్కల్మషుండు
వితతనవద్వయా ♦ ద్వీపనానాజయ, శ్రీవధూటీసమా♦శ్లిష్టభుజుఁడు
నిఖిలవిద్యానటీ ♦ నృత్యరంగస్థలా, యతనాయమానజి♦హ్వాంచలుండు
గీ. పరిస్తుతింపఁగఁదగు సము♦ద్భటకఠోర, చటులగుణటంకృతియానున♦స్తనితఘోష
చాప నీరదభవశరా♦సారశమిత, బలవదహితతేజోదవా♦నలుఁడు నలుఁడు. 496

శృంగారనైషధము, ఆ 1 పద్య 46.

సీ. శివునికైవడిమహా ♦ సేనానియాత్ముండు, బలభేదిపగిది న♦పప్యపాయుఁ
డరవిందహితులీల ♦ నధిగతాభ్యుదయుండు, బుధునిక్రియనజహా♦త్పుష్కరుండు
గంగాప్రవాహంబు♦కరణిఁ బావనమూర్తి, భుజగాధిపునిభంగి ♦ భోగశాలి
యేనుంగుచందాన ♦ దానధారాశోభి, శౌరిలాగున శంఖ ♦ చక్రపాణి
గీ. కర్తయాశ్చర్యములకు నా♦కరము నీతి, కఖిలవిద్యాగమములకు ♦ నాస్పదంబు
బగఱకుత్పాతహేతువు ♦బంధుకోటి, కమరలోకద్రుమంబు హే♦మాంగదుండు.
గీ. ఆనృపాలుండు నీతివి♦ద్యానిరూఢిఁ, జారదృష్టియెఁగాని వి♦చారదృష్టి
సమధికైశ్వర్యవైభవో♦జ్జ్వలతనాతఁ, డష్టమూర్తియెఁగాని య♦నష్టమూర్తి. 498

శివరాత్రిమాహాత్మ్యము, ఆ 2 పద్య 13, 14.

సీ. తలపోయ బ్రహ్మవి♦ద్యానిష్ఠజనముల, కనయంబుఁ గింకరుం ♦ డైనవాఁడు
నఖిలశరీరగుఁ ♦ డాప్తసుహృజ్జన, తానందకరుఁడన ♦ నలరువాఁడు
సంసారఘనకర్మ ♦ సంగహీనులయందు, సంగసంప్రీతుఁడై ♦ జరగువాఁడు
దుర్మార్గ మనుజసం♦ద్రోహంబునకు నుగ్ర, దండధరుండనఁ ♦ దనరువాఁడు
గీ. ప్రకృతిపురుషకావేశుఁడై♦పరగువాఁడు, భగవదవతారయుక్తుఁడై♦ నెగడువాఁడు
నగుచు వర్తించునమ్మోద ♦ మతిశయిల్లఁ, జారుతరమూర్తి యీరాజ♦ చక్రవర్తి.

భాగవతము, స్కం 4 పద్య 458.

సీ. విశ్వసన్నుతశౌర్య♦తైశ్వర్యపర్యాయ, కుటిలకుండలిరాజ ♦ కుండలుండు
దిగిభశుండాకాండ ♦ దీర్ఘబాహాదండ, మానితాఖిలమహీ ♦ మండలుండు
జనసన్నుతానన్య ♦ సామ్రాజ్యవైభవ, శ్లాఘాకలితపాక ♦ శాసనుండు
కులశిలోచ్ఛ్రయసాను♦కోణస్థలన్యస్త, శస్త్రవిక్రమజయ ♦ శాసనుండు
గీ. భాసమానమనీషాంబు♦జాసనుండు, సకలదేశావనీపాల ♦ మకుటనూత్న
రత్నరంజ్యదంఘ్రినీ♦రజయుగుండు, శంబరారాతినిభుఁడు దు♦ష్యంతవిభుఁడు.

శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 1.

సీ. చర్చింప రెండవ♦చంద్రుండు మూఁడవ, యశ్విని నాలవ ♦ యగ్నిదేవుఁ
డైదవలోకపా♦లాఖ్యుఁ డాఱవపాండు, సంతాన మేడవ ♦ చక్రవర్తి
యెనిమిదవమహర్షి ♦ జనసత్తముఁడు తొమ్మి, దవ భోగిపతి పది♦యవవిరించి
పదునొకండవ చక్రి♦పాణి పండ్రెండవ, శూలి పదుమూఁడవ ♦సూర్యుఁ డనఁగఁ
ఆ. దనరఁ గాంతిరూప♦మునఁ బ్రతాపమున స, త్యమున ధర్మచరిత ♦ నాజ్ఞ శుచిని
భో[illegible]♦బుద్ధతఁగలిమిని, భూతిఁ దేజమునను ♦ భోజవిభుఁడు. 501

భోజరాజీయము, ఆ 7 పద్య 244.

సీ. [illegible] ♦ [illegible], సాదుణ్యచాతురీ ♦ చక్రవర్తి
[illegible] ♦ [illegible]
[illegible]
[illegible]డు
గీ. [illegible] ♦ మంత్రిభృత్య
[illegible]మ♦[illegible]డు.
సీ. [illegible]♦[illegible]
[illegible] ♦ [illegible]
[illegible] ♦ [illegible] మెలఁగు
[illegible] మొందు
గీ. [illegible]♦[illegible]
[illegible] ముక్తాముక్తా[illegible]♦[illegible]. 503

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 30, 32.

మ. సుకృతుల్ [illegible] మంత్రిపాలకజయా♦శోకుల్ జయంతార్థసా
ధక. సిద్ధార్థ[illegible]సచివా♦ధ్యక్షుల్ నిజాంగంబుఁ బో
యక [illegible]మూర్తియుతుఁడౌ ♦ నాశంభుఁడో నాఁగ న
[illegible]డు మించుఁ బంక్తిరథుఁడై♦శ్వర్యం బవార్యంబుగన్. 504

రామాభ్యుదయము, ఆ 1 పద్య 155.

సీ. [illegible]విమధిజ్య ♦ వరధన్వమునఁగాని, తనసెమ్మనమ్మునఁ ♦ దగుల నీక
సితతస్వభావంబు ♦ నిజఖడ్గమునఁగాని, తనవర్తనంబునఁ ♦ దగుల నీక
విశదభావముకీర్తి ♦ విలసనంబునఁగాని, తనమంతనంబునఁ ♦ దగుల నీక
దీర్ఘభావము శత్రు♦దీనత్వమునఁగాని, తనదుకోపంబునఁ ♦ దగుల నీక
గీ. యంబుధులు కేళికుల్యలు, కు♦లాచలములు, మేడ, లలచక్రగిరి చుట్టు♦గోడ గాఁగ

నవనిఁ బాలించె శుద్ధాంత ♦ భవనమట్లు, కీర్తిలక్ష్మీకళత్రుఁ డా♦క్షితివరుండు. 505

కవికర్ణరసాయనము, ఆ 2 పద్య 57.

సీ. తనకీర్తిసంతాన♦మునకుఁ దారానాథ, నక్షత్రముల్ ప్రసూ♦నములు గాఁగ
తనప్రతాపధనంజ♦యునకు నీరజబంధు, కరములు విస్ఫులిం♦గములు గాఁగ
తనవినిర్మలబోధ ♦ ఘనసుధాసరసికి, సజ్జనుల్ రాజహం♦సములు గాఁగ
తనబాహుజయరమా ♦ వనితకు బ్రహ్మాండ, భాండముల్ కాంచనా♦బ్జములు గాఁగ
గీ. వెలయు వలయాద్రిమధ్యమో♦ర్వీబుధాళి, దానవేళానితాంతహ♦స్తతలవిగళ
దంబు ముదితాబ్ధినిస్వన ♦ వ్యాజమహిత, వితతనుతిపాళి యల రఘు♦క్షితిపమౌళి.

ఇందుమతీపరిణయము, కుమారధూ. ఆ 1 పద్య 159.

ఉ. సారవిభూతి రెండవ వృ♦షధ్వజుఁ డాకృతిచేఁ దృతీయబృం
దారకవైద్యుఁ డిష్టశుచి♦తాగుణమందుఁ జతుర్థపావకుం
డారయ భూమిమోచుటకు ♦ నైదవదిక్పతి దానరేఖచే
నాఱవకల్పవృక్షమన ♦ నన్నరపాలుఁడు మించెఁ గీర్తులన్. 507

తపతీసంవరణోపాఖ్యానము, ఆ 1 పద్య 70.

సీ. గాంభీర్యభవకీర్తి ♦ కలశపాథోరాశి, వాచాలతాకీర్తి ♦ వాగ్వధూటి
భూమీభరణకీర్తి ♦ భోగిలోకస్వామి, సాహసార్జితకీర్తి ♦ శంకరుండు
సంగీతజనికీర్తి ♦ జలజాతభవసూతి, దాతృత్వకీర్తి ♦ సంతానశాఖి
ధైర్యధారాకీర్తి ♦ తారాచలేంద్రంబు, వదనప్రభాకీర్తి ♦ వనజవైరి
గీ. గాఁగ విహరించు నిఖిలభూ♦కాంతమౌళి, పటహభాంకారకారణ ♦ ప్రళయకాల
భైరవారావశంకాని ♦ బద్ధబుద్ధి, విద్విషద్వీరుఁ డెల్లప్పృ♦థ్వీవరుండు. 508

కకుత్స్థవిజయము, పీఠికపద్య 94.

సీ. తనభవ్యధామంబు ♦ తనభవ్యధామంబు, కరణిమిత్రోన్మేష ♦ కరము గాఁగఁ
దనధర్మగుణములు ♦ దనధర్మగుణముల, ట్లతులితశ్రుతిమార్గ ♦ గతుల నెనఁగఁ
దనమహాహవదీక్ష ♦ దనమహాహవదీక్ష, పగిది నానావనీ ♦ పకులఁ బెంపఁ
దనయంబకంబులు ♦ దనయంబుకములట్ల, పరభీరువిముఖతఁ ♦ బరిఢవిల్లఁ
గీ. బరఁగుఁ గరినాద్రిజడలుఠ♦జ్జగరకమఠ, కూపకిటి గూఢచరణది♦క్కోటికరటి
కుటిలతానహభూసౌఖ్య ♦ ఘటనభూరి, భుజబలవిహారి యార్వీటి ♦ బుక్కశౌరి.
సీ. ఏరాజు భూరితే♦జోరుణాలోకంబు, లోకంబుతమము ని♦రాకరించు
నేధన్యుబాహాధ♦రాధరాభోగంబు, భోగింబుసవరించు ♦ భూమిసతికి
నేపుణ్యునభిరూప ♦ రూపానుభావ[illegible], [illegible] గరిఁగించు ♦ భామినులకు

నేఁ భవ్యశుభకీర్తి ♦ శోభావిహారంబు, హారంబు దశదిశా ♦ యాతతమున
గీ. కతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ ♦ డరికృతాంతుఁ, డనుపమస్వాంతుఁ డాశ్రిత♦
వనవసంతు
డనఘుతరకందనోలి ♦ మహాపురీని, శాంతుఁడగు రామమేదినీ ♦ కాంతుఁ డలరు.
వసుచరిత్రము, ఆ 1 పద్య 28, 30.

సీ. వైరిప్రతాపంబు ♦ వడిఁగట్టినట్టిచం, దాన నెవ్వానిశో♦ణధ్వజంబు
కమలసాయకుసోయ♦గము మూర్తిగైకొన్న, కరణి నెవ్వాని యా♦కారమహిమ
భుజభుజంగమనాథ ♦ భోగనారాయణ, చ్ఛాయ నెవ్వానికా♦క్షేయకంబు
అకలంకనళినగే♦హకు ద్వితీయగృహంబు, కైవడి నెవ్వాని ♦ కన్నుఁదోయి
గీ. బరఁగు నాతండు నిఖిలభూ♦పాలజాల, నిరుపమాద్భుతరసహేతు ♦ నిజనిటాల
వర్ణితానూనసౌభాగ్య ♦ వర్ణశాలి, రమ్యగుణపాళి ఖండోజి ♦ రాజమౌళి. 511
ఘటికాచలమాహాత్మ్యము, పీఠిక పద్య 10.

సీ. ప్రౌఢిసదాదేశ ♦ పదవిభక్తులెఱింగి, సంధివిగ్రహముల ♦ సరణిఁ దెలిసి
వివిధాగమాంగముల్ ♦ వేడ్కఁ బరీక్షించి, పరరూపవినిపాత ♦ భంగు లరసి
యనురక్తిగుణవృద్ధు ♦ లలరంగఁ బోషించి, ప్రకృతిప్రత్యయలీల ♦ బయలుపఱచి
ఘనసూత్రవృత్తులు ♦ గణకసంజ్ఞలు నేర్చి, యవ్యయభవ్యవా♦క్యములు పలికి [మ
గీ. ప్రకృతభావంబు పూర్వరూ♦పమును గాంచి, యుర్వి యేలుచునుండు న♦భ్యుదయమహి
మానవేంద్రులలోన న♦హీనరాజ, శబ్దవిస్ఫూర్తి నాహరి♦శ్చంద్రనృపతి. 512
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 38.

సీ. ఏకముఖంబుగా ♦ నిలనాజ్ఞ నిలుపుచుఁ, బ్రజలందు నుభయక♦ర్మముల నరసి
శక్తిత్రయంబునఁ ♦ జాలఁ బ్రసిద్ధుఁడై, చతురుపాయంబులఁ ♦ జతురుఁ డగుచుఁ
బంచాగయుతనయ ♦ ప్రాగల్భ్యము నమించి, షడ్గుణక్రమవిశే♦షములఁ దెలిసి
సప్తాంగరక్షావి♦చక్షణత్వముగల్గి, యష్టభోగసమృద్ధి ♦ నతిశయిల్లి
గీ. నవవిధంబైన హరిభక్తి ♦ నలవుమెఱసి, దశదిశలఁ గీర్తి విస్ఫూర్తి ♦ దళముకొలిపి
యవనిచక్రంబుఁ బాలించు ♦ నట్టి నృపతి, కలిమి జనులకు నధికభా♦గ్యంబుగాదె.
పరమయోగివిలాసము, ఆ 3 పద్య 34.

సీ. కురియించు నొకవేళ ♦ శరదమే యనవృష్టి, ధరణి కనావృష్టిఁ ♦ బరిహరింపఁ
గాయు నెండలు భాను♦కరణి విర్వారివేళ, నీడు చేఁ బ్రజ నొప్పి ♦ నెనయనీక
విసరుఁ జల్లని గాడ్పు ♦ లసమానపవమాన, శాబమై మందువే♦సవులయందు
పండించు సస్యసం♦పదలోషధీశుఁడై, తృణలతానందదా ♦ మృతము నించి

గీ. చేరనీయఁడు రుజలందుఁ ♦ జెనకనీఁడు, మృత్యువును భూమిజనులధా ♦ ర్మికుఁడతండు
యోగిబలమునదివిజుల ♦ యాగడములు, సాఁగనీయఁడొక్కొక్క ♦ సమయములను.
శ్రీరంగమాహాత్మ్యము, క. ప. ఆ 7.

చ. ద్రుపదుఁడురాజు తత్పురికిఁ ♦ దుండిలధృత్యధరీకృతామర
ద్రుపదుఁడు సముద్రదుర్మద వి ♦ రోధిశిరోధిమణీఘృణిస్ఫుర
ద్విపదుఁడు చక్రివాళపరి ♦ వేష్టితభూభవనార్థిసైంధవ 515
ద్విపదుఁడు శాశ్వతాత్మకళ ♦ భిద్విపదుండు నృపాలమాత్రుఁడే.
పాంచాలీపరిణయము, ఆ 1.

గీ. అబ్జదానత, శుద్ధప ♦ క్షాప్తి, విమల, మానసస్థితి, నడవడి ♦ మహితకీర్తి
పరిచయంబున నాత్మభూ ♦ భరణశక్తి, రాజహంసప్రభావంబు ♦ రమణఁగాంచు. 516
రాజవాహనవిజయము, ఆ 1 పద్య 66.

సీ. కువలయంబునకార్తిఁ ♦ గూర్పఁడయినుఁడు చ, క్రావళినొంచక ♦ యలరురాజు
గోత్రవైరముఁ గూర్చు ♦ కొనని యింద్రుఁడు పుణ్య, జనులఁగాఱింపని ♦ చక్రవర్తి
పక్షపాతములేక ♦ పఱఁగుచుండువిరాట్టు, పాడిదప్పని ప్రజా ♦ పరివృఢుండు
కుజనులపొందు చే ♦ కొననిధరాధిపుఁ, డుగ్రుఁడై ప్రజద్రుంప ♦ కుండునీశుఁ
గీ. డౌరయితఁడనిబుధజను ♦ లభినుతింప, వఱలెఁ దేజఃకళానైభ ♦ వప్రభావ
జవవచస్స్ఫూర్తి ధృతిమహై ♦ శ్వర్యములను, విపులగుణపాళి యమ్మహా ♦ నృపతిమౌళి.
రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 56.

సీ. కుగాయావనకళా ♦ కుశలుఁ డింతియకాని, వివరింపఁ జక్రవి ♦ ద్వేషిగాఁడు
సతతసన్మార్గసం ♦ చారి యింతియకాని, రూపింపదోషాక ♦ రుండుగాఁడు
బుధజనప్రియకరా ♦ భ్యుదయుఁ డింతియకాని, శోధింప గురువిప ♦ క్షుండుగాఁడు
వర్ణితపరిశుద్ధ ♦ వర్ణుఁడింతియకాని, గణుతింపమలినల ♦ క్షణుఁడుగాఁడు
గీ. ఖళిరయీతఁడురాజు గా ♦ కిలనొకండు, రాజగుటకెట్లుదగునని ♦ రహినిసుకవి
రాజులును రాజులును బుధ ♦ రాజులెన్న, రాజిలెడుశీవినాథర్మ ♦ రాజుదనరు. 518
సుభద్రాపరిణయము, ఆ 1 పద్య 46.

సీ. కర్ణునిత్యాగంబు ♦ గవ్వడిశౌర్యంబు, భీమునిబలిమి శ్రీ ♦ రాముకరుణ
చంద్రునిప్రభ హరి ♦ శ్చంద్రునిసత్యంబు, మేరువుధైర్యంబు ♦ శౌరిలీల
హరునిసర్వజ్ఞత ♦ మరునిసౌందర్యంబు, వనధిగాంభీర్యంబు ♦ వజ్రిసిరి
భరతునిన్యాయంబు ♦ బలిమహోదారత, తరణితేజము ఫణి ♦ వరునిమేధ
గీ. తనకె కలుగంగ సకలవి ♦ ద్వద్వితాన, సంతతోద్గేయమానని ♦ స్తంద్రకీర్తి

యగుచు నగణితలీలల♦నలరె వంశ, పావనుండైన మాధవ♦దేవనృపుఁడు. 519

సోమదేవరాజీయము.

సీ. సకలభూతహితప్ర♦చారుఁడయ్యు నికృత్త, మత్తారిరాజన్య♦మండలుండు
జనముఖస్తుతులీయ♦కొనని వాఁడయ్యును, పారనిజాంకప్ర♦బంధనేత
యవిదితభావచే♦ష్టాన్వితుండయ్యును, విదితపరాకూత♦విక్రియుండు
తతగుణస్థితినను♦ద్ధతుఁడయ్యుఁ ద్రిజగదు, ద్ధతవిహారమహాప్ర♦తాపసూర్యుఁ
ఆ. డఖిలభువనభవన♦హారికీర్తిస్వర్ధు, నీతరంగఫేన♦భూతతారుఁ
డతఁడు రాజమాత్రుఁ♦డగునె ధీరోదాత్త, నాయకుండు బలిమి♦నాయకుండు.

మిత్రవిందాపరిణయము, కుం. వెం. ఆ 1 పద్య 32.

సీ. తనకీర్తిచంద్రికా♦తతినిండి కృష్ణప, క్షంబులు శుక్లప♦క్షములు సేయఁ
దనదు రాజత్వమిం♦పున సార్వకాలంబు, నందును గువలయా♦నంద మొసఁగఁ
దనకరంబులు జడ♦త్వమునను భువనప్ర, జానురాగంబులు♦నై వెలుంగఁ
దనవర్తనంబు మి♦త్రసమాగమంబున, సంపూర్ణకళలచేఁ♦బెంపు వడయఁ
గీ. దనవిలాసంబఖండసౌం♦దర్యమహిమ, నిష్కళంకస్వభావమై♦నివ్వటిలఁగ
జంద్రునకుఁ జంద్రుఁడనఁదగు♦సద్గుణముల, చేతననిరుద్ధుఁడు జగత్ప్ర♦సిద్ధుఁడయ్యె.

అనిరుద్ధచరిత్రము, ఆ 5 పద్య 105.

సీ. పటుభుజాస్తంభాగ్ర♦ఘటితవిశ్వంభరా, భరలాఘవితమహా♦ఫణిఫణుండు
నవకీర్తినర్తకీ♦నాట్యరంగావధీ, కృతచక్రవాళ ధా♦త్రీధరుండు
సంతతౌదార్య సి♦ద్ధాంతార్థపూర్వప, క్షీభవత్కల్పక♦ప్రాభవుండు
బిరుదాంకరచితగం♦భీరగీతప్రసం, గాశాపసంజీవ♦నాంతకుండు
గీ. నిశితనిరుపమనిజకర♦నీరజాత, నిహితనిస్త్రింశనిర్భిన్న♦నిష్ఠురారి
పలలనైవేద్యతృప్తశుం♦భత్ప్రతాప, ఘోరతరభైరవుండు పు♦రూరవుండు. 522

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. పుణ్యజనప్రియ♦మునమించు నేరాజు, ప్రబలు నేరాజవి♦పక్షగుప్తి
నైకసహస్రాక్ష్య♦వాప్తకుండేరాజు, సకలాశలే రాజు♦చక్కఁద్రొచు
బహువజ్రభూషల♦భాసిల్లు నేరాజు, దనరు నేరాజు స♦త్కవిహితాత్మఁ
బరదేవహరణచా♦తురినొప్పు నేరాజు, బలయుక్తి నేరాజు♦పరిఘవిల్లుఁ
గీ. జెలఁగు నేరాజు నిచ్చయ♦శృంఖలైక, లక్ష్మిలోప్పారఁ దనుఘను♦ల్భక్తిఁ గొలువ
నహహ యారాజు దనరు ది♦వ్యప్రఖ్యత్య, మానితగుణాంశపరిజితా♦మత్స్యరాజు.

చంద్రికాపరిణయము, ఆ 1 పద్య 116.

సీ. శత్రునుంచఁడుగదా ◆ క్షమలోన క్షమలోన, విడువనొల్లఁడుగదా ◆ వేలకైనఁ
బలికిబొంకఁడుగదా ◆ కలనైనఁ గలనైన, వెన్నుఁజూపఁడుగదా ◆ యెన్నఁడైన
మాయఁజేయఁడుగదా ◆ మదినైన మదినైనఁ, గోపముంచఁడుగదా ◆ కుమతు లరసి
కాలుఁదప్పఁడుగదా ◆ కరమెత్తి కరమెత్తి, యీఁగిమానఁడుగదా ◆ యెట్టియెడల
గీ. నీ ధరాపాలుఁడని లోకు ◆ లెన్నుచుండ, బాల్యముననుండి కీర్తిచేఁ ◆ బ్రబలె నౌర
ఖ్యాతచరితుండురంగభూ ◆ కాంతసుతుఁడు, భావజనిభుండునీలాద్రి ◆ భూవిభుండు.

నాసవదత్తాపరిణయము, వక్క. వీ. ఆ 1 పద్య 86.

సీ. తనపృథుకీర్తి ము ◆ క్తాచ్ఛపత్త్రమునకు స్వ, ర్ణధరంబు కనకదం ◆ డంబుగాఁగఁ
దనప్రతాపసమగ్ర ◆ దావాగ్నిశిఖకు వ్యో, మంబు తదగ్రధూ ◆ మంబుగాఁగఁ
దననిరర్గళదాన ◆ ధారాంబులహరికిఁ గైలాసశిఖరి సై ◆ కతముగాఁగఁ
దనకటాక్షస్యంది ◆ ఘనకృపారసవృష్టి, కఖిలార్థికోటి స ◆ స్యంబుగాఁగ
గీ. మహిని జెలువొందె మర్త్యారి ◆ మండలేశ, మకుటమణిగణశరణాయ ◆ మానచరణ
నఖరపాళి నిజాశ్రిత ◆ నళినహేళి, చారుకీర్తి హరిశ్చంద్ర ◆ చక్రవర్తి. 525

కవిజనరంజనము, ఆ 1 పద్య 28.

సీ. బలశాతపరిపంథి ◆ బలశాసనుండన, స్ఫురణభీషణహేతి ◆ ధరుఁ డనంగఁ
ధర్మనిర్మాహార్థ ◆ దండధారియనంగఁ, బుణ్యజనాన్వయ ◆ పోషకుఁడన
బహువాహినీశ్వరు ◆ పరిపాలకుండన, ఘనజగత్ప్రాణ వి ◆ ఖ్యాతి యనఁగ
రాజరాజాహ్వయా ◆ ర్థ సమన్వితుండనఁ, జారుసర్వజ్ఞతా ◆ శాలి యనఁగ
గీ. బ్రస్తుతికినెక్కె సకలది ◆ క్పాలకాంశ, జనిత శుభమూర్తి శేషాహి ◆ సదృశబాహు
దండ పరిరంభసంభృత ◆ ధరణీయువతి, సమ్మదస్ఫూర్తి దశరథ ◆ చక్రవర్తి.

రామవిలాసము, ఆ 1.

సీ. తనయాజిభావంబు ◆ గనుపించె సకలస, న్నుతసత్కళా ప్రవీ ◆ ణత వహించి
తనగభీరతనూపెఁ ◆ దటినీమనోహర, పరిఖ్యాత సత్యసం ◆ పదలఁ జెలఁగి
తనప్రభావముఁ దెల్పెఁ ◆ దపనసంచనగర్వ, నిర్గంధనక్రియా ◆ నిరతిఁ దనరి
తనతేజమెఱిఁగించె ◆ ననిమిషేశ్వరవజ్ర, దుస్సాధ్యదైత్యపం ◆ క్తుల వధించి
గీ. రాజమాత్రుఁడె యష్టది ◆ గ్రాజవినుత, రాజితయశఃప్రతాప ని ◆ ర్దళితరాజ
హేళి రిపురాజభయదాజి ◆ కేళి రాజ, రాజధనశాలి దశరథ ◆ రాజమౌళి. 527

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 76.

సీ. తనకలాపస్ఫూర్తి ◆ తనకలాపస్ఫూర్తి, కరణి దివ్యాంబకా ◆ కరముగాఁగఁ
దనసత్త్రిసంస్థాయి ◆ దనసత్త్రిసంస్థాయ, సఖిలద్విజావృతం ◆ బై చెలంగఁ

దనదానవీభవంబు ◆ దనదానవిభవంబు, గతి సరసాళి స◆న్నుతివహింపఁ
దనపురాకారంబు ◆ దనపురాకారంబు, పగిది బలోత్కృష్ట ◆ పటిమఁ బూనఁ
గీ. దనదు దోర్దండమండితో◆ద్దండమండ, లాగ్రఖండిత చండాహి◆తావనీశ
దళితమార్తాండమండలాం◆తరుఁ డమోఘు, సాయకుండాదిలీపభూ◆నాయకుండు.

దిలీపచరిత్రము, ఆ 1 పద్య 85.

సీ. కారుణ్యసుపరిభా◆కలిత విద్యావాప్తిఁ, గమలాక్షు గమలాప్తు ◆ కమలభవుల
వరభోగసౌందర్య ◆ వాగ్విశేషంబుల, జిష్ణుజిష్ణుకుమార ◆ జిష్ణుగురుల
భూతిపరితాపసం◆పూర్ణవైభవముల, భర్గు భర్గాత్మజ ◆ భర్గసఖుల
ఘనబుద్ధిసత్కళా ◆ గాంభీర్యగుణములఁ, జంద్రనందన చంద్ర ◆ చంద్రగురుల
గీ. నపహసించుచుటంచు ది◆గంతరముల, సకలజనములు వినుతింప ◆ సమ్మదమున
రాష్ట్రమేలుచునుండె సు◆రక్షితముగఁ, జిత్రవర్మండు పార్థివ◆శ్రేష్ఠుఁ డగుచు.

బ్రహ్మోత్తరఖండము, ఆ 3.

సీ. మొలపట్టుకాసెలో◆పల పసిండిమొలాము, చికిలిగూర్చినబాకు◆ చెన్ను మెఱయఁ
దళతళలాడు కుం◆దనపుపోషస్కుహా, యత్మెనిచాయతో ◆ నంటి మెఱయఁ
బలుహారంగలర చెం◆గులు జాఱవిడిచి క, ట్టిన బురుసాదుమా◆స్త్రేన మెఱయ
భానుకోటిపరిభా◆భాస దివ్యకిరీట, ముత్తమాంగంబున ◆ హత్తి మెఱయ
గీ. నింపు చిఱునవ్వు నూఁగు మీ◆సంపురేక, కౌముదీలక్షణంబుల◆కరణి వదన
రాజమండలమునఁగూడి ◆ రాజిలంగ, రాజమండలమునఁగూడి ◆ రాజవిభుఁడు.

శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 1.

సీ. తనమహోవనత పరి◆త్యక్తమౌనట్లు నూ, తనమహోవనములు ◆ దనరఁ జేసి
తనరసాశయత ప్ర◆త్యక్షమౌనట్లు నూ, తనరసాశయములు ◆ దనరఁ జేసి
తనసదావృత్తి పరి◆త్యక్తమౌనట్లు నూ, తనసదావృత్తులు ◆ దనరఁ జేసి
తనయశంబవనిఁ బరి◆త్యక్తమౌనట్లాత్మ, తనయశంబమితమై ◆ దనరఁజేసి
గీ. తనపరిజానురాగోన్నతి ◆ గనుపడంగఁ, దనపరిజానురాగోన్నతిఁ ◆ దనరఁ జేసి
తనకుసములధికులు లేని ◆ ఘనత గలిగి, తనరిన కుమారవిభు సెన్నఁ◆దగ మెతరుణి.

రాధాకృష్ణసంవాదము, ఆ 4 పద్య 92.

సీ. పరిజలఁగన్నను గన్న◆ప్రజలకన్నను మిన్న, గాఁగావఁగాఁజూచు◆కారుణికుఁడు
వసుమతినేర్పుమై ◆ వసుమతియగునట్లు, పరిపాలనమొనర్చు ◆ పార్థివుండు
బంధులఁ బేర్మిమాను ◆ బంధులఁగావించి, మన్ననఁ బచరించు ◆ మానఘనుఁడు
భటసమూహము సము◆త్కటసముత్సాహమై, తనరఁ బోషించు పరి◆తాపశాలి

గీ. కలఁడె యీదృశసాద్గుణ్య ◆ గణ్యుఁడైన, నృపశిఖామణియంచు వ◆ర్ణింప నెసఁగి
రావువేంకటనీలాద్రి◆రాయవిభుని, సూర్యరాయేంద్రుఁడలరె ని◆స్తులనిరూఢి.
రామరాయవిలాసము, ఆ 1 పద్య 83.

సీ. మన్యుశీలునిఁగాని ◆ మదిసమ్మతింపఁడి, యలుగనుగతిక్షింపఁ ◆ దలఁపఁ డెపుడు
దానపాత్రునిపైన ◆ కాని లతోఁగ్రప, సాదవృష్టులు చక్క ◆ సాగ వెపుడు
పటులక్ష్మిదేశసం◆ప్రాప్తిగల్గియెకాని, శరముయాచకతతి ◆ మరల దెపుడు
ప్రత్యర్థిభామిను◆ల్బహుశోకమోదార్త్రు, లురులుకన్నులఁగాని ◆ యుండ రెపుడు
గీ. కలుగుఁగలుగ దనీతియా◆ఘనునిపుడమిఁ, దలఁపులోఁబరసత్వాప్తి◆నిలుపునిలుపఁ
డాత్మగోపాయనంబన్యు◆నడుగునడుగఁ, డితనువిభవుండుశంతను◆క్షితిధవుండు.
శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 33.

సీ. తనదుమన్మథసమ◆తనమానసౌందర్య, మతులితనాసంత◆ఋతువుఁ జేయఁ
దన శౌర్యతపననీ◆క్షింద్రతైక్ష్ణ్యంబు, సతతంబునుంగ్రీష్మ◆ఋతువుఁ జేయఁ
దన దానవారిన◆దనదీపగ్రివాహముల్, పితతవర్షార్తిక◆ఋతువుఁ జేయఁ
దనయశఃపరిశుభ్ర◆ఘనఘనపటలంబు, సతతంబునున్ శర◆దృతువుఁజేయఁ
గీ. దనదుపరిపంథికర్మకో◆దార్తకంప, మతులితంబైనహేమంత◆ఋతువుఁ జేయఁ
దనదుశీలలహ్యదయాని◆స్తాగమహిమ, తతసఖాళికిశిశిరర్తు◆ధాటిఁ జేయ. 534
సావిత్రీపరిణయము, ఆ 1 పద్య 129.

సీ. దానమానవవనా◆వానభూమీరుహ, సంతుష్టికృతికి క◆సంతవేళ
యాచకజనచకో◆రాచితాశాపూర్తి, నాగకరాకాని◆శాగమంబుఁడు
పండితజనసుర◆మండలీకృతసభా, మండనాయితమహా◆ఖండలుండు
పరిపంథిసృగ్గణగణో◆పరిసుమున్నేసర, దుర్వహకాలజం◆ఘానిలంబు
గీ. జ్ఞానిజనతాత్రిపిపాసద◆వానలంబు, కవిజనామగపోషణ◆కల్పకంబు
గసికజనహృద్యనవరసా◆లంబనంబు, రాజమాత్రుండె శ్రీరామ◆రాయవిభుడు.
వాసవదత్తాపరిణయము, య. ల.

ద్విపద. రతిరాజురూపున◆రమ్యభోగమున, సురరాజుకళివిభా◆సురరాజరాజు
కురురాజుమానస◆గుణములనీగి, ధరనంగరాజని◆తనుఁబ్రస్తుతింప
గరిమతోనారాజ◆కంఠీరవుండు, శాతహేతినికృత్త◆శత్రురాజన్య
జాతినిర్భిన్నభా◆స్వన్మండలుండు ... ... ... 536
ప్రభులింగలీల. పి. స్తో. గతి 3.

# రాజసభ.

—:o:—

సీ. త్రైలోక్యవిజయాభి♦ధంబైన సౌధంబు, చంద్రశాలాప్రదే♦శంబునందు
సచివసైన్యాధీశ♦సామంతనృపవర, సీమంతినీజన♦శ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు♦సాహిత్యగోష్ఠియు, విద్వత్కవీంద్రులు♦విస్తరింపఁ
గర్పూరకస్తూరి♦కాసంకుమదగంధ, సారసౌరభము ది♦క్పూరితముగ
గీ. నిజభుజావిక్రమంబున♦నిఖిలదిశలు, గెలిచి తను రాజ్యపీఠమె♦క్కించినట్టి
యన్నసోమేశ్వరునియంక♦మాశ్రయించి,నిండుకొలువుండెఁగన్నుల♦పండువుగను.

కాశీఖండము, పీఠిక. పద్య 10.

సీ. మొగిసలాములొనర్చి♦ముదముతోఁదవ్వగ, భయముతోడవజీర్లు♦బారుదీఱ
సాష్టాంగముగ మ్రొక్కి♦సామంతనృపకోటి, కోటీరమణిఘృణి♦క్రమ్మరింప
మన్నీలుబాంధవుల్♦మన్ననల్ గలవార, లోకదండ సంతోష♦యుక్తి నుండఁ
గానుకల్గొనివచ్చి♦గౌరవంబలరంగ, బాళెంపుదొరగుంపు♦ప్రస్తుతింప
గీ. దండిభవభూతినిభులైన♦దండికవులు, సరసవిద్వత్కవుల్ దన♦సరసవెలయ
వనితలిరుగడఁబైఁడిపా♦వడలువీవఁ, బ్రమదమలరంగఁ బేరోల♦గమునునుండె. 538

కృష్ణరాయవిజయము, ఆ 1 పద్య 61.

సీ. చెవిదండఁజేరి ని♦ల్చినవార్యసమువారి, ముదలకమ్మలకొప్పు♦ములు లిఖించి
దిక్కులనుండి యే♦తెంచుమన్నీల మం, త్రులతోడ నుచితంపుఁ♦బలుకు పలికి
సమయోచితముగ హా♦స్యములొనర్చువిదూష,కులదిక్కు మొలకన♦వ్వొలుకఁజూచి
యవసరంబుల వారి♦లవధారనుచుఁదెల్పఁ, బోడఁగనివారికిం♦పులు నెలార్చి
గీ. సత్కవీంద్రులరచియించి♦చదువుపద్య, సమితియందొరసపారలు♦చక్కదిద్ది
ప్రౌఢిఁగనిపింపఁజేయు భూ♦పాలుకొలువు, ప్రజలకవ్వేళఁగన్నుల♦పండువయ్యె.

కువలయాశ్వచరిత్రము, ఆ 2 పద్య 9.

సీ. వందిజనస్తుతి♦వ్యాహారములను బ్రా, సంగికుల్ సేయు ప్ర♦సంగములను
సచివశేఖరుల వా♦క్చాతుర్యములను బ్రా, బంధికుల్ జదువు ప్ర♦బంధములను
సాటిబాంధవులాడు♦సల్లాపములను బౌ, రాణికుల్ సెప్పు పు♦రాణకథల
గాయకగళసముద్గ♦తగానరసములఁ, బరిహాసకులపక్తి♦భాషణముల
గీ. వేదవేదాంతవిద్యావి♦నోదములను, మోదమునుజెంది ఝల్లరీ♦నాదవిదిత
భోజనావసరుండయి♦భూవిభుండు, మరల సభ్యంతరంబున♦కరిగెనపుడు. 540

దిలీపచరిత్రము, ఆ 1 పద్య 152.

సీ. లెక్కింపనొకమిత్రుఁ♦డొక్కఁడై వాత్రుకుం,డొక్క భూతనయుండు♦నొక్క సౌమ్యుఁ
డొక గురుం డొకకవి♦యొక్క సూర్యాత్మజుం, డొక్క కేతువు గల్గి♦నిక్క నిక్క
మిన్నందె నడులోక♦మెన్ననిట్టిదెకదా, తమముగ్రమ్మెడువారి♦క్రమ మటంచు
గోసి యసంఖ్యమి♦త్రులసంఖ్యలై వాత్రు, కులసంఖ్యభూతన♦యులు నసంఖ్య
గీ. సౌమ్యులు నసంఖ్యగురులు న♦సంఖ్యకవుల,సంఖ్యసూర్యాత్మజాతుల♦సంఖ్యకేతు
వులును వెలయఁ దమోహర♦కలనగలిగి, డంబు మీఱెడు కొలువుకూ♦టంబుఁజేరి.

రాధాకృష్ణసంవాదము, ఆ 2 పద్య 5.

సీ. కనకాచలోత్తుంగ♦ఘనమత్తమాతంగ, తతు లొక్కదెసబృంహి♦తములు సేయ
పాథోధిసుతరంగ♦పంక్తిఁ బోలుతురంగ, మములొక్కకడ హేషి♦తములొనర్ప
నతిమనోరథముల♦హరియించురథములొ, క్కెడఘుర్ఘురధ్వను♦లడలు కొలుప
చటులమైదిక్తటీ♦పటలము ల్వెటలగా, భటులొక్కయిక్కనా♦ర్భటులు సల్పఁ
గీ. బ్రికటసామంతధీమంత♦నికటరత్న, రుచిరసింహాసనస్థుఁడై♦సుచరఖచర
ప్రచురవిభవుండు వరబుభు♦ప్రభునిభుండు, వెలయు పభనుండు దశరథో♦ర్వీవిభుండు.

రఘురామచరిత్రము, ఆ 1 పద్య 51.

సీ. ఒకవంకనుతులధీ♦యుతభూసురానీక, మొగి వేదఘోషము♦లొనరఁ జేయ
నొకచాయభుజవిక్ర♦మోద్ధూతరిపురాజ, బంధువు ల్రాజస♦మొంది మెఱయ
నొకదారివరభట♦నికరము ల్తనకీర్తి, సంతోషహృదయులై♦సాగి పొగడ
నొకచోటభరతశా♦స్త్రోక్తక్రమంబునఁ, జెలఁగి వేశ్యలు నాట్య♦ములనొనర్ప
గీ. రాజశేఖరుఁడతులవి♦భ్రాజమాన, మౌక్తికాహారకాంచన♦మయ వినిర్మ
లాభరణజాలభూషితుం♦డవుగుదెంచి, యరిది కూర్చుండె రత్నసిం♦హాసనమున.

ధీరజనమనోవిరాజితము, ఆ 1 పద్య 31.

సీ. చెలువంబుగానాడు♦వెలయాండ్రబంగారు, చిఱుగజ్జియల మ్రోఁత♦చెవులఁ దనుప
విరిబోఁడులిరుకేవ♦వింజామరలు వేయ, వెడలుచల్లనిగాలి♦విందుగొలుప
రహిమీఱఁదాల్చిన♦రతనంపుఁబనిసొంపు, తొడవుల తళతళల్♦కడలనిండఁ
బగడాలకంబాల♦పజ్జముద్దనునుల, కెంబట్టుపఱపులు♦డంబునూపఁ
గీ.గొలువనేతెంచుదొరలెల్ల♦గుములుగూడి,యదనొదవుదాఁకనందంద♦యొదిగియుండి
యడుగుదోయికి మ్రొక్కుచు♦నవలనిలువఁ, బసిఁడిగద్దియఁగొలువుండె♦బలియుఁ
డతఁడు.544

కృష్ణాంధ్రోత్తరరామాయణము, ఆ 1 పద్య 12.

# ఆస్థానమండపము.

సీ. సంచితమణిమయ♦స్తంభాభిరామంబు, బహువిచిత్రవితాన♦భాసురంబు
ఘనసముత్తేజిత♦కనకవేదికమును, సామ్రపల్లవహేమ♦క్రమకుంభ
ముపకంఠగతమద♦ద్విపసంకులంబును, పుణ్యాంగనాగేయ♦పూరితంబు
మంగళతూర్యాది♦సంగీతముఖరంబు, వందిమాగధజనా♦నందితంబు
ఆ. నైమనోజ్ఞమైన♦యాస్థానమండపం, బమర నందు రత్న♦హైమతుంగ
భవ్య సింహయుక్త♦భద్రపీఠంబున, నునిచె దానవేంద్రు♦నుత్సహించి. 545

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2270.

సీ. పగడంపుగుండ్రకం♦బములు మేలికడాని, దూలముల్ జాబిలి♦తాలమెట్లు
పులుఁగు తాపచ్చబో♦దెలు తప్కుమగవాని, కంపుగోడలు తమ్మి♦కెంపు వెడఁద
తలుపులు పటికంపు♦ద్వారబంధంబులు, తెలిగంటిరాచరా♦తిన్నియలును
వైడూర్యవలభిక♦ల్వాటంపు గోమేధి, కపుజలయంత్రముల్♦కడిఁదిముత్తి
గీ. యంపు నేఁతలు పుష్యరా♦గంపుజాల, కములు రవికాంతమణివలీ♦కములు రజిత
ఫలకములు గల్గినా డెంపుఁ♦బనులబల్ హొ, రంగులననాగతంబుఁ జె♦లంగి మఱియు.
సీ. జాలవల్లికలు ప♦చ్చలగద్దెపీఁటహూం, జట్టుతివాసీలు♦వట్టివేళ్ళ
సురటీలు మేల్ పైఁడి♦కురిచీలు నెత్తంపు, పలకనిద్రాజర♦బాజుజీబు
చందువాముత్యాల♦జాలీలు చికిలికోరి, మ్మించుటద్దములైన♦మించుతగటు
ఖాలీసురతనంపు♦కీలుబొమ్మలు చిటి, చాపలు వెడఁదవిం♦జామరములు
గీ. తమ్మపడిగలు మంచిగం♦దంపుఁగోళ్ళ, చిఱుతముక్కాలిపీఁట రా♦చిలుకపంజ
రములు. చిత్రింపుదివ్వెగం♦బములు గలిగి, జాళువులకెంపు కొల్వుహ♦జారమునను.

రసికజనమనోభిరామము, 1 పద్య 60, 61.

సీ. వింజామరంబుల♦విసరుపూఁబోడులు, కంకణఝుణఝుణ♦త్కారరవము
మురువుగా సుతిగూడి♦మొరయించు వైణిక, వల్లకీనిక్వణ♦క్వాణరవంబు
కడుసొంపుగా నాడు♦కర్ణాటనాటకీ, కనకమంజీరఘుల్♦ఘుల్ రవంబు
పరిణతపార్థివశిరః♦స్రగ్గంధలోలితఁ దిరుగుతుమ్మెదల ఝుం♦కారరవము
గీ. మిళితమగుచు సుధారస♦గళితమగుచు, లలితమగుచు మనోరథ♦ఫలితమగుచు
నానినాదం బపూర్వమో♦హనవిలాస, మహిమఁ జెన్నొందెఁ దత్సభా♦మంటపమున.

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. పగడంపుఁ బనులఁ బెం♦పగుగుండ్రగంబము, లచ్చంపుపచ్చరా♦గచ్చుమెట్లు
జేజేవజీరురా♦జిగికిటికీతనా, బీలతల్పులు నెల♦రాలుగూర్చి
న హారంగుద్వారబం♦ధములునై డూర్యము, ల్దాపినపసిఁడి దూ♦లములు పుష్య
రాగములెచ్చెక్కి న♦రాణించుజాళువా, తీనియ ల్మరకత♦దీప్తకుడ్య
గీ. జాలములు మానికములచేఁ♦జాలనలరు, జాలకములు గోమేధిక♦స్థగితసలిల
యంత్రములు చిత్తరువుబ్రాత♦లాదియైన,గడిఁదిసొంపగుపెంపులు♦గలిగిమఱియు.

శకుంతలాపరిణయము, ఘ. వేం. ఆ 1.

సీ. మితిలేనిగతనముల్♦జతఁగూర్చినకడాని, సింగంపుఁబీఁటహా♦రంగుతగటు
హొంబట్టుచందువా♦డంబుసూరతజాతి, ముత్యాలజాలీల♦ముద్దుగుల్కు
మొకమాలుబాలీసు♦మురువుతివాసీలు, దంతపుఁగురిచీలు♦తళుకుపనుల
నిద్దంపుజిగినిల్వు♦టద్దమువింజామ, రలు గుబ్బగొడుగు మేల్♦వలపుగులుకు
గీ. చిన్నిపన్నిటియత్తరు♦గిన్నియలును, బచ్చకెక్కులపులుఁగుల♦పంజరములు
గలిగిగరితంపునెరిసొంపు♦వెలయుబెంపు,మహిమచెలువొందునాస్థాన♦మండపమున.

„ „ „ ఆ 1.

---

# రాచనగరు.



సీ. మానినీమంజుల ♦ మంజీరకరరవ, కేళీసగోహంస ♦ కీలితంబు
కామినీకాముక ♦ కలహప్రసాదన, పండితశారికా ♦ భాసురంబు
సరసకథాలాప ♦ సంగీతసాహిత్య, చతురశుకస్తోమ ♦ సంచితంబు
అంగనాగండూష ♦ హాలాలసద్గంధ, వకుళపుష్పావళీ ♦ ప్రకటితంబు
ఆ. విలసదగరుగంధ ♦ విస్ఫుటతరగంధ, మైన వివిధమంది♦రాంగణంబు
చూచి నెమ్మనమున ♦ సుడివడ నానంద, మంత కంత కుబ్బ ♦ నచ్యుతుండు.
సీ. గళితమదోదక ♦ గండస్థలీసంగి, మధుపఝుంకారాత్త ♦ మత్తగజము
హేషారవోద్ధతి ♦ పోషితనిస్సాణ, పటహభేరీధ్వాన ♦ బహుళహయము
పాకారచితరత్న ♦ బహువిధతరధామ, లిప్తసౌధసమూహ ♦ దీప్తతలము
ఫాలస్థలీకృత ♦ ప్రకటితాంజలిపుట, పరిచారికావళీ ♦ భాసురంబు
ఆ. ద్వారఖచితరత్న ♦ తోరణోపాంతాప, లంబిమౌక్తికోప ♦ లసితమైన
నగరి చొచ్చె శౌరి ♦ నానావిధానూన, వినుతిలసితహృద్వి♦వేకుఁ డగుచు. 552

ఉత్తరహరివంశము; ఆ 6 పద్య 266, 269.

# కీర్తి.

శా. లాటీచందనచర్చ, చోళమహిళా ♦ లావణ్యసామగ్రి, క
ర్ణాటీగీతకలాసరస్వతి, కళిం♦గాంతఃపురీమల్లికా
వాటీమంజరి, గౌడవామనయనా ♦ వక్షోజహారాలియై
పాటింపందగు నీదుకీర్తి రథినీ ♦ పాలాగ్రణీ సాహిణీ. 553

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 826.

చ. స్థిరజయుఁడైన కోనరర♦దేవు యశోవనరాశి యా సుధా
కరునకు బొమ్మబంటి కఱ♦కంఠుని కుత్తుకబంటి నాకరా
డ్ద్విరదము చెక్కుబంటి ఫణి♦దేవునికన్నులబంటి శారదాం
బురుహ విశాలనేత్రతల ♦ ముక్కులునై విహరించు మించుగన్. 554

కకుత్స్థవిజయము, పీఠిక పద్య 70.

సీ. చెక్కునొక్కెదెయంచు ♦ దిక్కరిగ్రామణి, యక్కుఁజేరదెయంచు♦రిక్కరాయఁ
డలుతనొందదెయంచు ♦ హాలాహలాహారి, కంటికబ్బదెయంచు ♦ దంటచిలువ
యంకమొందదెయంచు♦యదుకులశ్రేష్ఠుండు, మోముఁజూడదెయంచు♦మొదటిగిబ్బ
యడుగుదొక్కెదెయంచు♦నమృతంపుమున్నీరు, చాయనుండదెయంచు♦సౌరశాఖి
గీ. తనచెలిమి కాసపడనొచ్చె ♦ మునికినారిఁ, దెగడి యాత్మసవర్ణల♦ద్ధికిఁ జరాచ
రంబునఁ జరించుఁ దిరుమల♦రాయతనయ, ధీరవేంకటరాయ స♦త్కీర్తికన్య. 555

వసుచరిత్రము, పీఠిక పద్య 80.

సీ. అప్పుపాలైన శు♦భ్రాబ్జంబురుచి యెంత, మాటమోచినయంచ ♦ తేట యెంత
నీళ్లుమోచిన భవా♦నీభర్త కలిమెంత, బిలముదూరిన శేషు ♦ బలిమి యెంత
తమ్ములతోఁ బోరు ♦ తారేశుకళయెంత, తృణమైనశరపుంజ ♦ దీప్తి యెంత
పండ్లిగిలించు క♦ల్పకశాఖిదళమెంత, విరిసినమల్లెల ♦ వీఁక యెంత
గీ. యనుచుఁ దనకీర్తిధవళాబ్జ ♦ హంస మదన, మథనవరభోగివిధుశరా♦మర్త్యవిటపి
వికచ విచికిల మాలికా♦వితతిఁ దెగడ, వసుధఁబాలించు నోబభూ♦వల్లభుండు.

నరసభూపాలీయము, ఆ 1 పద్య 67.

ఉ. వేడుకవీరసేనపృథి♦వీవరుకీర్తివధూలలామ యీ
రేడుజగంబులు న్మదికి ♦ నింపులొసంగెడు బొమ్మరిండ్లుగాఁ
దోఁచ నజాండభాండములు ♦ దొంతులుగానిడి బాల్యపాయమం

దాడు నటన్నఁ బ్రోడముగ ♦ నత్తఱి కచ్చెరి యెంత సేయునో. 557

నలచరిత్రము, ఆ 1 పద్య 208.

సీ. అనిదిండి జడదారి ♦ చినుకుపూసలకోవ, మగటాలువెన్నెల ♦ మ్రాగల తేఁకు
గిబ్బడాల్దొరగుండు ♦ కబ్బంబుపోరియాలు, లబ్బిగుబ్బెతయబ్బ ♦ బొబ్బమెకము
ఖిన్నకేళాకూళి ♦ వేల్పులబోనము, తడవులవిడుపఁడు ♦ పుడుకుదొడుకు
తూఁడుమే పుడుపుల్గు ♦ దూర్పురాయనిజక్కి, చొల్లకొవ్విరియెత్తు ♦ జొల్లుపువ్వు
కీ. నురువులద్దంబుపాలుక ♦ ప్పురపుబూది, సంకు రిక్కలు తుంచు నీ ♦ రింకుమొగులు
దనయసంబునకెనగాక ♦ పెనుపుడింప, వెలసె నమ్మన్న తాలుపు ♦ వేల్పు తేఁడు.

అచ్చతెలుఁగు రామాయణము, యుద్ధ. పద్య 590.

సీ. కాశకాశాధిపా ♦ కాశధునీహార, నీహారకలశవా ♦ ర్నిధులఁ దెగడి
సోమసోమామర ♦ సామజతారకా, తారకాదంబబృం ♦ ధముల నవ్వి
చంద్రచంద్రాతప ♦ చందనశారద, శారదాంభోదకే ♦ సరుల నెన్ని
గోపగోపారదేం ♦ దూపలసంతాన, సంతానఫేనవ ♦ జ్రములఁ గేరి
గీ. మీఱి తనకీర్తి జగముల ♦ మెఱయు నలరె, నిఖిలభూధరణోదగ్ర ♦ నిజభుజాగ్ర
జాగ్రదుగ్రమహామండ ♦ లాగ్రదళిత, దుష్టనృదుర్వ్యభుజుండు బు ♦ తుధ్వజుండు.

రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 54.

చ. సురకరిచెక్కునొక్క గజ ♦ సూదనుకంఠమునవ్వి రేవతీ
శ్వరుకటిరోసి రేవెలుఁగు ♦ వక్షముఁద్రొక్కి పయఃపయోధిలోఁ
గిరముఁ గలంచి వాణిజడ ♦ గప్పి భుజంగమురాట్ఫణాపరం
పరలనటించి దాసఘను ♦ భానురకీర్తి చెలంగె దిక్కులన్. 560

వేదాంతరసాయనము, అవతా. పద్య 49.

సీ. కుందమ్ములసితార ♦ విందమ్ముల మృణాళ, బృందమ్ములను పయ ♦ స్స్యందములను
రంగిమ్ముల సుధాత ♦ రంగిమ్ముల నభస్తు, రంగిమ్ముల సురసా ♦ రంగములను
హారమ్ముల శరద్వి ♦ హారమ్ములను గాంగ, పూరమ్ముల ఘనక ♦ ర్పూరములను
సూనమ్ములఁ గళావి ♦ తానమ్ముల నుడుపఙ్క్తి, తానమ్ముల సురసం ♦ తానములను
గీ. సొగసుమగరాలనిగరాల ♦ నిగనిగలను, మిసులనలరారునెలరాల ♦ తగువగలను
దెగడి పొగడొందు నెల్లెడ ♦ జగతి నతని, పరమహిమహృద్యశోభాప్రి ♦ భావగతుల

అచలాత్మజాపరిణయము, ఆ 1.

సీ. త్రిపశాలయముఁజొచ్చి ♦ తేరెఁద్రుణగ్రాహి, హరికరమంటె గో ♦ త్రాంతకాత్రి
కాకోదరముఁబట్టెఁ ♦ గాత్యాయనీభర్త, క్ష్మాతలంబంటెఁ గం ♦ జాతషాళి

ఘనతారకంబుల♦కరములానెఁగళంకి, కొలనునీటను ముంచెఁ♦గుముదకోటి
హరిశిరస్స్పర్శ ని♦ర్జరుఁడయ్యెఁ గరదుండు, పరిజనం బెనమితవ♦ర్ణస్వరూపి
గీ. యనుచు వారలఁ దత్సమా♦ఖ్యలజయించి, రూపసంపదలకు ముసు♦గ్రాపుగొన్న
సారసంగ్రహవైభవో♦దారలీల, వెలసె మదనాభిరామ భూ♦విభునికీర్తి. 562

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

సీ. తారకాచలతార♦తారకాపంక్తుల, తారతమ్యముఁగట్టి♦శౌరసిల్లి
శౌరతరంగిణీ♦పూరామరాహార, వారిజవారముల్♦నీరసించి
హీరనీహార క♦ర్పూరడిండీరాస్థి, హారపటీరము♦ల్పాఱఁ దోలి
నారద శారద♦నారద పారద, క్షీరదరంబుల♦దూరఁ బల్కి
గీ. శారదైరావతములను♦మీటిమీటి, క్షీరవారాశిపూరము♦ల్గేరి కేరి
సారెజగములయందున♦మీఱనంగ, మీఱె శ్రీరామరాణ్మణి♦చారుకీర్తి. 563

వాసవదత్తాపరిణయము, య. ౨.

# రాజ్యపాలనము.

సీ. పాదపంబులుపుష్ప♦ఫలసమృద్ధివహించె, నఖిలధేనువులుఁ జ♦న్నవిసిపిదికె
జగతీవధూటిగా♦జన్వతియైమించె, గతమయ్యె నెచటఁ ద♦స్కరభయంబు
కనరైరిపుత్త్రిశో♦కముతల్లిదండ్రులు, పాలఁతులనైధవ్య♦ములుదొలంగెఁ
బ్రాణిజాతంబు ని♦రామయస్థితిఁబొల్చె, నెలమూఁడువానలు♦నిలిచికురిసెఁ
గీ. దేనెతలవడఁబండెధా♦త్రీతలంబు, పొదలిధారణపోఁకకుఁ♦బుట్టెఁడయ్యె
నన్నివంకలగుర్భిక్ష♦మడఁగిపోయెఁ, బ్రస్తుతింపఁగఁదగురామ♦రాజ్యమునను.

జైమినిభారతము, ఆ 6 పద్య 9.

సీ. వానలుసరవితో♦వర్షించె సస్యముల్, వేళ్ళఁగొల్చుగ విజ్ఞ♦వీఁగిపండె
నారోగ్యపుత్త్రిపౌ♦త్త్రైశ్వర్యవంతులై, బ్రదికిరినూఱేండ్లుఁ♦బంచజనులు
పూవుఁబోఁడులుపతి♦దేవతలైరగ్ని, భయతస్కరవ్యాధి♦భయములడఁగె
ఫలపయఃకుసుమాది♦బహుపదార్థంబులు, రసగంధసామగ్రి♦నెసకమెసఁగె
గీ. నీత్యుపద్రిసమృత్యురా♦హిత్యయుక్తి, నరఁబ్రజాసృష్టిశామర♦తంపమయ్యె

న్యాయపథమునస్వారోచి◆షాఖ్యమనువు,శ్రీలఁ బెంపొందిపాలించు◆కాలమునను.

మనుచరిత్రము, ఆ 6 పద్య 120.

సీ. ఆరాజువిమలవి◆ఖ్యాతిచంద్రికనిచ్చ, రహికెక్కె జాఱె జా◆రప్రసంగ
మాఘనుదానధా◆రాపూర్ణవర్షము, ర్వరఁబర్వ డిగియె న◆వగ్రహార్తి
యాలోకహితుమిత్రతా◆పాతపం బవిరతో, దయరూఢిఁ దగ నింకె◆దస్యుపంక
మాసద్గుణాబ్ధి చ◆రామృతంబెల్లచో, దయివాఱఁ దెరలెనా◆మయవిభూతి
గీ. యమ్మహాశైలదమనురా◆జ్యముననిట్లు, ఫలములీనెడుచెట్లతోఁ◆బాలవెల్లి
కాన్పుపసితోనఖండభో◆గములతోడఁ, బ్రజలుగాంచిరిభూరివై◆భవసమృద్ధి. 566

వసుచరిత్రము, ఆ 6 పద్య 99.

సీ. ధర్మంబునాల్గు పా◆దంబులవర్తిల్లు, వాంఛించినప్పుడే◆వానకురియుఁ
దరువులేవేళను◆ద్ధతిమీఱ ఫలియించుఁ, బైరులు దున్నక◆పండుచుండు
దిరిపంబువిసరమే◆చిక్కనవొదవదు, మొదవులుపిదుకక◆మున్నెపిదుకు
వ్యాధులునఘములు◆వలసలైదూరించుఁ, జింతింపఁగోర్కులు◆సిద్ధినొందు
గీ. రాజపరమేశ్వరుఁడుదైత్య◆రాజహరుఁడు,రాజసింహుండుదశరథ◆రాజసుతుఁడు
రాజసదృశకళాంగుండు◆రాఘవుండు, ఘనత రాజ్యంబుఁబాలించు◆కాలమునను.

శతకంఠరామాయణము, ఆ 1 పద్య 16.

సీ. మంత్రిలమనముఁబ◆ల్కులు దేవి తెలిసి దు, ర్గాధినాథులమర్మ◆మరసిచూచి
మన్నీలభేదముల్◆పన్నిపాయఁగఁబెట్టి, సాన్నిధ్యులకుగట్టు◆సనువులీక
కొనుటమానుటనిల్వ◆మనుచుట వివరించి, పాలుపత్తెమువారి◆తీరు లెఱిఁగి
బలములనప్పట◆ప్పటికి నీక్షింపుచు, గ్రాసక్రమములదు◆గకరయుసఁగుచు
గీ. లోకవార్తలుమావల్ల◆లోనఁగొనుచు, ననుదినాయవ్యయంబులం◆గనుచుధర్మ
లీలనేర్పడ నీవు భూ◆పాలనంబు, సేయఁ బ్రజగొడవందునే◆క్షితివరేణ్య. 568

నలచరిత్రము, సి. ధ.

చ పరిజలకుమూఁడుపాల్లొసఁగి◆భాగము తాఁగొని భూమిదేవతా
ప్రజమునకున్ సమస్తమున◆వారణగానిడి పూర్వకాలభూ
భుజులగతిన్ జతుశ్చరణ◆పూరితధర్మ పథానువర్తియై
నిజభుజశక్తి నేలె ధర◆ణీవలయంబు జనుల్ సుఖింపగన్. 569

పద్మినీపరిణయము, ఆ 1 పద్య 81.

సీ. కలలోనఁగన్న జ◆గంబయ్యె రోగంబు, గొడ్రాలిచూలయ్యెఁ◆గుటిలవృత్తి
శత్రుజన్యభయఁబు◆శశవిషాణంబయ్యె, సలిలాక్షరంబయ్యె◆సస్యబాధ

ఉత్పాతచయముకు♦హలాచంద్రరుచియయ్యెఁ, గఱవుతారాపథ♦కమలమయ్యె
నపమృత్యుపీడనం♦డాంగనాస్పృహయయ్యెఁ, గిల్బిషమతిధూళి♦క్షీరమయ్యె
గీ. దారుణశరారుమృగఘణి♦చూరుతాగ్ని, తస్కరోపద్రవంబు స♦ప్తమపదార్థ
మయ్యెఁ గజ్జలకాఠిన్య♦మయ్యె లేమి, ధశరథస్వామిపాలించు♦ధరణియందు. 570

రామవిలాసము.

సీ. రాజకీయవిధాన♦యోజనోద్యోగంబు, లంచితస్థితివిమ♦ర్శించుకొనుచు
నఖిలప్రజానుపా♦లనమార్గములయందు, విహితక్రమంబులు♦వెదకికొనుచు
గురువిప్రబాంధవో♦త్కరములపట్టున, ననువొందహితవృద్ధి♦నరసికొనుచు
ధర్మార్థసంగ్రహ♦తత్పరజ్ఞానంబు, తెఱఁగుప్రాజ్ఞులయందుఁ♦దెలిసికొనుచుఁ
గీ. దశయశశ్చంద్రికలుదిగం♦తములునిండ, నామృగాంకార్కముగనతం♦డాత్మవంశ
ముత్తరోత్తరవృద్ధిఁ బెం♦పొందుచుండ, సొంపుదీపింప నవనిఁ బా♦లింపుచుండె. 571

రంగరాయచరిత్రము, ఆ 3.

సీ. ఘనకేతువిస్ఫూర్తి♦ఘనకేతువిస్ఫూర్తి, పగిదిని బరరాజ♦పటిమఁ గలఁప
వరధర్మగుణపాలి♦వరధర్మగుణపాలి, సరణిని బుధలోక♦సమితిఁ బ్రోవ
గురువిభాకరలీల♦గురువిభాకరలీల, గతిని సారసనస♦హితము గాఁగ
మరుకళావిస్ఫూర్తి♦యురుకళావిస్ఫూర్తి, కరణి నిజతురాస్య♦గరిమఁ బెంప
గీ. వితతవిజయప్రశస్తదో♦ర్విపులశక్తి, నవనిఁ బాలించు విజయరా♦మాభిధాన
గజపతిక్ష్మాసతీమణి♦కాంతు శ్రీసృ, సింహగిరివాసికృపనుర♦క్షించుఁ గాక. 572

కౌసల్యాపరిణయము, శ్రీ. వేం. ఆ 1.

---

# స్త్రీవర్ణనము.

---

సీ. పలుకులముద్దును♦గలికికీరాళిగన్నుల, తెలుపును వలుఁదచ♦న్నుల బెడంగు
నలఘుకాంచీపద♦స్థలములయొప్పును, లలితాననేందుమం♦డలము రుచియు
నళినీలకుటిలకుం♦తలముల కాంతియు, నెలజవ్వనంబున♦విలసనమును
గలభాషణంబును♦బోలుపును మెలుపును, గలుగునగ్గిరికన♦తలఁచి తలఁచి

\+ + + + + + +

భారతము, ఆది. ఆ 3 పద్య 27.

సీ. అల్లఁదనంబున♦యనువు మైకొనఁజూచు, నడపు కాంతికి వింత♦తొడవుగాఁగ
నడ వెడ నూఁగారి♦వింతయై యేర్పడుఁ, దేరని వళులలో♦నారు నిగుడ
నిట్టలుద్రోచు చను♦ నిలువులకల మీఁర, లెల్లను విరియెక్కి♦ యేర్పడంగఁ
దెలుపు నగవును♦ వెలయంగ మెఱుఁగెక్కు, తారకంబులఁ గెక్కి♦తనము దోడరఁ
ఆ. జరణములును నడుముఁ♦...... గన్నులు, జవ్వనంబు చెన్ను♦నివ్వటిల్లు
చునికిఁదెలుపు చుండ♦నుత్తరసను దంచె, నలరువిలుతు పువ్వు♦టమ్ముఁబోలె. 574

,, ,, ,, పి. రా. ఆ 1 పద్య 245.

సీ. ఇయ్యింతి పాశ్రిపున♦నయ్యనంగుఁడు పార్వ, తీశునైనను దక్క♦ నేలకున్నె
యిన్నాతి చెలువంబుఁ♦గన్న శచీశ్రియుఁ, డైనను గనుకలి♦నవయకున్నె
యిత్తన్వి కెనలేమి♦ కెవరి పన్నిదము భా, షావిభుతో నైనఁ♦జఱవ రాదె
యిత్తలోదరి జీని♦ తేశున కిందిరా, పతినైన మెచ్చక♦పలుకఁ జనదె
గీ. కుసుమబాణుని బాణము♦ల్గాడనైదు, గరఁగి నేరమి వాటించి♦కరువు గట్టి
పోసి చేసి చైతన్యసం♦పుటముఁడగ ఘటించిరో కాకయిట్టి చే♦డియలు గలరె.

,, ,, ,, పి. రా. ఆ 2 పద్య 87.

చ మలఁపఁగ నున్నకల్పలత ♦ మన్మథనారి నమర్పనున్నకో
మలతరపుష్పబాణ మహి♦మద్యుతిఁ జూడఁగ నున్నపద్మకు
ట్మళ మలరంగనున్న మధు♦మంజరి నా. మదజృంభితాంగదో
హలరుచి నొప్పె గౌరి నవ♦యౌవనసంగమలీల డాయఁగాన్.

సీ. మధుసమాకలితమై ♦ మవ్వ మారినమారు, నవలత నా మేన♦నవక మెక్క
దమణి చేసోఁకినఁ ♦ దావి పొంపిరివోవు, తమ్మి నాఁ దగుసుగం♦ధంబు నుడిసె
మది శరత్సంగతి ♦ మత్తిల్లి క్రాలురా, యంచ నా మదమంద♦యాన మమరెఁ
దాలిమి రసనేవ♦పోలి ముద్దాడురా, చిలుక నా వెడఁదొక్కుఁ♦బలుకు లొప్పె
గీ. మరుఁడు శృంగారలక్ష్మిఁజి♦త్తరువు నెఱయ ♦ వ్రాసి తెమ్మెరలాయువు♦వోసినట్లు
సుందరాకృతిఁ దైశ్రిలోక్య♦సుభగ యయ్యె ♦ శైలనందన యౌవన♦సంగమమున.
సీ. శశిబింబమణిహేమ♦సౌదామనీచయో, త్కరకాంతు లన్నియు ♦ నరసి తెచ్చి
నవలతాపుష్పప♦ల్లవబిసకోమలు, విభవంబు లన్నియు ♦ వెదకి తెచ్చి
కర్పూరచందన♦కాశ్మీరమృగమదా, మోదంబు లన్నియు ♦ మంచి తెచ్చి
పరివాదినీశుక♦పరపుష్టమనుకరా, రావంబు లన్నియు ♦ రాచి తెచ్చి

ఆ. హావభావరూపలావణ్యసారముల్, త్రిభువనముల నేర్చి • తెచ్చి నేర్పు
రూపఁ దలఁచి యాఁడు•రూపఁ జాఁ డొనరించె, నని నుతింప నొప్పు • నగతనూజ

కుమారసంభవము, ఆ 3, పద్య 288, 317, 321.

శా. ఆలీలాస్యసదృఙ్మరీచిదివిజా•హారప్రవాహోదక
ల్లోలాసీకమపోలెఁ బొల్పెసఁగ నా•లోలాతిరమ్యాళిక
భ్రూలీలాస్యాంచితమైనపార్వతి ముఖాం•భోజంబు నేణాంకిత
ప్రాలేయద్యుతిమండలంబునుపమిం•పం బోయి శంకించెదన్. 576

కుమారసంభవము, ఆ 8 పద్య 10.

సీ. మదనవశీకార•మంత్రదేవతదృష్టి, గోచరమూర్తిగై•కొనియె నాఁగ
సితకరబింబని•స్సృతసుధాధారని, తంబినీరూపంబుఁ•దాల్చె నాఁగ
విధికామినీచేష్ట•విజ్ఞానపరసీమ, విధిగండరింపంగ•వెలసె నాఁగ
శృంగారనవరస•శ్రీవిలాసోన్నతి, సుందరాకారంబు•నొందె నాఁగ
ఆ. కాక యొకవధూటి•కడుపునఁబుట్టిన, భామ కేల నిట్టి•రామణీయ
కంబు గలుగుననుచుఁ•గన్నియపైమహీ, పాలసుతుఁడుదృష్టి•పఱపెనర్థి. 577

విజయసేనము, ఆ 2.

సీ. లక్ష్మీహస్తములకు•లాంఛనం బబ్జంబు, హస్తంబ యబ్జమీ•యబ్జముఖికి
సిరి పురాతనుఁడైన•పురుషుని మును బొందెఁ, జెలువునిఁ బొందదీ•చిగురుఁబోఁడి
జనులకు నిందిరా•సతిపాదచూపదీ, పద్మాక్షి కన్నుల•పండువయ్యె
నింతప్రియంబని•యొఱుఁగము కమలకీ, నాతికి నెలజవ్వ•నంబు మించెఁ
గీ. గాన నీలక్షణంబులు•గమలనిలయు, లక్షణములకుఁ గడు నగ్గ•లంబు లిట్టి
వనితకన్న మనంబు నె•వ్వానిఁదగిలె, నతఁడె కాఁడె మన్మథునకు•నసుగలంబు.

దశకుమారచరిత్రము, ఆ 10 పద్య 29.

—• ద్వి ప ద. •—

పొలుఁగుఁదీఁగెలువోలు• మేనులునలుపు, గిరికొన్నయలినీ•కేశపాశములు
తరుణేందునుపమింపఁ•దగు లలాటములుఁ, గరివంకబొమలును•గ్రాలుకన్గవయు
సుధలొల్కుపల్కులు•సుషుమదంతములు, మధురాధరంబులు•కుందహాసములు
చంద్రబింబమునొప్పు•సరకుఁగాఁగొనక, ... ... ...
తమ్మిసెత్తావుల•తలఁగింపఁజాలు, కమ్మనియూర్పులు•కంబుకంఠములుఁ
బసిఁడిమించులనొప్పు•బాహుమూలములు, కిసలయంబులనవ్వు•కెంగేలుగవయుఁ

... ... ... ... ... ... ...

రంగనాథరామాయణము, కాం. ఏక. ఉత్తర.

సీ. చైతన్య మొందిన ♦ చక్కనిచిత్రంబు
చిఱునవ్వు మరగిన ♦ చిగురుబొమ్మ
నడుపాడ నేర్చిన ♦ నవకంపుననుఁదీగ
మురిపెంబుఁ బూనిన ♦ విరులయొత్తు
వంకవాఱఁగఁ బెట్టి ♦ వచ్చిన క్రొన్నెల
పలుక నభ్యసించిన ♦ పసిఁడిప్రతిమ
విలుకాడు వడసిన ♦ తొలుకాఱు మెఱుఁగక్కిఁ
గైసేసి తోఁచిన ♦ కామునలుఁగు
గీ. నాఁగ నభిరామమగు నెల ♦ నాఁగయొకతె
మానవాంగన సదృశంబు ♦ గానిరూపు
శుభిమ గలయది నానుష్టి ♦ మందిరమున
కేకరము వచ్చియుండఁగ ♦ నేనుగంటి.

కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 80.

ఉ. ఆమదిరాక్షి రూపవిభ ♦ వాతిశయంబుల దృష్టి సోఁకినన్
సోముని నైన వేఱొక ♦ సోముఁడు నామని నైన వేఱొకొ
కాముని కమ్మతెమ్మెరల ♦ నైనను వేఱొక కమ్మతెమ్మెరల్
కాముని నైన వేఱొక ♦ కాముఁడు నేచుదు రేమి చెప్పుదున్. 581

మ. వనితారత్నము నాసికాపదభుజ ♦ ద్వంద్వశ్రీవోలంకృతుల్
వనజామోదపుటూర్పు లంచనడుపుల్ ♦ వాణీద్యుతుల్ కాతలో
చనపార్శ్వంబులు దృష్టిదోషమున ర♦కుల్ నాకుఁ జూడంగఁ ద
ద్ఘనముక్తావళి యందియల్ వలయముల్ ♦ కల్యాణతాటంకముల్. 582

,, ,, ఆ 4 పద్య 130, 131.

చ. పదములు చారుపద్మములు ♦ భాసురకంఠములొప్పు శంఖముల్
గదములు కుందము ల్కుచభ ♦ రంబులు నీలము లట్టుగాన స
మ్మదమునఁ గాంతలై నిధులు ♦ మానుగనున్నవియైన నాపురిన్
సుదతుల తుచ్ఛవస్త్యములఁ ♦ జొచ్చినలేములు వాయ వెన్నఁడున్. 583

భాస్కరరామాయణము, బాల. పద్య 34.

సీ. విదియచందురుఁడైన ♦ వెలఁదినెమ్మోమునఁ, గవిసిన సంపూర్ణ ♦ కాంతినడఁగుం
వడఁగాలియైన న♦ప్పుడఁతియూర్పులచెంతఁ, బరఁగిన మలయాద్రి♦ పవనుఁబోలు
నవకసమయిరులైన ♦ నయ్యింతిచిఱునవ్వు, సొలపునవెన్నెల ♦ చెలువుఁ బూను
నలరియేఋతువుల ♦ నెలమినాసతి మేలి, పరిభఁగన్న వనములు ♦ పల్లవించు
గీ. బట్టబయలైన నాసిత ♦ పద్మనేత్రి. కన్నుఁగవయొప్పు జిగిసొంపు ♦ గడలుకొనిన
విమలకమలషండంబుల♦విధముఁ బొందు, నెంగుపరివోల్పఁగలరయ♦య్యిందుముఖికి.

„ అరణ్య. పద్య 278.

సీ. సరసిజసౌందర్య ♦ సదనంబు వదనంబు, చారుసుధారస ♦ స్రావి మోవి
పరిభూత బిసపద్మ ♦ భాతులు చేతులు, కదళికాయుగళంబు ♦ గడలు తొడలు
ముహురుదంచితకాంతి ♦ ముచములు ......, భూరిసువర్ణవి♦స్ఫూర్తి మూర్తి
చతురవిలోకనా ♦ సాధ్యంబు మధ్యంబు, తీపారుకందర్పు ♦ తూపు చూపు
గీ. లోలభావ సూచనములు ♦ లోచనములు, ధర్మపతిమతియభిమాన♦ధనము మనము
కాన యీసతి కెనయగు ♦ మానవతులు, సారెదె మూఁడుజగంబులఁ♦జూడఁగలరె.

నుంద. పద్య 153.

సీ. తొడవులూడ్చినదైనఁ ♦ దొయ్యలిరూపుతోఁ, జిన్నవోయినపట్ల ♦ చెన్ను మీఱు
సిరులుప్పచ్చినదైన ♦ వెలఁదిపెన్నెఱితాళిఁ, బాయనిజవ్యాది ♦ బయలు మెఱయుఁ
బూఁతరాల్చినదైనఁ ♦ బొలఁతుకమైచాయ, గప్పుసెనవచ్చిన ♦ క్రమముఁ దెలుపు
మడుఁగుమాసినదైన ♦ మగువపైయుందుసో, యగముజూపఱచిత్ర ♦ మాఁకగొలుపు
గీ. మురిపముల నుజ్జగించిన♦ముగుదనడుపు, గలికిచూపుల పీడ్వోన్న♦కన్నుఁగవయుఁ
జెఱునగవు నోసరించిన ♦ చిగురుమోవి, నింతిమఱిభీతి తెలుపీడు♦ టెఱుకసేయు.

ఉత్తరహరివంశము, ఆ 1 పద్య 57.

గీ. రాజబింబంబునందు సా♦రము హరించి, చేసినాఁడు విధాత యా♦చెలువమోము
నడిమిరంధ్రంబునందుఁ గా♦నంగవచ్చు, ఖనిఖనీలిమయది నిద♦ర్శనము గాదె.
సీ. జగము లొక్కుమ్మడి♦సాధింప నెత్తిన, రతిమన్మథుల విండ్లు♦రమణి బొమలు
కాంతి నిర్ఘగ మీఁదు♦కామయౌవనముల, కుంభప్లవము లింతి ♦ ......
నడుమింత యని కేలఁ♦దొడికి పట్టిన ధాత, యంగుళిరేఖ ల♦బ్జాస్యవళులు
యుంచ మనో మృగరాజిఁ ♦ దవిలింపఁ దీర్చిన, మదనవాగుర లిందు♦వదన కురులు
తే. బాల్యతారుణ్యసీమాని♦భాగమునకు, నజుఁడు వ్రాసినరేఖ త♦న్వంగియారు
భానువరమునఁ బడసిన♦పంకజముల, యపర జన్మంబు పూఁబోఁడి♦యడుగులధిప.

శృంగారనైషధము, ఆ 2 పద్య 13–15.

ఉ. పచ్చనివృక్షవాటికల • పండ్ల భిక్ష భుజించి నిచ్చలున్
వచ్చి పఠింపఁబోలుఁ బ్రతి•వారముఁ గోయిల బ్రహ్మచారి పెం
ఱచ్చపడంగ నీసరసి•జాక్షి ముఖద్విజరాజునొద్ద నా
పిచ్చి లసత్ప్రసూనశర•వేదరహస్యము లైనపల్కులన్.
గీ. కలువ సన్నంబుగా దీని•నడుము గిసి, యాసనమునకు నిచ్చె నా•యంశ మెల్ల
నదియుఁ బాదాననముగఁ గదా•యిది సృజించె, నున్నతములైనయేతత్ప•యోధరములు.
,, ,, ,, ఆ 3 పద్య 177-191.

శా. పొచ్చెంబింతయు లేక హంసనడతోఁ • బాలొప్పు లేనవ్వుతోఁ
ఒచ్చల్లాపినకుల్కుముంగరులతో • బాగైనకెమ్మోవితో
నచ్చంబైనమునుంగుఁ బెట్టిచెలితో • నాదూటలే చెప్పుచున్
వచ్చెన్ బో............•వామాక్షి తా నీళ్ళకున్. 583
వీథినాటకము, పద్య 40.

సీ. పల్లవవైభవా•స్పదములు పదములు, కనకరంభాతిర•స్కారు లూరు
లరుణప్రభామనో•హరములు కరములు, కంబుసౌందర్యముం•గళము గళము
మహితభావాభావ•మధ్యంబు మధ్యంబు, చక్షురుత్సవదాయి • .........
పరిహాసితార్ధేందు•పటలంబు నిటలంబు, జితమత్తమధుకర•శ్రేణి వేణి
ఆ. భావజాశుగముల•పాల్పులు చూపులు, కుసుమశరుని వింటి•కొమలు బొమలు
చిత్తతోషణములు•చెలువభాషణములు, జలజనయనముఖము • చంద్రసఖము. 590
భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 1711.

సీ. సాంద్రశరచ్చంద్ర•చంద్రికాస్ఫూర్తిచే, రాజిల్లు పూర్ణిమా•రజనివోలెఁ
బూర్ణేందుబింబావ•తీర్ణమై యిలమీఁద, భాసిల్లుహరిణీడిం•భంబువోలె
సులలితమేఘమం•డలమును నెడఁబాసి, వసుధఁ గ్రుమ్మరు తటి•ద్వల్లివోలె
మాణిక్యరచిత స•న్మహితచైతన్యంబు, వొందిన పుత్తడి•బొమ్మవోలె
గీ. లలిత విభ్రమరుచికళా•లక్షణములఁ, బొసఁగ రూపైన శృంగార•రసమువోలె
నర్థిఁ జరియించుచున్న ప•ద్మాయతాక్షిఁ, బ్రకటసద్గుణభద్ర సు•భద్రఁ జూచి.
,, ,, ,, స్కం 10 ఉత్తర పద్య 1173.

ఉ. సోమునిఁ దోడు తెచ్చుకొని • నుక్కుక చిల్కలు తేంట్లు గొల్వఁగాఁ
గాముఁడు విల్లు నమ్ములు న•ఖండతఁ బట్టినయట్లు దోఁచు నా
భామమ ఖాబ్జరేఖయును • బల్కును గొప్పును భ్రూ వపాంగమున్

గాముని నీవు చంపు టది ◆ కల్లనిపించె శశాంకశేఖరా. 593

వీరభద్రవిజయము. ఆ 3 పద్య 64.

గీ. ఒప్పులేయేతి మాటలే ◆ కుండ బ్రహ్మ, యంగకంబులు చేసెనం ◆ చాత్మ మెచ్చి
యవయవశ్రీలు గనుంగొను ◆ నట్టియుచ్చ, దరుణికన్నులు తలమట్టు ◆ తిరిగి వచ్చె. 594

విక్రమార్కచరిత్రము, ఆ 6 పద్య 48.

సీ. బంగారుతలుపులు ◆ పాయంగ దట్టించి
లావణ్యవిత్తమే ◆ లావ్రియించె
లావణ్యవిత్తమే ◆ లావ్రియించును గాక
యతిమాత్రమే లాప్రి ◆ యాసపడియె
నతిమాత్రమాయాస ◆ మనుభవించును గాక
విటజనంబుల నేల ◆ వెడ్డు కొలిపె
విటజనంబుల కారె ◆ వేరంబు సేయంగా
నేల నిర్మింపండో ◆ యీనయము మగని
గీ. సొమ్ము పోక మహాప్రయా ◆ సమ్ము రాక
ప్రజలబాధ విరక్తకా ◆ రంభణంబు
కలిమి సిద్ధింప నేమిగాం ◆ దలంచు నొక్క
సరసిజాసనుం డీతలో ◆ దరి సృజించి.

క్రీడాభిరామము, పద్య 287.

సీ. కమలమొక్కట నల్ల ◆ కల్వలు రెంట భృం, గములు పెక్కింట శం ◆ ఖము నొకంట
బిసకాండములు రెంటం ◆ బసిండిమండలు రెంట, నొప్పార సృజియించె ◆ నొక్కసగము
ఘనరథాంగద్వంద్వ ◆ కంబునం గమనీయ, రంభామృదుస్తంభ ◆ రాజయుగ్మ
కమున మన్మథశరం ◆ గారద్వయంబునం, బల్లవయుగమునం ◆ బరంగం జేసె.
ఆ. నొక్కసగము రెండు ◆ నొగిం బొందుపడం గూర్చి, పిడికిలించిపట్టి ◆ నడుముం జేసె
నజుండు నాంగ నింతి ◆ యవయవోత్పాదన, లీలం దెల్పు నవ్వ ◆ చిత్రియంబు 598

భోజరాజీయము, ఆ 7 పద్య 148.

ద్విపద.

మఱి చూడరమ్మ యమ్మా ◆ మానినీమణిని, దొగవుచ్చనద్దంబుం ◆ దెగడెడు మోము
జాతినీలపురంగు ◆ జడిపించు కురులు, లేంతచందురుం బిసా ◆ ళించు నెన్నుదురు

మదచకోరములతో ♦ మలయు నేత్రములు, గొదమతేళ్ళకు సిగ్గు ♦ గొలిపెడిమాఁపు
విరులవిండ్లకునమ్ము ♦ వేసిన బొమలు, సరసచంపకము మె ♦ చ్చని నాసికంబుఁ
దెలిమొల్లమొగ్గలఁ ♦ దెగడు పల్వరుస, పులకండమొలికెడు ♦ బొమ్మంచుమోవి
చీకటి విరియించు ♦ చిఱునవ్వు పసిఁడి, రేకులతో నెది ♦ రించు చెక్కులు

... ... ... ... ...

కెందామరలఁ జేవ ♦ గించుపాదములు, సుందరి గాదిది సొబగురాయంచ
యంచ గాదిది నడ ♦ పాలు క్రొమ్మించు, మించు గాదిది రాచ ♦ మెచ్చుల ప్రతిమ
ప్రతిమ గాదిది వచ్చి ♦ పగడంపులతిక, లతిక గాదిది నవ ♦ లావణ్యసరసి
సరసి గాదిది పువ్వు ♦ చాఁపనిశరము, శరము గాదిది రతి ♦ సవరించు చిలుక
చిలుక గాదిది విక ♦ సించు చెంగల్వ, కలువ గాదిది చంద్ర ♦ కళవంటి చెలువ. 599

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భాగ. 2.

చ. కనుఁగవఁ దన్నుఁ గెల్వఁగన్ ♦ గం బల నూఁకున కిందుఁ రేఁడు నే,
నని రుచిదక్కఁ దత్పరిషళా ♦ ధ్యత లేమి నతండు గొంకఁ దా,
నినుపఁ జన న్మగం దఃదు ♦ వెత్తులఁ బొట్టిదుకొంటకాక వా,
ననక యనన్ మృగం బమరుఁ ♦ జామకు ఫాలము పచ్చికస్తురిన్.

శా. వాసా చంపకత న్సుగంధ మదటన్ ♦ రా భృంగముల్ గ్రోల సం,
త్రాసం బందియుఁ బల్కుచో నలము వ ♦ క్త్రం బేల నా నేల యం,
దే పారభ్యము లేదు కుందములుగా ♦ వే దంతము ల్గానిరాఁ,
డాపక్తిన్ బ్రతిబింబ దంభమున నే ♦ లా వ్రాలఁ దజ్జాలికిన్.

ఆముక్తమాల్యద, ఆ 5 పద్య 12, 16.

చ. కలితసుధారసంబు తొలఁ ♦ కన్ సరసప్రియభాషణంబులన్
బలికిన శీతకాలమగుఁ ♦ బల్లవపాదము రెత్తి లీలమై
మెలఁగ వసంతకాలమగు ♦ మించుగ నుంగవఁ జాఁజూచినన్
దలకొను కాలుకాలమగుఁ ♦ దన్విలాసము చిత్రమెన్నఁగన్. 600

రాజశేఖరచరిత్రము, ఆ 2 పద్య 72.

సీ. అవనిపై నుండుగా ♦ కనఁటికంబము లెట్టు, లనఁటికంబములపై ♦ నవని నిలచె
గగనంబు గిరులపైఁ ♦ గనుపట్టుగాకెట్లు, గగనంబుపైగిరు ♦ ల్గానవచ్చె
జలధరంబులమీఁద ♦ శశియుండుఁగాకెట్లు, శశిమీఁదనున్నది ♦ జలధరంబు
నాళంబుపైఁగాక ♦ నలినకోశం బెట్లు, నలినకోశంబుపై ♦ నాళమున్న
గీ. దనుచుఁ జూపరులకు విస్మ ♦ యంబుఁ గొలుపు, ......................

లాననముగొప్పు నాభియు ♦ నారునలర, నలరె విమలాంగి నవయౌవ ♦ నాగమమున.

కవికర్ణరసాయనము, ఆ 3 పద్య 27.

సీ. కొమ్మవాతెఱతోఁ గు♦ణమ్ముగ్గైకొనవచ్చి, కలితవిద్రుమము చే♦కట్లఁ బడియెఁ
గోమలియధరంబు♦తో మొనల్పచరించి, యరుచి బింబఫలంబు♦లవిసి పడిగొ
మృగనేత్రి పెదవితో♦సాగనుఁబూవఁగడంగ, కెంపునీరసముఁ జె♦క్కించుకొనియె
పతిమోవితో తత్స♦స్థితులు చూపినుగంధ, వికలబంధూకమూ♦రకయొదిగె
గీ. డాయుపగడంబునకుఁబగ♦డంబుబింబ, మునకుబింబంబు మెఱయు కెం♦పునకు గెంపు
బంధుజీవంబునకుఁ దాన♦బంధుజీవ, మూర యీసుందరదన ర♦దాంశుకంబు 612

ఉ. ఇంతిమృదూక్తి మాధురికి♦నిక్షురసం బెనవోలఁజాలకా
ద్యంతము నోడి మధ్యమగు♦ణాశ్రియమై నెఱకాక నెన్నిజ
వ్యాంతరముల్ వహించియుఁ ద♦నంతనె ఖండములయ్యెఁ గాని యా
వంతయుఁ బూనదెంతవోడి ♦ యయ్యనఖండతదీయ సంపదన్. 613

శా. నానాసూనవితానవాసనల నా♦నందించు సారంగమే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్♦కాఁకం దపం బంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమన♦స్సౌరభ్యసంవాసమై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీ ♦ పుంజంబు లిర్వంకలన్. 614

చ. అనయము నీలకంధరము♦నభ్రమునన్న సమాఖ్యవారితో
నొనరియు నింతవేనలికి ♦ నోడియనిశ్చితరూపధేయమై
చనియె మొగుల్ నగావళికి♦శబ్దగుణంబులు నూపువారి నె
ట్టనఁబురివిచ్చువానిదరి♦డాయుజడాత్ముల కెవ్వ నిల్కడల్. 615

వసు, ఆ 2 పద్య 32—50.

ఉ. సేవరమాధురీస్పృహప♦సం బికమో శుకమో తదీయజి
హ్వావిలసత్స్వరస్వతిను♦పాసనఁజేయుచు నగ్రభూమి నిం
పావహిలంగ నేర్చి యుప♦హారముగా నిడినట్టి పల్లవం
బో విమలంపుబింబఫల♦మో యన వాతెఱ యొప్పు నింతికిన్. 620

చ. నుకవులుకిందుమీఁదఱసి♦చూడక యీడని యాడుకొన్న హా
టకకదళీవిలాస మక♦టా విపరీతము గాక సాటియే
యకలుష రామణీయక స♦మంచితకోమలతద్వధూరుల
క్ష్మకి సరిగావ యెంతతల♦కిందయినన్ గరిరాజహస్తముల్. 621

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 74, 80.

చ. కమలజుఁ డీవధూటి యలి♦కం బటు చూచి మునిద్రుమప్రసూ
నము నొనరించి పోలదని♦నవ్వుచుఁ జెట్లను గట్టి కొన్నికాలం
గ్రమమునఁ జేసిన వ్రతు♦రామికి రోసి నవోఢురాజునుం
దమకముతోడ నాకసము♦నవ్వడిఁ బాఱఁగ వైచె సిగ్గునన్. 625

చిత్రభారతము, ఆ 3 పద్య 68.

సీ. కమలంబు నెమ్మోము♦గాకున్న వీక్షణ,భృంగపంక్తులు సారె♦పెనచు టెట్లు
ఘనఘనాఘనపాళి ♦ పెనుగొప్పు గాకున్న, శృంగారరసము వ♦ర్షించు టెట్లు
సౌదామినీలత ♦ మైదీవ గాకున్న, కనుఁగవ మిఱుమిట్లు ♦ గొనుట యెట్లు
సుధమీఁది మీఁగడ ♦ యధరంబు గాకున్న, కోరినయపుడు నో♦రూరు టెట్లు
గీ. గగన మతిసూక్ష్మమైనది♦కటికి కాను, గాకయుండినఁ జూచినఁ ♦ గానరాద
యింతి చెలువంబు చెలియంగ♦నింత యరుచు, వస్తువలు సేయ నలువకు♦వశము గాదు.

చారుచంద్రోదయము.

ద్విపద నీలంపురంగులో♦నికరంపుఁగప్పు, బాలేందులోపలి♦పస పట్టు నొసలు
వలరాజువిండ్ల జీ♦వాళిను ల్బొమలు, కలువలలోని చొ♦క్కములు నేత్రములు
మొలకగు కెంపులలోని♦మిసిమిపల్వరుస, చలువవెన్నెలలోని♦చిక్కన నవ్వు
పసిఁడిసంపంగిలో♦పలితావి నాస, రసముల చిగురుసొ♦రమ్ము కెమ్మోవి
శ్రీకారములలోని ♦ చెల్వులు వీను, లాకుజనమిలి మో♦హనము నెమ్మోము
ఒనపరిసంకున♦ముసురు కంఠంబు, పసిఁడితీవల మేలు♦పట్టు బాహువులు.

... ... ... ... ... ...

అష్టమహిషీకళ్యాణము, ఆ 5.

ఆ. నాన కోలగాఁగ♦భాసిల్లు భూవల్లి, విల్లుగాఁగఁ దొడిగి♦వేసినట్టి
మదమరాళగమన♦నుదురు కందర్పుని, యర్ధచంద్రబాణ♦మనఁగఁ దనరె. 631

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 6 పద్య 72.

క. తరుణివిలాసం బెన్నం, దరమే పరమేష్ఠికైనఁ♦దలపఁగఁ♦నోహో
హరిమధ్యం బఁట బంధుర, కరిగమనం బఁట, విచిత్ర♦కర మిది గాదే. 632
ఉ. ఆనలినాక్షి చూడఁ దమి♦నై కనుపట్టు విభావరీకరుం
డానవబింబ మయ్యెఁ గురు♦లయ్యె నగంధు సుధాధరాధర
శ్రీనిగిడించె నున్న తనుఁ♦జెందిన కెంపుగ్రుశత్వమెల్ల నా
హీనవమయ్యె దానిదర♦హాసము వెన్నెల గాకయుండునే,

విప్రనారాయణచరిత్రము, ఆ 2 పద్య 39, 47.

సీ. గజయానకేలు సౌ♦గంధికాహరణంబు, శృంగారతిలకంబు ♦ చెలువనుదుటి
కలకంఠి మైత్రావి ♦ కర్పూరమంజరి, కావ్యప్రకాశంబు ♦ కాంత పలుకు
మగువహాసంబు చ♦మత్కారచంద్రిక, సతిరూపలంకార ♦ సంగ్రహంబు
మీనలోచనకొప్పు♦మేఘసందేశంబు, రసకళిక మనోజ్ఞ♦రదనమోవి
గీ. యువిదమోము ప్రబోధచం♦ద్రోదయంబు, గాఁగజగములు చనువులు♦ గాగణింప
చేమి యాశ్చర్యమనిలోకు♦ లెల్లఁబొగడ, నలరు వేడుక నప్పుడున♦వ్యులఁబోఁడి
భానుమతీపరిణయము, ఆ 2 పద్య 10.

సీ. కేకికానగసిలోఁ ♦ దేలిరాకుండుటఁజేసి, శైవాలలతకొంత ♦ సాటివచ్చుఁ
బుష్పమాలికలతోఁ ♦ బొందుసల్పుటఁజేసి, రోలదేఁటిగమికొంత ♦ యీడువచ్చుఁ
గంటికింపగు రేఖ ♦ గల్గియుండుటఁజేసి, మినుకుఁగాటుకకొంత ♦ దినుసువచ్చుఁ
బిఱుఁగునొయ్యారంబు♦ మెఱయుచుండుటఁజేసి, చమరివాలము కొంత♦ సమముమచ్చుఁ
గీ. గాక నీలత్వమున సరి♦ గాగఁ దెలియ, నెటిగరిగి యొక్క మొత్తమై విడుదలై ద
శమ్ముగలై మెగ్గులై కారు ♦ కమ్ముచున్న, వికచకమలాక్షి నునుసోగ♦ వెండ్రుకలకు.
విజయవిలాసము, ఆ 1 పద్య 100.

గీ. భ్రమరకమనోహరంబౌటఁ♦బద్మ మగును, తారకాహ్వాన్యమగుట ను♦ధానిధి యగు
రెంటిజగడాలు మోమున♦నంటియుంట, నద్దముఖియంట లెస్సయా♦యువుఁబోఁడి
,, ,, ఆ 2 పద్య 105.

సీ. శుశ్రిత్యంతపరిచితి ♦ శోభిల్లె నేత్రింబు, ...గమాభ్యాసిక ♦ నమరెఁ...
లనఘపురాణవా♦సనఁజెంద మధ్యముల్, ఘనకల్పరీతులు♦ గాంచెఁ గురులు
ధర్మశాస్త్రస్థితిఁ ♦ దనరెభ్రూవిస్పష్టులు, జ్యోతిషస్ఫూర్తితో ♦ నొనరె నఖము
లమరుపాటలవర్ణ ♦ మంకించె మోవులు, కవితాపటస్ఫూర్తిఁ ♦ గనియె నడక
గీ. యలమహాహీనశయ్యాంకుఁ♦ డైనయట్టి, హరిసదాగూఢపదభూషుఁ♦ డైనహరుఁడు
సూవపాకతఁజెలఁగువా♦గ్గానియట్టి, కమల, నయనలవర్ణింపఁ♦గలరెతలఁప. 842
చమత్కారమంజరి, ఆ 1 పద్య 61.

గీ. అరుణపల్లవములఁబోలు ♦ నాపదంబు, లాపదంబులఁబోలును ♦ నలకజాత
మలకజాతముఁబోలు ని♦త్యముఖలీల, నిత్యముఖలీలఁబోలు న♦న్నెలఁతనడుము.
మ. బిగువుం ...... గాంచి మాను నలజం♦బీరంబు బీరంబు గ్రొం
జిగిమోముల్ గని సిగ్గునన్ వదలు రా♦జీవంబు జీవంబు విం
తగ భ్రూరేఖలు చూచి భీతినిడుఁ గో♦దండంబు దండంబుఁ ద
జ్జగతీమోహనము ప్రోలనున్న నెలఁతం ♦ జర్చింపఁగా శక్యమే.
,, ,, ఆ 2 పద్య 43, 90.

చూచె నాశాలకిం దన♦సొమ్ము గాఁగ, నించి వేడ్కలు దైవాఱఁ♦బంచశరుఁడు.

ధనాభిరామము, ఆ 2.

చ. కమలయుగంబుపై ననఁటి♦కంబము లాకదళీద్వయంబుపై
నమరిన సైకతంబు వెస♦ నాపులినస్థలిపై ననంతిమా
యమరపథంబుపై నగము ♦ లాకుధరంబులపై శశాంకుఁ డా
హిమకరుపై నలుల్ నిలిపె ♦ యీసతిఁ జేయఁగఁబోలు ధాత తాన్. 658

నలచరిత్రము, శిరి. ధ. ఆ 4 పద్య 155.

ద్విపద అమరేంద్రమణియొప్పు♦ననఁదగుకొప్పు, కమలారిబింబంబు♦గదుసు నెన్నుదురు
అరవిందపత్త్రము♦లట్ల నేత్రములు, మెఱుఁగుటద్దముజోడు♦ మించు చెక్కిళ్లు
కంతుశంఖంబుపొం♦కంబు కంఠంబు, ......................
చిగురుటాకులబాగు ♦ చేతులలాగు, బిగియింప సాధ్యంబు ♦ పేదమధ్యంబు
స్ఫుటసైకతనిభంబు ♦ శ్రోణితలంబు, పటుతరకదళికా ♦ ప్రభనొప్పుతొడలు
తలిరులచొప్పు పా♦దంబులయొప్పు. కలహంసనడలు చ♦క్కని నాతినడలు
నింగితళుక్కున ♦ నెగయు మెఱుంగొ, బంగారుబొమ్మయో ♦ పగడంపులతికొ
కలికి రాచిలుకయో ♦ కాయజు శరమొ, యలరులబంతియో♦యాణిముత్తియమొ.

... ... ... ... ... ...

నలచరిత్రము, చ. రా: చతు. భాగ.

సీ. దీపితకనకసం♦దేహంబు దేహంబు, పచ్చకర్పూరంపుఁ♦బలుకు పలుకు
పల్లవసంపదా♦స్పదములు పదములు, శోభితావర్త న♦నాభి నాభి
కుంభికలకంఠ♦కంఠంబు కంఠంబు, ముకురవిడంబాధి♦ముఖము ముఖము
సరసిజవైభవా♦కరములు కరములు, విజితనీలోరగ♦వేణి వేణి
గీ. నడుము లేఁటికి నెప్పుడు♦నట్టినడుము, లోచనములు కర్ణాంతరా♦లోచనములు
......................., నట్టి రూపంబు రూపింప♦నరిది గాదె.

ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 1.

ఉ. సారము ముద్దుఁబల్కు ఘన♦సారము నిద్దపుమేనితావి కా
సారము నాభిరంధ్రము ర♦సారము తేట మిటారి చూపు శ్రీ
కారము కర్ణయుగ్మము చొ♦కారము నవ్వు మొగంబు షట్పదా
కారము కొప్పు నన్మృగవి♦కారము మోవి వధూలలామకున్. 660

రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 2 పద్య 9.

సీ. తళుకులేమావి కొ♦త్త జవాది బలుకోవి, వలపులదీవి చెం♦గలువబావి
ముగుదలమేల్బంతి ♦ సొగసులదొంతి కొం♦, బొగడపూబంతి యా♦బ్బురపుటింతి

మానికమ్ముఁ మూట ◆ మరుని గెల్పులకోట, పండువెన్నెల తేట ◆ పసిఁడివేఁట
కపురంపుదిమ్మ చొ◆క్కపుఁదన్క కీల్బొమ్మ, మొల్లంపుఁదానిమ్మ◆ ముద్దుగుమ్మ
గీ. తేజులకొటారు వలపుదము◆ప్రియపుఁ బేరు, కడిఁదిజగరంగు తొలకరి◆కార్మెఱుంగు
మనుపికిలిచెండు పరువంపుఁ ◆ జనసుపండు, నాఁగఁ దగు నెన్న నన్నయా◆న్నా
తిమిన్న. 662

అచ్చతెలుఁగు రామాయణము, బాల- పద్య 135.

సీ. కలకంఠి జఘనంబు ◆ కాంచికాస్థానంబు, మధురామృతస్థలి ◆ మగువమోవి
యన్నులమిన్న పా◆దాగ్రంబు కూర్మంబు, పడఁతుక జిల్గు నె◆న్నడుము మాయ
నీలజీమూతంబు ◆ నెలఁతధమ్మిల్లంబు, రాకేందుముఖి రోమ◆రాజి కాళి
నలినలోచన నిమ్న◆నాభి కేదారంబు, ............ శ్రీ◆సర్వతంబు
గీ. గాఁగ నృపనందనను శ్రే◆కరిను నెపుడు, జెలఁగుచున్నది దాని భ◆జింపఁగలుగు
పరమపురుషున కత్యంత◆భాసమాన, నిరుపమానందసంసిద్ధి ◆ దొరకకున్నె. 663

రసికజనమనోభిరామము, ఆ 2 పద్య 78.

క. పదమా పొక్కిలి జాంబూ, నదమా మెయిచాయ కోక◆నదమా పదమా
పదమా జడ నడుము వియ,త్పదమా నూఁగారు గూఢ◆పదమా చెలికిన్. 664

,, ,, ఆ 3 పద్య 68.

సీ. కనకకుంభము లెంత◆కాఁక చేఁ బెరిఁగిన, దరము లేతెఱఁగున◆మొరయుచున్నఁ
గరటికేలెంత వం◆కరగా మెలంగినఁ, గడుజక్కులము లెంత◆యుడుకుచున్న
భుజగంబు లేరీతిఁ ◆ బొరలూని పొరలిన, మృగకులాధిపుఁ డెంత◆యొగిరిపడినఁ
గలికితేంట్లెంత ఝం◆కారంబు చూపిన, మీ లెంత పొలనెక్కి ◆ మిట్టిపడిన
గీ. నారయికొక్కవ ...కంఠ◆గౌరుకర్ణ, రోమవల్లీవలగ్న శి◆రోజనయన
ముల నెదురొక్కని యొక్కంత ◆ గెలువఁగలవె, మనునికొంబున్నవములకి య◆
య్యారికలికి, 665

సత్యపురమాహాత్మ్యము, ఆ 2 పద్య 42.

గీ. కలికి పదియాఱువన్నెబం◆గరుసలాక, గావలయు నద్దిరా యట్లు◆ గాక యున్న
నఖిలసంగపరిత్యాగు ◆ లైనయతుల, డెందముల కైన నాస పు◆ట్టింపఁగలఁడె 667

శివలీలావిలాసము, ఆ 1 పద్య 91.

ద్విపద. కలికివేసలి కైన◆ గాక మొగిళ్లు, పలవెలఁబాఱుచు ◆ పిడిమలల్ వట్టె
ముద్దియ నిద్దంపు◆ముద్దునెమ్మొగము, నుద్దివోలక మెచ్చ ◆ యూనె జాబిల్లి
వనఁబోఁడి హొమల యం◆దముఁ గనలేక, తునియలై మరువిండ్లు◆ ఘూళి నణంగె

కలికి బేడిస లింతి♦కన్నులు నూచి, కలఁగి రెప్పలు మోడ్పఁ♦ గానక యుండెఁ
నాళీకదళ నేత్రి♦ నాసకు నోడి, పీలి సంపఁగిమొగ్గ♦ విప్పఁదొడంగె
తొనకంటి చెక్కుల♦తోఁ దీటు గామి, రవళి నద్దములు ర♦రాపులఁ బడియె
పడఁతి వీనుల చెల్వుఁ♦ బడ నుంగరామి, నుడుగకెంతయు వ్రేఁగ♦చుండె శష్కులులు
తెలుపు మెఱుంగు వా♦తెఱ జోడుగాక, తటిదప్పి చిగురులెం♦తయు గాఁచువాఱె
ముగుద కొంజిగి కంఠ♦ములకుఁ గ్రిందగుట, మగఱాలు తాగ్రసంబు♦ మానక పూనె
సుదురాజముఖి యుర్తి♦ కున్నతి గాలేక, సుడిపడి మొరసేయఁ♦ జొచ్చె చిందంబు
అతివ బాహువ్రలకు♦ నలచేతుఁ గుసుమ, బ్రతిగాక మధువ్రులం♦ బడె బిసాంబుజము

... ... ... ... ... ...

సారంగధరచరిత్రము, కూ తి. ఆ 1.

గీ. కమలముఖ్యాంతి ముగ్ధమో♦గంబుఁ దోడ తె. గెలువఁజాలక రేకెత్తి ♦ దళములెల్ల
విచ్చుటయు నీరజంబయి♦ పిచ్చలించి, తరుణియడుగులు పట్టుక♦తిరల కుండె.

సుభద్రాపరిణయము, ఆ 2 పద్య 15.

సీ. కస్తూరినెత్తావి ♦ కలువపుష్పంబు నించి, మెఱయు కల్వలను నె♦మ్మేను జేసి
నిండుచందురుకాంతిఁ ♦ బిండి తమ్మినినించి, కమలంబు చేత మె♦గంబుఁ జేసి

... ... ... ... ... ...

పగడాలడాలు కెం♦జిగురుటాకుల నించి, తళుకుల చేతఁ బా♦దములఁ జేసి

గీ. హస్తకుశలత మెఱయ న♦య్యబ్జభవుఁడు, బూని కావించె నేమొ యా♦పూర్వసృష్టి
కాకయుండిన నిటువంటి ♦ కన్యగలదె, యలయుపలుతుని చికటూరి ♦ యామినీటూరి.

కార్తికమాహాత్మ్యము, ఆ 3.

చ. కమలదళాక్షి హస్తములు ♦ గన్గొనఁ జిగ్మని క్రొనుదీవి పో
ణిమిఁబరికింప శంఖినియె ♦ నెన్నడ హస్తిని యౌఁ బరేంగిత
క్రియమరయంగఁ జిత్తినియె ♦ కాఁకటు పల్కులు వేయు నేటికిన్
బ్రిమద మెసంగ సిక్కలికి ♦ పక్కన సర్వని జాతు లేర్పడున్. 673

సీ. ఇది మనోహరకాంతి ♦ కింపైన బింబంబు, బింబంబు గాదిది ♦ పెడగు కెంపు
కెంపుగాదిది తేఁటి ♦ గొంపని మంకెన, మంకెన గాదిది ♦ మంచి చిగురు
చిగురు గాదిది వింత♦జిగి హెచ్చు పగడంబు, పగడంబు గాదిది ♦ పానకంబు
పానకంబిది గాదు ♦ పలుచని చెఱకుపాల్, చెఱకుపాలిది గాదు ♦ కురుజు తేనె

గీ. కురుజుతేనెయు గాదిది ♦ కుసుమరసము, కుసుమరసము నుగాదిది ♦ గొనబుజుమ్ము

ఱున్నగా దిది చవిఁగుల్కు ♦ సుధలదీవి, సుధలదీవియుఁ గాదిది ♦ సుదతిమోవి

తారాశశాంకవిజయము, ఆ 3 పద్య 38, 43.

ఉ. సింగము లెన్న వీరలకు ♦ సిద్ధముగా మొలబంటి మత్తమా
తంగశిరస్స్థలంబులు ప♦దంపడి బొమ్మలజంటి యంచు సా
రంగచయంబులెల్లను స♦రాసరిగా నెదిరింపలేక మా
వంగడపున్వధూమణుల ♦ వాలికచూపులకున్ భయంపడున్. 676.

శకుంతలాపరిణయము, రే వేం. ఆ 1.

సీ. మగువ యానముఁ జూడ ♦ మత్తేభక్రీడ, సఖి నాసమహిమంబు ♦ చంపకంబు
కలికి కన్నులలీల ♦ తలఁప నుత్పలమాల, పొలఁతి సత్కటి వృద్ధి ♦ వాసరఁగఁ బృథ్వి
జలజాక్షి కర్ణముల్ ♦ చెలఁగు శ్రీవృత్తముల్, కొమ్మకంఠము మత్త ♦ కోకిలంబు
చాన నూఁగారు భు♦జంగప్రయాతంబు, వనిత యొప్పులకుప్ప ♦ వనమయూర
గీ. మార యంగన సొంపుచే♦నలరువృత్తి, పటిమఁ గాంచి మనోహర♦ప్రతిభ మించె
సత్ప్రబంధముగతిని రా♦జ్యమున జెలఁగెఁ, జిత్తజునిధాటి పరమనా♦చీవధూటి.

సీ. ధరణీవిలాసమై ♦ పాపిష్ఠ చెలువొందెఁ, గడుఁ బునర్వసురూఢిఁ ♦ గాంచె మేను
కనదపూర్వాషాఢ ♦ ఘనతఁ గాంచెఁ గచంబు, చిత్రిసత్కళలచేఁ ♦ జెలఁగె మోము
ధరణి జ్యేష్ఠాకృతిఁ ♦ దాల్చెను గటిసీమ, శ్రవణసంగతిని నే♦త్రములు ప్రబలె
నమ్మూలార్ద్రకఖ్యాతి ♦ నలరెను గమ్మోవి, భాషితాశ్లేషయై ♦ భాష మెఱసె
గీ: శేషనక్షత్రములు నాఖి♦జిహ్వలయి, పద్మపత్రాక్షినఖములై ♦ పరిఢవిల్లె
ననుచు సిద్ధాంతవేత్తలు ♦ వినుతిసేయఁ, జెలఁగె శుభనామ పరమనా♦చీలలామ.

ఒడయనంబివిలాసము, ఆ 1 పద్య 106, 109.

సీ. నలినాక్షికొప్పు కృ♦ష్ణత్వంబుఁ బ్రాపించు, నెమ్మోము విధురీతి ♦ నివ్వటిల్లు
నబ్జాస్యకన్ను ల♦బ్జాక్షతవహియించు, నధరంబు మాధవ♦ఖ్యాతి నమరు
నలివేణి ..... ♦యాదృత్త్వముఁ గాంచుఁ, జేయి పద్మాహిత♦స్థితి భజించుఁ
గరియాననూఁగారు♦హరిలీల భరియించుఁ, గౌ ననంతవిభూతి♦గరిమఁ దాల్చు
గీ. నాభి పురుషోత్తమాకృతిఁ♦బ్రాభవిల్లుఁ, దనువు హేమాంశుకస్ఫూర్తిఁ♦దనరునిట్లు
భామ యవయవగతి విష్ణు♦భావ మొంది, వెలయుచుండు జనావళి♦వినుతిసేయ.

బిల్హణీయము, 1 పద్య 50.

సీ సారంగమదహారి ♦ సంపన్నత వహించు, ఘనసారసచ్ఛాయ ♦ కడు రహించు
సారంగమదహారి ♦ సంపన్నత వహించు, ఘనసారసచ్ఛాయ ♦ కడు రహించు
సారంగమదహారి ♦ సంపన్నత వహించు, ఘనసారసచ్ఛాయ ♦ కడు రహించు

సారంగమదహారి ♦ సంపన్నత వహించు, ఘనసారసచ్ఛాయ ♦ కడు రహించు
గీ. బాలికామణి తనుమధ్య ♦ నీలచికుర, చారుదీర్ఘవిలోచన ♦ సరసహసన
తరుణమోహనమూర్తి సౌం♦దర్యవదన, నవ్యసౌరభ సురుచిర ♦ నఖరలీల.

కవిరాజమనోరంజనము, ఆ 3.

సీ. ఉవిద నీకొప్పు నీ♦లోత్పలంబులగుంపు, భామ నీకన్నులు ♦ పంకజములు
లలన నీనాస తి♦లప్రసూనము మధు,కములు నీచెక్కు ♦ ల్కమలగంధ
తెలుప నీముద్దువా♦తెలు పాటలము మల్లె, మొగ్గలు నీదంత♦ములు వనజాక్షి
చెలఁదినీ ......... ♦ విరిచెండ్లు బంధూక,ములు నీకరంబులు ♦ ముద్దుగుమ్మ
గీ. నెలఁత నీమేను సంపెంగ ♦ నీపదములు,హల్లకము లింతి సమనో♦లతాంగి నిన్ను
బుష్పశరుమిచేత నిర్మించె♦బో విధాత, ....................

,, ,, ఆ 5.

సీ. క్రొమ్మించుతీవయో ♦ క్రొమ్మించుతీవకు, నిశ్చలాంగద్యుతి ♦ నెనయు టెట్లు
జాళువాబొమ్మయో ♦ జాళువాబొమ్మకు, మేనఁ జల్లనితావి ♦ మెలఁగు టెట్లు
మందారవల్లియో ♦ మందారవల్లికి, మందయానంబు పెం♦పొందు టెట్లు
మరుఁడెక్కు దంతియో ♦ మరుఁడెక్కుదంతికిఁ, బలువాక్యనైపుణు♦ల్గలుగు టెట్లు
గీ. లౌర యీనారి చారుశృం♦గారభంగి, బళిరె యీచాన సౌందర్య♦విలసనంబు
లహహ యీబోటి బిబ్బోక♦హావగరిమ, మనముఁ గొందలపఱ్చించి♦రనుపమోక్తి.

చంద్రికాపరిణయము, ఆ 5 పద్య 37.

సీ. వర్షాభ్రలక్ష్మియో ♦ వనిత సముల్లస,ద్ధారాపయోధరో♦దయముఁ జెందెఁ
గురురాజబుద్ధియో ♦ కోమలి కర్ణవి,శ్రాంతదృగంతవి♦భ్రాంతి నలరె
వింధ్యభూమూర్తియో ♦ వెలఁది తుంగశ్యామ,ల... సౌభాగ్యలీ♦లలఁ జెలంగె
వానరసేనయో ♦ మానిని సుగ్రీవ,నీలాంగదాప్తి రా♦జించి యుండె
గీ. గురుకటిద్వయములోహి తా♦ధరము వికచ,లోచనోత్పలములు జంద్ర♦రోచమాన
హాసమును మందగతిభాస్వ ♦ దంఘ్రియుగళి, సౌమ్యతయుఁ గాంచె గ్రహసమ♦స్యయొ లతాంగి.

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 1 పద్య 275.

సీ. నవ్యాబ్జకళ లీను♦నఖలీల ముఖలీల, నఖలీలనై కాను♦చంద మలరు
నాగరాజముఁ గేరు♦నడతీరు జడతీరు, మెడతీరు చందంబు♦మేర మీఱుఁ
గమలజాలముఁ జూపుఁ♦గనుదోయి......, నునుదోయి కేలించు♦లనుహసించుఁ
దొలుకరికై మించుఁ♦దొడలింపు నొడలింపు, గడలింపునేయు శృం♦గారరసము

గీ. పరిస్ఫుటితపద్మరాగంబు◆పదము రదము, ధనఘనసారబింబంబు◆తావి మోవి
కలితరసభంగములుదృగా◆నయలు వయలు, జితలలితకాంచనం బింతి◆చెక్కుటుక్కు.
రుక్మిణీపరిణయము, సత్య. భ ఆ 2 పద్య 19.

సీ. దుర్యోధనధ్వజ◆తులితమా కీల్జడ, కపికేతుశంఖమం◆గళము గళము
లలిఁ బాండురాజకై◆లాసంబు హాసంబు, ఘనధార్తరాష్ట్రసం◆గతులు గతులు
గురుతరగాంగేయ◆కుంభిసంభవకళా,సంధాయి ...............
కర్ణసన్నిధిగతే◆క్షణము లీక్షణములు, సౌనుదత్తిపరిభా◆షణము ముఖము
గీ. ధర్మరాజక్రియంబు లా◆తరుణిబోమలు, ఉభయభారతియోధుల◆నొకటిసేయఁ
దలఁచి విధిసృజియింపఁగా◆నలయుఁజుమ్మ, గాకతక్కిన సౌందర్య◆గరిమకలదె.
పద్మినీపరిణయము, ఆ 3 పద్య 131.

సీ. మగతేఁటిగురులకు◆మగుపముంగురులకు, నేనాటికేని స్నే◆హమెయ్యెఁగరాదు
ఇలఁ జందురిగోమున◆కింతినెమ్మోమున కేమి గాంపత్యమో◆యెయ్యెఁగరాదు
కపురంపుఁదాఁకిఁ◆గలికి కెమ్మోవికి, నేయనుకూలమో◆యెయ్యెఁగరాదు
బంగారుగింజ్లకుఁ◆........., నేయనుబంధమో◆యెయ్యెఁగరాదు
గీ. కసుకుమగమీలు తెలిరాలు◆కనులడాలు, కాంతిజిగిమాపు మరుచేతి◆కలువతూపు
నతిని మెఱుంచుతళతళ◆యానెదు మించు, నొక్కచోటనె బుట్టని◆దొకటెకొదవ.
రాధికాసాంత్వనము, ఆ 3.

సీ. మేను మించులఁ జేసి◆వాని చాంచల్యంబు, వాలుఁగన్నులయందుఁ◆గీలుకొలిపి
శశి నెమ్మొగమొనర్చి◆చందురినందలికప్పు, కుటిలాలకములందుఁ◆గుదురుపఱిచి
కెంపు వాతెఱఁ జేసి◆కెంపుకాఠిన్యంబు, ... ... ... ... ...
విరులు గోర్లొనరించి◆విరులసౌరభ్యంబు, నిట్టూర్పుగాడ్పుల◆మట్టుపఱిచి
గీ. నలువ గావింపఁబోలు నీ◆చెలువనార, యనఁగఁ జెలువొందె నాచాన◆హంసయాన
యమృతపూరంబు వావి యరిదియం◆దమిలదివి, యాణిముత్తెమ్మ వలరాజు◆నలరుటమ్మ
కవిజనరంజనము, ఆ 1 పద్య 70.

గీ. మిగుల శశికాంతమైననె◆మ్మొగము చేత, నెఱిమహానీలరుచులైన◆నెఱులచేత
జలజరాగములయిన హ◆స్తములచేత, రత్నమయమగుఁ గామినీ◆రత్న మమరె. 698
భర్తృహరిసుభాషితము, ఏ. ల. శృం. పద్య 18.

ఉ. వెన్నెల నవ్వుగాఁగఁ బయి◆విప్పు కళంకము కొప్పుకప్పుగాఁ
జెన్నలరన్ సుధారసవి◆శేష మశేషము తియ్యమోవి గా
నన్నుతచందబింబగత◆సారము తోరము గా గ్రహించి పే

లెన్నిక సీతమోము రచి♦యించె విరించి సముంచితద్యుతిన్ 700

రామవిలాసము, ఆ 3.

మ. కరయుగ్మంబులు పద్మరాగములు వ♦క్త్రింబుల్ మనోహారిచం
దిరకాంతంబులు కుంతలంబులు మహా♦నీలంబులు న్గావునన్
దరుణుల్ రత్నమయంపుబొమ్మలు; సుమీ♦తథ్యంబుగా భోజతు
ల్యరసజ్ఞత్వనువిశ్రుతా సుభిష♦ల్లామానినీమన్మథా. 702

భర్తృహరిసుభాషితము, ఎ. బా. శృం. పద్య 16.

ఉ. ఇమ్మెయిఁ బెట్టుచాయలపి♦ యెన్నఁగ నేటికి నైజకాంతిచే
నిమ్మది రాక్షిమోముసరి♦ యిచ్చట నచ్చట లేదు చూడ నీ
నెమ్మది సంశయంబయిన♦ నిక్కము చేసెద నిప్పు డంచు నా
తమ్ములమీఁదఁ బెట్టుకొనె♦ దన్ద్విజరాజుకుఁ జేయి సాఁచెదన్. 704

సునందాపరిణయము, ఆ 2.

సీ. మించిదృష్టికి మిఱు♦మిట్లుగొల్పెడు నిది, తెలియఁగారు మెఱుంగుఁ♦దీగయేమొ
కార్మెఱుంగునకిట్టి♦కళ గలదే యిది, సొబగైన వెన్నెల♦ సోగ యేమొ
వెన్నెలసోగకీ♦చిన్నె లున్నవె యిది, మరుని రాచిల్క సాం♦బ్రాణి యేమొ
చిలుకసాంబ్రాణికిఁ♦ జెలువంపునడలుండు, నా యిది కలికిరా♦యంచ యేమొ
గీ. కలికిరాయంచ కీసోయ♦గంబు గలదె, యిమ్మెగలదిది జాళువా♦బొమ్మ యేమొ
జాళువాబొమ్మకీవిలా♦సములు గలవె, మెచ్చ నగు నచ్చరవెలంది♦మిన్న యేమొ.

ఉత్తరరామాయణము, ఆ 4 పద్య 189.

సీ. పలుకారియంచ గా♦వలెఁ గాకయున్నచోఁ, నఖరంబు చరణంబు♦ లరుణమగునె.
కలికిరా చిలుక గా♦వలెఁ గాకయున్నచో, నవవిల్తుని వహించు♦కొనఁగఁగలదె
కుసుమరత్నంబుగా♦వలెఁ గాకయున్నచోఁ, గన్నభూసతిరత్న♦గర్భ యగునె
తొలుకారుమెఱుఁగుగా♦వలెఁ గాకయున్నచోఁ, జంచలాలోకముల్♦ సంఘటిలునె
గీ. కంతుబాణంబు గావలెఁ♦ గాకయున్న, భువనమోహన శృంగార♦పూజ్య యగునె
యనుచుఁ బొగడంగ సకలలో♦కైకమాన్య, యయ్యునవమాన్యయై మించె♦నవనికన్య

దశావతారచరిత్రము, ఆ 7.

సీ. నెఱిగొప్పు మేఘసం♦దేశంబు కనుదోయి, యందమౌ కువలయా♦నంద మరయఁ
బొంకపు మోము ప్ర♦బోధచంద్రోదయం, బధరంబు మణిసార♦మార చూడఁ
జెలువంపుఁ జిఱునవ్వు♦ సిద్ధాంతకౌముది, ........... రసమం♦జరి నుతింపఁ
. గరరుహంబుల కాంతి♦కావ్యప్రకాశిక, ఘననితంబము రసా♦యనము తలఁపఁ

గీ. ఘనవలంకార మతను శా♦స్త్రములు చూపు, లహహ మధ్యంబు నాటకం♦బపనిలోన
విద్యలకు నెల్ల మూల మి♦వెలఁదిఁ గనిన, విద్యలు పఠింపఁగా నేల♦వే బుధులు.

హంసవింశతి, ఆ 2 పద్య 142.

సీ. జలితంపుఁ బులినంపు♦వెలఁ బెంపు జఘనంబు, పోఁడి మెన్నఁగ నొక్క♦నాఁడు పట్టు
విరితమ్ములను గ్రమ్ము♦సిరిఁ జిమ్ము వదనమ్ము, చెలువ మెంచుట కొక్క♦నెలయుఁ బట్టు
నిరులెన్నఁడుము గుప్పు♦నెటికప్పు గల కొప్పు, పరిణుతింపఁగా ను పా♦బ్దంబు పట్టు
జితజంభకరికుంభ♦శతడింభ ........., యుగ మెన్నుటకు నొక్క♦యుగము పట్టుఁ
గీ. జొక్కటపు తీక్కగమిలిక్కు♦చెక్కు జక్కు, నఖములను తింపఁ గల్పకాం♦తంబు పట్టుఁ
గెంజిగురు సంజకెంజాయ♦పుంజిఁ దెగడు, పదము లెన్నంగ బ్రహ్మక♦ల్పంబు పట్టు.

హంసవింశతి, ఆ 4 పద్య 74.

మ. సతి శృంగారగసుశ్రివంతి యనఁ జం♦చద్వేణి శైవాలసం
తతి శ్రోణి పులినోన్నతి న్నయనమీ♦నశ్రీవళీభంగసం
గతి నాభీసలిలభ్రమా ప్రగళశం♦ఖస్ఫూర్త వక్త్రాంబుజ
ద్యుతి......గభాంగిలీలఁ జెలువొం♦దుం జూడ్కికిన్ వేడ్కగన్. 710

శకుంతలాపరిణయము, పె నా. ఆ 2 పద్య 78.

సీ. పంకలగ్నత లేని♦పద్మినుల్ ప్రియుని స,ద్గాంగీకృతుని జేయ♦నట్టిసతులు
మధుపానమత్త రూ♦పధృతి సందసిలొమ్మ, లమలినత్వమున నిం♦పగు మురమణు
లకృతపల్లవరాగ♦లగు లతకూనలు, ద్విస్వభావత లేక♦వెలయు కన్య
లినుని తేజముఁ గుర్తింగ♦నీయని యనసూయ, లేకళంకిని గూడ♦కెనయు చామ
గీ. లెంచ విటపాళి సంగతి♦యించుకయిన, లేని కలకంఠులు నురాగ♦మానుషక్తి
భావమున లేని భామలప్పట్టనమున, శీలవతు లుందురు గుణాను♦కూలవతులు. 711

అచలాత్మజాపరిణయము, ఆ 1 పద్య 16.

సీ. ఘడఁతి మేల్ నడత లా♦పరమహంసల కైన, సతి నఖశ్రీతులు స♦ద్వితతి కైన
వనితకన్నవకాంతి ♦ యనిమిషావళి కైనఁ, గన్నె పెన్నెఱిగుంపు ♦ ఘనుల కైన
వనజాక్షి వదన మీ♦శ్వరశిఖామణి కైన, వెలఁదిపల్కులు శుకా♦దులకు నైన
హరిణాక్షి యిటిగౌన ♦ హరి కైనఁ బల్లవా,ధరయూరులు నరస♦తరుల కైనఁ
గీ. బట్టి వర్ణింప నలవిగా♦దిట్టు లుండ, నతివ యాసొంపు లాపెంపు ♦ నానెరాయొ
యారములు బీరములును శృం♦గారములును, దరమె లెక్కింపఁ దర్కింప ♦
నరుల కెపుడు. 714

" " ఆ 2.

సీ. పడంతి........ ♦ పద్మంపు మొగ్గలో, పసిఁడికుండలో వేరఁ ♦ బలుపరాకు
బింబోష్ఠికన్నులో ♦ బేడిసమీనులో, కపురంబు టీకులో ♦ కనఁగ రాదు
కమలాక్షి యూరులో ♦ కరటికరంబులో, యరఁటికంబంబులో ♦ యరయ రాదు
పూఁబోఁడివదనమో ♦ పూర్ణేందుబింబమో, తెలుకులద్దమొ మేలు ♦ దెలియ రాదు
గీ. కెంపుటోయ్యారియమ్మ కల్కి ♦ చకోరఁదనము, మాయురే జాణయగు నని ♦ మాటిమాటి
కిచ్చఁ దలపోసి మెచ్చిర ♦ య్యంతిసొబగు, రచ్చరచ్చలఁ గూర్చున్న ♦ రసికులెల్ల.
సురభాండేశ్వరము, పద్య 39.

చ. మగువపదంబు కోకనద ♦ మానదమానదమా పరిణాభి న
మ్మఁగనగురూపు భాగ్యకర ♦ మాకరమాకరమా మృదూక్తు లెం
చఁగఁ గటిసీమ మోహదర ♦ సాదరసాదరసాధుకంఠలీ
లగళనినాద మెన్న పిక ♦ లాకలాకలాకచాళి యున్. 719

చ. ఘనకబరీ......కృతులు ♦ కందగమై దగమై రమైక్యమై
చనుమదికంఠవక్త్రములు ♦ సాదరమా దరమా రమాకమా
డినుసుగవాక్సితాంగములు ♦ తేనెలతో నెలతో లతోక్తితో
నెనయగు నాభిజంఘగతి ♦ హేమకరిన్ మకరిన్ గరిన్నగున్. 720
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 2.

గీ. రమణిమధ్యనితంబదృ ♦ గ్గమనమహిమ, సగణిహరిభృగుగాముల ♦ క్ష్మణవిలాస
మమరె. భారతభాగవ ♦ తాదికావ్య, మైనరామాయణపురాణ ♦ మనాట బురుద 721

సీ. శ్రీరంగధామ మీ ♦ చెలువముద్దుమొగంబు, తిరశ్రాక్షి నాభి కే ♦ దారగరిమ
మానినీమణిపల్కు ♦ మధురామృతముఁ జిల్కు, నతివ......భ ♦ ద్రాద్రిమహిమ
చంచలాక్షి పిఱుందు ♦ కాంచీపరికాశంబు, వనితపన్ను ఘనగౌను ♦ వారణాశి
గీ. గాఁగ నుక్షేత్రమహిమచే ♦ ఘనత మీఱి, వెలయు నీయింతిఁ ...... ♦ విమలపుణ్య
పురుఁడు పరమచిదానంద ♦ వార్ధిఁ దేలి, బహుళసంసిద్ధిశుద్ధబ్ర ♦ హ్మంబు గాఁడె.
వేంకటేశ్వరవిలాసము, ఆ 2 పద్య 65, 66.

ఆ. తరుణి మోముఁ జూచి ♦ సరి గాను దానని, కమలవైరి చేర ♦ గగనసీమ
దర్పణంబు పోయి ♦ దాఁగెను గరిమతో, నజ్జకాంతి రేయి ♦ నణఁగి యుండె.
గయోపాఖ్యానము, ఆ 1.

సీ. చంద్రమండలనిభా ♦ స్యంబు గల్గుటఁ జేసి, కమలాక్షి శ్రీలక్ష్మి ♦ కరణి వెలయుఁ
గాననవ్య...... ♦ గౌరవంబు నెలంగి, గిరిరాజపుత్త్రికా ♦ కృతి వహించుఁ
శారదోక్తిచాతుర్య ♦ పాటవంబులు గల్గి, వాగ్దేవిసాటియై ♦ వన్నె కెక్కు

గీ. సహజమయి యీ కాంతరూపంబు ♦ వననియందు, హాటకము మెత్తగా దంచి ♦ యమృతరసము
పోసి మెదిచి మహాద్భుతం ♦ బుగ నజుండు, నేను మెప్పుటకై దీసి ♦ నిలిపె నేమొ.
వేంకటాచలమాహాత్మ్యము, ఆ 4 పద్య 258.

సీ. ఝుంఝు కేశములయందుఁ ♦ గృష్ణత్వమును నిల్పి, ...గిరీశత్వ ♦ మును ఘటించి
ఘనచతురాస్యత్వ ♦ మును బలుకులఁ బెట్టి, వరమధ్యమున హరి ♦ త్వంబుఁ జొనిపి
గరిమాలకంబులఁ ♦ గాలత్వమును గూర్చి, వపువునఁ గర్బుర ♦ త్వంబుఁ జేర్చి
యాధరంబునందున ♦ నరుణత్వమును దార్చి, దరహాసమున శుచి ♦ త్వంబుఁ గొలిపి
గీ. జాలయు పాణులనబ్జత్వ ♦ మును బెనంచి, మోమున విధుత్వమిడి బ్రహ్మ ♦ కామునకిల
గెలువఁగా నెల్ల దేవాంశ ♦ ములహరించి, పూని రచియించియిచ్చెఁ గాఁ ♦ బోలు దీని.
కవిజనచకోరచంద్రోదయము, ఆ 4 పద్య 163.

మ. తిలముం జంపక మింతి నాసఁ గని మై ♦ త్రిం గోరి చాంపేయము
జ్వలగంధాప్తిఁ గనం దిలంబు తదలా ♦ భవ్యాధిఁ గూల న్నితా
మలహా తత్ప్రిసనౌఘముం బొదివి హే ♦ మం బూన్చె నాసాప్తతం
దెలుపన్ స్నేహమునన్ స్వగంధము హితా ♦ ర్తి న్నైనఁ పరార్ద్రాంతరుల్. 738
ఇందుమతీపరిణయము, మ. నృసిం. ఆ 2 పద్య 121.

చ. చెలిమధురోక్తితోన శుగ ♦ చేకొని నూనరసంబు గాంచె ని
చ్చలు రసభంగ మొందె వి ♦ పత్వము క్షౌద్రరసంబు చెందె ని
ష్ఫలత ఫలాసవంబు ముఖ ♦ భంగము నయ్యమృతంబు పూనె ని
మ్మలఁ దుదినోడె నిక్షురస ♦ ముం గనుఁ బల్కుఁదనం బెసంగఁగన్. 737

గీ. పాణిపాదాధరములు పద్మ ♦ వాళి సుణులు, దశనవఖరము లమలము ♦ క్తాఫలములు
కచము నీలము తనువెల్లఁ ♦ గాంచనంబు, తరుణి కామ్యత్వకఠినత ♦ లరుదె నీకు.
,, ,, ,, ఆ 3 పద్య 43.

మ. స్తుతతారావలమై తిచే నమృతచం ♦ ద్రుం డొప్ప రోహిణీయత
స్థితి తారల్ చెలియంజతమ్ములను బోఁ ♦ దెస్ వాణీసుగీర్వసం
గతి తారామలమైత్రి మించుటలు వే ♦ ద్యంగాంచి రొందన్నద
మ్ములబొందౌనని దోషయోగులకు ప ♦ మ్మోల్ గావె సద్వర్తనల్. 739
సుబ్రహ్మణ్యవిజయము, ఆ 1.

గీ. అబల మన్య మనంతక ♦ ల్యాణగుణక, మాధురీశ్రీవిమానంబు ♦ రూపహీన

మగుట సవికల్ప నిర్విక♦ల్పానువాద, ములను నెప్పుడు జపయుక్తమై ♦ యలరుచుండు.

సుమనోమనోభిరంజనము, ఉల్లాస. 2 పద్య 88.

సీ. కలకంఠి శృంగార♦జలధి మధ్యంబున,...మందరాద్రిగాఁ ♦ గుదురు పఱచి
వెలఁదివెన్నునఁ దూగు♦వేణినిదరి త్రాడు, గాఁగరంబులఁ బట్టి♦కాంక్ష లూరఁ
దరచఁగా నమృతంబు ♦ తఱచుగా జన్మింప, నరవిందశరుఁడు తా♦నాక్రమించి
యందులో నగపాలు ♦ నతివమోవిని జేర్చి, నిలిచిన నగపాలు ♦ సేర్పు మెఱయ
గీ. నందనుమరంగఁ దన ఖనా♦వందు నిలిపి, యవనిలోఁ దీయవిల్లుకాఁ♦డనఁగఁబరఁగె
ననుచు మగువలు వినుతింప ♦ నాత్మయందు, సంతసిల్లుచునొప్పెనా♦దంతిగమన.
క. చక్కని మౌక్తికహారం, బక్కజమగు రత్నపదక ♦ మమరిన యురమున్
జక్కరదిండివజీరుని, చొక్కపు సింహాసనంబు ♦ సొబగు వహించెన్. 743

శశిరేఖాపరిణయము, అప్పప్ప. ఆ 1.

ఆ. ఉవిద నేత్రసామ్య♦ మొందఁగాఁ గడఁగిమి,నొక్కయేటఁజిక్కి♦నొక్కనెలకె
పద్మ మోడె నొక్క♦పగటికే చెడెఁ గల్వ, సఫలమగునె కోర్కె ♦జడగతులకు.
గీ. మ భ...మీనలోచన♦గోనితంబ, యబ్జధామాస్య హరిమధ్య♦యళిశిరోజ
చాపనుభ్రూయుగళనక్ర♦జంఘ యతుల, కన్యసగసక్రియలరాశి♦గాదె తలఁప.
ము. గతిమత్తేభము నాసచంపక మొగిన్ ♦ గైశ్యంబు కందంబు సం
గతవాక్యంబులు మత్తకోకిలలు దృ♦గ్వ్యాపార మయ్యుత్పల
ద్యుతి నెమ్మోమంబురుహంబు దేహరుచి ♦ స్యస్మ్రల యీమానినీ
తతవృత్తస్థితు లెన్నఁగాఁ దరమె త♦న్వ్యాగ్రానికైనన్ ధరన్. 747

భద్రాపరిణయము, ఆ 2 పద్య 107, 112, 113.

చ. వదనము గోముఁ గాంచి మది ♦ వారిజమంచుఁ దలంచి తెక్కలన్
గదలిచి మేనువంచి దుము♦కం దమకించి మదించి ముందటన్
గుదురగు నాసికాకనక♦కుట్మలమున్ వెసఁగాంచి నిల్చె తు
మ్మెదలొ యనంగ ముంగురులు ♦ మించె లతాంగి లలాటసీమపై. 740

పల్లవీపల్లవోల్లాసము, ఆ 2 పద్య 196.

క. కచజలదగాత్రి చంచలా♦కమ్రవదన, కంజశాత్రవ నఖతార♦కావ్రజముల
నింపు మీఱుచుఁ దనరారె ♦ నిందువదన, లలితమై యొప్పుగగనత♦లంబుకరణి.

రంభానలకూబరవిలాసము, ఆ 3.

మ. వరహేమాంగలతల్ మదాలసలు శా♦స్వచ్ఛంబు ఘోషల్ స్ఫుర
ద్ధరిణీ నేత్రలు రత్నమంజరులు ప్రో♦ద్యద్ధాన్యమాలల్ సుమో

త్కరరంభోరులు చిత్రిణీశశిరే♦ఖల్ కుందదంత లుర్వరీ
వరకాంతిల్ సురకాంతలై వఱలుట♦ల్వర్ణింపఁగా శక్యమే. 731

రఘురామచరిత్ర ఆ 1 పద్య 46.

సీ. తామరపూఁబోలు♦కామినీవదనంబు, పున్నమజాబిల్లి ♦ చెన్ను మించెఁ
కలువరేకులఁ బోలు ♦ కలికి కన్నుంగవ, బేడిసమీనుల♦నివ్వెఁ దోఁచె
మొల్లమొగ్గలఁ బోలు ♦ తెల్లని పలుగమి, రహిమించునట్టి వ♦జ్రముల మించె
క్షీరపూఁబోలు నా♦బిడనగవు నెమ్మేను, సౌదామనీకాంతి ♦ సరణి మించె

గీ. ముద్దులో ముద్దు మోహన ♦ మోహనంబు, జోకలో జోక సొగసులో♦సోయగంబు
నీటులో నీటు లన్నిఁగ♦న్నింప నగుచు. శీవి నాటిల్లె సత్యభా♦మావధూటి. 752

సత్యభామాపరిణయము. ఆ 2 పద్య 28

క. ఘట కందము నడకందము, కడుసుందము చిందము న్న♦గందము సొగసౌ
మెడ కుందము రదబృందము, నడుమన్ నడుమన్నసృష్టి ♦ నలువయె మఱచెన్.

గీ. కర్ణములఁ జూచి శ్రీశోభ♦గానుపించుఁ, గరములరయంగఁ బద్మనై♦ఖరి నెసంగుఁ
గనులఁ దెలకింపఁగ వలాభ♦దనరియుండు, లలన మ్మాత్రిటికి నిజమ్మ♦లక్ష్మి సుమ్మ.

క. వనజాక్షి నడుము వైఖరిఁ, గన మందురు లేని దైన♦కతమున భువిలో
జను లంద అంతకన్న న,వని వరలక్షణముఁ గని న♦భంబనుట దగున్. 755

రామరాయవిలాసము, ఆ 3 పద్య 34, 36, 37.

ఉ. పువ్వులఁ బోలు నంగముల ♦ పోలికఁ జూడఁగ వెన్నఁ బోలు తే
జవ్వని మారయంగ వెజి♦చక్కని రూపము చుక్కఁ బోలు సా
క్షీవ్యథ మెల్ల నారయఁగ ♦ నెద్దియు నొందు కొఱంత గానరా
దివ్వనితా లలామ మిపు ♦ డిచ్చట నుండఁగ హేతు వేమొకో. 756

కాళిందీపరిణయము, ఆ 2 పద్య 70.

చ. కమలజుఁ డాలతాంగి మృదు♦గాత్ర మొనర్చి కడానికిం సుగం
ధము నిడకున్న యాకొఱంత ♦ దప్పఁగఁ జేసెను బువ్వు వీవనన్
విమలిసముజ్జ్వలజ్వలను ♦ పీచుటకై నియమించు పోల్కి నా
కమలముఖీమణిం బరువ♦కర్మ్రల పాలొనరించె నక్కటా. 767

చ. ఇలఁ బయిఁ బుట్టు టాగములు ♦ హెచ్చుగ నూర్ధ్వము లౌటఁ జెట్లకుం
గలయది గాదె పృథ్వియగు ♦ కాంతల సత్కుటి సిమకిరిందటన్
మొలచి తనూరుకాండమిష♦మొంచ లధోగ్రము లౌచు జంఘల

ర్వేలసితకుట్మలంబులను ◆ వింతగఁ దాల్చె నిదెట్టి చిత్రమో. 696

శంతనూపాఖ్యానము, ఆ. 3 పద్య 57, 62.

ద్విపద. నిండుచీకటి సేలు◆నీలంపుడాలు, గండుఁదుమ్మెదచాలు◆కలికి ముంగురులు
నూతన హేమంబు ◆ నును మెయిసిరి, లేఁతచందురుఁబోలు◆లేమ నెన్నుదురు
ఇంద్రచాపాగ్రంబు◆లింతి కన్బొమలు, చందురునిప్రియసఖుల్ ◆చామ నేత్రములు
శ్రీకారముల నిర◆సించు కర్ణములు, అకలికి నునుఁజెక్కు◆లరయ నద్దములు
... ... ... ... ... ... 697

సారంగధరచరిత్రము, బా. శం. ఆ 1.

శా. ఇవ్వామాక్షి మెఱుంగునాసికముతో ◆ నీడౌదు మేమంచు నా
నువ్వుంబువ్వును జంపకంబు కడఁకన్ ◆ బోరాడ మధ్యస్థమై
నువ్వున్ సామ్యముచేసి చంపకముత◆న్నున్నీడవాడంగ నో
డవ్వేపోవుట బంభరావళికి గం◆ధస్వాంతమున్ దెల్పుచున్. 698

విశ్వకర్మపురాణము, ఆ 5.

గీ. శిశుతయును వీడి పూర్ణతఁ◆జెంది యైన, నేలఁతనిటలంబు కనరాక◆నీరజారి
యష్టమీతిథి కష్టస◆మాశ్రియముగఁ, గొంకి పేరొందె బాలమ్ము◆గాంచుఁ డనఁగ.
ఉ. శ్రీకరకర్ణసంగతి వ◆రించు నేత్రయుగంబు ధాళధ
ళ్యాకృతి మీనకేతనక◆ళం గొని యబ్జభవుం గ్రహించి మ
ల్లోకమునం దనోయని వి◆లోలతఁ జూచి విధాత మీఁదు రా
నీక లిఖించు రేఖ లన◆నింతికి వింతగఁ దోఁచె భ్రూలతల్. 700

గంగాగౌరీవిలాసము,

గీ. సగసిజానన తొడలు బి◆త్తరము చేత, సమదకుంజరరాజహ◆స్తముల గెలిచె
నందుచేఁ గాదె యధికల◆జ్జాభరంబు, మించి వస్త్రంబు విడిముడి◆గించుకొనుట.
గీ. జలనిధితరంగములచెంత ◆ చిలువ లేని, పైఁబఱుండిన కటి నేల్పు◆పగిది దాని
వళులదరిఁ గులుకు నూఁగారు ◆ పాముమీఁద, నిండువేడుకతోఁ దఁబ◆రుండవలదె.

నీలకుంతలావిలాసము.

మ. శశిపత్రకుచ యెన్ని యెత్తుయకళా◆సంప్రాప్తికిన్ దాతృహృ
ద్వశుఁడై దీని సృజించుకాలమున వ◆క్త్రంబయ్యెనో తా మహా
ర్ఘశయూర్ధ్వస్థితి నుంట రోసి తొలఁగన్◆రేకోఁదఁటంమం దనం
ఘ్రశయా కాంతసఖాకృతిం బొలిచెనో◆శ్రీంద్రైక్యచిత్తారకల్. 702

నృసింహవిలాసము, ఆ 3.

ఉ. ఆరతినాలకుప్ప యమృ◆తాపగ తెప్ప సుమాస్త్రుకోఁటలో
జాజెడిపూలకుప్ప సర◆సంబగు తేనెలతిప్ప ముత్తెపున్
వారపుఁజిప్ప మామిడుల◆చచ్చురసమ్ములగొప్ప నాఁగ నా
సారసగంధియొప్పు ముర◆శాసన నాకు వచింప శక్యమే. 703

భార్గవపురాణము, ఆ 4.

సీ. హరిమధ్యయగుట నో◆య్యారిఁ జూచి......, కుంభముల్ పయ్యెద◆కొంగుమాటు
భోగీంద్రుపసమించు◆నూఁగారు గని ముఖ, చంద్రుండు కురులను◆చాటుకొనఁగ
గజహస్తములసొంపు◆గలయూరువులఁ గాంచి, చరణపద్మంబులు◆జడిమ నొందఁ
జంపకప్రసవదు◆ర్జయనాసికమునకు, నళికులాలకములు◆చలనమందఁ
గీ. గంబుమట్టెలుచిటితాళ◆తులనెరసి, మించి మెఱుంగుమురిపెంబు◆మిగులఁగనర
నించువిలుకాఁడు నేమించి◆పెంచుకొన్న, యంచగతిఁ గొల్వఁ జేరఁగ◆న్యాబల వచ్చె.

శివరాత్రిమాహాత్మ్యము, లో సో ఆ 2.

సీ. యామినీ భామినీ◆టోక్కామినీమణు లెన్న, సీమంతినీపాద◆సితనఖములు
ఇందిరా సుందరీ◆మందిరంబులు జూడఁ, జందిరానన పిఛా◆స్వాస్పదములు

... ... ... ... ... ...

నాళామృణాలాభి◆లీలాకరములొప్ప, నాళారుణాధరి◆వరభుజములు
గీ. అహహ యీయింతి సొగసు మో◆హములదొంతి, కాముపట్టపుదంతి చెం◆గల్వబంతి
లలితవాసంతి చెలువు మే◆లగు వలంతి, మరునిదీముశకుంతి భూ◆వరుపడంతి. 769
గీ. కలికికన్నులు శ్రుతిపార◆గములు నారు, శాస్త్రధారాగ్రరుచిరంబు◆సఖియమేను
కలిత జ్యోతిర్విలాసంబు◆గాంతతనువు, విద్యలమయంబు నడుమె య◆విద్యకాని.

నరసభూపాలీయము, ఆ 3.

సీ. చిగురులఁగలకుగాఁ◆జేసినయాజడి, తేఁటులఁ జెట్లఁజెం◆డించురట్టు
జిగితొగరేకులఁ◆జేరఁజేసిన సేగి, యంచలఁగొలఁకుల◆నుంచునగడు
కొన్నినగుత్తులఁ◆గూలఁజేయుకొఱంత, యసఁటులఁజొనతోడ◆నొనరుచుసడి
యేనుఁగుగొంగలఁ◆గానసుంచినయొగ్గు, తరఁగలఁ గుప్పింగఁ◆దార్చుకీడు
గీ. కలికిచేతులుఁగురులును◆గన్నుదోయి, నడలసొగసును......◆దొడలుఁ గొనుఁ
దలును నొనరించి కాదెతా◆దాత తోడఁతి, చేసికొనె లేకయుండంగఁ◆జెలఁగి తనకు.

శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము, ఆ 1 పద్య 34.

చ. చెలువయొయారివిగున్న యల◆చెల్వపుఁగొమ్మలె చేతు లందపుం
దలిరులె తెలుదోయి నెఱ◆తావులమావులె గోన్ల తేనియల్

దోఁచెడుపండ్లె ......♦గోఁతగుతొట్రుయె బొడ్డు పండ్లకై
చెలువుగఁ దొట్టువెల్వడిన♦చీమలబారులె యారు కన్గొనన్. 708

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 106.

చ. అలతలకట్టు లింతితెలు♦లమ్మకను ల్మిడుద ల్వెలంది చె
న్నలరెడు బొడ్డు వట్టునుడి♦నాతుకసైకపుఁగొను నున్న బం
తులు ననఁబోడి ......♦దొంతిగవిద్దెలు రూపుపూని యీ
మొలఁత నెపంబునం బుడమి♦మీఁదను గ్రిమ్మరుచున్న వారయన్. 709

,, ,, ,, ఆ 3 పద్య 122.

చ. నిలుకడఁగన్న క్రొమ్మెఱుఁగు♦ సెటున మేనును దాల్చి యిచ్చమై
మెలఁగెడు గుజ్జుమావివలె♦ మేలిమిచేఁతలు పూని మెత్తనై
చెలఁగు పసిండి బొమ్మవలెఁ♦జేరువఁ గ్రిమ్మరుచున్న దొరదిం
గలయఁగఁ జూచి పూఁబిలుతు♦కమ్మనిములుకు లనొచ్చి క్రిచ్చఱన్. 710

శుద్ధాంధ్రభారతసంగ్రహము, ఆ 1 పద్య 163.

సీ. కవజక్కవలఁబోరి♦తొవపెక్కువలనేలి, ..... గుబ్బలు♦చెన్నుమీఱ
జిగిహొన్నువనెమించి♦తగమిన్నఁ బులకించి, మేనును గౌనును♦జానుమీఱ
నిరులసొంపునుమీఱి♦ తరఁగగుంపునుదూఱి, కురులును దరులును♦గొమరుమీఱ
నరఁటాకుఁగనిపోవ♦ మరుబాకులకువ్రేవ, వీఁపును జూపును♦వింతమీఱఁ [నడలు

గీ. జిలుకపలుకులఁ జెలువంబు♦గులుకు చెవులు, నగవుతొడలుననొయ్యార♦ మొలుకు
మొలకనగవును జిగిమోవి♦గలిగి యలరు, వెలఁదిపఁగ్గడకూఁతును దెచ్చి♦పెండ్లిచేసె.

శుద్ధాంధ్రోత్తరరామాయణము, ఆ 1 పద్య 127.

## బాలిక.

సీ. లీలఁ బొత్తులమీఁద♦ లేచి కూర్చుండుచోఁ, దగ్గియు నొకకొంత♦ముద్దుఁజెలువు
క్షితిమీఁద లేఁతకెం♦గేలిడి తడవుచో, మొనలిడి యొండొక♦ముద్దుఁజెలువు
వలవల్లవ తప్పట♦డుగులు వెట్టుచో, నిద్దంపు బసపగ♦ముద్దుచెలువు
కొదలుమాటలు తేట♦గులుకుమఁ బలుకుచో, మోహనంబగు వింత♦ముద్దుచెలువు

గీ. కరగి యాబాల నపరంజి♦కొయనంగ, దినదినాభివృద్ధిఁ దనరు లేఁ♦దీగయనఁగ
సంతసంతనుఁ బ్రోదిచే♦నతిశయిలుచుఁ, బెరిగెఁ జూపఱకును గను♦పండువగుచు.

కళాపూర్ణోదయము, ఆ 6 పద్య 196.

ఉ. ముద్దులమాటలున్ జిలుగు♦మోమున నున్నని లేఁతచెక్కులున్
గొద్దిగ నున్న వెన్నడుము ♦ కూఁకటి కంధర ఫాలపట్టికన్
పెద్దము సేయు ముంగురులు ♦ విప్పగు గొప్పలగొప్పకన్నులున్
బొత్తిగఁ గవింత లై యమరెఁ ♦ బుష్పసుగంధికి బాల్యవేళలన్. 713

అనిరుద్ధచరిత్రము, ఆ 2 పద్య 21.

సీ. అరయంగ నెమ్మేను ♦ గురువిందచయము పాట, దంతముల్ వజ్రపు♦తావ పాటా
మాటలు నెఱిమించు♦మౌక్తికావలి లౌట, భుజములు మరకత♦స్ఫూర్తి లౌట
నగవు పెన్నెఱిసుంపు ♦ నీలజాలము లౌట, గుణములు వైడూర్య♦గణము లౌటఁ
గరములు పుష్యరా♦గఖ్యాతి గల లౌటఁ, జరణము శ్రీగుర్రు♦సరణి లౌటఁ
గీ. గరికి చెవ్వులు గోమేధి♦కంబు లౌట, వనిత యెల్లను నవరత్న♦ఖని యనంచు
ముద్దు సేయంగఁ బెరిఁగె నా♦ముద్దుగుమ్మ, యుల్లమగు కల్పవల్లిమ♦తల్లి యగుచు.

ఓఘవతీపరిణయము, ఆ 4 పద్య 76.

# యువతి.

సీ. నాభిలోపాలముం♦దలమున మొలచిన, తాపింఛవల్లిమ♦తల్లి యనఁగఁ
దివమనోభవపుష్ప♦ధనురంతరంగంబుగఁ, గట్టిన బంగారు♦కట్టు లనఁగ
సౌందర్యకేళికా♦సారంబులోపల, మొనసిన నెత్తమ్మి♦ముగడ లనఁగ
నిటలస్తనంధయా♦ధిపాంకరుని సైఁ, గవిసిన గాఢాంధ♦కారు మానఁగ
గీ. నాఁడు నాఁటికి నారు♦గానంగఁ బడిగొ, వగలు నోఁచెఁ .........♦వన్నెఁగులుకు
వాశ్రిత నంగుల భూభిల్ల♦వంశవల్ల, భాత్మసంభవ సంపూర్ణ♦యౌవనమున. 715

వరాహపురాణము, సం. ము ఆ 2 పద్య 112.

చ. అనుపమ చంద్రహాసవిపు♦లాంబకముల్ చెలువైనమోమునన్
ఘనతర చక్రవ్రజకల♦నంబు మెఱుంగుమిటారి......
.........గుప్త లాలనక♦లాపవిలాసము వేణి జోపుచు
న్మనసిజశస్త్రశాలయన ♦ మానిని రాజిలు యౌవనంబునన్. 716

నాగరఖండము, ఆ 5 పద్య 27.

సీ. వాతెఱ తోంటికై♦వడి మాటలాడదు, కుటిలవృత్తి వహించెఁ ♦ గుంతలంబు
లక్షులు సిరులు రా♦నటు మాడ్కిఁ గనుఁగొనె, నాశించె బొమగొని ♦ యావనంబు
.........త్నగయ వ♦క్షము పేటగడకొత్తెఁ, బాణిపాదము లెఱ్ఱ♦వాలఁదొడఁగె
సాదెస మధ్యంబు♦దారిద్ర్యములఁ జెప్పె, యౌవనోచ్చత్వకిటులోఁగఁ♦జొచ్చె మేను

సీ. ఎదఁ దనిమ్రోకమొగ్గ ♦ లెనసి పై నిల్పెనో, యనఁ......... ♦ నునుపు దేర
జడఁ దగూఁడులనుండి ♦ వెన్నెలపులుఁగులు, తెనులెనా నేత్రాంచ ♦ లములు బెళుకఁ
గలదు లేదను వాద ♦ కలితోక్తి మార్గమునఁగఁ గడు సన్నపు ♦ నడుము చెలఁగ
బాల్యపుఁ టేటెంకఁ ♦ బాఱఁగన్పట్టెడు, నిను ముగన్నియ వాఁగ ♦ నెసఁగె బిఱుఁదు
గీ. కొదమరాయంచయంచల ♦ మెదలెననఁగ, గులుకునడయందమయ్యెఁ జేఁ ♦ గల్వ నేస్తి
సిస్తిఁగనె మోము నెమ్మేను ♦ మిస్తుమీఱెఁ, గంబుకంఠికి మొదలిప్రా ♦ యంబునందు.

ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము, పద్య 290.

శా. లీలన్ బాలతటాకము న్వెడలి పో ♦ లిం గేల గర్ణస్ఫుర
ల్లోలాపాంగము లంటుఁ గేళిలసదు ♦ ల్లోలోత్పలం బంచు శై
వాలభ్రాంతిని నారుఁజిమ్ము నఖర ♦ వ్యాపారలీలన్ జలీ
స్తోమన్ మేననిపల్కుఁ గాయపడిత ♦ శ్రోణీభరాయాసయై. 723

శృంగారరసమంజరి, పద్య 5

సీ. అరవిందములు మన్మ ♦ థాస్త్రంబులైనట్లు, వాలుగన్నోనలఁ గ్రొ ♦ వ్వాఁడివోవ మె
హరినీలములు పేరు ♦ లైనచందమున నిం, చుకలైన కురులు పెన్ ♦ సోగలయ్యె
హీరాగ్రతతులు మేళ ♦ వింపైనవగ ముద్దు, పలుకులు ప్రౌఢసం ♦ పద వహించెఁ
గనకంపుఁ గణికకుం ♦ డనమైనరీతిఁ జా, యల మేను నిండుతే ♦ పల వహించె

... ... ... ... ... ...

బంధుజీవాధర యతీత ♦ బాల్యయగుచు, నిండు జవ్వనమున నొప్పు ♦ చుండునపుడు.

అనిరుద్ధచరిత్రము, ఆ 2 పద్య 22.

చ. నిటిలములయ్యెఁ గోమలికిఁ ♦ గుంతలముల్ జెలుకుల్ కనుంగవం
బటుమరిలెన్ ........ ♦ బోకల రేకలఁ బ్రాకెఁ బల్కులం
జటులలిత బులొప్పె నర ♦ చందురుచందముఁ జెందె మోము పొ
క్కిలిటగహానత్వ ముల్లసిలెఁ ♦ గెంపులక్రొంపు దలిర్చె వాతెఱన్. 725

అనలాత్మజాపరిణయము, ఆ 2.

క. పదలక్షణసంజ్ఞవ్యయ, పదగుణవృద్ధివిభక్త్య ♦ పరరూపసమా
స్పదభావతద్ధితక్రియ, లొదవఁగఁ జెలి శబ్దశాస్త్ర ♦ మో యనఁ దనరెన్. 724

సీ. కేవెల్లు నెమ్మోము ♦ భావించి యలరాహు, వారులోఁ బొంచె నై ♦ ల్యమును బొంది
మీలడాల్ కన్దోయి ♦ జాలువాఱుటఁ జేసి, జక్కవల్ వొమ్మికి ♦ నొక్కి నిక్కి
మోపిబింబపుఁగావి ♦ నావరింపఁగ నంతఁ, జగువు రాఘులు వా ♦ క్సమితి నొంగ
నిలనెక్కు మెకపు రే ♦ క్కులయూనమును బూనఁ, గనిమ్ర ముండఁ ♦ మునపసించె

గీ. దనర నవయౌవనములు కామ♦ధర్మశాస్త్ర, పద్ధతికి నించుమించు నే♦ర్పాటులేక
ననుపనుంబైన భువనమో♦హినివిధాన, పరిభరింపైన యౌవన♦ప్రాయమునను.

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 2

## వృద్ధ.

సీ. పసిమిపోనెండిన ♦ కసవుఁబట్టయుఁబోలె, నరవెండ్రుకలబర్వు ♦ శిరము వలన
నులిగొన్న చెలఁదిపు♦ర్వ్వలనూలివల్లునా, నమరెడు ముడుతక♦న్బొమల వలనఁ
గడుఁ జిట్టినట్టి బం♦గరుపూఁతపొక్కిళ్ళ, వడువుఁజూపెడిమేని ♦ వళుల వలనఁ
దునిసివ్రేలెడు మాఁకు ♦ తునుకల వలపించు, బాహు......లం♦బనము వలన
గీ. ఘూంకరవములచాడ్పున ♦ ఘోరవృత్తిఁ, దనరు ఘనకాసకుహుకుహూ♦ధ్వనుల వలన
భావజుఁడువెళ్లిపోయిన♦పాడు మేడ, పగిదిఁగాన్పించుముదుసలి♦పడఁతియొకతె.

కళాపూర్ణోదయము, ఆ 3 పద్య 83.

## పద్మినీజాతి స్త్రీలక్షణము.

సీ. రాజీవగంధి స♦ద్రాకేందుబింబాస్య, నీలోత్పలశ్యామ ♦ నిర్మలాంగి
సద్గుణచారిత్ర ♦ సత్యవ్రతాచార, తరుణకురంగాక్షి ♦ ధవళనేత్ర
పాటలాధర రక్త♦పల్లవమృదుపాణి, గానవిద్యాలోల ♦ దానవిభవ
హంసభాషిణి మణి♦హారవిభూషిత. మదమరాళయాన ♦ మధురభుక్తి
గీ. విమలవస్త్రంబు పద్మిని ♦ వేడ్కఁగట్టు............... 729

కొక్కోకము ఆ 1.

## చిత్తినీజాతి స్త్రీలక్షణము.

ఉ. అన్నువయైనకాను కుటి♦లాలకపంక్తులు జెన్నుమీఱఁగా
వన్నెలుబెట్టుపచ్చనురు♦వంబును బూయఁగ నేర్చు నయ్యెడం
గన్నులు వాల్చు......♦కాకకు నోర్వదు నేర్పునేఁతలం
దిన్నని మాటలాడుఁ గడుఁ ♦ ద్రిమ్మరుఁ జిత్తిని చిత్త మాకిరియన్ 730

కొక్కోకము ఆ 1.

## శంఖినీజాతిస్త్రీలక్షణము.

సీ. అన్నువ ఘుగునడుమును మనువైన యధరంబు, గొండెంబునకుఁ జొక్కుఁ ♦ గోపగుణము
గొంచెపుఁ జూపును ♦ గుడుపుదొడ్డనరాదు, మృదుభాషణంబులు♦ మేను సనుపు
మున్నత......భార♦ముత్పలదళనేత్ర, కాఠిన్యపదపద్మ♦కంబుకంఠి
లాలితభూరియుగ♦నీలాళికచ ............స♦మ్మదిచిత్త
గీ. పిరియరసంబులు గారంబు ♦ పెంపుతావి, వేల్పుపట్టినవట్టియై ♦ విభుని నమ్మ
నీలివన్నెలచీరలు ♦ లీలఁగట్టు, శంఖినీభామ... ... ... ... 731

కొక్కోకము ఆ 1.

## హస్తినీజాతిస్త్రీలక్షణము.

సీ. నడువనేరదు వంక♦పాదవును గలవేళ్లు, గళపాదయుగళంబు ♦ గళము కుబుచ
కపిలవర్ణంబైన ♦ కబరీభరము గూర్ఁర, చేష్టలు వలమైన ♦ చిఱుతయొడలు
కరిమదగంధంబు ♦......తనువులు, కటికషాయము లధి♦కంపుగుడుపు
విపులోష్ఠకఠిన...♦......గడుఁ గూర్చు, గద్గదస్వరము చి♦క్కనిమనంబు
గీ. హస్తినీభామ యుగ్రత♦రాంతసీమ ... ... ... ... 732

కొక్కోకము, ఆ 1.

## స్త్రీప్రాముఖ్యము.

క. సతియును గుణవతియుఁ బ్రజా,వతియు ననువ్రతయు నైన ♦ వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచునతఁడు,గ్రతి కిహముం బరముఁ గలదె ♦ మతిఁ బరికింపన్. 733
క. సంతతగృహమేధిఫలం, బంతయుఁ బడయంగ నోపు ♦ ననుగుణభార్యా
వంతుం డగువాఁడు క్రియా,వంతుఁడు దాంతుండుఁ బుత్త్రి♦వంతుండు నగున్.
సీ. ధర్మార్థకామసా♦ధన కుపకరణంబు, గృహనీతివిద్యకు ♦ గృహము విమల
చారిత్రశిక్షకా ♦ చార్యకం బన్వయ, స్థితికి మూలంబు స♦ద్గతికి నూఁత
గౌరవంబున కేక♦కారణం బున్నత,స్థిరగుణమణుల కా♦కరము హృదయ
సంతోషమునకు సం♦జనకంబు భార్యయ, చూవె భర్తకు నొండు♦గావు ప్రియము
ఆ. నెట్టిఘట్టములను ♦ నెట్టియాపదలను, నెట్టితీఱనులను ♦ ముట్టఁబడిన
వంత లెల్లఁ బాయు♦నింతులఁ బ్రజలను, నొనరఁ జూడఁ గనిన ♦ జనుల కెందు.

భారతము, ఆదిపర్వము. ఆ 4 పద్య 81-84.

గీ. అధికదుఃఖరోగార్తున కౌషధంబు, సురుచిరంబుగ భార్యయౌ మాని యెందు
నౌనర భార్యాసమేతుఁడై యున్నవాని, కెంత లయ్యును నాపద లెఱుక పడవు
క. అలసినెడ డస్సినెడ నాఁకలి తృష్ణయు నైనయెడలఁ గడుఁ గొని ధరణీ
తలనాథ పురుషులకు నిమ్ముల భార్యయ పాముఁ జిత్తమున దుఃఖంబున్. 737
గీ. పురుషునందు దోషపుంజంబు గలిగిన, నెఱిఁగి యెద సహించు నేని భార్య
పురుషునం దభీష్టభోగంబు దేహాంతరంబునందు ధర్మరతియుఁ బడయు. 738

భారతము, అరణ్య ఆ 2 పద్య 78, 74, 1 9.

క. పలువురు క్రీడింతురు భూ,వలయాధిప యరయ మంచివారును గల ర
త్కులధర్మవతులకతమున, నిల నిరపాయత్వ మొందియొసకం బెసఁగున్. 739
క. పాతివ్రత్యము గలిగిన, నాతి యనఁగ దైవ మన జనస్తుతి వే తే
యాతతధర్మార్థసుఖ, ఖ్యాతులు సద్భార్యవలనఁ గాదే కలుగున్. 740

భారతము, అను. ఆ 2 పద్య 218, 219.

గీ. సంసారసాగర క్షయదుఃఖవారాశిఁ, దరియింపఁగాఁ జేయు తరణితరుణి
హృదయంగమస్ఫూర్తి నెపుడు నామోదంబుఁ, గలిగించు తావిచెంగలువ చెలువ
కామితఫలములు ఘటియించి వేలుపు, టేడు పెంచిన చెట్టు నెమ్మకొమ్మ
కందోగల నిత్యవిశ్వాస మొందింపఁగా, మంచిపున్నమచంద మామ రామ
గీ. సదనమణిమయదీపికా జ్వాలబాల, వల్లభమనోముదావళి వారినారి
శుభపరంపరవర్షించు సోనచాన, పృథులసన్మార్గమణిగణ పేటిబోటి 741

దశావతారచరిత్రము,

సీ. కులకాంత సౌభాగ్య కలనంబున నె కదా, ముదిమి వీడ్వడిపోయి మెదవుఁ బతికి
గృహిణీమణి యదృష్ట మహిమంబున నె కదా, లేములు విడి సిరుల్వ్రాలయు జేని
కాత్మీయసతి సువ్రతాప్తిచేత నె కదా, యముమలు వెవలి మేలెసఁగు విభుని
కిల్లాలి సన్మార్గవృత్తిచేత నె కదా, చింతవాసి ముదంబు చేలఁగు మగని
గీ. కటులు గానజగాననికయుతి వమన్న, కెన్న సుగుణంబు లన్నియు నెసఁగియుంట
శ్రీహరికృపాకటాక్షవిశేషగరిమ, నఖిల సంపద లొనఁగూడి యలరకున్నె.

నయనోల్లాసము, ఆ 2 పద్య 105.

## స్త్రీస్వభావము.

క. కులమును సమ్మార్వ్యశయము, గలిగి యొకని భార్యయై సంగౌరవలీలన్
మెలఁగును వెలిఁ జనుచు మన్, లలన పలసినట్లు యే మనంగిల స్వనసూ. 743

సీ. యోషిజ్జనంబులు ♦ దోషంబులకు నెల్ల, మూలంబు వారల ♦ నేల చెప్ప
నడిగితి గానఁ గ♦న్నంత సెప్పెద విను, పురుషుల మేలిమి ♦ పొలఁతు లెఱుఁగ
రది గాక నిర్లజ్జ♦లై కుత్సితుల భజి,యింతురు కదిసిన ♦ యంతఁ జేసి
వర్జనీయులు లేరు ♦ వారల కెవ్వరు, దండభీతిన పాడి♦ దప్పకునికి
ఆ. యగ్నిగాత్రముల మ♦హాంబుధి యేఱుల, నంతకుండు భూత♦సంతతులను
వనజముఖులు పురుష♦లను దృప్తిఁ బొందుట, గలుగ దంద్రు కోవి♦దులు మునీంద్ర.
క. కల దొక రహస్యగోపన, ములఘుమతీ వినుము పురుష♦నన్యుని గనినం
బొలఁతులకు నేమి సెప్పఁగఁ, గలుగుఁ బదనుతోడి కళలు ♦ ......... 745
క. కుడుచుట కట్టుట పూయుట, తొడుగుటయును వివిధధనత♦తులఁ గూడుట యె
క్కుడు వేడ్క సేయఁ జాలవు, పడఁతికిఁ బరపురుషుఁ గవయ♦బొలుటవోలెన్.
గీ. తొల్లి నిర్దోషచిత్తత ♦ నెల్లజనులు, వలచినప్పుడ దేవత్వ♦వైభవంబు
నొందఁ జాలియుండుదురు మ♦హోపయుక్తి, వనితలకు లేక సాధ్వులై♦యునికిఁ జేసి
క. వనితలు మాయావినులై, యనిరూపితచిత్తవృత్తి ♦ నంచితరతుం
బనుపడ కుండుదు రైనను, వినినదికథ యొకటి సెపు ♦ వినిపింతుఁ దగన్. 748

భారతము, అను. ఆ 2 పద్య 172-181.

గీ. ఉపలములకంటెఁ గఠినంబు ♦ లొక్కవేళఁ గుసుమములకంటె నొకవేళఁ ♦ గోమలములు
గాన లజ్జాభయంబులు ♦ గలవొ లేవొ పువ్వుఁబోఁడుల హృదయంబు ♦ లెవ్వఁ డెఱుఁగు

శృంగారనైషధము, ఆ 7 పద్య 182.

సీ. ఖండశర్కరతోడఁ ♦ గలహించు పలుకులుఁ, బద్మవిలాస మే♦ర్పఱచు మోముఁ
దుహినాంశుకళలతోఁ ♦ దులదూఁగు చెయ్వులుఁ, జెమటఁ గ్రొన్నెత్తురుఁ ♦ జేయు మేను
నిలువెల్లఁ గరగించు ♦ నేర్పులయింపులుఁ, బువ్వుల కరుదైన ♦ పొందిదనేఁత
తమకంబు రెట్టించు ♦ తరితీపుతలఁపులు, సెనసిన మదిలోని ♦ యిచ్చగింత
ఆ. గలిగి కలువ నున్న ♦ కాలాహిపోలికిఁ, జెలఁగుచున్న సతుల♦ చిత్తవృత్తిఁ
దెలియ వశమె యెంత♦ధృతి గలవారికి, నాక కాదు నిఖిల♦లోకములకు. 750
ఆ. కోరి పతుల కెల్లఁ ♦ గూర్పువా రెవ్వరు, పతుల నైన సతుల♦హితుల నైన
బలిమిఁ జెలిమి నైనఁ ♦ బరహస్తమున నైన, హింస పఱతు రాత్మ♦హితముకొఱకు

భాగవతము, స్కం. 6 పద్య 516, 517.

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు♦లొల్లమి సేయుదు రొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్ష♦ణక్షణముల్ చపలాంచితచిత్తముల్
చక్కన వేసరం జనదు♦ పాయములం గడు నిచ్చకంబులం

జిక్కఁగఁ జేసి డాసి సతి♦చిత్తముఁ బట్టి చరింపఁగాఁ దగున్. 752

మనుచరిత్రము, ఆ 3 పద్య 89.

క. జన్నవము రాకమును పెవి♦శ్వప్రపంచ, మంతయును హృద్యత మొనర్చి♦యడఁచికొందు
రేమియెఱుఁగనికరణి మ♦హీనబాల్య, చేష్టఁ బ్రకటింతు రవని రా♦జీవముఖులు.

సీ. గజకర్ణముల కింత♦గర్వింపఁ గల్గనీ, కరికి నెమ్మదికి ని♦ల్కడలు లేవు
కమలమాపునకింత♦గర్వింపఁ గల్గనీ, కాంతనెమ్మదికి ని♦ల్కడలు లేవు
చలదళంబులకింత♦గర్వింపఁ గల్గనీ, లలననెమ్మదికి ని♦ల్కడలు లేవు
కామిసింపునకింత♦గర్వింపఁ గల్గనీ, పడఁతి నెమ్మదికి ని♦ల్కడలు లేవు

గీ. జలములకొకింత గర్వింపఁ ♦ గలుగనిమ్ము, కనుల నేత్రములకి ని♦ల్కడలు లేవు
కాఫుత వసుంతికల యిచ్చ♦కంబు లెల్ల, విశ్వసించినమగవాఁడు ♦ వెఱ్ఱివాఁడు.

శుకసప్తతి, ఆ 3.

చ. కిటుకవనంబులుం గనసు♦కృత్య మనస్వపునాటకుల్కలుం
గుటిలము కూచిమాగములు ♦ కుత్సితము ల్దరితీఁపుచూపులు
న్నటచటనందనంబులును ♦ జాగులబాగుల మెంచిచూడ నీ
యటపటము ల్ధరిత్రి జల♦జాక్షులకున్ సహజప్రవర్తనల్. 755

ప్రభులింగలీల పి. బ. ఆ 2.

# స్త్రీగర్హణము.

సీ. గజరాజగామిని♦కంఠసూత్రంబులు, కాలసూత్రంబులు♦గాఁ దలఁపక
పద్మపత్రేక్షణ ♦ బాహుపాశంబులు, కాలపాశంబులు♦గాఁ దలఁపక
కోమలిపీనవ♦క్షోజచక్రంబులు, కాలచక్రంబులు♦గాఁ దలఁపక
యుడురాజవదనమ్రు♦మారుదండంబులు, కాలదండంబులు♦గాఁ దలఁపక

గీ. కాలసూత్రంబు లెబ్బంగిఁ♦గడచు నరుఁడు, కాలపాశంబు లేభంగిఁ♦గడచు నరుఁడు
కాలచక్రంబు లేభంగిఁ♦గడచు నరుఁడు, కాలదండంబు లెబ్బంగిఁ♦గడచు నరుఁడు

శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 4.

గీ. వికటదుర్గంధభీభత్స♦వేషములకు, నాలయంబులు చర్మమాం♦సాస్థిపంజ
రములు నైన వధూశరీ♦రంబులకును, వ్యాధిగృహముల కింతైన ♦ వాసి గలదె. 757

ప్రబోధచంద్రోదయము, నం. మ. ఆ 4 పద్య 8.

చ. వలపులు చంచలాలతలు ♦ వావులు పంకములోనికంబముల్
సొలపులు నాసరఁగములు చూపులు ♦ శాటవేఘబాలముల

ఉ. చక్కెరపూఁతపూసినవిషంబులు భామలవాక్యవైఖరుల్
చొక్కఁగ విన్న మెత్తనవి యక్కరిబోఁడులచిత్తము ల్మణుల్
చెక్కినసంకెలల్ సతులచేష్టలు కొమ్మల నమ్మవచ్చునే
యక్కట మేకవన్నెపులు లంగన లెన్నిట నెన్ని చూచినన్. 763

కవిరాజమనోరంజనము, ఆ 1

మ. కులభూయిష్ఠపుఁదోలుబొమ్మ యగు కొమ్మం జూచి విద్వాంసుఁడుం
బులినశ్రేణి మనోహర......నవాంభోజాస్య నీలోత్పలా
క్షి లతాతన్వి యటంచు మత్తుఁడగు హర్షించున్ రమించున్ భళీ
భళి యంచున్ వినుతించు మోహవికృతుల్ భావింపఁగాఁ జిత్రముల్. 764

కం. తనుఁ బలఁచినఁ బరితాపము, గనుఁగొనఁ జిత్తభ్రమంబు గడువేడుకము
ట్టిన మోహంబు నొసంగెడు, వనిత దయిత యనుచుఁ బలుకవచ్చునె జగతిన్.

తే. ఎంతలో నింతికన్నుల యొగుటు నిలుచు, నంతలో నింపు వాటించు నమృతమట్లు
కాకలోచనమార్గంబు గతి చెనేని, గరళమునకన్నఁ బ్రాణసంకటముఁ జేయు.

ఆ. పడఁతి కొక్కదాని విడిచి యించుక యమృతంబు లేదు భువి విషంబు లేదు
అమృతలత లతాంగి యనురాగవతియైనఁ, గాక మెలఁగెనేని గరళవల్లి. 767

మ. నరకద్వారము సాహసాకరము పుణ్యస్వర్గవిఘ్నంబు దు
స్తరమాయాశతపేటి దంభనిధి దోషస్థాన మప్రత్యయా
త్కరనుక్షేత్రము కాలకూట మమృతాకారంబు స్త్రీయంత్రమున్
ధర నెవ్వాఁడు సృజించెఁ బూరుషగళోద్బంధకృత్యాపాశమున్ 768

భర్తృహరిసుభాషితము, ఏ. ల. నీతి 41-45.

సీ. కుంతలంబులయందె కుటిలత్వ మన నేల, భావంబులందును బ్రబలియుండు
............యందె కాఠిన్య మన నేల, హృదయసీమలయందు నెనసియుండు
గీలుకొప్పులయందె మాలిన్య మన నేల, బుద్ధిమార్గములందుఁ బొడమియుండుఁ
జంకుచూపులయందె చాంచల్య మన నేల, మోహంబులందును మొనసియుండు
గీ. దలఁచి చూచిన బోఁటులందె ధర్మగుణము, మాట లేటికిఁ గటికేళ మావిలాస
ఘనపరతరక్తి యాధరంబులందె కాని మానినులచిత్తమున లేదు మానవేంద్ర.

దశావతారచరిత్రము, ఆ 2

కం. కాంతల నమ్మఁడు లేదీ, మంతు లిసీ పతనులతలు మాయామృగముల్
కాంతలు జగజంతలు నిమ్మ, మంతయు లోకాపవాద మరయుదు మనిలోన్ 770

నిజశాసనోల్లంఘు ♦ నజువృత్రుకామిలో, లకురంగచయాభిల్లి ♦ లంజతల్లి
శాంబరీచంగభు ♦ జంగకృత్యవివేక, పుంజభూరుహవల్లి ♦ లంజతల్లి
గీ. బహువిధోపాయచణపంచ ♦ భద్రభద్ర, కుంజరమ్మగాధిపమతల్లి ♦ లంజతల్లి
నిఖిలవిటజనారంభముల్ ♦ నేలఁ గలఁపు, నంజ కరుడెంచు పెనువల్లి ♦ లంజతల్లి.
సీ. కిడుగుచందమ్మునఁ ♦ బడి మోఁదు తెరువాటు, కానికైన నొకింత ♦ కరుణ పుట్టు
బహుధనాపేక్ష చే ♦ బాధించునృపతికై, నను జనించు నొకింత ♦ కనికరంబు
చేరి కన్నడభూమిఁ ♦ జెఱ వట్టు పాశ్చాత్య, నృపతి కైన నొకింత ♦ కృప దలిర్చు
నతిపాతకులనొంచు ♦ యమకింకరుల కైనఁ, గదలించు నొక్కింత ♦ కారుణికత
గీ. యసమసాయకసమరక ♦ ర్మాంతరాయ, కరణపారీణవాక్క్రియా ♦ గౌరవమున
నఖిల విటకోటిధన మెల్ల ♦ నపహరించు, లంజతల్లికి దయలేదు ♦ లేశమైన. 776
సీ. కాలకూటమునందుఁ ♦ గల మేలువిస మెల్ల, రాలలోఁ గల్గు కాఠిన్య మెల్లఁ
బైశాచసమితిలో ♦ వలివికారం బెల్లఁ, గపికోటిలో నుండు ♦ కాంక్ష లెల్ల
సెలయేళ్లలోన వ ♦ క్రతలేదువక్రత లెల్ల, మయశంబరులలోని ♦ మాయ లెల్ల
ధార్తరాష్ట్రులలోనఁ ♦ దనరు మచ్చర మెల్లఁ బంచపాతకులలోఁ ♦ బాప మెల్లఁ
గీ. దీసి విటదోషరాశిచే ♦ ద్విగుణిఁ జేసి, యనృతపంకంబులోఁ గల్పి ♦ యశుచిభావ
రసము జిల్కించి నిర్మించె ♦ బ్రహ్మ కృపణ, తరుణహృద్భల్లియగు లంజ ♦ తల్లిఁ గాఁగ.
గీ. వేము పండ కున్న ♦ విషసమావిష్టంబు, పండెనేని మధుర ♦ ఫలయుతంబు
పండ్లు రాలు నప్డు ♦ వణ్యావృద్ధివిషంబు, వేశ్యమాతవిషము ♦ వేమువిషము. 778
నిరంకుశోపాఖ్యానము, ఆ 2 పద్య 40-43.
సీ. భావింపఁ దీర్ఘపు ♦ రేవుకాలు మొసళ్లు, చెఱకు పైఁ గ్రొవ్వాఁడి ♦ కఱకు వేళ్లు
గెంటని తేనియ ♦ జుంటిపై యీఁగలు, పూచిన మొగలిపైఁ ♦ బొదలు ముండ్లు
పంటచేలకునాఁగఁ ♦ బడినయోదంబులు, గందంపుఁదీవెల ♦ కాలఫణులు
కదలక పెన్నిధిఁ ♦ గాచుదయ్యంబులు, రచ్చరాపునబొమ్మ ♦ రక్కసియలు
ఆ. లంజతల్లు లనఁగ ♦ లక్షింపఁగా నిట్టి, కట్టిఁడులకు నలువ ♦ కరుణ లేక
బాతిమాలినట్టి ♦ బ్రతుకులు నిప్పుడుగాఁ, జేసి విటులగోడు ♦ వోసికొనియె. 779
ఆ. గణికవలని డెంత ♦ ఘన మైనసుఖ మేని, దాని తల్లి వలనఁ ♦ దప్పదోవు
మదిఁ దలంప నెట్టి ♦ మధురాన్న మేనియు, నీఁగ దొరలె నేని ♦ నిందు వెట్లు. 780
సీ భావజువిడిచిన ♦ పాడింటిపై బొల్లి, పాసుటుగ్గిగతి మేనఁ ♦ బలిత మొదవ
నం టుండకుండఁ బ్రా ♦ యముదుట్టుకొను నూడ్కి, పడు . . . లేచిచ ♦ న్పట్టుచు నవ
ననుధ వేచ్చాళిలాం ♦ సాదులఁ దిగిచిన, కొప్పు నాఁ కేయుచాంగ ♦ కోల యుచాఁట

యుండుట గష్టమే ♦ నొల్లమే ననువట్లు, పలుమాఱు విడువక ♦ పడఁత వడఁకి
గీ. నున్న లంజతల్లిఁ ♦ గన్నచో నల్లుర, గుండె భగ్గురనుచు ♦ నుండ దెల్లు
తేరిచూడ వెరచి ♦ చేరదు మృత్యువు, దానఁ గాదె చావు ♦ దప్పి మనుట 781

కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 110-112.

సీ. మునుపు జంగాలఁ జే ♦ సినభుజంగులఁ గన్న, గర్జించి కునుక మై ♦ కలుపవచ్చుఁ
బెట్టొకించుక తీసి ♦ కట్టైనఁ బట్టిచే, దట్టించు విటునిఁ గం ♦ దర్పు నైనఁ
బాదదక్షిణచేతఁ ♦ బడినఁ దజ్జామాతఁ, బఱిఘలించు విటశిఖా ♦ మణి యటంచు
ధనవంతుఁడైన మే ♦ త్త్రనివాఁడు చేరెనా, పుత్త్రిక కొప్పించుఁ ♦ బోటివిటుల
గీ. బయిసి మాలించుఁ దనపిన్న ♦ వయసునాఁటి, పడపునుగ్గులు దలపెట్టి ♦ సాంతజోలి
నోరువిడి వష్టఁ బచ్చిబూ ♦ తే రచించు, వివిధమాయామయోపేత ♦ వేశ్యమాత.

వైజయంతీవిలాసము, ఆ 2 పద్య 84.

క. పల్లిగల కయ్యానిశ్రయుఁ, జిల్లిగల కుటుంబునందుఁ ♦ జేర్చిన పీరున్
పల్లిగల వేశ్యఁ దగిలిన, పల్లవునుఖములును బోధి ♦ పల్లవసఖయుల్. 783

వైజయంతీవిలాసము, ఆ 3 పద్య 23

సీ. గణికాభుజంగసం ♦ ఘటనాగతాయాత, జామాతృభయదవా ♦ చాప్రభూత
వివిధమాయోపాయ ♦ విరచనప్రఖ్యాత, కర్కశోపలసదృ ♦ క్కఠినచేత
నందనీపల్లవా ♦ నందదత్తాఘాత, జనపాతకాన్యాంగ ♦ జప్రపాత
యష్టాతిగోత్రినా ♦ మాంకనిజతాత, యుల్కాఘుశతసమా ♦ యుస్సమేత
గీ. జైత్రిహృజ్జన్యసన్నష్ట ♦ శస్త్రజాత, కలుషపేషు తిరస్కృత ♦ జ్వాలదలాత
పరుషవాచార్భటీసమా ♦ తోప్యమాన, దీర్ఘనిర్ఘాత యద్దేవ ♦ దేవిమాత. 784

వైజయంతీవిలాసము, ఆ 3 పద్య 85.

గీ. నలిసినలిసిన చికిచికి ♦ నెఱులు బొమలు, పావములు పెన్దపుప్పింబు ♦ పడగపోదు
పూతదేవాదులక డెంబు ♦ మూతినిట్ట, తెల్లవెండ్రుక వీడెంపుఁ ♦ జొల్లు నిగుడ.
సీ. ఒదిగియాత్మవయోవి ♦ యోగంబుచే నంచ, నడక నడల్చె నా ♦ నడ కృశింపఁ
బుప్పంబు లుడివోవఁ ♦ బొలుపు వోనాడిన, తీవయో యన మేని ♦ చేవఁ ద్రోవ
మున్ను . . . . . . న్రాలకళ డిందు, కమలమో యన మోము ♦ గానుపింప
నధిక శరత్ప్రాప్తి ♦ నవతరించినశుభ్ర, మేఘమో యనఁగ ధ ♦ మ్మిల్ల మెనయ
గీ. నొంటిపలుసొంటితలపట్టు ♦ కుంటినడక, కంటికాటుక యొడివక్క ♦ కావిత్తి
ప్రేలి యూ కొత్తుఁ దెగయు ♦ వ్రేలవేలంది, తల్లియే తెంచిపిటుకాన్క ♦ తెల్లఁగాంచి

గీ. పరిస్రుతముగాని వెడతొఱిక్కుఁ ♦ బలుకు పలుకు, మోఱియు తేఁటులతోఁగూడి ♦ ముచ్చటాడు
సుబ్బి జాబిల్లిఁ బిలుచు రా♦కున్న నలుగు, మగువయొక్కతె మధుమదో♦న్మత్తి యగుచు.
గీ. శశివిహారంబుదీర్ఘమై♦సంభవించె, వికసితంబయ్యెఁ గగనార♦విందమపుడు
మధురసాస్వాదనోన్మత్త♦మత్తకాశి, నీకలోక్తి పరిసంగాభి♦నీతమగుచు. 943

కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 160, 161, 162.

ఆ. ఆకసంపుఁ జిప్ప ♦ నబ్జమండల మను, కప్పురంపు లప్పఁ ♦ గలిపి యున్న
వింత మధు వటంచు ♦ వెన్నెలఁ గని బయ, లానఁ జొచ్చె నోర్తు♦ మేనుమఱచి.

సుదక్షిణాపరిణయము, ఆ 3 పద్య 102, 104.

సీ. తతతతామరసాక్షి ♦ తలపంత మాడకు, వివివివీణాకంఠ ♦ వీఁకఁ దెమ్ము
పపపపాటలగంధి ♦ పాట పాడు మొకింత, కుకుకుకుందస్మిత ♦ కురులు ముడువు
ససససారసహస్త♦సరిదానవా నీవు, ననననాతుకనాలి ♦ నవ్వులేల
వవవవారిజముఖి ♦ వలదు నామలు చాలుఁ, గోకోకోకోమలి యేలఁ♦గోపవేగ
గీ. వినుచుఁ దపుదప్పు లాడుచు ♦ నతనిఁ గనిరి, మదననిర్ముక్తదుత్తూర♦మార్గణోగ్ర
హతుల నలసిరోయనఖేచ♦రాబ్జముఖులు, భర్తఁ దేల్చిరి మైరేయ♦పానకేళి. 951
సీ. పవనంబునకు నైనఁ♦బాయఁ దట్టఁగరాని, పయ్యెద కప్పులు♦బయలు పడియె
నధరపల్లవకాంతు♦లక్షిపద్మము లంటు. వేడ్కనో యొక్కింత♦విశ్రమించె
మాటాడ నేరని♦మార్ధ్యంబు విడనాఁకి, ప్రౌఢిమ తనుదానె ♦ గాఢమయ్యెఁ
బరమ యోగికినైన ♦ భావింపఁ గారాని, యానందసంపద ♦ యల్లుకొనియె
గీ. మఱపు ఘనమయ్యెఁ జేష్టలఁ ♦ తెఱఁగు విక్రృతిఁ, గనియెఁ దొలుతటి కోపమె♦క్కడకో చనియెఁ
గాపిశాయనమదమత్త ♦ కరివరేణ్యా, యానలకు నాథకేలిత ♦ ధ్యానలకును. 952

నారసింహపురాణము, ఆ 2 పద్య 159.

ఉ. వెడవిలుకాఁడు పోఁకముడి ♦ విప్పకు గుబ్బలు ముట్టరాకు క్రొ
మ్ముడి సడలింపఁ బోకు జిగి ♦ మోవియు నానకు మేలయారె రే
యొడయఁడు చూచుచుండె నిది ♦ యోజయె నీకని నివ్వారింపఁగాఁ
దొడఁగె నొకర్తు మైమఱచి ♦ తూరెకు మద్యమదంబు పెంపునన్. 953

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 199.

సీ. అతులార్కమణిఖచి♦తానర్ఘతరతప్త, హాటకచషకాంత♦రార్పితంబు
పానగోష్ఠీరత♦మానినీతనులతా, ప్రాకామ్యదర్పసా♦రభగుణంబు

కలశపారావార ♦ గర్భసంభూత సు,ధారసదాయాద ♦ తానుతంబు
పుంభావరతికళా♦రంభజృంభితసుద,తీజనమన్మథో♦ద్దీపనంబు
గీ. నగుచుఁ జేరెన్నికైన ది♦వ్యాసవంబు, సమయ మిది గొనుఁడనుచును♦సఖులు దెచ్చి
మదిని భయమును భక్తియుఁ♦గదురనెదుర,నిడినఁజేకొని త్రావుచు♦నిందుముఖులు.

మ. ఇదికర్పూరసుగంధబంధురము భో♦గేచ్ఛానుకూలంబు సు
న్మదకాంతాపురుషాయితోల్లసనకృ♦న్మారపత్రాపస్థిరా
భ్యుదయప్రాప్తఫలంబు సుమ్మనుచుఁ దా♦ముట్టాడుచుం గాంతునిం
గదియం జేరి యొసంగి రామదిరవే♦డ్కన్నెచ్చెలుల్వ్రాడఁగన్. 955

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 3 పద్య 73, 74.

చ. కుముదదళాక్షియొక్కరితె ♦ గొంతున కానఁగఁ గ్రోలి మత్తచే
తమహిని వ్రాలుటొప్పె సుమ♦ధార్మికుఁ డన్నెఱబొమ్మలాటవాఁ
డమరఁగ నాటకంబున హళా♦యల్ దగఁ ద్రిప్పి ముగించునప్డు వా
లెము నొకపక్క కీలు సడ♦లించిన జంత్రపు బొమ్మయో యనన్. 956

కవిజనచకోరచంద్రోదయము, ఆ 4.

ఉ. ఆజికి నేఁగు నత్తఱిన ♦ యంగజకేళినిగూడునత్తఱిం
దేజము విక్రమంబు ధృతి ♦ ధీరతయుం గడు సాహసంబునుం
భ్రాజితమైన యౌవనముఁ♦బ్రాప్తము లౌటను నై జగంబునం
దేజను లైనఁ జేసెద ర♦భీష్టము దీఱఁగ మద్యపానమున్. 957

సీ. అప్పాటివిటులకు ♦ నవల నంతంతకుఁ, గ్రమముగా మద్యపా♦నములవలన
రయమొప్పఁ గన్నుల ♦ రక్తిమం బలరెను, వేడినిట్టూర్పు లా♦విర్భవించె
మఱిమఱి వాక్కుల ♦ మద్యంపువాసన, లప్పటప్పటికిని ♦ గుప్పుఁ దొణఁగె
వింత సొలపు నాపు♦లింతలు హెచ్చె దే,హంబులఁబులకాంకు♦రంబు లొదవె
గీ. భ్రమతలు జనించెసరససం♦భాషణములు,దొట్రుపడసాగెమమతని♦ద్దురలుగ్రమ్మె
శ్రమజలములూరెఁగడునల♦సటలుదోఁచె,తనుపులొక్కింతపరవశ♦త్వంబునొందె.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 8.

# మన్మథోపాలంభనము.



చ. తోడిఁబడఁ బాటి పై కుతికి ◆ ధూర్జటికంటికడిందిమంటలో
నడపాడగానరాక తెగ◆టాటియుఁ గాలిన యట్టి మ్రోడుకై
వడి రతిలోచనాంబువుల ◆ వాన నిగిర్చితె పాంథబాధకై
మడియ కనంగ! యవ్వేళఁది ◆ మంగళసూత్రమహత్త్వమెట్టిదో. 959

మనుచరిత్రము, ఆ 3 పద్య 46.

శా. నీబాణంబులు రాల నీధనువు ఖం◆డీభూతమై పోవ నీ
జాబిల్లిన్ ఫణియుంట నీబలము లా◆శావీథిపాలై చనన్
నీబంట్రౌతుతనంబు స్త్రీలయెడ నే◆ నిన్నెవ్వరున్ నవ్వరే
మాబాలామణి నేఁచఁబోకు మకటా ◆ మర్యాద గా దాత్మజా. 960

ఇందుమతీపరిణయము, కు. ధూ. ఆ 4 పద్య 53.

మ. అణుమధ్యాతతిమీఁద నంతవిరసం◆బౌ చాపమున్ సీధుపా
రణమత్తా గొని సోలునారి శిఖి మి◆త్రంబైన తేరున్ వనాం
గణలుబ్ధానుగకోటిఁబూని వెడలం◆గా నిట్టి దేధర్మ మే
గుణమే యొక్కుడిదే బలంబు సుమనః ◆ కోదండ నీకెంతయున్. 961

వనుచరిత్రము, ఆ 4 పద్య 41.

సీ. భామానిరూఢి గ◆న్నపడ మండలాగ్రంబు, మెఱయించు మొదటనీ◆మేనమామ
కొమ్మలపైఁ బండ్లు ◆ కొఱికి లావులనల్ల, ధాటికన్పించు నీ◆ఘోటకంబు
కాంతాళిపైఁ బరా◆గస్ఫూర్తిఁ గల్పించి, చెనకంగఁ జూచు నీ◆చికిలితూఁపు
నారులమ్రోఁత నా◆నందించి నిలువెల్లఁ, గన్నులు దాల్చునీ◆కార్ముకంబు
గీ. బళిబళీ నీకు బాకైన◆తలిరుటాకు, లడవి లతకూన లన్నఁబై◆నంటి నిలుచు
నీవు మామీఁద శౌర్యంబు ◆ నెరపు టరుదె, మానినీప్రాణచోరర◆మాకుమార.

కువలయాశ్వచరిత్రము, ఆ 4 పద్య 29.

ఉ. ఏయెడ విల్లు నమ్ము లోక ◆ యించుక యేమఱకుంట పాంథులం
గూయఁగఁ బట్టి గొంతుకలు ◆ గోయుట యీశ్వరునంతవానిపై
సాయక మొక్కఁడేసి పగ ◆ సాదుకొనం దుది సూడు ద్రిప్పటన్

బోయవు నీకు నంతేరముఁ ♦ బొందు నె యొందును శంబరాంతకా. 963

బహులాశ్వచరిత్రము, ఆ 3.

చ. ములినతనంది నీగుణము ♦ మూలల పాలగు నీవిజాతియా
బలమును నెక్కుడయ్యెడవి ♦ పాలగు నీదగు గంట్లధర్మమా
బెలుచకొనా మొదల్ చెడియు(?) ♦ పిప్పికిఁబాలగు నీ జయాంక మా
పలువల పాలుగాడె యిటు ♦ పాంథుల బాధ యొనర్ప దర్పకా. 964

ముకుందవిలాసము, ఆ 3 పద్య 67.

సీ. విషయలిప్తంబులై ♦ వెలయు నారాచంబు, లూరక మొఱయుచు ♦ నుండు నారి
యిలఁబడి నూటార్లు ♦ మొలచునబ్రిపువిల్లు, పెల్లార్చి పొదలెడు ♦ నల్లమూఁక
నీళ్ళలో జాడలు ♦ నెమకెడు టెక్కెంబు, కడు నగ్గిచాయల ♦ నడరు నురియ
యడవిఁగాచుక యుండు ♦ గడసరిసంగాతి, యీలవెట్టిన నొద్ద♦ఁ బ్రాలు సచివుఁ

గీ. డొరుల కేరికిఁ గనఁబడ ♦ కుండు రూపు, దనరఁ బాంథులచిత్తని♦త్తముల దోఁచు
తస్కరుఁడ వీవు ముగుదలఁ♦దఱుముటరుదె, కుంతితామ్ర స్త్యనగచాప♦కుసుమచాప

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 140.

ఉ. వారఁట లేఁటిజోకనలి ♦ నారఁట తేరఁటచిల్క సౌరభో
ద్గారఁటవిల్లు పూతనయ ♦ గారఁట చుట్టము శైత్యపున్ సదా
చారఁట కమ్మగట్టి పరి ♦ చారఁట కోయిల కేతసిభవ
ద్వారఁట యిట్టి నీకొదుగు ♦ వారఁట లోకు లదేమి చిత్రమో. 966

సీ. కుటిలోగ్ర నిటలదృ ♦ గ్ఘోరాగ్ని నీకు ని, ర్బంధపంచత్వంబు ♦ ప్రాప్త మగుట
యాకారహీనుఁడ ♦ వై యుండియును గాలి, చందాన లోక సం♦చారి వగుట
వేళఁ గాచుకొని యా♦వేశించియింతులఁ బురుషులఁ బీడపా♦ల్పఱచుచుంట
నీవు సోఁకిన నెంత ♦ నీతిశాలికినైనఁ, బుణ్యాపాపవివేక ♦ బుద్ధి చెడుట

గీ. యొంచి చూచిన భూతమ♦వీవు మదన, సంశయము లేదుశివుఁడుమో♦క్షప్రదాత
యతనిచేఁ దుంగియును ముక్తి ♦ నందలేక, గ్రహమవై తివి విరహుల♦కర్మవశత.

కవిరాజమనోరంజనము, ఆ 3.

ఆ. కొలఁతి పొలఁతితోడఁ ♦ పురుషుండు బురుషుతోఁ, బొందుసేయఁ దగును♦ బోరఁ దగును
పురుషుఁ డబలతోడఁ♦బోరాడ రా దిందు, రాకు మార యిందిరా కుమార. 968

రుక్మిణీపరిణయము, సత్య. భ. ఆ 2 పద్య 304.

సీ. ఎత్తిన నీధ్వజం ♦ బేటిపాలైపోను, పాంథుల నేఁచకు ♦ పంచబాణ
ఆలరు నీవాహనం ♦ బడవిపాలైపోను, పథికుల నేఁచకు ♦ పంచబాణ
నీచేతి పెనువిల్లు ♦ నేలపాలైపోను, పడఁతుల నేఁచకు ♦ పంచబాణ
నీరూపవిభవంబు ♦ నెఱిభస్మమైపోను, బలముల విడువకు ♦ పంచబాణ
గీ. పతివియోగులడాయకు ♦ పంచబాణ, బాల నని విన్నవించితి ♦ పంచబాణ
పాపమున కేల రోయవు ♦ పంచబాణ, పచ్చి బోయవు గదరోరి ♦ పంచబాణ.

పద్మినీపరిణయము, ఆ 4 పద్య 43.

క. బలుసాధనములు దాల్పక, నలరుం గైదువులు దాల్చు ♦ నట్టి మత మహో
తెలియఁబడె మాకు సుమకో, మలగాత్రిల నేఁచఁ గాదె ♦ మనసిజ నీకున్. 970

కవిజనరంజనము, ఆ 2 పద్య 37.

ఉ. ఉల్లము చల్లగాఁ గనిన ♦ యొప్పులకుప్పయిన్ సుమాస్త్రముల్
పెల్లుగ నేసినట్టి కడు ♦ పెద్దవు నీకొక లక్ష్యమా నవో
త్ఫుల్లసరోజలోచనల ♦ పొంక మడంచుట మన్మథా ధరన్
తల్లికి ముక్కుఁగోసి పిన ♦ తల్లికిఁ గమ్మ లొసంగ నేర్తురే. 971

మదనసాయకవిలాసము, ఆ 4.

సీ. తావకంబగు బాణ ♦ పావకంబును బట్టి, కన్నీటియేటిలోఁ ♦ గలపి వైతు
భవదీయ సాహాయ ♦ పటుమందపవనుని, వేణీభుజంగికి ♦ విందుఁ జేతు
నీశరాసనమును ♦ నిపుణత ఖండించి, రసనకుఁ బండువ ♦ నెవ్వస నొనర్తు
త్వత్సహకారి నూ ♦ త్నాంబుదంబుల దీర్ఘ, నిశ్వాసభరమున ♦ నిగ్రహింతు
గీ. చంద్రబలమున్నదనుచు ను ♦ త్సాహమేల, దీప్తరోమాళిరాహువుం ♦ దెలియఁజాల
వబల యని నన్ను నెఱపింతు ♦ వసమనయన, గోచరతనొందవెఱచు లే ♦ గుణము మదన.

ఉషాకళ్యాణము, ఆ 2 పద్య 84.

గీ. అతనుఁడవు నీవు పాంథులఁ ♦ నణఁపఁ దలఁప, నైనదోషాకరునిసహా ♦ యమునఁ జేసి
యేఁచెదవు దుష్టసహవాస ♦ మెట్టిశిష్టుఁ, జెఱుచుననుమాట తప్పునే ♦ సరసిజాస్త్ర.

మిత్రవిందాపరిణయము, (రా. జ. రం.) ఆ 3.

చ. అరయఁగ నీకుఁ డీవు నస ♦ మాంబకు లౌదురు గాన వేగ నీ
యురుతరబాణలాఘవము ♦ నుగ్రనిపైఁ బ్రకటింప కిప్పుడో
సరసిజబాణ నన్నబల ♦ సారెకు నేఁచఁగ నీకుఁ బాడియే
పరిణయము న్వివాదమును ♦ భాసిలుఁ దుల్యుల కం చెఱుంగవే. 974

కాళిందీపరిణయము, ఆ 3 పద్య 75.

సీ. వసుధఁ బద్మాప్తుని ♦ వలన నుద్భవమౌట, నవలాక్షుపదహతి ♦ నంటఁ బడుట
ఘటితసత్యాధారు♦నటఁ జేరకుండుట, నతులిత నీలమే♦ఘాంగుఁడగుట
దక్షిణాశాస్పర్శ ♦ నాక్షేప మొందుటఁ, గాలాంతమున మతి♦కానఁ బడుట
సుమనోరసాప్తి భా♦నురధర్మగుణుఁడౌట, నేవేళ హింసల ♦ కియ్య కొనుట
గీ. హరికుమారక నీకు న♦య్యంతకునకు, భేదమిఁక నెద్ది ధర్మవి♦వాదలీల
మెఱసి జీవులబాధలు ♦ పఱచు వేళఁ, దలఁప నంతకునీవెయం♦తకుఁడ వైతి. 975
విశ్వకర్మపురాణము, ఆ 4.

క. సాగసగర్భుఁడు మాకే, న్వాయు నడలుఁ జేయవుండ ♦ వలయునని మమున్
నారులఁ జేసిన నరినై, యేరీతిం దారసిలితి ♦ విక్షుశరాసా. 976
భరతాభ్యుదయము, ఆ 2 పద్య 79.

క. మదనా, సదనాసూనదో,ర్మదనా నాకుసుమబాణ ♦ మండలినాశే
రెదనాటుటకదనాని, కదనాతిశయంబుఁజూప ♦ గమనింపకురా. 977
సర్వకామదాపరిణయము, ఆ 2.

క. కలువలదొర యల్లుఁడనై, కలువలె తూఁపులుగఁ దాల్చి ♦ కర మలరెడునీ
కలుకమెయి నక్కటకటా, యసు గొందిన కలువకంటి ♦ నలఁచుట తగునే. 978
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 32.

---

# చంద్రోపాలంభనము.

సీ. విరహిణీవధమహా ♦ దురితపంకకళంక, కలుషితాత్మకుఁ డైన ♦ ఖలుఁడు వీఁడె
గరళకూటకఠోర ♦ కల్పాంతవహ్నికిఁ, దోఁబుట్టువైన ఘా♦తుకుఁడు వీఁడె
చండదీధితికర♦జ్వాలమండలములోఁ, బోఁద్రిఁబొందిన మహో♦గ్రుండు వీఁడె
బాడబంబునుదానుఁ ♦ బాథోధికుక్షిలో, సరిఁబొత్తుమన్నదు♦ర్జాతి వీఁడె
గీ. సైంహికేయనిశాతదం♦ష్ట్రావిటంక, విషరసపవిత్రపాకభా♦వితుఁడు వీఁడె
గగనమను దవ్రిభూమినే♦కతమ విరుగు, నదరులుమి సెడికొంటివద♦య్యంబువీఁడె.
శృంగారనైషధము, ఆ 2 పద్య 122.

ఉ. కందళితానురాగములఁ ♦ గావు మనంబులు విన్న యంతలో
నందఱు పారవశ్యపద ♦ మందురు చల్లఁదనం బొకింత లే
దిందున శంకరాభరణ ♦ మెట్లయి తీవ్ర శశాంక నీపదం
బుం దుది నంతశూన్యమగుఁ ♦ బో వివరింపఁగ మాట లేఁటికిన్. 980

పంచతంత్రము, (బై. వేం.) ఆ 4 పద్య 160.

సీ. తొలువొల్తుఁ గమలమి ♦ త్రునివంకరూపాట, పఱొధ్వరధ్వంసి ♦ తన్నుఁ గనుటఁ
బరివేషమిషమునఁ ♦ బాశంబుఁ దాల్చుటఁ, గప్పుదేహమునందుఁ ♦ గానఁబడుటఁ
గాలవశంబునఁ ♦ గాని తోఁపకయుంట, సతతనిష్ఠురగదా ♦ న్వితతఁ గనుటఁ
బూని పాండు క్షేత్ర ♦ మునఁ బ్రవర్తించుటఁ, బ్రికటానురాగతా ♦ రకుఁడగుటను
గీ. నంతరం బెట్టి యాత్మలో ♦ నరసి చూడ, రాజ నీకును నలధర్మ ♦ రాజునకును
బ్రాణిలోకంబు బాధలఁ ♦ బఱుచునపుడు, ధర్మపథ మొక్కఁ డెక్కఁడా ♦ ధన్యునందు.

మనుచరిత్రము, ఆ 3 పద్య 37.

శా. రాజీవాక్షుల నేచుపాతకివి చం ♦ ద్రా రాజవా నీవు నీ
రాజత్వంబునఁ జక్రియుల్మనియెనో ♦ రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనొ డిందెనో యహిభయో ♦ ద్రేకంబు తాఁ జెల్లరే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే ♦ రాహోట దోసాగ్రహే. 982

ఉ. ఇంతుల నేఁచు పాతకమ ♦ సెంతట నంతటఁబోదు పాంథులో
కాంతక నిన్ను ఘోరతమ ♦ మైఘనమై యజహత్కళంక మై
వంతలఁ బెట్టియాఁపది ♦ వక్రికలు సేయక పూర్వపక్షపుం
గంతుల కేమి మాపెడపు ♦ గా తుది నీ బహుళార్తి ఖేదముల్. 983

వసుచరిత్రము, ఆ 4 పద్య 27, 28.

సీ. శ్యామకంఠలలాట ♦ సామీప్యపరితప్త, మానంబులుగఁ గళల్ ♦ మార్చి మార్చి
సింధూపకాంతస్న ♦ మింధనబడబాన, లోగ్రకీలలదగ ♦ నూని యూని
ప్రత్యమావాస్యసం ♦ భవపద్మసంయోగ, కలితాధికోష్ణమఁ ♦ గ్రాఁగి క్రాఁగి
విప్రయోగోష్ణపాం ♦ థపాణిపరిపాన, భూమజంబగు కాఁక ♦ పొంది పొంది
గీ. కాలకూటాహ్వయభ్రాత ♦ పాలుపట్టి, పుచ్చుకొనుదాహకత్వంబు ♦ పోచి ప్రోచి
యింత వేఁడిమి సాధించి ♦ తేమొ చంద్ర, నన్ను నేచుటకే ప్రయ ♦ త్నంబుతోడ.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 153.

శా. తాపుల్లుల్కెడు మేనితీవకుఁ బరీ ♦ తాపంబుఁ గావించునీ
జీవంజీవమనోజ్ఞమూర్తి యుకటా ♦ శీతాంశునా కాదు శో

భాసై రూప్యమునన్ జనభ్రమదమా ♦ భస్మావృతానంగతే
జోవైశ్వానరవిస్ఫులింగము సుమీ ♦ చూడన్ దిశానాయకా. 985

చారుచంద్రోదయము.

గీ. రాలు నీరుగఁ జేయు క♦రమ్ము నేర్పు, దనరు నీకెంత యుంతి చి♦త్తముఁ గలంప
నబ్జ గుడిగ్రమింగ నేర్చిన ♦ యట్టివాని, కందులో లింగ మొక వడి♦యంబు గాదె.

నాగరఖండము, ఆ 5 పద్య 90.

సీ. మొదలవనగ్రామ♦మున జన్మమొందుట, పొడయె మెమ్మె నెమ్మెనఁ♦గడలు కొనుట
పాంథసంఘములకు ♦ భయమింతచూపుట, గట్టిగా మృగి ననిఁ ♦ బట్టుకొనుట
పశుపతి శీర్షంబు♦పైఁ జొకళించుట, నఖరపాతాహతి ♦ నాటుకొనుట
మునుపు సత్సంతాన♦మున వాసిలోఁ గొంట, పుండరీకవరాఖ్యఁ♦బూనుకొనుట
గీ. బెబ్బులికి నీకు నింతైన ♦ భేదమేది, పదరి కన్నుల ముందఱఁ ♦ బడ్డవాని
గాని చెనకనిగుణ ముండు♦దానియందు, నొకటి కారుణ్యరహితయో♦యుత్పలహిత.

బహులాశ్వచరిత్రము, ఆ 3 పద్య 42.

ఉ. ఆగగనాంతరభ్రమణ♦మందుట నుత్పలసక్తిఁ జెందుటన్
యోగము భూతభర్తకడ ♦ నొందుట మైపటయుక్తిఁ బొందుటన్
హోగణియింపఁగా గ్రహము♦వౌట నిజంబగుటన్ నిశాట నీ
వేగతి పాంథవేధ ఘటి ♦ యింపక నుందువె యుంటిసిక్కరన్. 988

ముకుందవిలాసము, ఆ 3 పద్య 72.

శా. సాయంసంధ్యకు రావొకప్పుడది న♦ష్టంబైన మధ్యాహ్నసం
ధ్యాయోగం బొక యింత లేదె కద ప్రా♦తస్సంధ్యకున్ సింధువున్
డాయంబోయి మునింగి పైటఁగనుప♦ట్టంగాన మేమీ తమీ
శా యీవన్నియమంబులేదు ద్విజరా♦జత్వంబు నీకర్హమే. 989

పాంచాలీపరిణయము, ఆ 3.

సీ. కువలయప్రియుఁడని ♦ కొనియాడుటకుఁ జాలఁ, జక్రాహితత్వంబు♦సలుపకున్న
బుధవత్సలుండని ♦ పొగడుట కెంతేని, గురువిరోధంబునఁ ♦ గొఱల కున్న
గోత్రాభ్యుదయుఁడను♦కొనుటకు నాత్మసత్సంతతి నడఁగింపఁ ♦ దలఁప కున్న
మనుమార్గవర్తి యం♦చు నుతించుటకు రాజ, కాంతావలుల బిట్టు♦కరఁప కున్న
గీ. రాజశబ్దంబు నీకు సా♦ర్థముగఁ జెల్లు, గాక యూరకె లోకాప♦కారివగుచు
నెఱయు నీ రాజశబ్దంబు ♦ నేతిబీర,కాయ చందంబుగాదె ప్రా♦లేయకిరణ. 990

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 124.

సీ. శ్రీసహజోన్నతిఁ ♦ జెలువొందుటయె కాఁక, శ్రీసహజోన్నతిఁ ♦ జెలువుఁ గంటి
సత్కళానిధివై ప్ర♦శస్తిఁ గాంచుటగాఁక, సత్కళానిధివై ప్ర♦శస్తిఁ గంటి
కువలయహితవృత్తిఁ ♦ గొమరుమీఱుటగాఁక, కువలయహితవృత్తిఁ ♦ గొమరుఁ గంటి
హరిణలక్ష్మఖ్యాతి ♦ నందియుండుటగాఁక, హరిణలక్ష్మఖ్యాతి ♦ నందఁ గంటి
గీ. కదెసి విషమాంబకుని కాప్త♦గరిమగనుట, గాఁకవిషమాంబకునికాప్త♦గరిమఁ గంటి
తనరెనీవింత నీవింత ♦ ఘనుఁడ వయ్యుఁ, జందమామ మాచెలినెంచఁ ♦ జందమామ.
కవిరాజమనోరంజనము, ఆ 3

సీ. దోషాకరసమాఖ్య ♦ తోనుండుటయె కాదు, సత్ప్రభాహరణంబు ♦ సలిపినావు
సత్ప్రభాహరణంబు ♦ సలుపుటయే కాదు, చెలియలింటికిఁ గీడు ♦ దలఁచినావు
చెలియలింటికిఁ గీడుఁ ♦ దలఁచుటయే కాదు, కుముదాశ్రయాకృతి ♦ నమరినావు
కుముదాశ్రయాకృతి ♦ నమరుటయే కాదు, రాకాసివై మిన్ను ♦ ప్రాఁకినావు
గీ. ఇంతరాజవు నిను మెచ్చ ♦ నెవరి తరము, విరహిణీమారణోద్యోగ ♦ విభవమెల్ల
నీకె చేకూడె మాదృశ ♦ లోకపూర్వ, జన్మదుష్కర్మవశమున ♦ శర్వరీశ. 992
వాసవదత్తాపరిణయము, (వ-వీ) ఆ 3 పద్య 90.
గీ. కాలమహిపాధిరాజతఁ ♦ గదలివచ్చి, కిరణపాశమ్ములను గూర్చి ♦ విరహిజనుల
గాసిఁ జేసెదవిప్పుడు ♦ దోసకారి, రాజవా నీవు యమధర్మ ♦ రాజుగాని. 993
రాధికాసాంత్వనము, ఆ 2.

మ. తొలుతన్నిప్పులకుప్పచందమునఁ దో♦డ్తోనెంతయుం ఘోరకుం
డలితాహీంద్రముచాడ్పునన్ సహజచం♦డత్వంబు నీరూపమే
యిలపైఁ జెప్పకచెప్పఁ బాంథతతికై ♦ యేతాదృశుం జంద్రు ని
న్నలరం బోల్పుమటంచు వేఁడఁదగునా ♦ యస్మాదృశుల్ వీఱుఁడుల్. 994
కవిజనరంజనము, ఆ 2 పద్య 45.

సీ. వనములో సతతంబు ♦ వాసంబుఁ జేయు త,మ్ముల సిరుల్ గొన్న దు♦ర్బుద్ధి వీవె
నిందకు నొడిగట్టి ♦ నిర్భయంబున గురు, రమణిఁ జేకొన్న దు♦ర్నయుఁడ వీవె
విబుధసేవితుఁడైన ♦ విశ్వేశ్వరునిమస్త,కంబు ద్రొక్కినదురా♦గ్రహుఁడ వీవె
దినమొకరీతి యప్పునఁ బుచ్చ చక్రిద్వి,జతతి నణఁచెడు దు♦ర్జనుఁడ వీవె
గీ. వసుధ రాజవటంచు దై♦వజ్ఞులిచ్చ,కమున కహూరిఁ దందురు ♦ గాదె యేకు
గుణమె యక్రూరవృత్తి నీ ♦ చెలిమి శశిధర, శశి జగద్వామ్యుడే క్రూర♦సంజ్ఞఁదనకె.
దిలీపచరిత్రము, ఆ 4 పద్య 40.

సీ. నీకరంబులపయి ♦ నిలిపిన కమలాక,రము లైన మునుపటి ♦ క్రమముఁ దప్పె
నినుఁగన్నయంతన ♦ నీరధి జడగతి, యంతకంతకు భువి ♦ నతిశయిల్లె
నీ ఘనాలోకంబు ♦ నెరయ నాకసమనం,తాఖ్యమయ్యెనుసాంత♦మగుచుఁదోఁచె
నిన్నంధఘాతకు♦నింజెంది రాతిరి, యవ్యయదోషాఖ్య ♦ నధిగమించె
గీ. నార నీ యుత్పలాశక్తి ♦ నధికమగుచు, రాత్రిచరభావ మెంతయ్యె♦రసిక జనులు
నిత్యపరిపూర్ణు లగుఁగాక ♦ నీకనింద్య, భావమేరీతిఁజొప్పడు ♦ బహులహైన్య.

సర్వకామదాపరిణయము, ఆ 2.

ఉ. కొంచక నీవు సత్కృపుల♦కుం దెలివొందఁగఁ గౌముదిఁ బ్రసా
దించితి వంచు మిన్నెగసి ♦ తెంపునముగ్ధులనంగఁ జంద్రబా
ధించెదు సంధిచేయుమని ♦ తీరి నభోమణి కర్తవచ్చినన్
గొంచెము కాఁకయుందుగద ♦ కోరి కళానిధి పొటఁ బాగ్గతన్. 997

విశ్వకర్మపురాణము, ఆ 4.

గీ. ఒకటి రెండు నాఁడులుచెల్లి♦యున్ననాఁడె,చూడరాదనినినుఁబెద్ద♦లాడుచుండఁ
బెద్దవాఁడవై మిన్నంది ♦ మెలఁగు నిన్నుఁ, జానలకుఁజూడవచ్చునే♦చందమామ.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 38.

---

# మలయానిలోపాలంభనము.

ఉ. అక్కట గంధవాహ తగ♦వా హరిణాంకునిఁ గూడి పాంథులం
బొక్కఁగఁ జేయఁ బావనుని ♦ పొందొనరించి జగమ్ము లేర్చు నీ
యక్కఱగామిమానవది ♦ యట్టిద చుల్కనివృత్తి దుర్గనుం
డొక్కనిఁ జొచ్చి క్రిందుపడు ♦ నొండ్లకుఁ గీడొనరింపఁ గల్గినన్. 999

మనుచరిత్రము, ఆ 3 పద్య 50.

ఉ. కీలియు నీవుఁగూడి యుడి♦కింతురు లోక మటంచు నెప్పుడున్
మూలల నైచె మిమ్ము నలు♦మోముల వేల్పటు నైచినం జనం
జాలక హవ్యవాహుని ♦ సంగతినుండి జగంబుఁ గాలుపం
గాలుపదంబుచేరితి పరి♦కింపన నీననుకంప చాలమిన్. 1001

ఉ. నిబిడతమోనుబంధమహా♦నీయ మహామహిజాతమైత్రిమైఁ
ప్రబలుశనైశ్చరుండ వతి♦పాంసుల నీవిఁక భీకరాకృతిం
గబళముఁ గొందుగాఁక తిరిజ♦గంబు వడంక బెడంక నిత్తువే
యబలల జీవనానిలము♦ లన్నియు నార్ఘుష కేతుసంగతిన్. 1002

వసుచరిత్రము, ఆ 4 పద్య 46, 50.

సీ. అంతకాశాసమా♦యాతత్వ మరసినఁ, జలువకు నీకును♦ జాల దవ్వు
శౌదరిమూర్తిత్వవా♦ర్తలు విచారించినఁ, జలువకు నీకును♦ జాల దవ్వు
దహనసారథ్యత♦త్పరత భావించినఁ, జలువకు నీకును♦ జాల దవ్వు
శ్రీఖండవిషధరో♦ద్భిష్టత యెంచినఁ, జలువకు నీకును♦ జాల దవ్వు
గీ. పలుకు లేఁటికి నీయందు♦ మలయపవన, చలువ గలదనునట్టి సం♦శయము దగదు
వసుధ నెంగైనఁ జండాల♦వాటిలోన, బ్రాహ్మణగృహంబు వెదకుట♦భ్రాంతి గాదె.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 160.

ఉ. పూనిపరిచేతుని న్మతియుఁ♦ బుణ్యజనేశ్వరు జోడు గూడుటల్
మాని యమా నియుక్తి నస♦మాననిశాటకృశానుసంగతిన్
మానకనూని మానినుల♦ మానము నొంచితి వౌర దక్షిణా
శానిల మందవృత్తులకు♦ నకట భూరివిచారమున్నదే. 1004

ముకుందవిలాసము, ఆ 3 పద్య 127.

సీ. మున్ను మహాబిలం♦బున సముద్భవ మొంది, శైలాగ్రమున నుండి♦ బైలువెడలి
ఘన వనాంతరముల♦ ననయంబు మెలఁగుచు, నమితనికుంజగు♦ల్మములఁదూటి
జంతుకోటికిఁ బ్రభం♦జనలీలఁ జూపుచు, విస్ఫుటమృగచర♦వృత్తినలరి
పాంథుల గుండియ♦ల్పగులంగ నదఁటుచు, వితతమహాబలో♦ద్ధతి నెసంగి
గీ. చెలఁగి విహరించు గబ్బిబె♦బ్బులివి నీవు, దాడి మెఱయంగ భీరులఁ♦దఱుముటరుదె
యజ్ఞులెల్ల జగత్ప్రాణుఁ♦డంద్రు గాని, కామినీమారణోత్సాహ♦ గంధవాహ.

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 148.

క. ఫణిరోమరేఖయగు న, గ్గణికాంగనమీఁదఁ బోవఁ♦గా వెఱచి సమీ
రణ మమ్మ్ర సేచఁ దగు గా,రణమేమి తలంగుసత్వ♦రత సద్భుజ్ఞిన్. 1006

చంద్రరేఖావిలాపము, ఆ 2.

చ. శమనుని దిక్కునం బొడమి♦ సర్పముఖంబుల బైలువెళ్లి ని
త్యమును బలాశసంగతులు♦ దప్పక త్రిమ్మరు నట్టి నాలిభూ

తేమ పవమాన నీకుఁ గల♦దా మతిభూతదయార్ద్రబుద్ధి యు
క్తమకద నీకుఁ గొమ్మల న♦దల్చుట నీవసి ధూళిపాలు గాన్. 1007

కవిజనరంజనము, ఆ 2 పద్య 47.

ఉ. ఘనులఁ దొలంగఁ జేయవె ప్ర♦కంపము నందఁగఁ జేయవే మహా
ఘనతరువుల్ సదాశుగత ♦ గైకొనవే హుతభుక్క్రియుండన
త్రినయనమూర్తి భాజివయి ♦ రెండవభూతమవై ప్రభంజనా
నిను వినుతించినన్ విరహి♦ణీతతులన్ గరుణింప నేర్తువే. 1008

బిల్హణచరిత్రము, ఆ 4 పద్య 91.

సీ. మానపీనపయోధి ♦ మధుపసంగతిఁ గూడి, పుష్పాభ్యుదయావేశ ♦ భూరిలీల
నమరు కొమ్మలతోడ ♦ ననమాతనుక్రీడ, లాచరింపుచును జాడ్య♦మునఁ గ్రాలించి
ఘుమ్మను వాసనల్ ♦ గ్రమ్మ నీవిటు మెల్ల, మెల్లన నచ్చితే ♦ మేలుసోఁకు
దయ్యము పట్టె యా♦ధరనున్న లతకూన, లెల్లను తలఁద్రిప్ప ♦ నేమిజెప్ప

గీ. మారుకిరియ నల్ప నెరవరి♦మద్విభుండు, మంద్రగమేమియుఁద్రోఁచక♦మాని స్వభుండు
పంచమార్గాటినిటుజూడు ♦ పైకములకు, నీకు సుఖమెందు లేదిటు♦రాకుపోమ.

ఉషాకల్యాణము, ఆ 2 పద్య 91.

గీ. ఒడలు నడుపు నిల్కడ కనఁబడుటలేని, జనునినునుగడునులవిడి♦స్తవమునింద
కడఁతినడిఁజేసె మందిరొ ♦ పిడిఁది వెడలి, యదవినడు మనునడలిన♦కడిఁదిగాఁజె.

ఆ. లేఁడివాహనంబు ♦ పేఁడివాఁ డొకపట్టె, వేఁడివాఁడునచిప్పఁ ♦ వాడి పాడు
చేడెమనుమరాలు ♦ బోఁడిపెనాండిని, గ్రాడి యొగ్గులాడి ♦ వేఁడ నేల. 1011

గణోదయము, ఆ 2 పద్య 37, 38.

సీ. నీవెప్పటికి దుష్ప♦భావుండ వౌట నీ, సదనంబు దొలుతఁ బా♦పాణ మయ్యె
నతితరకూర్రుఁడ ♦ వౌటచేఁ గోమలం, బైన నీయావనం♦బడవిఁ గలసెఁ
బరులను బాధించు ♦ పాపకర్ముఁడ వౌట, తాఁకుచుపాములునిన్నుఁ ♦ దగిలికఱచెఁ
గడుఁ బతివ్రతలను ♦ గౌఁగిలించుటఁ జేసి, మెయి లేకనిటువలె ♦ మెలఁగవలసె

గీ. నిన్ని శిక్షలఁ బొందితి ♦ వింక నైన, ధర్మపద్ధతి సమయోచి♦తంబెతింగి
మెలఁగవలెఁ గానివిరహంపు♦చెలులతోటి, చలముసాధింపఫలమేమి♦మలయపవన.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 3.

గీ. గంధవహనీవు బద్ధకం♦కణుఁడవగుచు, యలక జీవనభంగము ♦ లాచరించి
దిమ్మరుట నేకదాయాల♦తమ్మిచూలి, యనిలునిగఁజేసె నట్లైన♦నణఁగవకట. 1013

సర్వకామదాపరిణయము, ఆ 2.

చ. జగమున కీవు కీడుఁ గడు ♦ సల్పుదు వంచును దమ్మిచూలి నే
వ్వగనిను నొక్కమూలఁ బడ ♦ వైచెను దాన నడంగకున్న నిన్
దగ మెసవంగఁ బాములకు ♦ నాల్కలు రెండొనరించి వానికిన్
జగమున వేయిఱేఁడులు మఱి ♦ నన్ బ్రదుకిచ్చెను గాదె సయ్యరా. 1014

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 46.

---

# భ్రమరోపాలంభనము.



ఉ. మిమ్ము జయించు మించుగల ♦ మేలినునువ్వలిగొప్పుచంద్రివే
మమ్ము మనోభవప్రికట ♦ మార్గణజాలము పాలు జేసి తాఁ
గిమ్మన తేఁగె దానిదరి ♦ తేఁగరు చంపకగంధియంచునో
తుమ్మెదలార మీరిచటఁ ♦ ద్రుళ్ళెద రక్కట శౌర్యహీనులై. 1015

చంద్రరేఖావిలాపము. ఆ 2.

సీ. సారెకు ఝుమ్మని ♦ సంగీతములు సేయ, విభవమూవలరాజ ♦ సభయుఁ గాదు
చెలరేఁగి కదిసి ని ♦ శ్చింతతో వ్రాలంగ, మకరందయుక్త తా ♦ మరలు గావు
జాతివిరోధంబు ♦ సాధింపనులుకంగ, మదమెక్కియున్న తు ♦ మ్మెదలు గావు
వైవారములు సేసి ♦ గాలి నిలుపంగను, వీచీసరస్సుల ♦ నాఁచు గాదు [డు
గీ॥ యాఁడువారలకూటము ♦ లాననములు, నక్షిచికురంబులును గొప్ప ♦ లరయుఁ డిపు
డెలియఁ జాలక మీరిందుఁ ♦ దిరుగఁదగునె, పదుఁడి వేగమింక ప ♦ ట్పదములార.

బృందావనవిహారము ఆ 2.

గీ. గమనవిఘ్నమ్ము సేయు నా♦మము వహించి, మధువుఁ ద్రావుచుఁ బలుకుసు ♦ మముల
[యందు
నపురుచును రెండుమూఁళ్లపా ♦ దములు కల్గు, నీకు భృంగమ యేరీతి నెగడుఁగరుణ.

భార్గవపురాణము ఆ 6.

ఉ. తుమ్మెదనంచు నేమిపని ♦ దోఁపక యుండఁగ నీడ మాతలల్
దిమ్మలు గ్రమ్మఁ గూసెదవు ♦ కేఁటి యపేటి వనాటవృత్తియో
తమ్ముల నమ్ముదాసవు గ ♦ దా మతికన్నులఁ జూచినట్టి యే
కొమ్మలనైనఁ బట్టి రస ♦ గుంభముతో విహరింతువే కదా. 1018

కాళిందీపరిణయము ఆ 3 పద్య 65.

---

# పికాద్యుపాలంభనము.

సీ. పద్మగంధి యటంచుఁ ♦ బదరకుమీ నుపంబ, చాంపేయనాస యీ ♦ చారుహాస
పల్లవాధరి యంచుఁ ♦ బదరఁబోకు పికంబ, షట్పాద్వేణి యీ ♦ వనజపాణి
జ్యోత్స్నాగుణ యటంచుఁ ♦ జొచ్చిరాకు చకోర, నిటలేనభూష యీ ♦ చటులభాష
తారేశముఖి యంచుఁ ♦ జేరకో హారిణంబ, హరిమధ్యలీల యీ ♦ యధిపబాల
గీ. భ్రమరకస్వాన నేత్రప్ర ♦ గ్భాంధనముల, హితుల రటుగానఁ దెల్పితి ♦ మింతెవీరు
కుంత్ర్మిక నెరని తిరుగుట ♦ కూఁతలిడుట, ప్రుక్కియుండుట యుడుగుట ♦ నుమ్మ
[ఫలము. 1019

ఇందుమతీపరిణయము కు. ఘూ ఆ 4; పద్య 58.

శా. ఆహా కోకిల మీకు మాధవుఁడు భా♦గ్యంబిచ్చుటల్ పాంథపీ
డాహంకారలతా ప్రవాళచయము♦ క్షాంచద్రసాలవ్వలీ
లాహారంబులఁ బూనఁ గొమ్మల మనో♦ల్లాసంబునం జేరఁ నే
డీహన్ మావుల నెక్కఁగాక భువిలో♦ నేతుల్ (?)విజాత్యున్నతుల్. 1020

కవిరాజమనోరంజనము; ఆ 3.

సీ. మోముఁ జూడక యింత ♦ మోసపుచ్చెద వేర, సోమ శీతలకర♦స్తోమభీను
మానసంబున నిల్పి ♦ మమ్ము నేఁచెద వేర, మార పుష్పశరా♦ సారధార
జీవసంబంధన♦ద్ధ్యానంబు విడనాడి, వరుస వీచెద వేర ♦ వాయుదేవ
స్వానఖిత్వము మాని ♦ చిలుతసంగతిఁ బూని, పదరి యార్చెదవేమె♦పరభృతంబ

గీ. యనుచు శశిసుమశరానిల(?)ఖ♦గాదిగగన, చరుల నిందించి యాదివ్య♦జలజగంధి
కడిమి రాజేంద్రనందను ♦ గవయఁ గోరి, మదనసంగ్రామకౌతుకో♦న్మత్తయగుచు.
చంద్రిదేవోపాఖ్యానము, ఆ 3.

సీ. ఒరులపంచలఁజేరి♦యున్నట్టికోయిలా, యెందుకునీకింత♦యెగిరిపాటు
నిలువఁ జోటునులేక♦నింగివ్రేలెడుచంద, మామ నీకేల ది♦మ్మరితనంబు
చచ్చి చావనివాని♦చాడ్పుననున్నట్టి, మరుఁడ నీకేటికీ♦మండిపాటు
కదిసి కొమ్మలపాల♦ బ్రదుకఁగాంచిన తుమ్మె, దా యేలనీకింత ♦ యపరిపాటు
గీ. మీకుమునుబోలెనిపుడుమా♦మెలఁతతోడి, యొక్కమాటనుంటయునుమో♦మోట [మియును
లోనిచుట్టరికంబును♦జానుమీఱు, చూపుచెలికారమును గొంత♦చూడవలదె. 1022
రసికజనమనోరంజనము ఆ 4 పద్య 31.

---

# శిశిరోపచారములు.

సీ. స్వర్ణకుంభములకు ♦ వర్ణలేపనముగఁ, జన్నులఁ గుంకుమం ♦ బలఁది యలఁగి
నెడవిల్లు నలుఁగులు ♦ వోడయుటగాఁ గన్ను, లెడపక పన్నీటఁ♦నుడిచి నుడిచి
తేఁటితుమ్మెదలకు ♦ మేఁతగా విరిదమ్మి, పుప్పొడిఁ గుచములపైఁ ♦ బోసి పోసి
యనుఁగుఁజుట్టములతో ♦ నాలింగనంబుగాఁ, బడకగంబులఁజిగు♦ళ్ళదిమి యదిమి
గీ. కప్పురపుధూళి మేనిపైఁ ♦ గుప్పి కుప్పి, విపుల కదళీదళంబుల ♦ వీచి వీచి
విరహపరితాపవతియైన♦వెలఁది కపుడు, చెలులు శిశిరోపచారము♦ల్సేయఁజేయ.
కవికర్ణరసాయనము, ఆ 3 పద్య 123.

సీ. జవరాలి యడుగులఁ ♦ జివురాకులంటించి, పాలఁతియూరులనంటి♦పొరలఁబొదివి
కొమ్మ చేదోయిచెం♦దమ్ముల హత్తించి, లేమబాహులుమృణా♦ళికలఁ బెనఁచి
యతివ గుత్తపుగుబ్బ♦లలనుగుత్తులఁ గూర్చి, కాంత చెక్కులఁజంద్రి♦ఖండములఁదు
కలికి కెంగన్నులు ♦ కలువరేకులఁ గప్పి, లలన పెన్నెఱులనా♦లంబు ముడిచి
గీ. నవనవగుణానుబంధబం♦ధనములైన, చలువ లెన్నేనిఁ గావించి♦చెలువ చెలులు
నెలఁత కీవసులాభంబు♦నించుమంచు, నించువిల్కానిమఱలఁ బ్రా♦ర్థించుటయును.
వసుచరిత్రము, ఆ 3 పద్య 182.

# వివాహము.

:0:

సీ. భక్తిఁ బ్రదక్షిణ ◆ ప్రక్రియంబులఁ జేసి, హుతభుక్కునకు ను ◆ పాసనంబు
నంతకఁ గ్రంథిక ◆ ల్యాణక్రియాచార, మాచరించిరి మండ ◆ హోస మెసఁగ
వశ్లిత్తిఁ జూచిరి ◆ యాకాశమండలా, స్థానరత్నంబు నా ◆ త్తానపాదిఁ
త్రైలోక్యపతి దేవ ◆ తా ఫాలతిలకంబు, దవిరి యరుంధతీ ◆ దేవిఁ గనిరి
గీ. బ్రాహ్మణోత్తమపుణ్యాహ ◆ రంధ్రినక్త, మంగళాశీర్వచోయుక్త ◆ మహిమ శోభ
నాక్షతారోపణంబుల ◆ నాదరించి, రంబుజాక్షియు నిషధదే ◆ శాధిపతియు. 1029

శృంగారనైషధము ఆ 6: పద్య 101.

శా. కట్టె న్మంగళసూత్రమున్ శరధిశం ◆ ఖాగ్రిలకుం బొమ్మలం
గట్టం జాలెదు కంఠపీఠినిఖిల ◆ క్ష్మాభర్త శోణమ్యాసుల్
దట్టంపై నఖకోరకోత్కరము త ◆ ద్గ్రైవేయహైమస్ఫుర
త్పట్టస్థాపిత పద్మరాగముల పం ◆ తంబుల్వడం బింపఁ గాన్. 1030

మనుచరిత్రము ఆ 5; పద్య 88.

ఉ. లేజవరాలి పాణియుగ ◆ లీపరిరంభణపాటలీభవ
ల్లాజచయంబు భాషినిఖి ◆ లక్రతుభుక్తి నిమంత్రిణాక్షత
శ్రీజనకంబుగాఁగ ముని ◆ చెన్ శిఖి నా శిఖియుం బ్రసన్నుఁడై
యాజితచిత్తభూరతుల ◆ కాగతులిచ్చెఁ బ్రదక్షిణార్చులన్. 1031
మ. జనకోత్సంగనివాసనాసనవో రా ◆ జన్యస్తహాస్తాభిమ
ర్శనసౌఖ్యామృతపారవశ్యమునవో ◆ సైఁచెన్ శిలాయోజనం
బని సాధ్వీల్వాగడం బ్రియాంఘ్రిసనేక ◆ ప్రాత్యించె భూజానిర
ఘ్నవభాగ్యంబు మఖశంసుశల్కుటకర ◆ త్నంబుల్ ప్రశంసింపఁగన్. 1032
చ. సిరులుఫలింపవంపతులు ◆ చెంతనరుంధతిఁ జూచుకోఁ బర
స్పరనయనాంతముల్గదియ ◆ బాలిక చూపులు పర్వానష్ఫుట
స్ఫురమసతీపదాబ్జముల ◆ పై భవదీయసువాసినీత్వనై
ఖరిఁ గరుణింపుమంచుపిర ◆ గల్వలఁ బూజలు సల్పెనో యనన్. 1033

వసుచరిత్రము ఆ 6; పద్య 31, 32, 33.

ఉ. బంగరుపెండ్లిపీఁట మహి ◆ పాలశిఖామణి సంవసింప శే
షాంగవసన్నిభుండు సుర ◆ ఘాధపుఁ డాత్మవధూటి పచ్చపా

గీ. నింక నెడలేదు సుముహూర్త ♦ మిందఱిసేన, తనయుఁ బిలిపింపుఁడని ధరా ♦ ధ [వునితోడఁ
జతురత వచించువారునై ♦ సందడిలిరి, కుశలరాజపురోహిత ♦ క్షోణిసురులు.

సీ. రత్నోపఖచిత నీ ♦ రాజనపాత్రింబు, లాయితంబులు గాఁగఁ ♦ జేయువారు
కళ్యాణవేదిపై ♦ ఘనవృత్తిఁ గ్రొత్త ము, త్తైపురంగవల్లికల్ ♦ దీర్చువారు
సరసమంగళగీత ♦ చాతురిఁ బ్రకటింపఁ, దలఁచి యన్యోన్యంబుఁ ♦ బిలుచువారు
రత్నభూషితయైన ♦ రాజేంద్రకన్యకఁ, గాంచి దీవనలఁ గా ♦ వించువారు

గీ. మంగళద్రవ్యపాణులై ♦ మసలువారు, పూర్ణకుంభంబులు ధరించి ♦ పొలుచువారు
నగుచువేల్లితవిద్యుల్ల ♦ తాంకురముల, చెలువుఁబూని సువాసినుల్ ♦ మెలఁగిరపుడు.

ఉ. క్షోణిసురుండు దెల్ప నృప ♦ సూనుఁడు మున్ను ననేకరూపక
ళ్యాణగుణాప్తిచే నలరు ♦ నంగనకంఠమునన్ నవీన క
ల్యాణగుణంబుఁ గూర్ప మది ♦ నబ్బురపున్ బ్రమదంబు గాంచెఁ బూఁ
బోణిప్రియోపలబ్ధము ల ♦ పూర్వవిలాసకళాసమగ్రముల్. 1043

సీమంతినీకల్యాణము ఆ 3.

సీ. భవ్యనీరాజన ♦ పాత్రసంగతలైన, సతు లుదంచితతటి ♦ ల్లతలు గాఁగ
లలనామనోజ్ఞమం ♦ గళగీతనాదముల్, బర్హికేకారవా ♦ రటులు గాఁగ
సూతమాగధజన ♦ స్తుతిఘుమంఘుమలును, స్థలవారిధరగర్జి ♦ తములు గాఁగ
సర్వాంగనల్ వెద ♦ చల్లుపుష్పాలజల్లు, సముదితాసారవ ♦ ర్షంబు గాఁగ

గీ. వర్ణనము సేయఁ దగు నవ్వి ♦ వాహవేళ, నప్పు డుపగతదుర్దినం ♦ బైనయట్టి
ఘనఘనాగమసమయంబు ♦ ననుకరించె, జూపఱకును బ్రమోదర ♦ స్ఫూర్తియొదవ.

ధరాత్మజాపరిణయము. ఆ 4; పద్య 48.

ఉ. పచ్చి పసిండిజారిగల ♦ వారి యిడెన్ ధరణీశురాణి లోఁ
మెచ్చుచు నల్లుబాదములు ♦ మేలిమిపళ్లెమునం గడంగి దాఁ
గ్రచ్చుర ధారఁబోసెఁదన ♦ కన్నియనొచ్చములేనివన్నియన్
నిచ్చలు హెచ్చువాద్యముల ♦ నింగి బోరంబోరి బూరటిల్లఁగాన్. 1045

గీ. వెలయువిధ్యుక్తముగ దొంగ ♦ వ్రేళ్ళుగ్రకంత, నాఁకబలిపాన్పుకట్నముల్ ♦ నవ్యమిఘన
వీటికలు సెమ్మకమ్ములు ♦ విన్నఁబోవ, నప్పగింతలు కట్నంబు ♦ లైనపిదప. 1046

ఓషువతీపరిణయము ఆ 3 పద్య 236, 242.

సీ. లోలాళిసంవ్యాప్తి ♦ బాలాతపావాప్తి, సప్తచ్ఛదాంబు ♦ జములకిడిరి
తతమృగాంకవిభూతి ♦ నుతచంద్రికాభాతి, పటుపిచరుంఘలీ ♦ పటనశశిక

విమలవర్ణాసక్తి ♦ నమలార్థసంపత్తి, నడరించిరిసతీ క ♦ రాక్షతలను
కుసుమాంజలివ్యక్తి ♦ వసుమార్ఘ్యసంసక్తి, నడపిరి భగవంతు ♦ నను శ్రీవునకు
గీ. మొక్కి కని వల్వ గట్టి కే♦ల్మోడ్చికచక్రి, రీటరుచిదృక్కు-వలపుండ♦రీకగోచి
ధవళవసనాంచలస్ఫుర ♦ దబ్జనిభ న, ఖాంగుళీయకదీధితి ♦ నతిన పతియు.
ఇందుమతీపరిణయము మ॥ నృ॥ ఆ 6 పద్య 56.

శా. దైవజ్ఞుల్ దరియంగఁ జొచ్చి సుముహూ♦ర్తం బిప్పుడే యంచు మే
ధానైశద్య మెలర్పఁ దెల్పఁగఁ బురో♦ధశ్రేణి లగ్నాష్టక
వ్యావృత్తిం గుడజీరకంబులు శిరో♦భాగాంతరన్యస్తముల్
గావించెన్ వెస వద్వధూవరులచేఁ♦గళ్యాణసంసిద్ధిగన్. 1048
సీ. పొదలపైనుంచి♦నప్పుడు జీమూత, జాతిజాతఖ్యాతి♦సంగ్రహించి
వేణీభరమునుండి♦వెలువడుచున్నప్పు, డహిసంభవత్వంబు♦నవహరించి
కను బొప్పలందుండి♦యనువొప్ప గాలుగ, మత్స్యసంభూతసం♦పదవహించి
గళసమీపమునుండి♦గళితంబులగుచుతి. శంఖోద్భవఖ్యాతి♦సంతరించి
గీ. నరుఁడు దోయిప్పఁ గీలించి♦నడిగ నించు, సేసముత్తెంబు లల్లన్ని♦శిరము నందు
గ్రిమ మెలర్పఁగ జన్మదే♦శములనుండి, యున్నదప్పుడు వెలువడు♦చొప్పదోఁచె.
రామరాయవిలాసము ఆ 3 పద్య 166, 168.

సీ. ఒకచెంత భూమీసు♦ రస్తోమ శీరావ, మొకపొంత మంగళా♦ష్టకవిరావ
మొకమోర వర్తకీ♦నికరనాట్యస్ఫూర్తి, యొక మేర శాస్త్రిశా♦స్త్రోదితంబు
లొకత్రోవ వివిధ నా♦టకకథాప్రభవం, బొక తేరిసభ ప్రకవా♦దకనినాద
మొకచోట వరయాచ♦కయాచనాఘోష, మొకబెట్టుఁ బొగ్గెగా♦యక సుగాన
గీ. మొకెడఁ గవీంద్రకవితాప్ర♦యోగగరిమ, మొక్క-డవవంది మాగధా♦ద్యుక్తస్వ [నంబు
లటులనై నా హిక్కోత్సవం♦బఖిలజనుల, కనుపమానందమునుగూర్చె♦నతిశయముగ.
భరతాభ్యుదయము ఆ 4; పద్య 113.

క. మదిలోఁ గలఁగలపుంరిమి, నిదె సేఁబయిచేయియగుదు♦నిదయేనగుదున్
వదలకకనుఁడనుకిరియ వా, డొదుఁగిక తలఁద్రాలుపోసి♦కొండొరులపయిన్. 1051
రసికజనమనోరంజనము ఆ 4; పద్య 97.

# వివాహాలంకృతి.

—— :0: ——

సీ. యావకద్రవమున♦నరుణాంఘ్రినఖపంక్తి, లభ్యక్తములు సేసె♦నతివ యోర్తు
నయికలవేళ్ళ మ♦ట్టియలుఁ బిల్లాండ్లిడి, పాయవట్టముఁ బెట్టెఁ♦ బైనొకర్తు
నెఱికవట్టి పసిండి♦నీటి వ్రాతచెఱంగు, వెలిపట్టు రహిఁ గట్టె♦వెలదియోర్తు
కటిసీమఁ గనకమే♦ఖలఁ జేర్చి తారహా, రములు గీలించెఁ గం♦ఠమున నొర్తు
గీ. కటకములు హస్తసరములం♦గదములంగు, ళీయకములును బాహువ♦ల్లికలవేళ్ళ
నిలిపి తాటంకనాసామ♦ణుల నమర్చి, చొనిపె సీమంతవీథిఁ జే♦ర్చుక్కయోర్తు.

ఆముక్తమాల్యద ఆ 6; పద్య 128.

సీ. అంబరం బొకభామ♦యతివకుఁ గట్టె బ, యోధరాకారని♦రోధకముగ
నంజనం బొకలేమ♦ మంజువాణికిఁ దీర్చె, ఘనసువర్ణప్రభల్♦గనుపడంగఁ
దిలకంబు నొకయింతి ♦ చెలికిఁ గస్తురి దిద్దెఁ, గనుగొన సుమనఃప్ర♦కారగ మమరఁ
కుంకుమగంధంబు ♦ కొమ్మ యోర్తు ఘటించె, వనితకు హృదయరం♦జనము గాఁగఁ
గీ. గాంత యొకరామ కుచసీమ ♦ గండపాళిఁ, గలితగోరోచనాచిత్ర♦కములు నిలిపె
నొక సరోరుహగంధి యా♦య్యుత్పలాక్షి, చరణతలముల లాక్షార♦సంబునించె.
ఆ. మెలఁత యోర్తు నేర్పు♦మెఱయంగసంపెంగ, విరులు దుఱిమి తరుణి♦కురులు ముడిచె
నప్పు డొప్పెఁ గొప్పు♦గొప్పయై తనలోన, మెఱుపులుంచుకొన్న♦ మేఘమనఁగ.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 37, 38.

సీ. మదనుని మోహినీ♦మానినీమణి మాడ్కిఁ, జూడ్కికి వేడ్కగా♦సొంపు లెసఁగ
నొగిగంధసౌరభ♦మొకర్తె యలంది, యొసఁగఁగాఁ గనకాంగి♦యొకతె దొడవి
పూఁబోఁడియొకతె కొ♦ప్పునఁ జుట్టె యొకవధూ, తిలకంబు జెలువమరు♦దిద్ది తీర్చె
యొకర్తు వాక్తికదంత♦యొరవుగాఁ దిలకించి, ముకురాస్య యొకర్తె♦ముందు నిలిపి
గీ. పెండ్లికూతును జేయ సం♦ప్రీతిదోఁప, గరిత యొకరితె నీకోర్కి♦తరువు గొరత
పడనియొనగొని గొనకొని♦పల్లవించి, యిపుడు ఫలియించెనని పల్కి♦యింపుఁ గూర్చె.

ఓఘవతీపరిణయము, ఆ 3 పద్య 217.

———

# వి వా హ గృ హ ము.

సీ. సామవేదండక♦స్తంభనిలస్తాలన, విలసితభ్రూవల్లి ♦ వేల్లనముగఁ
తోరణమాలికా♦హీరాంబరచ్ఛాయ, వెలఁది లేఁజిఱునవ్వు ♦ మొలక గాఁగఁ
బ్రోది రంభాస్తంభ♦ముల మోసుటాకులు, లలిఁబచ్చపట్టుచే♦లంబుగాఁగ
వీతెంచు మృదువేణు ♦ వీణానినాదంబు, కలికి తియ్యనినున్న♦పలుకుగాఁగఁ
గీ. చేరఁటాంద్రుదు హస్తపం♦కేరుహములఁ, బూఁచి యెత్తినకనకంపుఁ♦బూజగుండ
లున్నతస్తనములు గాఁగ♦నొప్పుమిగిలెఁ, దరుణియును బోలె నృపగృహ♦ద్వారభూమి.
శృంగారనైషధము, ఆ 6 పద్య 82.

సీ. నక్షత్రములతోడ ♦ నభమును హాస్తికా,వలులతోఁ గొప్ప పం♦దిలి దనర్చఁ
దరణిచంద్రములు వి♦తానంబులై లగ, నరుణసితవితాన ♦ వరములొప్ప
భవమిత్రుఁ డంపెనో♦నవనిపు లన ఘన, వాద్యత్రయముతో గృహ♦రాజి వెలయ
నంబుధికేశప ♦ యాంబరములు నాఁగ, పల్లవతోరణ ♦ వల్లులమర
గీ. భూతలస్వర్గవాద్యము♦లార్భటిమీఱ, నొక్కచో మ్రోసె ననఁగను♦ఢక్కమురజ
భేరికాదులు మ్రోయఁగా♦భూరమణుఁడు,(దనర?)గావించెనంతట♦సురలు మెచ్చ.
భార్గవపురాణము, ఆ 4.

# వి వా హ మం డ ప ము.

సీ. సల్లలితాశ్వత్థ ♦ పల్లవమిశ్రిత, చారుపల్లవరత్న♦తోరణంబు
అసదృశకుంకుమ♦రసలిప్తతలపరి, వర్తితముక్తారంగ ♦ వల్లికంబు
ఫలపుష్పయుక్తా♦ప్రాలంబమాలికో,దారవిచిత్రవి♦తానకంబు
రమణీయమంగళ ♦ ద్రవ్యకాంచనపాత్రి, కాకారపుణ్యాంగ♦ణాకరంబు
గీ. విశదవేదఘోషాపూర్ణ ♦ విప్రగణము, దీప్తమణికాంతికల్పిత ♦ దీపచయము
నగుచుఁ బరిణయమండప ♦ మమరి యుండె, రాష్ట్రపనుపున రాజును♦రాజసుతయు.
కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 183.

# వి వా హ యా త్ర.

సీ. పట్టపుఁడీ కొన్ని♦పాండురచ్ఛత్రముల్, కటిక చీఁకటి నిండఁ♦ గ్రమ్ము కొనియె
వీవకుఁడీ కొన్ని♦వింజామరలు వాత్య, లడరి యాత్రికునంత♦ రాయ మయ్యె
మరలింపుఁడీ కొన్ని♦ కరుల సాందీకృతా, నేకదానసఝరంబు♦ లేఁత లయ్యె
మాటుసేయుఁడి కొన్ని♦మరకతాలంకృతుల్, తేరులెల్ల వనసం♦దేహమయ్యె
గీ. వంచుఁ గంచుకినిచయంబు♦ లాడనాడ, గణన యిడరాని రాజన్య♦గణముగదలె
విందసేనవసుంధరా♦ధీశతనయ, పరిణయాలోకనైకత♦త్పరతఁ గాంచి. 1059
సీ. బిరుదుటెక్కెములుగ్రి♦క్కిరిసిచుక్కలఁ చాలు, రాలునో యంచుసం♦భ్రమముఁ గాంచి
పుణ్యాంగనాగీత♦ములచేత నిల మోయ, మునుచునో ఘనియంచు♦మదిఁ దలంచి
బహుభారమొకచోటఁ♦ బరఁగ భూతలమెల్ల, నొఱఁగునోయనియాత్మ♦నూహసేసి
సమితవాద్యముల నా♦శాంతదంతిశ్రేణి, కలఁగునో యంచుఁ దర్కము వహించి
గీ. వందిబృందంబు నుతివిరా♦వంబుచేత, సజ్జభవుచిత్త మదరునో♦యంచు నెంచు
శ్రీకరచరిత్రుఁడగు విందసేన పుత్త్రి, పరిణయోత్సవమునకేఁగు♦బహుజనంబు.
సీమంతినీకల్యాణము, ఆ 3.
సీ. రమ్యపయోరాశి♦ రంగదుత్తుంగ తరంగముల్ పోలు తురంగ చయము
బలిమిగా టెక్కెలు♦గల నాఁటకోంటల, తండముల్ పోలు నేత్రసందోహములు
శారదసముదగ్రి♦సారసిరదమున, బృందంబుఁ బోలిన♦స్యందనములు
వెలివెల్లి విరిసిన♦ బలుపాలవెల్లి నాఁ, బాండుపట్టాంబర♦ పటగృహంబు
గీ. వడువ చుక్కలు భూమిపైఁ♦ గడలు కొనిన, భంగిఁగరదీపికాకదం♦బంబు వెలఁగ
మేటి వారవిలాసినీ♦కోటు లమర, దశరథుఁడు పెండ్లి కవ్వేళ♦దరలి వచ్చె.
సరసభూపాలీయము, ఆ 1.

# క్రాంత.

సీ. హాసచంద్రికలతో♦ నసఁగి పెసంగెడు, రాలొందు ముత్యాల♦ పాళిల తోడ
భూరికాంతిన్యక♦ర్కోరుహ పత్రిభటు, కళానారశేళఫ♦లముల తోడ

# కేళిగృహము.



సీ. బందీకృతాన్యరా♦డ్భవనలక్ష్మీపురం, పరలునిట్టూరుపుల్ ♦ పఱపు కరణిఁ
బుంజీకృతస్నేహ♦భూరిమోహనశక్తు, లనురాగకళికలఁ ♦ బెనఁచు కరణి
నంగీకృతాంగచై♦త్రాధిదేవత లాత్మ, సుమచోరుమచ్చంబు ♦ చూపు కరణిఁ
బ్రకటీకృతానంత ♦ రతిమూర్తులలతాంత, శరశాస్త్రసంచికల్ ♦ సాఁచు కరణి
గీ. యంత్రపాంచాలికలుగొన్ని♦యగురుధూప,వితతి వెడలింపఁగొన్నిదీ♦వియలుదాల్పఁ
గొన్ని విరివీవనలువీవఁ♦గొన్ని పసిఁడి,తళుకుఁ దెలనాకులొసఁగసం♦తసము లెసఁగ.

వసుచరిత్రము, ఆ 6 పద్య 73.

సీ. పటుకీరశారికా ♦ పాపఠ్యమానక,శాశాస్త్రసౌష్ఠవా♦లంకృతంబు
నాయాతియాతవా♦తాహతవల్లకీ, సంగీత భంగీత♦రంగితంబు
స్వర్ణకుడ్యవిచిత్ర ♦ చతురశీతివిభేద, బంధనిబంధన ♦ బంధురంబు
శుంభన్మణీమయ♦స్తంభసంభవభవ్య, దీప్తప్రదీప్తికా ♦ దీపితంబు
గీ. కలిత ఘనసార ఘనసార ♦ గంధసార, ఘుసృణ మృగమదపంకసం♦కుమదముఖ్య
సురత సముచిత వస్తుభా♦సురము నైన, కేళిగేహంబుఁ జేరె భూ♦పాల వరుఁడు.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 98.

సీ. మరునిగెల్పులకథా ♦ మహిమంబు విలసిల్లు, నొఱపుజిత్తరుకీవి ♦ నల్లసిల్లు
వీనుల కమృతంపు ♦ సోనలై వర్తిల్లు, శారికాముఖసూక్తి ♦ సందడిల్లు
కస్తూరి కాదిసు♦వస్తులఁ బ్రభవిల్లు, పరిమళమ్ములజోకఁ ♦ బరిఢవిల్లుఁ
జెప్పఁ జూపఁగ రాని ♦ సింగారము ఘటిల్లు, పెక్కు శయ్యలసొంపు♦పిక్కటిల్లు
గీ. వింత హరువుల పనులచే ♦ విస్తరిల్లు, దివ్య మాణిక్య కాంతులఁ ♦ దేజరిల్లు
నందములకెల్ల నందమై ♦ యతిశయిల్లు, పాపజవరాలి బంగారుఁ ♦ బడకటిల్లు.

విజయవిలాసము, ఆ 1 పద్య 187.

సీ. పవనసంగతిరాగ ♦ పద్ధతిఁదముతామె, యొగిఁబల్కు వీణె లొ♦క్కొక్కచోట
మలయానిలాంకురా ♦ వలులు పైకొని వీచు, సురవీజనంబు లొ♦క్కొక్కచోట
శరదీపికలఁ బూని ♦ కదిసి వెంబడిఁ జాగె,యొప్పుకెల్ప్రతిమలొ♦క్కొక్కచోట
సంతతార్ధ్రవరత్న♦చయకీలితము లైన, యున్నతాసనము లొ♦క్కొక్కచోటఁ!

గీ. నొక్కచోఁ దోమతెరమంచ♦మొక్కచోట, నొరపుటుయ్యాలమంచము♦లొక్కచోట
బలుపసకినలమంచముల్ ♦ గలిగితనరు, తద్విలాసంబుఁ గనిప్రమో♦దమునఁ బొంగె.
నలచరిత్రము, (సిరి-ధ) అ 5 పద్య 5.

సీ. కెలఁకుల గుజరాతి ♦ కెంపుజంత్రపుబొమ్మ, లలఁతివాయించు మ♦ద్దెలలరవళి
కెరలి కుందనపుఁ బం♦జరము వెల్వడి చిల్క, లొయ్యన సూళాదు♦లుగ్గడింప
నెడనెడ గొరవంక ♦ లివురుఁగైదువుజోదు, బిరుదుపక్కాణించి ♦ పేరువార
లయఁ దప్పకుండ మె♦ల్లనె సోగపురివిచ్చి, నెమ్మిబోదలు పేర♦ణమ్ముఁ ద్రొక్క
గీ. వానిఁ గనిమింటపెఱయంచ♦పదనముంచ, దానిజిగిజక్కవలు ప్రమో♦దంబుగాంచె
నందులఁ జకోరి వెతఁబడి ♦ గుంద నచ్చు, తావహంబగు కేళిగృ♦హాంతరమున. 1070
చంద్రాంగదచరిత్రము, అ 6 పద్య 131.

సీ. ఘనతరస్తంభసం♦ఘటితమాణిక్యముల్, దీప్తదీపావళీ♦స్థితి వెలుంగ
వాతాయనాయాత ♦ వాతపోతంబులు, చామరవిక్షేప♦సౌఖ్య మొసఁగ
నపరంజి మెఱుఁగుని♦ద్దపుఁ గీలుబొమ్మలు, పరిచారికలరీతిఁ ♦ బనులు సేయ
ముత్యాలపంజరం♦బులఁ గీరశారికల్, శృంగారకథలు ప♦ఠింపుచుండ
గీ. వజ్రసోపాననీలక♦వాటచంద్ర, కాంతకుట్టిమమరకత♦ఖచితకుడ్య
పుష్యరాగవితర్దికా♦స్ఫూర్తి నధిక, సుందరంబైన కేళికా♦మందిరమున. 1071
కవిరాజమనోరంజనము, ఆ 5.

సీ. రతిఁ జొక్కి కేళిని♦రమణిగుబ్బలమీఁద, వ్రాలిన నలరాచ♦వాని సొగసు
కినిసి కీల్జడను గొ♦ట్టిన గృహిణికి మ్రొక్కి, మమతఁ జూపెడి చంద♦మామవలపు
పౌరుషంబున మించి ♦ పౌలోమి నద నుంచి, యలరెడు వేల్పురా♦యని విలాస
మధురంబుఁ గ్రోలని♦మ్మనిరంభచుంబకంబుఁ, బట్టినేఁడు ధనేంద్రు♦పట్టిహొయలు
గీ. కలయ వ్రాసినకఱుసగ♦డలమెఱుంగు, మేలుముత్యంపుఁదలుపుల♦బూలచందు
హాతెగలు ధూపధూమంబు♦వలపు లుపరి, గిండ్లుమొసలుగఁగల కేళి♦గృహమునందు.
ఉత్తరరామాయణము, ఆ 6 పద్య 159.

సీ. వెలయుటాఁగులుదీర్పు ♦ నిలువుటద్దంబులు, జలతారుపనివింత ♦ చందువలును
వింతచిత్తరువుల ♦ విలసిల్లుసకినెల, నలరెడు తూఁగుటు♦య్యాలలహంస
తూలికాతల్పముల్ ♦ కీలుబటుశిలాడె, లలకప్పాముప్పాలు ♦ లలరు తెరలు
కపురంపుసురటులు ♦ గంధంపుఁ జిప్పలు సరిమాపేసులు ♦ పైఁడిగద్దె
గీ. సొగసుటడపంబు ముత్యపు♦సున్నగుడుక, పవ్వసపెగంబుచేనిన్నె♦బొమ్మసలిల
కళసములుపాదుకలు గల్గి ♦ వెలయు కేళి,మందిరంబులు మఱియును♦బొందుపఱచి.
కిరాతార్జునీయము, ఆ 3 పద్య 148.

సీ. పగడాలకంబాల ♦ జిగినీలభిత్తుల, సఘనసౌదామనీ♦సౌరు చేరఁ
జవులఁ దీర్చిన ముగ్గు♦చాయరత్ననిబద్ధ, ధరభర్మపాత్రికం♦దగతి గదురఁ
గెంపులవలభికా♦ఘృణినిధూపలవేది, వెండిపళ్ళెపుదివ్వె ♦ విధము దోఁప
మరకతద్వార్దీప్తి ♦ మగటాలతలుపుల, నిలువుటద్దపుజవ♦సొలుపుఁ దెలుప
గీ. నలినరాగపుబొమిడికం♦బుల మెఱుంగు, లలితవైడూర్యసోపాన♦ముల మహాస
రోంబురక్తాబ్జముకుళపు♦హరువు నెఱప, హవణిఁ బెంపొందుశయ్యాగృ♦హంబునందు.
రామచంద్రోపాఖ్యానము, (వా. వేం.) ఆ 4 పద్య 114.

సీ. మంజులస్తంభాగ్ర♦రంజితమాణిక్య, కాంతులు దీపాధి♦కత భజింప
శృంగారమైన మె♦ఱుంగుబంగరుకీలు, బొమ్మలు కొమ్మల ♦ పోల్కిఁ దనర
తోరణగండ్లను ♦ సోఁకెడు తెమ్మెరల్, చామరవిక్షేప ♦ సరణి నెలయఁ
బోలుపొందపంజర♦ములఁ జిల్క పల్కులు, శృంగారగాథలై♦ చెన్ను మీఱఁ
గీ. పద్మరాగపరివాళ సో♦పానసీల, మణికవాట ప్రథితవజ్ర ♦ మహితకుడ్య
మరకతాంచితవేదికా♦స్ఫురణ నమరు, చారుతరమైన కేళికా ♦ సౌధమనను.
పల్లవీపల్లవోల్లాసము, ఆ 3 పద్య 187.

సీ. పగడంపుఁగోడుల ♦ పందిరిపట్టెమంచము దోమతెర సేమ ♦ చక్కపలక
తాంబూలసామగ్రి ♦ తమచేతిపళ్ళెరం, బాల నిడు రతనంపు ♦ బొమ్మలఁ గని
హంసతూలపుశయ్య ♦ యందమరిచిన గలీబులూడిచిన బా♦లీసులొప్పు
అత్తరుబన్నీరు ♦ లానినగండీలు, పటములద్దంబులు ♦ వాలుసేద్దు
గీ. చిత్రకంబళములు తివా♦సీలబరుపు, కీలుబొమ్మలు వేయుపం♦కాలగాడ్పు
పీకిదాను పొందానులుఁ ♦ జిన్నచాప, చందనపుఁజందుగులును ద♦శావతారి. 1076
క. బంగరపు గొలుసు లుయ్యేలల, శృంగారపు బొత్తములును ♦ సిరిసొగటాలున్
రంగుచతురంగపాళిక, లుం గని ఘనసౌధమందు ♦ లోలత నిలిచెన్. 1077
సావిత్రీపరిణయము, ఆ 4 పద్య 163, 164.

సీ. కమ్మతావులుగ్రమ్ము ♦ కపురంపు విడెములు, పసిఁడిపళ్ళెరములఁ♦బొసఁగనుంచి
కస్తురి జవ్వాజి ♦ గందంబుఁ బన్నీరు, రతనంపుగిండుల ♦ రమణనుంచి
పటికంపుగోడల ♦ పజ్జనిగ్గొంకల, నిలువుటద్దంబులు ♦ నెలవు కొలిపి
పగడంపుమనుఁగోళ్ళ ♦ పచ్చలపీఁటపై, పట్టివేళ్ళసురటి ♦ పెట్టియుంచి
గీ. వెండి తబుకులఁబండ్లు వే♦ర్వేఱ పెట్టి, గొప్పరతనంపుదివ్వెలు ♦ కుదురుపఱచి
మేలిచొక్కపు బంగారు ♦ మేడలోని, వింతగదిని సింగారించి ♦ రింతులంత.
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 102.

---

# సఖీజనహితోపదేశము.



మ. హరిద్యై నాథులు దాయగాఁ బురము లిం♦పుల్ మీఱఁగాఁ జేయుమం
గది పెండ్రేశికొమాళ్ళఁ గూఁతులఁ దగం♦ గన్నట్టి యిల్లాండ్రకున్
మది నజ్ఞాగులు లేవె నీకు బలె స♦న్మానంబుతోఁ జక్క వ
చ్చెదో యేమేఁగలచేయుటంచుఁ దిగిచెం♦ జేపట్టి యాయంగనన్. 1079

కళాపూర్ణోదయము, ఆ 7 పద్య 119.

సీ. మా యిందుముఖి సర్వ♦మంగళ నీశరీ,రంబుగాఁ జూడుమీ ♦ రాజమౌళి
మా యింతి శ్రీకాంత ♦ మన్నించి యక్కునఁ, జక్కఁగాఁ జేర్చుమీ♦ చక్రవర్తి
మా భామ యంజన♦మంజులోచన సర,సముగఁ జేపట్టుమీ ♦ సార్వభౌమ
మా సతి మృదువాణి ♦ నీ సముఖము గల్గ, నేలుమీ లీల లో ♦ కేశభర్త
గీ. యనుచు ననుచుఁ దమ మది♦ ననుచు మండ,నెవరు దొరలిన దొరలును♦ వినయ మొనర
నప్పగించిరి నిషధదే♦శాధిపతికి, నంతికంబునఁ జను దమ♦యంతిఁ జూపి. 1080

క. దమయంతిఁ బలికి రయ్యెడఁ, దమయంతికసీమఁ జెలులు ♦ దార్కొని శ్రేలీ
సమయముల విద్య మాపెదు, సమయములను సిగ్గువడఁగ♦ జనునె లతాంగీ.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 80, 119.

సీ. ప్రియముతో రమ్మని ♦ పిలిచిన జేరఁబో,యెదవుగా కూరకుం♦డెదవు సుమ్మ
చెంతఁ గూర్చుండఁగ ♦ జేఁజూపఁ గూర్చుచుం,డెదవుగా కూరకుం♦డెదవు సుమ్మ
విడెము చేతి కొసంగ♦ వినయంబుతో దశనం,దెదవుగా కూరకుం♦డెదవు సుమ్మ
మధురోక్తి వినఁ గోరి మాటాడ మాటువ,ల్కెదవుగా కూరకుం♦డెదవు సుమ్మ
గీ. కాక విభుఁ డైనఁ గొంతసి♦గ్గరికనంబు,గడచుకొని యున్నఁ గక్కునఁ♦ గడకు రాక
చక్కఁగ నొకింత సేపటు♦ సమ్ముఖమున, నిలువు మీరత్నపాంచాలి♦ చెలువు మీఱ.

సీ. చిలుక నీ చేఁగాక ♦ చెలిచేత నుండదే, నిమిరి యిప్పుడె మాట♦ నేర్పవలెనె
యెదుటఁ గాసిన వేయ ♦ కిడి నారు చెమ్మని, వీణ యిప్పుడె మేళ♦వింపవలెనె
పటముగా నుకఁ దెచ్చి♦ పట్టిన నిప్పుడే, చిత్తర్వనకు వార్వ ♦ చెప్పవలెనె
మంచిమాటలు దోఁచె♦నంచును బలకలో, నిప్పుడె కవిత వ్రా♦యింపవలెనె
గీ. గంట సప్పిన వారిఁ గ్రేఁ♦గంట గనెదు, లెండు పోదమటన్న న♦టుండు మనెదు
పడిగ రావమ్మ కంచియే♦ పదుకటిల్లు, కన్నియలఁ గంటిమిటు లెండుఁ♦ గాన సుమ్మ.

విజయవిలాసము, ఆ 3 పద్య 197 198.

సీ. మనను చూచినయట్లు♦మగని రాగభరంబు, మొనసిచూడకె చూపు ♦ మొనల నీవు
మనను పల్కినయట్లు ♦ మగనితోఁ బలుమాఱుఁ, బలుకకే నెయ్యపుఁ ♦ బలుకు నీవు
మనను చేరినయట్లు ♦ మగఁడు పిల్వక మున్న, చేరకే యతని పూ♦సెజ్జ కీవు
మనను చేసినయట్లు ♦ మగఁడు జేసినఁగాని, సేయకే...... ♦ చెయ్వు లీవు
గీ. మనను వేవేలకోర్కుల ♦ మలఁగుచున్న, దాన వెలిగానఁగాఁ జేసి ♦ మానవతులు
పతుల వలపింపకున్న నో♦పద్మగంధ, పంచశరుతూపు లెందాఁక♦బలము చూపు.
గీ. అంతరంగంబు లొకటియై♦నంతదాఁక, నంగనకు లజ్జ భూషణం♦బగుచునుండు
నంతరంగంబు లొకటియై♦నంతమీఁద మిగులఁ బ్రౌఢిమ భూషణం♦బగుచునుండు.
సీ. ఒకమాటచెప్పి వే♦ఱొకపరాకు ఘటించి, యొకచంద్రసాలచే♦రికకుఁ దార్చి
యొకచిత్తరువుమీఁద♦నుత్సాహమొదవించి, యొకయంచనడఁ జూపు♦టకుఁ దెరల్చి
యొకపద్యమున కర్థ♦మూహించుమని పల్కి, యొకముద్దుఁ జిల్కఁ జెం♦తకును దెచ్చి
యొకమంతనముఁ జెప్ప♦నోజ సన్నయొనర్చి, యొకవిరిగుత్తి యం♦దుకొనఁ జేర్చి
గీ. మఱియు నీరీతి నాయాయి♦మాయ పన్ని, కన్నియ భ్రమింప ప్రౌఢలౌ♦కంజముఖులు
జనవరకుమారకేలికా ♦ చంద్రశాల, సన్నిధికిఁ దేర నంతనా♦సన్నయెఱిఁగి. 1086
ఆ. నవశిరీషమునకు ♦ నవమానమగు నింతి, మేనిమార్దవంబు ♦ మెచ్చుచోట
మరుఁడు నిర్దయుండు ♦ మదిరాక్షి నేలుమీ, కరుణతోడ నీవు ♦ సరసవర్గ్య. 1087

సీమంతినీకళ్యాణము, ఆ 2.

మ. విలసద్రూపము విద్యయున్ ధనము దో♦ర్వీర్యంబు తారుణ్యముం
గల ప్రాణేశుఁడు గల్గినట్టిసతి భా♦గ్యంబే యమేయం బిఁకన్
దలమే నీసుకృతంబు దెల్పుటకు సీ♦తా! షడ్గుణైశ్వర్యసం
కలితున్ శ్రీరఘునాథు సంతతము వే♦డ్కం గూడి క్రీడింపఁగన్. 1088

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 2 పద్య 186.

సీ. విభుఁడుదండనె యిది♦వినుచున్నవాఁ డెంత, గబ్బివే యిదిలజ్జ♦క్రమమె యనియు
నతఁ డిది సరకుసే♦యమిగ భావించిన, నపు డేమి యగుదు వీ♦వబల యనియు
రసికశేఖరుఁడు స♦ర్వజ్ఞుఁడు ప్రియుఁడు నీ, కొలఁదిన నడుచు భీ♦తిలకు మనియు
నతిగోప్య మీశుభా♦వాప్తి దేనికి నింత, తడయు టొప్పమి యెట్లు♦దలఁప వనియు
గీ. మఱియు నెన్నియొ బిసిబిసి♦మాటలమరఁ, బ్రియము చెప్పియు నదరవై♦చియు హి
తాను, వృత్తిఁ దెలిపియు నొకకొంత♦మెత్తఁబడఁగ, జేసి కేల్వట్టి తిగిచె నా♦చె
లువఁ గదల. 1089

భర్తృహరిసుభాషితము, ఏ. ల. ఆ 5 పద్య 27.

క. మనుజేంద్రి మా నెలంతుక, పను లేమియు నెఱుఁగదెలమిఁ ♦ బాదుకొనంగాఁ
జనపిచ్చి దినదినంబును, గొనబు మెఱయసీవె దిద్దు♦కొనవలయుఁ జుమీ. 1090

కవిచకోరచంద్రోదయము, ఆ 4.

సీ. ధవుఁడు డస్సటిలంగ ♦ దవ్వేఁగెదవు సుమ్ము, భీరుత్వమింతుల ♦ తీరటంచు
సరసోక్తు లాడంగ ♦ సైరించెదు సుమ్ము, మితభాషణము దగు ♦ మెలఁతకనుచుఁ
జేసేను మరుచేతఁ ♦ జేయకుండెదు సుమ్ము, మాన్యంబు చిత్తంబు ♦ మగువకనుచుఁ
జెలఁగేఁగి పైఁ బెక్కుఁ ♦ జేరఁ గొంకెదు సుమ్ము, వ్రీడ యలంకృతి ♦ వెలఁదికనుచు
గీ. నతఁడు మ్రానుశిలలెన్నటని ♦ నిన్నలయఁజేయఁ, దటులఁ గాకున్న సుమ్ము పు♦త్తుండు గాక
నమ్రసుచు నేర్పు మీఱఁగ ♦ నమ్ముకట్టి, బుజ్జగించుచు మెల్లన ♦ పొజ్జఁ జేర్చి.

శంతనూపాఖ్యానము, ఆ 3 పద్య 175.

—♦ సఖీజనవిగ్రహము. ♦—

సీ. అదె యొవ్వరే పిలి♦చెదరే గదియేమొకో, యూసి వచ్చెద నంచు ♦ నరిగె నొకతె
చిలుకయాఁకలిని ద♦ర్శింప నైతిరేయనె, కూయుచున్నది యంచుఁ ♦ బోయె నొకతె
మనజాలవల్లిక ♦ మఱచి వచ్చితిఁ గొంచుఁ, జనుదెంతు నదె యంచుఁ ♦ జాఱె నొకతె
యాదివాయి యెంత సే♦పయ్యెఁ జూచితె తోడు, కొనివత్తు నేనంచుఁ ♦ జనియె నొకతె
× × × × × ×

కళాపూర్ణోదయము, ఆ 7 పద్య 48.

సీ. మృగనాభి నేఁ దెత్తు ♦ మృగరాజమధ్యమ, పుష్పాలు నేఁ దెత్తుఁ ♦ బువ్వుబోఁడి
గంధంబు నేఁ దెత్తు ♦ గంధవారణయాన, కంబులు నేఁ దెత్తుఁ ♦ గంబుకంఠి
తారహారముఁ దెత్తుఁ ♦ దారకానిభదేహ, ముకురంబు నేఁ దెత్తు ♦ ముకురవదన
ఘనసార మేఁ దెత్తు ♦ ఘనసారతరకచ, కంజములు నేఁ దెత్తుఁ ♦ గంజనయన
గీ. యనుచు జను లెల్లఁ బనిలేని♦పనులు వలికి, వెనుక ముందరఁ గికురించి♦వెనుక వెనుక
జాతి రందఱు వచ్చిన ♦ జాడ పట్టి, ధావనంబునఁ బల్లవా♦ధరను డించి. 1093

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 124.

చ. కలయఁగ మంచిలగ్న మిది ♦ గట్టిగ జేగడె లెన్నియయ్యెనో
తెలిసెద నంచు నోర్తుఁ జను♦దేరఁ దఁ దేమని యోర్తు నెచ్చెలిం
బిలిచెద నంచు నోర్తు నొక ♦ పేరిడి వారిటు లేఁగి రంద ఱ
చ్చెలియలవెంట నే సగము ♦ సిగ్గరిగెన్ దరుణీలలామకున్. 1091

విజయవిలాసము, ఆ 3 పద్య 218.

సీ. నాగవల్లీదళా♦నయనము గావింతు,నని బయ లెక్కె నో♦య్యారి గాంక తె
చిలుకల కాహార♦ము లొసంగవలెనని, యరిగె మెల్లన నీర♦జాక్షి యొకతె
వన్నెల పిలిచితె ♦ నలినాక్షి యిదె వత్తుఁ,బదపదమనియేఁగెఁ♦బడఁతి యొకతె
తన కొక్క పని గల♦దని విన్నవించినే,ర్పునజాక్షి నెలమితోఁ♦బోలఁతి యొకతె
ఆ. నర్మసఖులు దమ మ♦నమ్మున లజ్జాభ,రమ్ము తేటపడఁగ ♦ రహసగతిని
జరిగి రట్లు వికచ♦సరసీరుహాక్షి ల,జ్జాసనాథ యయ్యెఁ ♦ జకితగతిని. 1092

వాసవదత్తా పరిణయము, వ. వీ. ఆ 5 పద్య 102.

క. అని బోధించి చెటూలున, వనితం గను మొఱఁగి చెలులు♦వరునకుఁ జెటిగాఁ
గను గిటిపి యొక్క రొక్కరె, చనిరం దలవంచి నాన♦సతి యుండంగన్. 1093

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 2 పద్య 187.

## నూతనవధూవరులు.

సీ. అంబుజాంబకుపూనిక్క♦నతి నిర్మలస్నాన,వ్రన మించు నామార్థ♦తను వసంగ
మోహనాగ్రణియత్న♦మునఁ దోఁచినుగుడెఁగం,బముఁ జేరుజంత్రపుఁ♦బ్రతిమ యనఁగ
సహకార తరు వర♦గ్రహమునఁ దగి యుప,ఘ్నావాప్తి యెడలని♦తీవ యనఁగ
మావంతు పార్థివా♦మహిమ నాలానంబు, దరలి వచ్చు మనోజ♦దంతి యనఁగ
గీ. నట్టి రమణుండు దివియ న♦పాగ్ర్యతనయ, విధు మణిస్తంభమున నర♦వెడలిబయటు
పడి పెనంగుచు మఱలికం♦బ మొక కేల,నూనియూఁతయుఁ దక్కు పా♦న్పొయ్యఁ జేరె.
క. ప్రకృతిజ్ఞయు హితనిర్వా,హకయు నగుట నల్లనల్ల ♦ నేనుఁగుఁ గంబా
నకుఁ దగిచి నల్లు యత్నా,ధికతం జెలి తెచ్చె నా స♦తిం బతికడకున్. 1094
క. అనయము చెరికయగుతిటి, ననివార్యవ్రీడభయాభ♦రాకులగతియై
తనువెనుక నొదుగ నొదుగఁగ, వనితామణిఁ దేర్చి తేర్చి ♦ వల్లభుఁ జేర్చెన్.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 29, 31.

ఉ. లేవఁ బెనంగ వేఁడియును ♦ లేమ విభూషలు మోఁయఁ దోఁచనే
యీవిధి పౌరుషీ లైన శర♦దిందుముఖీ వినువారు నిన్ను వీ
గావతి యండె ప్రియుంచుఁ దను ♦ డాయఁగ హస్తము పట్టికొంచు గో
తాప్రవిభుఁ డొయ్యఁ బక్కఁ జెరి♦దండఁ బెనంగఁ దలంక కింతయున్. 1096
చ. కదలఁగ రా దొకించుక యయో ♦ ఘల్లున మ్రోయఁగ నంచు నందియల్
మొదలుగఁ గొంతసౌమ్యభృదు ♦ ముద్దియ యొయ్యన కీ లెడల్చి మే
లొపవఁగ నూడ్చి వల్లభుఁడు ♦ నోసతి యూయితపాటు లెస్స యం
చు మయుతతోఁ గపోలములు ♦ సోఁకఁగ గొంతన మాడె నవ్వుచున్. 1097

ఉ. ఏపలుకుం జెవిం బడఁగ♦నీక పెనంగుచు మోము దప్పఁగాఁ
బాపుచుఁ ద్రోపులాడుసతి♦పాణితలంబుల మేళనంబు నుం
ర్వీపతి క్రిందభాగమున ♦ వేడ్కఁ బొనర్చు ముఖాబ్జముం గడుం
జాపఁగ నాలకించుటయె ♦ బ్రహ్మసుఖోదయ మయ్యె నయ్యెడన్. 1099

కళాపూర్ణోదయము, ఆ 7 పద్య 149, 170, 152.

గీ. మగని వీక్షించి దేహళీ♦మధ్యసీమఁ, ద్రపయు వెనుకకుఁ దీయ ముఁ♦దలికిఁ దిగువ
భామ గనుపట్టె నాలీఢ♦పాదయగుచు, మరునితోఁ బోర నిలుచున్న♦మహిమ మెఱయ.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 114.

ఉ. తాలిమిఁ గ్రుంగఁ ద్రొక్కి మదిఁ ♦ దర్పకమున్ దమియున్ భయంబు హే
రాళము గాఁగ మైఁ జెమట ♦ గ్రమ్మఁగఁ గొంకుచు మెల్ల మెల్లనే
బాలిక యేఁగుదెంచె విభు♦పాలికిఁ బ్రాణసఖుల్ దమల్పఁగా
దోలిక మ్రోలకున్ మనసి ♦ జే గమనయ్యభిమానిపోలికన్. 1100

ఉ. చంచలనేత్రి రాఁ గలుగు♦సంభ్రమ మే మనవచ్చు వాసనల్
ముంచుకొనెన్ సమస్తగృహ♦ముల్ మిఱుమిట్లు గొంచు నొడల్
ముంచుకొనెం దనూరుచులు ♦ ముంగిటి కించుక రాక త్రొల్తనే
ముంచుకొనెన్ నృపాలునకు ♦ మోహముఁ గోర్కులు నెమ్మనంబునన్. 1101

విజయవిలాసము, ఆ 3 పద్య 128, 129.

గీ. కరితెఱంగున భారమై ♦ దరులు మీఱు, ఝురితెఱంగున నడ్డమై ♦ సమదమైన
కరితెఱంగున నెదిరిభీ♦కరము గాఁగ, సిగ్గు మది నగ్గలింప నా♦చిగురుబోణి. 1102

గీ. మాటుకొనియును వెనుచిక్కు♦మరలిచనియుఁ, గూడి కేల్వట్టితిగిదిన♦నీడిగిలియు
నలిగి బొమముడి చూపియు♦నానలిడియుఁ, జాలదరలతఁ గనియు రాఁ♦బాలకున్న.

సీమంతినీకళ్యాణము, ఆ 3.

సీ. కనకపంజరశారి♦కల ముద్దుపల్కుపల్కులు విను నెపమునఁ ♦ గొంతసేపు
నంచబోదల నడల్♦గాంచి సంతోషించు,కొను విధం జేర్పడఁ♦గొంతసేపు
నీలశైవాలనాట♦నెఱవు నెమ్మలఁ జూడఁ,గోరు జాడ దలిర్పఁ ♦ గొంతసేపు
హరిణశాబక విలో♦లాయతేక్షణముల, వింతలుగనురీతిఁ ♦ గొంతసేపు

గీ. గాలయాపన సేయుచుఁ♦గాముఁ డపుడు, ముందటికి లజ్జ వెనుకకు♦మొనసి తిగియఁ
జొచ్చుకత్తియ కిరుపంకఁ ♦ జేరు కొలువ, నచ్చె విభుఁ డున్న యోవరి♦[illegible].

గీ. పలుకరించినఁ బలుకక ♦ బలిమిఁ దలుము, కొనినఁ జిక్కక ప్రతికూల♦తను నటించు
నంబుజానన విభున క♦త్యంతకామ, దోహద సుఖం బచేసె సం♦తోషము దవ.

చ. కినుక యొకింతపూని గిలిగింతలు మాని నిజేశ్వరుండు వం
చనఁ గనుమూయుచో నిది నిజంబగునో యుఁకఁ బల్కరింతునో
యని కనువిచ్చిచూచు విభుఁ డంత నెఱింగి దరస్మితంబుతోఁ
గనుఁగొనఁ గన్నుమూయుఁ గలకంఠి తటిచ్చలనంబుకైవడిన్. 1105

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 5 పద్య 99, 105, 106.

గీ. సఖులు ప్రార్థించు తఱిని లజ్జాస్రవంతి, బద్మగంధికి మోఁకాలి బంటి యయ్యెఁ
బడకయిలు సేరు తఱి మొలబంటి యయ్యెఁ, బతిని డాయంగఁ బుక్కిలి బంటియయ్యె

గీ. సఖులు ముందరిదెసకు లజ్జావధూటి, వెనుకదెసకును దోయు నవ్వేళ యంతఁ
గలికి నవరత్నమయడోలికయును బోలి, భూతలాధిపు చిత్తము బ్రాంతలూఁచె.

సీ. ఆస్యేందురుచిని శశాంకాశ్మకుడ్యముల్, గరఁగు నంచునొ నెమ్మొగంబు వంచె
మహితలజ్జాపరిమగ్న యగుటనో చేసెను, వరుని మాటకు మాఱువలుక దయ్యె
భావినఖక్షత భయము గల్గునటనో, కలకంఠి నెమ్మేనఁ గంప మందెఁ
గ్రొవ్వాఁడిచూపుముల్కుల కోర్వఁడంచునో, సుందరి పతిఁ దేఱిచూడదయ్యె

గీ. భూవరవసంతసంపర్కమున లతాంగి, యంగలత కోరకిత మయ్యె ననఁగఁ జూడఁ
బటుతరస్వేదకణములు పర్వె మేన, సారసాయతనేత్రికా సమయమందు.

క. పిలిచినచో మాటాడమి, తలయెత్తమి తేఱిచూడఁ దలపోయమి ముం
గల నయ్యెడు జలజానన, పొలయలుకలపోలుపుఁ దెలిపె భూపతి మదికిన్. 1109

క. జనరంజనము, ఆ 3.

సీ. ననుడించి మారెందు సనియెదరిపుడంచు, గునిసి పయ్యెదకొంగు బెనసిపట్టు
వలపగ్గలంబుగా నొలసె నెమ్మది గ్రమ్మఁ, గాంతుని మిగుల క్రేఁగంటఁ జూచు
నీటుజాగు సేయుదురె యంచుఁ బలికిన, యన్ను మిన్నులకను సన్నఁ దిట్టుఁ
జెలిమి మైనడుగుఁ దమ్ముల బెనంగొనెడు రా, యంచబోదిల నడలించి పెంచు

గీ. బలితమై దోఁచుకినుక నెచ్చెలుల వెనుక, కరుగఁగఁ దలంచు నెమ్మది వరుని నెంచు
తలిరుఁబోఁడికి వలపు ముందటికి సిగ్గు, వెనుకకును దీయ నొయ్యన వెఱపుమాలి 1110

కవిచకోరచంద్రోదయము, ఆ 4.

గీ. చెలువ లజ్జాభరం బను శృంఖలంబు, దవులుకొనియుంటఁ బదము గదల్పదయ్యె
మేటి వలపను ముష్కరి త్రాటఁ బట్టి, ముంగలికి లాగఁ దొడఁగెనంగుఁడంత.

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 2 పద్య 181.

సీ. విపుల మందాకినీభావంబు♦వెనుక కీడ్వ, ధవునిపైఁగలకూర్మి ముం♦దటికిలాగఁ
ద్రొక్కులాడుచు నున్నవ♦నూటిమనము, లీల బంగారుడోలిక ♦ పోలి కర్వె.
గీ. కేళికావాసమునకు నేఁ♦గెద నటంచు, ముందటికి రెండు మూడంజ♦లందినడుచు
లజ్జ పెనఁగొన్న యట్టు ల♦ప్పడ్జఁ జేసి, నిలతునోయంచు వెనుకకుఁ♦దొలఁగినడుచు.
ఉ. చందనగంధి యెంతటవె♦సం జనుదెంచునొ యంచు నున్నచో
నందెలసందడుల్వినఁగ ♦ నై చెలి రామి త్రిపాగుణంబుగా
డెందమునం దలంచి గడు♦శీఘ్ర దలిర్పఁగ మ్రోల కేఁగిన
న్సుందరి నాన నాననముఁ ♦ జూపక పయ్యెదచెంగు మాటిడన్. 1114

శకుంతలాపరిణయము. ఫ. వేం. ఆ 3.

చ. ఎదుట మహీశుఁ గాంచి తర♦లేక్షణ మేను చెమర్ప సమ్మదం
బొదవియు సిగ్గుపెంపునఁ బ♦యోజదళాక్షుల వంపుఁజూపుముం
దుదల నదల్చివైచి కర♦తోయజకేళి సరోరుహంబునన్
బదరుచుఁ ద్రిప్పివైచె విభు♦పార్శ్వగతం బగు రత్నదీపమున్. 1115
ఆ. బాలకేలు గేలఁ ♦ గీలింప నెదుటికి, వీఁగ వెనుక కతివ ♦ వీఁగుటలరఁ
బూఁచి యున్నవాలు♦భూపాలుఁగని లోఁగి, మగిడిమన్మథుండు♦దిగిచె ననఁగ.
గీ. అధికగంభీరమైనయ♦య్యబ్జనినాభ, గలఁపు బల్కొపదృజ్మాత్రత్రి♦గెలిచివాఁడియు
భూరివిజయాంకమాలిక♦ల్పోలెఁ జరణ, నఖముఖంబుల ధర వ్రాసె♦నలిననయన.
చ. కురు లనునీలరత్నముల♦గుంపు కపోలవిలోలఘర్మశీ
కరనవమౌక్తికాళి......♦కాంచనకుంభయుగంబు నబ్బురం
దిరుగక రాజుకేలు సుద♦తీమణికాంచి హరించునాస న
య్యిరవున కేఁగి పట్టువడి♦యెంగడి దేరని చోరుఁడుం బలెన్. 1118

సుదక్షిణాపరిణయము, ఆ 5 పద్య 182, 184, 188, 190.

క. పొడమిన లజ్జాభరమున, వడు గామడయైనముగుద ♦ యపు డీడిగిలం
బడి పడకయిల్లు సొరక,ప్పడఁతుల వెసఁ గసరి యిట్లు ♦ పలికెం గలఁకన్. 1119
ఉ. అక్కట! నన్ను మీర లిపు♦డందఱు నాఁడిడివెట్టి మాయలం
జిక్కఁగఁజేసి కన్మొఱఁగి ♦ చెచ్చెర నేగఁ దలంచినార ల
య్యక్కలొ! మీవివేకముల♦హా! తెలిసెన్ మిముఁ బాసియొంటిమై
నొక్కనిమేషమున్ మెలఁగ♦నొల్లఁజుఁడీ వెనువెంట వచ్చెదన్. 1120
ఉ. పానుపు నొంద కప్పుడు త్రి♦పాభయసంచలితాంతరంగయై
మానిని మోహసంభ్రమస♦మగ్రితమైపులకింప ఘర్మసాం

డాసినదయై కనుంగవ ముదశ్రులు గ్రమ్మ వినిశ్చలహర్షముం
బూనుచు నిల్చె దివ్యమణి♦పుత్త్రిక కైవడి శౌరి యుండటన్. 1121

భద్రాపరిణయము, ఆ 4 పద్య 88, 89, 95.

గీ. చెలియకత్తెలు ముందుకు, ♦ సిగ్గు కొంత, వెనుకకు నుదోయి మెల్లన ♦ వెలఁది నడిచి
పడకటింటను చేరుతటి మొల♦బంటిసిగ్గు, మంచి జాలు వాఱుచుఁ దల♦మున్కలయ్యె.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 100.

## —♦ సఖీజనపరిహాసవాక్యములు. ♦—

సీ. పలుగర సేయక ♦ పసుపును నలిపించు, కొనక మొగంబు మ♦జ్జనము లేక
పరిశుద్ధవస్త్రంబు ♦ ధరియింపక కచంబు, లాగిఁ జిక్కుపుచ్చి కొ♦ప్పుగముడువక
పత్త్రగ్రంథిలకధా♦రణ మొనర్పక నవీనముగఁ గాటుక లోచ♦నముల నిడక
తగునట్టి సొమ్ములు♦దాల్పక దినముఖనియమపుణ్యంబు లె♦వ్వియుఁ జలుపక

గీ. నీవు తడయుట చోద్యమో ♦ నీరజాక్షి, ఘనముగాఁ బోలు శ్రమమట్లు♦గాక...
చిన్నెలింపునఁ జూచుకొ♦నుచున్నదాన, వేమొ విఘ్నమై వచ్చితి♦మెఱుఁగ కేము.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 66.

క. రావే ముద్దులగుమ్మా, రావే బంగారుబొమ్మ ♦ రావే కొమ్మా
నీవిభుఁ డిచ్చినవస్తువు, లేవే యని పిలిచి దాదు ♦ లింపుగఁ బలుకన్. 1124

సీ. అర్ధచంద్రునిమీఁద ♦ నమరి యున్నవి తేఁటు, లలివేణి యిది విస్మ♦యంబు గాదె
యలవోడ్చి వాడిన ♦ యంబుజంబులు పగలంగన యిదియె చో♦ద్యంబు గాదె
బింబంబుపైఁ గెంపు ♦ డంబుగా నుదయించెఁ, దరుణిరో యిది విచి♦త్రంబు గాదె
కరికుంభములమీఁదఁ ♦ గనుపట్టె నెలవంక, తరలాక్షి యిది యద్భు♦తంబు గాదె

గీ. యనుచుఁ జెలువలలోఁ బ్రౌఢ♦మైనయట్టి, భామ కనుగీటి తనతోడి♦పడఁతితోడ
నాయికను జూపి కేళిచి♦హ్నములు కొన్ని, బయలుపడకుండ ధ్వని యొప్పఁ♦బలికె నపుడు.

క. ఇవి యేమి చిత్రమే చెలి, కువలయములు కెంపు మీఱు ♦ కొని యుండంగా
వివరింప విని విచిత్రం, బవునా యని యటులు పల్కె ♦ నదియున్ మగుడన్.

సీ. పూఁదీవె యేటి కిం♦పుదొలంగి వాడెనో, వాడదే యినకర♦పీడనమునఁ
గరికుంభముల కేల ♦ గాయము ల్గలిగెనో, కలుగవే యతనుసం♦గరము వెలయఁ
బత్త్రింబు లేటికిఁ ♦ బస దప్పి సడలెనో, సడలవే యతిశయ♦స్పర్శనమున
జక్కవకవ కేల ♦ సత్కాంతి వాసెనో, పాయదే రాజవి♦భ్రమము మెఱయ

చ. ఒపవగఁగూర్చి చేనియును◆నొప్పదు మన్మథకేళి పిమ్మటన్
మదతులగాత్రముల్ గదిసి ◆ నుప్తి యొనర్పఁగ రాజకోటికిన్
విదురలఁ జెందియున్నరమ◆ణీతిలకంబులయూర్పు గాడ్పులన్
చెదరి తొలంగు నందుఁ గడుఁ◆జేసిన నాథుల మేలిపుణ్యముల్.

శా. ఇరుప్రొద్దు న్నరుఁ డల్పభోజి యయి తా◆ నేప్రొద్దు శుద్ధాత్ముఁడై
చరణత్రాణములందు నేమరక యో◆జం బర్వవర్జంబుగాఁ
బరనారీరత మానపథంబుక్రియ ని◆ర్వాంచా మతిం బొంది యొ
క్కరుఁడున్ నిద్రభజించు పీనభయుఁ డా◆శ్యం గాంచు శ్రీయుక్తుఁడై.

చారుచర్య, పద్య 56-62

గీ. అనఘపురుషనతుతత్రింబు◆లైన జ్యేష్ఠ, మొదలుగాఁ గల నక్షత్ర◆ములన యుగ్మ
కముల నైనను ఋతుదివ◆సముల నైనఁ, దనకులాంగనఁ గవయుట ◆ ధర్మమగును.

సీ. పరకాంత మున్నైన ◆ పడఁతి సన్యాసక్త, యైనతొయ్యలి దుఃఖ◆యైన చెలువ
సంతసం బెలుఁగని◆సతి సనాచారంపు, టిభయాన బాలింత◆యుసురు బోఁడి
నివ్వ మాలినలేమ◆నిర్మోహయగు కొమ్మ, కలహంబు పెట్టెడి◆కములఁ గన
రతుల నేరుపు లేని◆రామ జారయుఁ జోరకుమతియగు నెలనాఁగ ◆ కూటి పేద

గీ. యైన మృగనేత్రి పరితుష్ట◆యైనయువతి, తన్ను మెచ్చని తన్వంగిఁ◆దమ్ములంబు
నీనిపద్మాస్య కడురోగి◆యైనయువతి, రతి కనర్హలు మానవ◆తతికి జగతి. 1137

సీ. రతితంత్రములయందుఁ ◆ బ్రౌఢయై తనమీఁద, నత్యంతభయభక్తు◆లతిశయిల్ల
సౌకుమార్యము చేత◆నే కొదవయు లేక, సుందరాకారత◆సొంపు గలిగి
సరసశృంగారవే◆షముల నెంతయు మించి, యుచితప్రియాలాప◆రచన లెఱిఁగి
వినయవిధేయవి◆వేకశీలతలచే, ననుకూలమగు నెఱ◆తనము నేర్చి

గీ నిర్మలాంగియు నిపుణయు ◆ నిర్మలాత్మ, బాత్యయును బుణ్యవతియును◆సతియు నైన
తన కులాంగన రతికేళిఁ ◆ దనిపె నేని, యతని కైహికలోక సౌ◆ఖ్యములు గలుగు.

గీ. అనఘ విను పౌర్ణమానుల ◆ నమవసలఁ జతుర్దశుల నష్టములను ప్ర◆దోషములను
సంక్రమణములయందును ◆ సతులరతుల, ననుభవింపంగ రాదని◆రార్యు లెల్ల.

గీ. చైత్యచత్వరగోష్ఠశ్మ◆శానతీర్థ, వారిశృంగాటకారామ◆వాహినీను
రాలయాగ్రామమధ్యంబు◆లందుఁ బగలు, సతులఁ గవిసిన దోషంబు ◆ సంభవించు.

విష్ణుపురాణము, ఆ 4.

గీ. పగట నుపవాసదినములఁ ♦ బర్వతిథుల,సంధ్యలను గాదు రతిసల్ప ♦ సజ్జనులకుఁ
బాయునాయువు పగలచే ♦ భంగమొందుఁ, దలఁగు సంపద దుష్ప్రసం ♦ గతిజనించు.

క. అతిసురతము రోగప్రద మతిమోహము సకలహాని ♦ యగు నీరెండున్
కతిపయదినముల నరునికి, సతికష్టముఁ జేయునందు ♦ రాయుర్వేదుల్.

మల్హణచరిత్ర, ఆ 2.

---

## సురతాంతము.

సీ. క్రొమ్ముడి న్మ్రడిచిన ♦ కుసుమము ల్వాడిజాఱఁ, జెక్కుల మకరికల్ ♦ చెమ్మగిల్ల
సరులముత్యంబులు ♦ చిఱ్ఱునఁ దెగిజాఱ, ఘర్మబిందువులు వ ♦ క్త్రమునఁ జిల్కఁ
బలుగెంపు చిమ్మదివల్ ♦ బలసి నిమ్మ్మకనొంప, తెలుపుగా నాసికా ♦ తిలు నలంగ
నడుగుల రతనంపు ♦ బందియ ల్వడిమోయ, గడగడనకకంపుఁ ♦ గౌను వడఁకఁ

గీ. బట్టె చెయ్యాని యల్లనఁ ♦ జానువ..., పీన కుచ ... ♦ చిందులాడ
నానఁ దలవంచి తనప్రాణ ♦ నాయకునకు, వెన్నగాఁ జేసి నిలిచె నా ♦ వెలఁదిమిన్న.

కళాపూర్ణోదయము, ఆ 4.

---

## గర్భిణి.

సీ. చంద్రికపైఁ బర్వు ♦ చారువల్లిక వోలె, వెలఁది నీ యంగంబు ♦ పెలుకఁ బాఱె
హేమకుంభములపై ♦ నింద్రనీలములట్లు, కాంత నీ చనుమొనల్ ♦ గప్పు మిగిలె
వెడపాడు లీలాగ ♦ విందయుగ్మము మాడ్కి, సుదతి నీ కనుఁగవ ♦ సోలమందెఁ
బెన్నిధిఁ గాంచిన ♦ పేదచందంబునఁ, బొలఁతుక నీ కాను ♦ పొడలు కొనియు

ఆ. లలన నీదు చెయ్యు♦లలనంబు లయ్యె ల,తాంగి నీదు మంద♦యానలీల
జడను దాల్చె గర్భ♦సంపదకలిమినీ,యందుఁ దేఁటపడియె ♦ నిందువదన.
నిర్వచనోత్తరరామాయణము, ఆ 8 పద్య 86.

మ. నిలిచెన్ చెప్పల బృందిమన్ విశదిమన్ ♦ నేత్రంబులం జూచుకం
బుల నాకాళిమ మేఖలం దృఢిమ నె♦మ్మోము మారఁగాఁ బాండిమ
న్వలిమిం జన్నుల శ్రోణిపాళి గరిమ♦న్మధ్యంబునన్ బృంహిమ
న్నలితాత్మన్ లఘిమన్ మహామహిమ మే♦నన్ గర్భదుర్వాగయై.
భాగవతము, స్కం. 8, పద్య 496.

మ. పలుచం బాఱుటఁ గోమలస్మితరుచుల్ ♦ పైఁగోఁచె నా గౌరకాం
తులగండద్వితయంబు పాల్చెఁ బ్రమదా♦ర్ణోరాశి ఖేలన్నవో
త్కలికాభంగపరంపరోపరిసము ♦ ద్యత్పాండుడిండీరపం
క్తులు నాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దలుచై ♦ తోడ్తోఁ గురంగాక్షికిన్. 1133
మనుచరిత్రము, ఆ 3 పద్య 120.

సీ. కౌను దోడ్తతనంబుఁ ♦ గని చింత పడుగతిఁ, గుచముఖంబులు నీల♦రుచి వహించె
మందస్మితంబున ♦ మరఁగిరాదనముగ్గుఁ, బలుచని చెక్కులు ♦ పలకఁ బాఱె
ఫలరసంబుల కెవ్వ ♦ ప్రీతి రామి నొల్లదో,యన జిహ్వకన్నిట ♦ నరుచి పుట్టె
గర్భస్థుఁడగుబాలు ♦ కమనీయగుణభార, మహిమనా నడలతి ♦ మందమయ్యెఁ
గీ. గలికి జేడిసమోలతోఁ ♦ గలహ మాడు
వాలుఁజూపుల దాఁటులు ♦ డీలుపడియె
మంటికమ్మని తావిపై ♦ మనసు పాఱె
నాఁడు నాఁటికి బాలికా♦నళినముఖికి.
రాజశేఖరచరిత్రము, ఆ 1 పద్య 86.

గీ. తెల్లనగు మేను కుసుమిత ♦ వల్లి గాఁగ
గురుకుచంబులు పుష్పమం♦జరులు గాఁగ
నంగనుండెడి నలుపు నిం♦దిందిరములు
గాఁగఁ జెలువొందె వాల్గంటి ♦ గర్భమహిమ.
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 2 పద్య 80.

ఉ. బాలకురంగలోచనకుఁ ♦ బాటిలు మోహననాభిమండలా
వాలమునం జనించి పరు♦వంబున మీఁదికిఁ బ్రాఁకు రోమరా
జీలతనుద్భవిల్లి విల♦సిల్లు కుచస్తబకద్వయంబునన్
వ్రాలిన గండుతేఁటులన♦వర్తిలుఁ జూచుకమేచకప్రభల్. 1136

రామాభ్యుదయము, ఆ 3 పద్య 83.

సీ. ఎలకుందలకు రెంటి ♦ కెక్కుడఁ గల్గెనో, నీలకిరీటముల్ ♦ నీలవేణి
మూసిపెట్టి రదేమొ ♦ ముకురంబు లొకరెండు, తెలిజల్లుపావడఁ ♦ గలువకంటి
చిగురులు రెంటికే ♦ తగవునఁ బొడమెనో, యందంపుఁదొట్టిపా♦టిందువదన
నిదురకుఁబడఁజొచ్చె♦నెత్తమ్ములొకరెండు, తెలఁగిదియెట్లొకో♦ మెలుఁగుఁబోఁడి
గీ. యనుచువలిచన్నుఁగవకప్పు♦మొనలుగంప, పాండిమముపాదములనడ♦బడలికయును
వెల్లపుడుశయ్యఁగనుదోయి♦ నెలయునేర్చు, నేరుపుననెచ్చరింతుర♦న్నెలఁతనగఁగ.

కకుత్స్థవిజయము, ఆ 4 పద్య 30.

మ. కడుఁ దోరంపుఁ బయోధరంబులమొనల్ ♦ గప్పారుచుం బర్వన
ప్పుడు తద్వక్త్రసుధాంశుబింబమనయం♦బుం బాండురశ్రీగనం
బడియెన్ గార్తికపూర్ణిమాతిథి బలెన్ ♦ భావించి చూడంగ నె
య్యెడనున్ స్థానగుణంబునం గలుగవే ♦ యేమేమియుం జిత్రముల్. 1138

కళాపూర్ణోదయము, ఆ 5 పద్య 124.

క. తొలిచూలు తేఁటివ్రాలుడు, నెలప్రాయపుఁదీఁగయించు ♦ కించుక గదలెన్
జలజలరాలెడు పువ్వులు, బలెఁ జెట్టుము లుప్పతిల్లెఁ ♦ బంకజముఖికిన్. 1139
గీ. లేమి నెడబాయుటేకాదు♦ పోమృగాక్షి, కానుబలిబంధనస్ఫూర్తిఁ ♦ గాంచెఁబూర్తి
వింత గోరంత యైన య♦ద్విష్ణుపదము, మీఁది పొడవులఁబడినాక్ర♦మించుజాడ.

సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 95, 97.

శా. మించెం బోరచికోరికల్ గడువిజృం♦భించెం దనుగ్లాని గా
న్పించె న్మేచకకాంతి చూచుకములన్ ♦ జెక్కుల్ తగన్ దెల్పఱె
ట్టించెన్ గోర్కులు సందడించె నడచం♦డించెన్ మృదామోదమున్
గాంచె న్వ్రాతెఱ యొసరించెఁ ద్రివళుల్ ♦ నానాఁటికిన్ బోటికిన్. 1140

సారంగధరచరిత్రము, (చే. వేం.) ఆ 1 పద్య 35.

ద్విపద. పరిపూర్ణ సోముని ♦ బడలించు మోము, దొరకొని వేగుచం♦ద్రునిరీతిమండె
ననవిల్తుపూచెండ్ల ♦ నందగు చనుల, మొనల నల్లని వర్ణ♦ములు గానిపించె
మృదుబింబముల పన్నె ♦ మెచ్చని మోవి, కదిసినమలినంబు ♦ గప్పినట్లుండె

బడలికల్ మేనునఁ బర్వె నంచంచ, నడుము మందంబాయె ◆ నాభి గన్పట్టెయో
పవరనివల్లపూ◆సలపేరుఁ బోలె, నవిరళంబగుచు నూఁ◆గారుఁ జూపట్టెఁ
గలికిచూపులచంద్రి◆కల్ పర్వె ననఁగఁ, బలుకఁబో లెడు గండ◆పాళికాయుగళ
మలివేణి ముఖచంద్రుఁ◆డమృతంపునసము, బిలుచుచందంబునఁ◆జిట్టుము లెసఁగ
గగనభాగంబుసా◆కారమైయొప్పు, పగిదిఁ గొఁదీఁగ చూ◆పట్టె నానాఁట. 1141
నలచరిత్రము, (చ. రా.) ఆ 3.

ఆ. చన్ను లుకియఁ బొదలె ◆ జఘనంబు ఘనమయ్యె, పలకనెన్ను దసరె◆నలువుపుట్టె
రాజ్యయోగ్యమైన ◆ రత్నంబు దాఁచిన, పసిఁడిపెట్టెయనఁగ◆ నెసఁగెఁగడుపు.
ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 3.

ఆ. కాంత గర్భభరముఁ◆ గాంచి కాంచి చలించె, నంగదేశమెల్ల◆నలఘు నొందె
మధ్యసీమ యలరె ◆ మంజులలాటంబు, చెంత వాలినెనసెఁ ◆ గుంతలంబు. 1143
రుక్మిణీపరిణయము, (స. భ.) ఆ 4 పద్య 128.

సీ. మేరుశృంగములపై ◆ మేఘముల్ దిగురీతి, నాతి చూచుకములు ◆ నల్ల నయ్యె
సౌహృదకీర్తినిల్చు ◆ ధవళాంబుజము పోల్కిఁ, దలిగంటి నెమ్మోము◆దెల్లనయ్యె
గృళదైత్యజాతిప◆ఙ్క్తిలు నిటు లను రీతిఁ, గలకంతి లేఁగౌను ◆ బలిత మయ్యె
గర్భగార్భకతనూ◆కాంతి బైలగు లీల, విమలాంగి నూఁగారు ◆ విపుల మయ్యె
గీ. నలరుఁబోఁడికి నొకయడు◆గామ డయ్యెఁ, గీరవాణికిఁ జిట్టుముల్ ◆ దోరమయ్యె
నబ్జపాణికి మంటిపై◆నాస యయ్యె, సైకతశ్రోణికిఁ బ్రసూతి◆సమయమయ్యె.
ఉత్తరరామాయణము, ఆ 2 పద్య 137.

శా. కప్పుల్ వీడ్కొన భూధరేంద్రముల సౌ◆కర్యంబున న్మించువోఁ
దప్పె న్కాంతపయోధరమ్ములు కన◆త్సారావతారమ్ముపై
నుప్పొంగెం జెలువారు నిర్మలత స◆న్మోమధ్యభాగంబునం
దొప్పెన్ హంసగతుల్ ప్రియాంకరశర◆ద్యోగంబు రా నంతలోన్. 1145
అచలాత్మజాపరిణయము, ఆ 2.

సీ. తరుణోత్పలాక్షి నే◆త్రద్వయద్యుతు లాని, పుండరీకచ్ఛాయ ◆ మెండుకొనఁగ
ఘనముకురాస్యవ◆దనరుచిశ్రీధిమ, మహిమరీచిఖ్యాతి ◆ నెసఁగు చుండ
శైవలరోమాళి ◆ చారుతనూరుహ,స్థితి నారదస్ఫూర్తి ◆ నతిశయిల్ల
నగుచ్ఛకుచచారు ◆ వక్షోజయుగళంబు, పర్వతోన్నతిమించి ◆ పరిఢవిల్ల
గీ. సాగమృదువాణివాక్సుధా◆సారభూతి, యుల శుకావాప్తి నలర నా◆హస్తియాన
యూన మొగిరాజసాంసవి◆ధానమైన, నమరె మునివృత్తిగర్భభ◆రమున సతికి.1146
ఓఘువతీపరిణయము, ఆ 4 పద్య 57.

సీ. అరుచులుచెన్నారె ♦ నన్నాదిభోజ్యచ,యమ్మునందుదళితశ్రీ ♦ యమ్మునందు
నతులితగతిమహో ♦ రతిమీఱెమృద్వ్యక్ష,ణమ్ములందాభర♦ణమ్ములందు
పెంచఁగావలెనన్న ♦ ప్రేమలుజనియించె, హితులయందతిశతా ♦ హితులయందు
రాజమణీఘృణీ♦రాజి రాజిలె లోఁచ, నమ్ములందగ్రస్త♦నమ్ములందు
గీ. సురుచిరాచ్యుతతేజోతి♦శోభిగర్భ, పృథుకసంయుక్తిమైఁబ్రతి♦బింబితేందు
బింబగంగాఝురోర్మివి♦డంబనంబు, లోకులకుఁదెల్పునాచలా♦లోకనలకు. 1147

రాఘవపాండవయాదవీయము ఆ 1.

సీ. గతితోఁగళస్వరో♦న్నతిసౌమ్యముభజించె, జఘనంబుతోఁ గౌను♦నవతు గొనియె
నెమ్మోము చెక్కుటద్దమ్ముల కెనయయ్యెఁ, జవిమేలుకలలనే ♦ స్తనము వహించె
జడిమతో నిదురహ♦స్తనసఖిత్వముఁ బూనె, నోపిక మేనుతో ♦ నుపముఁ జెందె
లలితహాసము దృగ్వి♦లాసంబు సరియయ్యె, వలయావళులతోఁ ♦ దులకుఁ బ్రాకె
గీ. మందమయి ఘనమయి పాండి ♦ మపరికాళ, మయి సముదితము నయి సాంద్ర ♦ మయి కృశంబు
నై రహితమై చ్యుతంబునై ♦ యనుదినంబు,మహిళఘనగర్భముపచేళి♦మతనెసంగ.

ఇందుమతీపరిణయము, (జ. నృ.) ఆ 1 పద్య 47.

సీ. గగనమధ్యముమూర్తి ♦ గనుఁగొనఁ గప్పుచే, నొప్పారెపృథులప♦యోధరములు
పరకంకణోర్మికా♦వళులు జాఱఁగఁజారు, వేణివిశదగర్భ ♦ వృత్తి నెరసె
గురుమీఱెచెలువాఱు ♦ కువలయావళిహాల, హాలికసంపూర్ణ♦మై ♦ నలుపుకెక్కె
భ్రమరకాక్షిణ్ణమై ♦ సుముఖినీరజపాళి, వెలవెల్లనై యొప్ప ♦ కలన దఱిగె
గీ. వక్షముతుశంకఁగల్పించు ♦ వనరుహాక్షి, గర్భగౌరవ మీలాగు ♦ గరిమఁ గాంచ
నిండెఁ దొమ్మిదినెలలును ♦ నిఖిలభువన, గర్భగౌరవవత్కీర్తి ♦ కాంతఁబోల.

సుబ్రహ్మణ్యవిజయము, ఆ 1.

మ. నవగర్భోదయవేళయన్ తొలుకరి♦న్మందంబులై హంసయూ
నవిశేషంబులు పొల్చె నూష్పగముల♦న్వ్యాజంబునన్ దూర్పుగా
డ్పువెస న్మించెఁబయోధరంబులొగి ను♦ప్పొంగెన్ వినీలాంతతన్
నవకంబేర్పడెమించెఁ జిట్టుములు సో♦నల్గాఁ గురంగాక్షికిన్. 1150

భద్రాపరిణయము, ఆ 2 పద్య 26.

చ. ధవుఁడిఁకముట్టరాదనుచు ♦ దర్పకుఁడప్పుడుమచ్చకంటిచ
స్తనపయిముద్రఁజేసెనిటు ♦ కజ్జలయుక్తి ననంగఁజూచుక

చ్ఛవినలుపెక్కుభావినుత ♦ సర్వనమస్కృతయానటన్నకీ
ర్తి వెలసివక్త్రసీమపయిఁ ♦ దేలెననందలుపెక్కుఁదద్ద్యుతుల్. 1151

సర్వకామదాపరిణయము, ఆ 1.

చ. నసుమిది పేద చంద్రికల ♦ నం బచలోన్నతి మావిధంబునం
బడిసెనెయుంచుఁ దన్ను నగు ♦ వక్త్రముఁ జన్గవవెల్లఁబాఱ న
ల్పడలేదుమోములం దనర ♦ నయ్యెడ నందఱు వేడ్కఁ జూడఁ జా
లెడు నభివృద్ధిఁ గాంచె నిల ♦ లేములు కాఁపురముల్ఘటించునే. 1152

మహేంద్రవిజయము, ఆ 4 పద్య 109.

క. చేడియమేనుకృశత్వము, తోడం గూడికొనెఁ గాను ♦ తోరపులీలన్
బోఁడిమిఁ గనె నపు డొకచో, నోడల బండ్లగును బండ్లు ♦ నోడ లగుఁగదా.

క. అతి సూక్ష్మమైన నెన్నడు, మతివకు నపుడంతకంత ♦ కభివృద్ధిఁ గనెన్.
క్షితిలో నెనునకు భాగ్యో,న్నతియోగదశాగమంబు ♦ నం బ్రిబలు గతిన్. 1154

నయనోల్లాసము, ఆ 1 పద్య 79, 80.

మ. వనజాస్త్రుం డిపు డింతి మై విడచిపో ♦ వం బైనముం గట్టి స్వాం
దనమార్గంబుసమంబుఁ జేసి రహిఁ జెం ♦ దం బ్రగ్గమున్ సాఁచి కం
దన వెట్టించెనొ బండిగండ్ల ననఁగాఁ ♦ దీఱెన్ వళీభంగముల్
ఘనరోమావళి సాగెఁ జూచుకములం ♦ గప్పెట్టె నైల్యం బొగిన్. 1155

శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 104.

క. అతిసూక్ష్మమధ్యదేశము, తతమై విలసిల్లె సతికి ♦ తతకుచకటిసం
గతిచే నన ప్పాంసం,గతి స్వల్పుల కైన వృద్ధి ♦ కరమున్ గాదే. 1158

సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 37.

---

# బాలెంత.

—:o:—

సీ. పొలుపు బ్బిగువుగుబ్బల నెమ్మివలతీవి, పసపంటుపయ్యెద ♦ పై నటింపఁ
గాయంపు ముద్దలు ♦ కారంపుఁదావులా,స్యనిసర్గవాసన ♦ లలమి కొనఁగ
నడుమున దిటము గా ♦ వడిఁ జుట్టి కట్టిన, బంగారుపైజారు ♦ కొంగు దనర
నుల్లిపూసల పేరు ♦ పసరుమంజిముత్యాల, కుతికంటు దాఁపునఁ ♦ గొమరు మిగులఁ

గీ. బహువనజనితపరిశ్రాంతిఁ ◆ బడలి యున్న, యంగకములనొక్కొక వింత◆మూఁక మొసఁగఁ
జూడఁ దగి యుండె నప్పుడా◆సుదతి యందు, లాలితంబైన బాలింత◆ రాలితనము.
కవిరాజమనోరంజనము, ఆ 2.

సీ. తారహారములతోఁ ◆ బోరాడు నెల్గుల్గి, పూసపేరులు కంఠ◆మునఁ జెలంగఁ
బద్మరాగంబుల◆పగిదిఁ జొక్కపువీడి, యములతో నెనసి దం◆తములు మెఱయ
ధగధగ వెలుఁగు ని◆ద్దపుఁ జెక్కుటద్దము, హొంతఁ గాటుకయుక్క◆ బొట్టు వెలుఁగ
ముఖచంద్రముని మీఁద ◆ మొనసిన కార్కొబ్బు, గతి నీలి వాసెన ◆ కట్టు మెఱయ
గీ. నంత నయ్యింతి పచ్చి బా◆లెంతసొబగు, భువనమోహనమగు వేష◆మునఁ బొసంగెఁ
దరుణు లెల్లను వృద్ధోది◆తప్రకార, మునఁ బురిటివైభవము సేయు ◆ వెనుక వెనుక.
వాసవదత్తాపరిణయము. వ. సీ. ఆ 2 పద్య 59.

చ. వడఁకెడు కొనురంగు తల ◆ వాసెనఁ గట్టిన కొంగు పుక్కిటన్
విడియపుఁ జొంగు ◆ మైలగొని ◆ వ్రేలెడు చేలచెఱంగు పాలచే
పుడుచనుఁదోయి పొంగు వస◆పూసల వింతబెడంగు నూనెకొ
మ్ముడిరుచి చుక్కబొట్టమర ◆ ముద్దియ యొప్పెను బిడ్డకాన్పునన్. 1159
హంసవింశతి. ఆ 2 పద్య 95.

సీ. మెఱుఁగారు రవనూనె ◆ కురులజాఱుముడితోఁ, బాల వెల్లుబ్బు గుబ్బ◆కవ తోడ
వదనాగ్రికటుతిక్త◆వస్తుసౌరభముతోఁ, గాటుక కనుదోయి ◆ నీటు తోడ
నలరు మేదావికిరిం◆దగు భూతిరేఖతోఁ, దాంబూలరాగాధ◆రంబు తోడ
నునుఁబైట బిగియఁజు◆ట్టిన లేఁవనడుముతోఁ, బసపునలఁడిన మై◆మిసిమి తోడ
గీ. ఘుమఘుమలఁ బర్వు సాంబ్రాణి ◆ పొగల తోడ, జటిశిఖామణినిజపక్ష ◆ సదనసీమ
బరఁగెఁ గాన్పున రంగద◆పాంగవిజిత, చకితబాలకురంగియా ◆ చంచలాంగి.
శకుంతలాపరిణయము. పె. నా. ఆ 3 పద్య 90.

## వేఁగుఁజుక్క.

సీ. సకుటుంబముగ వీఁగి ◆ చరమశైలముఁ జేరు, తుహినాంశుఁడుము దారు◆వౌర యనంగ
జానీర మైవమ్ము ◆ నలినబాంధవు టెక్కి◆యంబుపై దీపించు ◆ సద్దమనఁగ

వరుణాగ్రనిబిడవా♦ద్యములలోఁ గనుపట్టు, సమయశాంఖికుచేతి ♦ శంఖ మనఁగ
నినుఁ దప్పడఁజుఁడౌట♦మును మున్న పడివాగ, కొనివచ్చురాయంచ ♦ కోదమనఁగ
గీ. నుదయగిరిమీఁదఁ గోపురం♦బుండ నిగుడు, నహితరవిరశ్మిచే బద్ధుఁ♦డగుచుఁ దోడి
బలఁగమైనట్టి చుక్కల ♦ పలసత్రోవఁ, జూపనేతెంచెనన వేగుఁ♦జుక్క వొడిచె.
మనుచరిత్రము. ఆ3 పద్య 54.

మ. అస్తాంశుండు నిశాసతిం గలసి శ్రీ♦గ్రచ్ఛందిరికాగంధశీ
ల్పముతోఁ బుష్కరశయ్యఁ బాసిచనవే♦శ్రీమంతి తచ్చుక్కలసం
ఘ్రిమసంశ్లిష్టశరోడుహారమణిహా♦రం బేరి తానొక్కచో
గుమిగాఁ బోసెనొ నా మినుక్కురను వే♦గుంజుక్కఁ గంటే చెలీ. 1163
మనుచరిత్రము, ఆ 4 పద్య 128.

గీ. తన పగతుఁడెంతదూరంబు♦జనియెనొక్కొ, యనుమానిక్కుచుఁ గనుధప♦శౌరి వింట
మనఁగ మినువాఁక నంతర♦త్యంత తాంత, కటులు నిద్రాపటిమఁ జొక్క♦వేగుఁ జుక్క.
రాజవాహనవిజయము, ఆ 3 పద్య 24.

గీ. చక్రదంపతిసుకృతభూ♦జంబు మొక్క, జారకాంతల మనసులందుఁ♦జేరు సొక్క
సిరిఁ బసరు పూర్వదిక్కాంత♦ చేరు ముక్క, విమలగతి నంటెఁ గనసరోజ్య♦వేగుఁ జుక్క.
సీమంతినీకళ్యాణము, ఆ 3.

గీ. కాలమను సింహమాకొని ♦ గంధగజముఁ, జీరి నెత్తుకుంభముధ్యాంబున ♦ సింపసంగుఁ
జిలిమిఁ గన్పడు గొప్ప ము♦త్యము మనంగఁ, జొక్కమగునట్టి వేగురుఁ♦జుక్క వొడిచె.
శతకంఠరామాయణము, ఆ 1 పద్య 164.

క. చలిగొలుఁగు గలియు వోరే, పెలఁదుక నెఱిగొప్పవలన ♦ పెను జాఱిన పెం
గలుపకరి వాఁగెఁ బగిచు, క్కలతెరువన వేగుఁజుక్క ♦ గనుఁగొనవయ్యా. 1166
అచ్చతెలుఁగురామాయణము, అయోధ్య, పద్య 37.

గీ. చక్రిపరిపాలనము నన్న ♦ జగము పొందు, దాని వచ్చను నీరంధ్ర ♦ నరుగు ముందు
సురలు శశికాంతుఁ బిలిపించి♦గరువుఁ గమ్మ, మిట్టిపడఁగ నభమున వేగుఁ♦జుక్క వొడిచె.
రసికజనమనోభిరామము, ఆ 5 పద్య 103.

గీ. చక్రపద్వేషి పైన కుం♦ట్రనుఁడ వీవు, రాజనాయిండు నిలుపంగ♦రాదు తలఁగు
మనుచుఁ జంద్రుని కెఱిఁగింప♦నినుఁడు పంచు, మాత యన వేగుఁజుక్క ప్రా♦దుర్భవించె.
సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 122.

ఉ. తను నెడఁబాయ లేక బహు♦తాపముఁ బొందుచు నున్న పద్మినీ
వనితల దుఃఖముల్ దునుమ ♦ వచ్చెడి నంచు నినుండు బూని వే

డక్కను మహితపరిభూత మను ♦ కంచుకిచే భువి నానవాలుగాఁ
బనిచిన మూలరొల్పటువు ♦ భంగిని వేగురుఁజుక్క భాసిలెన్. 1169

మిత్రవిందాపరిణయము, (రా-జ.) ఆ 4.

గీ. నలిని నలినీమలినగాలి ♦ నవతుషార, పూరచాపాగ్రకుచకోశ ♦ నూరడింప
నూరఁ దంపిన సంకేత♦చూరుఁడనఁగ, వేగమొదయించెఁదమిచిక్క ♦వేగుఁజుక్క.

రుక్మిణీపరిణయము, (స-భ.) ఆ 2 పద్య 259.

గీ. సమయలోకేశ్వరుఁడుచక్ర♦శత్రురచిత, భువనజాతార్తి మాన్పవి♦స్ఫూర్తినొసఁగు.
లోకబాంధవనిభు♦ తైకశాసనం బనఁగ వేగుఁజుక్క మిం♦టను నలర్చె.

వేంకటేశ్వరవిలాసము, ఆ 2 పద్య 110.

గీ. పక్కములసొంపుఁ మాలించి ♦ పటుకరాసి, చేతఁ జక్రంబులనుగుందఁ♦జేసి తంచుఁ
గినిసిగ్రహరాజుచంద్రుఁడె♦మ్మనుచుఁబంపు, నోపుదారనరహివేగుఁ♦జుక్కవోడమె.

కృష్ణార్జునసంవాదము.

మ. లలితాపాండువిభావిశేషదధి వే♦శాగోపి గాఢోదయా
కలభాయంత్రమునన్ మథించి గగన♦చ్ఛద్మాత్మ్య పాత్రింబునన్
వెలయింపం దిమిరాచ్యుతుండు గొని వే♦వేగ జ్జన స్తత్కరా
కులమై యొప్పెడు వెన్నముద్దయన వే♦గుం జుక్కదోఁచెన్నభిన్. 1173

సర్వకామదాపరిణయము, ఆ 2.

గీ. అరుణకిరణుఁడు పద్మినీ ♦ వరణమునకు, పమ్చెనపఁ గాల మనియెడు♦బాణకారి
తారకామండలము నేయఁ♦దనరెననఁగఁ, జక్కగాఁదూర్పునను వేగుఁ♦జుక్కవోడమె.

వల్లీపల్లవోల్లాసము, 2 పద్య 113.

గీ. తడపు దే కొనితోడను ♦ దనరియుండి, వెడలఁబోయెడుతటిని రే♦వెలఁదివిప్పు
కొప్పునందుండి దిగజాటి ♦ కూలినట్టి, విరులబంతి నాఁదోఁచె♦వేగుఁజుక్క.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 114.



## కోడి కూత.

——:O:——

ద్విపద. తొలుకోడికనువిచ్చి ♦ నిలిచి మై వెంచి, జలజల రెక్కలు♦సడలించి నీల్గి
గ్రక్కున కాలార్చి ♦ కంఠంబు విచ్చి, ముక్కున నీకెలు ♦ ఇక్కల్పి కడుపు

వెక్కిరించి మెడసాఁచి ♦ నిక్కి మిన్నుచూచి, కుక్కుటోత్కృష్టి ♦ కూయక మున్న
ప్రబ్బతనాథ ప్ర♦బ్బతనాథ యనుచు, నుబ్బనీరుక్కోళ్లు కూ♦యుడుగక మున్నె.

పండితారాధ్యచరిత్రము, పు-రా. ప్రక.

ఉ. కోమలతామ్రచూళికల ♦ క్రొవ్వెలసంజకుఁ బోల్చిదిద్దె ని
స్సీమకఠోరతారమతిఁ ♦ జెట్టుపలార్చుచునట్టులెత్తి వి
శ్రామముపోలెఁ గూసె విల♦సచ్చరమాచలకూటపక్కణ
గ్రామటికాకుటీరశిఖ♦రంబులఁ గుక్కుటచక్రవాళముల్. 1177

శృంగారనైషధము, ఆ 8 పద్య 153.

మ. సకలాశాగతి నర్మకోపవిరతి ♦ శౌరిత్రక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశ♦బ్దజ్ఞానమేమూల మిం
తకుఁబోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెం♦తం గొండపైఁ బల్లెలం
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిధం♦గిన్ భుగ్నకంఠధ్వనిన్. 1178

మనుచరిత్రము, ఆ 3 పద్య 55.

క. ఇక్కువగతి పతిపాలికి, జక్కవజవరాలు చేర ♦ సంకేతరవం
బొక్కటియొసంగెనోయనఁ, గుక్కుటములు పక్కణములఁ ♦ గోంకృతిసలిపెన్.

రామాభ్యుదయము, ఆ 2 పద్య 103.

మ. సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు "వివిధ♦చ్ఛందస్క్రియామంతురం
తిమయామోభగవాన్వృషః కుసుమధ♦న్వీ దేవతామానినీ
రమణాయాంవినియోగ" యంచు నిదియా♦రంభించెఁ గాఁబోలు నా
నమరెం ధ్వని మానినుల్ రతికిఁ దా♦మై నాథులం జేకొనన్. 1180

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 56.

గీ. కోడితపసిపక్కలు ♦ గొట్టుకొనుచు, గుయుక్రమమొప్పమీ ఱెక్క♦సవయనియెడు
కనముగట్టిన ధూమాన ♦ ఘనముఁ దోఁచు, నసమశరుఁడు పప్పటఁ గొట్టి ♦ యార్చెననఁగ.

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 24.

మ. కమలాప్తుండిట బ్రహ్మగ్రాము యఖిలముం ♦ గల్పింపఁగా నిమ్మహా
ర్ఘముబ్రాహ్మంబనఁ బొల్చు నేతదనుసం♦ధానంబు నించుప్తి తా
త్త్వములంచున్ జనకోటికిం దెలుపుచం♦దంబొప్ప ఘోషించెఁ ద
త్సుసమారాధనజాతనాంత్రపీఁమమిం ♦ [illegible] ముఖోసుముల్. 1182

చంద్రభానుచరిత్రము, [illegible] 4 పద్య 139.

గీ. చక్రరిపుఁడగు రాజశా♦సనమువలన, నెంచి మాదండు పాంథుల♦నేయఁ జాగఁ
గావ రావే యటంచుజ♦గంబువిందుఁ,గూర్చి మొఱచేసెననఁగఁగు♦క్కుటములఱచె.
రసికజనమనోభిరామము, ఆ 5 పద్య 104.

గీ. పరమహంసాంబుజనులపై ♦ వేఁట లాడి, గెల్పుఁ గొని యేఁగుచో విజయ♦కేతనుండు
హాళిఁ బుట్టించుచుంతా♦హాళియనంగఁ,గుక్కుటముగూసెఁగుక్కురో♦కోయటంచు.
సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 121.

చ. తనువు గుణత్రియాప్తఁ డగు ♦ తామసరాజససాత్త్వికాఖ్య నే
మనుజున కైన గోనధను ♦ ముఖ్యము నుత్తము(?) రీతి నొప్పు నీ
మనుకులసార్వభౌముసకు ♦ మత్స్వరసైఖరి నిట్టిలంచు వే
గునిసి త్రిభంగియుక్తముగఁ ♦ గూసెను సప్పుడు కుక్కుటౌఘముల్. 1185
ఉత్తరనారిశ్చంద్రోపాఖ్యానము, ఆ 1 పద్య 47.

క. ఱెక్కలువిదలిచియాఁకలు, ముక్కునఁజక్కంగదిద్ది ♦ ముందటికి మెడల్
నిక్కించిమిన్నుఁజూచుచుఁ, గొక్కురొకో యనుచుఁగూసె ♦ గొల్లనకోళ్లుల్.
సురాభాండేశ్వరము, ఆ 1 పద్య 115.

ఉ. నాయెడ వేఱు సేయకిఁక ♦ నాయెడ దగ్గఱ జేరి నన్ను ర
మ్మాయనునట్లు పిల్లులస♦యంగని చక్కటిలాగలాఁగపై
రోయుచుఁ గాచె నా మనవి♦రోధుల కిమ్మగు వేళ కొక్కురో
కోయనినట్లు పెల్లఱచె ♦ గూటను గుక్కుటకోటి వేకువన్. 1187
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 5.

గీ. చక్రపరిపాలనముసేయు♦సంభ్రమమునఁ, దరలిచను దెంచులోకబాం♦ధవుని బిరుదు
కాహళలనంగఁ జారుల♦కళలుగ్రుంగ,గూట వేఁకువ నెందుఁ గు♦క్కుటము లఱచెం
వేంకటేశ్వరవిలాసము, ఆ2 పద్య 116.

క. ఱెక్కలు విదలించుచుఁ దన, ముక్కున చరణములు దీటి♦పొలుపుగగనముల్
మక్కువ ముందఱఁ జూచియు, గొక్కురొకోయనుచుఁగోడి♦గుంపులు గూసెన్.
గయోపాఖ్యానము, ఆ 1.

క. కాలజ్ఞానముదెలియని, దేలీలన్ నరులునేఁత♦లెఱుఁగ రనుచు వే
మేలుకొలిపినట్టులన, క్కాలంబునఁ గుక్కుటములు ♦ గడు వడిఁ గూసెన్. 1190
ఓఘవతీపరిణయము, ఆ3 పద్య 130.

మ. తమిసంకేతగృహంబులన్ విటుల మో♦దంబొప్పఁగాఁ గూడి కౌ
సుమబాణాసనకేళిఁ దేలు కులటా♦స్తోమంబుతో నయ్యెనా

గను మాపన్నతఁ జెందె నింక నిలువం ♦ గర్జంబుగాదంచుఁ గూ
రిమి ముమ్మాటికిఁ దెల్పె నాఁగ నలరా♦రెం దామ్రచూడస్వనుల్. 1191

సుమనోమనోభిరంజనము, (ఉల్లాస) 5 పద్య 74.

# ప్రభాతము.

—:0:—

తే. రాలియున్న పుష్పపరిక♦రము విదిర్చి, వెన్నుగా నున్న చేసిన ♦ సెజ్జ యనఁగ
వేఁగుటయుఁ జుక్కలన్నియు ♦ విరిసి విశద, భాతిఁ జెలువొందెఁ జూడ నం♦బరతలంబు.

భారతము, (విరా) ఆ 2 పద్య 239.

సీ. లెక్కింపఁ జాలకనై ♦ చుక్కలాకసమునఁ, బాఁతముత్తియముల ♦ పగిది నుండ
నొదవెను కెంజాయ ♦ నుదయాచలము మీఁద, మాణిక్యవేదితో ♦ మచ్చరింప
వాశాళనది కేఁగ ♦ నమృతభానుఁడు మేని, మించుఁ గోల్పడి ముది♦యంచఁ బోలఁ
జలిగాలి సోఁకునఁ ♦ దెలిసి కొండొకవడి, కవలెల్ల జక్కవ ♦ కవలఁ బేరయ
గీ. వెలుఁగువాఱుచు గృహదీప ♦ వితతి యొప్ప, విరులపైనపుల్ గోరంట♦విరుల దొరయ
నలినములుకుముదములనవ్వ(?)♦నలు దెసలను, జాల బెరయంగఁ బ్రత్యూష♦వేళ యయ్యె.

కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 26.

చ. అళికుల మల్లనల్ల నవ♦హల్లకమొల్లకకేసరోల్లస
ద్దళదరవిందమందిరవి♦తానము చేర నగాధదీర్ఘికా
జలజనవీనగంధములు ♦ చల్లుచుఁ జల్లనిగాడ్పు లిమ్మల
న్నొప్పలయ గృహప్రదీపముల ♦ పోఁడిమిఁ దూలఁ బ్రభాతమొప్పినన్. 1194

భాస్కరరామాయణము, (అయో) పద్య 25.

సీ. కుముదంబులర్ధమ♦ర్ధము మొగంబు మొగిడ్చె, నర్ధమర్ధంబు తో♦యజము విరిసె
స్యందనాంగంబింత ♦ నంతనుం జరియించె, నింతనింతఁ జకోర♦మూక విరిసె
విధుకాంతశిలవెడ ♦ వెడనీరిగిరితీసె, వెడసూర్యకాంతంబు ♦ వెచ్చనయ్యె
నిసియించుకించుక♦దెసల యంచుల నిల్చె, నించుకించుకదివం♦బీరికత్తెఁ [తియును
గీ. వొలఁగిపోయెడు కుముదబం♦ధుద్యుతియును, దోఁచుచున్న సరోజబం♦ధుద్యు
తళుకులై శ్వేతరక్తముల్ ♦ సంక్రమించె, సకలదిశలను బ్రత్యూష♦సమయమునను.

శకుంతలాపరిణయము, (పి. వీ.) ఆ 3.

చ. అనిశము నర్థిసంతతికి ♦ నాత్మధనంబిడి పేదవడ్డదా
తను విడువంగఁ జాలరు గ♦దా ధర నర్థులు కొంచె మీగినన్
వెనుకొని వత్తురంచు శశి♦వెన్నెలపుల్గుల నవ్వినట్లు ప్ర
న్నన నునుఁజాయవెన్నెల ద♦నర్చెఁ బ్రభాతమురాక చేరువన్. 1196

తారకబ్రహ్మరాజము, ఆ 2.

చ. దలమటిపోవువెన్నెల వి♦ధంబది రక్తపటీరచర్చగాఁ
జలకని తారకావళి వి♦సూత్రితహారమణివ్రజంబుగా
నలుతొలుసంజకెంపుపద ♦ యావకచిహ్నలు గాఁగ నంబర
స్థలియలరారివేకువని♦శాశశిభుక్తవిముక్తశయ్యనాన్. 1197

కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 184.

సీ. మునువిలూనంబైన ♦ దినపాదపము మొదల్, మగుడఁజిగిర్చిన ♦ చిగురనంగ
గతనిద్రశక్రేభ♦కర్ణతాళానిలే,రితకుంభసిందూర ♦ రేణు వనఁగ
ధ్వాంతజాలముమీఁద ♦ దండెత్తుభానుమం,తుని వెలిగొల్లెన ♦ తోఁపనంగ
మార్తాండపథరోధి♦మందేహబలపదో, ద్ధతపూర్వనగధాతు ♦ ధూళి యనఁగ
గీ. వనజరంగస్థలిని నాట్య♦మునకు వచ్చు, సిరికిఁబట్టిన కెంబట్టు ♦ తెర యనంగఁ
బ్రాగ్దిశాలిప్తఘుసృణాంగ♦రాగ మనఁగ, మెఱసె నరుణోదయప్రదీప్తి♦మింటికెలన.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 58.

గీ. ద్విజకులమ్ముల కూఁతలు ♦ దెసల నెగసె, నింకె నక్షత్రతేజముల్ ♦ పంకజాత
మటు విజృంభించెఁ గువలయం♦బట్టెటు వడె,నట్టులగుఁగాయరాజకం♦బైనయెడల.

సారంగధరచరిత్రము, (చే. వేం.) ఆ 2 పద్య 187.

చ. చిరతరపుణ్యశీలతను ♦ జీవిత నాథుఁడు వచ్చు భానుఁ డం
చరయఁగఁ బ్రాగ్దిశారమణి ♦ యంబుజరాగమణీసమంచితా
భరణము లెల్ల యానుటయు ♦ భాసిలు దజ్జనితప్రభాసము
త్కరమట నిండఁ బర్వె నన♦గా నరుణోదయమయ్యె నెంతయున్. 1200

నలచరిత్రము, (సి. ధ) ఆ 4 పద్య 7.

సీ. భూరిత్రియామికా♦భోగిని తొలికొండ, పుట్టపై నిడిన ని♦ర్మోక మనఁగఁ
బ్రత్యూషవిష్ణుని♦ర్మథితాంధకారాబ్ధి, రహిఁ దోఁచునవసుధా♦లహరియనఁగఁ
బద్మినీమిత్రుఁడు ♦ బ్రహ్మవేషముఁ దాల్చు, తఱినిఁ బట్టిన వెల్గు ♦ తెరయనంగఁ
గుముదంబులనుఁ గల ♦ క్రొవ్వను గుగ్గిల,పొడి యుంచుదీపంబు ♦ పుటిక యనఁగ

గీ. వెలయ వేగురుఁజుక్కను ♦ వెన్నముద్ద, చెంతఁజూపట్టుకాను వ♦క్షిగయనంగ
ముచ్చువేఁడుకకత్తెల ♦ మోము లెల్ల, వెలవెలనుఁబోవఁదూర్పునఁ ♦ దెలుపు దోఁచె.
తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 125.

సీ. వనవాటికలయందు ♦ వరవిహంగీవిహం,గసమాజకూజిత ♦ కలరవంబు
పారిపాదములయందుఁ ♦ బాతకోద్గీతభూ,పాళాదిగీతికా ♦ గానశరవము
గోస్థానములయందు ♦ గోపకాహ్వానోత్సు,కారంభసురభికాం ♦ భారవంబు
నళినాకరములందు ♦ నవనవోత్ఫుల్లార,విందబృందచలన్మి♦లిందరవము
గీ. స్నానఘట్టంబులందు మ♦జ్జనవిధాన, నిరతవిశ్వంభరామర♦నికరపఠిత
సుపరిసిద్ధాఘమర్షణ ♦ సూక్తరవము శ్రావ్యమైయొప్పెనయ్యుష♦స్సమయమునను.
కవిరాజమనోరంజనము, ఆ 5.

సీ. పౌండరీకసమృద్ధిఁ ♦ బాపఁగా శశికిరి,ములఁగెనా వెన్నెలల్ ♦ కలఁకఁ బాసెఁ
బతివిపక్షతనుక్కు ♦ సతులకన్నులపోల్కి, రాజుచెన్నఱఁజకో♦రములు బడలెఁ
బద్మిమల్ వెతఁజెందఁ ♦ బరిహసించినదోష,మున నాఁగఁ గుముదినుల్ ♦ మురువు
దొఱఁగె
బాంధసంహారపా♦పమున మూర్ఛిలె మాఱఁ,దన గతికుచముల ♦ నలసి తూఁగె
గీ. నిదుర లుడిగి పునారతి ♦ కెదల వ్రాలు, వాలుగంటులయాణిము♦త్యాలసరుల
శైత్యమున నుల్కపడి రథ♦సమున లేచు, తత్పతుల నవ్వె దీపికల్ ♦ ధవళరుచుల
ఉత్తరరామాయము, ఆ 4 పద్య 242.

సీ. తురగరింఖాముఖో♦ద్ధూతరేణువులీలఁ, గలయంగ నుదయరా♦గంబు పర్వ
మేదురమాగధ ♦ నాదంబుగతిఁ బద్మ,నిర్గతసారంగ ♦ నినదమలర
సకలవాద్యములఘో♦షములీల నెల్లెడ, విహగారవంబులు ♦ వెలయు చుండ
రమణీయకాహళో♦రావంబుగతిఁ దామ్ర,చూడధ్వనులు మిన్ను ♦ సోఁడుముట్ట
గీ. బలసి తనుఁ గ్రమ్మినవతెంచు♦బలమునీలఁ,గిరణనిచయంబునిగుడుచుఁ♦జొరిగొనంగ
నడరి దినరాజు రేరాజు ♦ వంటఁ దఱుము, కరణి నెంతయు నుదయాద్రి ♦ మె
ఱసెనపుడు.

కిరాతార్జునీయము, ఆ 3 పద్య 159.

సీ. సారసశ్రేణిక ♦ సత్కాంతిఁ జెన్నొందెఁ, గైరవంబుల కెల్లఁ ♦ గలఁగె దిగులు
చక్రవాకంబులు ♦ సంతోషమందెను, భయమబ్బెను జకోర ♦ పటలి కెల్ల
భానుతేజంబు న ♦ పరిహార మయ్యెను, పలుచనై చుక్కలు ♦ జలసె మింట
మ్రాసతోనుసొక్కు ♦ మేనెల్ల నిండెను, పక్షులరవములు ♦ ప్రబల మయ్యె

గీ. సప్తమండల మస్తాద్రి♦యందు నిలిచె, దానవారాతికీర్తనల్ ♦ తఱచుగాను
పఠనచేసిన ఋషుల ♦ పరిఘన మన, దిశలు తెలుపెక్కె నంతటఁ ♦ దెల్లవాఱె.

గయోపాఖ్యానము, ఆ 1.

మ. దివి నంతంతకు దారకల్ వడఁకెఁ బ్రా♦గ్దిగ్భాగరాగవ్రజం
బవియం జొచ్చెను దీపకాంతులు మఱా♦బారంగులన్ దేలె యా
పవనుం డల్లనఁ జల్లగాలి విసరెన్ ♦ బ్రాంతంబుగాఁ జంద్రుఁడున్
రవి తేజంబునకుం జంకి క్రుంకె ననఁగా ♦ రాత్రింతమై యొప్పినన్. 1205

బృందావనవిహారము, ఆ 3.

చ. పలపల నైన చీఁకటి ప్ర♦భాపరిహీనత దోఁచు తారలున్
గలఁగు పిటీపిటోత్కరముఁ ♦ గందినచంద్రుఁడు మూతివిచ్చు తీ
కులవిలసిల్లు తామరలు ♦ గూర్కను మేల్కను పక్షులున్ రుచుల్
వలిసిన చెందొవల్ గలిగి ♦ వేకువ దాఁ బొడసూపె నంతటన్. 1206

ఉద్భటారాధ్యచరిత్రము, ఆ 1 పద్య 46.

ఉ. పిట్టలు గూసెఁ జీకటుల ♦ పెంపెడఁ బాసె మెఱుంగురిక్కచాల్
బిట్టుగ మాసె జక్కవలు ♦ వేడుక నొందొరు డాసెఁ గల్వలే
ప్పట్టునఁ దేఁకు వాసె వెత♦వాసిన తమ్ములు పొంగి తేంట్లకున్
గొట్టిన విందు చేసె విలు ♦ నేర్పున మూసె మరుండు వేకువన్. 1207

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 50.

---

## సూర్యోదయము.



సీ. నీరజాకరములు ♦ నిస్తులమైఁ జేసిన, భవ్యాతపంబుల ♦ ఫల మనంగ
దివసముఖాభినం♦దితచక్రయుగస్తికం,బుల యనురాగంపుఁ♦బోవనంగ
హరిహరబ్రహ్మమ♦హానుభావంబులొ,క్కటి గాఁగఁ గరఁగిన ♦ గట్టి యనఁగ
నిగమవేదత్రయీ ♦ లలితకాయము పెను, పొందఁ బాదైన మూల ♦ కంద మనఁగ

గీ. నఖిలజగముల కన్నైఱ ♦ యాగుచు జనన,మాజకరపుటహృదయస♦రోజములకు
ముకుళనంబును జృంభణం♦బును నొనర్చి, భానుబింబంబు పూర్వాద్రి♦పైవెలింగె.

భారతము, (విరా.) ఆ 2 పద్య 241.

ఆ. అంత నుదయశైల ♦ మను నశోకద్రుమ, సమితియందుఁ గాంతి ♦ చారుభంగి
నెఱయ విరిసి తొలుత ♦ నెగసిన యుజ్జ్వల, స్తబకమనఁగఁ బద్మ♦సఖుఁడు వొడిచె.

భారతము, (ఉద్యో) ఆ 2 పద్య 113.

సీ. ప్రాచీనశైలాగ్రభాగస్థమగు నశో,కంబునఁ జిగురుజొం♦పంబనంగ
వర్షాధిపతియని♦వాసవుఁ గొలువఁ జే,రినయింద్రగోపక♦శ్రేణి యనఁగ
గురుతరపూర్వభూ♦ధరమునెత్తంబునఁ, బొలుచు గైరికగండ ♦ శిల యనంగఁ
గాశ్మీరపటమునఁ ♦ గావించి సురపతి, విడిచి యాడెడు తూలుఁ♦బడఁగ యనఁగ
గీ. నరుణకిరణుండు దోతెంచె ♦ నంబుజాత, నర్మసచివస్మితాపాద ♦ నంబునందుఁ
జతురుఁడై యోష్ణకరములఁ♦జక్రవాక, తాప ముడుపుటనాశ్చర్య♦ధాముఁడగుచు.

దశకుమారచరిత్రము, ఆ 5 పద్య 128.

మ. తనతేజంబున నన్యతేజముల వి♦ధ్వంసంబునొందించి రయిం
దును సన్మార్గము సుప్రకాశవిగళ♦ద్దోషంబుగాఁ జూపియా
త్యసురక్తోజ్జ్వలమండలుం డగుచుఁ బూ♦ర్వాద్రీంద్రభద్రాసనం
బున నొప్పెన్ గ్రహరాజు విశ్వముకరం♦బుల్ మోడ్చి సేవింపఁగన్. 1211

హరివంశము, (ఉత్తరభాగ.) ఆ 3.

ఉ. అనితరకాంతిఁ బద్మినిఁ బ్రి♦యాతిలకంబు మొఱంగిపోయి రే
యెనసినవేడ్క నొందుదన♦యిచ్చమెయిన్విహరించి మేనఁ గం
టినవరాగలీల జిగి♦దేరఁగ నోడి యొదింగి యొయ్యనొ
య్యనఁ బొడచూపెనా నుదయ♦మయ్యెఁ బతంగుఁడు ప్రాఙ్ముఖంబునన్. 1212

నృసింహపురాణము, ఆ 3 పద్య 116.

మ. కమలామోదమెలర్ప నేత్రసుఖదా♦కారంబు రంజిల్ల ను
త్తమవందారుశివంకరత్వ మెసఁగన్ ♦ ధర్మార్థకామక్రియా
దిమమూలంబన నొప్పు మిత్రుఁ డుదయో♦త్సేకప్రభావంబుచే
నమఁ దద్దేవున కిందువంశజుఁడు త♦చ్చంచద్గుణశ్రేణులన్. 1213

కావ్యాలంకారచూడామణి. (ఉల్లాస.) 3 పద్య 114.

సీ. ధరణీధరములందు ♦ ధాతుపాషాణంబు, పాదపంబులయందుఁ ♦ బల్లవంబు
పాథోనిధులయందుఁ ♦ బవడంపుఁదీగ, కాలాభ్రములయందుఁ ♦ గోలమెఱుపు

హరిదంతనాగంబు♦లందు సిందూరంబు, భూమిగొడలియందు ♦ హేమభూ
యాకాశవీథియం♦దవతంసరత్నంబు, వబ్జజాండగృహంబు ♦ నందు దివియ
గీ. యగుచు బాలాతపముజగం♦బాక్రమింప, నంధకారము దిక్కుల ♦ నస్తమింప
భానుబింబము వొడిచెఁ బ్ర♦భాతలక్ష్మి, కబరిభారంబుమీఁది చెంగలువకచ్చు.
కాశీఖండము, ఆ3 పద్య 238.

సీ. పౌలోమిదనబాలు ♦ బాన్పుపైఁ గనుపట్టఁ, బన్నినబవడంపు ♦ బంతి యనఁగ
నాయురర్థములవ్య♦యంబు లొత్తిలి చాటు, కాలజాంఘికుచేతి ♦ ఘంట యనఁగ
ఘనజంతుజీవిత ♦ కాలరాసులవిధి, కొలువ నెత్తినహేమ ♦ కుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత ♦ పరగఁ గైసేయుచో, ముందట నిడుకొన్న ♦ ముకురమనఁగఁ
గీ. గోకతాపోపశమదివ్య ♦ ఘుటిక యనఁగఁ, బద్మినీకాంతనోముల ♦ ఫల మనంగ
మూఁడుమూర్తులసారంపు♦ముద్దయనఁగ, మిహిరమండలముదయాద్రి♦మీఁదనొప్పె.
భాగవతము, స్కం 10 పూర్వ, పద్య 1302.

సీ. నలినదళంబుల ♦ కలకొని నెలయించి, కువలయదళముల ♦ క్రొవ్వణంచి
కుసుమబాణుని పెంపు ♦ కొంత విచారించి, విరహులఁ బట్టిన ♦ వెట్టఁ దెలిపి
యంధకారము నెల్ల ♦ హతమును గావించి, చుక్కలతేజంబు ♦ చక్కఁ బెట్టి
మదచకోరంబుల ♦ మదములు విడిపించి, నిఖిలజగంబుల ♦ నిదర మాన్చి
ఆ. వెండిదీప్తి దిశల ♦ వెదచల్లి మునులును, నమరపంథములును ♦ నర్ఘ్యజలము
లొసఁగఁ బూర్వశైల♦దెస నభిరమ్యమై, తామ్రకిరణుఁడైన ♦ తరణి వొడిచె.
వీరభద్రవిజయము, ఆ 3 పద్య 122.

సీ. మొగుడుతమ్ములఁజిక్కు ♦ మగతేఁటియులుఁగులు, సడలిపోఁజేయు వి♦శల్యకరణి
కాలవశంబునఁ ♦ గడచన్నవాసర, శ్రీఁగ్రమ్మఱించుసం♦జీవకరణి
రేయనువాలునఁ ♦ బాయలైనరథాంగ, తతుల హత్తించు సం♦ధానకరణి
తిమిరంబుచే సొంపు ♦ సమసినదిశలకు, వన్నియనొసఁగు సౌ♦వర్ణకరణి
గీ. మించు బీరెండ నగ్నిఁ బు♦ట్టించు నరణి, కలుషఘోరపయోరాశిఁ ♦ గడపు తరణి
తోఁచెఁ బ్రాచీమహీధరో♦త్తుంగసరణి, పాఁజదువుమానికంబుల ♦ బరణి తరణి.
పారిజాతాపహరణము, ఆ 4 పద్య 49.

సీ. తనుఁబాసిశశిదవ్వు ♦ చనిన నెవ్వగఁబోలెఁ, దొలిదిక్కుజవరాలు♦వెలుకఁబాఱెఁ
బ్రథమాద్రిసభయందుఁ ♦ బఱచిన కెంబట్టు, జముకాణమనఁగ రా♦గము జనించె
ధవుఁగూర్మి కొసరుచు♦న్నవివొలెముఖరాళి, వనరుహాస్యముఁబ♦ద్మినులు తెఱచె
భానూష్మభీతిము♦న్పడిన చుక్కలభంగి, దొరలె నేకువ గాలి ♦ దరులమంచు

గీ. కాలగుణయుక్తి మించిచ♦క్కటికి నెగయ, వాసవునిపట్టిపాడువుగా ♦ నైచియాడు
గచ్చుచమరినదారుచ♦క్రంపుబిల్ల, వోలె నొయ్యనఁ బ్రాచిలేఁ ♦ బ్రొద్దు వొడిచె.
మనుచరిత్రము, ఆ 5 పద్య 40.

ఉ. ఏఁగలలోన నొండెఱుఁగ ♦ నీవెవిభుండవు సందియంబునా
పైఁ గలదేని చూడుమని ♦ ప్రాగ్దిశ గౌతమదార జారునిన్
దాఁ గడు నమ్మఁ జేయుటకుఁ ♦ ద్రాగఁగ నెత్తెడు నట్టి యొజ్జఁగాఁ
గాఁగిన మడ్డుచందమెస♦గం గనుపట్టె నినుండు నుష్ణతన్. 1219
ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 80.

సీ. మిళితభూగగనాంత♦ముల సందువిచ్చినఁ, గాన్పించుబ్రహ్మాండ ♦ కాంతి యనఁగ
దిశ లెన్నుచిదిపూర్వ ♦ దిశయని బ్రహ్మని,ల్పినయట్టి మొదలిటి ♦ లెక్క యనఁగ
నుదయాచలాధీశు ♦ నుత్తమాంగంబున, భాసిల్లు హొంబట్టు ♦ పాగ యనఁగ
గగనాఖ్యపనసవృ♦క్షపరికాండోపరి, భ్రాజితంబగు పక్వ ♦ ఫల మనంగఁ
గీ. దారకాభర్తృచంద్రికా♦క్షీరభోజ,నాంతమునఁ బూర్వసంధ్యయ♦న్కాంత వెలిచి
లీలఁ జేర్చిన పసిఁడి ప♦ళ్లెర మనంగఁ, దరణిబింబంబు గాన్పించె ♦ వరుసతోడ.
కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 34.

చ. పదలకపద్మరాగమణి ♦ వట్రువగ్రాలఁగఁబట్టి నేర్పుపెం
పొదవఁగఁ దూర్పుకొండపయి ♦ కొప్పుగఁ దెచ్చి జగద్గురుండు దాఁ
ద్రిదశవరేణ్యుకట్టెదురఁ ♦ దేఁకువ నిల్పిన దర్పణంబునా
నుదయమునొందె భానుఁడు స♦ముజ్జ్వలకోకనదప్రదీప్తులన్. 1221
మొల్లరామాయణము, అయో. పద్య 23.

ద్విపద. తలిరుబోఁడులమాన♦ఘనములఁదివియు, నలినాస్త్రుచోరుక♦న్నపుఁగత్తియనఁగ
నామీనసతిదాల్చు ♦ నట్టి యసంక, నామమోయనఁ దోఁచె ♦ నలినారియపుడు.
అష్టమహిషీకళ్యాణము, ఆ 2

ఆ. తప్పులేక రాజు ♦ తనుడించియపరఁజెం, దుటయుఁ దాను మిగుల ♦ దోషయగుటఁ
బ్రాచిలోక మెఱుఁగఁ♦బాలఁబుట్టెడువాని, పోల్కి నెఱ్ఱనగుచుఁ♦బ్రొద్దువొడిచె.
కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 196.

చ. వనరుహవైరి పద్మినిని ♦ వావి దలంపక పాదతాడనం
బున సహరింపఁ గాంక్షయూను ♦ బొందుచు రక్తములోనునుండియు

య్యనఁ దలపంచెఁ దన్గువల◆యంబుహసింపఁగ నంచుఁ గుక్కుట
ధ్వనియనుదూత పల్కు విని ◆ వచ్చెననన్ రవి దోఁచెఁ దూర్పునన్ 1224

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 74.

ఉ. శంకఁ దొలంగి చంద్రుఁడను ◆ జాజులపొట్లము వైవఁ బూర్వది
క్పంకజగంధి తత్పతికిఁ ◆ బైనివసంతమునల్లఁ దెచ్చెనాఁ
గుంకుమగంధసారరస ◆ గుంభితచర్మవిశేషభస్త్రినాఁ
బంకజబాంధవుం డలరెఁ ◆ బ్రాగ్గిరికూటశిఖాతటంబునన్. 1225

భానుమతీపరిణయము, ఆ 3 పద్య 87.

చ. క్రమమున మిత్రమండల మ◆ఖండితపండితధామభూమచేఁ
గొమరు వహించెఁ బూర్వగిరి◆కూటమహోన్నతపీఠవాసియై
యమరకులాధినాథసము◆దంచితపట్టనసౌధపాళిపై
నమరెడు కుందనంపుగడి◆యారపుగంట యనంగ నెంతయున్. 1226

చమత్కారమంజరి, ఆ 3 పద్య 40.

సీ. తిమిరకుంచివిదార◆ణమునకు నుదయాద్రి, దరినిర్గమించు కే◆సరి యనంగ
శీతాంశుకిరణమూ◆ర్ఛితపద్మలక్ష్మికి, సముచితజీవనౌ◆షధమనంగ
యామినీవిరహివి◆హంగదంపతులకు, సాంగత్య మొనరించు ◆ సఖుఁ డనంగ
భువనాంతరక్షేత్ర◆మున వంశబీజముల్, వెదవెట్టుకర్షక ◆ విభుఁ డనంగఁ
గీ. బరమ మునిపుణ్య పరిపాక ◆ ఫల మనంగఁ, బ్రాక్సతీపద్మరాగద◆ర్పణమనంగ
జంభరిపుసౌధకాంచన◆కుంభమనఁగ, సూర్యుఁడుదయించెనభినంది◆తార్యుఁడగుచు.

వరాహపురాణము, హరిభట్టు.

క. ఘనతిమిరోరగకబళిత, వనజాసననిర్మితాండ ◆ వర్ణితసంజీ
వన మిది యన నుదయించెను, దినకరుఁడు సురాధినాథ ◆ దిగ్భాగమునన్. 1228

మత్స్యపురాణము, ఆ 4 పద్య 80.

సీ. తరణివచ్చెనటంచు ◆ గురుతమోవారాశి, మగ్నులందఱును స◆మ్మదము పూన
హంససమాగమం◆బయ్యె నంచుఁ బ్రబోధ, కాము లెంతయుఁ గౌతు◆కము వహింప
మిత్రసంగతి నైన ◆ మేలు గల్గె నటంచు, నతిబాధ గనువార◆లాదరింప
నినుఁడు గల్గెనటంచు◆ఘన తస్కరాదిక, భీతిఁ జెందినవారు ◆ ప్రేమ పూన
గీ. గగనమణి యబ్బె ననుచు శ్రీ◆కాంతుఁ గన్న, మనుజులందఱు నానంద◆మనుభవింప
నిఖిలభువనప్రకాశకో◆న్నిద్రలీల, భానుఁ డుదయించె నా తామ్ర◆భానుఁ డగుచు.

సీమంతినీకళ్యాణము, ఆ 3.

ఉ. ఆవనజాప్తుఁ డద్రిపయి♦నంబుధి స్వప్రతిబింబముం దగన్
కేవలమైన యద్భుతము ♦ గీల్కొను చక్రియుగంబుగా మయూ
ఖావళినూత్నసంహతియుఁ♦గా భువిఁ బాంథులమేలుతూరుపన్
జావిలిఁదెల్పు ఢక్క యను♦చాడ్పున నొప్పె విచిత్రభంగినై. 1230

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 121.

మ. బిసినీకాంతవియోగసంజనితగ♦ర్భీభూతతాపజ్వరో
ల్లసదార్తిం గృశియించుచున్నయెడఁ గ♦ల్యప్రాజ్ఞవైద్యుండు నే
ర్పెసఁగన్ దత్ప్రబలోపతాపముడుపన్ ♦ హేలాగతిం దెచ్చు బల్
రససిందూరపుటుండయో యనఁగ మా♦ర్తాండుండు దోఁచెన్ దివిన్. 1231

రసికజనమనోభిరామము, ఆ 5 పద్య 114.

చ. సమయవినోదిమిన్నసెడి ♦ చక్కని రంగమునందు సర్వది
గ్రమణులు చూడ గారడము ♦ రక్తిని జూప విధుండనెండున
గ్గము నొక కర్ణమం దునిచి ♦ దాపలికర్ణమునందు హేమచ
క్రము వెడలంగఁ దీసెననఁ♦గా రవి దోఁచెఁ బ్రభాప్రభావుఁడై. 1232

బిల్హణీయము, ఆ 3 పద్య 187.

మ. తమముం బాయఁగఁ జేసి రాగగుణముం ♦ దప్పించి సన్మార్గవ
ర్తిమతంబొప్పఁ దపంబు పెంపుననువ♦ర్ణిష్ణుత్వముం గాంచి లో
కము లెల్లం గనుఁగొంచు సజ్జన సమ♦స్కారార్ఘ్యదానంబులం
బ్రమదంబొంది వెలింగె యోగికరణిం ♦ బ్రద్యోతనుం డయ్యెడన్. 1233

అనిరుద్ధచరిత్రము, ఆ 3 పద్య 89.

చ. తొలుతటిదిక్కుదీవులట ♦ తోడనె భూధవుసాజ్ఞ చేకొన
న్మలయకనిల్చుతద్ధవళి ♦ మంబను తెల్లనిశానిచేరువన్
వెలిఁగెడు పద్మరాగయుత ♦ విశ్రుతకాంచనకుంభమో యనన్
జలరుహబాంధవుం డుదయ ♦ శైలముపై గనుపట్టె నయ్యెడన్. 1234

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 1 పద్య 53.

ఉ. వాసెడవాసి గువ్వలర♦వంబులనెంతయు మూల్గిమూల్గి గో
త్రాసురమంత్రితాంబువులు ♦ త్రావి సమీపదిశన్ నిశాచర
గ్రాసముగా ననూరురుచి ♦ రక్తజలాన్నము లెత్తిచల్లఁ బ్రా
చీసతి గాంచెఁ బుత్త్రు నతి♦చిత్రచరిత్రుఁ బవిత్రమిత్రునిన్. 1235

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 2 పద్య 288.

ఉ. కాలము దా విభుత్వమును ♦ గన్నది గాన నభఃప్రదేశమా
లీలను దోఁప మైత్రికిని ♦ ప్రేమయొసంగిన పద్మరాగమో
యేలిక రాకఁగాంచ మది ♦ హెచ్చి వెలింబడు పద్మరాగమో
నారవియుం దదాభగఁ గ ♦ నంబడెఁ దూర్పున మింట నయ్యెడన్. 1236

పార్వతీపరిణయము, ఆ 5.

చ. కలువలసొంపుడాఁగె భుజ♦గంబులు పుట్టలఁ దూఱెఁ దారకా
వళి రుచిజాఱె జక్కవల ♦ వంతలు దీఱెఁ జకోరకవ్రజం
బులనుభమాఱెఁ దమ్ములకు ♦ మోదము లూరె నిశాకరద్యుతుల్
వెలవెలఁబాఱెఁ దూర్పుదెస ♦ తెల్లడిగాఁ దెలవాఱె నయ్యెడన్. 1237

భల్లాణచరిత్రము, పో॥ వీ॥ ఆ 1.

సీ. హరిదిగధికరగ్ర♦హణవేది గౌరోదయము నిశాభవ్యాప్తి♦శమ వళక్షు
ఖమ్ముర తోల్లాభ ♦ కాయమానముఖగ, వంక్తి సత్తోరణ ♦ పత్రితతినీల
కంఠధ్వనులు కీర♦కాహళరావముల్, తతపక్షినినదవా♦ద్యములుభృంగ
సంభావనాద్విజుల్ ♦ చక్రవివాహప్రతులుకౌశ్యపిపురో♦హితుండు గాఁగఁ
గీ. గల్యబాలవరుని దివా♦కన్యఁ గూర్చి, హరతులొసంగఁజన్నులా♦స్యాకరదశ
శతమణీదీపవర్తికాం♦చనసుపాత్ర, యన సహస్రకరుం డొప్పె ♦ నంబరమున.

గణోదయము, ఆ 2 పద్య 45.

చ. అలయక బాలసూర్యుఁ డుద♦యాద్రిశిఖాంగణమందు నాడుచున్
జెలువుగఁ జారుపద్మినుల♦చే ససరోరుహవక్త్రహాసమున్
గలుఁగగ వీక్షితుండగుచుఁ ♦ గమ్రఖగధ్వనిఁ జేరఁ బిల్చిన
ట్లలరు నభోంకమందునిహి♦తాగ్రకరుండయి యొప్పె లీలతోన్. 1239

శిశుపాలవధ, ఆ 3 పద్య 36.

సీ. ఆకాశవాణినో♦య్యనఁదాల్చు తమ్మికేంపుల గొప్పనింబోలి ♦ పూస యనఁగ
వేలుపుదొరకొమ్మ ♦ మేలి ముత్తెపు పేర్లనొగి కొల్కిబెట్టిన ♦ పగడ మనఁగ
విమలరంభాలలా♦టమున చుక్కతెఱంగు, సమకూర్చినట్టి కుం♦కుమ మనంగ
సముచితసూదనునిక్రొ♦న్ననతోఁటలోఁబూను, గొరలు దాలిమ్మపూ♦గుత్తియనఁగఁ
గీ. బూర్వదిగ్భామినీమణి ♦ పువ్వుఁబోండ్లఁ, గూడి యాడెడు తరిమూల♦నూడి పడిన
రాజ తారుణవికచ స♦రోజ మనఁగఁ, బ్రాక్షితిధరిఁదోఁచెనంభోజ♦బాంధవుండు.

నీలకుంతలావిలాసము.

ద్విపద. తనయుని పెండ్లికి ♦ ధరణీధరారి, ఘనతఁ గట్టిన మేలు♦కట్టో యనంగ
నిందీవరాక్షితో ♦ నెలమిజయంతుఁ, డుంది వసంతంబు ♦ లాడెనో యనఁగ
నిల ధరేంద్రములతో ♦ నింద్రుండు పోరి, జలజల రక్తంబు ♦ సల్లెనో యనఁగ
వరుణోదయంబయ్యె ♦ నంతలోపలను, వరవైభవంబున ♦ వాసవుఁడిడిన
కొలువులో జగజంపు♦గొడుగోయనంగఁ, జెలువొప్పుపూర్వాద్రి♦శిఖరంబుమీఁదఁ
జలమున హరివేయు ♦ చక్రమో యనఁగ, జలరాశిపుట్టంబు ♦ సతిధరియించు
పొలుపొందు పాపట ♦ బొట్టో యనంగ, బలభేది మెడనున్న ♦ పతకమోయనఁగ
నటనతో నింద్రుని ♦ నాతిపై నున్న, పటువైన చెంగల్వ ♦ బంతియోయనఁగ
భానుఁడప్పుడు తూర్పు♦పర్వతంబునకు, మానుగాఁజనుదెంచె♦మహియెల్లఁబొగడ.

పలచరిత్రము, చ. రా. ప్రథ. భాగ.

ఆ. వెచ్చకాంతిమదుల ♦ వేడుక డిందంగ, పాలు లలరి పగటి ♦ పనుల కడర
పడిగఁ గాఁపువారు♦పనిపాటలకుఁ బోవ, తూర్పుకొండమీఁదఁ♦దోఁచెఁ బ్రొద్దు.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 51.

# మధ్యాహ్నము.



సీ. పద్మినీపద్మాత ♦ పత్త్రంబు శిఖలవ, తాగ్రమ్మై రాయంచ ♦ యాశ్రయించెఁ
బాలుప్రసత్తైన ♦ జాలంబుతో ఘోణి, పంచలగొంపిగ ♦ లంచియాడె
మారోద్గమద్దావ ♦ ధూమమంబుబుద్ధి, నెమ్మి లోపొదనుండి ♦ నిక్కి చూచె
జఠరస్థజలము సో♦సానాళమునఁ బీల్చి, సామజంబిరుపక్క ♦ జల్లుకొనియె
గీ. సరసిపైనీరు పలసల ♦ దెరలె విపిన, సకలవిహఁగులునిర్మృగో♦చ్ఛయము లయ్యె
మిట్టమధ్యాహ్నమిదినుధా♦మధురవాణి, యన్హామి నొప్పెఁబథశ్రమ♦మపనయింప.

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 138.

# సంధ్యారాగము.



చ. సురుచిరతారకాకుసుమ శోభి నభోంగణభూమిఁ గాలమ
స్థరువపుసూత్రధారి జత నంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపఁగ నిశాసతికెత్తిన క్రొత్తతోఁపుఁ బెం
దెరయన నొప్పు సాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్. 1244

నృసింహపురాణము, ఆ 3 పద్య 78.

గీ. వామనానేకపముచక్రవాళకుధర, ధాతుతటముగోరాడుచోఁ దరులుఁ బెగి
కూలుటయు మింటికెగసిన ధూళి వోలెఁ, బర్వె నెఱసంజవన్నెమరఁబట్టుకొనుచు.

శివరాత్రిమనేనము.

చ. తరువులయందుఁ బల్లవపదస్థితి నద్రులయందు ధాతుబం
ధురగతి నంగనాజనపృథుస్తనమండలిఁ గుంకుమంబునై
పరఁగుచు సాంధ్యశోణిమవిభాసురమై జలనాదదిక్తట
ద్విరదము కుంభసంభవన వీనగళద్రుధిరంబునాఁ దగెన్. 1246

భాస్కరరామాయణము, యుద్ధ, పద్య 2633.

చ. ప్రమదమదాదిరేకమునఁ బాసివిలాసవతీకదంబకం
బుమిసిన తమ్ములంపుఁగళయోయన నింగిలికంబుఛాయచేఁ
గమిసిన దాసనంపుఁబువుకాంతికిడాసిన కూర్మిచుట్టమా
కొమరున సంజ యంబరముకొంగుననూన్చెఁ గుసుంభరాగమున్. 1247

శ్రీ మేశ్వరపురాణము, ఆ 2 పద్య 29.

క. సుందరసాయంసంధ్యా, వందనవిహారిగ్రహతోయ పజ్రిహతోద్య
న్మందేహాసురరక్త, స్యందముక్రియఁ గెంపుసొంపెసఁగెనపరదిశన్. 1248

భాగవతము, స్కం 10 పూర్వ, పద్య 1283.

చ. తనువున నంధకారపుమదం బలమి న్ననుభద్రదంతికి
న్నొనసినఁ జిందరేఁగి తపమండనుమావుతుఁ గ్రుంకుమెట్టులో
యు నురులనైచినన్నొగిలి యచ్చట నెత్తురు గ్రిక్కెనో యనన్
గనుఁగవగోరగింపఁ బొడకట్టెసముజ్జ్వలసాంధ్యరాగముల్. 1249

పారిజాతాపహరణము, ఆ2 పద్య 32.

సీ. రవిబింబపతనదీ♦ర్ణపయోధిగర్భని,ర్గతశేషఫణిఫణా♦రత్నరుచియొ
దివసాపసానసం♦దీప్తాస్తగిరిశిఖా, జ్యోతిర్లతా ప్రతా♦నాతపంబొ
తపనధూర్జంవని♦ర్దళితదిక్కటదృశ్య, కమలజాండకటాహ ♦ కనకఘృణియొ
చండీశతాండవో♦త్సవసంభృతక్షుపా, హస్తాగ్రదీపక ♦ భస్త్రిచయమొ
గీ. దాగ్రిస్విదాహచ్ఛిదాతిని♦దాగ్రిణమదప, దంజవాలానమూలశ♦య్యావిధాన
వారుణాధోరణాకల్పి♦తారుణోణ, మృత్తికారాశియో యన♦ మెఱసె సంధ్య.
మనుచరిత్రము, ఆ3 పద్య 17.

క. తొట్టుకొని సంజకెంప, ప్పట్టున రవిఁబాసి సితగ♦భస్తి నెదురుకో
నట్టై సిరివచ్చుటకు నై, పట్టిన కెంబట్టుదిడ్డి♦పాలకిఁబోలెన్. 1251
రామాభ్యుదయము, ఆ2 పద్య 92.

సీ. వనజాలయమునూసి ♦ యినుజూడఁ దిలకించు, లలితాబ్జినీరాగ ♦ లక్ష్మియనఁగ
ఘనపదాయసపట్టి♦కఁదమోంజనముపట్ట,నపరాశయిడిన దీ♦పార్చి యనఁగఁ
గప్పుచూపుచుఁ బాంథ ♦ గణము నేఁచుప్రదోష,కరిమేనిధాతుశృం♦గార మనఁగ
ద్విజనూక్తిఁ బతిరాక ♦ దెలిసి మోమెత్తిరా,త్రి వహించుకాశ్మీర ♦ తిలక మనఁగ
గీ.సమయమృగహృతరవిరఘూత్తమునిసతిఁబ్రి,భామయిఁదమోనిశాటుండు♦పరవకుండ
ననలదామంబులోడాఁచి♦ యమరులిడిన,వంచనాగౌరగాత్రినా ♦ వఱలె సంధ్య.
వసుచరిత్రము, ఆ 4 పద్య 7.

మ. ఇనుఁ డత్యుత్కటతేజుఁడై మెలఁగి భూ♦యిష్ఠానురాగంబునన్
దనుఁ జేరం జనుదేరఁగా నపరది♦క్స్త్రీశిరోరత్నమై
త్రినిశీరాజనమో యనం దదనుష♦క్తింబుట్టురాగంబుత
త్కనదాశాసతి మేనఁ బర్విరెసఁగె ♦ గన్పట్టెసాంధ్యద్యుతుల్. 1253
ఘటికాచలమాహాత్మ్యము, ఆ 2 పద్య 106.

సీ. పాటలంబులవన్నె ♦ తేటమంకెనలబిం,కము............విద్రు♦మములసొబగు
పద్మరాగంబుల ♦ పసపిరియుంగుచ్ఛాయ, కుసుమమొప్పిదముకుం♦కుమముచెలువు
లత్తుక చెన్ను పల్లవసముల్లాసంబు, కాశ్మీరజాంగరా♦గంబుపూఁత
చక్కఁదనంబుహం♦సములచంచుస్ఫూర్తి. పటుపలాశద్రుమ ♦ ప్రసవకాంతి
గీ. బింబఫలవిభవము చందిరంబుఠీవి, యాదిగాఁగలరక్త(పదా)ర్థసమితి
నలుపకేలికినొకచోట♦నలమికూ(ర్చె), ననఁగఁజెలువొందె నెఱసంజ♦యపరదిశను.
ఉద్భటారాధ్యచరిత్రము, ఆ 1 పద్య 35.

సీ. తపనుఁడప్పన సేయఁ ♦ దద్వసుగ్రిహణార్ధ,మటుదోచుఁచటులార్ఘ్య♦టార్చియనఁగ
నచ్యుఁడు విష్ణుఁడై ♦ యరుగుతోడనఁ జను, పతగకేతురుగరు♦త్ప్రితతి యనఁగ

లోకబంధునకు రత్నాకరుం డెదురేఁగి, బడిసిప్పై చినమణిపర్వరుచి యనఁగ
నినుని రాకకు దిగంగనపొంగ వెలిఁజిమ్ము, తదనురాగరసాంబుధార యనఁగఁ
గీ॥ దరుణతారాతికన్యాను సరణకరణ, సమయకాముకసముచిత క్రమవిరచిత
జవమనఃప్రీతసపదిసాక్షాత్కృతారు, ణావయవదివ్యశక్తినా నలరె సంధ్య.
లక్ష్మీవిలాసము, ఆ4 పద్య 38.

గీ. అబ్జబాంధవవిగహాంధరార్తమైన, జలధివల్లభదిశయను చంద్రముఖికి
నపుడొనర్చినకిసలశయ్యయును బోలె, సంజపుంజారుణశ్రీల సంజ దనరె. 1256
పరమయోగివిలాసము, ఆ 3 పద్య 227.

చ. తిమిరపుదాడికాఁడు చను దేరఁదొడంగెను నాకెదుర్పఁగా
సమయము గాదు సూక్ష్మతర చర్యనుపర్తిలి వేగవచ్చెదన్
రమణఁదమోనుదాశ్రియము నన్నిలుమంచును నైజతేజమున్
గమలహితుండునిల్పెనసఁగాఁ బొడకట్టెను సాంధ్యరాగముల్. 1257
విప్రనారాయణచరిత్రము, ఆ 3 పద్య 23.

ఉ. సమయభిషగ్వరుండపరశైలపుఁగుప్పె దినేందు పేఁడన్ రసేం
ద్రము నిడి పైఁదదూర్ధ్వకరతామ్రశలాకఘటించి వహ్నియో
గము నొనరింప సిందురముగాఁ బయికిం బ్రసరించెనాఁగరం
బమరెను సాంధ్యరాగము నభోంతరదంతురితాంశుభాగమై. 1258
ముకుందవిలాసము, ఆ 3 పద్య 41.

గీ. రాజు కువలయ మలరింప రాఁదలంచు, టెంచి సమయాధికారి గట్టించినట్టి
భవ్యకహ్లారతోరణ పంక్తియనఁగ, సాంధ్యరాగమువిలసిల్లె సాంద్రముగను.
రాజశేఖరవిలాసము, ఆ 1 పద్య 127.

సీ. చరమాద్రిశిఖరసంచరదభ్రచరవధూ, శ్రేణిగట్టినతోఁపుఁ జీర లనఁగ
నంబరారణ్యభాగంబునఁ దఘుకొత్తు, గుజ్జులేమావిచిగుళ్లనంగ
నంబుధీశ్వరురాణి హర్మ్యాగ్రభిత్తిపైఁ బొలుపారుజేగురు పూఁతలనఁగ
దిక్సతీమణులుమత్తిలిచల్లులాడెడు, గడితంపుబగ్గుండి పొడు లనంగఁ
గీ. దిమిరమత్తేభరాజముద్వృత్తి బయలు, వెడలుచో మేనఁ గనుపట్టు వితతగైరి
కప్రభాచ్ఛటలనఁగనఖండలీల, సంజకెంజాయలలరె దిశాముఖముల. 1260
రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 94.

గీ. సవిధలబ్ధదినేశ్వరో♦స్రప్రతప్త, వితతనిష్యందపశ్చిమో♦ర్వీధరస్థి
తప్రభాకరకాంతతా♦మ్రప్రదీప్తి, మెండుకొనెనో యనన్ ధాత్రి♦మెఱసెసంధ్య.

రామచంద్రోపాఖ్యానము, వా॥ వేం॥ ఆ 4 పద్య 107.

చ. దినకరుచెంగట న్వరుణ♦ దిగ్గణికామణిరూపవైఖరుల్
గొనబుగఁ జూపి యంత రవి♦కూరిమి మెచ్చికుసుంభచేలమి
చ్చిన నది మేల్మనుం గిడుచుఁ♦ జెన్నువహింప బహిర్గతంబులై
యొనరు తదీయశోణరుచు♦లోయనఁ గన్పడె సాంధ్యరాగముల్. 1262

కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 145.

మ. అపరాద్రీభవిభుండురాకతటిచా♦యానక్రసంగ్రస్తదే
హపరార్థుండగుచున్ విరావయుతుఁడో♦టాలించి మేలెంచి కా
లపయోజాత్ముఁడు లీలఁ దద్గ్రహము దూ♦లన్ సూర్యచక్రంబునై
చి పడంగొట్టఁగ జిమ్ము రక్తమన మిం♦చెన్ సాంధ్యరాగం బొగిన్. 1263

కృష్ణాభ్యుదయము, ఆ 1 పద్య 75.

ఆ. ఇనసమాగమమున♦ కెంతయు రాగిల్లి; వరుణదిగ్వధూటి♦ వన్నెమీఱఁ
గటితటంబునందుఁ♦ గట్టిన కౌసుంభ; వస్త్రమో యనంగ♦ వఱలె సంధ్య. 1264

గోపీనాథరామాయణము, యుద్ధ.

ఉ. వారిజసంభవాఖ్యవన♦పాలకనిర్మితమౌ వియత్తల
స్ఫారతరాటవీస్థలిని♦ బశ్చిమదిక్కున పేర నొప్పి పెం
పారెడు చూతజాతము ది♦నాంతవసంతపువేళఁ దోఁప సం
ధ్యారుచిజాలకైతవము♦నం జిగురించి తనర్చె మెండుగన్. 1265

నయనోల్లాసము, ఆ 3 పద. 100.

చ. భువిఁగలవీరులండఱు న♦భోమణియుంజనఁ జూచితాళిమిం
బవిసితొఱంగి వార్ధిఁజొర♦బోలువిధంబునఁ గ్రుంకుభానుపై
గవిసినరక్తధారలనఁ♦గా జరఠాతపముల్ చెలంగుచున్
భువనములెల్లనిండెఁ గుల♦భూధరగైరికమండలద్యుతిన్. 1266

విశ్వకర్మపురాణము, ఆ 5.

గీ. లేవనపుడునిశానర్త♦కీవధూటి, నాట్యమొనరింపఁదలఁచిముం♦దరనుతోఁపు
డెరయమర్పించెనోనాఁబ్ర♦దీప్తమగుచు, సాంధ్యరాగంబుప్రాగ్దిశా♦సరణిఁబర్వె.

ద్రౌపదీపరిణయము.

సీ. పాటలంబులవన్నె ♦ తేటమంకెనలబింకము.........విద్రు♦మములసొబగు
పద్మరాగంబుల ♦ పసపిఁడియంగుచ్ఛాయ, కుసుమ మొప్పిదముకుం♦కుమము చెలువు
లత్తుక చెన్ను ప♦ల్లవసముల్లాసంబు, కాశ్మీరజాంగరా♦గంబుపూఁత
చక్కఁదనంబుహం♦సవులచంచుస్ఫూర్తి, పటుపలాశద్రుమ ♦ ప్రసవకాంతి
గీ. బింబఫలవిభవంబుచం♦దిరముశీవి, యాదిగాఁగల రక్తప♦దార్థసమితి
నలువకేలికినొకచోట ♦ నలమికూర్చె,ననఁగఁజెలువొందె నెఱసంజ ♦ యపరదిశను.
ఉద్భటారాధ్యచరిత్రము, ఆ 1 పద్య 35.

క. హరిదశ్వకరగ్రహణ, స్ఫురితయగుపరాశఁగని వి♦బుధసంతతియం
బరమునవసంతములనిం, చిరినాసంధ్యప్రభావి♦శేషమువొలిచెన్. 1269
సర్వకామదాపరిణయము, ఆ 3.

---

# సూర్యాస్తమయము.

ద్విపద. అంచితకఠినపుం♦ఖాస్త్రాంశుతతుల, ముంచి రావణునిత♦మోగుణం బణఁప
భీమప్రతాపసం♦స్ఫీతుఁడై యున్న, రాముఁడేచాలుదు♦ర్వారుఁడన్మార్తి
ఘనతరంబగుతన ♦ కరములు ముడిచి, వనజాప్తుఁడపరది♦గ్వనధిలోమునిఁగె. 1270
రంగనాథరామాయణము, రంగ యుద్ధ.

గీ. కమలినీకాంతయొంతయుఁ ♦ గందివంద, వారుణీసక్తుఁడై పసు♦వ్యయము చేసి
యరిగినట్లు పరాగిగ్నై ♦ యంబరంబు, దొఱఁగి పశ్చిమజలధిలో ♦ నుఱికెఁ దరణి.
విక్రమసేనము.

గీ. విపులతరమైనకమలినీ ♦ విరహ మంది, పల్లవారుణభానుర ♦ పటలమమర
నంగజాగ్నికి నోర్వని ♦ యట్లపోలె, వనజినీపతివారాశి ♦ మునిఁగె నంత. 1272
భాస్కరరామాయణము, యుద్ధ, పద్య 2634.

సీ. కడపంగరాకున్న ♦ కాలఖడ్గము చేతఁ, బగలింటితలనేలఁ ♦ బడినయట్లు
సాయంతనంబను ♦ జాలరిజలధిలోఁ, జరింప వలడిగఁ ♦ బాతినట్లు

గాఢమైనయాకాశ ♦ భూరుహంబున సంధ్యఁ,గొనయుంగ గొలదెవ్రివ్వ ♦ కూలినట్లు
చరమదిగ్వేతాళ♦కరమునవరుణుండు, గడివెట్టఁ బొలపొట్ట ♦ నడఁగినట్లు
గీ. క్రుంకుగుబ్బలిపారకి ♦ కొప్పరించి, పట్టఁజాలక వైచిన ♦ బ్రద్దపరికిఁ
బాటియగుచు ముగురపొత్తు ♦ పల్లెరంబు, భానుమండలమంతఁ జూ♦పట్టదయ్యె.
ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 271.

గీ. గగన యానవేగంబునఁ ♦ గలమరించి, కడుపునిండంగఁ గ్రోలిన ♦ కమలమధువు
గ్రక్కనోనాఁగ గగనమా♦ర్గంబునందు, భానుబింబంబురక్తాత♦పంబుఁ గాసె.
శివరాత్రిమాహాత్మ్యము, ఆ 3 పద్య 92.

మ. గగనారణ్యచరాంధకారగజమున్ ♦ గాలాహ్వయవ్యాఘ్రుఁడ
చ్చగఁ బట్టం గమకించి మచ్చిడుటకై ♦ చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించినకందుకంబనఁగ సూ♦ర్యుండంత వీక్షింపగాఁ
దగె మందప్రభతోడఁ బశ్చిమమహా ♦ ధాత్రీధరేంద్రంబునన్. 1275
భాగవతము, స్కం 10 పూర్వ. పద్య 1286.

చ. ఉదయముఖం దలిర్చుదిశ ♦ నొల్లక తన్ననుహీనుఁ జేయుచుం
గదిసిప్రీతిఁ జెందె దిన♦నాథుఁడు భూరమణుండు సంతతా
భ్యుదయముఁ గోరుచున్నపతి ♦ నొల్లక తన్ననుహీనుఁ జేయఁగా
మదిఁ దలపోయు వారసతి ♦ మక్కువఁ జెందిన లీల నత్తఱిన్. 1276
విక్రమార్కచరిత్రము, ఆ 6 పద్య 108.

ద్విపద. భవచండతాండవ ♦ భ్రమణవేగమున, దివినుండి పడినయఁ♦దియయనఁబోలి
కిరణజాలంబుల ♦ కెంపుసొంపెసఁగ, నరుణబింబము పశ్చి♦మాంబుధిఁ గ్రుంకె.
హరిశ్చంద్రోపాఖ్యానము, (గౌరన) భాగ 1.

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బా♦ఱెంబక్షులుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యె మృగతృ♦ష్ణావార్ధు లింకెం జపా
శోణంబయ్యెఁ బతంగబింబము దిశా♦స్తోమంబుశోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు ని♦ద్రాణంబు లయ్యెం గడున్. 1278
మనుచరిత్రము, ఆ 3 పద్య 12.

మ. వికసిల్లంబ్రజ చక్రపాలనము గా♦ వించెం గరవ్యాపృతిం
కనుబంతంబుల నాక్రమించెఁ బొస్సఁగం ♦ గానేర్చె వస్త్రాళిఁ గాం

తికిఁ బాపెం బెఱరాజకోటిఁదుది శాం ♦ తిం బొందె దైవంబునేఁ
తకుఁ దాపం బిఁక నేలనంగ నిమఁడ ♦ స్తప్రాప్తుఁడయ్యెం గడున్ 1273
,, ,, ఆ 5 పద్య 32.

గీ. కలువచెలిదొంగరాయిడి ♦ గలుగు నింక, ననుచు మునుమున్న పద్మిని ♦ దనవికాస
ధనమునిచినీటనిడురాగి♦తార్చ్వవోలెఁ, బడియెఁబడమటికడలిలోఁ♦బద్మహితుఁడు.
రామాభ్యుదయము. ఆ 2 పద్య 91

ఉ. అంబుధిలోని కంతటను ♦ హంసుఁడు డిగ్గె దినాంతమజ్జనా
ర్థంబునుబోలె నట్టియెడఁ ♦ దత్తటినాఱఁగఁ గట్టినట్టి ర
క్తాంబరమో యనంగఁ దన♦రారెఁ గడుం గడసంజకెంపి యం
తం బొడసూపెఁ దారకలు ♦ తత్పదనోద్గతబిందులోయనన్. 1281
ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 117.

గీ. సరగ మిన్ననుకమ్మరి ♦ సంజకొలిమి, జెట్టుగాఁ గాచ్చి బంగారు ♦ చట్టువాలు
పదునువెట్టఁగఁ గొనిపోయి♦పట్టలేక, విడిచె ననఁ బ్రొద్దుపడమటి♦కడలిమునిఁగె.
యయాతిచరిత్రము, ఆ 2.

క. కమలినిఁ బొమ్మని కరముల, నిమురుటఁ దన్నదియువారు♦ణీపరిచయదో
షమునకు రవిప్రాయశ్చి, త్తమొనర్చుకొనె నన నపర♦ ధరమునఁ బడియెన్. 1283
చిత్రభారతము, ఆ 6 పద్య 103.

గీ. అపరదిగ్వారసతి రవి ♦ యనెడు విటుని, రాగయుతుఁడైన నేకాంబ♦రంబుచిక్క
నిర్వనునిఁ జేసి కడురశ్మి ♦ పర్వ రాజు, వేగ రాఁదెల్సి తనయిల్లు♦వెడలఁద్రోచె.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 41.

చ. ఉదయధరాధరంబుపయి♦నుండి హుటాహుటి నేఁగుదెంచువో
నొదవినదప్పిఁ బశ్చిమమ♦హోదధితోయముఁ జూచి శీఘ్రతన్
గదియఁగనీడ్చె నేమొ తుర♦గంబులుతద్రథమంచు భూజనుల్
మదిఁ దలపోయ వ్రాలె రవి ♦ మండలమజ్జలధీశుదిక్కునన్. 1285
పరమయోగివిలాసము. ఆ 3 పద్య 225.

చ. తరుణవయస్కుఁడైనహిమ♦ధామునిమీఁద మనంబు నిల్పి యం
బరసతిదన్ను వృద్ధనుచు ♦ మానఁదలంచినఁ జాల సిగ్గునన్
ద్వరితగతిన్మునింగినవి♦ధంబునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకె భా
స్కరుఁడు కుముద్వతీతతి న♦గంగ వికాసకళామిషంబునన్. 1286
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక ఆ 1 పద్య 221.

గీ. ప్రామినుకుమానికమ్ములు ♦ భారమైనఁ, దరణిశరనిధిమునుఁగఁగా ♦ సరగఁ దిగిచి
వేయఁబోల్ పైపనుతలి నా♦రాయణుండు,కాకది కృపీటజాతాప్తిఁ♦గాంచనేమి.
సారంగధరచరిత్రము, చే॥ వేం॥ ఆ 3 పద్య 24.

క. దోషాకరముఖదర్శన, దోషమునకు భీతినొంది ♦ తొలఁగినమాడ్కిన్
బ్రోషితుఁడై యఖిలజగ, ద్భూషణుఁ డర్కుండు గ్రుంకెఁ ♦ దోయధిలోనన్.
మత్స్యపురాణము, ఆ 4 పద్య 69.

మ. పరసీజోద్భవరుక్మకారకుఁడు ఘ♦స్రశ్రీమణిం బ్రేమతో
గర మింపొంద నలంకరించుటకు వే♦గం గాచి తానీటిలోఁ
బరగన్ ముంచినయట్టి మేల్మియగుబ♦ల్బంగారపుంబూదెయ
న్కరణిన్ భానుఁడు పశ్చిమాంబునిధిఁజ♦క్కం గ్రుంకె నొక్కుమ్మడిన్. 1289
రాజశేఖరవిలాసము, ఆ 1 పద్య 126.

చ. సమయభటుండుపూర్వనగ♦సానుతటంబనుకొత్తళంబునన్
బ్రమదముమీఱనిల్చి యల ♦ పాపపుఁజీకటిసోఁకుమూఁకపై
నమరవడిన్నిగుడ్చిన వి♦యన్మయమైనపిరంగిగుండు నాన్
గమలహితుం డఖండగతిఁ ♦ గ్రక్కునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకినన్. 1290
విష్ణుమాయావిలాసము, ఆ 1 పద్య 190.

మ. స్ఫురితాంభోరుహజాతభావముదయం ♦ పున్ జోకలన్ దెల్పి యు
ర్వర కొక్కుమ్మడిఁ బిట్టు పట్టపగలు♦గ్రీస్ఫూర్తి నూచించి సా
గరశాయిత్వము వాసరాంతమున వే♦డ్కం జూపఁ జింతించియో
యరవిందాప్తుఁడు వేగఁ జేర్చెఁ దన మే♦నంభోధిమధ్యంబునన్. 1291
చంద్రాంగదచరిత్రము, ఆ 5 పద్య 45.

మ. అపరాహ్ణాంబనువర్ణకారుఁడు ప్రతీ♦చ్యంభోజపత్రాక్షి క
చ్చుపడన్ జందురుకావియంబుదపట♦స్తోమంబున న్నించఁగా
నపరాబ్ధిస్థలి నుంచు కుంకుమరస ♦ వ్యాకీర్ణకుంభంబునాఁ
దపనుండ స్తవసుంధరాధరము చెం♦తన్నిల్చి గ్రుంకె న్వడిన్. 1292
పరిబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 58.

గీ. రిక్కరాయఁడు దమిమీఱ♦ రేవెలందిఁ, బెండ్లి యగునని కడయను♦పేరఁటాలు
మొనసి దైరేనినీటికై♦ముంచు పసిఁడి,కుండయనఁ బ్రొద్దుమున్నీటఁ♦గ్రుంకెనంత.
అచ్చతెలుఁగురామాయణము, అయో. పద్య 12.

చ. చరమనగాగ్రశృంగపటు ♦ సంకషణక్రియలన్ లసద్వనూ
త్కరములు చిందగా వెదక ♦ తత్ఫలభూములడిగ్గెనోయనన్
సరసిరుహాప్తమండలము ♦ జారెనువిష్ణుపదంబువీడి యె
వ్వరికిఁదరంబు? కాలకృతవంచన♦కున్ వెలిగా మెలంగగన్. 1294

కార్తికమాహాత్మ్యము, ఆ 4.

మ. స్వకవిద్యోతవసువ్రజంబడరస♦ర్వంబున్ బరక్షోణిభృ
న్నికటోద్యత్కటకంబుఁ జెందియఘ ఘనా♦నీకానురాగాదియై
సకలోర్వీజనసేవ్యుఁడయ్యె నినుఁ డెం♦తం భూరితేజుండు శ
త్రుకులాంతస్థితుఁడయ్యెఁ బూజ్యుఁడె కదా ♦ రూపింప నెవ్వారికిన్. 1295

భోజనుతాపరిణయము, ఆ 5 పద్య 4.

మ. హరిణీభీమతమంబుమాపి కుముదా♦ధారప్రభల్వాపి దు
స్తరభీచక్రము లేపి పద్మినికిఁ బాం♦చాలత్వముం జూపి భా
స్వరలీలన్ వసురా జనందగి సదా ♦ సన్మార్గవృత్తి న్మహా
విరతిం బూని యినుండు సేరెఁ దుదఁ బృ♦థ్వీభృద్వరావాసమున్. 1296

రుక్మిణీపరిణయము, స. భ. అ 2 పద్య 285.

చ. సరసిజబాంధవుం డపుడు ♦ చక్రధరత్వముఁ బూని వేగమే
శరనిధిచెంతఁ జేరఁజని ♦ చాఁగిలిమ్రొక్కి గృహస్థుగా ననున్
గరుణనుబ్రోవుమం చని డో♦కారముచొచ్చెనొ నాఁగ మెల్లఁ ద
త్పరిసరభూముల న్వెలిఁగి ♦ తజ్జలరమ్మునఁ గ్రుంకె గొబ్బునన్. 1297

పార్వతీపరిణయము; ఆ 5.

చ. అవికిరణాభిముఖ్య మపు♦డందక నూఱును వేయునైకరం
బు వెలయకుండునట్టి దశ♦ముల్ గలయాశరజాతముల్ చెడం
గువలయ మంతలోఁ దెలివిఁ♦గూడెను రాజమహోదయార్థివ
స్తువునకు మేలుగాదె మఱి ♦ సొంపఱిపంకజనుల్ కృశించుటల్. 1298

లంకావిజయము, ఆ 2 పద్య 126.

గీ. అరసిచూడ రజోరుణా♦వరణదీని, నంటగాఁగూడదనక లో♦లాత్ముఁ డగుచు
పగలు పద్మినిగూడిన ♦ పాతకంబు; దివసమణికప్రకాశతఁ ♦ దేఁకయున్నె. 1299

రంగారాయచరిత్రము; ఆ 3.

చ. సమయమహేంద్రజాలకుఁడు ♦ సారసమిత్రుఁడ నేటిపద్మరా
గము వెస మాయఁజేసి కుతు♦కంబున హాయని నీలపంక్తులన్
భ్రమపడఁజూచి ఘూయనుచుఁ ♦ బల్కనుపాంసులఁజేసి చూపెఁ జి
త్రమనఁగ బొద్దుగ్రుంకెఁ దిమి♦రం బెసఁగెన్ దివినొప్పెఁ దారకల్. 1300

హంసవింశతి, ఆ 2 పద్య 173.

ఉ. వారిజమిత్రసింహము ది♦వస్పతిదిక్కరి నిర్గమించి దై
త్యారిపదాటవీస్థలిది♦నాఖ్యమదేభము వెంటనంటి తే
త్స్వగమదం వెసంజరమ ♦ శైలతటంబునఁ జెంది సక్తర
క్తారుణదేహమై యరిగె ♦ నగ్గిరిమాటునకున్ రయంబునన్. 1301

చెన్నబసవపురాణము, ఆ 2 పద్య 256.

క. వనజరుచిఁ గొనఁగ సమయం,బను చోరుఁడు రోదసీగృ♦హముఁ జొచ్చి భయం
బునఁ బఱప నడచుదీపం,బును బోల్పంబడుచుఁ బ్రొద్దు♦పోటునకుఁ గ్రుంకెన్.

శుకసప్తతి, ఆ 2.

చ. కరమనురక్తుఁడై పరుష ♦ కాంతి వహింపక భర్తచల్లనో
కరముల బుజ్జగింప వినఁ♦గానక పద్మిని మోమువాంచెనో
కరమనురక్తుఁడై పరుష ♦ కాంతి వహింపకభర్తచల్లనో
కరముల బుజ్జగింప వినఁ ♦ గానక పద్మిని మోమువాంచునే. 1303

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 2 పద్య 188.

చ. అదనను లోహకారుఁ డస♦మాంబకధారికి పుష్కరాగ్నిసం
పదలిడుచక్రిఘోరశిఖి♦పాకమొనర్చి మయూఖదంశికా
స్పదకలనంబునంగమిచి ♦ పట్టిపయోధిమహాగ్నిధారలో
పదనిడఁ గూర్చెనో యనఁగ ♦ భానుఁడు గ్రుంకెఁ గ్రమక్రమంబునన్. 1304

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 4.

గీ. సరసతరపద్మినీదివా ♦ సంగమంబు, సేసి తద్దోషపరిహార ♦ సిద్ధి కొఱకు
స్నానమొనరింపఁగాఁబోవు♦చందమునను, బశ్చిమాంబుధిలోఁగ్రుంకె♦భానుఁడపుడు.

బ్రహ్మోత్తరఖండము, ఆ 2.

సీ. అబ్జబాంధవుఁ డిట్టు♦లపరాబ్ధిఁ గ్రుంకఁగ, నపు డహిగిరినుండి ♦ నట్టి లక్ష్మి
వెలఁతలైన సతులను ♦ ముచ్చటగాఁ జూడ, హేమాంబరము ధరి♦యించిపద్మ

రాగభూషణములు ♦ రక్తచందనమును, బసుపుఁ గుంకుమఁ దాల్చి ♦ భక్తి మెఱయఁ
బశ్చిమాశాకాంత ♦ పయనమై వచ్చెనో, యనఁగ సంధ్యారాగ ♦ మతిశయిల్లె
తే. నందుచేఁ బార్వతీప్రియ ♦ ఖాబ్జముఖుల, మణులభూషణములరక్తి ♦ మములు మించెఁ
బక్షులారత్నములఁ జూచి ♦ ఫలములనుచు, మెక్కుటకుఁ బొంచుగతి చెట్ల ♦ మీఁద వ్రాలె.
వేంకటాచలమాహాత్మ్యము, ఆ 5.

ఉ. కుముదిని యంద మెల్లఁ జెడఁ ♦ గొట్టె నితండని తన్నెఱింగినన్
గుముదహితుండు రాజగుటఁ ♦ గొట్టునొ తిట్టునొ యంచు భీతిఁ బ
శ్చిమగిరిచాటుఁ జేరె సర ♦ సీజహితుం డిల నున్నవేకదా
కుమతులు రాజభీతులయి ♦ కొండలఁ గోనల డాఁగియుండుటల్. 1307
కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 144.

సీ. కాలమాంత్రికుఁ డస్త ♦ శైలపీఠంబున, రవిబింబశక్తియం ♦ త్రంబు నిల్పి
శ్రితహితద్విజరవా ♦ కృతిమంత్రము లెసంగ, త్మ్మరుహచ్ఛాయని ♦ ర్మాల్యము డిపి
హారిమారందధా ♦ రానందబాష్పముల్, దొఱఁగఁ దామరకన్ను ♦ లఱముడించి
కుసుమసంధ్యారాగ ♦ కుంకుమాంజలి నిచ్చి, తిమిరోడుధూపదీ ♦ పము లొసంగి
తే. చంద్రుఁడను వెండిగిన్నతోఁ ♦ జంద్రిక యను, పాయసంబు నివేదించి ♦ భ్రమరగాన
మమర కల్హారమంత్రపు ♦ ష్పము ఘటించి, శివునపుడు గొల్చె నరపతి ♦ చెల్వుఁ గాంచె.
రాధాకృష్ణసంవాదము, ఆ 2 పద్య 130.

ఆ. వృద్ధి నొంగి రాజు ♦ వెనుకొని చను దేర, నులికి గ్లానిఁ జెంది ♦ యున్న యినుఁడు
యాత్మ తేజ మెడలి ♦ యపరభూభృన్మణి, మఱుగుఁ జొచ్చె నది క్ర ♦ మంబు గాదె.
గోపీనాథరామాయణము, యుద్ధ.

మ. అనుజస్నేహితులైన కౌముదులకా ♦ హ్లాదంబు లేకున్కి నె
మ్మనమం దుంచఁ బోసి రోసి నిజభ ♦ ర్మక్షేత్రని స్తంద్రిసం
జనితోద్యత్కిరణాళి శాంతముగఁ దాఁ ♦ జర్చించి కోపంబుతోఁ
జనె నస్తాద్రికి నంగ భానుఁ డరిగెన్ ♦ సారస్యముల్ గుందఁగన్. 1310
కృష్ణార్జునసంవాదము.

చ. మొదలఁ బురందరాశఁ దగ ♦ ముట్టితి రాగముతోడఁ బద్మినిన్
బిదపఁ జమత్కరించితివి ♦ వేడ్కఁ గరంబులు సాఁచి యింకనన్
బొదువకు మంచు దూఱుచు న ♦ పూర్వదిశాంగన కాలఁ దాఁచినన్
సదమికయావకద్రవముఁ ♦ దాల్చెను నా నినుఁ డొప్పె రక్తిమన్. 1311

మ. ఉదయమునొందెసానులకు ♦ నొద్దికఁ బద్మినిఁ దేర్చి తద్గృహం
బదవదనేసెఁ దత్కువల♦యప్రభఁ దూలిచె నట్టె వారుణిం
దుదిఁ గనె నంచుఁ దన్ జనులు ♦ దూలఁగనాడిన నింద యోర్వకో
గొదగొని పశ్చిమాంబునిధిఁ ♦ గ్రుంకె సరోరుహమిత్రుఁ డత్తఱిన్. 1312

ఉద్భటారాధ్యచరిత్రము, ఆ 1 పద్య 33, 34.

ఉ. వేఁటతమిన్మహాసమయ ♦ వీరుఁడు తెల్వడి సంతసంబు బల్
పాటిలచందనంబునల ♦ పశ్చిమదిగ్విభసామజంబునుం
వ్రేటిడ దాని పక్కదిగి ♦ వీడనిచాయల మందుగుం డనం
దేటతనంబుతోఁ జరమ♦దిక్కునకున్ రవి సేరె నప్పుడున్. 1313

కవిజనచకోరచంద్రోదయము, ఆ 4.

ద్విపద. ఆకాశలక్ష్మీకర్ణావతంసంబు, ప్రాకటంబుగ జాఱి♦పడినచందమున
నరుణమాకిరణంబు ♦ లల్పంబులగుచు, తరణిపశ్చిమపర్వ♦తంబున కరిగె. 1314

నలచరిత్రము, చ. రా. ఆ 1.

క. వడమటిమల కడగుహలో, నడఁగిన యిరులను గడంక ♦ నవలికిఁ దఱుమన్
వెడలెడి పడువున నడిచెను, బడమటి కొండకును బ్రొద్దు♦పడిఁ గెం పడరన్.

చ. అదనదితప్పి వేఁడివెలుఁ ♦ గత్తమిలన్ దడమెత్తుపాముగా
ముదొరవిసంపుమంటలనఁ ♦ బొల్పగుఁ బద్మరసంజకాపి, పైఁ
గుదిరినసందెచీకటి త♦గుంబొగయట్లు, చెలంగు నల్లరాఁ
జుదడముల్లట్ల చీకటులు, ♦ చుక్కలొగిం దలమానికంబులో. 1316

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 3, 4.

---

# తమోవర్ణనము.

:0:

చ. ఇనుఁ డొడఁగూడి రాకకుద♦ధీశుదిగంగనరాగ మొందెనో
యన నెఱసంజవర్వె నమ♦రాధిపదిక్సతి దానిఁ జూచి వం
దినఁదనుకాంతిమాసెననఁ ♦ దెల్పఱఁ జీకటి గప్పె నంబుజా
సనహరివిశ్వరూపయుగ ♦సంగమవేళ నభంబు వొల్పగాన్. 1317

కుమారసంభవము, నన్నె. ఆ 8 పద్య 90.

ద్విపద. ఖలుఁడైన యద్దశ♦కంఠుని చేటు, దెలుపుటకై నిశీ♦థిని కచభరము
విశదమైఝుల్లన ♦ విరిసెనో యనఁగఁ, బరపొంది చీకటి ♦ ప్రబలమై పర్వె. 1318
రంగనాథరామాయణము, రంగనా. యుద్ధ.

చ. తనకరయంగఁ దండ్రియగు ♦ తామరసప్రియుఁ డంతరించినన్
మనమున శోకవేగమది ♦ మానుపఁజాలక ఖిన్నమూర్తియై
వెనుకనవచ్చు నయ్యమున ♦ వీచులఁ బోలు తమంబు లెల్లచోఁ
మునుకొని నిండఁబర్వె నతి♦మోహతరస్థితిభాసమానమై. 1319
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2639.

ఉ. కాలకిరాతపాదతల ♦ ఘట్టనఁజేసి వియద్వనీమహా
కాలఫలంబు భాస్కరుఁడు ♦ గ్రక్కున నస్తమహామహీధర
స్థూలశిలాస్థలింబడియెఁ ♦ దోరములైన తదీయబీజముల్
నీలరుచుల్ వడిన్ జెదరె ♦ నింగిననచ్ఛతమశ్ఛలంబునన్. 1320
శృంగారనైషధము, ఆ 8 పద్య 164.

సీ. అభ్రితాపింఛవ♦న్యాఘూణిరోదసి, కాపాలికమషీవి ♦ లేపనంబు
దివసాబ్జముకుళనో♦ద్ధితభృంగతతివారు, ణీపరిప్రాప్తసూ♦ర్యాపకీర్తి
చక్రిదాంపత్యవి♦ఘ్నముగజన్యభిసారి, కాతను మేచక ♦ కంచుకంబు
కాలగోపాలక ♦ కంబళంబు రమాకు,చూరనాసీరగా♦ఢేరజంబు
గీ. నిఖిల దిక్కుందరాముఖ ♦ నిర్గలప్రమత్తకరిఘటానటనభ్రి♦మప్రదోష
నీలకంఠకలాపంబు ♦ నిండఁ బర్వెఁ, గౌశికప్రియతమమైన ♦ గాఢతమము. 1321
వరాహపురాణము, నం. మ. ఆ 4 పద్య 141.

సీ. దినవారిరాశిమా ♦ పనుమానిగ్రోలంగ, నడుగునఁగనుపట్టు ♦నప లనంగ
గ్రుంకు మెట్టుపవిగా ♦ లోక్కనినసంధ్యావహ్నిఁ, బొడమినదట్టంపుఁ♦బొగ యనంగ
దనమణివడిపోవ ♦ ధరణీతలంబున, నెమకంగవచ్చిన ♦ వింగి యనఁగ
నలచుక్కలనిరియెడి ♦ వలరాజుగెలుపువ్రా,ద్రెలియఁ బూసినమషీ ♦ లేప మనఁగ
గీ. వృద్ధవారవిలాసినీ♦విసరమునకు, నఘలితంకరణౌపధం♦బనఁగ జార
నలినముఖులకదృశ్యాంజ♦నంబనంగ, నంధకారంబు జగమెల్ల ♦ నాక్రమించె. 1322
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 34.

క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండము చెమ్మయుతికి ♦ రూక్షార్కవిభా
రహితతఁ గాటుకపట్టెను, గహిం చెడియున నంధతమస♦రానులు బెరసెన్. 1323
మనుచరిత్రము, ఆ 3 పద్య 18.

ఉ. కాలసమాఖ్యచేనలరు ♦ కంచరవాఁడొక తామ్రపాత్రము
ద్వేలసుధారుచిందనరు ♦ వెన్నెలసీసముఁ జేతు నంచుఁ బ్రా
ల్మాలక తోమఁగా వెడలు♦మష్టన సర్వదిశాంతరంబులన్
మూలతమస్సమూహములు ♦ ముంచుకొనెన్ మఱియు న్సమగ్రతన్. 1324

సానందోపాఖ్యానము, ఆ 5.

క. కలయికలెడసినజక్కవ, చెలువల కన్నీటిపదను♦చే నెల్లెడలన్
మొలచెననఁగ నలుగడలన్, బలిసి తమోలతలుబయలు ♦ పందిరిఁబ్రాఁకెన్. 1325

రామాభ్యుదయము, ఆ 2 పద్య 93.

సీ. కలయిండ్లకరిగెడు ♦ కన్నపుదొంగల, నీలికాసెలదీప్తి ♦ నిండెఁ గాక
గద్దించిచనుదుండ♦గపువేడ్కకత్తెల, మైలచీరలచాయ ♦ మలసెఁ గాక
ముకుళితవికసితాం♦బురుహోత్పలములకు, నెడయాడునలికాంతు ♦ లెసఁగెఁగాక
విటులకై మెండాడు ♦ వీథులజంతల, పెనుఁగాటుకలకప్పు ♦ బెరసెఁ గాక
గీ. వాఁడఁబాఱెడు విరహిణీ ♦ వదనసమితి, కందుపొందుననగునల్పు ♦ గలసెఁగాక
కాని నాడింత దట్టమై♦గలదె మొదల, ననఁగఁ జీకటియంతంత ♦ కగ్గలించె.

కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 90.

సీ. తమినహల్యాజార♦తారతాశయుఁడైన, జంభారికిదిరత్న♦జాల మయ్యె
వల్లవీతతిఁగూడి ♦ మల్లాడు మాయగొల్లనికిది చూడ క♦లాపమయ్యె
దారుకావనవాని ♦ దారకాముకుఁడైన, పశుపతికిది గళా♦భరణ మయ్యెఁ
దారాభిసారసా♦దరతఁద్రిమ్మరిన తమ్ములదాయకిది యురో♦ముద్ర యయ్యె
గీ. నభిమతనవీనవరనిధా♦నాప్తిహేతు, దివ్యసిద్ధాంజనంబైన ♦ దీనివంటి
యనుఁగుఁగనుఁగవనెత్తుకే♦యరుదటంచుఁ,గులటలునుతింపఁదిమిరంపు♦గుంపులెసఁగె.

వసుచరిత్రము, ఆ 4 పద్య 13.

క. ఇనుఁడొత్తిపట్టఁబోలుం, దనకరముల మున్ను మిన్ను ♦ దానికి గుఱుతా
యన చన్న నదియూ నిదిగో, ననయము వ్రాలె ననఁ దిమిర ♦ మడరె న్నిగులన్.

పరమయోగివిలాసము, ఆ 3 పద్య 228.

చ. తఱియను లోహకారకుఁ డు ♦ దగ్రితఁ బశ్చిమశైలశృంగమున్
గుఱిగొని వేలుపుందెరువు ♦ గొప్పపిరంగునఁ జాయమందులో
గొఱలెడు విన్నమానికపు♦గుండు ఘటించి యగాదు చేసినం
దఱచుగఁ గ్రమ్మ క్రొంబొగల ♦ నంగ జగంబునఁ బర్వెఁ జీఁకటుల్. 1329

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 95.

సీ. రేరాయనికిఁబొక్కు ♦ తారావధూమణి, కఱిచాయనునుఁజట్టు ♦ గా ధరింప
వేయుకన్నులవాని ♦ దాయ నెంచు నహల్య, నీలాలసరులంచుఁ ♦ జాళిఁ దాల్ప
దహను నాత్మఁ దలంచు ♦ తపసిరాయిల్లాండ్రు, కప్పుకుప్పసములు♦గా ఘటింప
శివునిమరులొక్కన్న ♦ వివిధతాపసకాంత, లిందీవరములుగా♦నెంచి ముడువ
గీ. నిగిడె జగములఁ గలకంఠ ♦ నీలకంఠ, కంఠకాదంబకరదంభ ♦ ఖంజనాభ
కజ్జలద్యుతిహారినీల ♦ ఘనతమాల, ఘోరరుచిపూరమగు నంధ♦కార మపుడు. 1330

భోజసుతాపరిణయము, ఆ 5 పద్య 19.

క. ఇనుఁ డరిగె ననుచు సమయాం,గన నీలపటంబుఁ దాల్చి ♦ గలయాశలమే
కొనియెడుజారిణికైవడి, ననఁజీకటి పుడమిఁ జెలఁగె ♦ నతిబహుళంబై. 1331

బిల్హణీయము, ఆ 2 పద్య 22.

చ. దళితతమాలజాలముల ♦ దాయ నిశాచరకోటిమేలు క
జ్జలరుచితోడు ధూమవిధు ♦ సారథి రేయెలనాఁగచూర్ణకుం
తలతతి రాజునొల్లక వె♦తంబడు పద్మిని శాపమూర్తి ది
క్కులఁ బచరించెఁ జీకటి య♦కుంఠితలీల నిలాతలంబునన్. 1332

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 3 పద్య 62.

సీ. యమునాపయఃపూర♦మనఁగ నిమ్నోన్నత,స్థలములనెల్లెడ ♦ సమము పఱచి
గంధాంధసింధుర ♦ ఘటయననిశ్శంకఁ, బంకజాతమ్ముల ♦ పొంక మడఁచి
యసితాంబుదకదంబ♦మనఁ గారుకొంచును, విరహిణీబాష్పాంబు♦వృష్టి గురిసి
యనుపమాంజనపుంజ ♦ మన నభిసారికా, జనముకన్నులఁ గప్పి♦కొనఁ దనర్చి
గీ. స్వచ్ఛశిఖిపింఛతాపింఛ ♦ గుచ్ఛభాను, రచ్ఛవిచ్ఛటఁ దెగడు నీ♦రంధ్ర వృత్తి
నఖిలదిక్కుహరంబుల ♦ నాక్రమించి, కానిపించెను గటికచీ♦కటులగుంపు. 1333

కవిజనరంజనము, ఆ 3 పద్య 67.

మ. తమిసాయాహ్నవిరోధిహేళిపయి సం♦ధ్యారాగరక్తప్రవా
హముగాఁ బోరుచు పట్టి హస్తగిరిదు♦ర్గాంతంబునన్ వైవ త
త్క్రమమాలించి వియోగచింత నతి కా♦ర్శ్యం బొందుచున్ బద్మినీ
రమణీరత్నము నించు నూర్పు లనఁగా ♦ రాజిల్లుఁ గ్రొంజీకటుల్. 1334

రంగారాయచరిత్రము, ఆ 3

క. రవియనెడు కాలచక్రము, దివసాంతప్రళయవేళ ♦ దీపాగ్నులచే
దివిఁ గాల్చి యడఁగ నమ్మషి, నివహంబనఘోరతమము ♦ నిండె న్వెలుచన్. 1335

హంసవింశతి, ఆ 2 పద్య 131.

సీ. కకుబబ్జముఖులకుఁ ♦ గస్తూరిపూఁతలై, భూభృదోఘముల కం♦బుదము లయ్యె
భూరిఘోరారణ్య♦ములకు గజంబులై, యారామములకుఁ బి♦కాళు లయ్యె
హర్మ్యపంక్తులకు ని♦ర్యద్ధూమరేఖలై, వరనదంబులకు శై♦వలము లయ్యె
భవనంబులకునీలి ♦ పట్టుమేల్కట్టులై, కొలఁకుల కెలదేఁటి ♦ గుంపు లయ్యె
గీ. ననఁగ సకలజగద్భీష ♦ ణాయమాన,లీల వన్నియలనునొక్క ♦ నీలిమ్రింగె
దనుటనిజమైయశేష వ♦ర్ణాంతరములఁ, గప్పుకొనియొప్పుచిమ్మచీఁ♦కటులు నెఱసె.
శుకసప్తతి, ఆ 1.

ఆ. గగన మెల్లఁ గప్పి ♦ ఘననీలరుచి నొప్పి,శీతభానుకరవి ♦ ధూతమాన
పూర్వమగుచుఁ దమము ♦ పొల్చెశంకరకరో,చ్ఛూననాగచర్మ♦ శోభగలిగి.1337
కిరాతార్జునీయము, ఆ 3 పద్య 130.

సీ. అరుణప్రభాపాళి ♦ కామ్లానకైరవ, శ్రీమహాభోగసం♦జీవకరణి
సమయావలోకనా♦సక్తమానసనాయి, కానాయకాబ్ధిసం♦ధానకరణి
ప్రత్యహాస్ఫూర్త్యసం♦భవహేతుయుక్తిని,ర్వారణఖద్యోతసౌ♦వర్ణకరణి
విప్రార్ఘ్యబాణవి♦చ్ఛిన్నమందేహశై, థిల్యకల్యాణవి♦శల్యకరణి
గీ. సకలభూతప్రపంచవి♦శ్రమవితరణి, జారచోరచకోరసం♦చారసరణి
తరణిజాకార రేఖాని♦ధానధరణి, ధరణిఁ జరియించెదమితిర♦స్కరణికరణి .1338
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 4.

గీ. మిత్రుఁడపసుత్వమునన స్త♦మింప నపుడు, సరసులప్రఫుల్లజీవన ♦ జాతములు ర
జోవిహీనతసత్త్వసం♦శూన్యతఁ గడు, విన్నవై యుండ నావిర్భ♦వించెఁ దమము.
రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 4 పద్య 108.

ఆ. భానుదీప్తియనెడు ♦ పరతత్త్వవిజ్ఞాన, మంతరించుసమయ ♦ మాత్మ నెఱిఁగి
యావరించినట్టి ♦ యజ్ఞాన మనఁగ లో,కంబునందు నంధ♦కార పడరె. 1340
కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 166.

సీ. తాతాంబునిధిపత ♦ నాతతఖేదత్వ, రాపతద్వ్యమునాల ♦ హరియనంగ
గ్రహసమారోహణ ♦ కంపితాకాశ జం,బూలతావిగలత్ఫ♦లాళి యనఁగ
జైత్రయాత్రాక్రియా♦సంభ్రమన్మథన సే,వాయాద్ఘనవప్రి♦యచయమనఁగ
స్వవిరోధ్యదర్శన ♦ సమ్మదావనిచర, న్మందేహదేహరు♦గ్బృందమనఁగ
గీ. నిజనిలయ సలిలరుహాళి ♦ నియతభంగ, కారిసంధ్యాసమయపరా♦క్రమవిధాన
కలితమతినిర్దయశివరా♦ఘుంబనంగఁ, దిమిరసంతతిజగదంత♦రమునఁ జెలఁగె. 1341
సర్వకామదాపరిణయము, ఆ 2.

క. ఇరు లెసఁగ విభుని రాకడ, దరసి నిశీథిని జలంబు♦లాడి వెసన్మృం
గురు లార్పఁగ వేసినబం,ధురమగు సాంబ్రాణిధూప ♦ ధూమమనంగన్. 1342
నయనోల్లాసము, ఆ 3 పద్య 101.

సీ. గగనవధూటిసో♦యగపుఁబిఱుందన, రంజిల్లు నీలాంబ♦రంబనంగ
నెతిజగత్కరిమీఁది ♦ నీలంపుజాలీల, పసమించు మిన్కుటం♦బారి యనఁగ
సంతసమొప్ప వ♦సంతుండు గాడిఖు,డాయించు గప్పు జేం♦డాయనంగ
నంగజరవీకా♦హళులపైఁ బన్నిన, లలినీలిపట్టుజా♦లారనంగ
గీ. నమృతకరునకు రజనీసు♦ధాధరికిని, పరిణయంబని సర్వది♦క్సరసిజాస్య
లుడుగరలొసంగుకస్తూరి♦బొడులనంగ,తటుకుననుగ్రమ్ముకొనెఁదమః♦పటలమపుడు.
నీలకుంతలావిలాసము.

గీ. గొండ్లి సలిపెడి యురవడి ♦ గుబ్బలల్లు, జడలగుంపులు వీడి యా♦పుడమి నెల్ల
నలముకొనియె ననంగను ♦ నలుపుమిగిలి, కటికిచీకటి రొల్లెడఁ♦గ్రిమ్ముకొనియె.
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 5.

---

# నక్షత్రములు.



ద్విపద. కృతకృత్యుఁడగురాము ♦ కీర్తిపుష్పములు, చతురతమై వెద♦చల్లిన యట్లు
కర మొప్పఁ జుక్కలు♦ కాన్పించె నంత, ,, ,, ,, 1345
రంగనాథరామాయణము, యుద్ధ.

ఆ. సురతనాటకంబు♦దొరఁకొన రాతిరి, కరపుటమునఁ జల్లు♦విరు లనంగ
నెఱసె నంబరమున ♦ నెఱిఁదారకలువియ, జ్జలధిఁ బెరుఁగు ఫేన♦సమితియనఁగ.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2636.

మ. నభమెల్లం గలయంగనిండఁ బొడిచె♦న్సంధ్యాన శేషాదృతా
గళటేడంబరతాండవభ్రమరికా♦రంభంబున న్శాంభవీ
పరిభుపాదాహతిమీఁదికిన్నెగయుచున్ ♦ బ్రహ్మాండగోళంబుతో
నభిసంబద్ధములయ్యెనోరజతశై♦లాశ్మంబు లన్నట్లుఁడుల్. 1347
శృంగారనైషధము, ఆ 8 పద్య 160.

ఆ. భూమి నిండి మింటఁ ♦ బూర్ణమై కర్కాట, మకరమీనరాశి ♦ మహితమైన
హరియశస్సుధాబ్ధి♦యందలి తుంపురు, లనఁగఁ జుక్క లొప్పె ♦ నాకసమున.
భాగవతము, స్కం. 10 పూర్వ, పద్య 1291.

ద్విపద. కొమరారు నభమను ♦ కొలనిలో విరియు,
కుముదజాలంబు బో♦గునఁ జుక్క లెసఁగ. 1349
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భాగ. 1.

సీ. కారొక్కన్న కటికిచీఁ♦కటిముగుల్ మొత్తంబు, గురిసినవడగండ్ల ♦ గుంపు లనఁగఁ
గవజక్కవలువాయఁ♦గరసాళములఁజందు, రుండూఁదుపటికంపు♦టుండ లనఁగ
నెల్లెదమిన్నేటి♦యిసుమునచ్చర, కొమలిడ్డ వెన్నెల ♦ కుప్ప లనఁగఁ
దెలివివెన్నెలవెండి♦తీగలు నిగిడించు, చదలుకమ్మచ్చుబె♦జ్జములనంగ
గీ. జగము గెల్వంగ దండెత్తు♦మగనిమీఁద, లీల రతిచల్లు దీవనఁ♦బ్రాలనంగ
వేఁడినెలుఁగెండఁగ్రాఁగిన♦విన్ను మేన, నెక్కొనుచెమటబొట్లునాఁ♦జుక్క లమరె.
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 36.

క. తలచూపె నప్పు డఖిలా,శల దట్టపుటిరులుచిలువ ♦ జవరాలు సభా
స్థలమండపకోపరిసీ,మల నిడిన సితాండపటలి♦మాడ్కిం జుక్కల్. 1351
మనుచరిత్రము, ఆ 5 పద్య 34.

చ. సురపథమాదిమార్గమునఁ♦జొప్పడి పండిన భానుఁడన్ ఫలం
బరుదుగఁ బశ్చిమాద్రి శిఖ♦రాగ్రమునంబడి పెక్కు వ్రక్కలై
యురువడిఁ జిట్లపై నెగయు♦నుజ్జ్వలబీజములో యనంగ బం
ధురతరభంగినల్లడలఁ♦దోఁచె నభోదితసాంధ్యతారకల్. 1352
నానందోపాఖ్యానము, ఆ 5.

సీ. వటదీశహాసవి♦స్ఫుటితవేధోండరే,ఖలఁ దోఁచు వరణాంబు♦కణిక లనఁగఁ
బెల్లుబ్బునిగ్గపై♦న్వెల్లినెల్లపదార్థ, ములుమున్గఁబొడముబు♦ద్బుదము లనఁగ
రవికిమందేహని♦ర్మథనసాధనములై, వచ్చిన ద్విజమంత్ర♦వర్ణము లన
హరిపదంబునునీశు♦శిరమునైన నభంబు,న నభోగతులునించు ♦ నన లనరఁగఁ
గీ. జరమగిరియను మరకాఁడు ♦ జలధి సరణిఁ, దరణిడించిన నతఁడు త♦త్సలిలమగ్న
విమలముక్తాఫలంబులు ♦ వెలికిఁజొరిపె, ననఁగ నవతారకానికా♦యంబు లడరె.
వసుచరిత్రము, ఆ 4 పద్య 15.

ద్విపద. కడిఁదిమున్నమృతంబు ♦ గరుడుండు గొనుచుఁ, గడువడిఁ జనఁగఁద♦త్కల
శంబు తొలఁకి

పెదరి యాకసమునఁ◆జింది చూపట్టు, తుదలేని యమృతంపుఁ◆దుంపురు లనఁగ
వికసించుచేమంతి◆విరులచందమునఁ, బ్రకటంబులై కనుఁ◆పట్టెఁ దారకలు. 1354
అష్టమహిషీకళ్యాణము, ఆ 5.

క. అలరెను దారలు సంధ్యో,జ్జ్వలనశిఖాదహ్యమాన◆చరమాద్రివనా
ఖులఁ బేటిలు వంశపటలం,బుల నెగసిన గొప్ప వెలఁది ◆ ముత్తెము లనఁగాన్.
పరమయోగివిలాసము, ఆ 3 పద్య 229.

చ. దిన మనుగ్రీష్మ తోఁగ జగ◆తిన్ నిశ నాఁగ ఘనాగమంబు దా
ర్కొనఁ గొనసాంధ్యరాగపుమె◆ఱుంగు మెఱుంగుగ మబ్బు మబ్బు గాఁ
దనరఁ దదంబుదాంతరగ◆తస్ఫుటమౌక్తికముల్ గ్రహించి య
య్యనిమిషరాశి రాశి నిడి ◆ రా దివి నాఁదనరారెఁ దారకల్. 1356
ముకుందవిలాసము, ఆ 3 పద్య 44.

గీ. రాజు సనుదెంచు నని నిశా◆రమణి యప్పు,డింద్రనీలపుమణిపాత్ర ◆ నిడినసోబ
నంపుటారతి తెలిముత్తి◆యంపుగుంపు, లనఁగ నభమునఁ దారక◆లతిశయిల్లె. 1357
ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, ఆ 1 పద్య 82.

గీ. రవళిఁ గువలయహితుఁడగు ◆ రాజు స్వారి, వచ్చునెడల విభావరీ ◆ వనరుహాక్షి
చెలఁగి చల్లిన ముత్తెంపు◆సేసఁబ్రా ల,నంగఁ జుక్కలు దట్టమై ◆ నింగిఁ బర్వె.
రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 96.

క. కుదురుగఁ జుక్కలు మిక్కిలి, పొదలెం దతి యనెడుకాఁపు ◆ పొరిఁబొరినివియ
త్పదకేదారాంతరమున, పెదచల్లిన తెల్లజొన్న ◆ విత్తు లనంగన్. 1359
సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 66.

చ. శరనిధి సాంధ్యరాగమను ◆ చక్కనిబచ్చెనయోడ నెక్కి దు
స్తరతరరశ్మిబద్ధరవి ◆ జాలిను నీటను ముంచి మౌక్తిక
స్ఫురదురుశుక్తికల్గొని న◆భోధరణిన్ సముయంపుబేరి ని
బ్బరముగఁ గొట్టి రాలుచును◆పాణులన వ్వెలసిల్లెఁ దారకల్. 1360
మిత్రవిందాపరిణయము, కుం. వేం. ఆ 5 పద్య 11.

మ. ప్రతిజన్మంబునుమంగళీత్వగరిమన్ ◆ బ్రాపింప నింద్రాణిసు
వ్రతచర్యన్వరుణానికిన్ రవిహరి◆ద్రాచూర్ణరాశిన్నభ
స్తతశూర్పంబున వాయునంబొసఁగఁ బ్ర◆త్యక్సింధువీచీపటా
వృతిమొప్పన్గొనిచల్లునక్షతలునాఁ ◆ బెంపొందెఁదారౌఘముల్. 1361
తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 110.

చ. అపరనఘాటికామణికి♦నై యతిమోహముఁ జెంది డాయు చో
క్కపుసిరిగల్గుమంత్రఘుటి♦కాతతిఁ విచ్చిన పూలు గొన్ని యం
దపుఁగపురంపుఁబూసలు ము♦దంబున వశ్యముఁగాఁగఁ బంచెనా
నపుడు సరోజజాండమున ♦ నంతట బోరులు దీరెఁ దారకల్. 1362

బిల్హణీయము, ఆ 2 పద్య 28.

గీ. అర్కకరతప్తకమలభ♦వాండనిష్ప,తద్రవత్స్వర్ణబిందుసం♦తాన మనఁగ
విరహినఖదూతఘర్మశీ♦కరము లనఁగ, ముందు వెన్కలఁదారల♦ప్పుడు చెలంగె.

పార్వతీపరిణయము, ఆ 5.

చ. అనువుగ మిన్నునంగడిత♦పాళితమంబునఁ గట్టిపెట్టు శో
భనతరచంద్రదీధితుల♦పంక్తి జమాఖరుచుల్ గణించి యిం
తనుకొని కాలమన్ గణకుఁ ♦ డప్పుడు తీర్చి లిఖించినట్టి యా
దినవహిరేఖవ్రాలనఁగఁ ♦ దెల్విగఁ జుక్కలు పర్వె నత్తఱిన్. 1364

హంసవింశతి, ఆ 1 పద్య 142.

గీ. విపులనీలాంబరమునిండ ♦ విమలమౌక్తి,కములఁ గుమిఁగూర్చి శేషన♦గంబుపైని
గట్టునటువంటి చందువా♦కరణిఁ దార,కంబు లంతంతకునభంబుఁ♦గ్రాలెనపుడు.

వేంకటేశ్వరమాహాత్మ్యము, ఆ 3 పద్య 170.

ఉ. తారకరాజిరాజితని♦తాంతపరిస్ఫుటదీప్తి దద్ధ సాం
పార నిజప్రియాగమన ♦ హర్షతయామవతీవిలాసినీ
స్ఫారవినీలకమ్రకచ ♦ భారవిచిత్రపరీతసాంద్రశృం
గారితమల్లికానుమని♦కాయ మనంగ విహాయసంబునన్. 1366

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 4 పద్య 109.

సీ. తిమిరమన్మథుఁడు రా♦త్రిమహిళ జాబిలి, నంటుకై యేయుబా♦ణమ్ము లనఁగ
పుష్కరాయనమహాం♦బుధికళానిధికొసఁ,గంగ నెత్తినవమౌ♦క్తికంబులనఁగ
నటనోచ్ఛలన్మహా ♦ నటజటాచ్యుతదేవ, తతినించుశుభ్రాతు♦తమ్ములనఁగ
చంద్రికాసంగార్థ♦సంతుష్టలగు దిశా,సతుల యానంద బా♦ష్పంబులనఁగ

గీ. రాజమార్గంబునఁ జకోర♦రాజియెల్ల, కమలఁదీర్చి యొనర్చిన ♦ కాంతిపెడని
పృథులతరసురరత్నదీ♦పికలనంగ, గ్రహసమేతంబుగాఁదార ♦ కలుదనర్చె. 1367

సర్వకాముదాపరిణయము, ఆ 2.

గీ. అంబరంబను కాయమా♦నంబు నందు, నల్లుకొన్న తమంబను♦మల్లెతీఁగె
యసమకుసుమాభిరామమై♦యెసఁగెననఁగఁ, జొక్కముగఁ జుక్కలెల్లెడఁ♦బిక్కటిల్లె.

నయనోల్లాసము, ఆ 3 పద్య 102.

ఉ. అల్లన కాలవర్తకుఁడు ♦ నయ్యెడఁ గెంపును ముత్తియంబులున్
మెల్లనఁ దూకి చూచుటకు ♦ మేలిమి త్రాసునఁ బెట్టి తూఁచఁగా
ఝల్లని వ్రాలు ముత్తెముల♦చాడ్పునఁ దారలు త్రాసు బిల్లజా
బిల్లియనంగ మించె మణి♦ పేరిటిసూర్యుఁడు గ్రుంకుచుండఁగన్. 1369

విశ్వకర్మపురాణము, ఆ 5.

---

# చంద్రోదయము.



సీ. నలువ చెందొవల కే♦కులకు నన్నువు వెట్టి, గోరి కావించిన ♦ గుళిక యనఁగ
నఖిలద్విజశ్రేష్ఠ♦మగు చకోరచయంబు, తపము సముల్లస♦త్ఫల మనంగఁ
జిగురుజొంపము నును♦జిగి యొప్ప మదయాద్రిఁ, బొలుపారు నవకల్ప♦భూజ మనఁగఁ
బూర్వపయోరాశి♦ పొంతఁ గెంజాయచె, న్నొందవిన పవడంపుఁ ♦ బొదయనంగఁ
గీ. నరుణరుచిఁ దనమండల♦మతిశయిల్లఁ, బొడిచి దివిఁ బ్రాఁకి దీధితు ♦ లుడరఁ జేసి
యంతకంతకు నెక్కుచు ♦ సంతమసము, గ్రోలుకొనె నీకచంద్రుఁ డిందు♦ గ్రాలె నధిప.

భారతము, ద్రోణ. ఆ 5 పద్య 275.

సీ. ఘనతమిస్రోద్యత♦కరిరక్తజలములఁ, జెలువారఁ దోఁగిన ♦ సింహ మనఁగఁ
బూర్వపయోరాశి♦ పొందున నుండక, వచ్చు బాడబమహా ♦ వహ్ని యనఁగఁ
బ్రథమాద్రిశృంగంబు♦ పైఁ దెచ్చి పెట్టిన, ఘనపద్మరాగైక ♦ కలశ మనఁగఁ
బ్రాచీవధూకర ♦ పల్లవతిలమునఁ, గొమరారు విద్రుమ ♦ గుచ్ఛ మనఁగ
గీ. భానుఁ డుదయించె రాఘవ ♦ మానవాధి, పతి మనోరథపరిపక్వ ♦ ఫల మనంగ,
భూరి తేజంబు వెలుగంగ ♦ భువనభువన, తిమిరహాతిఁ జేయఁ జాలిన♦దీప మనఁగ.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 1803.

ద్విపద. ......................., చిరకాలములసీమ ♦ శిశువులమామ,
పాలుపొందుకలువల ♦ పోరానివిందు, కలసినజక్కవ♦కవఁ బాపు మందు
పాలవెల్లిని దచ్చి♦పడసినవెన్న, శూలియౌఁదలపువ్వు♦చుక్కలనవ్వు
నెరిచకోరములకు ♦ నెలనెలపంట, యురవేదివిరహుల♦నుడికించుమంట
గగనంబుతోడవు దొం♦గల గుండెదిగులు, నొగినబ్ధిఁ బొంగించు ♦ నూఱటపట్టి
హరిహరబ్రహ్మల ♦ యానందదృష్టి, సరసిజరిపుఁడైన ♦ చందురుండు వొడిచె.
రంగనాథరామాయణము, రంగ. యుద్ధ.

ఉ. వెన్నెలవెల్లపచ్చడము ♦ విచ్చినయంబరశయ్యమీఁదఁ జే
రన్ననమండిదిగ్వనిత♦లాదటఁ జుట్టును గొల్వ రాత్రియన్
కన్నియఁగూర్మిచిక్కఁ దన♦కౌఁగిటఁజేర్చి సుఖించు నాఁడనన్
జెన్నువహించెఁ జందురుఁడు ♦ శ్రీకమనీయకళంకరేఖతోన్. 1373
నృసింహపురాణము, ఆ 3 పద్య 89.

సీ. ధరవియోగులనెల్లఁ ♦ బరిమార్పఁబూని హృద్భవుఁడు గట్టిన వీర♦పట్ట మనఁగ
విరహులపైదండు ♦ వెడలుసోమదమున, కెత్తినకెంజిగు♦రెల్లియనఁగ
నలిఁ బ్రోషితులమీఁద ♦ గొలిపెడుమరుకరి, ఘుసృణపంకాంకిత♦కుంభ మనఁగఁ
జొత్తిల్లిపథికుల♦నెత్తుటఁదోఁగిన, శంబరద్విషుచేతి ♦ చక్ర మనఁగఁ
ఆ. దూర్పుకొండతుట్ట♦తుదిమాఁకుననువ్రేలుఁ, గొమ్మనలుదపూవు ♦ గొలకవోలెఁ
గందు బెరసిరాగ ♦ కాంతిదలిర్పంగ, మవ్వమొప్పఁ జంద♦మామ వొడిచె. 1374
విక్రమసేనము.

చ. అవిరళతారకానిబిడ♦హారము లోలి ధరించి చంద్రికా
ధవళవినూతనాంబరము ♦ దట్టముగాఁగ మునుంగు వెట్టి కై
రవధుధురస్మితంబమర ♦ రాత్రివిలాసిని యొప్పె శీతరు
క్ప్రవిమలరత్నదీపములు ♦ గల్గునజాండనికేతనంబునన్. 1375
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 456.

మ. అదె రౌద్రాకృతిఁ జూచెఁ జంద్రుఁడు మయూ♦ఖాటోపమేపారె న
ల్లదె, మున్నాడెఁ జకోరసంఘమదె జ్యో♦త్స్నాపానసంక్రీడకై
యదయుండంగజుఁ డెట్లుగాఁ గలఁడో! నీ♦యాలోకనేందీవరా
పదఁదూలించెదు చంద్రవంశజుని నొ♦ప్పంజూతు రమ్మా సఖీ. 1376
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 110.

గీ. శుద్ధకాంచనపిండంబు • సూర్యుఁ దిగిచి, పూర్ణశశిపూఁతబంగారు • బూది నొసఁగి
సాయమనుధూర్తవంచించె • జగము నెల్లఁ, దెల్లఁబాఱెడునదె చూడు • తెలివిపిసఁడు.
శృంగారనైషధము, ఆ 8 పద్య 167.

గీ. అర్ధమండలముదయించు • నమృతభానుఁ, డుదయరాగంబుతోఁ గూడ • నొప్పుమిగిలెఁ
బ్రకటతాంబూలరాగసం • రక్తమైన, బ్రాగ్దిశాకాంతబింబాధ • రంబు వోలె. 1378
భీమేశ్వరపురాణము, ఆ 2 పద్య 40.

సీ. మఱచినవిరహుల • మానంబులడరించి, యిరవైనచీఁకటి • యిండ్లకనిపి
మతిఁ గోకములనెల్ల • మఱువులుగాఁ దోలి, నీలోత్పలంబుల • మేలుకొలిపి
వెలయఁ జకోరకా • వలికివిందులు పెట్టి, నీరజాతంబుల • నిద్రపుచ్చి
వనధులనుబ్బించి • వలరాజు నెగయించి, మందమారుతముకా • నంద మొసఁగి
ఆ. తనదు తెలుపుచేతఁ • దలకొని నిఖిలంబు, తెలుపుగాఁగఁ దూర్పు • దిక్కునందు
జల్లఁదనముఁ జూపి • జగములొండొరులకు, మామయనఁగఁ జంద • మామ పొడిచె.
వీరభద్రవిజయము, ఆ 8 పద్య 120.

సీ. పాంథలోచనవారిఁ • బడనీనమర్చిన, సంతప్తపరశువు • కంతునకును
బ్రాచీదిశాపతి • పావడంబనిచిన, మవ్వంపుఁజిగురెల్లి • మన్మథునకు
నాత్మపరితాపాగ్ని • నవతారమొందంగ, నంగారఖండమ • నంగునకును
గాముదీజలధి వే • డ్కకునిండఁ దెచ్చిన, పవడంపుఁగుంభంబు • భావజునకు
గీ. ననెడు విచికిత్స జనులకు • నావహిల్లఁ, జక్రవాకము లెడఁబాయ • జారసతులు
డాయ నబ్జవిలాసంబు • డాఁపరేఁడు, ప్రాచికొనరించెఁగునుమపూ • బంతి చెలువు.
శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 3.

ద్విపద. సురుచిరలీలమై • సురరాజుదేవి, ధరియించుకర్పూర • తాటంక మనఁగ
మెల్లన నవలొత్తు • మించులఁ బొదలి, చల్లనైవటుప్రవ • చంద్రుండు వొడిచె.
హరిశ్చంద్రోపాఖ్యానము, (గౌర) భాగ 1.

చ. దినపరిణామలక్ష్మికిఁ బ్రతీచిదగంగయినేయువేడుక
న్వరుహమిత్రబింబమను • వర్తులలాక్షికపట్టికం బయో
ధినడుమఁ దోఁచి సాంధ్యనవ • దీప్తిరసంబు హరించి పాఱవై
చినవెలిదూదియో యనఁగ • శీతకరుండుదయించె నత్తతిన్. 1382
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 44.

శా. ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితా • జాండంబులోఁ జంద్రుఁ డొ
ప్పారెం గాలభిషగ్ద్వ్యండవిగతం • బై కాముకశ్రేణికిన్

మారోత్సాహము నిల్వఁ బాదరసమున్ ♦ బంధించి ప్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టిగుటికా♦సిద్ధౌషధంబోయనన్. 1383

మనుచరిత్రము, ఆ 3 పద్య 25.

మ. జలజాతాహితమాంత్రికాగ్రణి కళా ♦ జాలాఢ్యుఁడై దీపికా
కలికాభీలవిషానలావిలతమః ♦ కాలాహిమార్గ్యమై వియ
ల్లలనాదేహము తారకానికరతా ♦ లాబిందువై యుండ వె
న్నెలమందుల్ పయిఁ బూసి తేర్చె ననఁ గా♦న్పించెన్ ప్రసన్నద్యుతిన్. 1384

రాజశేఖరచరిత్రము, ఆ 3 పద్య 141.

సీ. వాతూంగభామినీ♦శ్యామధామాళియుఁ, గంఠహాలాహల ♦ కాళిమంబు
నాకాశదేశపా♦శాసిలచ్ఛాయయుఁ, జాళికాసింధువై♦వాలరుచియు
గరకృష్ణసారాగ్ని ♦ ఘనధూమనీలిమ, శేషభూషణఫణా♦సీమనలుపుఁ
గటితటకీలిత♦కరటిచర్మద్యుతి, మేచకశూలశో♦భాచయంబు

గీ. భువనలోచనుపైనెత్తి ♦ పోవునంధ, కారబృందంబునకుఁ దోడు♦గాఁగఁ గూర్చి
వెనుక నేతెంచుభూతేశు♦విధముదనరఁ,జంద్రుఁడుదయాద్రిపైనొప్పె♦సాంద్రలీల.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 4 పద్య 40.

మ. హరిదంభోరుహలోచనల్ గగనరం♦గాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్య నొయ్య సడలిం♦పన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ ♦ వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతిపొల్చె రేకయి సగం♦బై బింబమై తూర్పునన్. 1386

వసుచరిత్రము, ఆ 4 పద్య 17.

చ. కళలకు నిమ్ము; సొమ్ము సెగ♦కంటికి; మింటికిఁ జెన్ను; వెన్నతో
య్యాలిపయిగాడు; కూడు దివి♦జాళికి; హాళికి జంట; తుంటకల్
గలదొరవిందు; పొందు విరి♦గల్వకుఁ; జల్వకు నిక్క; రిక్కకే
వెలఁదుల నీవి; బావి రుచి♦వీచికిఁ; బ్రాచికి వచ్చె జెచ్చెరన్. 1387

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 4 పద్య 16.

చ. పనుపడవేణునాళముగఁ ♦ బగ్గములంబలెఁ గ్రిందబర్వు శో
భనకిరణప్రకాండముల ♦ భాసిలఁ జందురుఁ డొప్పె నెంతయున్
మనసిజుఁ డెల్లప్రోవుల మం♦త్రంబులు చేలుగ రాగబీజముల్
పెనుజలనంతతోడ నెడఁ♦ బెట్టెడుకొప్పెపుజడ్డిగంబనన్. 1388

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 124.

ఉ. భానుసహస్రసత్కిరణ ♦ పంక్తులనుద్భవమైనయాబృహ
ద్భానునివెట్టఁ బెల్లుడుకఁ ♦ బట్టనుధాంబుధిమీఁది మీఁగడల్
పూనిసమీరుచేఁదెరలి ♦ పూర్వదిశంగనుపట్టి దానిపై
ఫేనమనంగనొప్పె శశి♦బింబము తూరుపుఁగొండపైఁదగన్. 1389

మొల్లరామాయణము, అయో. పద్య 13.

గీ. నలుపయనుకోఁపు గగనంబు♦నల్లనేలఁ, దారకాహారమనుమేలి ♦ పైరు నించి
నింగిదిగుపాలుటయుఁజూచి♦నించుదృష్టి,నుండయునుబోలెఁబూర్ణేందు♦మండలంబు.

సుదక్షిణాపరిణయము, ఆ 4 పద్య 139.

గీ. వీణె యన్న నసాక్షించి♦విన్నునాఁగ, సఖులు వెన్నునిగొలువంగ♦వచ్చు చివ్వ
కూటితనిసియుఁబలఁ గందు ♦ గొనబుమీఱఁ, జందురుం డల్లనల్లన♦చదలఁబ్రాఁకె.

యయాతిచరిత్రము, ఆ 2.

సీ. తనభానుసంతతి ♦ ధరమీఁదవెలయింప, భువిగాధిపతిగురు♦స్ఫురణఁ బెంప
రహిఁబొదమహిమచే ♦ తాతినాతినొనర్ప, నభవోగ్రధర్మమె♦ప్పారఁజేయ
మానితధరణిజా♦తానందమొనరింపఁ, బాంధరామాత్మద♦ర్పంబులడఁప
వనభూరికమలవ♦ర్గస్ఫూర్తి మాయింపఁ, జోరేశరూఢివ♦ర్ధన మొనర్పఁ
గీ. దేవలాయని గర్వంబు ♦ గానుపింప, సమధికపలాశపరిచక్ర ♦ సమితినొంప
నమితకువలయపరిపాల♦నమునగ మెలఁగఁ, దూర్పుదెసరామచంద్రుఁడు♦తోఁచెనపుడు.

కువలయాశ్వచరిత్రము, ఆ 4 పద్య 16.

మ. ఉదయంబందుచు నంబుజాసనతచే ♦ నొప్పెన్ సువర్ణద్యుతిన్
బిదపన్ సోముఁడు గాన శోభనరుచుల్ ♦ పెంపొందె నామీఁదటన్
గుదిగట్టించి సితేతరాంగుఁ డగుచున్ ♦ దోఁచెన్ విధుండోటఁ ద
ప్పదుమూర్తిత్రితయాఖ్యఁ దౌనసఁ డగం ♦ బద్మారి ప్రత్యగ్దిశన్. 1393

లక్ష్మీవిలాసము, ఆ 4 పద్య 18.1

చ. ఇనుఁడపరాంతదేశమున ♦ కేఁగినఁ డప్పతిఁ దాల్మి రాగియై
ఘనుఁడగు రాజు పద్మినిని ♦ గైకొనఁ గోరి కరంబు లాశఁ జా
చినదది మోము మోడ్చుటయుఁ ♦ జింతఁగుముద్వతి బిగ్గనవ్వినం
గనుఁగొని తెల్లబాఱెఁ నవఁ ♦ గైరవబాంధవుఁ డొప్పెఁ దూర్పునన్. 1394

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 44.

చ. నలినభవాండకోటగము ♦ నంగనుపట్టినయంతరిక్షమం
మొలుచు నననొనాయుయగు♦టగ బ్రికటాంకము నిలరళి గాఁ

గళలు కరాళజిహ్వికలు♦గాఁగ మదోద్ధతి నెత్తునట్టి ప్రి
జ్వలితమహాగ్నిబింబ మనఁగఁ ♦ జంద్రుఁడు తూర్పునఁ దోఁచె నెంతయున్. 1395
భానుమతీపరిణయము, ఆ 3 పద్య 14.

చ. కమలవిరోధి కామజయ♦కారి కరద్యుతికీర్తనీయుఁడున్
కుముదహితుండు కూటమృగ♦గోప్తకృతాంకుఁడు క్ష్మాప్తసత్కళా
కరుఁడును కేశవేక్షణము ♦ కైరవణీశుఁడు కోకభేదనా
గమనుఁడు కౌముదీకరుఁడు ♦ కంధిభవుం డుదయించెఁ దూర్పునన్. 1396

గీ. తారకారాజివాలంబు ♦ తారకిరణ, దామ మంకాచ్యుతప్రతి♦మా మహితము
కలువ ఱేఁడనువటువ్రవ ♦ గాలిపటము, సమయశిశువభ్రమధ్యత♦ల్పమున నాడె.
రాజవాహనవిజయము, ఆ 3 పద్య 18.

క. ఖగఖురకిరణస్ఫురణన్, బరితప్తంబైనజగము♦పైఁబీవఁగ నుం
దరరజనీకరమునఁదగు, నురటి యనన్ జంద్రుఁ దెలరెఁ♦జూపఱ కిమ్మై. 1398
విష్ణుమాయావిలాసము, ఆ 1 పద్య 203.

గీ. సరసమై తనుగంధని♦స్తంద్రి యగుచు, నురుతరంబుగ ఘనమార్గ♦యుక్తమగుచుఁ
దోరమైసకలామయ♦హారియగుచు, నొనరె నెంతయుఁ బూర్ణచం♦ద్రోదయంబు.
రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 3 పద్య 83.

చ. కలువలనిద్రలేపి రతి♦కాంతుని మాంద్యము వాపి పుష్కర
స్థలిఁ దిమిరంబుఁ జోపి రతి♦చాలని బాలల నూఁపి దేవతా
వలి కమృతంబుఁ జేపి యల♦వాసవదిక్సతికుండలంబునై
కలువఱేనిమండలము ♦ కాంతిలుచున్నది తూర్పుకొండపై. 1400
బిల్హణీయము, ఆ 2 పద్య 52.

సీ. భూనభోంతరములఁ ♦ బూర్ణిభవించుత,మంబుల నుచ్చాట♦నంబు చేసె
వసతులఁ మెలఁగుజీ♦వంజీవవిహగకై, దరిబరిబు నాకర్ష♦ణంబు చేసెఁ
గవగూడి చెలఁగు జ♦క్కవలకేళ్ళిడావిలా,సంబులు సంస్తంభ♦నంబు చేసె
సలిలమధ్యంబులఁ ♦ జెలువొందు కైరవా,రావంబులవశీక♦రంబు చేసె
గీ. నలినపంక్తిని విద్వేష♦ణంబు చేసెఁ, దమ్మిచేరాశకలమార♦ణమ్ము చేసెఁ
బొసఁగ వెన్నెలమంత్రవి♦భూతిఁ జల్లి, మహిమఁ జూపిసుధాకర♦మాంత్రికుండు.
అనిరుద్ధచరిత్రము, ఆ 3 పద్య 18.

మ. ఉదయోర్వీధరవన్యధైనవకరీ♦ఘౌఘుంబునం గూర్చి యం
దు దినాంతంబున నిష్టవర్యుఁడు నిజ♦ద్యోతాగ్నిరాఁజించి నె

చ్చఁదగన్నీసపుబిళ్ళజెండిగఁగొనన్ ◆ చాదొక్కమందాకుచే
వడనంబిండుచు నెత్తివిూటుగతి సా◆రంగాంకుఁ డొప్పెన్ వడిన్. 1402

పార్వతీపరిణయము, ఆ 5.

చ. తదనసరంబునందుబుధ◆దారకుఁ డా రజనీచరుండు సొం
పొదవఁగ మింటనుండి తన◆యుద్ధతిఁ జూపఁగ నేమిచెప్ప నం
గదనలమైంచవాలినుము◆ఖప్రముఖాగ్రహారవ్రజంబుమే
లుదనకుఁ గాంచరామిఁ దన◆లోఁ బనమాలి మునింగ నెంతయున్. 1403

లంకావిజయము, ఆ 2 పద్య 28[illegible].

ఉ. ఖ్యాతమహీధ్రసంగతప◆వాగ్నుల నిచ్చెనదీపముల్ చకో
రీతతి పేరఁటాండ్రు దివి ◆ జెక్కులు నీలపుపాత్రసేసఁబ్రా
లాతతరాత్రియన్ సరసి◆జాక్షివరింప గజాధిరోహణుం
డై తనరారె నాఁగ నుద◆యాద్రిపయిన్ శశిదోఁచె వింతగన్. 1404

చెన్నబసవపురాణము.

సీ. ఉదయించుచుండెడు ◆ నుడురాజబింబంబు, గళితాంశుకాననక్రమతఁ దనర
నింతారుతత్కాంతి◆నెమ్మేనలఁదిన, కుంకుమగండఁబు ◆ కొమరు దెలుపఁ
గలయంగ నించు చు◆క్కలునిక్కుకీల్కొప్పు, చిక్కుముత్తియములు◆చెలువుమీఱ
నంతకంతకుజాఱు◆నంధతమిస్రంబు, వీడెడు నునుసిగ్గు ◆ విధము గాఁగ
గీ. రజనిగనుపట్టెనతితృప్తిఁ◆బ్రజలుచూడ, పొసఁగనిడినట్టియామేలు◆ముసుఁగుజాతి
మోముగనుపట్టె నొకవింత ◆ గోము మీఱ, సిగ్గుచేఁ గొంకు నూతన◆స్త్రీవిధమున.

కిరాతార్జునీయము, ఆ 2 పద్య 135.

సీ. జలధినుప్పొంగించి ◆ జలరుహపంక్తుల, నీక్షించి నోళ్లమూ◆యించి మించి
కుముదసంతతులను◆బ్రమదంబు నొందించి, తొలఁగకశుభ్రకాం◆తులను బెంచి
విరహులనలయించి ◆ విరసముల్లలిగించి, చక్రవాకులవేడ్క ◆ లాక్రమించి
చీఁకటి గబళించి ◆ చిగురుటాకులదీప, ములమాడ్కి వెల్గించి ◆ మొనసిరోయించి
గీ. చలువచీరెలు సానుదే◆శముల నిండఁ, బఱచినటువలె వెన్నెలఁ ◆ బ్రబలఁ జేసి
పూర్వదిక్కాంత నీక్షింపఁ◆బొసఁగుకరణి, నరగవచ్చుచునుండెనా◆చంద్రుఁడంత.

వేంకటేశ్వరమాహాత్మ్యము, ఆ 5 పద్య 171.

ఉ. గౌరవకాంక్షినైన సమయ ◆ కాంచనకారుఁడు వాసవాజ్ఞఁ ద
న్నారికిఁ గొప్పిత్తిపొమ్మ్రుల నొ◆నర్పఁగ నిచ్చు పదాయునన్నెం

గారవుమమ్ముపూజెయన♦గాఁ బరిపూర్ణకళాభిరాముఁడై
కైరవబాంధవుండు వెలు♦గంగఁ దొడంగెను దూర్పుకొండపై. 1407

కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 169.

క. ఉదయాచలవల్మీకా,భ్యుదితసముదయభోగిభోగ♦మో యనఁ జందు్రం
డు దనర్చెఁ దత్కళంకము, మృదురుచియగుకృష్ణపాద♦మే కాదుగదా. 1408

కృష్ణాభ్యుదయము, ఆ 1 పద్య 169.

ఉ. సరతారాంబుకణాళివర్వఁగ నభో♦వారాశిఁ దర్వంగ శ్రీ
కరలీలాయుతిఁ బుట్టి ప్రాక్సితతరం♦గస్తోమమున్ బాయు నం
దరలక్ష్మీమణిపట్టుపాలముఖముల్ ♦ దళ్కొందుచున్ దోఁచె నా
హారిణాంకుం డుదయించె రేకయి సగం♦బై బింబమై తూర్పునన్. 1409

సుబ్రహ్మణ్యవిజయము, ఆ 5.

గీ. గగన మొప్పారె నీలోద♦కంబు కరణిఁ, దారకాప్రకరంబులు ♦ కైరవముల
పగిది విలసిల్లెఁ జంద్రుండు ♦ భాసమానుఁ,డగుచు హంసవిధంబున ♦ నలరెనపుడు.

గోపీనాథరామాయణము, సుందర.

గీ. గగనరమ లీలఁ దాల్చు న♦క్షత్రమాల, కతరునాయకవిస్ఫూర్తి♦యని సుపక్వ
కారకత్వముఁ గాంచి య♦క్కాలమట్లొ,నర్చె నన నట యోషధీ♦నాథుఁ డమరె.

సర్వకామదాపరిణయము, ఆ 2.

సీ. నూటు తొకులనవల్♦నోరు లెత్తఁగనోడె, నోలిఁ జెందొగచాన♦హోళిఁ గూడె
అంకులాఁడికి నెద♦జంకు నిండుగఁ దాకె, జేజేలకాఁకలి ♦ సిలుగు దీఱె
నెడకాండ్రితెగ గ్రచ్చు♦వెడలంగ నొచ్చెజో,ళ్లడయుదిట్టలదాఁటు♦లడలఁజొచ్చెఁ
నొల్లఁదిరేయెండ తొ♦క్కులదారిచొక్కెఁదే,రికలు తొక్కులదారి♦యొకట గ్రుక్కె
గీ. నేచి తెలిగంటియేనుఁగు ♦ నేలు నాటు, జిక్కెఁ దెగడుచునత్తొత♦చానకూన
దీటితిగకంటెనాతని ♦ తేరునూరు, నెనయుఁదళ్కులఁ జందురుం♦డొనరుటయును.

శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, ఆ 3 పద్య 8.

ఉ. వేఁడిని వీడువాఁడు విను♦వీథిఁ జరించెడువాఁడు గల్వలే
చేడియ మేలువాఁడు సర♦సీరుహగేహకుఁ దోడువాఁడు మున్
వాడనివాఁడు వాఁడికిని ♦ వాడనివాఁడు మనోజువాఁడికిన్
గూడెడివాఁడు వేల్పులకుఁ ♦ గూడసువాఁడు జనించెఁ దూర్పునన్. 1412

సావిత్రీపరిణయము, ఆ 4 పద్య 140.

మ. హరిణచ్ఛాయుఁడు తారలం దలఁచి సు◆వ్యామోహసమ్మోదముల్
బరగం దానుదయాచలం బనెడు క్రీ◆డాశైలపున్మెట్టులన్
వరుసం దప్పక యెక్కుచుండె నన బిం◆బం బత్తఱిన్ జూపడెన్
బరకై పాటికరైరి సగం బఖిలమై ◆ ప్రాగ్దిఙ్ముఖంబం దొగిన్. 1413

భరతాభ్యుదయము, ఆ 2 పద్య 65.

ద్విపద. సురరాజదేవిభా◆సురలీలతోను, ధరియించు కర్పూర◆తాటంక మనఁగఁ
గలువలునవ్వ జ◆క్కవలు చింతింపఁ, దలఁచుచు విరహులు ◆ తల్లడం బంద
ఘనతతోఁ బూర్వది◆గ్వామాక్షినొందఁ, జనుదెంచెనోయనఁ◆జంద్రుండుపొడిచె.

నలచరిత్రము, చ. రా. ఆ 1.

ఉ. చుక్కలఱేఁడు చీఁకటుల ◆ సూడు వెలుంగులఱేని జోడు బల్
జక్కవపుల్గుమొత్తముల ◆ సారెకు నేఁచెడువాఁడు చక్కనౌ
మిక్కిలి కంటికిం బేవగకు ◆ మేల్నగవై తగువాఁడు కల్వలన్
మక్కువఁ బ్రోచు ఱేఁడు మరు◆మామ కనంబడెఁ దూర్పుకొండపై. 1415

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 9.

---

# వెన్నెల.



సీ. గంగాప్రవాహంబు ◆ గాఁబోలునని పశిస్థాదు లనుష్ఠాన ◆ మాచరింప
నమృతంబువెల్లువ◆యని నిలింపాదులు, మునుకొని గోసిళ్ళ◆ముంచి క్రోల
దుగ్ధాంబునిధియని◆తోయజాక్షుఁడు శేష, పర్యంక మిడుకొని ◆ పవ్వళింపఁ
బరమేశు విశ్వరూ◆పంబని బ్రహ్మాదు, లమర దండప్రణా◆మములు సేయఁ
గీ. దలఁప భూనభోంతరముల◆కొలఁది దెలిసి, పెరసి యెన్మిదిదిక్కులఁ◆బొరలిపొరలి
దట్టముగ నంతకంతకుఁ ◆ దనరి తనరి, యిట్టులంబుగ వెన్నెల◆నిట్టవొడిచె. 1416

విక్రమార్కచరిత్రము, ఆ 6 పద్య 69.

ద్విపద. మనసిజాంపనియెడు ◆ మటుమాయదొంగ, జనులపై మంత్రించి◆చల్లినయట్టి
మోహనభస్మంబు ◆ మురువున విరహి, దాహకమైపర్వెఁ ◆ దఱచు వెన్నెలలు.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. ఆ 1.

సీ. తపసుకుసుమాళిఘు♦త్యాలమించుచు మించి, మెఱయుచుక్కలమేని♦ మెఱుఁగు దఱిమి
కలికిరాయంచ టెం♦క్కలఠేవ గెలువాడి, విరిమల్లెగుత్తుల ♦ మురువుఁ దెగడి
చదువుతొయ్యలిమేని♦చాయనుల్లస మాడి, వెలిదమ్మిమెఱుఁగడల ♦ తెలివి గెలిచి
జిగిమీఱుతొగటెక్కు ♦ సిరులకు నసమిచ్చి, పాపరాయనివన్నె♦తేపు చూపి
గీ. పాలమున్నీటితెరఁగల ♦ పసల నంది, కొండయల్లునిమైతెల్పు ♦ కొంచెపఱచి
కుప్పతిలుచుట్టుగొండపైఁ ♦ గొనలు సాఁగి, వెలఁదివెన్నెలతెల్లెడ♦ వెల్లివిరిసె. 1418
శ్రీరంగమహాత్మ్యము, భైర. క. ఆ 2 పద్య 255.

చ. అమృతరసంబుచేతసమ♦యంబనుసంయమి పూర్ణచంద్రబిం
బమను వినిర్మలస్ఫటిక♦పాత్రములోనఁ గళంక బాణలిం
గమునభిషేకముల్ సలుపఁ♦గాఁ బ్రవహించెననంగ నిండుబ
ర్వ మహీ నభోంతరాళమున ♦ వెన్నెల వెన్నెల నెల్లఁ గప్పుచున్. 1419
వరాహపురాణము, నం, మ. ఆ 4 పద్య 149.

మ. అమృతాఖ్యానసంగరాగ ముదయో♦ద్యత్కాంతి చేలంబుచి
హ్నమునుంగా శశి రేపతీరమణుఁ డు♦న్మాదంబుమీఱం దవో
యమున స్సంగము నొంది పాఱఁగ సీ♦రాలోడితం జేయఁ వ
చ్చె మరుద్వాహిని దానిఁ జేర్పనన మిం♦చెం జంద్రికాపూరముల్. 1420
గీ. తారకాధీశుకిరణక♦దంబకంబు, చిలికెఁ బలుచని వలివంపు ♦ జిలుఁగుమంచు
గైరవశ్రీవధూకర ♦ గ్రహణవేళ, వెలికిఁ గ్రిమ్మిన సాత్త్విక♦స్వేద మనఁగ. 1421
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 47, 48.

సీ. కలయ వెల్లువగట్టి ♦ జలజలఁ బ్రవహించు, శశికాంతవాంతని♦ర్ఝరము జలము
మలయానిలముచే దు♦మారంబు రేఁగు సౌ,గంధికంబురజంబు ♦ కలువదుమ్ము
నిండారవిరిసిన ♦ బొండుమల్లెలనుండి, పడియు మరందంబు ♦ గుడగసంబు
తొలఁకి మింటికిఁ బొంగు♦దుగ్ధపాథోరాశి, కరడులమీఁది మీ♦గడల మెఱుఁగు
గీ. తనకు రసవర్గములుగా సు♦ధాకరుండు, సారెసారెకుఁ గరములు ♦ సాఁచిచాఁచి
యచ్చదెలుపుగ నప్పుడు బ్ర♦హ్మాండమండ,పంబు వెన్నెల సన్నసు♦న్నంబు సేసె.
మనుచరిత్రము, ఆ 5 పద్య 38.

సీ. మిత్రాధికారంబు ♦ మీఱరాదనికాక, వెసఁ బట్టపగలుగా♦వింపలేదె
మ్రాఁకులకింది సో♦మరులెంతయనికాక, మలసి నీడలరూపు ♦ మాపలేదె
బాడబాక్షేపపా♦పమున కోపకకాక, యౌర్వాగ్నినైనఁ జ♦ల్లార్పలేదె
రాజకాంతాకృతి ♦ ప్రతిసన్నమనికాక, శిలలెల్ల సరసము♦ల్సేయలేదె

గీ. జగతినిదియనిజగములు♦వొగడనెగడె, హరునితలయెక్కి వెలిదమ్మి♦నదఁగఁద్రొక్కి
కలశవారాశి నెమ్మెనఁ♦గలయఁద్రొక్కి, కుముదరుచినేలెఁ గౌముదీ♦సముదయంబు.

వసుచరిత్రము, ఆ 4 పద్య 22.

చ. తెలయను వెండికుండఁగడు♦ నించి నిశాఖ్యచకోరనేత్రి యిం
పలరఁగ నంబరాహ్వయమ♦హానటమూర్తి మహాభిషేకమున్
జలుపఁగ నెల్లదిక్కులవె♦సం బ్రవహించెడు పాలవెల్లినాఁ
బొలిచె సమస్తముం జలువఁ ♦ బొంద నమందతసాంద్రచంద్రికల్. 1424

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 125.

అతనుఁ డనుదొంగ విరహుల, యతులితనిజమానధనము ♦ హరియించుటకై
క్షితిపైఁ జల్లిన మంత్రి, స్వతభూతిప్రభ లనంగ ♦ వెన్నెల లెసఁగెన్. 1425

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 70.

సీ. బలిధామమెనసినఁ♦బట్టిబంధింపదే, చీకటిదళమేది ♦ చెదరెఁ గాక
యడవులుబలసిన ♦ నడఁపదే పీడ ప్రకంపనాకులవృత్తిఁ ♦ గాంచెఁ గాక
రాజు చేరినఁ గాప♦రముమాన్పదే యంక, మవినిశ్చితాకృతి ♦ యయ్యెఁ గాక
దుర్గేశుఁ డంటినఁ ♦ దునుమదే యలకప్పు, మదమేదికదలక ♦ యొదిగెఁగాక
గీ. రోచనీపూర్వదిక్పుహాద♦రోచమాన, విమలధారావిశేషమై ♦ వెలయుదీని
మహిమచేఁ దూలవెయ శేష ♦ మలినగుణము, లనఁగ వెన్నెలజగమెల్ల♦నాక్రమించె.

చంద్రభానుచరిత్రము, ఆ 4 పద్య 78.

క. సురలకిడి ధరణిసురలకు, వెరవున నిడకున్నఁ బ్రజలు ♦ ద్విజరాజికొఁగిం
బరుఁ డనఁ గని ద్విజులకు సుధ, విరివెన్నెల గురిసె ననఁగ ♦ వెన్నెల బర్వెన్.

రాజవాహనవిజయము. ఆ 4 పద్య 43.

చ. శమనుని దుంతఁబట్టుకొనె ♦ శశిరుఁడు దా వెలియేనుఁ గంచు వే
గమునఁ బురారినందియని ♦ గాడుపునెచ్చెలి మేఁకపోతుపైఁ
దమకముమీఱ నెక్కె నల♦ధాతి కుమారుని నెమ్మిఁ గాంచి హం
సముగఁ దలంచె సాంద్రతర ♦ చంద్రికలోకము లెల్లఁ గప్పటన్. 1428

రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 3 పద్య 86.

క. ఇందీవరబంధుండా, నందము డెందమున నెనయ ♦ నవ్వుచు రజనీ
సుందరి మేన నలందిన, చందనగంధం బనంగఁ ♦ జంద్రిక మెఱసెన్. 1429

సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 70.

గీ. సమయగోపాలకాగ్రణి ♦ చదలుచేరి, సురభిజాబిల్లిపొదుపునఁ♦గరమెసంగు
విమలచంద్రికాదుగ్ధపూ♦రములు పిదికి, ఘనతరచకోరవత్ససం♦ఘముల మనిచె.
శకుంతలాపరిణయము, పె. నా. ఆ 2 పద్య 190.

గీ. చంద్రతారాకపాలభూ ♦ షణములమరు, హరుని శిరముననుండి సా♦గరము చేరు
నల్లగంగాప్రవాహతో♦యములపగిదిఁ, బండువెన్నెల దివినుండి ♦ నిండె జగము.
వేంకటేశ్వరవిలాసము, ఆ 2 పద్య 65.

సీ. కొమ్మలకై మేలి ♦ సొమ్ములకై పోవు, జారచోరులకిది ♦ మాఱుతల్లి
తముఁబాసి పతులన్య♦తరుణులఁ జెందినఁ, గనలొందుసతులకుఁ ♦ గన్నమాత
జారిణీజారులఁ ♦ గూరుప మదిఁ గోరి, మెలఁగు దూతికలకు ♦ మృత్యురాత్రి
యిక్కట్ల నెక్కుడు ♦ రొక్కము గలిగిన, పెనుధనికాళికిఁ ♦ బెండ్లివేళ
గీ. పణ్యరమణీజననిమనో ♦ భయవిధాయి, పనులఁజరియించువారికి ♦ భాగ్యలక్ష్మి
హీనదీపాలయులకు ల♦క్ష్మీనిధాన, మగుచు జాబిల్లివెలుఁగవ్వ♦డలిశయిల్లె. 1432
గణోదయము, ఆ 2 పద్య 14.

సీ. ఇవిగదా సొబగుల ♦ నెసగించునట్టుచిం,దమ్ముల కష్టహా♦రమ్ము లయ్యె
నివిగదా గబ్బిపా♦లిండ్లగుబ్బలులకు, గంధసారస్థాస♦కంబు లయ్యె
నివిగదా కెంజాయ♦లీనెడునడుగుఁద,మ్ములకుహీరాశ్మనూ♦పురము లయ్యె
నివిగదా పొంజిగి♦నింపులువచరించు, మైదీవియలకుక్షౌ♦మంబు లయ్యె
గీ. నివిగదా నీలిడాలుచే ♦ నిరులు కొలుపు, కొప్పుమొయిలకుమల్లికా♦కుసుమములయ్యె
ననుచు జ్యోత్స్నాభిసారికల్ ♦ వినుతిఁజేయఁ,బండువెన్నెలతేఁరగలు♦నిండెదిశల.
సుమనోమనోభిరంజనము, ఉల్లాస 5 పద్య 50.

గీ. కటికచీకటులనుభూత♦గణముమీఁద, జందురుండనుమాంత్రిక ♦ సాహసుండు
జల్లు వీభూతియనఁ బ్రజ♦లుల్ల మలరఁ, బండువెన్నెలదిశలెల్ల ♦ నిండుకొనియె.
సౌగంధికప్రసూనసంగ్రహము, ఆ 1.

గీ. పూర్వభూధరశిల్పియ♦ఖర్వకర్పు, రాండసౌధదిశాకుడ్య ♦ కాండమున ను
ధాకరఘటంబుచేఁబూని♦యందులోఁ ద,నర్చు వెన్నెల పాలను♦న్నంబొనర్చె.
సర్వకామదాపరిణయము, ఆ 2.

సీ. వనజారియుదయించు♦టనుబొంగిపొరలిజా,ల్గొనుపాలకడలివె♦ల్లువ యనంగ
విధుమండలంబను ♦ విరిగుత్తినుండి వె,ల్వడి క్రిమ్మకొనెడుపు♦ప్పొడి యనంగ
యామినీకాంతకై ♦ సోముండుచల్లిన, పటవాసధూళికా ♦ పటల మనఁగ
శారదబ్జముఖులు సొం♦పలరఁ దాల్చినమంచి, చలువవలువలుంగుల ♦ చెలువ మనఁగ

గీ. హారసీహారహీరమం♦దారకుంద, శరశరత్కాండచంద్రసుం♦దరత మెఱయఁ
బండువెన్నెలజగమెల్ల ♦ నిండి పిండి, యారఁబోసినకరణి నిం♦పారు చుండె.
నయనోల్లాసము, ఆ 3 పద్య 105.

గీ. అపుడుద్విజకోటిపస్తుండె ♦ ననుచు నాత్మ, నెంచితదధీశ్వరుండుచే♦యుంచి భూవ
భోంతకటమునఁ బోయించి ♦ నట్టికుసుమ, బియ్యపుఁబ్రసాదమో యన♦వెన్నెలలరె.
భరతాభ్యుదయము, ఆ 2 పద్య 190.

సీ. నెఱతావులు చెలంగ ♦ నిండారవిరిసిన, మల్లెపూవులతోడ ♦ వెల్లి విరిసి
కప్పురంపుటనంటి ♦ విప్పుఁబొరలరాలు, కపురింపుఁబొడితోడ ♦ గలసి మెలసి
కమ్మవిల్తునిదాయ ♦ కాఁపురంబైతగు, వెలిమల జిగితోడ ♦ వియ్యమంది
కలిమేల్పునిల్లా♦లిఁగని పెంపుఁ గాంచిన, పాలమున్నీటితో ♦ మేలమాడి
గీ. నిండికొనియుండె భువినిండ ♦ వెండికొండ, కొండపిండులఁజెండెడు♦పిండిపాతి
పిండికలకండ పలిఁదమ్మి ♦ దండదగడి, పండురేయెండదండులు ♦ నిండుజిగిని.
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 13.

---

# వసంతర్తువు.



లయగ్రాహి. కమ్మనిలతాంతముల♦కుమ్మొనసివచ్చు మధు, పమ్ములను గీతనిన ♦ పమ్మె
దెసఁగంజూ
తమ్ముల లసత్కిసల♦యమ్ములసుగంధివకు, ళమ్ములను నానుచును♦దమ్మొనసగానా
లమ్ములగు కోకిలకు♦లమ్ములరవమ్ము మధు, రమ్మగుచు వీచె నని♦శమ్ము సుమనోభా
రమ్మునసశోకనికి♦రమ్ములసుజంపకచ, యమ్ములనుగింశుకప♦నమ్ములనునొప్పెన్
భారతము, ఆది. ఆ 5 పద్య 138.

సీ. కమనీయకమలినీ♦కల్లోలవీథులఁ, గదలురాయంచల ♦ గతులయొప్పు
బహుళపుష్పపల్లవ♦పరికరచిత్రితములై, తనరారు తరులతా ♦ తరులసొంపు
మకరందరసపాన ♦ మసృణలోలంబులై, క్రాలెడిఱెలఁదేఁటి ♦ గములయొప్పుఁ
పరిపక్వమంజుల♦ఫలరసాస్థలములై, పలుపలుచిలుకల ♦ పటురవంబుఁ

ఆ. ప్రియుఁడు వేఱువేఱఁ ♦ బ్రీతిమైఁ జూపుచుఁ, జెప్పుచును జనంగఁ ♦ జిగురుఁబోఁడి
కనుచు వినుచు నిర్వి♦కారసల్లాపంబు, లార నతని తెఱఁగు ♦ సరయుచుండె.
భారతము, అర. ఆ 7 పద్య 212.

ఉ. పల్లవపుష్పసంపదలఁ ♦ బంచి వసంతుఁడు కాఁపురాకకై
యెల్లవనంబు సంకటము ♦ లేదఁగఁ దారొడికంబుమీఱ న
ల్లల్లనఁ గ్రోలికోకిలమల♦యానిలుఁడందుఁ బురాణపత్త్రముల్
దుల్లగఁజేసె సత్క్రియఁ బ♦టుత్వము కాముఁడు పెచ్చెలింపఁగన్. 1441
విజయసేనము.

ఉ. చిలుకలపిండునొప్పిదము ♦ చిత్రనురాయుధలీల యేపునం
జెలఁగు మధుప్రతానవలుల ♦ చిక్కనిమ్రోఁతను గర్జలుల్లస
త్ఫలరసపూరముం దెరలఁ ♦ బర్వుట సొదులుగాక మేఘపం
క్తులక్రియనొప్పుభూరుహత♦తుల్ మధువేళఁ బయోదవేళలన్. 1442
నృసింహపురాణము, ఆ 2 పద్య 72.

చ. వననివహంబులెల్ల మృదు♦వల్లుల నామృదువల్లులెల్ల లే
గొనలఁ దనర్చు లేఁగొనలు ♦ గుత్తుల గుత్తులు లేఁజిగుళ్ళఁ బెం
పొనరుచిగుళ్ళఁ గ్రొవ్విరులఁ ♦ బొందగుఁ గ్రొవ్విరులెల్లఁ దేఁటులన్
మునుకొను తేఁటులెల్ల నను♦మ్రోఁతల నెంతయు నొప్పె నామనిన్. 1443
కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 47.

సీ. కామినీగండూష ♦ కాదంబరీధారఁ, బులకించె సారామ ♦ భూమిఁ బొగడ
చివురాకుచవిమాఁచి ♦ చవిచూచి యెలుఁగించెఁ, బంచమస్వరమునఁ ♦ బరభృతంబు
సంఫుల్లకోరక♦స్తబకోచితంబైన, కొరవిపై భ్రమయించెఁ ♦ గొదమతేఁటి
పరిపక్వసహకార♦ఫలరసాస్వాదన, ముదమునం గీరంబు ♦ చదువఁ దొణఁగె
గీ. పటపటీసముదయములు ♦ వివిధవిధుల, నుపవనక్రీడసల్పిరి ♦ యుబ్బు మిగిలి
యఖిలజనులకు సంతోష ♦ మావహించె, మాసరములైన మధుమాస♦వాసరములు.
శివరాత్రిమాహాత్మ్యము, శ్రీనాథ. ఆ 3 పద్య 118.

సీ. ముక్తపత్రవ్యాజ♦మునఁ జీరసడలించి, కళికలన్బులకలఁ ♦ గలుగఁజేసి
పొలివోనితావులఁ ♦ బూలదండలఁ జుట్టి, కడలేనిమధుసాత్త్వి♦కమునఁ దేల్చి
రఁపళిఝంకార♦మణితముల్ ఘటియించి, దీపిచక్కోరలూను ♦ మోవి యాని
సరసినున్నతఫల♦స్తనములఁ గబళించి, కళి దేఱుతనుపల్లిఁ ♦ గౌఁగిలించి

గీ. కలికిరాచిల్కపల్కుప♦ల్కుల నలర్చి, సురభికస్తూరిరజములు ♦ సొంపొసఁగ
కలితవనలక్ష్మిఁ గూడి రా♦గమువహించె, మాధవుఁడుహృష్టనిఖిలజ♦మాధవుండు.

పంచతంత్రము, బై. వేం. ఆ 3.

చ. ప్రియపరిరంభణప్రథిమ ♦ పెల్లిఁకఁ జైత్రుఁడు వచ్చి చేయుఁ గా
వ్యయమని సీతునందచెలు♦వల్పెడపుల్లదుపంగవచ్చెఁ దా
రయమునఁ బేర్చి యాఋతువు♦రాఁ జలివిచ్చితొలంగిరయ్యర
ష్ఠయుచితమేకదా విపది♦ధైర్యమనం జనుమాట యింతకున్. 1446

ఉ. కుప్పసముల్వదల్చి రతి♦గుబ్బలనొత్తిలి హత్తి వేఁగుబా
మిప్పలలగ్చుగాడ్పుల క♦ధీశుఁ గ్రమంబున ఘర్మశంకమై
నుప్పతిలంగ దోమతెర ♦ లుప్పరమెత్తిరి దక్కరూపత్రము
ద్దెప్పరమైనలోహశక♦లీప్రకటీకరణంబుఁ గామినుల్. 1447

ఉ. నైపుణిఁ జందనాద్రిగహ ♦ నద్రుమసౌరభవీచిఁ దామ్రప
ర్ణీపరిలబ్ధమౌక్తికమ♦ణిప్రకరంబులు గోఁచి దక్షిణా
శాపవనుండు సల్లుడెదఁ♦జల్ల జనించెన కాక వీనిచే
లాపాడమంగనప్పొలప ♦ మప్పుడునా వనిఁదోఁచెఁ గ్రొన్ననల్. 1448

ఆముక్తమాల్యద, ఆ 5 పద్య 99, 104, 114.

సీ. సానదేటిపోటమరిం♦చి నెటివాసినయట్టి, యాకురాలుపుగండ్ల♦యందుదొలఁగి
యతిబాలకీరచ్ఛ ♦ దాంకురాకృతిఁ బోల్చి, కరవీరకోరక ♦ గతిఁ గ్రమమున
నరుణంపుమొగ్గలై ♦ యరవిచ్చిపికిలియోఁ, కలదండలట్లుగు♦పులయి పిదప
శేఖులేర్పడఁగ వ♦ర్ధిలి నెడలై వ్రేమ్మ, పసరువాఱుచు నిక్కఁ ♦ బసరుకప్పు
గీ. పూఁటపూఁటకునెక్కఁగ♦ప్పువకుఁదగిన, మెఱుఁగుదాన్చాఁటికినిమీఁద♦గిజికొనంగ
సొగసైయాకువాలంగ♦జొంపమగుచుఁ,జిగురుఁదళుకొత్తెఁదరులతా♦శ్రేణులందు.

మనుచరిత్రము, ఆ 6 పద్య 27.

చ. ధవునిసమాగమంబున ను♦దారతదిష్టవశాప్తిఁ బూనిచి
త్రవితతభూషణాళులను ♦ దాల్చెవెసం జిగిరించె నట్లు మా
ధవునిసమాగమంబున ను♦దారతదిష్టవశాప్తిఁ బూని చి
త్రవితతభూషణాళులను ♦ దాల్చెవెసం జిగిరించెవృక్షముల్. 1450

ఉ. మాధవుశాసనంబునను ♦ మాద్విజముఖ్యఫలప్రదాత్రియై
తాధరణింజెలంగుగతిఁ ♦ ధడ్డ వనీరమయొప్పె!యప్పుడా

మాధవునాజ్ఞసద్ద్విజస♦మాజమునందు ఫలప్రదాత్రియై
తాధరణింజెలంగెను సు♦ధారససత్ఫలవృక్షరాజియై. 1451

సకలకథాసారసంగ్రహము, ఆ 3.

సీ. తరుణారుణాంశుబిం♦బురరసాలకిసాల, పటలివక్షఃకౌస్తు♦భంబుగాఁగ
సౌవర్ణవర్ణభా♦స్వత్కర్ణికారాభ, రమణీయహేమాంబ♦రమ్ముగాఁగ
వికసజ్జపానవీ♦నకనద్ద్యుతిస్ఫూర్తి, కురువిందకోటీర♦గరిమగాఁగ
నతికోమలశ్యామ♦లాంచత్తమాలవ, న్యారుచి నెమ్మేని♦సౌరుగాఁగ
గీ. సంతతశ్రీసమాయుక్త♦సహజలీల, మదనజనకత్వనిజమహా♦మహిమ వెలయ
సర్వదిక్పూర్ణసువిలాస♦సరణి మెఱయ, మాధవస్ఫూర్తి చూపట్టె♦మహినిరహిని.

ఇందుమతీపరిణయము, కు. భూ. ఆ 2 పద్య 42.

సీ. లలనాజనాపాంగ♦వలనావసదనంగ, తులనాభికాభంగ♦దోఃప్రసంగ
మలసానిలవిలోల♦దళసాసవరసాల, ఫలసాదరశుకాల♦పనవిశాల
మలినీగరుదనీక♦మలినీకృతధునీక, ములినీసుఖితకోక♦కులవధూక
మతికాంతసలతాంత♦లతికాంతరనితాంత, రతికాంతరణతాంత♦సుతనుకాంత
గీ. సుకృతకామోదకురవకా♦వికలవకుల, ముకులసకలవనాంతప్ర♦మోదచలిత
కలితకలకంఠకులకంఠ♦కాకలీవి, భాసురము వొల్చు మధుమాస♦వాసరంబు. 1453

వసుచరిత్రము, ఆ 1 పద్య 126.

సీ. చైత్రికుండై రాగ♦సామగ్రి నెఱపి త, పస్యాంతమై ఫల♦ప్రాప్తి నడరి
మధువై నవామోద♦మహిమఁ దార్కొని కాల, గురుడై యశేషాధ్వ♦గులఁ గలంచి
సుమనఃపవిత్రాతియై♦శుకలీలఁ దనరి మా, ధవుఁడై వలాశభే♦దన మొనర్చి
యామినిరాయై భూజ♦నైకదుర్గతిఁ బాపి, సురభియై హరిహయ♦స్ఫురణ మెలఁగి
గీ. సారసవనప్రియోక్తయై♦సకలవిప్ర, వరశుభప్రదనానాస♦వములఁ జెనఁగి
యవని నలరె వసంతమ♦త్యంతమధుర, పంచమస్వరపూర్ణతా♦భవ్య మగుచు. 1454

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 86.

సీ. అలమింటఁ జెలఁగు రా♦చిలుకలచాలుపుల్, వేలుపుమన్నని♦విండ్లుగాఁగ
బూఁదేనియలఁజాలఁ♦బొదలు తేఁటులమ్రోఁత, రహిమించు నులుములా♦రవలిగాఁగ
మూఁకలై పొడమైన♦చీఁకటిమ్రాఁకుల, చొళ్ళు గార్కొన్న మొ♦గుళ్ళుగాఁగ
తెలుతురీయకఁబాఱు♦విరిదేనియలసోన, వదలక కురియుచు పెన్♦వానగాఁగ

గీ. వేడుకలుమీఱఁ దోఁటల♦నాడు కొమరు, వెలఁగుతెల్లనుమెఱుఁగుడీ♦పియలుగాఁగ
గ్రమ్మ యుప్పొంగుచునుదోలి♦కొరువోలె, వలపునెఱపుచునామని♦పొలుపుమీఱె.

యయాతిచరిత్రము, ఆ 4.

చ. జలనముపాదునీటఁ దము♦సంతతమున్ మునుపుచ్చుకున్నయ
ప్పులకయి యడ్డగింప ఫల♦పుష్పము లయ్యెడలేమి లేమివా
టిలి గతిలేక పత్త్రములో♦డెన్ తరుకోటియనంగ సంతతా
నిలహతిపండుటాకుగమి ♦ నిండెనభోంగణసీమ నామనిన్. 1458

చారుచంద్రోదయము.

సీ. అచ్చంపులేఁజిగు♦రాకుజొంపముకెంపు, మేలిచెందిరపుఁగెం♦ధూళిగాఁగ
గ్రుచ్చినట్లుగజాఁదు♦కొన్నమొగ్గలగుంపు, ప్రకటపాటలబిందు ♦ పాళిగాఁగ
విచ్చినపరువంపు ♦ విరులతండముపెంపు, శోభితభూతిరిం♦ఛోళిగాఁగ
నిశ్చలంబైన తే♦నియవానజడిసొంపు, లాలితదానధా♦రాళిగాఁగ
గీ. నునుపరాగముల్క్రాలిపా♦నుపులుగాఁగ, భ్రమరపంక్తులు పైపర♦చణాలుగాఁగఁ
బుడమి నెల్లెడ వాహ్యాళి ♦ వెడలుమదను, మడపుటేనుఁగుఁబోలెనా♦మనిదనర్చె.

రాఘవపాండవీయము, ఆ 2 పద్య 5.

సీ. చిలుకబాపనకొలం♦బులబందుగులకెల్లఁ, గలితామ్రఫలకోటి♦గ్రాసమొసఁగు
నెలదేఁటిరాచగుం♦పులచుట్టములకెల్లఁ, బలుకుదేనియపల్లె ♦ బట్రిలొసఁగుఁ
జలిగాడ్పుకోమటి ♦ చాలుసజాతీయ, ములకుఁ దావులసంచి ♦ మొదలొసంగుఁ
గోయిలనాలవ♦కొలముదాయాదుల, కోలుకోఁ జిగురాకు♦నేలయొసఁగు
సీ. కొమ్మలునెలఱ్ప సాలజా♦లమ్ములోనఁ, జిలుకసాంబ్రాణితేజీవ♦జీరుఁ దనుప
దాశేమున్న వసంతుని ♦ రాణ లెల్లఁ, గన్నుగప్పెడు కడుపుంజి♦గనుటకతన.

కువలయాశ్వచరిత్రము, ఆ 3 పద్య 98.

గీ. బలుగుబ్బగుత్తుల♦పైరజంబులురాలఁ, జిలికినకస్తూరి ♦ చెలువుమీఱ
మెఱుఁగారుకొదమతు♦మ్మెదరొదల్ నిగుడంగ, ననతేనెచెమటసో♦నలుచెలంగఁ
గమ్మనియూర్పులేఁ ♦ దెమ్మెరల్ వీడలంగ, వికసితనవపత్త్రి ♦ విధము లెసఁగ
లలితరత్నకనకాప♦ఘులు పెనఁగొనియుండఁ, బారావతధ్వని ♦ పంతమెఱయఁ
గీ. దళుకుఁగెమ్మావిపంటరే♦ఖలు దలిర్ప, భుజలతాలింగనంబునఁ ♦ బొసఁగమదన
కేళిసల్పును వనదేవ♦తాలతాంగి, శుభమెలర్పవసంతవ♦ల్లభునిఁగూడి. 1459

భానుమతీపరిణయము, ఆ 2 పద్య 38.

గీ. పరగవిటపాళిఁగూడియు ♦ బహుపలాశ, మయ్యునెంతయు బహుకోశ ♦ హారియయ్యు
భూజసంఘంబు సుమనోవి ♦ భుత్వమొందె, నహహ మాధవసేవని ♦ రర్థమగునె. 1460

చమత్కారమంజరి, ఆ 1 పద్య 46.

శా. శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనో ♦ వ్యాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నవ్యహావనివిభుం ♦ డై మాధవుం డొప్పె నో
శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనో ♦ వాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నవ్యహావనివిభుం ♦ డై మాధవుం డొప్పఁడే. 1461

ముకుందవిలాసము, ఆ 1.

ఉ. తావులవెంబడిం గదలి ♦ తారకఁ నేఁ దేఁటులు తేఁటి కొక్కలన్
తోపక నాకెఁ బుప్పొడియుఁ ♦ బుప్పొడితోఁ దగెఁ బూవుసోనయా
పూవులసోనతో మిగులఁ ♦ బొల్చెను గల్పతరుప్రసూనమా
ధ్వీవిసరంబు నావెనుక ♦ వీచెను జల్లని కమ్మతెమ్మెరల్. 1462

సత్యభామాసాంత్వనము, ఆ 2.

సీ. నవజాతవివిధప ♦ ల్లవజాతరుచివిలా, సము పల్లజడలకెం ♦ జాయ గాఁగ
నుదనభ్రమత్సంభ్ర ♦ మదమరీచిచయంబు, గళహాలహలకాంతి ♦ కలన గాఁగ
ప్రత్యగ్రవిలసిత ♦ ప్రసవోచ్ఛలచ్ఛాయ, మహితవిగ్రహపాండి ♦ మంబు గాఁగ
నమితమరందపూ ♦ రములయాసారంబు, పటుదయాపరుషవి ♦ భ్రమము గాఁగ
గీ. వంచితారామలక్ష్మిని ♦ త్యానపాయి, భూమిధరరాట్కుమారీల ♦ లామ గాఁగ
సకలభువనజనానంద ♦ జనకుఁడైన, మాధవుఁడు మాధవుని పోల్కి ♦ మహిమఁ దనరె.

సీమంతినీకళ్యాణము, ఆ 2.

చ. చిగురులచాలు డాలు పెను ♦ చిచ్చులకన్నుగఁ బుష్పరాశియ
త్తొగ చెలికానిబాగులుగఁ ♦ దోరపుఁదీవెలు పాపపేరులై
తగ నెలఁదేఁటిపిండు మెడఁ ♦ దాల్చినకప్పుగ నీశుపోల్కిఁ బెం
పగుపనరాశిమాధవస ♦ మాగమలీల వహించె భూస్థలిన్. 1464

నలచరిత్రము, సి. ధ. ఆ 3 పద్య 196.

సీ. ధళి పొండుపత్త్రౌఘ ♦ ములు నేలకుఁ డొలఁగ, ఘనవనప్రియలీల ♦ కడు వెలుంగ
జాగురే వేమారు ♦ శరములు వికసింపఁ, గువలయంబొకవింత ♦ కొమరుఁ గాంచ
శాపురే యొంటయే ♦ ర్పడ లోకమొలపొంద, వనిసారసవనంబు ♦ పెనుపుఁ జెంద
జయ్యారె పక్షికసం ♦ హతి పటంకఁ దొడంగ, నిలఁ దోఁపుఁబచ్చదం ♦ బులు చెలంగ

గీ. గనదమితజాతివిస్ఫూర్తి ♦ కతకుఁబాయ, బుతమిఁగనుపట్టెమిగులస ♦ ద్భుతమొనర్చెఁ
జారుతరమూర్తి సకలర్తు ♦ చక్రవర్తి, మధుఁడుం తనయందు సకలర్తు ♦ మయతఁదోఁప.

చంద్రాంగదచరిత్రము, ఆ 4 పద్య 72.

గీ. పవనదుశ్శాసనుఁడు వనీ ♦ పాండవేయ, లలనజీర్ణచ్ఛదాంశుకం ♦ బులంహరింపఁ
గలికిశుకసూక్తిఁ జీరఁగి ♦ సలయహేతు, మయపటములీఁ డెయయ్యెడ ♦ మాధవుండు.

సీ. శుకనాదములు ద్విజ ♦ శ్రుతిఘోషములు గాఁగఁ, గనకకోరకముల ♦ క్షతలు గాఁగఁ
దేఁటిపాటలు పురం ♦ ధ్రిగీతములు గాఁగఁ, గిసలముల్ తోరణ ♦ విసరములుగఁ
బలుకప్పురంపుఁది ♦ ప్పలు వితర్దులు గాఁగఁ, బుప్పొడుల్వాలిగంధ ♦ పొడులు గాఁగఁ
జలిమొల్లమొగ్గచా ♦ ల్పులు తలఁబ్రాలుగాఁగ, విరితీగెపొదలు మం ♦ దిరులు గాఁగఁ

గీ. బుష్పితపలాశనికురంబ ♦ ములు నివాళి, పళ్లెములు గాఁగ నిర్భర ♦ పవనచలిత
తరురవంబులు భద్రవా ♦ ద్యములు గాఁగ, వనవధూమణిఁ జైత్రుఁడు ♦ ద్వాహమయ్యె.

రసికజనమనోభిరామము, ఆ 2 పద్య 10, 14.

సీ. గున్నలేమామిడి ♦ గుంపులచిగురాకు, గాసంపుగమికి తన్ ♦ ఖా లొసంగి
పూఁబొదల్ విరిదేనె ♦ పొట్టజీతంబుల, నల్లమూఁకకు మొకా ♦ బిల్లచేసి
పరువంపుదాడింబ ♦ తరువులఫలలాభ, కారిశూరులకుజా ♦ గీరు లొసఁగి
ఫ్రావృపుప్పొడిదిన్నె ♦ తావులెల్లను సదా, గతివేగరులకు ఖి ♦ ల్లతులుజేసి

గీ. యొక్కమొగిఁ దసపౌజులు ♦ పిక్కటిల్ల, గ్రొత్తపూగుత్తికత్తిచే ♦ హత్తి విరహి
-చిత్తవృత్తులడంప దం ♦ డెత్తివెడలె, కంతుఁడు ద్వ్యాలీల వ ♦ సంతవేళ. 1468

తాలాంకనందనీపరిణయము.

సీ. కుంజఘనాఘన ♦ కోరిడగళతోర్కాగ, కనికోయపటుకర ♦ కానికరము
తెరుసుమాగ్రివనీప ♦ తన్మధూళితపర్ణ, కలికొతసుమగజ ♦ కర్దమంబు
అరుణకిసాలశం ♦ పాలోకననికృత్త, విరహిణీచిత్త న ♦ క్రీకరంబు
నానాప్రసవమాలి ♦ కానగారిశరాస, గటపటీరమమయు ♦ స్వాంబు

గీ. కోకిలకుహూగ్రవజ్రని ♦ ర్ఘోషదళిత, మాలతీస్వచ్ఛతగుగుచ్ఛ ♦ మత్తహంస
కంబయి చెలంగె వస్తద్రు ♦ కరణిబుతుల, మానరంబగు వాసంత ♦ వాసరంబు. 1469

మిత్రవిందాపరిణయము, కుం. వేం. ఆ 2 పద్య 75.

సీ. శిశిరర్తు గెలిచి ని ♦ క్షిప్తతద్ధన మెత్తెఁ, గనుపట్టు పద్మరా ♦ గంబులనఁగఁ
దద్బలంబులఁ గొట్టె ♦ తటిమిమేనులుదుల్చి, మైకొన్నబంగారు ♦ దూకలనఁగ
తనభుజాభుజగతం ♦ తన్యమానంబులై, గాలిప్రతాపాగ్ని ♦ కీలలనఁగ
తనమీఁద వనదేవ ♦ తలు జల్లనెల్లెడఁ, దగుకుంకుమవసంత ♦ ధారలనఁగ

గీ. విరహిసైన్యపుటఁజొత్తిల్లు ◆ శిరసులనఁగ, నరుణతరుణప్రవాళంబు ◆ లచటనచటఁ
గ్రమ్ముచుఁదుఱుంగాఁజూనిండోలగంబుఁజేసె, మదనసేనాధిపత్యసం◆పదలువొదలి.

సీ. ధరములనునట్టిపచ్చరా◆తట్టులందు, మొగ్గముత్యపుస్వస్తికం◆బులుఘటించి
తలిరుశోతు లమర్చి మా◆ధవునిఁగూర్చి, తీగయొలనాఁగ లారతుల్◆ద్రిప్పిరపుడు.

కార్తికమాహాత్మ్యము, ఆ 4.

శా. అంత న్బ్రాంతవనాంతకాంతరకృతాం◆తాశాంతవాతాంకురా
హంతాక్రాంతనితాంతతాంతమృదువృం◆తానంతసంతానశా
ఖాంతర్దంతురకాంతపల్లవలతాం◆తాలోకచింతాకన
త్కాంతాస్వాంతము వింతవింతగ వసం◆తం బెంతయుం బొల్చెనన్. 1472

యాదవరాఘవపాండవీయము, ఆ 2 పద్య 7.

మ. కమలామోదముసంఘటించి శుకవా◆క్యంబర్థి నాలించి యా
సుమనఃకాండము లెల్ల బోధముఁగనన్ ◆ శోభిల్లఁగాఁజేసి ని
త్యమహోభూతిఁబలాశభేదవకళా◆వ్యాపారియై మాధవుం
డు మహిం గౌరవజాతి నేపడఁచియుం◆డున్ సద్విజు ల్మెచ్చఁగన్. 1473

బిల్హణీయము, ఆ 2 పద్య 6.

గీ. సద్విజాళిప్రసంగంబు ◆ సరసతరము, ప్రణవవిస్ఫూర్జితముబీజ◆బంధురంబు
పల్లవాలంకృతము ◆ ఫలప్రదమునైన, యాగమస్థితి నొప్పె స◆ర్వాగమములు.

అనిరుద్ధచరిత్రము, ఆ 2 పద్య 40.

ఉ. అత్తఱిఁ జిత్తజాతవిజ◆యాంబుజమందిర కాటపట్టునాఁ
గొత్తమెఱుంగుఁగ్రొన్ననల ◆ గుంపుల చక్కలిగింతనాశుభా
యత్తతనొప్పెఁ బుష్పసమ◆యంబు సమంచితచంచరీకలో
కోత్తగవిత్తమై వనస◆ముజ్జ్వలపైకవధూసపక్తమై. 1475

చ. ననవిలుపాదుసాపనుపు◆నన్ మఘుఁడన్నరులస్కురద్విజా
లను పెనుగుత్తదారులవ◆నాంతరసీమలలో మరుత్కశం
గొని చివురాకునెత్తురులు ◆ గుప్పఁగఁ గైకముఁ గూర్చుదాఁక మొ
త్తినమయిపట్టలెత్తినగ◆తిన్ దెరవైవగుడాకులత్తతిన్. 1476

సూర్యతనయాపరిణయము, ఆ 2.

సీ. ప్రబలకుంజవ్రజ◆పటమందిరములొప్ప, సుమనోమనోవితా◆నములు మెఱయ
మలయసమీరడిం◆భకు లూడిగము సేయ, నవ్యకాంచనభూష◆ణములు వెలుఁగఁ

బరభృతమాధవ♦ప్రతతులు గొనియాడ, లతికాంగనలనాట్య ♦ గతులు చెలఁగఁ
దతభృంగగాయక♦ప్రతతి గానముసేయ, శుకశారికాదిసై♦నికులు గొలువ
గీ. వనధరాస్థానమున మాధ♦వప్రభుండు, నిగ్రహానుగ్రహక్రియా ♦ నిపుణుఁ డగుచు
మధుపమాలిన్యజాతుల ♦ మదమడంచి, యధికతరులకుఁ బచ్చడా♦లపుడు గప్పె.

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 2 పద్య 67.

సీ. పథికనిశ్వాసదం♦భమున వేఁడిమిఁ జూపి, సవినయస్ఫూర్తి వే♦సవి భజింప
గళదురుమరస♦చ్ఛలమున జడిఁ జూపి, వాఁక సేవింప♦వర్షఋతువు
వ్యాకోచసుమకైత♦వమువసితాభ్రసై, భవముఁ జూపి శరదృ♦తువు గొలువఁగఁ
బాటీరగిరిశీత♦పవనమిషమునశై, త్యముఁ జూపి హేమంత ♦ మనుసరింప
గీ. శుకపికగరున్మరుద్ధూత ♦ శుభ్రపుష్ప, రజము పేర హిమానీదో♦రముగఁ జూపి
యవిరతంబుగ శిశిరర్తు ♦ వాశ్రయింప, సకలఋతురాజమయిన వ♦సంత మలరె.

కవిజనరంజనము, ఆ 2 పద్య 12.

గీ. సరససహకారకుసుమకే♦సరసమూహ, గురుతరామోదమయదిగం♦తరము మధుర
మధువిధురమధుపము మధు♦మాససమయ, మెవ్వనికి వేడ్క వాటింప♦దిజ్జగమున.

భర్తృహరిసుభాషితము, ఏ. ల. శృం. పద్య 88.

క. కమనీయవసంతప్రియ, సమాగమప్రభవహర్ష ♦ సముదిక పులకో
ద్గమకలనఁ బూనె లతికా, సముదయమన నూత్నముకుళ ♦ జాలము లెసఁగెన్.

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 2 పద్య 108.

చ. తలిరులు సంజ కోకిలవి♦తానము చీఁకటి పూలబారు చు
క్కలగమి యేచి పూచిన చ♦కోరిపుమల్లెలనాయ వెన్న జె
న్నెలలుగ మాలతీవిరహి♦ణీవదనాబ్జసుషుప్తి కారిగా
నెలకొనియెన్ వసంతరజ♦నీసమయంబు సుఖోన్నతస్థితిన్. 1481

రామవిలాసము, ఆ 1.

క. తమజరఁ బోరిగొని తరుణ, త్వము గ్రమ్మఱ నొసఁగుమనుచు ♦ ధరణీదేవిన్
గ్రమమునఁ బూజించినగతి, యమరఁగఁ బరులెల్లఁ బండు♦టాకులు రాల్చెన్.

సునందాపరిణయము, ఆ 4.

సీ. కలకంఠనాదంబు♦కాహళధ్వని గాఁగ, దగు మరందము వసం♦తంబు గాఁగఁ
జిలుకపలుకులు ద్విజా♦శీర్వాదములు గాఁగ, ప్రాలు పూవులు దలఁ♦బ్రాలుఁ గాఁగఁ
దుమ్మెదల్ హోమాగ్ని ♦ ధూమరేఖలు గాఁగ, లతలు పుణ్యాంగనా♦తతులు గాఁగఁ
జెలయ లేఁజిగురుటా♦కులు నివాళులు గాఁగఁ, గుసుమరజంబు భ♦స్మంబు గాఁగఁ

గీ. స్థలసరోజాతతతులు గం◆ధచపకములు, గాఁగ మీనధ్వజుఁడు యాజ్ఞి◆కతవహించి
కడిమిమీఱఁగఁ గావించె ◆ ఘనవివాహ, విధులు మాధవవసరమా◆మిథునమునకు.

దిలీపచరిత్రము, ఆ 3 పద్య 6.

శా. కంతుండన్నవజీరుఁ డాగ్రహాసము◆గ్రస్ఫూర్తి లోకత్రయీ
కాంతాకాంతమనోధనప్రితతిఁ దా◆గైకోఁ దలంపూని దు
ర్దాంతప్రక్రియ దండయాత్ర చనుమా◆ర్గంబంటఁ జైత్రిస్ఫుర
త్ప్రాంతాశామధురక్తవస్త్రగృహశో◆భం జేసి చెన్నారెడున్. 1484

వాగ్నజితీపరిణయము, ఆ 2.

సీ. వలువంకఁ దగు కాంచ◆నములపూమొగ్గలు, ప్రజ్వలత్స్తంభదీ◆పములు గాఁగ
పొన్నక్రొవ్వనకమ్మ◆పుప్పొడి చిన్నియ, డంబు మీఱిన దాడి◆మంబు గాఁగఁ
పసుకుఁగెందలిరుటా◆కులగుంపులందంద, చఱచుహరిద్రహ◆స్తములు గాఁగఁ
కలకలకంఠికా◆కలకలధ్వానంబు, లల్లనేరెడిపాట◆యనువుఁ జూపఁ
గీ. ప్రేమమీఱంగ లతకూన ◆ పేరఁటాండ్రు, కొమరెక్రొవ్విరిరెండిప◆ళ్ళెములఁ దేఁటి
యలతిఁ జిమ్మిలి హాయన◆మందుకొనఁగఁ, బ్రథమఋతువయ్యె వనలక్ష్మి◆ప్రాభవమున.

దశావతారచరిత్రము, ఆ 9.

చ. ఘనతరులాశ్రితద్విజని◆కాయహృదిష్టఫలప్రదాతృతా
తనుసుమనశ్చటారుచివి◆తానము పేరును కీర్తిలాభముం
గనుఁగొని రాగసంపద న◆నంతపదంబు భజించి యెంతయున్
మనుటయుఁ బాత్రిదానమహి◆మంబడియట్టిదకా గణింపఁగన్. 1486

శకుంతలాపరిణయము, పె. నా. ఆ 2 పద్య 15.

సీ. కలకంఠములునోరు ◆ కాయకపడకయ్య, పమ్మినవిరులమీఁద ◆ తెమ్మెరయ్య
పరిమళనుమఫల◆భరము చేఁ జిగులొప్పఁ, దేఁటుదాఁటులమ్రోఁత◆జనులఁ గప్పఁ
గుసుమాయుధుఁడు పుష్ప ◆ కోదండము ధరింప, వలిగాడ్పు పుప్పొడి◆వసుధ నించ
శారికాశుకహంస◆సంచారములు మీర, పూఁదేనె సోనలు ◆ పొంగి జాఱ
గీ. జాతిగడుఁ గుండఁ బాంథులు◆భీతినొంద, జీర్ణపర్ణాళి రాల తేఁ◆జిగురు గ్రాల
మంచు తెఱవీడ శృంగా◆మహిమతోడ, జగతిఁ దగె కాంత నా సంత◆సమయమంత.

చెన్నబసవపురాణము, ఆ 4 పద్య 16.

సీ. కమనీయశాఖాగ్ర◆కతరులకుసరాగ, పల్లవయోగంబు ◆ ప్రాప్తమయ్యె
మృదులపత్త్రగుచ్ఛైక◆పటనుఘనోరాజి, తోదూష్మితనవరసా◆యుక్తిఁ జెందె

బంచమసహితమై ♦ పరభృతద్విజకోటి, పాంథపీడనకు ను♦పక్రమించె
సకలరసజ్ఞాళి ♦ సముదయం బతిమాత్రి, మధుపానవశముచే ♦ మదముఁ జెందె
గీ. జాతికి విరోధి యగుచు వ♦సంతనాముఁ, డైన యన్యాయనృపతివ♦నాంతభూమి
యావరింపఁగ నిటు లకృ♦త్యములు సాఁగెఁ, బ్రజలు రాజానువర్తన♦పరులు గారె.
ధరాత్మజాపరిణయము, ఆ 3 పద్య 2.

ఉ. చిత్రితరప్రసూనమధు♦సేవనలుబ్ధమనోజ్ఞచంచరీ
కత్రము పల్లవగ్రసన♦కామపికాళివిహారవల్లికా
దాత్రము కామినీజనవి♦తానమనోగతమానధీరతా
జైత్రము చైత్ర మొప్పెసుమ♦సాయకకేళిరసైకపాత్రమై. 1489
కృష్ణజన్మఖండము, ఆ 3.

ఉ. అంపముగానిజ్యోత్స్నదళ♦నాంబరమున్విడనాడి వేడుకన్
గండశిలాకుచల్వఁ దుల♦కింప ధరించి మిళిందలోకమున్
బొందుగఁ దాల్చి మాధవుని ♦ పొందున వాసకసజ్జలీల నా
నందమొసంగ వన్యరమ ♦ నవ్యరుచిం బెనరారె నత్తఱిన్. 1490

చ. కనదళిపాళిచూచుకవి ♦ కస్వరగుచ్ఛకుచప్రకాశతన్
ఘనశుకరాజవాక్పటిమఁ ♦ గాంతఫలావళిభూషణంబులన్
దనపరిరాగగంధమును ♦ దాల్చివనావనికాంతయావసం
తున కనురాగ మొప్పఁగను ♦ దోఁచెను దత్సమయాగమంబునన్. 1491
వల్లవీపల్లవోల్లాసము, ఆ 1 పద్య 110, 111.

మ వనవీథిం బవనాహితుండికుఁడు శాఖి♦వ్యాంకైనభృంగావళీ
స్వనతుంబీరవ మొప్పగుచ్ఛపణయు♦గ్వల్లీభుజంగాళి నా
మనిమ్రోలన్నటియింపఁజేయ నిదే శుం♦భద్విద్రుమశ్రేణికం
దనకుంగల్గినవెల్ల నిచ్చునుగదా ♦ త్యాగాభిరక్తుండిలన్. 1492
నయనోల్లాసము, ఆ 3 పద్య 91.

సీ. వికచగుచ్ఛప్రసే♦వకసముద్ధరమైన, పువ్వుఁగొమ్మప్రవాళ♦ముగఁ దనర్చి
ధవళపుష్పంబులన్ ♦ దంతపుమెట్లపైఁ, దతచంచరీకాళి ♦ తంత్రు లమర
వల్లికాబాహుమ♦తల్లికాగ్రంబునఁ, జెలఁగుకెంజిగురుటం♦గుళులఁ జేర్చి
పవనలేపనమునఁ ♦ బల్కులు మీటుచుఁ, గలకంఠరవము పాం♦గెంబు గాఁగ

గీ. సాగనిగరిమమాపని◆సరిసరిధని, మగనిగనిమానినీపగ◆మాయటంచు
మించిమధులక్ష్మివీణవా◆యించసాగెఁ, బ్రీణయకుపితలమనసువి◆హ్వలతనొందఁ.

శంతనూపాఖ్యానము, ఆ 2 పద్య 9.

సీ. ఎనలేనిరంగుల ◆ ననలగుత్తులుఁదగు, నీరాలుసొగసైన ◆ యిండ్లుగాఁగ
గాలితాఁకుడులచేఁ◆గడునూఁగుడీగియ, లాడిగాలొనరించు ◆ జేడియలుగఁ
గొలకొలనంచలు ◆ గోరింక లొనరించు, రొదలులగ్గులొసంగు ◆ రొదలుగాఁగ
సరిదేఁటిఅంతులు ◆ చక్కనిగాణీల, తండనాలనెసంగు ◆ క్రందుగాఁగఁ
గీ. చేటుగలకోయిలలు గాణ◆తెగలుగాఁగఁ, జిలుకదాఁటులు నేలజే◆జేలుగాఁగ
పోలిగొనినవకారను◆నేల తేఁదు, గానసిరిచేయిఁజేకొని ◆ కదుఁడనర్చె. 1494

శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, ఆ 2 పద్య 34.

చ. విటపిలతల్ వసంతశుభ◆వేళను మున్నుగఁ బండుటాకులన్
దటుకునరాల్చి పల్లవవి◆తానముదాల్చెను బచ్చిమొగ్గలన్
దటశిరమందుఁగ్రాలఁగ ము◆దంబునజీర్ణపటాలివిప్పి క్రొం
బ్రటములఁ దాల్చి యక్షతలు ◆ పైనిడఁగ్రాలువధూవరుల్ గతిన్. 1495

సావిత్రీపరిణయము, ఆ 3 పద్య 5.

మ. తమకుంబోరిదియొనర్చెభూతరుణి శ్రీ◆తింజాలఁదత్తన్వికిం
విమలంబౌపరిధానభూషణములే ◆ వేలొందఁగాఁజేసిశే
మముగైకొందుమటంచుఁబాదపములన్ ◆ భాసిల్లవల్లీసమే
తముపైపుష్పితమయ్యెసాంగముగ ని◆త్యానందసంశీలతన్. 1496

పట్టాభిరామాయణము, ఆ 2.

మ. కలయంగాడ్పునఁ దూలుపుష్పాడి దివిం◆గప్పారుమారుండువే
డ్కలనారామరమావసంతులఁగడం◆కంబెండ్లిసేయించుచోఁ
వెలయంబట్టినయుల్లభంబుపగిదిన్ ◆ వేమాఱుఁదద్భూమిపైఁ
జెలువొందించుచు రాలుఁ బుష్పవితతుల్ ◆ చేసన్నఁబ్రాలోయనన్. 1497

ప్రద్యుమ్నచరిత్రము.

సీ. చిలుకగోర్వంకకో◆యిలలముత్తెపుముద్దు, లాడిసెడునుడులుప్రౌ◆నుడులుగాఁగ
వికసించినట్టివా◆లికనునుసంపంగి, తుటుము జన్నంపుఁబ◆మ్మఁటులుగాఁగ
గాలిచేనటునిటుఁ ◆ గదలియాడెడుపత్త్రి, సముదాయములుధవ◆త్రములుగాఁగ
సాపులురాలిన ◆ ప్రసూనములు పసులను, బంధింపనిడిన యూ◆పములుగాఁగ

గీ. ననఁటిమ్రాఁకుల క్రిందరా♦లినకపురపుఁ, దిప్పలు వెలుంగు యజ్ఞవే♦దికలు గాఁగ
మారుఁ డనియెడు సోమాసి♦మఖముఁ జేసి, పాంథులనియెడు పశువ్రాలఁ♦బట్టె సాగె.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 2.

గీ. సకలసరసాతిశయరీతి ♦ సంఘటింపఁ, బాలువడియును శుకపిక♦పరికరయుక్తిఁ
బక్షపాతానుషక్తిఁ దాఁ♦బ్రబలె ననఁగ, నమరె వసంతుఁ డిలమన్మ♦థాతిశయము.

సీ. తుమ్మెదలకు నోగి♦రమ్ముగా నలరుల, కమ్మఁదేనియ లెల్లఁ ♦ గుమ్మరించెఁ
గీరవారంబుల♦కారివేరంబుగా, ఫలజాలముల నేల ♦ పాలుచేసె
దొరలు వంటువఁ జారు ♦ తరుల నంటి పెనంగు, నలలతకూనలఁ ♦ దోలఁగఁ ద్రోచె
పని నిచ్చఁ దమయిచ్చ♦వర్తిల్లు ఖగముల, కన్నులపైఁ బరా♦గములు సల్లె
గీ. విరహిజనమానసము నేర్చు ♦ విధము నేర్చు, భావభవకేళికోకకేళి♦యావహించె
గాలియావేళ దాక్షిణ్య♦శాలియయ్యుఁ, జంచలాత్ములఁ దగవిశ్వ♦సించఁదగవె. 1500

గాంగేయోపాఖ్యానము.

సీ. సల్లలితామోద ♦ సల్లలితారు [illegible], పటుకుటీరమ్ముల ♦ భ్రమరనాద
గీతంబు రంజిల్లఁ♦గీరపికాదుల, రవము మృదంగాది ♦ రవముగాఁగ
మందానిలుండు పి♦ఞ్ఛుం డెపసించెడి, గాయకుండుగ లతా♦కాంతలెల్లఁ
జివురుచేతులఁ ద్రిప్ప ♦ చెలఁగి నాట్యము సేయఁ, బూవింటి పాదుపా♦పుష్పపీఠి
గీ. వఱలఁ జేసి వసంతభూ♦వరుఁడు పుష్ప, రజము మకరందమును గంధ♦రజము ఘనవ
సంతమునుగా నమర్చి ల♦తాంతహారి, సంతతియొసంగె ననఁగ వ♦సంతమలరె. 1501

భార్గవపురాణము, ఆ 6.

సీ. పొన్నగున్నల చాలు ♦ పొంబట్టుపలువతో, రములైన పటకుటీ♦రములు గాఁగ
నవరసాలచ్ఛటా♦నవపల్లవావ్రాత, మమితమంగళ తోర♦ణములు గాఁగ
పికపికీపంచమ ♦ ప్రకటనిస్వానముల్, వేణువీణాగాన ♦ విధులు గాఁగ
కేకికేకలు శత్రు♦లోకభీకరతాప్రదములైన జయకాహ♦ళములు గాఁగ
గీ. భ్రమరగానంబు శుకముల♦భగతవిద్య, వరకపోతమృదంగని♦స్వనము చెలఁగ
గణికలు నటింపఁ జూచితే ♦ కమలనయన, కొలువుఁ దీర్చె వసంతభూ♦తలవిభుండు.

సీ. కుసుమబృందములపై ♦ ముసరి గుంపులుగట్టు, భ్రమరపంక్తులు మేఘ♦సమితి గాఁగ
మహిఁ బొటపొటవ్రాలు♦మకరందబిందువుల్, వర్షాగమోత్కర్ష♦హర్షమెసఁగ
మలయానిలోద్ధూత♦మహీరుట్పతత్ప్రసూ,నములు వ్రాలినకర♦కములు గాఁగ
దెసలు గ్రమ్ముచు వ్రాలు♦ తేనెవాకలచాలు, ఘనములౌ సెలయేళ్ళ♦గములు గాఁగ

గీ. బుష్పాదులతోడ మిళితమా♦పుష్పరసము, పంకసంకలితములైన ♦ పదము గాఁగఁ
యీవసంతర్తు వీక్షించి♦ తేవఘూటి, నేఁడు పక్షర్తుధర్మముల్ ♦ నెరపెనహహ. 1503

కుబ్జాకృష్ణవిలాసము.

సీ. మదనునియాస్థాన♦మంటపంబు లనంగఁ, జూతపోతంబులు ♦ సొంపుమీఱె
నంగజరాజసిం♦హాసనస్థలులనఁ, బున్నాగములచాలు ♦ పొలుపుమిగిలె
ననవిల్తుశృంగార ♦ నాట్యశాల లనంగ, వకుళంబు లెంతయు ♦ వన్నెమీఱె
నతనునిక్రీడాగృ♦హంబులోయన నొప్పె, మాధవీనివహంబు ♦ మహిమఁ దనరె
శంబరారాతిపటుశస్త్ర♦శాల లనఁగ, లీలఁ గన్పట్టె జాతిమ♦ల్లీనికుంజ
పుంజములుమించె మంజుల♦పుష్పలతల, శ్రీకరంబును సకలసౌ♦ఖ్యాకరంబు.
నగుచు విలసిల్లె నంత చై♦త్రాగమంబు. ... ... ... . . 1504

ధనాభిరామము.

గీ. మాధవవరప్రసాదసా♦మగ్రివలన, యామ్యదిక్కాంతనికటప♦నాగజిహ్వ
పర్ణచిత్రపరిష్కార ♦ పటలి సడలి, యనిలడింభకగర్భిణి ♦ యగుటఁ దెలిపె. 1505

క. తలఁప నుదాహరణాకృతిఁ, గలకల రంజిల్లపరస ♦ కపికావ్యమునుం
బలె నెడలమత్తకోకిల, కలయన్మధువేళ వనని♦కాయం బలరున్. 1506

రామాభ్యుదయము, ఆ 1 పద్య 160, 170.

క. భ్రమరకములు ముఖసంగతి, నమరమధుస్వేదయుక్త♦యౌవనలక్ష్మీ
కమలాననయు పరతిచే, తమాధవునిఁ గూడినట్లు ♦ దగునవ్వేళన్. 1507

సర్వకామదాపరిణయము, ఆ 2.

---

## గ్రీష్మర్తువు.

——:0:——

మ. హరియంభోనిధి సొచ్చె శంభుఁడు తుషా♦రాద్రిప్రభుం బ్రాఁకె వా
గ్వరుఁ డున్న్యస్తకరందదుర్దినసుమ♦గ్రంబైనయుత్ఫుల్లపం
కరుహంబున్ భజియించె దీనిమనుగ♦ల్గంగాంచి యేకాక యె
వ్వరి నింకేలసహించు గ్రీష్మమనఁగా ♦ వర్ధిల్లెఁ దాపోద్ధతుల్. 1508

హరివంశము, పూర్వభాగ. ఆ 6.

చ. మలయజవారిసేకములు ♦ మౌక్తికనూతనహారలీలలన్
వలిపెపుసన్నకావులను ♦ వారిరుహాక్షులవీఁగుఁజన్నులన్
గలిగినచల్విరింబ్రదికెఁ♦గాకజనావలియిట్టివేసవిన్
గలదెశరణ్యమన్య మనఁ♦గాఁగదుఁ జేర్చె నిదాఘుదాహముల్. 1509

నృసింహపురాణము, ఆ 3 పద్య 68.

చ. పరిమెయిమెట్టితొల్తబహు♦భంగులఁ గ్రొవ్వెదు మిత్రు జైత్రునిం
జరిగొనవచ్చె గ్రీష్మ మను ♦ పొచ్చపుఁ జేరఁబురారిఫాలభా
సురపటువహ్నియంచువెఱఁ♦జొచ్చిన మన్మథుఁ గాంచె నత్తఱిన్
సరసశిరీషకేసరల♦సన్మహిళామృదులాలకాగ్రిముల్. 1510

నృసింహపురాణము, ఆ 3 పద్య 98, 72.

శా. ధారామండితసాలభంజికలచేఁ♦దన్ జిత్రయంత్రోద్గళ
త్సారామోదతుషారపూరములు వి♦స్తారంబులై పర్వఁగాం
తారూఢేక్షణదీప్తితోడనచకో♦రాధీశుపైఁ జంద్రిమం
శారాధ్యుండని చంద్రికారసమునిం♦పై క్రోలుచందంబునన్. 1511

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 100.

ఆ. వాఁడిరుచులుగల్గు ♦ వానివేఁడిమిగ్రీష్మ, కాలమందు జగము ♦ గలయఁ బడియె
బ్రహ్మ జనులకొఱకు ♦ బ్రహ్మాండఘటమున, నుష్ణరసముఁ దెచ్చి♦యునిచెననఁగ.

భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 716.

సీ. విఘ్నరప్రభలవే♦ణికలింకఁజటాళిఁ, జేరిన ప్రాచిపె♦న్నీట తెగసె
నెఱుకులుపడియనీ♦రిపురగువ్వలఁబట్టఁ, బోయునీరాడాడఁ ♦ బోలము నెఱసె
సురగాలిదపదగ్ధ♦తరుపఙ్క్తతతి రేఁవఁ, బావురాలనిడేగ ♦ పదువుదూఱె
నిద్రితద్రుచ్ఛాయ ♦ నిలువక జరుగనెం, బడిగనధ్వగపంక్తి ♦ పాదలునెత్తె
గీ. క్షేత్రపాలునికుదికిన ♦ చీరలాఱు, చాకిరేవులగములయ్యె ♦ సకలదిశలు
దెలుపులుగఁదోఁచె నెండమా♦వులబయళ్ళ,గందెనివియెండవనదిజ్మ్ర♦ఖములురాఁజె.
గీ.ఎసఁగుకట్టావిక్రియనాఁటి♦రెగయఁబగటి,యెండయుడుకారకుండభూ♦మండలమునఁ
బొలిచె మాపటిపండువె♦న్నెల చకోర,పోతవితతికిఁ జాపట్టు♦వోసినట్లు. 1514

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 37, 51.

ఉ. ఎండఁగొలంకులెల్లనుమ♦హీధరముల్ దవవహ్నికీలలన్
మండె ధరాతలంబినుప♦మంగలముస్సలెనుండెఁ గాలి యా

యెండలనేమి సెప్పఁ బర♦మేశ్వర యావరణాంబురాశితే
కుండిననాఁడె పొక్కిపడ♦కుండునె పద్మభవాండభాండముల్. 1515

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 1 పద్య 123.

మ. బిలనిశ్చేష్టజరద్భుజంగముతదా♦భీలాతిఫూత్కారకా
దళఘోరానలభావదాయకదవ♦వ్రాతంబుఁ దచ్ఛాంతిపీ
త్క్యలసచ్ఛైవలినీభవిష్ణుమృగతృ♦ష్ణాలీలమై నుర్వరం
గలయంబర్వె నిదాఘకాలముసమ♦గ్రక్లాంతదిగ్జాలమై. 1516

కువలయాశ్వచరిత్రము, ఆ 1 పద్య 94.

సీ. చండభానుఁడుకక్క♦సముఁజేసి మున్ను దా,మహికిచ్చునప్పులు ♦ మరలఁగొనియె
వారిపూర్ణములైన ♦ వసుధాగకలశముల్, శివలింగమూర్తుల ♦ శిరము లెక్కె
నృపమందిరములఁబా♦నీయకుంభంబులు, వెసనుట్టిఁగట్టుక ♦ వ్రేలఁదొణఁగె
భువినెల్ల జనులద♦ప్పులుమాన్పుతక్రంబుఁ, దాదప్పిఁగొనినీళ్ళ♦ద్రావఁ జొచ్చె.
గీ. హరుఁడు కైలాసకుధరనా♦థాగ్రవసతి, విడిచి వటమూలతలమున♦విశ్రమించె
సతతనిజదీర్ఘతాతనూ♦కృతినిశాప్రి, హరములగునట్టిగ్రీష్మవా♦సరములందు. 1517

వైజయంతీవిలాసము, ఆ 1 పద్య 57.

సీ. అశ్వన్యభిజ్ఞశ్రీ♦మాఘ్వన్యసంఘంబు, ప్రతిపద్ధతిప్రపా♦పరికరంబు
పల్వలోదస్వయం♦పచ్యమానఝషంబు, బహుభిదేళిమశిరః♦పటలరురుక
ముస్తముస్తావిహా♦స్త్రస్తఘోణంబు, కీచకనికషణో♦ద్గీర్ణరవము
పరితోవిభిన్నభూ♦పదదృష్టపాతాళ, మానాభిగళనీర ♦ సాచ్ఛభల్ల
గీ. ముదిరఖాగప్రపూరణో♦ద్యోగవిముఖ, వమధువిరహోన్నమత్కార♦వ్యక్తవిటప
కించిదాతపహృద్వనీ♦సంచరిష్ణు, మదగజేంద్రంబు వేసవి ♦ యెదురుకొనియె.1518

విప్రనారాయణచరిత్రము, ఆ 3 పద్య 49.

గీ. అట్టివేసవి బెడిదంపు♦వెట్టకతన, నేలనందంపవిరిసిన ♦ నెఱియలందు
ధరణిపాదంబు లెడనెడఁ ♦ దవుల మెల్లఁ, దివిచికొనిపోవ దివసంబు♦దీర్ఘమయ్యె.

వాల్మీకిచరిత్రము, ఆ 2.

గీ. ఏమిచెప్పెదనయ్యెండఁ♦దామరసభ, వాండభాండమ్ము లెల్లను♦ద్దండసాల
జ్వాలక ప్రాశనకరాళ♦కీలదుర్గాల, గుమ్మరావమ్ముకరణిజ♦గమ్ము దొరసె. 1520

రాజవాహనవిజయము, ఆ 5 పద్య 99.

చ. ఉడుగనిబాడబాగ్ని సెగ◆నోర్చియు నోర్వఁగలేక వేసవిన్
జడమయుఁడయ్యు శైత్యపడి ◆ సాగరుఁడుస్సున నూర్పువేఁడిమిన్
బడమటి గాడ్పు లుప్పతిలెఁ ◆ బోరముగాక నిదాఘవేళలన్
గడుసెగచేత మేహామయ◆గాత్రిజనుల్ తపియింప కుందురే. 1521

కవిరాజమనోరంజనము, ఆ 4.

శా. మాయాసంసృతిసత్యసంస్మృతిజని◆పంజేసి పేరాసలం
గాయక్లేశముగొంది లోకులుతలం◆కన్ మించుకాంతేక్షణా
ఛాయంబోలినజాలినాఁగమృతతృ◆ష్ణంజూచి సారంగముల్
తోయభ్రాంతిఁ దపించెసంగఫలమెం◆దుందప్ప దెవ్వారికిన్. 1522

ఉ. రేదొరసొంపొసంగి పవ◆రించినకల్వల జీవనోన్నతిం
బోద్రిడియొనర్చెనం చులుక◆పుష్టి కొలంకుల నింకఁజేసెఁ గా
కాదెసఁ బద్మినుల్ గనుల◆యంబుగనండినుఁ దెట్టి బంధువుల్
భేదిలినన్ విరోధు నడ◆లించకమానరుగా మహాప్రభుల్. 1523

సమీరకుమారవిజయము, ఆ 2 పద్య 90, 92.

ఆ. క్రమముతోనగాధ◆విమలోదకమహాహ్రి, దమ్ము లింకెఁ దపన◆తాపమునను
బోరినసంఖ్యకోశ◆పూర్ణగేహములు దు,శ్శీలనృపునిచే న◆శించుభంగి. 1524

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 2 పద్య 124.

చ. పవలనువర్తకాగ్రణి న◆భశ్చలసాగరమధ్యమంబులో
రవియను నోడమీఁద నప◆రక్షితభృత్పురిఁ జేరరా మరు
జ్జవగతిసుళ్ళఁ జొచ్చె నది◆సాగక చిక్కినమాడ్కి సూర్యుఁ డే
య్యావసరమందు మందగతు◆లానిన దీర్ఘములయ్యె ఘస్రముల్. 1525

హంసవింశతి, ఆ 2 పద్య 155.

మ. తురగాస్యోత్క్రమకృష్ణవోద్గతమహా◆ధూమాంబువాహంబు వే
చరమాశాగతమైన గాలికెదురై ◆ సౌరోజ్జ్వలస్యందనం
బురహిం గ్రోలఁ గుమారు గాలిపటముం◆బోలెం దివి న్మెల్లనై
తిరగంగా నిటులయ్యెనాఁగ దినముల్ ◆ దీర్ఘంబులయ్యెం గడున్. 1526

చ. పడమటిగాలిసెట్టనొక◆పారియుఁ గ్రోలమి నీరసంబులై
జడిసిన సిల్వగుంపు నొక◆సారియు ద్రిమ్మంగమి సొమ్మసిల్లి వ్రా
ప్పడినగుబ్బాల నొల్లని ధ◆ణాయమునికిం దనవాహనంబులం
బడిబడియుం బెనోయుమాట◆భర్గ యనం బగ దావఘామముల్. 1527

మ. జలజాప్తోగ్రమయూఖపుంజకుముకిన్ ♦ సప్తాశ్వకాంతోపల
మ్ములు సోకించి తదుద్గతాగ్నిలవముం♦బోధించివాత్యానవా
నిలవేగమ్మునఁ గాలుకొల్పిపతకా ♦ నీకంబు పాకంబుగా
నలరించె న్సమయాఖ్యపాచకుఁడు భూ♦తాహారసంప్రాప్తికిన్. 1528

శుకసప్తతి, ఆ 3.

ఆ. పగలువిస్తరించి♦మిగులవేఁడిమిసూపు, తపనుఁజేరకచాయ♦తరులనీఁగెఁ
బరమసాధ్వియయ్యు ♦ భర్తవెన్నాడె నే, తగనిశిక్షసేయఁ♦దగదు పతికి. 1529

గీ. సూర్యుఁడునిజప్రతాపంబు♦సూపసూర్య, కాంతములు రేఁగినిప్పులు♦గ్రక్కఁదొడఁగె
నినుఁడు కోపింపఁ బరివార♦మినుమడించి, కడిమి సూపుటధరణిని♦క్రమంబకాదె.

శకుంతలాపరిణయము, కృష్ణ, ఆ 1 పద్య 33, 34.

సీ. మృదుతరచ్ఛాయాప్తి ♦ మీఱియుండుటె కాని, మృదుతరచ్ఛాయాప్తి♦మీఱదయ్యె
భువనబంధుప్రీతిఁ ♦ బూనియుండుటె కాని, భువనబంధుప్రీతిఁ♦బూనదయ్యె
మిథునసంగతిగల్గి ♦ మించియుండుటె కాని, మిథునసంగతిగల్గి ♦ మించదయ్యె
సుమనోవికాసంబుఁ♦జూపనోపుటె కాని, సుమనోవికాసంబుఁ ♦ జూపదయ్యె

గీ. నెయ్యెడలనంచుజనులెంచు♦టిరువుగాంచు, సొమ్మసిలమించుటుడుకులు♦గ్రుమ్మరించు
బడలికలునిండు భోగుల♦పసలడంచు, నెండలలరించువేసవి ♦ దండఁగాంచు. 1531

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 3.

క. బాడబవహ్నిజ్వాలల, వేఁడిమిచేజడతనొంది ♦ వేసవితఱినిన్
దాడివి(న?-వాడిన?)యపరపయోనిధి, వీడిననిట్టూర్పులనఁగ♦వెలసెన్ గాడ్పుల్.

వల్లీపల్లవోల్లాసము, ఆ 2 పద్య 162.

గీ. ఇనునిసత్కృపవనలక్ష్మి ♦ హెచ్చుటరసి, నిశలు నానాఁటభృశకృశ♦దశలఁగాంచె
నొరులసిరులకుఁ జూపోప♦కున్నఁడనదు, పెంపుదలుఁగుటగాకన్య♦వృద్ధిసెడునె.

గీ. ఇచ్ఛఘనులుండిగని యప్పు♦లిచ్చవడసి, పొంగి పొరలిన సరసుల♦పొలుపుదఱిఁగె
మున్నుగలకీర్తిపారముల్ ♦ పోవ నప్పు, డప్పులనుజొప్పడినయొప్పు♦ముప్పుగాదె.

మహేంద్రవిజయము, ఆ 2 పద్య 68.

క. ఇనతీక్ష్ణపాతహతయై, నను భూసతిరక్తయయ్యె♦ననుటకునరుదా
వినుఁడదిక్షమయేకాదే, యినపదతాడనముసతికి ♦ నెగ్గేతలఁపన్. 1535

సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 19.

# వర్షర్తువు.

——:0:——

క. ఘనతరనైశతమంబో, యనఁగ ఘనాఘనతమిస్ర♦మవిరళమై క
ప్పిన జనులకునస్తువిభా, వన మొక్కొకమాటుగలిగె ♦ వైద్యుతరుచులన్. 1536

చ. జలితనవీనకందళిక ♦ డంబకదంబకకేతకీరజో
మిళితసుగంధబంధురస♦మీరణుఁడున్ సఖుఁడై మాఁచుచుండఁగా
నులియుచు మొల్లగుత్తులను ♦ నుయ్యాలలూఁపఁగ నెక్కియాఁగెను
ల్లలదళినీకులంబుమృదు♦లధ్వనిగీతమువిస్తరించుచున్. 1537

క. సురచాపచిత్రగగన,స్ఫుటంబురచించునట్లు ♦ భూవనితనిరం
తరచిత్రితమైయొప్పెను, సురుచిరనవతృణశిలీంధ్ర ♦ సురగోపములన్. 1538

భారతము, అర. ఆ 4 పద్య 136, 138, 139.

ఆ. దిశలఁ బొలయు మెఱుఁగు♦దృష్టులుఘుర్ఘుర, గర్జనంబులులియ గజపగతుల
ఘనపయోధరములు ♦ దనరంగ జవ్వని, వోలె వచ్చెవాన♦కాల మర్థి. 1539

శా. ఆక్రీడోత్కరసురారాజుమ్రోల నిజరా♦వాసంతగేయాభ్రనా
దైకాతోద్యముఁగూర్చిమ్రోయ సురగో♦పాంభోదరాగత్విషా
నీకోద్యత్కదశక్రకస్థలలస♦న్నృత్తోర్వరరంగస్థలిన్
కేకీపాత్రియి లాడె భావముగను♦క్షిప్తాగ్రపింఛంబులై. 1540

కుమారసంభవము, ఆ 6 పద్య 752, 760.

సీ. ఉదధిసమేతపే♦తోద్ధ్వాంతబాడబ,జ్వాలయితోగ్రశం♦పాలతంబు
నిర్ఘాతరవసరం♦ధ్రీకృతాజాండబ,హిర్జలభ్రమదుదధా♦రోర్జితంబు
నిర్జాడ్యగర్జిత♦స్ఫూర్జిఘూర్జర్జిత, ప్రళయభైరవరట♦త్పటహరవము
ఝంఝాప్రభంజన♦జాతసంఘట్టన, పరిగళత్కరక♦త్కరకగణము

గీ. నగుచు ఘనఘనాఘనసంఘ♦మవ్విధమునఁ, బూనిహోరున జడిదంపు♦వానగురియఁ
గరము భూనభోంతరముచీ♦కట్లుగొనియె, నఖిలలోకంబునుదకమ♦యత్వమొందె.

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 88.

మ. యమునద్గంగము కృష్ణభూమదిల మ♦జ్జాకున్నమున్నవ్యంబు నీ
లమహోద్గ్రిన్నిఖిలాచలావళిత మా♦లమ్యాజమిందీవర

త్కుముదశ్రేణి పికద్విహంగము దమ♦స్తోమద్గ్రిహార్కపరిభా
సముదాయం బగుచుండెలోక మలఘు♦శ్యామాభ్రము ల్వర్షిపన్. 1542

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 382.

మ. చపలాలోకములున్ బయోధరగరి♦ష్ఠశ్రీయు నవోల్లస
ద్విపులానందము నంబరాభరణస♦ద్వేషంబునుం గంకణ
స్ఫుటారావము సొంపుమీఱఁదగువ♦ర్షావేళ విశ్వేశ్వరా
ధిపుసేవించుప్రగల్భకామినిగతిన్ ♦ దీపించు భావింపఁగన్. 1543

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 102.

క. వర్షాకాలభుజంగుఁడు, హర్షముతోనిడినవవన♦ఖాంకములని యు
త్కర్షింపభూమిసతిపైఁ, గర్షకహలరేఖ లమరె ♦ గహనాంతములన్. 1544

క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించుభూమి ♦ పులకము లనఁగా
మొలచి తలలెత్తి నిక్కుచు, సలలితగతిఁజాలువాలె ♦ సస్యములధిపా. 1545

భాగవతము, స్కం, 10, పూర్వ, పద్య 753, 754.

శా. ధారాళాంబుదబృందనిర్భరనిరో♦ధవ్యాప్తి నాశాంతముల్
భూరిధ్వాంతమయంబులైనజనులే♦ప్రొద్దున్ రవిం గానమిం
దారూహించుచు నుందు రాఁకొనుట మ♦ధ్యాహ్నంబునుద్దామని
ద్రారంభంబునరాత్రిటంబగటబో♦ధావాప్తిఁ బ్రత్యూషమున్. 1546

శ్రీరంగమాహాత్మ్యము, భై. క. ఆ 2 పద్య 236.

సీ. ఎలగోలుజల్లుపుక్ ♦ పెళపెళనేటవాల్పడి గాలినట్టిండ్లఁ♦దడిపి చనఁగ
నట్టైతోవడగండ్ల ♦ కట్టావులుదుమార, మావులు రేచిరెం♦డవదియుఁజన
మతిమూఁడవదినిల్చి ♦ మెఱసిబిట్టుతిమిశీ,కరవారిసృష్టిఁజీఁ♦కటిగనలమ
నుర్యోలచేరుల ♦ యోఁజఁ బైపైవెండి, జల్లుపైజల్లుపె♦ల్లల్లుకొనఁగ

గీ. భూభిదాపాదిదుర్భరాం♦భోభరంపు, వడిమరుజ్ఝంర్ఝుఁదెరలక♦కడవవంచి
నట్లు హోరని ధారౌఘ♦మైక్య మొంది, విన్నుమన్నునొకటిగా♦వృష్టిబలసె.

మ. అలపర్జన్యుఁడుకేకిపాత్రములగుం♦పాడించుచో మేఘమం
డలపున్ మద్దెలగ్రుంగలేవనుమరు♦న్మార్దంగికుండర్థినె
త్తి లలిన్నేలకుద్రావాలుచున్నెగయుచుం♦దారాడునత్తెల్లజ
ల్లులుఁగెంగుప్పలునయ్యెధారలునుద♦ల్లోలేంద్రగోపంబులున్. 1548

సీ. రవిఁజూచికుడుచువా♦రలకును గృకలాస,ములకునుదృష్టిమి♦న్నులనె నిలిచె
సంధ్యార్ఘ్యదాయిద్వి♦జశ్రేణి కిలుసేరు, మొదవులకునుభ్రాంతి♦మది జనించె
హాలజీవిసందోహ♦ములకు బలాకికా, విసరంబులకుమంచి ♦ వెదలుదొరకె
నెలమిఁబొల్పగుయూథి♦కలకు సంతలకూట,ములకును మతివిచ్చు♦మొగ్గలొదవె
గీ. నతిథిసంఘంబునకునీని♦నట్టియెనువు, కదుపురేఁగలగమికివా♦కట్టు లెసఁగె
మంటిమిద్దెలవారికి ♦ మరుపనులకు, నెలఁతవాసినవారికి ♦ నిదుర చెడియె. 1549
ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 91, 92, 123. (చేత

గీ. మెఱుఁగుతతిత్రాడు పెనఁకువ♦మించుమొగులు, చాలుకవ్వపుమలమరు♦చ్ఛాయ మీఱ
భ్రమణమొందించినూత్నమా ♦ నమృతమూర, వినుకడలిఁగల్గఁజేసెఁబ్రా♦వృణ్మురారి.
గీ. సాగరవిషంబుఁ గ్రోలి ధూ♦ర్జటియుఁ బోలె, నాత్రివిక్రమగతి దివి♦నాక్రమించి
విధియుబలెసాదిసృష్టికా♦వించికారు, మొగులుదలఁపించెనపుడుత్రి♦మూర్తిమహిమ.
శా. ధారాశుద్ధిఁ బ్రసిద్ధిఁ గాంచి ఘనశ♦బ్దస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
దోరంబైన రసస్థితిన్ దరళవి♦ద్యున్మాలికాలక్షణో
దారంబై కవిసేవ్యమా వనమయూ♦రారూఢిఁ బ్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధమట్లఖిలహృ♦ద్యాక్రాంతమయ్యెందగన్. 1552
సీ. హరిహయాయుధరేఖ♦లనుగడల్ వేయించి, యలముధారారజ్జు♦వులబిగించి
జలదంబులనునీలి♦వలలెల్లెడలనిల్పి, వివిధగర్జావాద్య♦రవముగొల్పి
తేవమీఱఁ దటిన్న♦టీశక్తిఁ బ్రేరించి, కోఁపుగా మెఱుములు♦గొనఁగ జేసి
సరనులకోకసొంపు ♦ సంధిల్లఁగావించి, పెక్కుదిక్కులవారిఁ ♦ బెంపుఁజేసి
గీ. యలరెఁ దొలకరితటి పేరి♦యాటవాఁడు, మీటువాటిల్లవలరాచ♦ మెచ్చువడసి
పథికజనమానధనము ల♦పారలీలఁ, గొల్లలాడెనుభువనంబు♦లుల్లసిల్ల. 1553
రామాభ్యుదయము, ఆ 6 పద్య 6, 8, 13, 18.

క. కుంభీనసములుప్రేలిన, గుంభనమునఁ గుంభిహస్త ♦ గురుతరధారా
రంభమున రేయుఁబగలున్, గుంభద్రోణములువట్టి ♦ కురిసెన్వానల్. 1554
కవికర్ణరసాయనము, ఆ 6 పద్య 23.

చ. కరములుచాఁపిపద్మిడుట♦కై బుధశుక్రులసాక్షి వెట్టి య
య్యరుణుఁడుభూమిచేతఁదగ♦నప్పులుగైకొని యియ్యకున్నదో
ధర తనమూలవృద్ధులకుఁ♦దక్కకసాగిన వారిఁ గూర్చి య
క్కఱగుడిప్రాసియీఁగెననఁ♦గాఁబరివేషము పుట్టెనత్తఱిన్. 1555
చిత్రభారతము, ఆ 2 పద్య 16.

సీ. బ్రహ్మాండమగలంగ ◆ బటపటధ్వనులతో, నుఱుములంతంతకు ◆ నుఱుముచుండఁ
గడుభయంకరముగా ◆ వడిమ్రోఁగుమ్రోఁతలఁ, బిడుగులాడాడను ◆ భీల్లుమనఁగఁ
గ్రముకంబులంతేసి ◆ కణములతోఁగూడఁ, గరడుగట్టినవడ ◆ గండ్లురాలఁ
గొఱవిదయ్యంబుల ◆ నెఱపించుతెఱఁగున, విద్యుత్ప్రకాశమ్ము ◆ విస్తరిల్ల
గీ. ముసుఁగువేసినచందాన ◆ మొగులుగప్పి, మీఁటినలుపెక్కు చీకట్లు ◆ కాఱుకొనఁగ
మించి కడవల నుదకంబు ◆ ముంచి తెచ్చి, కుమ్మరించినగతి వాన ◆ కురిసె నపుడు.

మొల్లరామాయణము, కిష్కిం. పద్య 9.

ద్విపద. కడలిపైఁ బొరలెడు ◆ కరడులో యనఁగ, నుడువీథిబకపంక్తు ◆ లురుగతి నడచెఁ
గలిగినపక్షిసం ◆ ఘములతో నెల్ల, దలయెత్తి చూచెఁ జా ◆ తకనికాయంబు
తిరుపుగట్టెడు సుర ◆ శ్రీలకాసియాల, మురువున శితికంఠ ◆ ములు పురుల్విచ్చె
నలసస్యగర్భయౌ ◆ నచలపాళిండ్ల, చెలువున నీలాగ్ర ◆ శిఖరులు నెలసెఁ
గాలాభ్రభూతముల్ ◆ కళపెళ నార్చ్చె, పోలికి గర్జితం ◆ బులు మింటఁ బొడలెఁ
బొలుపున వెల్లువల్ ◆ పొదలెనంతటను, బలసి కుంభద్రోణ ◆ పాతంబుగాఁగఁ
గాఱుకమ్ముచు నేల్ల ◆ కాలువల్పెరయ, ధారాధరోద్దార ◆ ధారలు నిగిడె
నిలకును మింటికి ◆ నేకసూత్రములు, గలిగినట్లుండెఁ ద ◆ ద్ఘనధారలపుడు
జలజాస్త్రహూతకామి ◆ జనమాంసఖండ, కులములో యన నింద్ర ◆ గోపంబులమరె
ధారుణీకుచహార ◆ తతులో యనంగఁ, జారుశైలాగ్రని ◆ ర్ఘరము లింపొందెఁ
బచ్చసూత్యపుటంబు ◆ పగిది నద్దెసఁ, బచ్చికల్మొలచి చూ ◆ పట్టె నంతటను. 1557

అష్టమహిషీకల్యాణము, ఆ 2.

ఉ. భోరున నష్టమాత్రజల ◆ పూరనిరర్గళధారలుర్వికిన్
భారముగాఁగ ముంచి జడ ◆ పట్టినమున్వలి నెల్లరీతిఁగా
వేరిదరుల్ వహించుకొని ◆ వెల్లువఁ జాఁపఁగ నోడికుండలన్
నీరెడలించినట్టికర ◆ ణిం జలదంబులు జేరె నోయనన్. 1558

శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 4.

ఉ. అంచలు పాఱెఁ గేకులకు ◆ నాటలు గేరె ఘనంబు లార్చెఁ గ్రొ
మ్మించులు గూరె శీతలస ◆ మీరము వారె మరుండు చేరిము
న్నుంచుగ జాతిబాణతతి ◆ నూఱె నటం బథికాళి ధైర్యముల్
గ్రించుకజాఱెఁ బాఱె నల ◆ గ్రీష్మము మీఱె జలాగమంబిలన్. 1559

అధ్యాత్మరామాయణము, కిష్కిం.

సీ. హలధరహృదయప్రి◆యాపహారంభకంబు, బాణాంతవిపినాంత◆హవ్యవాహ
శాంబరాడంబర◆చ్ఛన్నాబ్జహితబింబ, మచిరాంశురుచిదీపి◆తాంబరంబు
నవనవారచితార్జు◆నవికాసగరిమంబు, ధార్తరాష్ట్రనిరాస◆దాయకంబు
శితికంఠబాంధవ◆ప్రతిపాదనోచితం, బాయతశక్రగో◆పావనంబు
గీ. వితతఘనఘోషపోషణం◆బతిశయోద, యాశ్రితకదంబమార్త్తమ◆హావనాగ్ర
జాలికమునై తనర్చి వ◆ర్షాదినంబు, దేవకీనందనునికీవిఁ◆దెలిపె నపుడు. 1560

చంపూరామాయణము, ఆ 6 పద్య 51.

ఉ. గాకఁదలిర్చుమబ్బుదుబు◆దక్కమెఱుంగుమెఱుంగుపట్టుసం
జోకబలాకికాసమితి ◆ చుక్కలనామపురేకనెమ్మిబ
ల్కేకసరోజభేకముల ◆ కీడును మేలును దెల్పుకూఁకగా
జోకఘనాఘనంబు రహిఁ ◆ జొచ్చెమహిన్ దుబుదక్కవాఁడనన్. 1561

చంద్రాంగదచరిత్రము, ఆ 4 పద్య 6.

సీ. ధూళిపర్వఁగవడిఁ◆దూర్పుపాఱెడుగాడ్పు, సారతురంగప్ర◆సార మనఁగ
సంపూర్ణజలమద◆శ్యామలాకృతులైన, యంబుదంబులు గుంజ◆రంబు లనఁగ
భూరిగర్జితములు◆భేరీరవములన, మెఱుపులాయుధముల ◆ మెఱుఁగు లనఁగఁ
కేకినాదములు మ◆హాకాహళములనఁ, జాతకంబులు భృత్య ◆ సంఘమనఁగఁ
గీ. చక్రవాకమువిజయధ్వ◆జంబనంగ, నొప్పి భూగోళహితజీవ◆నోదయమున
నవనినాయక నీదువా◆హ్యాళిఁ బోక, ననుసరింపుచుఁ దోఁచె వ◆ర్షాగమంబు. 1562

ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 3.

గీ. మెఱయుప్రావృట్సమయలక్ష్మి◆మేఘములను, నీలమయచాలనులనుము◆త్యాలునించి
పట్టెజల్లింపరాలిన ◆ బటువులైన, ముత్యములనంగఁ జినుకులు◆మొదట దొరఁగె.
సీ. ఆకాశనీలహ◆ర్మ్యాగ్రభాగమునిష్ఠ, కాళ్ళునాఁగనువాన ◆ కాళ్ళుపోడమ
ఘనఘనాఘనమల్లె ◆ కరికరాగ్రవిధూత, జలశీకరములనా◆జల్లునిగుడ
తపనృపోపరికాల ◆ ధన్విముక్తాశుగా, సారంబులనమహా◆ధార లడర
స్తనితనిర్భిన్నాబ్జ◆జాండపద్రివద్బహి, ర్ఘారులోయనఁగఁ బూ◆రములుపొరల
గీ. పల్లమిది మిట్టయిది మెట్ట◆పట్టులివియు, టంచుఁ దోఁచఁగనీక ని◆ట్టట్టు చుట్టి
కొట్టి పిడుగులు రాల్చుచు ◆ గుట్టలకును, బట్టెనలజడులపుడు చూ◆పట్టెజడులు

మిత్రవిందాపరిణయము, కుం.-వెం. ఆ 1 పద్య 82, 83.

వ. శరచాపోన్నతిసంస్కృతాంబరమణి◆చ్ఛాయాప్రకాశంబునన్
హరిసారంగచయప్రచారవిదిత◆ఖ్యాతిన్ మహాసారను
స్థిరతన్ శంబరభంగరమ్యతనుభా◆తిన్ మీఱుసారస్వత
స్ఫురణం గాంచెను సార్వభౌమవిభవం◆బున్ వానకాలం బిలన్. 1565

కవిరాజమనోరంజనము, ఆ 4.

కం. బహువర్ణోపేతంబై, యహహా కృతయుగమురీతి ◆ నలరుచు మిగులన్
రహి నింద్రచాపయుక్తమై, మహిరొప్పె న్విష్ణుదేవు ◆ మందిరలీలన్. 1566

పద్మినీపరిణయము, ఆ 1 పద్య 83, 89.

గీ. సమయమనునాట్యకారక◆జనుఁడు మేఘ,యవనికాంతర్ధిఁజపలామృ◆గాక్షిలాస్య
మునకు ననురూపముగనొన◆ర్చినమృదంగ, శబ్దములరీతి గర్జిత◆స్వనము లొప్పె.

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 4.

చ. జలదము నీలిచల్లడము ◆ శక్రశరాసన మొప్పుకాశధా
రలు తెలిజల్లు వేగుబక◆రాజి వహించిన బూజిపూఁతల
గ్గలపు మెఱుంగు లాయుధపుఁ ◆ దాంతులు గర్జితగర్జ లొప్పఁగాఁ
దొలుకరివీరముష్టికడఁ ◆ ద్రొక్కెనభశ్ఛలపణ్యపీఠికన్. 1568

మ. తగఁ దేజంబనుబల్ఫిరంగిజలభృ◆త్సంగంబుమందుంచి పొం
దుగ శంఖంబనుగుండువేసి పటువి◆ద్యుద్వహ్ని చేభ్రాప్తి మం
టఁగఁ గాలంబను యంత్రికారకుఁడుసూఁ◆డన్ మ్రోయనామ్రోఁతలై
జగము ల్గంపమునొంద మ్రోసె ఘనము◆ల్సంభీషణాహంకృతిన్. 1569

సీ. గగనమండలభద్ర◆కాయమానంబున, ఘనపంక్తులను మేలు ◆ కట్లుగట్టి
ధరణివేదిక మీఁదఁ◆గరకానికాయమౌ, క్తికములరంగవ◆ల్లికలు దీర్చి
ఘనఘోర భేరికా◆ధ్వనులు బర్హిణగళ, చ్ఛాదకానాశనినా◆దములు మ్రోయఁ
దెగని మెఱుంగుల ◆ దివ్వటీలు చెలంగ, ద్విజరాజమంత్రిము◆ల్విస్తరిల్ల
గీ. వృష్టిగజరాజగామినీ◆విభుఁడు సమయ, పురుషుఁడయ్యేడ నిమ్నగా◆పుత్త్రికలను
గాంచి పెంచిప్రమోదంబు◆గడలుకొనఁగఁ, బరిణయమొనర్చె శరధికి◆భవశరధికి.

హంసవింశతి, ఆ 5 పద్య 55, 57 62.

మ. అలపాథోనిధిజీవనంబు సెడకాఁ◆డై తెచ్చి మేఘుండు ని
ర్గళదంతస్సగభీరభావరసమై ◆ కన్పట్టుకల్లోలినీ

జలజాతాక్షుల కిచ్చి ప్రాణవిభునిన్ ♦ సర్వంకషప్రౌఢిమన్
గలయంజేసె ఘనుల్ పరోపకృతికి♦ఖ్యాతప్రశంసుల్ గదా. 1571

శకుంతలాపరిణయము, పె. నా. ఆ 3 పద్య 44.

క. దళమయ్యె వర్ష మంబుధిఁ, దలక్రిందుగఁ బట్టినట్లు♦ధారాశ్రేణీ
ఝళఝళలున్మ్రింపులబల్ధళధళలున్ స్తనితఘళఘళ♦ళల్వెలసిల్లన్. 1572

శుకసప్తతి, ఆ 3.

శా. అన్యాయంబున హెచ్చి గ్రీష్మబుభురా♦జశ్రాంతమున్ భోజనో
దస్యాతాపము సేర్పరింపఁగనిక్రో♦ధస్ఫూర్తి గర్జిల్లుచు
ర్జన్యుండభ్రరథస్థితిన్ మణిగణ♦చ్ఛాయల్ దలిర్పన్ మహా
జన్యస్థేమము నూపెనో యన శరా♦సారంబు పర్వెన్ వడిన్. 1573

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 1 పద్య 142.

గీ. నవరసాన్వితమగుచును♦దరమనోజ్ఞ,తరళజలధరలక్షణో♦దారవృత్త
మైత్రబంధలీలఘనశ♦బ్దప్రయుక్తి, మహిమ నలరారె వర్షాగ♦మంబు మహిని.

రామచంద్రోపాఖ్యానము, వా. వెం. ఆ 4 పద్య 58.

సీ. కలమాంకురారోప♦కరశాలిపాలికా, స్త్రీప్రాళికిసరస్వ♦తీప్రసన్న
మాతృక్షితికృషిక్రి♦యార్థవృద్ధినియుక్త, హాలికబాలురకన♦ధ్యయనపర్వ
మన్యసంవసథప్ర♦యాణప్రయోజన, ప్రవణప్రజలకెల్ల ♦ గ్రహణశూల
యార్కసందర్శనా♦నంతరాభ్యవహార, శీలురకేకాద♦శీవ్రతంబు
గీ. నిజనివాసగృహాన్యమం♦దిరయియాను,ఖగసమూహంబులకునెల్లఁ♦జిగురుఁగండె
నిఖిలపశుయూథములకెల్ల♦నిగళబంధ, మెడతెగనివానజడినప్పు♦డెసఁగెముసురు.

మహేంద్రవిజయము, ఆ 2 పద్య 88.

చ. కమలభవాండగేహమునఁ♦గంధగభాండగళజ్జలంబుచేఁ
గ్రమముననర్క్యయార్క్యకర♦కాకులమార్తికరంగవల్లికల్
క్రమముగఁదీర్చితీర్చిచప♦లాపటలీఘనదీపజాలముల్
విమలతఁబెట్టిపెట్టివెడ♦లెన్ ఘనకాలపులక్ష్మి యెంతయున్. 1576

సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 7.

సీ. నీలమేఘంబను♦నీలాంబరముఁ గట్టి, పూర్వాస్తగిరులను ♦ బూర్ణకుచము
లందునమించులే♦పొంపమిరపికగాఁ, బొందుగాగూర్చి సం♦క్రందనధను

రాభరణంబులు ◆ శోభిల్లవృష్టికా,లత్రివిక్రముఁగూడి ◆ లలితగగన
లక్ష్మిజలాశ్మజా◆లస్ఫురన్మౌక్తిక,ములు రాలగర్జిత◆ములునుమణిత
గీ. ములువిరాజిల్లఁ గ్రీడించి◆మోదజాశ్రి, జలము లిలకునుబాలంగఁ◆జల్లఁదనము
గాఁగసపితివిరోధంబు◆గాకయుండఁ, జెలఁగెనన దంబువిరామవా◆ర్షికదినంబు.
భార్గవపురాణము, ఆ 6.

---

# శరదృతువు.

—:0:—

ఉ. భూసతికిం దివంబునకుఁ ◆ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకర◆మైవిలసిల్లెమహర్షిమండలో
పాసితరాజహంసగతి◆భాసిప్రసన్నసరస్వతీకమ
లాసనశోభితంబగుచు◆నబ్జజుయాసముతో సమానమై. 1578
ఉ. శారదరాత్రులుజ్జ్వలల◆సత్తరతారకహారపంక్తులం
జారుతరంబులయ్యె విక◆సన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ ◆ దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచి◆పూరములం బరిపూరితంబులై. 1579
చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ ◆ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల◆వైభవజృంభణ ముల్లసిల్లను
ద్ధురతరహంససారసమ◆ధువ్రతనిస్వనముల్ చెలంగఁగాఁ
గిరము వెలింగ వాసరము◆ఖంబులు శారదవేళఁ జూడఁగన్. 1580
శా. దానాంభఃపటలంబునం బృథుపయో◆ధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషముబృంహితచ్ఛలనఁ బ్ర◆చ్ఛాదించి పాంప్రవృట్పయో
దానీకంబుశరద్భయంబుననిగూ◆ఢాకారతన్ డిగ్గనాఁ
గా నొప్పారె మదోత్కటద్విరదసం◆ఘంబు ల్వనాంతంబునన్. 1581
భారతము, ఆర. ఆ 4 పద్య **141, 142, 143, 144.**

మ. మునువర్షోదకధారలన్ ముదముతో◆మూర్ధాభిషేకంబుఁగై
కొనిశుభ్రప్రకటశోభియయి సం◆క్షుభ్యన్మరాళావళుల్

ఘనవాలవ్యజనంబులై మెఱయఁగాఁ ♦ గాంతేందుబింబాతప
త్త్రనిరూఢిన్ శరదంబరంబమరె నుద్యద్రాజచిహ్నంబులన్. 1582

హరివంశము, పూర్వ. ఆ 7.

శా. సోమస్ఫూర్తికరంబు నిర్మలనదీ♦స్తోమప్రవాహంబు ని
ర్ధూమాతంబు నిరస్తకర్దమధరి♦త్రీకంబు శుభ్రీకృత
వ్యోమాశాంతము ఫుల్లకాశముఁదుషా♦రోద్గారియున్మీలితో
ద్దామాంభోజసరోవికాసము శర♦త్కాలంబు గానంబడెన్. 1583

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 404.

శా. సోమశ్రీలకునన్నె వెట్టును, ఘన♦స్తోమంబునం బర్వు నా
శామాలిన్యము నోలిఁ ద్రోచు, నవరా♦జద్రాజహంసావళిన్
ప్రేమంబుం బచరించు మానసమునం♦బెంపై శరద్వైభ్రమం
బామోదప్రదమైన విశ్వవిభుస♦ద్వ్యత్కీర్తికిన్ సాటియై. 1584

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 104.

ఆ. నీరదములులేక ♦ నిర్మలాకారమై, యాకసంబుచూడ ♦ నతిశయిల్లె
విగ్రహంబులెల్ల ♦ విడిచి సౌమ్యజ్ఞాన, యుక్తుఁడైనదివ్య♦యోగిఁబోలె. 1585

ఆ. తొల్లివిడిచియున్న♦తోయజాకరముల, యంచు మఱలఁ జేరె ♦ నంచపిండు
పూర్వసంచితార్థ♦ములకుయోగజ్ఞాను, లందమగుడనిల్చు♦నవ్విధమున. 1586

విష్ణుపురాణము, ఆ 7 పద్య 220, 223.

ఉ. రాజమరాళలబ్ధగిరి ♦ రంధ్రము శాలివనీశరావలీ
వైజననంబు యజ్వహుత♦వాజహుతాశము భాస్వదిందిరాం
భోజసమాగమం బుదిత♦బోధభుజంగశయోపచారనీ
రాజనఫుల్లహల్లకస♦రంబుదయించె శరద్దినంబులన్. 1587

చ. అలిగరుదంచలామలత♦దంతరబింబితయయ్యెఁ బాకని
ర్గళితమహాఫలోఘహరి♦తచ్ఛదకర్కరికావనాలి సాఁ
గలమువనభ్రమచ్చుకని♦కాయములో వలసాంధ్యరక్తమం
బలఁతిగఁ దాల్చి మింటఁ గన♦నయ్యె విపాండుపయోదఖండముల్. 1588

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 137, 141.

సీ. జగతీస్థలము పట్టు♦చాలమి వరికించి, చాలించు లీలవ♦ర్షములు వెలిసెఁ
దైకొన్నని రెల్లఁ♦గ్రిక్కించి రవి నాక, విడుచు లీల మొయిళ్లఁ♦కిడయఁ బాఱెఁ

బ్రావృడ్జననితోడఁ ♦ బాసినబిడ్డలై, పెంపేది నదులు శో♦షింపఁ జొచ్చె
రాజులదండయా♦త్రలఁ దొడ్క్కుడగుభీతి, నిలఁజొచ్చెనవరొంపు♦లివురఁబొలె
ఆ. జలముకలఁకదేఱె ♦ సస్యముల్పక్వంబు,లగుచువచ్చెఁ దెల్ల♦నయ్యెఁ దిసలు
తెల్లుపూచె నంచ♦లెల్లెడఁ గొలఁకుల, నుల్లసిల్లె శార♦దోదయమున. 1589

కవికర్ణరసాయనము, ఆ 2 పద్య 60.

గీ. కలితగాంగేయమహిమంబు♦కలశజోద, యప్రభావముపాండుప♦క్షాధికతయు
ధార్తరాష్ట్రాభివృద్ధియుఁ♦దనర జగతి, శరదృతువుమించె భారత♦సమితిగాంచి.

ఇందుమతీపరిణయము, కు. భూ. ఆ 3 పద్య 114.

ద్విపద. కాలతోయములోని♦శరవుమీలకును, గాలంబుగతి శర♦త్కాల మే తేరఁ
గమలాకరంబులు ♦ కడు లేట లయ్యెఁ, గమలాకరశ్రీలు♦కడు విస్తరించె
గసములువింటసా♦రసపునారసము, పొసఁగించి విరహులఁ♦బొంచె మన్మథుఁడు
విరిసె దిక్తటుల కా♦విరివిరివొదలె,సరసవాసనలతోఁ♦జల్లనై యలరె. 1591

అష్టమహిషీకళ్యాణము, ఆ 2.

సీ. దుష్కాలయనుబోలె♦దుహినవిపాతవై, ఘరులన్నిదిక్కులఁ ♦ గలయనుంచి
కుటిలభూపతిబలెఁ♦గువలయకమలాళి, వృద్ధిదుర్వ్యాపార♦విధినణంచి
యాతతాయివలెనె♦యతులితదోషాలి, శయములోకమెలుంగ♦సంతరించి
కాకోదరుఁడుబలె♦ఘనకంచుకంబులు, లలినచ్చుటచ్చుట ♦ వెలయనించి
గీ. బహుళపానీయశాలలు ♦ పాడుచేసి, తాళవృంతకదంబముల్ ♦ మూలకదిమి
యుల్లములు తల్లడిల్లంగ♦నుల్లసద్ఘనాంతికంబగుచెంత హేమ♦మంత మెదిరె.(?) 1592

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 7 పద్య 9.

సీ. కార్తికచంద్రవి♦స్ఫూర్తివస్త్రములతోడఁ, జంద్రికామందహా♦సంబుతోడ
హరిదంతరాచ్ఛవి♦స్ఫురదంబరముతోడ, విమలకల్హారనే♦త్రములతోడఁ
దారావళీస్వచ్ఛ♦హారావళులతోడ, నతులరాజమరాళ♦గతులతోడ
నభ్రవిభ్రమకళా♦దభ్రమధ్యముతోడఁ, గమలకోమలపదా♦బ్జములతోడ
గీ. వితతసత్కాచచామర♦ప్రతతితోడ, సకలకవిరాజసంస్తుత్య♦వికలుషైక
జీవనస్థితినెరసనా♦నావనీత, లమల శారదసమయవి♦లాసలక్ష్మి. 1593

వైజయంతీవిలాసము, ఆ 3 పద్య 78.

సీ. ఆదిసములనువ♦ర్షాన్యగోచితముగా, విలసైనవానలు ♦ వెలుచునంతఁ
ద్లొవాటెనయట్టి ♦ తెలఁగునవావేశ, దశన(?)జెల్లి ♦ జనులుపొగడ

హంసనాదములు గా♦హళులుగాఁ దిత్వత్క, లఘుచాలనములు తా♦ళములు గాఁగ
ముదమునఁ గ్రాలుతు♦మ్మెదలఝుంకారంబు, లమరినీవీణాస్వ♦రములు గాఁగ
ఆ. యోగనిద్రఁ జెంది♦యున్న విష్ణుని మేలు, కొలుపఁ గడఁగు గాయ♦కుండనంగ
బంధుజీవహర్ష ♦ పదమూచుఁ దద్రాగి, మయముగా శరత్స♦మయమునయ్యె. 1594
ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 7.

శా. అంతన్ భ్రాంతసరస్సమగ్రబిసనా♦శాహంసలీలాపరి
భ్రాంతానంతమరాళికానిచయను♦శాద్రివ్యస్వనాకర్ణనా
శాంతాత్యంతకుతూహలోల్లసితభా♦స్వచ్ఛాళిపాలీఘన
స్వాంతంబై శరదాగమంబు దనరెన్ ♦ సర్వంసహామండలిన్. 1595
సర్పపురమాహాత్మ్యము, ఆ 2 పద్య 22.

సీ. మదహంసగమనసం♦పదలందివిలసిల్లి, కాశప్రపిచ్ఛటా♦కలన మెఱసి
చంద్రముఖస్మేర♦చంద్రికల్వెదచల్లి, నక్షత్రమాలికో♦న్నతిఁ జెలంగి
స్వచ్ఛాంబరద్యుతి♦చాకచక్యము నొంది, భువనపంకము లింక♦ బోవఁ జేసి
యజ్ఞోద్భవప్రభా♦వాప్తిఁ బ్రకాశించి, బహువర్ణశోభియా♦హంసఁ దాల్చి
గీ. లోకవితతులు నిజకుక్షి♦లో భరించి, సితపయోధరకళలచే♦ నతిశయిల్లి
విలసితోత్పలమాలికా♦వృత్తితఁ గని, యలరె శారదవలె శార♦దాగమంబు. 1596
మిత్రవిందాపరిణయము, కుం. వేం. ఆ 1 పద్య 88.

క. సముదితకలశజరుచికత, కమఠితనిష్కల్మషోద ♦ కవిజృంభితశా
లిమనోజ్ఞక్షేత్రవిశా, లమగుశరత్కాలముజ్జ్వ♦లంబై తోఁచెన్. 1597

సీ. అలమహానీలఘ♦నానీకమడరెన, నంతమందునవల♦రారె శ్వేత
తారక్షపతిసుక♦రోరుద్యుతుల్ పృథు, నలకుముదస్ఫుట ♦ విలసనములు
పటుచక్రిమేఘపు♦ష్పగవయస్వనములు, సుముఖగజర్షభ ♦ ప్రమదలీల
లున్మనోహరశర♦భోస్మేరవలుదధిము, ఖార్కగవాక్షవి♦హారకృతులు
గీ. పనసనవ్యశో♦భారంభ♦భవ్యగతులు, ప్రబలెనాసత్యధర్మజ♦రాజరాజ
తనుభవసుబాహువిజయయా♦త్రలుదనర్చె, నాశరద్యోగమతివిస్మ♦యంబు మెఱయ.
లంకావిజయము, ఆ 2 పద్య 29, 31.

గీ. రాజు మిత్రులఁ బ్రసన్నుఁడై♦తేజరిల్ల, వాహినులు చాలనిర్మల♦త్వము వహించె
క్షితినిధర్మంబు రాజాను♦గత మటంచు, నార్యులాడిన మాట య♦థార్థమరయ.
మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 4.

సీ. రాజహంసలకును ♦ రాజహంసలకును, ధారాధరావరో ♦ధంబణంగె
సన్మార్గసీమల ♦ సన్మార్గసీమల, నత్యంతనైర్మల్య ♦ మధిగమించె
శరకలాపములందు ♦ శరకలాపములందు, గణనమీఱినరుచుల్ ♦ గానవచ్చె
భూదేవమణులకు ♦ భూదేవమణులకు, సాంద్రమహాహవో ♦ త్సవము పుట్టె
గీ. ధరణిఁ గాంతారములును గాం ♦ తారములును, సరసభావంబుఁ గాంచి ప్ర ♦ శస్తి కెక్కెఁ
గోవిదారప్రసూనప్ర ♦ భావిభాస, మానమైనశరత్కాల ♦ మహిమ దోఁప. 1600
దిలీపచరిత్రము, ఆ 1 పద్య 97.

ఉ. కాశదుకూలమింపెసఁగఁ ♦ గట్టి విధుండను మోము భాసిలం
గా శతపత్త్రిముల్ వెడఁద ♦ కన్నులుగా నళహంసముల్ గతుల్
గా శతపత్త్రికోశములు ♦ కమ్రకుచంబులునై కడుం దగం
గా శరనాథ(?) సైకతవి ♦ కాసనితంబముతోడ రాజిలెన్. 1601
భార్గవపురాణము, ఆ 6.

క. పులినములు మెల్ల మెల్లన, పొలుపునఁ గాన్పించె నదులఁ ♦ బొలఁతులు మరుకే
ళులఁ బ్రియులఁ గూడి సిగ్గున, వలరఁగ జఘనములకరణి ♦ నాసమయమునన్. 1602
వల్లీపల్లవోల్లాసము, ఆ 3 పద్య 28.

---

# హేమంతర్తువు.

మ. తరుణీయౌవనగర్వజృంభితకుచో ♦ దగ్రోష్మగంధంబులన్
వరకాశ్మీరసాంకవాగురురస ♦ వ్యాసక్తులం బట్టి కాం
బరమాంజిష్ఠపటాదులన్ హిమగతిం ♦ బాఱింపరీవిశ్వభూ
వరు మెచ్చించినసత్కవీంద్రులతులా ♦ వాసంబులం దిమ్ములన్. 1603
కావ్యాలంకారచూడామణి, ఉల్లా. 3 పద్య 106.

క. కలవింక కలకలాకుల, వలభీగర్భములు సౌధ ♦ వాటములు పురం
బులయందుఁ దుహినవేళలఁ, జలి గులగులకూయునట్టి ♦ చందం బొందెన్. 1604
శివరాత్రిమాహాత్మ్యము, శ్రీనాథ. ఆ 4 పద్య 21.

క. అన్నులచన్నులదండవి, పన్నులు గాకెల్లవారు ♦ బ్రదికిరిగాకీ
చన్నులుమీఁటినవలినా, పన్నులుగాకుండఁదరమె ♦ బ్రహ్మాదులకున్. 1605

ఆ. పొదుపుఁగొండమీఁదఁ♦బొడుచుట మొదలుగాఁ, బరువువెట్టియినుఁడు♦పశ్చిమాద్రి
మఱుఁగుఁజొచ్చెఁగాక ♦ మసలినఁజలిచేతఁ, జిక్కఁజిక్కనఁగ ♦ జిక్కకున్నె.

భాగవతము, స్కం. 10 పూర్వ పద్య 800, 801,

సీ. నేలయంతంతయు ♦ నెఱిఁజంద్రికాంతపు, టాలఁగట్టించిన ♦ లీల మెఱసె
నింగియంతంతయుఁ ♦ బొంగిదుగ్ధాంభోధి, నిట్టదొట్టినమాడ్కి ♦ దట్టమయ్యె
సకలజీవులమీఁదఁ ♦ బ్రకటమైహరికీర్తి, కలయఁబర్వినమాడ్కి ♦ దెలుపుమాఱె
నక్కజంబుగనెల్ల ♦ దిక్కులునొక్కటఁ, దెరచీరలెత్తిన ♦ కరణిఁ దోఁచె

గీ. నగములెల్లనుసీహార♦నగము లయ్యెఁ, దరువులెల్లనుఘనసార ♦ తరువు లయ్యెఁ
బక్షులెల్లను రాయంచ ♦ పదువు లయ్యె, గురుతరంబగుపెనుమంచు♦కురియుకతన.

పద్మపురాణము, ఆ 1 పద్య 76.

ఉ. వ్రిక్కలువంచు వంచి ముని♦పండ్లునుపండ్లునురాచు రాచిజో
మ్మక్కిలఁజేయఁ జేసి తల♦యల్లనఁగాళులసందు సందిలో
చక్కిలినొక్కి నొక్కి యిరు♦చంబడ గుమ్మడివూటఁగట్టిపీ
పెక్కు దువాళిచేసి చలి♦యిక్కడనక్కడఁ బెట్టువేకువన్. 1608

క్రీడాభిరామము, పద్య 46.

గీ. హిమముచేనంబరంబెల్ల♦నిరుగొనఁగ, నుష్ణకరుఁడునుగరములో♦యొయ్యయ్యసాఁచి
తానునలాంశధరియింపఁ♦బూనెననఁగ, నెంతయనవచ్చునింక హే♦మంతమహిమ.

శ్రీరంగమాహాత్మ్యము, క్షే. క. ఆ 2 పద్య 241.

క. చెప్పనశక్యంబగుచలి, యుప్పతిలంబాలవృద్ధ ♦ యువజనములకుం
దప్పకశరణము లయ్యెం, గుప్పసములు మున్మురములు ♦ గుచకుంభములున్. 1611

కవికర్ణరసాయనము, ఆ 6 పద్య 30.

చ. అలనిజభూరిసారములో♦యూరముతో మధుపాళికిచ్చి యో
రల ద్విజరాజుమెల్లనక♦రంబులుసాఁచినమోముగందియా
కులతఁజెలంగుపద్మినుల♦కున్ సిరులెంతయుదూరమయ్యె భూ
స్థలినినపాత్రదాతలకు ♦ శాశ్వతమేరమణీయసంపదల్. 1612

క. చెలువగుజనహస్తంబులు, వెలవడియొకచోటఁ దాళ♦వృంతము లుండెన్
బలువడి నుడిగము చేసిన, యలయిక నుఖనిద్రలందు ♦ నందముమీఱన్. 1613

చమత్కారమంజరి, ఆ 1 పద్య 39, 41.

గీ. చలికి బెగడొంది మేరువు ♦ చాటుఁజొచ్చి, యొట్టకేలకుఁ గాని రాఁ ♦ డినుఁడు వెడలి
వెడలి పరువెత్తి యపరాద్రి ♦ వెనుక కేఁగు, నితరజనముల శీతార్తి ♦ యెన్న నేల. 1614
కవిరాజమనోరంజనము, ఆ 4.

సీ. దినముఁ బ్రాతస్స్నాన ♦ మొనరించు ద్విజులకు, నగు కర్మలోపభ ♦ యంబుకంటెఁ
బాఁచిపనుల్ సేయ ♦ లేమి కోదండ్రికా, నత్తలవలని భ ♦ యంబుకంటె
గడువులో దూర మేఁ ♦ గఁగనున్న చరులకు, నధిపుచే నొదవు భ ♦ యంబుకంటెఁ
గర్షణం బొనరింపఁ ♦ గడఁగు కాఁపులకార, యమిఁ బైరు చెడునన్ భ ♦ యంబుకంటెఁ
ఆ. గడిఁది యయ్యె సీతు ♦ ఖగమృగపశునర, ప్రముఖజంతువులకు ♦ భావములను
జాల మించె మిథున ♦ సంపర్క సౌఖ్యంబు, శిశిరమహిమ వినుతి ♦ సేయవశమె.
ఉత్తరరామాయణము, ఆ 5 పద్య 283.

గీ. హైమకంకణభూషిత ♦ హైనఁ గాని, సరసులను గూడి ముఖసార ♦ సములయందు
దేజరిల్లవు శీతఁ బ ♦ ద్మినులు (?) యుక్త, మినకరస్పర్శనము లేమి ♦ యేమి నుతము. 1616
సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 13.

---

# శిశిరఋతువు.

—:O:—

చ. వెరవున నాత్మవంశ్యుఁడగు ♦ విశ్వనరేశ్వరు మీఁది ప్రీతిఁ జం
దురుఁడు తుషారసంహతుల ♦ దొడ్డుగఁ బంచిన వచ్చి యచ్చటన్
బరిగొనఁ బోలునంచుఁ జెడి ♦ పాటిన వైరులు భీతిఁ గానలోఁ
దిరముగ నిల్వ నేరరొకొ ♦ దే యని చూతురు పంద లాత్మలన్. 1617
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 108.

క. పసిఁటిజడికి నామని, వెన్నెల కంభోదవేళ ♦ వీడ్కోలు పువరో
జోన్నతికి ధాన్యలక్ష్మి ప్రసన్నంబగు నెళవు శిశిర ♦ సమయము దోఁచెన్. 1618
కవిరాజమనోరంజనము.

సీ. ఫాలభాగంబునఁ ♦ బ్రాలేయకరవాలి, శీతభీతి, వహించె ♦ వీతిహోత్రుఁ
బార్శ్వస్థుఁ గావించె ♦ బలభేది సతతంబు, చలిమిరిభయమున ♦ శ్వాసనసఖుని

గర్భదేశమునందుఁ ♦ గల్గొలిసిశుండు, చలికిఁ బెడఁబాగ్ని ♦ నిలుపఁ గొనియె
సాయంపరిభాతావ ♦ సరములఁ జలిదీఱఁ, బ్రజ్వరిల్లఁగఁ జేయు ♦ యజ్వ జ్వలను
గీ. వారెయిటులుండిరింకేని ♦ వలనటంచుఁ, బ్రహతధూమాంచదంగార ♦ సహితసృఘఃహ
సంతతాయంత్రిసేవకా ♦ సక్తచిత్తు, లైరి ప్రజలెల్ల నాశిశి ♦ రాగమమున. 1619

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 3 పద్య 118.

సీ. హరిలోకసంచార ♦ నిరతాభిలాషపూ, రుషచయాభీష్టద ♦ రుచిరపథము
తరుణతాతిగదశా ♦ పరిపూర్ణశాలిత్వ, సారానుభవమోది ♦ సర్వజనము
దినదినానూనసం ♦ దీప్యత్తివృషాంపతి, సుప్రభాపటలాతి ♦ శోభితంబు
పటుతరభూమిరు ♦ ట్పర్ణేవిదంకుర, త్పాండుపర్ణద్యుతి ♦ భాసితంబు
గీ. ననుదినవివర్ధమానస ♦ వనసముదయ, మూలకారణవిస్ఫూర్తి ♦ లాలితంబు
నగుచుఁ దనరారెఁ జూడన ♦ య్యవసరమున, భానురంబగు శైశిర ♦ వాసరంబు. 1620

కౌసల్యాపరిణయము, ఆ 2.

గీ. కొన్ని హేమంతచిహ్నముల్ ♦ గొనలు ప్రాఁకఁ, గొన్ని వాసంతచిహ్నముల్ గుదురుచెంద
శైశిరంబొప్పననుయాయి ♦ సమభియాయి, బంధుసమసేవ్యమానార్య ♦ వర్యపగిది.
సీ. వానంతపంచక ♦ వాసరంబులకెల్ల, నగ్రగణ్యతఁ గాంచి ♦ యలరు నెద్ది
హరిణయోషనయాన ♦ పరిముఖశుభక్రియో, త్సవరత్నములకుని ♦ ధాన మెద్ది
రవిదీప్తిరయుక్రాంత ♦ రాణించి పరిబలఁగా, నాత్మప్రకృతిశాణ ♦ మైనదెద్ది
శైవలింగాంకురం ♦ బావిర్భవము నొందె, పెరుఁగంగఁ దొల్కారి ♦ వేళ యెద్ది
గీ. యుభయసంధ్యాసమానము ♦ హాలా గ్రమెన్ని, యద్ది గనుపట్టు బుతువుల ♦ కనుఁగుఁ బస్సుఁ
దగుచు నాత్యుష్ణదివస మై ♦ నాతిశీత, రజని యై ధాత్రిపై శైశి ♦ రంబుమిగుల. 1622
ఉ. పచ్చిక పైరులుం బెరుఁగ ♦ బండిన ధాన్యపు నూర్పుకళ్ళముల్
హెచ్చుము లేనియిక్షువులఁ ♦ బూనికఁ బొనక మాడు గానుఁగల్
హెచ్చుగ నొప్పు చప్పరము ♦ లొప్పెడఁ జల్లనినీటి కాలువల్
ముచ్చటదీరఁగన్నుఁ డను ♦ పున్ శిశిరర్తువునందుఁ జేలలోన్. 1623
సీ. బలితఁపుటాకుఁ దో ♦ టలపని రత్తనే, తముఁ దోడు జనులగా ♦ నముల సొబగుఁ
బొలిహెచ్చి కోలకు రాఁ ♦ గొలుచు కళ్ళము నూర్పు, కాఁపు బిడ్డలగీతి ♦ కస్యనంబుఁ
బండిన పేరెత్తఁ ♦ బసరు పై రేదఁ గా, వలియున్న చెలులగీ ♦ తులనవంబుఁ
జెఱకు సుగానుఁగు లెన్నఁ ♦ జాఱుకు గానడిపించు, నైతనికులానర్చు ♦ పాటనుటిపుఁ

గీ. గూడిచిఱుచలినిద్దుర ♦ వీడలేని, పాంథజనముల మేల్కొల్పి ♦ పైనములకు
హెచ్చరికఁజేయుగ్రామబ ♦ హిర్వితర్ది, కాతతులనుండిమాగధ ♦ గీతులగుచు 1624
రామరాయవిలాసము, ఆ 3 పద్య 113, 114, 120, 122.

---

# అరణ్యము.

—:0:—

సీ. కకుభాశ్వకర్ణతిం ♦ దుకబిల్వఖదిరమ, ధూకపాటలసాల ♦ దుర్గమంబు
కంకశిఖిల్లీబక ♦ క్రౌంచఘూకానేక, కాకకులస్వన ♦ కలకలంబు
సూకరహర్యక్ష ♦ శుండాలశార్దూల,శరభాదిమృగకుల ♦ సంకులంబు
బాయతబహుతర ♦ చ్ఛాయానిరస్తస,మస్తతీవ్రాంశుగ ♦ భస్తిచయము
గీ. వంధకారీకృతాశాంత ♦ రాంతరంబు, దుర్నిరీక్ష్యంబుజనలోక ♦ దురవగాహ
మఖిలవనమృగగణశర ♦ ణ్యంబునీయ,రణ్య మారయ నెవరియ ♦ రణ్యమనిన. 1625
భాస్కరరామాయణము, బాల. పద్య 230.

సీ. అనఘులోకవిలోచ ♦ నాలోకమహిమాభి, వృద్ధిరోధికుజన్మ ♦ విటపపటలి
యప్రతీపాశ్రియా ♦ నల్పకల్పితకన,త్క్రమనీయఘనధూమ ♦ గంధపేటి
బహువిధజంతుసం ♦ బంధపరస్పరా, తనుసంగరక్రియా ♦ స్థానభూమి
యున్మత్తరూపవ ♦ యోవిశేషోద్ధూత, నాదమంజులతోక ♦ నద్గృహాళి
గీ. నర్మదాస్పదమధుపాంగ ♦ నావినోద, గీతలోలభుజంగసం ♦ కీర్ణమగుచు
వేశ్యవాటికపగిదివో ♦ ల్పవెలసినట్టి, కాన వీక్షించె ధారుణీ ♦ కాంతుఁడెలమి. 1626
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 94.

గీ. కనిమహీశుండుకంటిరే ♦ వనవిలాస, మధికసత్వసమృద్ధిస ♦ మాశ్రితేంద్రి
యానిశాచరావనస్థితి ♦ మదనజనక, మగుచు హరిపోలె నిదిచాల ♦ నబ్రెుసగె.
నలచరిత్రము, సి. ధ. ఆ 3 పద్య 26.

సీ. కరులు మేఘములుకీ ♦ కరకదంబమువాన, కీచకధ్వనులు ఘో ♦ కీరవములు
చెంచుముద్దియలమే ♦ సిరులు మెఱుంగులు, మణిఘృణుల్ హరిధను ♦ ర్మంజురుచులు

చమరికావాలసం♦చలనముల్ పవనముల్, మృదులసాంకవమృగీ♦మదముఖురద
కపురంబునురువుసిం♦గపుఁబొబ్బలుఱుములు, హిమజాలపూరమిం♦పెసఁగువఱద
గీ. హరినఖరదారితోన్మద♦ద్విరదకుంభ, గళితముక్తావళుల్ వడ♦గండ్లగములు
గాఁగవర్షాగమంబువై♦ఖరిని దనరు, నవ్వనస్థలిదాఁటియ♦త్యాశుగతిని. 1828

రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 4 పద్య 7.

సీ. శక్రరంభాహారి♦జాతకైరావత, ఖ్యాతమై నాకలో♦కంబుకరణి
గాలవశాండిల్య♦కౌశికకపిలాది, వాసమై ధాతృని♦వాసమట్లు
వృషకుమారకశివా♦ప్రియశివాపరికలి, తంబయిరజతభూ♦ధరముమాడ్కి
మదనసువర్ణక♦మాధవలక్ష్మీన, నాథమైవైకుంఠ ♦ నగరిగరిమ
గీ. సంతతానందనాగేంద్ర ♦ సహిత మగుచు, విలసితంబగు నలరసా♦తలముపోల్కి
నెసఁగు నక్కాననంబుమ♦హితలేశ, కుంజరునకాత్మఁబ్రమదంబుఁ♦గూర్చెనపుడు.

రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 100.

సీ. హారీతశుకశారి♦కారవాక్రాంతంబు, పరభృతకూజిత ♦ భ్రాజితంబు
సరసగానకళాని ♦ శభ్రమద్భ్రమరంబు, ప్రమదనృత్యన్మత్త♦బర్హిణంబు
నికటసరోహంస♦నిస్వనాకీర్ణంబు, సాంద్రపుష్పపరాగ ♦ సంకులంబు
ఫలభారకుసుమస్త ♦ బకలసద్భూజంబు, మృదులమరందఝ♦రీపరీత
గీ. మతితరామోదమేదురా♦త్యంతశీత, లానిలకిశోరవారస♦మాదృతంబు
నైనయక్కాననంబుభూ♦జానికపుడు, మోదమొనఁగూర్చెగడితంపు ♦ సేదఁదీర్చి.

సర్పపురమాహాత్మ్యము, ఆ 2 పద్య 32.

సీ. ప్రాగద్రితటభాగ♦భాగహారపరాగ, రాగదూతఘనాఘ♦నాగకులము
దారితాభ్రశతార♦తారదంష్ట్రోదార, దారయుగ్భదార♦దారకంబు
మాలూరహింతాల♦తాలతూలరసాల, సాలకేసరసాల ♦ సాలయుతము
శబరయోషావండ♦చండరుక్కరకాండ, కాండఖండితగండ ♦ గండకంబు
గీ. పిండితాజాండగండభే♦రుండనినద, సంశ్రవణమాత్రవిత్రస్త ♦ శరభసరభ
సాగమనదర్శనోద్భ్రాంత♦హరివరేణ్య, మవుమహారణ్యమొకటిరా♦ఘవుఁడుగనియె.

ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 221.

సీ. ఘననిషాదస్వనం♦బెనయబోధిద్రుమ, చ్ఛదములుగబళించు♦మదగజములు
సటలుపైఁగ్రమ్మను♦ద్భటవృత్తి చంగున, నవనికిదాఁటుసిం♦హవ్రజంబు
కొలవులఁబ్రోవులై♦వలనొప్పనురుగులు, గుర్రెక్కుడుఘనభల్లు♦కపరితతులు
శృంగసంఘట్టన♦న్క్షితిరాజంబుల, నరిమిగోరాడువా♦హద్విషములు

గీ. చటులగరళజ్వాలనఘన♦జ్వాలలోలయు, చందనద్రుమకోటర♦స్థలులఁగ్రమ్మ
ఫణిగణంబుల ఫూత్కృతా♦ర్భటులుగలిగి,ప్రబలునకాననముఫల♦భరితమగుచు.
సీ. మల్లికార్జునఘన♦మహిమంబునఁ జెలంగి, శుకవాక్యరచనచే♦శోభితమయి
గంధర్వరాజసం♦కలితమై ప్రభఁజెంది, పుండరీకప్రాప్తిఁ ♦ బొలుపుమీఱి
గాలవశాండిల్య ♦ కౌశికయుక్తమై, నీలకంఠస్ఫూర్తి ♦ నివ్వటిల్లి
యైరావతస్థాన♦మనఁగఁ బ్రకాశించి, హరిబలిమిళితమై ♦ ధరణిమించి
గీ. శ్రీగిరియుభాగవతమును♦శ్రీదుపురము, నగ్నిదిశయామునిపదంబు♦హరుఁడుదివియుఁ
ద్వారకయుననియెన్నఁగా♦వరుసతోఁడఁ,దోరముగనుండునటికాం♦తారవనము.
కవిచకోరచంద్రోదయము, ఆ 2.

---

## ఆటవికులు.

మ. అగరుక్ష్మారుహకాష్ఠఖండముల స♦ర్వాంగంబులం జేసి మై
మృగనాభిన్మసిఁబూసి చామరము ధ♦మ్మిల్లంబుగాఁజుట్టి యే
నుఁగుకుంభమ్ములలోనిముత్యములఁ గ♦న్గ్రుడ్డుల్వినిర్మించి భి
ల్లగజేంద్రుల్ వెలబొమ్మలందవిదచే♦లం జేయుదుర్ గాపుగన్. 1634
క. ఏనుఁగులతలలఁ కొమ్ముల,తో నారబములకుదృష్టి ♦ దోషమువాయం
గా నెత్తుదు రెఱుకులు తమ,చేనికి బసరంబుతలల ♦ చెలువం బెసఁగన్. 1635
క. కొండలలోఁజేసిన తమ, పండినచేలకు వరాహ♦పంక్తులు చొరరా
కుండం దెల్లనిచామర, ఖండంబులు ప్రోఁగుదాళ్ళఁ♦గట్టుదు రెఱుకుల్. 1636
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 7, 8, 9.
సీ. చిలుకంపపొదికిఁ దా♦ర్చిన నెమ్మిపురిజగ్గి,చేనెక్కుడిన చేగ♦సెలసువిల్లు
గట్టిగాఁదట్టిగాఁ ♦ గట్టినపులితోలుఁ, గుడివంకదోఁపిన ♦ కుఱుచపిడెముఁ
బేరెదఁజేర్చిన ♦ పికిలిపూవులచేరుఁ, గుడిసందిగురిగింజ ♦ కుట్టుదండ
జుంజాఱుసికమీఁదఁ♦జుట్టినతలముళ్లు, దట్టిలోపలనఱ♦పెట్టుచుట్ట
గీ. కోరమీసలు మిడిగ్రుడ్లు♦గునుకునడుపు, బెదరుఁజూపులుఁగత మేనఁ♦గదురుకంపు
వలుదయొరచ్చులునుగల్గి♦వచ్చె నెఱుకు,పాశిగాఁడొక్కఁడాచంద్ర♦భానుకడకు.
చంద్రభానుచరిత్రము, ఆ 2 పద్య 2.

సీ. గొఱకయీఁటెలు మేటి ♦ కఱకు నారసములు, వంకకత్తులు పెడ ♦ వంకవిండ్లు
నడునెత్తి సికలుగీ♦ర్నామంబు లెకువారు, మెట్టులుక్రొవ్వాడి ♦ మెఱుఁగుసురెలు
కావిలాఁగులు సెలి♦కాసెలు వాగురుల్, గుద్దుకత్తులు నల్ల♦గొంగడీలు
నలుపుమీఱినకారు♦ములుచయొడళ్లు జుం, జురుగడ్డములు బలు♦కుఱుచదుప్పు
గీ. వలుదసోఱకాయదిప్పలు ♦ తులసిపేర్లు, గండ్రగొడ్డండ్లు చిక్కము♦ల్దండికోఱ
మీసముల్గల్గికొందఱు ♦ మృగయు లెదుటఁ, జేరిపాడఁగ నిమిగులజో♦హారులొసఁగి.

రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 63.

సీ. క్రోధరసంబు పే♦రుగుణాన వీనిలోఁ, గాఱెనా జేవురు ♦ కన్నులమర
నాననంబున వ్రేలు ♦ నఘుపంశగుల్మంపు, మూలమ్ము లన గడ్డ♦ములు జెలంగ
హాత్యలనెన్నెన్ని ♦ యనిగీచిన వితాన, ముండ్లజీరలు దేహ♦మున జెలంగఁ
బల్కుటంగనఁ దమ♦పల్లె నేనిలనీని, పాచి జేటినకప్పు ♦ పండ్లతోడఁ
గీ. బందిబల్లెలుతలయుంట ♦ పాటికొయ్య, లలసితడవిండ్లు దోటితో♦నంపపొదులు
నీలిదట్లును జెక్కిన ♦ నిడుపనూరు, నడర నగభిల్లులొకకొంద♦ఱరుగుదెంచి. 1639

పార్వతీపరిణయము, ఆ 6.

ఉ. క్రొవ్వు మెఱుంగుగబ్బొలయు ♦ గుజ్జగుమేనులతోడ నోరఁగా
దువ్విసిగల్ తలల్ ముడిచి ♦ దొడ్డగు నిత్తడిపోగులం జెవుల్
గవ్వలపేరులన్ నుదురు♦గప్పఁగ వంకరబొట్లుదిద్ది పై
గువ్వల వన్నెచేలమిడి ♦ కొందఱు చెంచులు వచ్చి ముందటన్. 1640

చిత్రసీమ, దళ 3 పద్య 78.

---

# ఆటవికస్త్రీలు.



సీ. స్తబ్ధరోమవిషాణ♦లబ్ధమౌక్తికములఁ, బాటింపుదురు రేఁగు♦పండ్లపాటి
ముక్తకంచుకమస్త ♦ ముక్తాఫలంబుల, మందలింతురు కురు♦వింద లట్లు
సమదసామజకుంభ♦జములైన ముత్తియంబులఁ జూతు రుసిరికా♦యలవిధమున
వేణుజాతములైన ♦ యాణిపూసలనెంతు, రూడుగపండ్లకు ♦ నీడుగాఁగ
గీ. గంధసారాగురుద్రుమ♦కాష్ఠఖండ, చయము దమయింటి వంటక♦ట్టియలుగాఁగఁ
జేయుదురు కాపురంబులు ♦ సేయునపుడు, చెంచెతలు చెంచులనుగూడి♦చిత్రలీల

ఉ. సంకుమదంబుమం బునుఁగుఁ ◆ జాఁదును గస్తురియుం ఘటంబులం
బంకముఁ జేసి యిండ్లలికి ◆ ప్రత్యహము న్వెలిపైవ మార్గకూ
లంకష గోమయప్రతతు ◆ లం బురిడించుచునుండు గుప్పలై
యింకఁ దదీయభూతినిద ◆ మిత్థమటంచు నుతింప శక్యమే. 1641

సీ. పట్టుచీరలఁ గట్ట ◆ భాగ్యంబు గల్గియుఁ, బారుటాకులఁ గట్ట ◆ భార మనరు
రాజాన్నభోజన ◆ ప్రాభవశ్రీ గల్గి, యును వన్యధాన్యంబు ◆ నొల్ల మనరు
మాణిక్యభూషస ◆ మాజంబు గల్గియు, నెఱ్ఱనికురువింద ◆ లేటి కనరు
మంచిమెచ్చులతూఁగు ◆ మంచముల్గల్గియుఁ, జాలుఁబూఁదీగ యు ◆ య్యాల లనరు

గీ. ఎంతసంపదగల్గియు ◆ నెట్టివారుఁ, దమకులాగతధర్మక ◆ ర్మములు విడువఁ
జాల రటుగానఁ దత్పురీ ◆ శబరసతులు, మహిమ గలిగియు మానరు ◆ సహజవృత్తి.

సీ. కలికుజాంజులు వెండ్రు ◆ కలకొప్పు గాఢత, రంబుగా నెమలిపిం ◆ ఛంబుఁ జుట్టి
తట్టుపున్నవవస్నె ◆ పెట్టినట్టిలలాట, పట్టిక జేగురు ◆ బొట్టు వెట్టి
కురువిందపేర్లకుం ◆ దెరువీనిపాలిండ్లఁ, బారుటాకులు గూర్చి ◆ పైఁటఁ దీర్చి
జమలిరొద్దాణంబు ◆ సందున నిఱియంగ, బర్హాంబరముఁ గట్టి ◆ బదిలపఱిచి

గీ. వీఁకఁ గలకుఁబు గనుఁపుల ◆ వెదురువింటఁ, జాఁగ పురిఁ దాల్చి నారిగా ◆ సంతరించి
గసికకోలలు గొని భిల్ల ◆ బిసరుహాక్షు, లడవిఁ దిరుగుదు రాత్మనా ◆ యకులఁ గూడి. 1643

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 4, 5, 6, 15.

చ. కుదురుగ జంగ సాఁచి చను ◆ గుబ్బలు మీటుగఁ బాలుటాకుఁబ
య్యెదపొదలంగ నెన్నుదురొ ◆ కింత చెమర్పఁగ మేచకాళి నే
ర్పుదొరలఁ బాడి చందనపు ◆ రోలున నేనుఁగుగొమ్ము రోకటన్
బ్రిదితెడు కొప్పుతో వెదురు ◆ బియ్యము గుప్పు నిజప్రియాంగనన్. 1644

వాల్మీకిచరిత్రము, ఆ 2.

---

# ఆటవికవస్తువులు.



సీ. నివ్వరిపాల్ఁలు తే ◆ నియపాలపండులు, కారెనుముల పెర్గు ◆ చాఱపప్పు
పునుఁగుచట్టంబులు ◆ పునుఁగుకట్టజవాజి, కమ్మకస్తురిపచ్చ ◆ కప్పురంబు

సేకలంబులకోర ♦ లేనుంగుకొమ్ములు, పురుడుజింకలు పెను ♦ పులులగోళ్ళు
హరిచయీకలు నెమ్మి ♦ పురిజొంపములు తెల్ల, సవరముల్ జల్లులు ♦ జాగిలములు
గీ. పికిలిపిట్టలు డేగలు ♦ బెట్టుదుతలు, పట్టుజిట్టలు ఫణిఫణా ♦ భద్రకుంభి
కుంభవరదంష్ట్రిదంష్ట్రికా ♦ కోటిగళిత, కలితముక్తాఫలంబులుం ♦ గాన్కఁజేసి.1645

శుకసప్తతి, ఆ 1.

సీ. అట్టులవ్వీరభ ♦ టావలుల్ దనివోక, వేడుకలెదమీఱ ♦ వేఁటలాడి
కరిదంతములునుగ ♦ స్తూరివీణియల్ పంది, కొమ్ముముత్తియములు ♦ నెమ్మికుత్తు
కలు పున్గుఁబిల్లులు ♦ ఘనచామరంబులు, పులిగోళ్లు మేటిరా ♦ చిలుకపిల్ల
లింపగుమంచిగం ♦ ధంపుఁదున్కలు పచ్చ, కప్రంపుపల్కులు ♦ గందవొడులు
గీ. చక్కెరల్ దియ్యతేనెలు ♦ చాఱపప్పు, లోనుగల మేలివస్తువుల్ ♦ పూని తెచ్చి
హెచ్చి మెచ్చులుగా ధరి ♦ త్రీశ్వరునకు, నర్పణ మొనర్చిరెంతయు ♦ న్నేర్పుమీఱ.

కవిచకోరచంద్రోదయము, ఆ 2.

---

# ఆటవికపల్లి.

—————:0:—————

సీ. అలరుకస్తూరితీఁగె ♦ లలికి వాకిళ్ళ చెం, తల వైచిపోయిన ♦ తట్టుపునుఁగు
గోడలుపూయంగఁ ♦ గుమ్మిగంధంబున, మేదించినట్టిజ ♦ వ్వాదియదును
నాడాడసరిచేసు ♦ లాడిపోవిడిచిన, ముదురువెదుళ్ళలో ♦ ముత్తియములు
బలుపుశేనికకొమ్ము ♦ టలవలపైఁద్రోవఁ, దవిలించికట్టిన ♦ సవరములును
గీ. వంటకట్టెలకని తెచ్చి ♦ వాములిడిన, యగరుమ్రాఁకులపైనిండ ♦ వాఱఁబెట్టు
కప్పురంపుటనంటులు ♦ గలిగి మెఱయు, నెఱుకుపల్లియలోకకొన్ని ♦ యెదుటఁగాంచి.

యయాతిచరిత్రము, ఆ 1.

సీ. తోరణంబులుగ వీ ♦ ఘులనారఁగట్టిన, యుప్పుఁగండలకునొం ♦ డొండదిరుగు
పులుగులపెక్కుగా ♦ డ్పులఁజాలనెగసెడు, పసరంపుఁబొలకంపు ♦ మునురుకొనఁగఁ
బసివట్టినలుగడఁ ♦ బఱచిన మెకముల, పచ్చితోళ్ళనుబండ్లఁ ♦ గ్రుచ్చిపెట్టుకు
బలుజాగిలంబుల ♦ ఘాఘోరవంబులఁ, గొంకిపంకములోన ♦ ఘుర్ఘురించి

గీ. పరువులిడునూరఁబందుల♦మెకిగవులు, చేఁపతట్టలఁగదురుతోఁ♦జెనసిచుట్టఁ
గూఁతవెట్టినజనులవా♦కొలుపఁజేయ,భయముఁగొల్పెడునొకబోయ♦పల్లెఁగాంచి.

వాల్మీకిచరిత్రము, ఆ 2.

సీ. పొసఁగఁగొప్పులవాస♦పోయంగ మిగిలిన, దంతంపువందల♦దొంతరలును
దపసికొత్తుగుప్పిసేఁ♦తలుసేసివిడిసిన, జల్లులవాముల♦మొల్లములును
గుమ్మ ముద్దలుచేసి♦గోడలవేయంగ, నున్నకస్తురిగొప్ప♦తిన్నియలును
జిగివారనున్నము♦ల్చేసిడించినకొమ్మ, ముత్యాలప్రోవుల♦మొత్తములును
గీ. జలికిసెగడులువేయంగ♦నిలిచినట్టి, మంచిగంధంపు మ్రాఁకులఁ♦మంచెలగరు
మ్రాఁకుమంచెలుఁగలిగివి♦స్మయముగొలుపు,చెంచుపల్లియలొకకొన్ని♦గాంచెనృపతి.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 85.

---

# తపోవనము.

—:0:—

సీ. శ్రవణసుఖంబుగా♦సామగానంబులు, సదివెడు శుకముల♦చదువుదగిలి
కదలకవినుచుండు♦కరులును గరికర, శీతలచ్ఛాయఁద♦చ్ఛీకరాంబు
కణములుచల్లని♦గాడ్పానపడివానిఁ, జెందిసుఖంబున్న♦సింహములును
భూసురప్రవరులు♦భూతబలుల్దెచ్చి, పెట్టు నీవారాన్న♦పిండతతులు
గీ. గడఁగిభక్షింపనొక్కూటఁ♦గలసియాడు,చున్న యెలుకలుబిల్లులు♦నొండుసహజ
వైరివర్గంబులయు సహ♦వాసమపుడు, నూచి మునిశక్తికెంతయుఁ♦జోద్యమంది.

భారతము, ఆది. ఆ 4 పద్య 23.

సీ. ఆవులునాకఁగ♦న్నరమోడ్పు పులులును, బాలుల చన్ గుడువంగ♦బోవులేళ్ళు
లేళ్ళపెల్లాట రం♦జిల్లెడుహరులును, హరులుగోళ్ళనుగోఁక♦నలరుకరులు
కరులకటాళివై♦ఖరినాడు పాములు, పాముల లాలించు♦బభ్రుతతులు
బభ్రుతతులపక్కఁ♦బాయనియెలుకలు, నెలుకలఁబెంచుపి♦ల్లులునుగలిగి
గీ. యపుడు పెంఁగొనరించె నా♦యంగనలకు, గీరభాషితపోషితా♦ఖిలతపస్వి
పటలతారకబ్రహ్మ♦భావనంబు, భావితశుభావనంబు త♦పోవనంబు. 1651

కళాపూర్ణోదయము, ఆ 3 పద్య 10.

సీ. హల్లీసకప్రమోద ♦ ఝల్లరీఝంకార, వల్లకీకలనాద ♦ వేల్లితంబు
పటుపటహాంకార ♦ పణవానకంగీర, వ్రతిస్తపథికేభ ♦ వలయితంబు
శుకశారికాదర్శ ♦ సురుచిరశ్రుతితర్క, మూలవచోయుక్తి ♦ ముఖరితంబు
శింజానమంజీర ♦ మంజుగుంజితహంస, సారసోత్సుకసార ♦ సారసంబు
గీ. పాత్రిజ్యమంత్రస్వరయుతదీ♦ప్రాజ్యహోమ, ధూమధూసరకేసర♦ద్రుమవిభాగ
మాహుతీరితశిఖిశిఖా♦వ్యాకులంబు, నైన యాశ్రమమండల ♦ మదిదనర్చె. 1652

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 1625.

సీ. నాచంయమోత్సంగ ♦ వత్సలసారంగ, మురుదశాలస్థూల ♦ యూపశతము
ప్రాగ్వంశబంధుర ♦ బహులగంధసాన్నాయ్య, మాగ్నీధ్రముఖ్యర్త్వి♦గాశ్రయంబు
నుగ్రామసఖయాయ♦జూకసామాజికం, బాతిథేయమయోట ♦ జాజిరంబు
పటుధవిత్రపవిత్ర♦పవనోజ్జ్వలత్రేత, మఘుమర్గణజ్ఞశౌ♦కాంచితంబు
గీ. సంతతబ్రహ్మవర్చస♦స్నాతకంబు, పరమయోగినిరాకృత ♦ పాతకంబు
హాస్త్రికైతిహ్యసహ్యాపం♦చాననంబు, బదరికాకాననంబుచూ♦పట్టెనెదుర. 1653

సీ. పవనవేగవిశీర్ణ♦పాదపాగ్రంబుల, జడియకుండఁగఁజట్టు ♦ సామజములు
పూజార్థనియమిత ♦ పుష్పవాటికలకై, మధుకరంబులఁజోపు♦మర్కటములు
నవభృథస్నానప♦ర్యంతనిర్మలతకై, కాసారములఁగాచు ♦ కాసరములు
నిజనిజోటజభాగ ♦ నీవారసీమలు, సొరక కావలియుండు ♦ సూకరములు
ఆ. గలిగి కంసవైరి ♦ కన్నులపండువై, చెలువమిగిలెఁ బూర్ణ♦కలశవిగళ
దాలవాలవారి ♦ హారితన్మునిదారి, కాశ్రమంబుబదరి ♦ కాశ్రమంబు. 1654

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 108, 109.

ఉ. సమ్మదలీలతోఁజదువ♦సామములేడును గండుఁగోయిలల్
తుమ్మెదలాలపించఁ బరి♦తోషమునం బ్రణవాక్షరంబులన్
సమ్మతిఁ బ్రస్తవించు శుక♦శారికలాగమభాషితంబులన్
నెమ్మదిఁ జెప్పశాస్త్రముల ♦ నీలగళంబులుతద్వనంబునన్. 1655

హరవిలాసము, ఆ 5 పద్య 31.

సీ. కదలుపాదపములు ♦ కల్లోలములు గాఁగ, విరులమంజరులు పే♦న్నురువు గాఁగ
హోమధూమంబులు♦జీమూతములు గాఁగ, ధవళాక్షతములు ము♦త్యములు గాఁగ
దేవపూజావిత♦ర్దికలుదీవులు గాఁగ, గ్రతుహవ్యవాహమా♦ర్వంబు గాఁగఁ
బర్ణశాలలుగూఢ♦పర్వతంబులు గాఁగఁ, జమువులు సహజఘో♦షములు గాఁగ

గీ. తూలఁబట్టిననీర్కావి♦ధోవతులు ప్రవాళలతికలు గాఁగ కై♦వల్యలక్ష్మి
పుట్టినిల్లై సుధాంభోధి♦వోలె నిత్య, మహిమములమించుపుణ్యాశ్రమంబుఁగనియె.

వరాహపురాణము, నం. మ. ఆ 4 పద్య 90.

సీ. ఉచ్చరించు మయూర ♦ ముపనిషద్వాక్యంబు, పారావతంబు శ♦బ్దంబు నొడువు
శారికతర్కశా♦స్త్రంబు వక్కాణించుఁ, గలకంఠములు షడం♦గముల నెఱుఁగు
హంసంబు లుభయమీ♦మాంసలు పరికించు, రాచిల్క శ్రౌతమా♦ర్గములు దెలుపు
నలఘు పురాణార్థ♦ములకుఁజొక్కుఁగురంగి, సామగానము విను ♦ సామజంబు
గీ. ఖంజరీటంబు వైశేషి♦కము విధించుఁ, గ్రౌంచమిథునంబు యోగ్యవై♦ఖరి భజించుఁ
దరమె కొనియాడ ఘటజన్మ♦తాపసాగ్ర, గణ్యపుణ్యతమాశ్రమా♦రణ్యభూమి.

రామాభ్యుదయము, ఆ 5 పద్య 118.

సీ. మును శిష్టసల్లాప♦మున నున్నఁ జెంగటఁ, జంచరీకము ఝుంక♦రించ వెఱచుఁ
దపసులపైరంచుఁ♦దలపోలంబునఁబోవు, మెకము నీవరిచేను ♦ మేయ వెఱచు
వ్రతులు కాషాయవ♦స్త్రములారఁగట్టినఁ, బ్లవగపోతము చెట్టు ♦ ప్రాఁక వెఱచు
మానులమణులువో♦దీననున్నవియంచు, నంచ తామరకాయ ♦ చించ వెఱచు
గీ. నేమనఁగవచ్చుఁ గొనియాడ ♦ నెవ్వఁడెఱుఁగు, నజభవాదులకైన న♦త్యద్భుతంబు
బదరికాశ్రమశాస్తృవ్య ♦ పారికాంక్షి, వివిధనియమోపచితతపో♦విభవమహిమ.

కకుత్స్థవిజయము, ఆ 1 పద్య 157.

సీ. మొకరితేఁటులుమూఁతి ♦ ముట్టవు తేనియల్, శ్రీమధుశాసి క♦ర్పించి కాని
కోకిలమ్ములు చివు♦రాకులు గొఱుకవు, శ్రీవనమాలి క♦ర్పించి కాని
లేఁబచ్చికల్ గబ♦ళింపవు హరిణముల్, శ్రీనీలమూర్తి క♦ర్పించి కాని
ఫలభుజిక్రియలకుఁ ♦ జిలువలు దలఁపవు, శ్రీమాధవునకు స♦ర్పించి కాని
గీ. యితరజంతువులును హరి♦మతిఁదలంచి, కాని యేవర్తనములకుఁ ♦ బూనవనిన
నాతపోవనమాహాత్మ్య♦మభినుతింప, నలవియే వేయిమొగంబుల ♦ చిలువకైన. 1658

ఘటికాచలమాహాత్మ్యము, ఆ 1 పద్య 13.

సీ. చెలఁగిహరేర్నకిం♦చిద్వ్యతిరిక్తమస్తీయటంచుఁబల్కు రా♦చిల్కగములు
వరుసమై వాసుదే♦వస్సర్వమితియని, సతతంబుఁబలవించు ♦ శారికలును
నచనచనారాయ♦ణాత్పరంమంత్రంబ, నిసరవిమోహియునిం♦దిందిరములు
మోదముతోనమో♦వేదాంతవేద నేయనియెఱింగించు పి♦కావళియును

గీ. తాపసులు సర్వవేదశా◆స్త్రములు చదువు, నపుడు గవుసులు పోవునన◆ చ్చోట్ల నాదిగాఁ
దీర్చి చదివించునట్టి సు◆ద్విజకులంబు, గలిగి విలసిల్లు నప్పుణ్య◆కాననంబు. 1660

చిత్రభారతము, ఆ 1 పద్య 68.

సీ. ఎదురిండ్లు పలుసాల◆లెనసి వర్తింపఁ జాలిన మేలి పర్ణశా◆లికలు కొన్ని
యాగమాంతంబుల◆యందలి యర్థముల్, ప్రకటించు కీరశా◆రికలు కొన్ని
హవిరన్న సంభ్రమ◆ద్ద్విజ కోలాహలాంకములైన యాగవా◆టములు కొన్ని
దున్ని విత్తక పుట్టి◆ యెన్నులఁ వ్రేఁగున, వ్రాలు నివ్వరిపా◆లేలు కొన్ని (కొన్ని
గీ. తోఁపులోకకొన్ని తెలినీటి◆దొనలు కొన్ని, కొలఁకులోకకొన్ని పెంపుమీ◆పులులు
మొదవులోకకొన్ని చేమంతి◆పొదలు కొన్ని, వెరయఁగఁ దపోవనంబుఁ గ◆ల్పించె.

చిదుపఁడు 1661

కువలయాశ్వచరిత్రము, ఆ 4 పద్య 77.

సీ. మలినత యాగధూ◆మములయందె కాని, మునిచరిత్రములపై◆ మొనయ దెపుడు
రాగంబు పీరవ◆స్త్రములయందె కాని, ఋషులలోచనముల◆ నెనయ దెపుడు
చలనత చలపిశ◆పశములందె కాని, వానిచిత్తములపై◆ మలయ దెపుడు
భ్రమణంబు నిర్వ్యాకృ◆త్యములయందె కాని, వ్రతులబుద్ధులయందు◆ వ్రాల దెపుడు
గీ. జాడ్య మెంతయు శ్రీగంధ◆సారతరుల, యందె కాని, యతీంద్రులఁ◆ జెంద దెపుడు
నౌర యయ్యాశ్రమస్థల◆ మరయ దాని, మహిమ వర్ణింప నలవి సి◆తాము హావినవశమె.

షట్చక్రవర్తి చరిత్రము, ఆ 2 పద్య 121.

చ. గురుతర హోమధూమము మొ◆గుల్లుగఁ గెంజిగురుల్ మెఱుంగులై
పరగఁగ నాజ్యమాహుతుల◆ పంక్తులు పుష్పఫలంబులై తగన్
గరటిఘటాది బృంహితము◆ గర్జగఁ గ్రొవ్విరి తేనె సోనలై
గురియఁగ నొప్పు నవ్వనము◆ క్రొత్తగు నామునవేళ యౌ నన్. 1663

నాగరఖండము, సంపుట 1 ఆ 1 పద్య 67.

సీ. కర్మసాక్షికి మున్న◆ గాముననందు రిలనుఁ, జుప్పుటదోఁచులు ప్రాకా◆స్ఫుటరవములు
జడదార్లుగ్రుంకని◆ ప్పుడెవస్తుగని తెల్పు, నల్లఁ గుకోలఁకుల◆ కంచపిండు
హరిపదార్చితుఁ డిమిం◆ కైవస్తుగని తెల్పు, గతిసుమంగులను భృం◆గములు చేరు
సురముఖ్యులను హవి◆స్సుల పరమ్మని పిల్చు, నల్లఁ గుదవికెవి◆హంగపిభులు
గీ. నవ్యదర్భాంకురములకై◆ సంయమీంద్రు, లరుగుదెంచెదు తెఱఁగులు◆ గనుపుకోటకును
జనెననఁగ నేఁగు మృగముల◆చ్ఛటిగిరులకు, విధులొనర్పంగ వాసర◆ప్రథమమందు.

నిర్వచనచిత్రరామాయణము, ఆ 1.

---

# పర్వతము.

—:o:—

చ. సురవరవాహినీధరుఁడు ♦ శుభ్రశరీరవిభాసి నీలకం
ధరపరిశోభితుండు గుణ♦ధాముఁడు తుంగతనుండు భూధరా
భరణుఁ డుమాసమన్వితుఁడ ♦ పారవిభూతిసమేతుఁడై మహే
శ్వరుఁడును బోలె నొప్పు హిమ♦వంతుఁ డనంతమహత్త్వసంపదన్. 1665

సీ. ఉరుతమఃపటలంబు ♦ నుక్కఁపట్టిదియని, నెఱినిగ్గుగొనునింద్ర ♦ నీలరుచులు
పున్నమవెన్నెల♦ప్రోదిపట్టిదియని, కాంతంబులగుశశి♦కాంతరుచులు
వెలుఁగొందు రేయెండ♦వీడుఁబట్టిదియని, రాజితంబగుపద్మ♦రాగరుచులు
క్రొక్కారుమెఱుఁగుల ♦ యిక్కఁపట్టిదియని, తారముక్తాహార ♦ తరలరుచులు

గీ. ప్రచురమాధవోద్యానంబు ♦ పసిమికెల్ల, నాటపట్టిదియని గరు♦డాండరుచులు
మెచ్చిచూచుచువేమఱుఁ♦బిచ్చలింతు, రమరకన్యకలతులహి♦మాచలమున. 1666

కుమారసంభవము, నన్నె. ఆ 8 పద్య 247, 261.

మ. చెలువారున్ నవరత్నపాదకటక♦శ్రీచేతగంధర్వమం
గళనాదంబులతోడనొప్పుగునభం♦గస్థైర్యవృత్తిన్ మహా
బలుఁడై నంబ్రహసించు భూభరణశో♦భం దాల్చిమిన్నందుచున్
గులశైలంబులపెంపువిశ్వవిభుతోఁ ♦ గూర్పందగున్ ధీరతన్. 1667

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస, 3 పద్య 99.

చ. కదిసితి మంత దంతపరి♦ఖద్విపఖండితదేవదారువున్
మదనవినోదకందళిత ♦ మానసమానసవాసభీరువుం
బ్రిదరపదామ్యతక్రికచ ♦ పాటితలస్తకదేశచారువున్
ముదితచమూరువున్ ఫలిత ♦ మూలినమేరువు సానుమేరువున్. 1668

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 38.

చ. అటసనికాంచెభూమిసుతుఁ♦డంబరచుంబిశిరస్సరోఝరీ
పటలముహుర్ముహుర్లుఠద♦భంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరి♦ఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణుకర ♦ కంపితసాలముశీతశైలమున్. 1669

మనుచరిత్రము, ఆ 2 పద్య 3.

సీ. జరఠకచ్ఛపరాజు♦చరమాంగగృహమేధి, భోగివేష్టనరేఖఁ ♦ బోలుచుజాఱు
కులములోఁదరితీపు♦గలిగిమించినమేటి, మైనాకునోరసిన ♦ మాసటీఁడు
తొలువేలుపులవేలు♦పులపనుల్ గొనుఱేఁడు, కదళికాయలలోఁతు ♦ గన్నగబ్బి
సురరాజునకుఁబాండు♦కరిఁ జేర్చు మఱకాఁడు, కల్పకంబులపంట ♦ కమ్మతీఁడు
గీ. కంటెమథితసుధాధౌత♦కటకజాత, చంపకవనప్రకంపనా♦కంపితసగ
దశిఖరముఖరవమధుకర♦ముఖరశిఖర, నందనసమంచితంబగు ♦ మందరంబు. 1670

మనుచరిత్రము, ఆ 5 పద్య 47.

చ. సురగణసేవ్యమష్టపురి ♦ చుంబితశేఖరముల్లసన్నగం
బరమసితేతరద్యుతిః ♦ ప్రసూనమాశ్రితసర్వమంగళం
బురుచిరభద్రనాగపరి♦పూజితభూతిమునై నికేశ్వరుం
బురహరుఁ బోలుచున్ రజిత♦భూధర మీధరఁ జెప్ప నొప్పఁగన్. 1671

బసవపురాణము, పి. సో. ఆ 1 పద్య 3.

సీ. మునిమనోమోహన♦ముక్తినటీనాట్య, రంగంబులగుహేమ♦శృంగములును
గిరికన్యకారవ♦కల్హారసౌరభో, ద్గారంబులగు జలా♦ధారములును
క్రీడారతశ్రాంత♦కిన్నరీపరిచిత, స్నేహంబులగుగుహా ♦ గేహములును
గుంజన్మధుపాళీ♦మంజులమంజరీ, పుంజంబులగులతా ♦ కుంజములును
గీ. నలరి పెంపొంగుఁ బూర్వాప♦రాంబునిధులు, నడుమధరణికిమానదం♦డంబుపోలె
దేవతాత్మధరాధీశ♦దిగ్విభూష, పుణ్యనిలయంబునీహార♦భూధరంబు. 1672

శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 2.

ఉ. శైలమెయి స్మృహీరమునఁ ♦ దేర్కొను నిశ్చలనమ్రదేవతా
సాలముఁ గంధగస్తనుర ♦ చారణదంపతిగానవీచివా
చాలముఁదుంగశృంగఘట♦నక్షమణీపునరుక్తతారకా
జాలముఁబారిజాతవన ♦ సంస్థితిమూలముఁ హేమశైలమున్. 1673

కఃకస్తరసాయనము, ఆ 2 పద్య 230.

చ. పొలుపగుతారకాప్రసన ♦ పుంజములన్ సిగఁజుట్టి ధాతురే
ఖల ఘుసృణం బలంది కట♦కంబుల మేఖలల న్వహించి త
జ్జలధరనూత్నచిత్రపట♦సంగతిసానులతోడికూటముల్
గలిగి తనర్చు నగ్గిరి యొ♦కానొక కాముకురేఖచూపుచున్. 1674

సుదక్షిణాపరిణయము, ఆ 1 పద్య 125.

ఉ. ప్రీతి యొనర్ప నగ్గిరి ని◆రీక్ష యొనర్ప దరీసరిత్స్రవం
శీతతటజాతరూపధర◆ణీరమణీయమణీసమగ్రమై
స్ఫీతసుధాంబుపూరసర◆సీరుహశీకరశీతలానిలా
న్వీతవిహారదేవతరు◆ణీహరిణీకరిణీసమూహమై. 1675

సీ. ఈదాపునీలంబు◆లెల్లఁ దుమ్మెదలు గాఁ, గెంపులు చిగురాకు◆గుంపు గాఁగఁ
గ్రమ్మిన మగమాని◆కమ్ములు విరులు గాఁ, జంద్రకాంతములు గు◆చ్ఛములు గాఁగ
నలరు గోమేధికం◆బులు తేనియలు గాఁగ, శృంగముల్ కొమ్ముల◆చెలువు గాఁగ
నష్టగిరికాదిధా◆తువులు పుప్పొడి గాఁగ, గిరిజగంధము పుష్ప◆పరిమళముగఁ
గీ. కిన్నరస్త్రీల పలుకులు◆కీరభాష,ణములు గా నిచ్చ భక్తా◆ణముల కమృత
ఫలము లొసగుచు మహితక◆ల్పకము రీతి, భాసురంబుగ నుండు న◆ప్పర్వతంబు.
నాగరఖండము, సంపుట 1. ఆ 1 పద్య 91, 92.

సీ. అలరుఁదీవియలఁ బా◆యక మించుకొంగేఁటె, జోటి వ్రేఁత లోయారి◆పాట గాఁగ
స్థలకంజనికుంజ◆ముల గాఢ్యదారిఁ దైఁ, బుష్పపుప్పొడి పచ్చ◆పాపడులుగఁ
గనకశృంగాగ్రసం◆గతపాండుకాంతచా, సకముల్ నవపుండ◆రీకములుగ
నతిచలచ్ఛదయుక్తి◆నలరు రంభాస్తంభ, జాలంబు జయపతా◆కాళి గాఁగ
గీ. భోగవతికావతంసముల్ ◆ పుణ్యతరులు, రాజహంసాలసంఘముల్◆ప్రాంతవీథిఁ
గొలువఁ బేరోలగింబున్న◆చెలువుఁ బూనె, నీధరాభృద్వరునిఁ గంటె◆భూధరేంద్ర.
చంద్రికాపరిణయము, ఆ 2 పద్య 17.

క. గంగోత్తమాంగమై సా,రంగధరంబయి పతంగ◆రాజాస్పదమై
రంగుగ గిరిగననొప్పెను, గంగాధరుభంగి నీల◆కంఠయుతంబై. 1678
రామచంద్రోపాఖ్యానము, మి. మ. సుందర. ఆ 5.

సీ. తతసరిఝ్ఝరచర◆త్పోతగరుత్స్వారగరు,ద్భవమరుత్ప్రచర◆త్ప్రకరజాల
మతిలసద్వాదనస◆న్మతిమిషత్పారఘూస,త్ప్రతివసప్రతిహాస◆త్సుతనుజాత
మఖిలలస్థరదల◆త్సుభవలత్సుమగల, న్మృదుమిలఝ్ఝరఫల◆న్మహీజజాల
మమలఫ్యాత్పికగహ◆ద్ద్రుమబృహత్కుసుమఘృ, త్కలుషహృత్స్ఫురణిభృ◆త్కలితసిద్ధ
గీ. మవ్యయానందగాయక◆శ్రావ్యగాన, భవ్యసౌధాగ్రనిర్మిత◆నవ్యకాంతి
దీవ్యదింద్రశిలాగార◆దివ్యభీరు, సేవ్యజనమా జగన్నాథ ◆ సీమఁ గాంచి. 1679
సర్వకామదాపరిణయము, ఆ 2.

---

# వేఁట.

క. వరుణాఁడుదుర్జయధరణీ, వరునాజ్ఞకువెఱచిమృగని ♦ వాగణమునవుచ్
బురికొలిపి శరధులెత్తిన, తెరలనఁ దెరలెత్తి రఖిల♦దిగ్భాగములన్. 1680
క. వీథిలనివల లొడ్డిరి హేా,రాళముగా లోకపాల♦రమణాలు మృగయా
లీలఁ గనుఁగొనఁగఁజేసిన, జాలకజాలములు గలడి♦శాభిత్తులనన్. 1681

వరాహపురాణము, సం॥ మ॥ ఆ 4 పద్య 77, 78.

సీ. ఒకనాఁడు తెరవేఁట♦నుగ్రసత్త్వంబులఁ, బడమిపైఁబడగాఱ్చ♦పడవధించి
యొకసారి సారమే♦యోద్ధతినుద్ధర,స్తఫరోమంబుల ♦ సంహరించి
యొకమరి దీమంబు♦లొడ్డి పొదులు దీర్చి, బహువిహంగంబులఁ ♦ బట్టితెచ్చి
యొకవేళ డేగవేఁ♦టకుఁజని యెగఁజొఁపి, నానాండజములప్రా♦ణములు గడపి
గీ. ముంగివేఁ పోఁదువేఁట సి♦వంగివేఁట, యుఱ్ఱివేఁటయు గంటవేఁ♦పెద్దువేఁట
మొదలుగాఁగలవేఁటల♦యుదనెఱింగి,తిన్నఁడొక్కొక్కతూకువ♦ర్తింపఁదొడఁగ.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 47.

సీ. ఓపముల్ దప్పిఁపించి♦యురులొడ్డ నియమించి, యువ్వలన్వలవల♦లీడఁగఁ బంచి
యడుగులెత్తించి చో♦ప్పడ జాడ వేయించి, యాయాయి టెంకిప♦ట్లెరయఁబంచి
పోగువారించి గొ♦ప్పనఁజోఁపు వెట్టించి, కొండలేఁజిగురాకు♦గూండ్లనించి
యక్కడక్కడఁగ్రోవ♦లరికట్టఁ జెప్పించి, వాకట్టుగట్టించి♦నైపు లెంచి
గీ. యెచ్చరికమించి తెరవేఁట♦యెద్దువేఁట, గంటవేఁటయు మొదలుగాఁ♦గలుగువేఁట
లెన్నిగలవన్నియుఘటించి♦యన్నరేంద్రుఁ,డుగ్రమృగభంజనక్రియో♦ద్యుక్తుఁడయ్యె.

రామాభ్యుదయము, ఆ 2 పద్య 29.

సీ. ఒకచేత సెలుఁగొంట ♦ నొకకొండ గొరియఁగా, నొకఁడు త్రిప్పెదుత్రిప్ప ♦ డొ
అపు గొలిపె
నొకచేతఁ బులినొంట ♦ నొకచేత లేడిగా, నొకఁడెత్తునెత్తికో♦లొఅపునిలిపె
నొకచేతసలుగొంట ♦ నొకదుప్పికొదమగా,నొక్కఁడుఁచినయూఁపు♦లుప్పతిల్లె
నొకచేతఁ బోతొంట♦నొకమన్నుఁబెంటిగా, నొక్కఁడార్చినమాట♦లొప్పిచెల్లె
ఆ. నొకఁడు నొకటఁ దెగక♦యొకటికిఁ దెగకొక్కఁ, డోపి రిట్లురెంటి♦కొకఁడచాలి
వలలఁగలమెకాల♦వలకేలుడాకేలు, బిరుదుగిరుదుఁ బంచి♦పెట్టుకొనఁగ. 1684

కకుత్స్థవిజయము, ఆ 4 పద్య 93.

సీ. సారంగదానముల్ ◆ సలుపుధీరుఁడుగాన, సారంగదానముల్ ◆ చాల సలిపె
హరిదానముసృజించు ◆ హరివంశమణిగాన, హరిదానగతులసం◆ఖ్యలుసృజించె
ఖడ్గదానమొనర్చు ◆ ఘనపుణ్యనిధిగాన, ఖడ్గదానము లనే◆కము లొనర్చె
భూదారదానమిం◆పుగఁ జేయుపతిగాన, భూదారదానము ◆ లుబ్భరిచేసె
గీ. నిజపురోహిత సంకల్ప ◆ నీతివెలయ, సాంగములుగాద్విజాళి యు◆ప్పొంగనృపతి
వేఁటలోపలధర్మంబు◆విడువఁ డయ్యె, క్షత్రియుఁడుగావనిజకులా◆చారమరసి.
ఆ. భల్లములనుబూని ◆ భల్లముల నణంచె, ఖడ్గముల ఘారించె ◆ ఖడ్గములను
బోరిలోని తెఱఁగె ◆ పొసఁగించె వేఁటలోఁ, బ్రభువుధర్మయుద్ధ◆పరుఁడుగాన.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 104, 105.

చ. బలువిలుకాండ్రుమెచ్చ నర◆పాలకుఁ డేసిన యాశుగం బన
ర్గళమదనాగకేసరని◆గాడిగసాస్థలిఁదూఱఁబాఱెనా
వలఁ దన పేరుఁదాలిచిన ◆ వాయువుఁ గ్రోలుటయెట్లుభోగిరా
ట్కులమని నాగలోకమున◆కున్ బగదీర్పఁగఁబోవుకైవడిన్. 1687
సారంగధరచరిత్రము, చే. వేం. ఆ 1 పద్య 97.

గీ. హాతియవిశ్వాసమునుభవ్య◆తరులవంచ,నయిమధుపమైత్రిగలిగిసాం◆ద్రతరమదము
కలిమిమేనులెఱుంగని ◆ కరటులనువ,ధించెఁ బతి యది రాజవృత్తియ తలంప.
శకుంతలాపరిణయము, పె. నా. ఆ 1 పద్య 135.

సీ. తాఱుచు నీరముల్◆దూఱుచు నొండొరున్, జీఱుచు మగటిమి◆నీఱుచువారు
దాఁటుచు నొరుని క◆న్గీఁటుచు కూనల, మాటుచు జింకల ◆ మీటువారుఁ
ద్రుంచుచు బలులమై ◆ నొంచుచు నొబ్బరలు, జించుచు పెంపున◆మించువారు
నేయుచుం దెలిగ్రొవ్వు ◆ గోయుచు నేపులం,దూయుచునురముగాఁ◆జేయువారు
గీ. సింగములడుంగమత్తమా◆తంగములకు, రంగములభల్లుకంబుల◆నంగములను
నిసితసాయకజాలము◆ల్నించిత్రుంచు, వారునై వేఁటసల్పిరా◆వీరభటులు. 1689
కవిచకోరచంద్రోదయము, ఆ 2.

గీ. జివురుగండెలు నురులను◆దవులఁజేసి, పక్షిజాతస్వరమ్ములఁ ◆ బలికిపలికి
చేరవచ్చెడిపులుఁగుల◆జెలఁగిపట్టి, చిక్కములఁబెట్టిరొకకొంద◆ఱక్కజముగ. 1690
గీ. గుంజపిట్టలుకాఁజుపు◆ల్గులనుడేగ, పక్కితుటుములుపూరేండ్లఁ ◆ బట్టి నైజ
పద్ధతులవేఁటలాడించి ◆ పలుతెఱఁగుల, నోలిమైఁ బట్టుకొనిరి నీ◆డోద్భవముల.
శకుంతలాపరిణయము, ఘ. వేం. ఆ 1.

శా. చెంతన్నిల్చినదవ్వువోయినను ని♦శ్చేష్టంబునైనన్వడిన్
గ్రింతుల్గొట్టినదృష్టికన్నమును ల♦క్ష్యంబంటుభూమీశున
మ్మంతర్వర్తి నవప్రసూతిసురత♦వ్యాసక్తమౌంజాటి క
ర్ణాంతాకృష్టమునయ్యసాగదురుమం♦తాఁదిపరిబద్ధంబనన్. 1692

శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 53.

---

# వేఁటకాండ్రు.

సీ. విండ్లుగోలలను జ♦ద్దాండ్లుబల్లెములుకో,లనుబూని మొనలుగాఁ♦జనెడివారు
గదులుచేకత్తులు ♦ గండ్రగొడ్డండ్లు స,య్యనఁబూని యెడలేక ♦ యరుగువారు
చిక్కములవ్వలలును ♦ జివురుగండెలు సురుల్, బోనులుగొనివడి ♦ బోవువారు
కోఁజుపిట్టలుజలా♦గండెలు పూరేండ్లు, డేగలు గైకొని ♦ యేఁగువారు
గీ. పటకుటీరంబులకు రుచి♦పాకములకు, వలయువస్తువులెల్లఁ గా♦వడులఁబండ్ల
నెడ్లతలమోపులనుపీఁక♦నెత్తి యొత్తి, మించువేడ్కలవడినడి♦పించువారు. 1693

సీ. తుండముల్పట్టి వే♦దండరాజంబుల, వెనుకకుఁబడఁద్రోతు ♦ మనెడివారు
చెంగునదాఁటి చె♦లంగుసింగములతో, డనె దాఁటిపడఁగూల్తు♦మనెడివారు
పలుతెంగుల బెబ్బు♦లులతోఁ బెనఁగికత్తు,లను కుత్తుకలుగోతు ♦ మనెడివారు
శరము లేఁటికి ఘను♦ష్టంకారముల వరా,హములు గూలఁగఁజేతు ♦ మనెడివారు
గీ. లేళ్ళతో డేళ్ళ మఱియుఁ గుం♦దేళ్ళనంగ, నెంత పదములరా ఫురఁ♦గంతుగొనున
టంచుఁ బలికెడువారలు ♦ నగుమొవీర,వరులు కొందఱు నడిచిరి ♦ వరుసమెఱసి.

శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 1.

సీ. గాలిబంతెగుఁబోతు♦కాటరి పసిగాండ్ల,నను జాగిలములతో ♦ నరుగువారు
దీముపెంట్లదనులు♦దీర్చినడేగలు, వడిఁబట్టుకొనిపర్వ ♦ లిడెడువారు
వివిధవివధములు ♦ వెడపవుట్టికలును, బడిబడిఁ బట్టుచుఁ ♦ బాఱువారు
” ” ” ”

గీ. రండు రండనువారలు ♦ రాజునెదుటఁ, బడుఁడుపడుఁడనువారలు ♦ గదియువారు
గృహము వెల్వడువారలు ♦ గెరలువారు, నగుచు నడచిరి వేగమ♦య్యధిపుభటులు.
శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 42.

సీ. డాసియేనుఁగులతొం♦డముమీఁదనుండి యు,య్యాలలూఁగునీచిన్ని♦యెఱుకవాఁడు
లేఁడీగఁ బులికిఁ గ♦ళ్ళెముఁబెట్టి పయ్యాళి,దోలుఁ గానడవి నీ♦దుండగీఁడు
కరిఁజంపిపోవు సిం♦గమువెంటఁజని గోళ్ళ, ముత్యముల్ దెచ్చు నీ♦ముగుదశిశువు
గండభేరుండంబు ♦ రెండుతలల్ రెండు, చేతులనించు నీ ♦ చిన్నివాఁడు
గీ. వేఁడుకలఁజేరియరకాల♦వీఁకఁదన్ను, నడవిపందుల కోఱలీ♦పడుచువాఁడు
తక్కునెలుఁగులగిలుగుల ♦ లెక్కసేయ, నేఁటికిఁక నీవిచారించెదు♦వేఁటలందు. 1696
ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 39.



# వేఁటసాధనములు.



ద్విపద. బోనులు నురులును♦బులులుఁ బందులును, కుక్కలు ముంగులు♦కుందేటివలలు
చిక్కంబులును తెర♦చీరలు జింక, లెద్దు లిఱ్ఱులు బడి♦యేనుఁగుల్ పెద్ద
గిద్దలు డేగలు♦గేదిజంబులును, మున్నైనసన్నాహ♦ముల్ వెంటరాఁగ. 1697
ప్రభులింగలీల, పి. సో. గతి. 20.

సీ. పలలకావళ్లు చి♦వ్వంగులబండులు, తిరుచుట్టుబొంగుకా♦లురులు చీరె
తెరలునుగ్గంబులు♦దీనము ల్మ్రాగము, ల్మేకదారికత్తులు ♦ మేకముబోను
లోఁబైనగోడ్డండ్లు♦ మెఱుఁగుఁబళ్ళెంబులు, తట్టగొమ్ములు పులి♦చెట్లుమందు
బలువింట్లఁ బొట్టగొ♦లలు తోలుమోకులు, గొరకత్తిశమ్ములు ♦ కరకతోలు
గీ. నాదిగావేఁటలకుయోగ్య♦మైన తనరు, సాధనంబులుసవరించి ♦ సరభసమున
నాటవికసైన్యమేతెంచి ♦ యధిపుఁ గాంచి,దండములుపెట్టినిలిచిప్ర♦తాపమలర.
రుక్మాంగదచరిత్రము, ఆ 3 పద్య 70.

సీ. పంకులుగుదియలు ♦ వలత్రాళ్ళు మోకులు, బిసలు మాఱమ్ములు♦పెద్దవిండ్లు
పచ్చకత్తెలగుదుల్ ♦ బలుతుపాకులు నెద్దు,లేనుంగులు శివంగు ♦ లిఱ్ఱిపోతు

పెదుకకుంపటు లాకు♦తడికలు పోగ్రిసుత్రా, శ్వాఁడిగొడ్డండ్లు మ♦వ్వంపుటురులు
పాఁదిగువ్వలు మోటు♦పలకలుపోటుగుం, జలు చుక్కములు నురు♦ల్జాగిలములు
గీ. జిగురుఁగండెలు గాలపుఁ ♦ జివ్వవెదురు, లాదియగు సాధనంబులు ♦ వలసరించు
బోనిపాటాపాటివడలతోఁ♦బిసుఁగులెల్లఁ, గదిసినడిచిరియపుృ్కహా♦కాంతునలుత.

శుకసప్తతి, ఆ 1.

# వేటకుక్కలు.

:O:

మ. బిగువట్టికృమరించి సేఁటవు భటుల్ ♦ పేర్వార నంకించి ము
గ్గుగఁబిల్వన్ మఱియున్ బయల్ పసిగొనున్ ♦ దూఁటున్ దెసల్ జిక్కి నీ
లిగి కొల్లిఖ్వ వెలుంగిడున్ కౌటకవల్ ♦ఆక్రిందు మైత్రాఁకుఁ బో
ల్పగపెల్గొల్పుచుఁబోవు దస్సిములవే♦ల్పింపత్తడుల్ మొత్తమై. 1700

రామాభ్యుదయము, ఆ 2 పద్య 21.

సీ. అలమగ్గరయిక్కిరిం♦తలవెక్కిరింతలా, డెసుకీతి నాలుక♦ల్వ్రేడలఁ బాఁచు
నిక్షిగుజ్జపుకొతు ♦ కొక్కునక్కములాడు, గతివాలుని క్షేప♦కలనఁ దాల్పుఁ
దోడరకొండపలనెత్తి♦యడపఁబూనెడుమాడ్కిఁ, బదరిచిఖ్వనఁబూర్వ♦పదము లెత్తు
గర్జగంబులసాకే♦ధర్జించుకైవడి, మొఱఁగు నార్భటముగా ♦ మొరలెత్తి
గీ. బలిమికలిమినిజవముసం♦పవను దిస్స, గనము పెంపున దారుణ♦ధ్వనినిమాఢి
జాగిలంబులు మృగయుల♦చ్ఛంపుఁబసిఁడి, పట్టెడలఁబట్టి వెంబలిం ము♦నట్టియెడను.
సీ. ధర నల్పనకుఁబ్రిభు♦త్వంబువచ్చినమను, ష్యుల వికారపుఁ జూడ్కిఁ♦ జూచినట్లు
భల్లవుల్ తుదిలేమి♦పడి యింటిపాయరా, మొగిలం జెలల్లులు ♦ మూల్గినట్లు
పగదేశి యతిలోభ♦పరునియింటికిఁబోవఁ, దెగికోఁతిసతెనుగ♦ర్జించినట్లు
వంతువానికిపీన ♦ వైష్యులు సమలోన, నేకంబుగాఁ గల♦హించినట్లు (భజెమి
గీ. తెరలియొరుఁడొక్కటనియా♦క్షృష్టిఁజూచు, గొలగొలనుమూల్గు గర్జించు♦పతిమి
కవిసికలపించి ఘాంకృతి♦కలకలముగ, జాగిలమ్ములు రోషభీ♦షణములగుచు. 1702

కవిరాజమనోరంజనము, ఆ 2.

# వేఁటకుక్కల పేళ్ళు.

చ. పులియఁడు బూచిగాఁ డసుర♦పోతులరా జనుమంతిగాఁడు చెం
గలువ సివంగి భైరవుఁడు ♦ గత్తెర సంపఁగి పెండిగుండు మ
ల్లెలగుది వాయువేగి చిటి♦లింగఁడు సాళ్వుఁడు వత్సనాభి యే
కలములమిత్తి గబ్బియనఁ♦గాఁ గలవాని గ్రహించి యుద్ధతిన్. 1703

మనుచరిత్రము, ఆ 4 పద్య 32.

చ. పొలుపరివేఁటమానికము ♦ పోతులరాజు తుపాకిబైరి బె
బ్బులి సుడిగాలి చల్పిడుగు ♦ బోదఁడు నాఁడగు పెక్కునామము
ల్గలిగిన జాగిలంబులను ♦ గావలివాండ్రు పసిండిపేరఁ గప్పుం
గొలుసులఁ బట్టి తెచ్చిరి య♦సుంతితభాంకృతు లుల్లసిల్లఁగన్. 1704

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 62.

# వేఁటధర్మములు.

సీ. మృగయుఁడు మృగముల♦నొగిఁ బొంచి వెనఁ జంపుఁ, గానకుండఁగఁ జంపుఁ ♦ గడఁకఁ జంపు
విముఖంబులై యుండ ♦ వేచంపు మఱిసమ్ముఖంబునుండఁగఁ ♦ గడఁగి చంపు
వలబోసులాదిగాఁ ♦ బలుయంత్రములఁ జంపు, వడిమీఱుశునకాళి ♦ విడిచి చంపు
మఱియొక్కమృగముతో♦మలసిపోరఁగఁ జంపు, దీమంబునకుఁ జేర్చి♦తెగువఁ జంపు
గీ. నెన్నిభంగులనయిన మాం♦సేచ్ఛ మృగము, నరులు చంపుదు రిల దాన♦దురిత మొంద
రఖిలధర్మార్థకోవిదు♦లైన రాజ,వరులు మృగయాభిరతులైన ♦ వారుకారె. 1705

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 256.

# యుద్ధవర్ణనము.

:o:

చ. అతులరణాంతరంబున ని♦రంతరమత్పటుబాణదారితో
చ్ఛ్రితదనుజాంగనిర్గళద♦సృగ్జలధారలునూడనొప్పె నా
తతగిరిశృంగసంగదళి♦తప్రచలజ్జలవాహజాలసం
తతగళదంబుధారలవి♦ధంబుననంబర మెల్లఁ గప్పుచున్. 1706

భారతము, అర, ఆ 4 పద్య 65.

శా. గీర్వాణప్రవిముక్తబాణపటల♦క్రీడావిలూనంబులై
గర్వోన్నద్ధసురారిశీర్షములు వీఁ♦కన్ డొల్లెఁ గల్పచ్ఛిదా
నిర్వక్త్రాంబుదమండలోద్గతమహా♦నిర్ఘాతపాతాపఘూ
తోర్వీభృద్ఘనగండశైలములతో ♦ నూహింపఁదుల్యంబులై 1707

,, ,, ,, అర. ఆ 5 పద్య 276.

శా. దేహోత్సేక మెలర్ప నుత్థితమదాం♦ధీభూతులై యాహవో
త్సాహవ్యగ్రులు విగ్రహంబుమిగులన్ ♦ సంరంభశుంభద్గతిన్
బాహాబాహులఁ బోరునప్పు డమరేం ♦ ద్రౌఘద్విపద్వంద్వహే
లాహస్తద్వయగాఢకర్షణరణో♦ల్లాసంబువిస్పష్టమై. 1708

,, ,, అర. ఆ 6 పద్య 384.

సీ. కరులఁ ద్రుంచెడువేళ♦గిరులఁద్రున్మాడుసం,క్రందనుకైవడిఁ ♦ గానవచ్చు
నరదముల్ దెరలించు♦నప్పుడుపఱ మొగుల్,విరియించుబలుగాడ్పు♦విధము మెఱయు
హయములఁజెండాడ♦నరుగుచోఁ జిల్లను లేళ్ళ, గమిగిట్టుకోల్పులి♦కరణి యొలయు
భటులకునరుగుచో♦బలువేసవినిగాన, దరికొనుచిచ్చుచం♦దంబుగలుగుఁ
గీ. గసిమసంగినయంతకు ♦ కరణి యంత్య, కాలరుద్రునిదర్పమ♦కాండమృత్యు
ముఖమునుగ్రభావముదోఁచు♦మునయువీర, సమితిఁదెగటార్చునప్పుడా♦శల్యునందు.

,, ,, ,, శల్య. ఆ 1 పద్య 232.

శా. రౌద్రోల్లాసమమూర్తిసంకలనఘో♦రంబై పొరిం బేర్చె నా
నుదిరక్తంబగునూత్నరక్తమునమ♦గ్నోన్మగ్నతం జొప్పిత
ర్జదూరిపోగ్రిగదాయుగంబువిసర♦త్సంధ్యాంబుదద్వంద్వభా
స్వదేరిఖాలలితంబు చెన్నువడసెన్ ♦ వారిద్దఱుం బోరఁగన్. 1710

,, ,, ,, శల్య. ఆ 1 పద్య 233.

సీ. గజిగానవొడసుల♦విఱిగెడునస్త్రముల్, దొలఁగుసంధులకిచ్చు♦మొలలుగాఁగ
బలువిడి మైగట్టు♦పాశముల్ దెగిపాయ, నంగములకుఁగట్టు♦లై పెనంగ
నెసకంబుతోఁదాఁకు♦నీటెలుగుమిసిన, పలువోటులకుఁజల్లు♦సలలుగాఁగఁ
బెడులుగంటులఁదూఱు♦భిండివాలంబులు, గ్రమమునవిడునౌష♦ధములుగాఁగ
ఆ. నలవులెన్నిగొనిన♦నప్పటికప్పటి, కలవ్రబలముఁ జలము♦నగ్గలింప
నుభయబలములందు♦సుభటోత్తములుపోరి, రాహవమునవిజయ♦దోహలమున. 1711

సీ. ఉరుపాశములు మృదు♦కరపాశములుగాఁగఁ, జక్రముల్ పృథుకటి♦చక్రములుగ
బాణముల్ నుతదృష్టి♦బాణంబులుగఁ గార్ముకమ్ములు భ్రూకార్ము♦కములుగాఁగ
మండలాగ్రములాస్య♦మండలమ్ముగఁ గుంభి, కుంభముల్ గురుకుచ♦కుంభములుగ
వజ్రముల్ సితదంత♦వజ్రములుగఁ దత్ప్రఘట్టనఁబటుగతి♦ఘట్టనముగ
ఆ. విక్షతములు బహువ♦ఖక్షతములుగాఁగ, రక్తరసమువోడము♦రాగరసము
గాఁగ సుభటవరులఁ♦గలిసిరణాంగన, సౌఖ్యమెఱసిచేసెఁ♦బరవశులుగ. 1712
కుమారసంభవము, నన్నె. ఆ 11 పద్య 692, 749.

సీ. కమనీయమణిచిత్ర♦కాంచనచాపముల్, శక్రచాపంబుల♦చాడ్పుగాఁగ
సారెసారెకులీల♦సారించుమౌర్వులు, పటుతటిల్లతికల♦పగిదిగాఁగ
భీషణతరవాజి♦హేషాగ్రఘోషంబు లురుగర్జితంబుల♦కరణిగాఁగ
మేనులనిగిడెడు♦మేచకరోచులు, దిక్కులఁజీకట్ల♦తెఱఁగుగాఁగ
గీ. భూనభోంతరమద్రువంగ♦సేనతోడ, మేఘసన్నిభాకారముల్♦మెఱయఁడతిమి
విపులగిరికల్పుఁడగుకపి♦వీరుమీఁదఁ, బరుషసాయకవర్షము♦ల్గురిసిరపుడు. 1713
భాస్కరరామాయణము, సుంద. పద్య 369.

సీ. ఇరువాఁగుబెరయంగ♦నెగయుపెంధూళులు, తెఱచుమేఘంపుమొ♦త్తముల తెఱఁగు
సారథులిలఁగూల♦సరిఁ బాఱుతేరుల, మోర్లతలు పెన్నుఱు♦ములవిధంబు
నమ్ముకేదినరథు♦లంకించిపడినైచు, చక్రదులుజ్జ్వలా♦శనులపోలుపు
శుండాలములనుంచి♦జోదులుతొరఁగించు, వాలంపజాలంబు♦వానవడుపు
గీ. ఖడ్గరోచులు మెఱుఁగుల♦గతియుఁగుంభి, కలితవరాక్తికములువడ♦గండ్లచాడ్పు
నెత్తురవఱదలేర్లపగిది♦నెఱయమెఱయ, ననిపయోధరసమయంబు♦ననుకరించె.
" " " యుద్ధ. పద్య 525.

మ. ఘనశస్త్రాస్త్రమహాతివర్షమునొగిన్ద♦ర్జామహాడంబర
ధ్వనిసంగీతఘనాఘనౌఘనిపత♦ద్ధారాళిధారామహా

శనివర్షంబులద్వంద్వమొందఁబయిపై ♦ సంరంభశుంభద్గతిన్
వనధుల్ ఘూర్ణిలబిట్టువాసవిపయి♦న్వర్షించె నొక్కుమ్మడిన్. 1715

హరవిలాసము, ఆ 7 పద్య 159.

సీ. చెఱకుపన్నిదమాడు ♦ తెలుఁగునగొడ్డండ్ల, నడుములురెండుగా ♦ నఱికినఱికి
యంత్రిమాడెడుభంగి ♦ నట్టలుదలలును, విడిసినధారల ♦ వ్రేసివ్రేసి
కఱకుట్లుగ్రుచ్చుసం♦గతినల్వురేవుర, గుదులుగాగొరకల ♦ గ్రుచ్చిగ్రుచ్చి
దొంతులకుఱుకురీ♦తులనొడ్డణములతో, శిరములకొడలఁ ♦ జిదిపిచిదిపి
ఆ. ప్రల్లదమునఁబల్కు♦పంతంబునొకఁడుగాఁ, బోటుగఱపుగన్న ♦ పోల్కిఁజూపు
శివములెత్తినట్లు ♦ చేతులతీఁటవోఁ, బోరి రింగు నందు ♦ వీరభటులు. 1716

కవికర్ణరసాయనము, ఆ 2 పద్య 169.

సీ. కరికరస్థూలర♦క్తనవాంబుధారలు, బలసి జోరున జడి ♦ వట్టిగురియఁ
దరుణమేదఃఖండ♦కరకానికాయముల్, బేతాళభక్ష్యంబు♦లైతొఱంగ
ముఖహుంకరణశేష♦ముఖరమస్తకములు, పిడుగులై పలుగొండ♦లపరఁబడఁగ
నలఘుబాహూరుజం♦ఘులువెల్లిపాముల, బలగమై జెలుచఁగ♦ప్పలుగరాల
గీ. నద్భుతాపహమైనవ♦ర్షాగమంబు, భూభువనమెల్లనెలుఁగంగఁ ♦ బట్టైనయ్యె
నరసురోరగహితముగా ♦ ధరణివిభుఁడు, గగనమునఁజూపుసంగ్రామ♦కౌశలమున.

కకుత్స్థవిజయము, ఆ 2 పద్య 108.

చ. ధనువులు మ్రోఁతమేఘనిన♦దంబులుగా శరదీప్తిజాలముల్
ఘనతరచంచలావళులు♦గా మణిమౌక్తికదీప్తిధాత్రిమీఁ
దనువడగండ్లుగా క్షతజ♦ధారలుసంతతవర్షధారగా
ననయముఁ జెప్పనొప్పె విపు♦లాహవమప్పుడు వానకాలమై. 1718

మొల్లరామాయణము, యుద్ధ. ఆ 3 పద్య 62.

సీ. దుష్టచిత్తులకేవఁ ♦ దుదిధర్మములుగుంచి, కృతులట్లగుణములు♦శ్రుతులఁజేర్చి
జలధరంబులమాడ్కి ♦ శరములుసంధించి, సత్కవులనఁగఁ ప్రా♦సములుగూర్చి
జనపాలకులలీల♦శక్తులేర్పఱిపించి, రథములకరణిఁ జ♦క్రములఁదనరి
శరనిధుల్ బలెబహు ♦ తరవారులుధరించి, వైద్యులగతిగదా ♦ వధులుగాంచి
గీ. ప్రబలదుర్వారగర్వశుం♦భత్ప్రతాప, దరులుగంధర్వవరులుమాం♦ధాతృసుతునిఁ
జుట్టిముట్టాడిరనికి వి♦స్ఫురణమలర, ఘనతుషారంబులలవిభా♦కరునిఁబోలి. 1719

షట్చక్రవర్తిచరిత్రము ఆ, 6 పద్య 81.

గీ. విల్లుదెఱగంటివిల్లాఁగ◆వింటిబ్రోఁత, లుఱుములుగఁగల్గు మెఱుఁగులు◆మెఱుఁగుదీవి
యలుగనెఱరాచతో లిమబ్బు◆పొలనుదిండి, కొండపైనంపజడివాన◆కురియుచుండె.

అచ్చతెలుఁగురామాయణము, యుద్ధ. పద్య 518.

సీ. నరసింహయమళంబు◆శరనిధిద్వంద్వంబు, కనకాద్రియుగముది◆క్కరియమంబు
తలపడువీఁకను◆ద్దండకాండప్రకాం, డగతులువారించి ◆ డగ్గఱంగఁ
జఱచుచుసవ్యాప◆సవ్యవిక్రాంతుల, వలయితగతులను ◆ వలనుమీఱి
తెగిదివ్యకాండముల్◆నిగుడించికొట్టుచుఁ, దనువులురక్తసి◆క్తములుగాఁగ
గీ. సమరవరఘనపత్త్రిర◆థాతిగతుల, డాసి, చెఱుచుచుఁజేరియు◆ద్ధతినినొంచి
మించి బడవేసి మూర్ఛలు◆ముంచఁదేఱఁ, బోరిరొక్కటనిద్దఱ ◆ పూర్వలీల. 1721

యాదవరాఘవపాండవీయము, ఆ 4 పద్య 87.

సీ. నగములై కూర్రసప◆న్నగములై హాలహాల, గరములై ప్రళయసా◆గరము లగుచు
ధరములై కాలాంబు◆ధరములై యసిపత్త్రి, వనములై జంఝూప◆వనము లగుచు
ఖరములై ద్విరదశే◆ఖరములై పటుపాద, రసములై కఱకునా◆రసము లగుచు
జలములై రక్తపిం◆జరములై, దుర్వార, తమములై సైంధవో◆త్తమము లగుచు
గీ. వెలుపుఁబుట్టించిపోనీక◆వెంబడించి, కహకహార్భటిచాలది◆క్కటులనించి
వేగనానావిధాయుధ ◆ వృష్టిముంచి, కదనమొనరించిరిట్టుల◆గ్గలికమించి. 1722

తారాశశాంకవిజయము, ఆ 5 పద్య 42.

సీ. తతతురంగమపదో◆ద్ధతి చేతజనియించి, ధూమ్రపరాగంబు మే◆ఘ మనఁ దనరె
ధూమ్రపరాగంబు మే◆ఘచ్ఛాయఁదనరారఁ, బ్రబలమై బాణవ◆ర్షంబు గురిసెఁ
బ్రబలమైబాణవ◆ర్షము విరాజిల్లిన, గలహాభుక్చాతక ◆ ఘామ మెడలెఁ
గలహాభుక్చాతక◆ఘామంబుదీఱిన, సమరకాంతావివా◆హంబు లయ్యె
గీ. నట్లయద్భుతమొదవెయూ◆థాధిపతులు, పరశుపట్టిసముద్గర◆ప్రాసచక్ర
భల్లకరవాలఫలకవి◆భ్రాజమాన, హస్తులై డాసి చెలఁగిపో◆రాడునపుడు. 1723

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 4 పద్య 91.

సీ. ప్రళయకాలోద్వేల◆జలధిసప్తకతరం, గావళీఘుమఘుమా◆రావ మనఁగఁ
బుష్కలావర్తకో◆ద్భూతజంఝూవాత, ఝూంకృతిఘోషణ◆జాత మనఁగఁ
గల్పవైశ్వానరా◆నల్పలీలాజాల, భవమహాచటచటా◆రవ మనంగ
సంవర్తకాంభోద◆సందోహభీషణా, శనిపాత పెళపెళ◆స్వన మనంగ

గీ. సంగరాంగణరంగమ్మ♦దంగముఖ్య, తౌర్యనినదంబుగజబృంహి♦తములువీర
సింహనాదముల్ జగములు♦ చెవుడుపడఁగ, నొక్కపెట్టుగదురమున♦కుదయమొందె.

రాఘవపాండవయాదవీయము, ఆ 3.

ఉ. ఆతతజృంభమాణనిబి♦డార్భటిజన్యము చెల్లుచుండగాఁ
భీతియొకింతలేక యరి♦భీషణబృంహితముల్ చెలంగ వి
ఖ్యాతనగాభవారణచ♦యంబు బృహత్కుటిసీమనుండి దా
నాతులవర్షముల్ గురిసె♦నద్రులఁబోలిన సెలయేఱులంబలెన్. 1725

శిశుపాలవధ, ఆ 4 పద్య 131.

ఉ. హెచ్చగుకోపముల్గదుర ♦ నిర్భర గాటపుఁగార్ముకంబులన్
జిచ్చఱముల్ముఁలొక్క మొగిఁ♦జిమ్మఁగసాగిరటంచుఁ జెప్పఁగా
వచ్చునొ చిచ్చుబుడ్డులను ♦ వారకచేకొని రంజకంబులన్
జిచ్చులమర్చి పట్టిరని ♦ చెప్పఁగవచ్చునొ సందియంబగున్. 1726

చిత్రసీమ, దళ, 3 పద్య 58.

# యుద్ధరంగము.



సీ. తలఁచుగాఁ దెగిపడ్డ♦ధవళచామరములు, డిండీరమాలలఁ బొల్పఁ ♦ బుండరీక
ములు మరాళంబుల♦పోలుపును గరవాల,ములు మీనభంగియుఁ ♦ దలలు శిలలు
చాడ్పును గేశముల్ ♦ శైవాలరేఖయు, మాంసంబు పంకస♦మానతయును
దాల్ప భటాశ్వమా♦తంగాంగభగ్నర,థములతిప్పలు సైక♦తములు గాఁగ
గీ. ధీరవరకోటి దెళ్లిన♦వీరతతికి, సంభ్రమము పుట్టసంభృతో♦త్సాహలీల
నుబ్బి భూతబేతాళంబు ♦ లోలలాడ, నెట్టలంబగు నెత్తురు♦టేఱు వఱపె. 1727

భారతము, ద్రోణ. ఆ 1 పద్య 146.

ద్విపద. సురుచిరామృతవార్ధి♦సుతయును బోలె, హరియుక్తమైన ని♦జాంగంబు గలిగి
చారువసంతమా♦సంబును బోలె, నారక్తఫుల్లప♦లాశాళి గలిగి
వరదానశీలుని ♦ హాసంబుఁ బోలెఁ, గరిమొప్ప నధికమా♦ర్గణకోటి గలిగి

దీపించు నేరేడు ♦ దీవియుంబోలె, రూపింప నవఖండ ♦ రూపరబు గలిగి
వలచి నపతియొద్ది ♦ వనితయుంబోలె, సలలితరాగ ర♦సంగాలు గలిగి
కడిఁదియై చోరరాని ♦ కానయుంబోలెఁ, గడునొప్పుపుండరీ♦కంబులుగలిగి
సడలనివృదునివా♦సంబునుబోలెఁ, గడఁగియూడెడుభూత ♦ గణములుగలిగి
కమలాప్తరుచినొప్పు♦గగనంబుఁబోలెఁ, గ్రమముదప్పినతార♦కంబులుగలిగి
సరభసంబైనవే♦సవియునుబోలెఁ, సురుచిరాంబరమణి♦స్ఫురణంబుగలిగి
కలిసినశివుఁడును♦గౌరియుంబోలెఁ, దలపోయఁగాసర్వ♦తనువులుగలిగి
పెక్కుచందంబులఁ♦బెంపుసొంపడరి, యక్కజంబయ్యె ర♦ణావనిస్థలము. 1728
రంగనాథరామాయణము, యుద్ధ.

సీ. రథయానపాత్రంబు♦పృథుచక్రికమఠంబు, శవమకరంబును ♦ శయభుజంగ
ముతరచామరో♦త్కరఫేనతతితతు,రంగతరంగంబు ♦ రాజదస్త్ర
బడబాగ్నిదుర్గంబు♦బహురత్నసహితంబు, సంభ్రమావర్తంబు ♦ సామజాద్రి
కలితంబుడాకినీ♦గణహాసఘోషంబు, సాంద్రశోణితపూర♦సలిలమయము
ఆ. నగుచు నబ్ధిఁబోలె ♦ నతిదుస్తరంబు న,గాధతరము దుర్వి♦గాహమంత
రహితపారముదిత♦రసవాహినీకంబు, దుర్నిరీక్ష్యగతిను♦దీర్ణమయ్యె. 1729
భాస్కరరామాయణము, యుద్ధ. 11 పద్య 1964.

సీ. ఖండితశుండాల♦గండముల్ నక్రముల్, భూరితుండంబులు ♦ భుజగసమితి
పదతిలంబులుకచ్ఛ♦పంబులు దంతముల్, శుక్తులుకుంభని♦ర్ముక్తమౌక్తి
కములు రత్నములువా♦లములుజలౌకముల్, మెదలు భేకంబులు♦ మెదడురొంపి
పేర్వులుపవడంపుఁ♦దీవులునరములు, నాఁచుమజ్జంబుఫే♦నంబులస్థి
ఆ. సైకతములురక్త♦చయముతోయంబులు, నోఁటఁగునెదలనొరలు ♦ మొఱలుఘనత
రంగరవముగాము♦తంగజాయోధన, స్థలముజలధిఁబోల్పఁ♦దగె నరేంద్ర. 1730
భాగవతము, స్కం. 10 ఉత్తర. పద్య 884.

సీ. కొండలవలెనేలఁ ♦ గూలినమదగజ, ఘనకదంబములు మే♦ఘములుగాఁగ
మోఁకాలిబంటితో♦నేకమైయాడఁ, గెనుపట్టు మెదడుపం♦కంబుగాఁగ
నలుగులతోఁకున♦నిలఁబడు మాంసఖం,డములు దామింద్రగో♦పములుగాఁగ
బలువిడినెడనెడఁ♦బొఱెడిరక్తంబు,లంబుప్లుతప్రవా♦హంబుగాఁగ
గీ. వాహినులగుంపుశరముల♦వానగాఁగ, మొనలహుంకృతులవియుఱు♦ములుగాఁగ
వర్షకాలంబుచూడ్పన♦వారికన్నుఁ, గవలకునుగోఁచెనప్పుడ♦క్కజముగాను. 1731
శతకంఠరామాయణము, ఆ 4 పద్య 108.

సీ. చెలఁగి పిశాచము ♦ లలి కపాలములతోఁ, గొనివేడ్కు రక్తంబుఁ ♦ గ్రోలుచుండ
శునకజంబుకతతి ♦ యొనసి పీనుఁగులపైఁ, బ్రాఁకి ప్రేవులు పీఁకి ♦ పైనుచుండ
ఖగచయంబులు మాంస ♦ ఖండకాండంబులు, చిందఱవందఱ ♦ సేయుచుండ
నీఁగలతెట్టియు ♦ లెక్కమై మెదడుపై, ముసుకొని ఝుమ్మన ♦ ముసరుచుండ
గీ. గుట్టలై యున్నశవములు ♦ కుళ్ళిముఱిగి, గప్పుగప్పున మిగులదు ♦ ర్గంధములను
చల్లుచును గుప్పుచుండఁ జూ ♦ పఱుల కెల్ల, రణమహిస్థలి భీభత్స ♦ రసము దోఁచె.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 1.

---

# యుద్ధసేన.

—:0:—

చ. రయవిచలత్తురంగమత ♦ రంగములన్ మదనాగనక్రసం
చయములఁ జంచలచ్ఛటుల ♦ సైనికమత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రినుప ♦ యాంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర
ద్ధ్వజయుదమనోహరప్రకట ♦ భంగులఁ దద్భటవార్ధియుద్ధతిన్. 1783

భారతము, ఆర. ఆ 6 పద్య 58.

గీ. అమరుతోడవులసద్రోంశు ♦ లంచపిండు, కరణి హరినీలములఁ బేర్చు ♦ కాంతియాసుల
పగిది మాణిక్యరుచిపప్ప ♦ భంగి మెఱయఁ, గురుబలంబు గందామఱ ♦ కొలనిఁబోలె.

,, ,, ,, భీష్మ. ఆ 1 పద్య 96.

క. అరదములు దీవులున్నర, కరులు గిరులు హరులు వీచి ♦ కలు సుభటసము
త్కరము గ్రిసత్త్వములుగా, శరనిధిగతిఁ బాండుపుత్త్రి ♦ సైన్యంబొప్పెన్. 1785

,, ,, ,, భీష్మపర్వము, ఆ 1 పద్య 181.

సీ. పృథులాంకుశంబుల ♦ బీగువ్రలుడించినఁ, గొంకక జాడించు ♦ కుంజరములు
కింకిణాలంక్రియలఁ ♦ కియలకోడక మెండు, కొనుచుఁ గరాళించు ♦ ఘోటకములు
హస్తులగదురున ♦ కడరి నిల్వక త్రెళ్ళు, ననుహయంబుల మణి ♦ స్యందనములు
తేరకిఁ గరికిఁ బోఁ ♦ జెరువీక హేవాక, కలితులై కేలు మొ ♦ క్కఁ బ్రుఘటులు

ఆ. నురువులుఱులనెడఁద◆నోళ్ళతోడుత మోర, లెత్తికొనుచు వేఁదు◆నెత్తి సట్టు
లుబ్బరేఁగియున్న◆యుష్ట్రములును సేన, కుగ్రలీలఁ జేయుఁ◆జుంచఁగడఁగి. 1736
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 517.

సీ. కరటిఘటాకోటి◆కటనిర్గళన్మదా, సారంబు దోలుకారుఁ◆ జేరఁ బిలువ
రథనేమినిర్భిన్న◆పృథివీపరాగంబు, నీహారసమయంబు◆నేర్పఁ దెగడ
సుభటభుజోద్భట◆చ్ఛురికాప్రభాభంగి, మండువేసవితోడ◆మాటలాడఁ
దురగఘట్టఖలీన◆ఘనఫేనతారకా, వళి శరత్కాలంబు◆వరుసఁ జూపఁ
గీ. పవనచంచలధ్వజపట◆పల్లవములు, నవవసంతంబుఁ దెలుప స◆న్నాహతరళ
ఖడ్గలతికలు శిశిరంపుఁ◆గడఁక దెలుప, హంసడిభకులసేన యేఁ◆గదనఁగ నడిచె. 1737
ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 223.

సీ. ఎడనెడవడిఁ గూడి◆సుడిఁ కీలిఁ దిరుగుచుఁ, దలపడి దర్పంబుఁ◆ దెలుపు నవియు
జనువెన్కకొక్కంత◆చని యొక్కటొక్కటి, దంతముల్ ఖేదిల్లఁ◆ దాఁకు నవియు
వెడవాయ నీకబ◆ళ్ళీడినంటఁ గదుముచు, నట్టెట్టుపడిఁ ద్రోపు◆లాడు నవియు
మావంతుల నొవ్వ◆మర్దితులై కూలినఁ, బూఁపుదప్పక యుల్కఁ◆బోరు నవియు
గీ. నగుచు నవుడగ్రజేంద్రంబు◆లతిశయిల్లె, దంతఘట్టననిష్ఠుర◆ధ్వనములను
ఘంటాలఘంటాఘణంఘణ◆శబ్దములను, గళితఘీంకారములసుది◆క్తటములదర. 1738
కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 79.

సీ. మదచండవేదండ◆మండలుల్ గ్రాంవలు, ఘోటకచ్ఛటలూర్మి◆ఘోటకములు
దరదమ్మలై యొప్పు◆నరదముల్ దీవులు, పదవాత్సకడిమిగ◆న్పదు మొసళ్లు
కరవాలచయము భీ◆కరవాలమీనముల్, చక్రిసంహతితోయ◆చక్రవితతి
చండార్ధచంద్రాంక◆చర్మముల్ కూర్మము, లాయుధద్యుతిజాల◆మౌర్వాశిఖ
గీ. లగుచుఁ గనుపట్టు దైత్యసే◆నార్ణవంబు, భూరిచంద్రోదయంబునఁ◆ బొంగిపొరలి
కెరలి శరలీలవఱలంగఁ◆ దరలి వచ్చి, సమరవాహినితో ముదం◆బమరఁగవిసె. 1739
తారాశశాంకవిజయము, ఆ 5 పద్య పద్య 18.

సీ. కోటపేరిటిశక్తి◆గుల్లిజ్జిగా వింపఁ, బౌరిఁ బొరిఁ రాలు ని◆ప్పులో యనంగ
రణదుర్గమిఁ ద్రిపనీ◆రంధ్రంబు గాఁ జల్ల, రాజిల్లు నాటాచ◆లాజ లనఁగ
గడిదుర్గమని యొడి◆కాలాహి గ్రక్కిన, క్రొవ్వేఁడి విషవిసంపు◆గుళిక లనఁగ
రంగరాయకుమార◆రమణాభ్రమునఁ బుట్టి, తోఁటఁ గడు పిడుగుకప్ప◆తునుక లనఁగ

గీ. లెక్క కెక్కుడు గాదూఁకు • రేకలాలు, గుంటికోఁపులు జబరుజం•గులు షిరఁగు
లొక్క మొగి గాతుఁ గావింప•నుక్కు మెఱసి, గుండ్లగుంపులు జడివాన•గురిసినట్లు.
రంగారాయచరిత్రము, ఆ 3 పద్య 56.

# యుద్ధయానము.

సీ. సమదసింధురకదం•బములు గావివి నిర్ఝ,రచిరచరదభ్రాభ్ర•రములు గాని
రంగదుత్తుంగత•రంగముల్ గావివి, కనుపట్టు జవనాశు•గములు గాని
కమనీయమణిశతాం•గములు గావివి సము,త్కటరత్నమయపుష్ప•కములు గాని
పటుసముద్భటభట • ప్రతతులు గావివి, యతులితసింహసం•హతులు గాని
గీ. ఘనచమూడంబరము లివి • గావు వాయు, చలితచతురర్ణవప్రఘో•షములు గాని
యనుచుఁ జూపఱు లద్భుతం•బందుచుండ, దండిఁ బురుకుత్సనృపమౌళి•దండు వెడలె.
షట్చక్రవర్తి చరిత్రము, ఆ 6 పద్య 8.

సీ. ఖేలాభవాభీల • కోలాహలము జలో, ద్వేలారవార్భటీ•లీల లీన
హేలాగతాలోల • వాలావళీగతుల్, కీలాలఘణులతో • మేల మాడ
కేళీఘుతాలీన • శాలీనరదకాంతి, జాలీభవత్ఫేన • పాళిఁ దెగడ
వ్యాళేశ్వరాళీక • రాళీకృతకరంబు, లాలీఢగగనోర్ము•లాళి గాఁగ
గీ. శాత్రవద్వీపములు ముంచఁ • జనెడు కల్ప, సమయఝుమఘుమగదీర్ఘ•జలధి యనఁగ
వని మెరక కొండ పల్లమే•ర్పఱచకుండ, నుదుటు మీఱంగ గజసైన్య•మెదుట నడచె.
రాఘవపాండవయాదవీయము, ఆ 3.

సీ. మరగజంబుల మీఱు • సొగసు గుల్కెడు మత్త, మాతంగవరములు • మలసి నడువ
రవిహయోత్కటవేగ•మవలీల నిరసించు, హయము లెల్లెడఁ బర్వ • హొయలు గులుక
మేరుమందరశైల • సారము ల్వ్రదళించు, నందమౌ రథములు • సందడింప
విచ్చుకత్తులచేత • విజ్జుపీగుచు వేగ, బయలుదేరెడు వీర•భటులు సెలఁగ
గీ. వీరశృంగారములతోడఁ • బేరులొలయ, మంత్రిపుంగవుతోఁ గూడి•మత్సరమునఁ
దండ్రిమీఁదికి దండెత్తి•తనయుఁ డపుడు, వెడలెఁ గరవాలహస్తుఁడై•వినయ ముడిఁగి.
ధీరజనమనోవిరాజితము, ఆ 1 పద్య 80.

సీ. చతురంగబలవేగ♦సన్నాహపదసము,ద్ధితరజః పటలంబు ♦ దిశలఁ గప్పె
గంధసింధురఘటా♦కర్ణతాళోద్ధూత, ప్రవహంబుతెదిఱిజః ♦ పటలి నడుప
బహువిధస్తంభశుం♦భద్రత్నకేతుకాం,తులునభంబునఁ జీఁక♦టులుగఁ జేయ
యురుఖడ్గసంఘర్ష♦ణోద్ధూతవిస్ఫులిం,గములుదిక్కులనుఁ బ్ర♦కాశ మొసఁగ
గీ. ఘోటకాటోపహేషిత♦ కుంజరోగ్ర, మహితఘీంకారఘోషభీ♦మప్రతాప
కార్ముకజ్యారవంబులొ♦క్కటఁ జెలంగ, సిరులఁ జెంపొందయారాజ♦సేననడచె.

వైశ్యపురాణము, ఆ 6.

సీ. భేరీమృదంగఢ♦క్కారావములమ్రోంగ, జయదుందుభిధ్వాన ♦ సంకులముగ
రాజవేషముఁ బూని ♦ రమణ సహస్రబా,హామండితంబయి ♦ హారమకుట
కటకకేయూరకం♦కణధారియై ఘోర, దంష్ట్రికలొప్పార ♦ దహనసదృశ
తేజంబుతో బహు♦వాజిసంఘటితము, తుంగశతాంగమం♦దున వసించి
గీ. తూర్పుదిశకేఁగెఁ బూర్వమం♦దుశఁ దటీయ, సైన్యకోలాహలంబుచేఁ ♦ జకితజగము
దళితనభము విశీర్ణగో♦త్రంబుభీత, భూతజాతంబు నయ్యెఁబ్ర♦భూతముగను. 1745

వేంకటాచలమాహాత్మ్యము, దా. చిన. వేం. ఆ 3 పద్య 30.

---

# యుద్ధభేరి.

—:O:—

సీ. రోదసీకుహరంబు ♦ మేదురంబైయుండఁ, దిగ్గజశ్రేణియుం ♦ మొగ్గతిలఁగ
ధారుణీచక్రంబు ♦ తల్లడముందంగఁ, బ్రహ్మగోత్రశైలము♦ల్పెల్లగిల్ల
సప్తార్ణవంబులు ♦ సరవితో ఘూర్ణిల్ల, దినమణిగతిదప్పి ♦ తిరుగఁ బడఁగ
గొంకోనినురకోటి ♦ గుండెలుపగులంగ, శేషాహిపీనులు♦చెవుడుపడఁగఁ
గీ. బరగబ్రహ్మాండభాండంబు♦పగిలెననఁగఁ, బ్రళయరుద్రుండువాయించు♦పటహము
ఖిడుగులొక్కటవడిమ్రోయు ♦ పెల్లుదోఁప, భీషణంబుగఁ బ్రస్థాన♦భేరిమ్రోసె.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 1932.

# ద్వంద్వయుద్ధము.

:O:

ఉ. నింగియు నేలయుం బగుల ♦ నిష్ఠురభంగిఁ జెలంగి యార్చుచుం
బొంగి పదోగ్రఘట్టనల ♦ భూమి చలింపఁగఁ బాఱు తెంచుచుం
జంగమభూరిశైలముల ♦ చాడ్పునఁ జేరుచు ఘోరమత్తమా
తంగయుగక్రమంబుల మ♦దంబున నొండొరు వీఁకఁ దాఁకుచున్. 1748

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 179.

సీ. పంచాస్యయుగళంబుఁ ♦ బాథోధియుగ్మంబు, ఘనగిరిద్వంద్వంబు ♦ గగనయుగము
భాస్కరద్వయమును ♦ భావకద్వికమును, గవిసి పోరుచునున్న ♦ గతిదలిర్ప
సామజభేరుండ ♦ శరభోరగంబులు, నప్రతిభటములై ♦ యసికిఁ గడఁగి
వృత్రేంద్రులును ఫాల ♦ నేత్రగజాసురుల్, చటులతరాహవ ♦ సంభ్రమంబు
గీ. సల్పునట్లుగ నిరువురుఁ ♦ జలము బలిమి, మెఱయ నన్యోన్యజయకాంక్ష ♦ మిగులుచుండ
రఘుకులాంబుధిచంద్రుండు ♦ రావణుండు, నొరసి పేర్మిమీడిఁ దలపడి ♦ యుక్కుమిగిలి.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2017.



# మల్లయుద్ధము.

:O:

సీ. చెయ్యిచ్చియొక కొంత ♦ సేపు నేర్పున బల్మి, యినుమడింపఁగఁ జోర ♦ సీకమలసి
యొక తెఱంగునఁ జొచ్చి ♦ యొండొండఁ గాసెలు, దొడకి పట్టుక కొంత ♦ తడవు పోరి
యదిమాని కొంత ప్రొ♦ద్దవని నూఁదివకాళ్ళ, పెకలించి పడవైవఁ ♦ బెనఁగి పెనఁగి
మఱికొంత వడి మెడ ♦ విరియ భుజమ్ములఁ, జిక్కించి యక్కున ♦ నొక్కి నొక్కి
గీ. నడుములనొడిసి కబళించి ♦ పుడమిమీఁద, ఘనము గాఁ ద్రావి బలపరా ♦ క్రమము లెసఁగ
హెచ్చుగుందేమియును లేక ♦ యీశ్వరుండు, హరిహయసుతుండు మల్లసం ♦ గర మొనర్చె.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 4 పద్య 191.

తరల. చెనఁగికొట్టుదు రెలమిఁ జేతురు ♦ జేయిచేయియు వీడ్వడన్
బెనచి పట్టుదురుదరఁ ద్రోతురు ♦ భీమహుంకృతు లొప్పఁగన్
మొనసి పాయుదు రంటితిగుతురు ♦ ముష్టిముష్టియు మీఱఁగన్
గినిసి తాకుదు రొండొరున్ రణ♦కేళిచిత్రము దోఁపఁగన్. 1750

మైరావణచరిత్రము, ఆ 2 పద్య 85.

# స్త్రీయుద్ధనైపుణ్యము.

సీ. తంత్రివినోదంబు ♦ తడవనైపనివేళ్ళ. గొనయంబు తెగలపైఁ ♦ గోరికనుట
యుద్ధంబుపిడిముట్టి ♦ నలయుపాణితలంబు, లస్త్రకఁబిజేయించు♦లావుకలిమి
చెలికత్తెనొత్తిలి ♦ చీఱలేనియెలుంగు, సింహనాదంబుచేఁ ♦ జెదరకునికి
ప్రమదనర్తనకేళిఁ ♦ బంతవింపనిపదం, బైదురాణంబుల ♦ నలఁతఁబడమి
గీ. సోయగపుఁజిత్రరూపంబుఁ ♦ జూచుచోట, వేసరువిలోచనంబులు♦వికృతదైత్య
లక్ష్యమీక్షించుటలు మొక్క♦లంపుగెలుపుఁ, గైకొనియె సత్యభామ సం♦గ్రామసీమ.
మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం♦దందంద మందారకే
సరమాలామకరందబిందు సలిల♦స్యందంబులందంబులై
తొరఁగం బయ్యెదకొంగొకింత దొలఁగన్ ♦ దోడ్తోశరాసారముం
దరహాసామృతపూరముం గురియుచుం ♦ దన్వంగి కేళీగతిన్. 1752

ఉత్తరహరివంశము, ఆ 1 పద్య 161, 162.

సీ. సౌవర్ణకంకణ ♦ ఝుణఝుణనినదంబు, శింజినీరవముతోఁ ♦ జెలిమి సేయఁ
దాటంకమణిగణ ♦ ధగధగదీప్తులు, గండమండలరుచిఁ ♦ గప్పికొనఁగ
ధవళతరాపాంగ ♦ ధళధళరోచులు, బాణజాలప్రభా♦పటలి నడఁప
శరపాత ఘుమఘుమ♦శబ్దంబు పరిపంథి, సైనికకలకల♦స్వనము నుడుప
గీ. వీరశృంగారభయరౌద్ర ♦ విస్మయములు, గలసి భామినియయ్యెనో ♦ కాక యనఁగ
నిషువుఁ దొడుగుట దివుచుట ♦ యేయుటెల్ల, నెఱుఁగరాకుండ నని చేసె♦ నిందువదన.

మ. పరుఁజూచున్ వరుఁ జూచు నొంప వలరిం♦పన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో ♦ వీరంబుశృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపుఁబరగన్ ♦ జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహమున్ సెలపుచున్ ♦ జంద్రాస్యహేలాగతిన్. 1754

భాగవతము, స్కం. 10 ఉత్తర. పద్య 177, 178.

సీ. నెలవంకబోమలకుఁ♦దలఁకి క్రొమ్ముక్కుచూచున్న పగిదినా నమితచా♦పములు మెఱయఁ
గలికిచూపులకు భీ♦తిలి డాఁగి నిలిచిన, కైవడిఁ బొదులమా♦ర్గణము లమరఁ
గుచమండలములఁ గ♦న్గొని భయంబందెను, రీతిఁ జక్రములు ప♦రిభ్రమింప
నలువొందు గోమావ♦సులకుఁ గాకవడంపు, కరణిఁ బక్షంబులు ♦ గంపమొంద
గీ. వీరశృంగారములు మేళ♦వించినట్టి, చెలువమున నింతుముఖులు తే♦జీల నెక్కి
వచ్చి రాహవ మొనరింప♦వారిలోనఁ, బడఁతి యొక్కతె మున్నాడి♦పాఱు తెంచి.

జైమినిభారతము, ఆ 5 పద్య 111.



# యుద్ధధర్మము.

:o:

క. ఉరుతరబలదర్పంబునఁ, బరిపంథిరణంబు సేయఁ ♦ బైకొని పిలుపన్
విరుపతి తొలఁగుటకంటెను, మరణం బెంతయును మేలు ♦ మగవారలకున్. 1757

భాస్కరరామాయణము, కిష్కింధ. పద్య 214.

క. దూరకపటవధకంటెఁ గ్రూరా, ఘోరము మఱి లేదనంగ ♦ కర్తనమంకేం
బోతల తదంతము లెందును, దూరత యాపద్యుఁడని చెప్ప♦దురు ధర్మవిధుల్. 1758

,, ,, ,, సుంద. పద్య 453.

ఉ. వేఁచినవాని దైన్యమున ♦ వేఁదుఱు నొందినవాని నిద్రనై
మఱచినవాని సౌఖ్యమున ♦ మద్యముఁ ద్రావినవాని భగ్నుఁడై
పఱచినవాని సాధుజడ ♦ భావమువానిని గావుమంచు వా
దఱచినవానిఁ గామినులఁ ♦ జంపుట ధర్మముగాదు ఫల్గునా. 1759

భాగవతము, స్కం. 1 పద్య 159.

క. హీనునితోఁ దగు రణము స, మానునితోఁ జేయఁదగు స♦మాధానము నెఱి
ధానరణంబులుదగవ స, మానునితోఁ దొలఁగి కొలిచి ♦ మనుటయె యొప్పన్. 1759
ఉత్తరరామాయణము, ఆ 2 పద్య 8.

# సముద్రము.

క. క్షీరనిధి రత్నంబులు దివిఁ, గరిగెనొ యని తొరకముల ♦ నతులోర్మికరో
త్కరములఁ దెమల్చి తెచ్చిన, పగిదిని నవవిపుల ఫేన ♦ పంక్తులు వెలుఁగున్.
గీ. వనధి నీరెల్లఁ గొనిపోవఁ ♦ గని సహింప, కబ్ధతలిఁ గిట్టి పట్టిన ♦ నయగనొప
కొలిదొంతులు గొనిపడి ♦ యున్న కారు, మొగుళులనఁ జూచితట భూమి ♦ మొగుళులమరె.
కుమారసంభవము, ఆ 1 పద్య 117, 120.

మ. అతి గాంభీర్యము గోత్రగోపనము స♦త్త్వాటోప మాహాత్మ్యమున్
హితలక్ష్మీసదనత్వమున్ సతతవృ♦ద్ధిత్రప్రభావంబు ను
న్నతసర్వోత్తరజీవనోదయము నా♦నావాహినీ సౌఖ్య శా
లితయుం బేర్చుఁ జనుక్ష్మానాథునకుఁ బో♦లెన్ జూడ నంభోధికిన్. 1762
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 96.

మహాస్రగ్ధర. కనియెన్ గల్లోలమాలో♦త్కరజనితతటా♦క్రాంతడిండీరపుంజం
బును ముక్తాజాలిశీలాం♦బుజమరకతసం♦స్ఫూర్తిసంశోభితంబున్
వనకోలక్రూరదంష్ట్రా♦వళి మకరఝులీ♦వ్యాళమైనాకయుక్తం
బును గృష్ణాజహ్నుకన్యా♦ముఖఘనతటినీ♦మూర్తి భద్రున్ సముద్రున్. 1763
రుక్మాంగదచరిత్రము, ఆ 4 పద్య 127.

సీ. రంగదుత్తుంగత♦రంగసంఘంబులు, సరసాభినయకరా♦బ్జములు గాఁగ
బహువిధప్రచలన♦పాఠీనపంక్తులు, ధవళచలోలనే♦త్రములు గాఁగ
సురుచిరస్నిగ్ధహా♦సోద్ధఫేనపటలంబు, చారుతరాట్టహా♦సంబు గాఁగ
లాలితఘోరిబా♦లప్రవాళంబులు, నిరిసిన ఘనజటా♦భరము గాఁగ

గీ. ఘుమఘుమధ్వనివాద్యఘో♦షములు గాఁగఁ, జండతాండవాడంబర♦శంభుమూర్తిఁ
బోలునని తన్ను జనములు ♦ పొగడునట్టి, వర్ణనకు నెక్కియొప్పు మ♦హార్ణవంబు.
పంచతంత్రము, దూ. సా. ఆ 4 పద్య 5.

చ. కనియె నగస్త్యుఁడమ్మునిని♦కాయముతోఁ బునరుక్తపానసం
జనితకుతూహలాగమన ♦ సంభ్రమవిభ్రమవన్నిశావలో
కనతరళోర్మిహస్తధృత ♦ కమ్రకణత్ప్రసవావళీసమ
ర్చనవినయైకధీనిధి ది♦శావలయావధి నమ్మహోదధిన్. 1765
తారకబ్రహ్మరాజము.

సీ. దరిఁదన్నితిరిగెడు ♦ తరఁగలు చనుదెంచు, తరఁగలునొండొంటిఁ♦దాఁకురవము
గుములుగూడుకకంధ♦రములాకసముడిగ్గి, నీరంబుఁ గ్రోలెడు♦నిబిడరవము
మబ్బునఁగసరెత్తి ♦ యుబ్బియంతంతకుఁ, బొరలంగఁబడియెడు♦భూరిరవము
ననుదినపూర్వాప♦రాహ్ణవేళలఁబోటు, పొడిచివిచ్చినట్టి ♦ భోరురవము
గీ. దశదిశాభాగములఁ బ్రతి♦ధ్వనులనీన, వలయశైలాదిగిరిగుహా♦వాససింహ
శరభశార్దూలహృదయభీ♦కరము లగుచుఁ, దనకు నైజంబులుగ మించు♦వనధిరాజు.
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 4 పద్య 60.

సీ. పరితఃప్రకీర్ణమై ♦ పఱచినట్లున్నశై, వాలజాలము నీలి ♦ జాలుగాఁగఁ
బ్రబలిపైఁబ్రాఁకిన ♦ పవడంపు లతలింపు, దగ్ధమైచినపసిండి ♦ తాళ్లుగాఁగ
బ్రహ్మాండపాటనో♦ద్భటములై మినుముట్టు, ఘోరఘోషములు ఘీం♦కారములుగ
వేలాగహనపక్షి♦కోలాహలము లెల్ల, నారిగట్టినపాఁజు ♦ నడలుపులుగ
గీ. నెగసిప్రాలెడుజలజంతు ♦ లెక్కనెక్కఁ, గూలవిసరివఁబటునూప♦టేలుగాఁగ
నూర్మిరేఖాకరంబుల♦ట్టూఁచికొనుచు, గంధగజలీలఁ గ్రాలు సా♦గరముఁ గాంచి.
రామాభ్యుదయము, ఆ 7 పద్య 38.

సీ. అంజనగిర్యధి♦త్యకశాద్వలస్థలి, పచ్చరాకోణిగెలోఁ ♦ బొరువంబు
బలుతుంగమడువులో♦పలికరేణువువట, చ్ఛదములోనినున్నైన ♦ శౌరిమూర్తి
దానవారియురంబు♦లోనిశ్రీవత్సంబు, భానుజాంతరపద్మ ♦ పత్త్రసమితి
కాదంబవనిఁదోఁచు♦నాదిమశ్యామిక, మింటనంటిననీల ♦ మేఘరేఖ
గీ. యనఁగ నిజమధ్యమున ధాత్రి♦దనర మెఱయు, బహులవాతూల జవముహు♦ర్ముహురుదగ్ర
లహరికాజాలడోలికా♦విహరదంబు, నరవితానంబు జలనిధా♦నంబుఁగనిరి. 1768
చంపూరామాయణము, ఆ 6 పద్య 88.

సీ. మిన్నందఁ జెరిఁగియు ♦ మేరఁ దప్పక పెక్కు, భంగముల్లగ్గియుఁ ♦ బాఱలేక
నుల్లైన్నిగలిగిన ♦ నుజ్జనస్రుక్కక, యనువయ్యుఁ బరులకు ♦ నలవుగాక
సరివారిలోపల ♦ నురువులఁ గ్రమ్మక, నేలపైఁ బొరలియు ♦ బేలగాక
తనలోన బడబాగ్ని ♦ దరికొనిమండియు, వడగాలిమీలపై ♦ నుడియనీక
గీ. బయలుపడియునుదనలోఁతు ♦ బయలుగాక, దిగులుపఱచియునొండెడ ♦ దిగులులేక
యినుకకంటెను గుణమణు ♦ లెసకమెసఁగ, ననమరసమయమైన నె ♦ క్కసమువాని.
ద్వాత్రింశత్సాలభంజికాకథలు. అ 2.

సీ. గోత్రాధిపఖ్యాతిఁ ♦ గొమరారియుండుట, సురశైలరాజభూ ♦ సురులఁబోలి
మకరాంకసంవర్తి ♦ మహిమఁ జెన్నొందుట, గగనకిన్నరవరాం ♦ గజులఁబోలి
ఘనరసాలంకృతుల్ ♦ గనుపట్టియుండుట, హరజటాసిద్ధకా ♦ వ్యములఁబోలి
హరిచరణప్రభూ ♦ తాభిముఖ్యంబౌట, బలిదానవననాక ♦ ములనుబోలి
గీ. రంగదుత్తుంగచటులత ♦ రంగనటన, భంగకల్లోలజాలసం ♦ భ్రమనినాద
పూరితాశాంతరాళమై ♦ పొల్చుచున్న, పశ్చిమాంబుధిఁగనియెగో ♦ పప్రభుండు.
అనిరుద్ధచరిత్రము, ఆ 5 పద్య 51.

ఉ. ఊరకమ్రోయుచుం జెసల ♦ కుద్ధతిఁ దుంగతరంగహస్తముల్
బారలు చాఁపుచున్ నురుగుఁ ♦ బైపయిఁ జూపుచు దుంపురుల్ పడం
బాఱుచుఁ బొంగుచున్ బయలు ♦ ప్రాఁకుచు గట్టులందాఁకుచున్ సుధా
నీరధిమించెఁ జూడు తరు ♦ ణీజనభావము మానదెయ్యెడన్. 1771
సమీరకుమారవిజయము.

సీ. ధరణీధరాధిప ♦ తనయాభిరామమై, తారాద్రికై వడిఁ ♦ దనరుదాని
మకరకుళీరాది ♦ మహితమైనీరగా, యనముచందంబున ♦ నలరుదానిఁ
ప్రబలాని మేషప ♦ రంపరాధరితమై, విబుధలోకమురీతి ♦ వెలయుదాని
సర్వతోముఖమహా ♦ సంపత్సమృద్ధమై, యలకాపురముపోల్కిఁ ♦ జెలఁగుదానిఁ
గీ. ప్రస్ఫురత్కటకణోర్మికా ♦ భాసమాన, మగుచు లక్ష్మీకరంబట్లు ♦ తగినదాని
వారిరాశిని జూచి భూ ♦ వరునితోడ, నలరుచును నర్మసచివుఁడి ♦ ట్లనియెనపుడు.
దిలీపచరిత్రము, ఆ 2 పద్య 45.

సీ. జగములుముంపంగ ♦ సమకొన్నకై వడి, నుద్వేలముగనుబ్బు ♦ చున్నదానిఁ
బాతాళనాగము ♦ లైప్రఁదేలియాకాశ, గంగలో విహరింపఁ ♦ గడఁగుదాని
నింగిమిఱిఁగెడుభంగి ♦ నెరయుసముత్తుంగ, భంగసంఘంబులఁ ♦ బరగుదానిఁ
నూలంకపాటోప ♦ కుటిలలరగాత్రిహ, బడబాగ్నిఘోరమై ♦ పఱిబలుదాని

గీ. మురుఘనధ్వనినుడుగక ♦ మెఱయుదాని, నాతతావర్తభీకర♦మైనదాని
నిబిడవర్షధారాపూర్ణ ♦ నిఖిలసింధు, భూరిజలసముత్సేధినం♦భోధిఁజేరి. 1773
భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 760.

ఉ. శ్రీకరబృందమెంతయు న♦శీతమరీచిమరీచిజాలమై
తీక్ష్ణకృతధాళధళ్యమయి ♦ తేజరిలన్ నిజధర్మమైన ర
త్నాకరభావమీజలధి♦యంబుజలోచన చూచితే కడుం
బ్రాకటమై తనర్పఁ దన♦బాహ్యవిభాగమునందుఁ జూపెడున్. 1774

ఉ. ఓలలితాంగిచూడుకడు♦నొప్పెడునీరమునిండు గాఁగఁదాఁ
గ్రోలి తిమిప్రకాండము శి♦రోవివరంబున వెల్వరించును
ద్వేలపుటూర్ధ్వధారయల♦వేలుపుశేటిపయిం గుతూహల
శ్రీలమరున్నదీవిభుఁడు ♦ చిమ్మెడుచిమ్మనఁగ్రోవినీరనన్. 1775
కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 193, 194.

సీ. ఈతనిగాంభీర్య ♦ మెట్టిదో కవ్వమై, తిరిగినమందర♦గిరియెఱుంగు
నీతనియౌదార్య ♦ మెట్టిదో యజరామ, రత్వంబుఁగనుసుర♦ప్రతతియెఱుఁగు
నీతనిసంపత్తి ♦ యెట్టిదో సిరిఁగూడి, యుల్లక్కమున్నస♦ర్వేశుఁడెఱుఁగు
నీతనిప్రాభవం♦బెట్టిదో వజ్రిని, గణనసేయని నగౌ♦ఘంబెఱుంగుఁ
గీ. గాక యీతని నోరులశ♦క్యంబె తెలియ, నప్పులెక్కవ భంగము♦ల్చెప్పఁదలఁచు,
లోనిచిచ్చార్చఁగానోప♦లేనివాఁడు, నిక్కమని కొండ తాడినఁ ♦ దక్క వగునె.
వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 4 పద్య 45.

సీ. అమృతస్వరూపత్వ♦మమరియుండియుఁదన్ను, భంగజీవనుఁడంచుఁ♦బల్కు కొదవ
ఘనసారసత్వసం♦కలితుఁడైఁ వెలసియు, జడవృత్తినలజడిఁ♦బడుకొఱంత
సర్వతోముఖవికా♦సస్ఫూర్తి పొగడొందె, యునుగబంధత్వమెం♦దిన తెఱంగు
భువనోన్నతఖ్యాతిఁ ♦ బొంది లచ్చికిఁబుట్టు, చోటయ్యునుడివడు♦మందువిధము
గీ. మదిని దలపోసి తలపోసి♦మాటిమాటి, కట్టైనిట్టూర్పునిగుడించు♦నటులచటుల
తరతరంగంబులెడనెడఁ ♦ దనరనొనరు, వారినిధిఁగాంచిరప్పుడ♦వ్వారలెదుట.
రఘురామచరిత్రము, పద్య 221.

*

# నదీవర్ణనము.

మహాస్రగ్ధర. ఘనులా రాజన్యసూను◆ల్గని రెదురఁ గృతా◆కాశగంగాపరిష్వం
గను రింగత్తుంగభంగం◆గలితజలవిహం◆గన్పదాశంభుసంగన్
మునిగేహోపాంతరంగన్ ◆ మురహరపదసం◆భూతపూతాంబుసంగన్
జనతాంహోభంగచంగన్ ◆ సగరనృపనుత ◆ స్వర్గసోపానగంగన్. 1778

భాస్కరరామాయణము, బాల. పద్య 343.

ఉ. ముందటఁ గాంచె నంత బుధ◆ముఖ్యుఁడు హల్లకఫుల్లపద్మని
ష్యందమరందపానవిల◆సన్మదభృంగజలత్తరంగమా
కందలవంగలుంగలతి◆కాచయసంగ మురాంగనాశ్రితా
నందితపుణ్యసంగ యము◆నన్ భవభంగశుభాంగనిమ్నగన్. 1779

భాగవతము, స్కం. 3 పద్య 167.

ఉ. ఉన్నతరంగధామలలి◆తోభయపార్శ్వములన్ బ్రిసన్నమై
యున్నది యుబ్బిపాలుఁగలి ◆ తాయతకంకణమౌక్తికద్యుతి
చ్ఛన్నమృదుప్రవాహములు ◆ సాఁచి చిరాగతుఁబ్రాణనాయకుం
జెన్నగ నిండుఁగౌఁగిటికిఁ◆జేర్చె చెలంగు మృగాక్షికైవడిన్. 1780

శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 89.

ఉ. జీవనమెల్ల సత్కవిని◆షేవిత మాశయమెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల◆పట్టు ప్రచారములెల్ల విశ్వధా
త్రీవలయత్రికాలఫల◆దేశికముల్ నవకంబులెల్ల ము
క్తావళివిభ్రమాస్పదము ◆ లానది పెంపు నుతింపశక్యమే. 1781

వసుచరిత్రము, ఆ 2 పద్య 105.

ఉ. ఫేనసమూహముల్ రుచులఁ◆బెంపగుగొజ్జఁగిపువ్వుగుంపులై
కానఁబడంగఁదుంపురులు ◆ గమ్మనిమల్లియలైతనర్పఁబెం
పానిన సుళ్లు మొల్లవిరు◆లైవిలసిల్లఁగ నింపుపుట్టియో
పూనె హరుందులేనగవు◆పొందఁగఁదుందగునిమ్మహానదిన్. 1782

చిత్రభారతము, ఆ 4 పద్య 43.

సీ. ఉబ్బుబగ్గలుగబ్బి◆గుబ్బలుగాఁగ బిత్తరమైనతరఁగలు ◆ తలులుగాఁగఁ
జాలగుతోఁగలుము◆త్యాలపేరులుగాఁగ, మురువగు వెలిదమ్మి◆మొగముగాఁగఁ

దోరంపుఁదామర♦తూండ్లుచేతులుగాఁగ, నలతేఁటిచాల్పునూఁ♦గారుగాఁగ
బలులోఁతుసుడియొప్పా♦క్కిలిగాఁగమిక్కిలి, కొమరైనచిందంబు♦వళికగాఁగఁ
గీ. గప్పుగలనాఁచుగొప్పైన♦కొప్పుఁగాఁగ, మేఁతలిడినంచలిరువంక♦మూతిగఁజవ
రాణఁదులకించుపూఁదీఁగె♦వీణెఁగాఁగఁ, బలుకుచెలనాఁగయమునబోలె♦నలరిమతియు.

యయాతిచరిత్రము, ఆ 2.

సీ. బహుపుణ్యవితరణో♦ద్భటములుతటములు, శ్రితలోకనాకని♦శ్రేణివేణి
యీషణత్రయజయో♦న్మేషంబుఘోషంబుఁ, బ్రశమితాఖిలభక్త♦భయమురయము
దమితోపతాపసం♦తానంబు ఫేనంబు, సంసారశమనపే♦శలముజలము
జ్ఞానదాతపటుప్ర♦సంగముల్ భంగముల్, ఘనమోక్షలక్ష్మిన♦గళ్లునుళ్లు
ఆ. శంఖములకుఁబాండు♦జలజకుట్మలములు, మహితవత్సమునకు♦మధుపసమితి
పీతవసనమునకుఁ♦బృథుపరాగంబునై, మీఱివెలయు నీక♦వేరకన్య. 1784

పరమయోగివిలాసము, ఆ 2 పద్య 96.

సీ. వికసించునెత్తమ్మి♦విరిమోము బాగుగాఁ, గలువలుకన్నుల♦చెలువుగాఁగఁ
గప్పుమీఱిననాఁచు♦విప్పుపెన్నెఱులుగా, జక్కవల్ గుబ్బల♦నిక్కుగాఁగఁ
బుప్పొడినెమ్మేనఁ♦బూయుకుంకుమగాఁగఁ, దెల్లనితెరలుకు♦చ్చెళ్లుగాఁగ
బెళుకుబేడిసలుచూ♦పులమిటారంబుగా, జవ్వాదునురుగు లే♦నవ్వగాఁగ
గీ. బహుళవిహగారవముమధు♦పానమత్త, కలకలాయిత మధురవా♦క్యములుగాఁగ
మగనికౌఁగిలియాసించి♦మగువవచ్చు, తీరుఁగనుపించిమించెఁ గా♦వేరియపుడు.

శ్రీరంగమాహాత్మ్యము, క.వ. ఆ 2.

సీ. కమనీయతరంగరూ♦పములువీఁగాళ్లుగా, సైకతస్థలికటి♦స్థలముగాఁగ
భాసురావర్తక♦భ్రమమదినాభిగా, వరకోకములుకుచ♦ద్వయముగాఁగ
విదితశంఖములయొ♦ప్పిదముకంఠంబుగా, నాగిపద్మములసొంపు♦మొగముగాఁగఁ
దళుకుబేడిసమీలు♦ధవళనేత్రములుగా, నవకమౌ ఫేనంబు♦నవ్వు గాఁగ
గీ. ఘనతతనయందుపుణ్యముల్♦గ్గలుగునంచు, వీచికాహస్తములుసాఁచి♦వేడ్కఁబిలుచు
మేటికామినివిధమున♦మెలఁగుచున్న, సప్తగోదావరిని గాంచె♦శంబరారి.

ధనాభిరామము, ఆ 2.

సీ. కంజాతవిమతశే♦ఖరజటాకోటీర, కావేరవారిజా♦కరమరాళి
ప్రకృతికైతవగవీ♦భరితశివాలయ, క్షితిధరోద్ధతక్షుర♦క్షీరలహరి
కపిలకోపజ్వర♦గ్లపితసాగరసము, ద్ధృతనవ్యదివ్యోప♦ధీమతల్లి
జాలిమజ్జనకుబ్జ♦నాలిపాతకజాత, దర్దురీసందోహ♦దండశూకి

గీ. ఆహరిద్వారవార్ధిప♦ర్యంతచార, జటిహితనిమిత్తవిధికృత♦స్ఫటికరథ్య
యగునిది శరణ్యకృష్ణవే♦ణ్యాదిసింధు, జలజదృగ్జాలమూర్ధన్య♦జహ్నుకన్య. 1787

చంపూరామాయణము, ఆ 4 పద్య 69.

సీ. పతితభూభృత్సేవ♦సలుపునర్థాపేక్ష, గలుగుహేలావతీ♦గతిఁదనర్చి
తతకబంధస్ఫూర్తిఁ ♦ దనరారు రామసం,గ్రామభీమస్థలి♦కరణినలరి
వేళాభివృద్ధిగా♦ంచువాసరముఖ, లక్ష్మీవిలాసలీ♦లలఁజెలంగి
ముఖభంగవిభ్రమం♦బులుగాంచు నటితర, కృద్ధవృద్ధాంగన♦రీతిమెఱసి
గీ. విమలకమలాంతరభ్రమ♦ద్భ్రమరమధుర, ఝంక్రియాగీతతానసం♦జననహేతు
భూతతటరుహకీచకో♦ద్భూతశీత, పవనగతిఁబొల్చునాసరి♦త్ప్రభువధూటి. 1788

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 2 పద్య 8.

సీ. ఆలోలకల్లోల♦జాలదివ్యామృత, సీకరాచ్ఛాదిత ♦ శ్రీనభంబు
తటసముత్కీర్ణసం♦తానాగశీతల,చ్ఛాయాశ్రయానేక♦జనకులంబు
గంభీరకముదపు♦ష్కరసౌరభాగత, బంభరఝంకార ♦ గుంభనంబు
నవమృణాళచ్ఛేద♦నవ్యాజవిభ్రమ, కలహంసమిథునవా♦క్కలకలంబు
గీ. విమలసైకతవేదికా♦సముదయంబు, సకలశైవాలజంబాల ♦ సంకులంబు
గౌతమీనామధేయప్ర♦కాశితంబు, గంగ గనుపట్టె నధికమో♦క్షప్రదంబు. 1789

యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 3.

ఉ. క్షోణిప యాతఁడక్కుధర♦కూటశిఖాంతరమందు గాంచె న
క్షీణజలోచ్ఛలన్మదజ♦శీకరబంధురసింధురార్భక
శ్రేణిని హంసకోకబక♦చిత్రితరమ్యవిశాలసైకత
శ్రోణిని దీర్ఘవేణిని బ♦హుప్రభురాణిని గృష్ణవేణినిన్. 1790

ఆనందసుందరీచాతుర్యవిలాసము, ఆ 2.

సీ. ఏపుణ్యనదివీచి♦కాపరంపరసాగ,రస్వర్గసోపాన ♦ రాజియయ్యె
నేపావనతరంగి♦ణీపయోఝర మిందు,ధరునిచేనౌఁదలఁ ♦ దాల్పఁబడియె
నేపవిత్రతరామ♦లాపగాంబులవంబు, సోఁకినంతన యఘ♦స్తోమమణఁగు
నేపరిశుద్ధవా♦హినిముజ్జగంబులఁ, దరియింపఁజాల్కొని ♦ తనరుచుండె
గీ. నట్టియమునాసరస్వతీ♦యమళసంగ, రంగదనుపమభూరిత♦రంగపద్మ
తంగనటనానుషంగసా♦రంగతుంగ, గంగనాతండుముదమెసఁ♦గంగఁగనియె.1791

బలరామక్షేత్రమాహాత్మ్యము, ఆ 2.

శా. ఆవర్తోపమనాభియై కమలయై ♦ యబ్జస్ఫురద్దేహయై
శ్రీవిజ్ఞానసమగ్రయై కలుషరా♦జీవార్తిదజ్యోత్స్నయై
యావైరించికిభార్యయై తలఁపఁ బ్ర♦త్యక్షంపువాగ్దేవియై
యేవిశ్వేశ్వరియొప్పెఁ గృష్ణ ధరలో ♦ నేఁగొల్తుఁదద్వాహినిన్. 1792

కృష్ణామాహాత్మ్యము, ఆ 1 పద్య 301.

సీ. తటరూఢకుటవార♦చటులాళిపటలాఖ్య, నటజాలగానము♦త్కటముగాఁగఁ
గమనీయవిమలాబ్జ♦గమనాఢ్యతమహంస, రమణీవిరావము ♦ త్క్రిమముగాఁగ
లహరీచరహితాప్తి ♦ సహస్రోద్ధబహుచక్రి, మహిళానినాదమ♦గ్రిమముగాఁగ
నిరతోదకరతాగ్ర♦సరరామతరుణప్ల, వరవప్రపంచము♦త్తరముగాఁగ
గీ. నళికిచూచుచునినుకడి♦న్నెలఁజరించు, మానిమానవులొప్పవి♦పైనదాని
గౌతమీనదిఁగాంచితే♦కమలముకుల, సదృశవక్షోరుహద్వయా ♦ సన్నుతాంగి.

సర్వకామదాపరిణయము, ఆ 2.

---

# నదీనామవిశేషములు.

సీసమాలిక. గంగ సరస్వతి ♦ కాళింది గౌతమి, చిత్రోత్పల విశాల ♦ శిత చంద్ర
భాగ కావేరి వి♦పాశి సితాలక, శీతలవాహిని ♦ సింధు సరయు
గిరి విరావతి గండ♦కి దశార్ణ కృష్ణవే,ణిక శంఖమాల దే♦విక తృణఘ్ని
బహుళ విశాఖిని ♦ బ్రహ్మభాగ సురస,వాలుతోవాహిని ♦ వర్ధమాన
శోకావధూత పి♦నాకినీ ఋభుతామ్రి, పర్ణివలనితామ్ర♦వతి వితద్రు
నర్మదబాహుక ♦ నందచిత్రిత యుత్ప,లావతి కపిల మా♦ల్యవతి త్రిదివ
లక్షణ హారిణి క♦లాంగలిని త్రిసామ, ద్యుమణి కుముద్వతి ♦ తుంగభద్ర
ఋషితజితౌఘగ ♦ ఋజ్వభద్ర సునంది, భృగువరగండకి ♦ భీమరథి మ
హాజలగోమతి♦హంసావళీశ్వర, గండకహరిగండ♦క శతభద్ర
బ్రహ్మగండికనీల ♦ పద్మావతీశావ,తి హిరణ్యశాఖావ♦తి హిమక్రౌంచ
హారితలమానస ♦ హంసకంబు సుమేఘ, సౌభద్ర కౌశికి ♦ చక్రధార
శ్యామమహోత్కట♦సోమమహావక్త్రి, శాక్లిపాశావతి ♦ చంద్రమత్త

పంచగంధ్యరుణప్ర♦భాంజని వలరవ, వజ్రవాలుకశూక ♦ వరుణవక్త్రి
శంచమహావాయి ♦ ఫల్గుణినురకర్త్రు, షధనుష్మతి వితస్త ♦ చంద్రవక్త్రి
స్కందావతి సమూల ♦ చక్షుకదంబక, పుండరీకపయోష్ణి ♦ భూతపాద
కూటవైఘుయుఁజిత్రి♦కూటవేదవతినక్రవతి వేగవతి వే♦త్రవతి గర్భ
వతి యింద్రినందియుఁ ♦ గృతమాలకృష్ణపా,దజయంతవందశా♦త్రాఖ్యాశుక్తి
మతిహరిధృతిసువ♦ర్ణతటీమణిప్రభా,ప్లక్ష కుజల పిప్ప♦ల శుచిసింధు
వర్ణకాశ్యపి మణి♦కర్ణిక మందాకి,ని మలప్రహారి సా♦నుమతి క్షీర
కామోదకీ సఖీ♦మోదితకరతాల, వేదత్రయి మయూఖ ♦ విలయవిదిత
భవనాశనియుసర్వ ♦ పాపహకటికక్షి, ప్రోదవేదస్మృజం♦బూరకుంభ
కరణిత్రిసంధ్యయు♦గాయత్రిఋషికుల్య, ప్రభవిష్ణువికూట ♦ రత్నకృష్ణ
తోయపాపఘ్నవి♦ద్యుతదౌర్గ్యసర్వదా, వైర్ణదృష్టిద్యుతి ♦ వందవార
శిగ్రఘోదయుఁబ్రిణీత♦చెయ్యేరుగుండ్లక,మ్మయుఁగుండమొదలుగా♦మహిఁదనర్చు

గీ. పుణ్యకూలంకషాబృంద♦ముల నమంద, వికసదరవిందగంధిల ♦ విమలకమల
ఘురరవంబుల నురుభక్తి ♦ జలకమాడి, సకలదానాదిసత్క్రియల్ ♦ సలిపెనంత.

హంసవింశతి, ఆ 4 పద్య 205.

ఆ. శర్మ కృష్ణవేణి ♦ నర్మద గౌతమి, గంగ పెన్నయలక ♦ తుంగభద్రి
సహ్యతనయయమున ♦ సప్తగోదావరీ,తీరముల మునింగి ♦ తిని వెలంది. 1795

సత్యభామాపరిణయము, ఆ 2 పద్య 49.

## సంగీతము.



సీ. అమృతంపుసోనపై ♦ నడరినశ్లేపాట, చెన్నున మోరల్లఁ ♦ జివుళులొత్తె
మారుతాహతిపేర ♦ భ్రమఁకులు దలయూఁపఁ, దొడఁగె మరందమా♦ధుర్యమునకు
నింపులగనియైన ♦ యీరాగరసముదీఁ,గలకుఁ గోరకపుల♦కముల నొసఁగె
సెలయేరులకునశ్రు ♦ జలములుదొరఁగించె, గిరులునుమంజుల ♦ గీతిఁగరఁగె

ఆ. ననిసఁబోలుఁబొసఁగు♦నగుఁ దగు ననఁగ న,చేతనంబులెల్లఁ ♦ జిత్రరూపు
లట్లుసోగినిలువ ♦ నంగనయొక్కతి, పాడఁగల మనోజ♦భంగు లలర.

నృసింహపురాణము, ఆ 2 పద్య 83.

క. తేనియమునుఁగో యమృతపు, వానయొ పుండ్రేక్షురసమొ ♦ వల్లోడిన చే
ల్లో నాఁ దుంబురునారద, గానరసం బభిపునోల♦గంబునఁ బర్వెన్. 1797

నన్నెచోడ కుమారసంభవము, ఆ 9 పద్య 235.

సీ. ప్రౌఢితో సరిగమ♦పధనిస్వరంబుల, ప్రతినియతశ్రుతి ♦ క్రమము లెఱిఁగి
రాగభేదములవ♦ర్జములఁ దొలంగించి; లయతాళశుద్ధి నెం♦తయుఁ దలిర్ప
గ్రామవిశేషమూ♦ర్ఛన లేర్పడఁగ మంద్ర, మధ్యమతారసా♦మగ్రిఁ దనర
ధాతుమాతువులు గీ♦తప్రబంధములందు, ననమానలీలమై ♦ నతిశయిల్లఁ
గీ. దోరమగు శ్రీమరసమునఁ ♦ దోఁచితోఁచి, వీనులకు నింపుఁ జలువయు♦ విస్తరిల్ల
నాకరణిఁ బనకాంత య♦నేకగతుల; నాత్మగుణగానములు సేయ ♦ నచ్యుతుండు.

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 33.

సీ. బహువిధాలంకార ♦ పర్యాప్తిచిత్తముల్, గరఁగించుటను వార♦కాంతఁ బోలి
పటుతరాలాపసం♦బంధపరిబంధని, ర్వాహమై ఖరిఁగవి ♦ వాణిఁ బోలి
మహితాంగరాగసం♦పత్తిగ్రామస్ఫూర్తి, బహుళమై నృపునిపై ♦ భవముఁ బోలి
వరతారకాంతర♦స్ఫురితనాదపరిధిఁ, దగి మహాయోగికృ♦త్యంబుఁ బోలి
గీ. వెండియు భుజంగమోహనో♦ద్వేలరక్తి; జాలమాధుర్యగతి మించి ♦ రాలు వెలయ
పౌరవశ్యైకహేతువై ♦ పవనసూను, మానితానూనవల్లకీ♦గాన మమరె. 1798

సమీరకుమారవిజయము, ఆ 6 పద్య 209.

గీ. సరసనై ఋరిషడ్జమ♦స్వరసరాగ, సరణిఁ బాడిన మది భయ ♦ సంభ్రమములు
గలిగి భ్రమ సెందు పున్నాగ♦గణము లెల్ల, న్యాయమున నప్పుడేరయన♦న్యాయమయ్యె.

సీ. సరససారంగాతి ♦ శయనిరూఢిఁ దనర్చెఁ, బున్నాగవైభవ♦స్ఫూర్తి నలరె
రమణీయరూపవ♦రాళిసంగతి మించె, శంకరాభరణసౌ♦ష్ఠవముఁ జూపెఁ
గరిమకల్యాణవై♦ఖరులు గానఁగ నయ్యె, ఘనమేఘరంజని ♦ క్రియత నమరె
మంజులశ్రీరాగ ♦ మంజరిసిరులబ్బె, హితజగన్మోహనా♦కృతి వహించెఁ
గీ. గలికిదృఙ్నాభిచూర్ణకుం♦తలవితాన, రోమరేఖాపఘనకచ♦స్తోమవుచలి
లాసమహిమాతిశయముల ♦ లలితగీత; కృతకవిద్యాధిదేవతా ♦ కృతి ఘటించె.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 2.

మ. అనురాగాంకురకందమై కృతమనో♦హ్లాదమై మాధురీ
ఘనసంపత్పరిణిందితామృతఝరీ ♦ కల్పప్రసూనాలి సూ

తనసంజాతమరందమై కుౘితిపుటాం♦తఃక్రీణనామందమై
దనరున్ మంజులగాన మెవ్వరిది యు♦త్సాహంబుపుట్టున్విన౯. 1802

సుమనోమనోభిరంజనము, ఉల్లాస. 1 పద్య 101.

---

# రాగవిశేషములు.

:o:

సీ. భైరవి మాళవి ♦ బంగాళ హిందోళ, రాజమంజరియు శ్రీ♦రాగగౌళ
భూపాళ లెన్మిది ♦ పురుషరాగంబులు, దేశాక్షి ఘూర్జరి ♦ దేశితోడి
దేవక్రి యాందోళి ♦ దేవగాంధారియు, గౌళ గుండక్రియా♦హరిసలలి
త బిలాహరికురంజి ♦ ధన్యాశి పూర్ణగౌ,ళ వరాళి నాట భ♦ల్లాతికి మల

గీ. హరులు సారంగరామక్రి♦యలు ననంగఁ, గన్నడయనంగ మంగళ♦కౌశికియన
వెలయు నారాయణియుఁజతు♦ర్వింశతివిధ,ములనుదనరారుస్త్రీ♦రాగ♦ములనుమతియు.

సీ. కాంభోజి కేదార♦గౌళ శోకవరాళి, పున్నాగ గుమ్మకాం♦భోజి శంక
రాభరణము మేఘ♦రంజి తోడి వరాళి,నాదనామక్రియ ♦ నాట రీతి
గౌళ రామక్రియ ♦ మేళరామక్రియ, గౌళనారాయణ ♦ గౌళ మధ్య
మావతియు ముఖారి ♦ మలహరి సామంత, పంతువరాళియు ♦ బౌళి రాగ

గీ. చెంచుమలహరి దేశాక్షి ♦ శ్రీవరాళి, మాళవియుఁబాండిసింధురా♦మక్రియయువ
సంత సామంతశుద్ధవ♦సంత గుర్జ, రియును హేజుజ్జ్వనీలాంబ♦రియు ననంగ. 1804

గీ. పొసఁగ ముప్పదిరెండున♦పుంసకములు, మాళవశ్రీయనంగను ♦ మలహరి యన
దేవమలహరి రేగుప్తి ♦ దిరముకుంద, మలహ రన నైదుమిశ్రలీ ♦ మర్మమరసి. 1805

హంసవింశతి, ఆ 5 పద్య 123, 124, 125.

---

# వీణలనామములు—వీణ.

:o:

ద్విపద. రావణహస్తంబు ♦ బ్రహ్మవీణయును, లావణ్యవీణ కై♦లాసవీణయును
యాకాశవీణ క♦నాకవీణయు వి,వేకింపసారంగ ♦ వీణయుఁ గూర్మ

వీణయు స్వాయంభు ♦ వీణయు గౌరి, వీణయుఁ గిన్నర ♦ వీణయు జనక
యనునవి మొదలుగా ♦ నందులోమున్న, ధ్వనియించినట్టియా ♦ దండియడిగిచి.

బసవపురాణము, పా. సో. ఆ 4.

సీ. తళుకునీలపుదట్ట♦ములువోలెనీడలు, గానంగఁదగుగుబ్బ♦కాయ లమర
రతనాలపూసల ♦ రాజిల్లెడుసిరాజి, పగడంపుమెట్లుల ♦ జిగిదొలంకఁ
బ్రచురరాగలతాంకు♦రములుప్రాఁకినలీల, మెఱుఁగారుతంత్రులు ♦ మీటుచూప
ఘుమఘుమధ్వనినించు ♦ క్రొవ్వినయపరంజి, కళుకులయనుసుల♦యొళుకుదనర
గీ. జీవరత్నంపుమేరువు ♦ చికిలికెంపు, బిరడలు గరుడపచ్చల ♦ కరివెజీని
వ్రాఁతహొంబట్టుగవిసిన ♦ రాఁదనరు,వీణెయొకయింతినిల్పెన♦వెలఁదియెదుట.

వాల్మీకిచరిత్రము, ఆ 3.

# వీణావాద్యము.



సీ. తతనితంబాభోగ ♦ ధవళాంశుకములోని, యంగదట్టపుఁగాంతి♦రంగుపలన
శశికాంతమణిపీఠి ♦ జాజునాఱఁగఁగాయ, లుత్తుంగకుచపాళి ♦ నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత ♦ తంత్రీస్వనంబుతో, జిలిబిలిపాటము♦ద్దులువటింప
నాలాపగతిఁజొక్కి♦యరమోడ్పుఁగనుదోయి, రతిపారవశ్యవి♦భ్రమముఁదెలుపఁ
గీ. బ్రౌఢిఁబలికించుగీతప్ర♦బంధములకుఁ, గమ్రకరపంకరుహరత్న♦కటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమా♦నములుగొలుప, నింపుదళుకొత్త వీణవా♦యించుచుండి.

మనుచరిత్రము, ఆ 2 పద్య 27.

సీ. వలుదగుబ్బలుపరిసే♦వకవృత్తిఁ దగుగుబ్బ, కాయలకపరంజిఁ ♦ చాయ లొసఁగ
లలితాంగుళీదళం♦బులుసమేళములైన, సారెలపైంగ ♦ సంపద లీడఁ
బాణికంకణయుతుల్ ♦ ప్రాణానుబంధంబు, గలతాళగతికను ♦ గ్రహములీన
నాలాపభంగియ♦వ్యక్తసంవాది స,మస్వరంబులకు గ్రా♦మంబు లునుపఁ
గీ. బ్రచురతానామృతములమూ♦ర్ఛనలచే న,చేతనంబులు చేతన ♦ రీతిఁ దనరఁ
జేతనంబు లచేతన ♦ భాతినొనర, వీణవాయించు నొకయలి♦వేణిఁగంటి. 1809

మనుచరిత్రము, ఆ 2 పద్య 30.

సీ. తతకాంతికుముదబాం♦ధవకాంతమణిగణం, బులసాంద్రవిమలాంబు♦వులుజనింప
వనసీమసంచర♦ద్వరమరుత్కామినీ, వితతులునిశ్చలా ♦ కృతులుగాఁగఁ
శయకంకణోత్పన్న ♦ ఝణఝణారావంబు, తాళమానంబులై ♦ తనరుచుండ
సకలభూజోల్లస♦చ్చారికాశుకపికా, ళులకుసం♦తోషమై ♦ చెలఁగుచుండ
గీ. సారెసరిగమపధనిసం♦జ్ఞాస్వరముల, కలితలలితాపరూపరా♦గములనెల్ల
వెలయనాలాపములసల్పి ♦ చెలులచేంత, నెలమిఁగొలువంగవీణవా♦యింపుచుండె.

రంభానలకూబరవిలాసము, ఆ 3.

సీ. కొన్నివ్వాఁడికొనగోళ్లఁ ♦ గ్రుచ్చి తంత్రులుమీటు, నందంబు మదిజల్లు♦మని కలంప
మురిపెంబుగాఁబట్టు ♦ ముద్దు వెలుంగున, కల్లనఁగోయిల ♦ లరుగుదేర
సారములుకలిపించి ♦ సొగసుగాఁ బలికించు, వింతకు తానెల్ల♦నెనఁ గరంగ
హాయిలుగాఁబాడెడు ♦ నొఱపైనపాటకుఁ, జేగుపమోదులు ♦ చిగురు వెట్టఁ
గీ. దాను నెవ్వడిఁగవ్వడి ♦ పైనిమున్న, సూరిచిన తేటపాటను ♦ సూర్మి మీఱ
వీణెమీఁటను షోయిగా ♦ వెలఁదిమిన్న, వింతగాఁబాడఁ జొచ్చెను ♦ వీను లలర.

రసికజనమనోరంజనము, ఆ 3 పద్య 43.

# మృదంగవాద్యము.

ద్విపద. ఆశీతివచ్చిన♦యల్లమప్రభుప్ర, గౌరిముద్దులయ్యారు ♦ ఫలకంబువంగు
సంధించి బంధంచి♦సప్తతాళముల, బంధురగతులుత♦ప్పకయుండశ్రుతులు
కూడంగఁ గుడిచేతఁ ♦ గొట్టుముమ్మద్ది, కూడుపాపటికంటఁ ♦ గూడహత్తించి
పరిపాటిగావిమ్మె ♦ పైరాతఁబొడిచి, కరవేగమునవాద్య ♦ కౌశల్యమెసఁగ
నందికేశ్వరునట్లు ♦ నాల్గుధ్వంథలను, బొందుగాఁగ బ్రమాణ♦ములు వినుపించె.

ప్రభులింగలీల, పి. బ. అ 1 గతి 4.

సీ. తత్తరిదొడుగుడాం♦తరికిటిదొడుగుడాం, దొడుతకతకతక♦తోంధిమికిటి
ధిక్కతోంధమిధిమి♦తక్కుఝుంతరికిణ్ణ, ధంధిమద్ధిమధిమ♦ధ్యేయటంచు
సరవినేకోత్తర ♦ శతతాళగరిమయు, నూళాదిభేదవి♦స్ఫూర్తియుఁదగఁ
బ్రస్తారతావ్యాప్తి ♦ ప్రారీణతలుమీఱఁ, జక్కణిప్రాబంధ ♦ సరణులలర

గీ. స్వర్గళంబులు మ్రోయించి ♦ మతియు వేణు, వాద్యవిద్యావిశేషంబు ♦ వఱలుచుండ
గానములు చేసిరపుడేక ♦ కాలమునను, వెలసె ఋతుషట్కసన్నిధి ♦ విరళగతిని.
కిరాతార్జునీయము, ఆ 3 పద్య 83.

---

## నృత్యము—అభినయము.

—:0:—

సీ. శృంగారమే పార ♦ నంగవల్లికయందు, గీతసామగ్రియం ♦ గీకరించి
కరతలామలకంబు ♦ గాఁ గరాంబుజముల, నర్థమాద్యంతంబు ♦ నభినయించి
భావింపనరుదైన ♦ భావమర్మంబులు, మెఱుఁగుఁజూపులలోన ♦ మేళవించి
తాళమానములతోఁ ♦ దాళనిర్ణయలీలఁ, జరణపల్లవముల ♦ సంగ్రహించి
గీ. యఖిలమును మెచ్చఁ బ్రత్యక్ష ♦ మైనయట్టి, నాట్యవిద్యాధిదేవత ♦ నాఁదనర్చి
భరతశాస్త్రమర్మజ్ఞతా ♦ ప్రౌఢి మెఱసె, నూర్వశీకాంత వేల్పుపే ♦ రోలగమున.
విక్రమార్కచరిత్రము, ఆ 2 పద్య 91.

చ. వెనుకకు మొగ్గవ్రాలి కడు ♦ విన్నను వొప్పఁగఁ దొట్టి నీళ్ళలో
మునిఁగి తదంతరస్థమగు ♦ ముంగర ముక్కునఁ గ్రుచ్చికొందు తే
చెనురసనాగ్రవాళమున ♦ శీఘ్రము గ్రుచ్చెను నల్లపూసపే
రనుపమలీల నిప్పడుచు ♦ ప్రాయము లిట్టివి యెట్లునేర్చెనో. 1815
క్రీడాభిరామము, పద్య 146.

సీ. సవ్యహస్తంబర్ధ ♦ చంద్రాభినయముతోఁ, గౌనంటికటితటిఁ ♦ గదియఁజేర్చి
కొనగోళ్ళనుదుటఁగ్ర ♦ మ్మినపెంజెమటమాటి, మాటికిఁదిగిచిపో ♦ మీటికొనుచుఁ
జనుకట్టువిప్పఁజు ♦ ట్టునుఘనస్తనకాంతి, చల్లించియుగముపై ♦ వెల్లివిరియఁ
గోపఘూర్ణితమైన ♦ కొదమనాగమువోలె, నలఁతినిట్టూర్పునం ♦ దందనిగుడ
గీ. వలనవళితంబులైన క ♦ టాక్షవీక్ష, ణాంచలంబులు యువధైర్య ♦ కంచుకములు
చించి చీకాకుపఱచి వి ♦ సంచుఁజేసె, రామ నర్తనకేళీవి ♦ రామవేళ. 1816
వైజయంతీవిలాసము, ఆ 1 పద్య 91.

సీ. అర్థాభినయవేళ ♦ నంగరేఖారూఢి, గల్లకెల్లవిజాతి ♦ గానికోపు
కడకట్లరెడుకత్తె ♦ కారగౌరవముకై, మొరయుగ్గడించుచో ♦ ముద్దుపలుకు

లయగయికొను కోటి ♦ లాస్యహావప్రౌఢి, యాడిగూడినకోటి ♦ యందగింపు
జతియెత్తి కోలుచో ♦ జతగిన్నపాదలిక, తీరుమానముచోటి ♦ తేటసోలపు
గీ. కాంతుఁగనువారినీరుగాఁ ♦ గరచివైచె, నన్నయనాట్యపాటవం♦బుండనిమ్ము
పాటలామోదయొకపాటఁ♦బాడఁబాడ, మాటకమ్మరొమ్రోటుమాన్♦తేటలొత్తె.

సీ. చరణానుచితవాద్య♦మురజనెట్టఁగఁజూచు, వాల్చూపుమరుతూఁపు ♦ వాఁడిదిద్దఁ
దెత్తెయ్యటంచు ధా♦త్రికిఁజూపు పదఘాత, మెంతనెప్పికుఁడైన♦నెదకుఁగోరఁ
బదవాక్యసృష్ట్పూర్వ ♦ బాహాభినయలీలఁ, దనుఁబిల్చుటయెకాఁగఁ♦గమనులెంచఁ
గదలెనో గదలదో ♦ నుదతిపుటాలమే, నవురంచుఁ బ్రజచూడ్కి♦కౌఁగిలింపఁ
గీ. జేటికాశయధాటికా♦ఛేదగళిత, లలితతాళావసానోల్ల♦లత్కపోల
ఘర్మజలకణకైంకర్య♦కలనకొప్పు, నతనుఁడత్తన్వినృత్తాన్వి♦తతఁజెలంగె. 1818

బహులాశ్వచరిత్రము, ఆ 5.

సీ. సంయుతాసంయుత ♦ సంజీవహస్తముల్, పదుమూఁడునొకయిరు♦వదియునాల్గు
త్రింశద్గణంబున ♦ నృత్తహస్తంబులు, నైదువక్షంబులు ♦ నైదుఘటలు
స్కంధంబులాఱును ♦ గంధరల్తొమ్మిది, జానువులేడు పా♦ర్శ్వంబు లేడు
నుత్తమాంగంబులే♦కోనవింశతిదశ, బాహుల్ త్రికుక్షులుఁ ♦ బదము లాఱు
గీ. స్థాయిదృష్టులెనిమిది సం♦చారిభావ, దృష్టులిరువది రసదృష్టు♦లెనిమిదియును
బొంకముగఁజూపివింతకో♦పులు నెలంగ, నాడఁగలిగినఁగలహంచఁ ♦ బాడినీకు.

వాల్మీకిచరిత్రము, ఆ 3.

క. రాణంగురుజులుశతముఖ, బాణంబులు మఱియుఁ జక్రి♦బాణంబులుఁ దే
ల్బాణములు గాల్పభోగము, గాణలునాట్యంబునలుపఁ♦గాహాయలారన్. 1820

కవిజనచకోరచంద్రోదయము, ఆ 4 పద్య 209.

సీ. భారుడంబును శుద్ధ♦పద్ధతిబహురూప, లక్షణంబులుచిండ♦లాస్యములును
బెక్కణపద్ధతి ♦ పేరణాపద్ధతి, కుండలీనృత్తంబు ♦ భాండికంబు
రాసకాఖ్యము నాట♦రాసకంబును జిత్ర, పద్ధతియును దేశ్య♦పద్ధతియును
జర్చరీకందుక♦చానరికోలాట,ములు నాఁగఁదగుపేళ్లఁ ♦ గలుగునట్టి
గీ. షోడశంబగునృత్తంబు♦చొరవనెఱిఁగి, సరవిఁజంచుపుటంబును♦జాంపుటమును
ధ్రువము మధ్యము రూపక♦త్రిపుట జంపె, యేకతాళాటతాళాదు♦లెల్ల నెఱిఁగి.

హంసవింశతి, ఆ 5 పద్య 122.

సీ. అన్యోన్యహస్తదం♦డావృత్తులేసఁగనొం, డొరులసాంముఖ్యంబు ♦ లొందియొంది
యీవలావలవచ్చి ♦ యితరేతరముద్రల్, నిల్చిననెలవుల ♦ నిలిచి నిలిచి
కంకణమంజీర ♦ కాంచికల్ మ్రోయ స,వ్యాపసవ్యస్ఫూర్తి ♦ చూపి చూపి
తాళవాద్యరవాను♦కూలంబుగా మంద, ద్రుతమృదుగతులను ♦ దిరిగి తిరిగి
గీ. యనుపమరసోదయంబున ♦ నభినవాలి, చిత్రవర్తనభంగులఁ ♦ జెలఁగి చెలఁగి
విడివడినమన్మథోన్మద♦ద్విరదములన, సఖులుహల్లీసకముసల్ప ♦ సంతసిల్లి. 1822

ఉత్తరరామాయణము, ఆ 6 పద్య 140.

సీ. అలఁదినబోనంపు♦బోలపంబుచే ధిమిం,ధిమిళ్లు మెలయుమ♦ద్దెలరవంబు
ఝంగుఝంగున మ్రోయు♦కాంస్యతాళధ్వనుల్, కలమంజులవిపంచి♦కావిశేష
కాకలీకలనంబు♦లేకలీలగ నెంచఁ, గలయుపాంగశ్రుతిఁ ♦ గలసి మెలసి
కంకణఝణఝణల్ ♦ కాంచికా ఘుణఘుణల్, గజ్జెలఘుళ్ఘుళల్ ♦గడలుకొనఁగ
గీ. నాగవాసంబు మోసల ♦ నాగవాస, నాకవాసవిలాసిను♦ల్లాసఁగ వాసి
సరసలాస్యంబు రసములా♦స్యములఁదోఁప, నెఱపనరపాలపర్యంకడు♦నిరుపమముగ.

రామరాయవిలాసము, ఆ 3 పద్య 181.

గద్య.

శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ సుకవితావిలసిత
చరణజకులసంజనిత, దాసరి కొండయాఖ్య
సుజనసుత, పీఠికాపురప్రభుపోషిత, సకలజన
విధేయ, లక్ష్మణనామధేయ సంకలితం
బైన వ్యాసరత్నాకరమునందు
ప్రథమ భాగము
సంపూర్ణము.



శ్రీ

పరమేశ్వరాయనమః

# వర్ణనరత్నాకరము

## ద్వితీయభాగము.



## ప్రకీర్ణకములు.



### పరతత్త్వస్తుతి.






యన గౌరి నాఁబరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగురూపముఁ దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కుఁడు భక్తజనంబు వైదిక
చ్ఛాయత కిచ్చు మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. 182

భారతము, విరాటపర్వము. ఆ 1 పద్య 1.



# విష్ణుస్తుతి.

ఉ. వ్రేఁగునపారసత్త్వగుణ ♦ విస్ఫురణం బరమేశ్వరోరువా
మాంగమునందు మున్నుదయ♦మై నియమస్థితిఁ గొల్చి తద్దయుం
లోఁగొని పేర్మితో నఖిల♦లోకములుం దగఁ గాచుచున్నవే
దాంగు ననంతు విష్ణుఁ గమ♦లాధిపు సంస్తుతిఁ జేసి సమ్మతిన్. 1825

నన్నెచోడ. కుమారసంభవము, ఆ 1 పద్య 4.

సీ. పన్నగంబులరాజు ♦ పగవాఁడుఁ గూడి నీ, శయనంబుఁ బయనంబు ♦ సంతరింప
దుగ్ధవారాశికూఁ♦తురు నాలుఁ గూడి నీ, శరణంబుఁ జరణంబు ♦ సవదరింపఁ
దామరపగవాఁడు ♦ దయితుండుఁ గూడి నీ, బడిచూపుఁ గుడిచూపుఁ♦బరికరింపఁ
జందురు చెలికాఁడు ♦ సైదోడుఁ గూడి నీ, యుల్లంబు మొల్లంబు ♦ నుపచరింపఁ
గీ. గంపమానమనోధ్యాన ♦ గతులు మాన, నేకతంబున్న మునులకు ♦ నేకతంబు
లేక పొడగానవచ్చు నీ ♦ లీల గాన, నన్యులే నాఁటి ధన్యులే ♦ యంబుజాక్ష. 1826

ఉత్తరహరివంశము, ఆ 1 పద్య 119.

సీ. తొమ్మండ్రు కొడుకులఁ ♦ దొలివేలుపులఁ జేయఁ, బొడమించునే దేవు♦బొడ్డుఁ దమ్మి
మూఁడు త్రోవలఁ బాఱి ♦ మున్నీటి గరితగాఁ, బరగు నే దేవుని ♦ పాదతటిని
పండెండు రూపులై ♦ పగలింటి రాజుగా, వలఁతి యే దేవుని ♦ వలనికన్ను
వేయిమానికపుఁ బ్రో♦వ్వేలతోడఁ బడగలు, మ్రొక్కు నే దేవుని ♦ మలకపాన్పు
గీ. మునులకెల్ల నే దేవుని ♦ మూర్తి వెలుఁగు, హృదయగేహంబులో దీప ♦ మెత్తినట్లు
హరి మురారి నద్దేవు మ♦హానుభావు, మనసులోఁ గంటి భావములు♦మానసునంటి.

సీ. పుండరీకములతోఁ ♦ బురణించు కన్నులఁ, గారుణ్యమును తేనె ♦ గడలుకొనఁగ
మందారశాఖతో ♦ మలయఁజాలెడు కేలఁ, బాంచజన్యంబను ♦ పండు మెఱయ
నుదయాద్రితటముతో♦నుద్దించు నురమునఁ, గౌస్తుభం బను దివా♦కరుఁడు దోఁప
నాకలోకంబుతో ♦ నవ్వు పాదంబున, నాకాశనదియను ♦ నమృత మొప్ప
గీ. నమృతధారాధరము మాట♦లాడినట్లు, భాగ్యదేవత రూపుచే ♦ పట్టినట్లు
లలితగతినున్న సద్గుణా♦లంకరిష్ణు, విష్ణుఁ బొడఁగంటి భవముల ♦ వీడుకొంటి. 1827

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 144, 146.

చ. కలుములకొమ్మనున్ సతముఁ గాంచఁగ నొమ్మన నుంచి యామెపై
వలపుదలిర్ప హారము లవారణతో సవరించు నేర్పునం
గులుకుమిటారిగబ్బిచలిగుబ్బచనుంగవఁ గేలఁ గూర్చి తాఁ
గిలకిలనవ్వు శౌరి మముఁ గేవల సత్కృపఁ బ్రోచుఁగావుతన్. 1829

ఒడయనంబివిలాసము, ఆ 1 పద్య 18.

సీ. దండంబు శార్ఙ్గకోదండోగ్రకాండప్ర,కాండఖండితదైత్యకాండ నీకు
జోహారు మదగజేంద్రోహగ్రహోపహ,గ్రాహచ్ఛిదాహవోత్సాహ నీకు
వందనం బరవింద మందిరామందిర, త్సుందరోరస్స్థలాలింద నీకు
జేజే మహారాజాది రాజీవపూజాస, మాజోచితాంఘ్రిపంకేజ నీకు
గీ. బహునమస్కారములు చక్రపాణి నీకు, నేకసాష్టాంగములు జగన్నాథ నీకుఁ
బ్రణతిశతములు సురసార్వభౌమ నీకు, నంతపేవాంజలులు సదానంద నీకు.

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 322.

ఉ. ఎప్పుడు ధర్మహానియగు నీధరణిన్ మఱి నాత్మఁబొంబునం
దప్పక మాటిమాటి కవతారము లెత్తుచు సాధుకోటిమే
లొప్పఁగ నుద్ధరించి కుజనోద్ధతిమాన్పిన విష్ణుమూర్తి మా
యప్ప కృపాపయోనిధి నిరంతరసౌఖ్యము మాకు నీవుతన్. 1831

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

ఉ. హరికిరీటద్రివిగ్రహవిహారికి నాశ్రితబృందదుఃఖసం
హరికి ధూతదేవనివహారికి కౌస్తుభసంజ్వలన్మణీ
హరికి హస్తపద్మగమహారికి సాగరబాలికామనో
హరికి వాసానత్ఫణవహారికి శౌరికిఁ గేలుమోడ్చెదన్. 1832

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

సీ. వందన మిందిరా సుందరీహృదయార, విందమధ్యచరన్మిళింద నీకు
నంజలిసజ్జన పుంజముస్తుతవిప,ద్భంజనాధీనస్వాత్కంజ నీకు
దండము భుజగజ శుండామృణాళత్ప్రి,చండగదోర్గళ కాండ నీకు
జోహారు నైగమ వ్యాహారవారము,క్తాహార హరినీల తరల నీకు
గీ. నతిజితహృషీకయతిలోక తతికృతాప, చితిసమంచితచరణరాజీవనీకు
నమనముపిచండగోళక భ్రమదనంత, తోయజాతభవాండనికాయనీకు. 1833

సుమనోమనోభిరంజనము, ఆ 2 పద్య 138.

సీ. దండధరుఁ బఖండితమా◆ర్తాండమండలవిభా, మండితాజాండ పిం◆చండ నీకు
వందనం బజశతా◆నందసంక్రందన, వందితచరణార◆విందనీకు
జోహారు దానవ◆వ్యూహదుర్మోహచే, ష్టాహారి సాహసో◆త్సాహనీకు
నభివాదనము జగ◆త్ప్రభవాంతకర్తృతా, విభవాఢ్యచిద్విలా◆సభవనీకు
తే. జగదధీశ్వరభక్తవ◆త్సలముకుంద, పరమపూరుష గోవింద ◆ పద్మనాభ
ఘనమనోనాథ మాధవ ◆ మద్భయంబు, మాన్పి వేగమె కావవే ◆ మహిమవెలయ.
శేషధర్మములు, అల్ల. న్రు. ఆ 4.



# మహేశ్వరస్తుతి.

సీ. రమణీయశృంగార ◆ రజతపర్వతమునా, శోభిల్లు సిద్ధవి◆స్ఫూర్తిమూర్తి
ఆపర్వతాగ్రహే◆మైకశృంగంబునా, నమరు జటామకు◆టాతిభాతి
ఆతుంగశృంగశి◆లాపూర్ణసరసినాఁ, బొంగారు జాహ్నవి◆భూరివారి
ఆవిమ్లసరసి వి◆హారమరాళికా, పంక్తినా నొప్పు క◆పాలలీల
ఆ. యామహామరాళి ◆ కాబ్జకీర్ణాంభోజ, పుష్పనిభసముద్ధ ◆ భోగిభోగి
సమితిఁ దాల్చి పొల్చు ◆ శంకరుండంబికా, ధవుఁడు మా కభీష్ట◆దాతగాత. 1835
కుమారసంభవము, నన్నె. ఆ 1 పద్య 2.
సీ. తరుణపల్లవరాగ ◆ తామ్రవిద్యుల్లతా, భాసురంబగు జటా◆భార మెఱయఁగ
నిబిడసంతమసాలి ◆ నీలబాలతమాల, పరిపంథియగుకంఠ ◆ భాగ మెఱయఁగ
తారముక్తాహార ◆ ధవళశారదనీర, దాకార మగు నిర్మ◆లాంగ మెఱయఁగ
ద్రవశాతకుంభగౌ◆రకుసుంభకుసుమఖం, డనశీల మగు ఫాల◆నయన మెఱయఁగ
తే. మెఱయఁ గిరీటనవచంద్రు నటమీఁద ◆ హృదయకమల, కర్ణికాభద్రపీఠంబుఁ◆గదియఁ జేర్చి
వరసుధాభిషేకంబునఁ ◆ బరమయోగి, సార్వభౌముండవగు నిన్ను ◆ చంద్రమౌళి.
ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 174.
సీ. కుజముకుంజరము చే◆గూలునో కూలదో, కూలు గుంజరము నీ◆కుజముఁగూల్చె
గ్రాహముపై రేటిచే ◆ మడఁగునో మడఁగదో, మడఁగుఁ జేరేటినీ◆మాఁ గ్రుమడఁచెఁ

కాలునో యొకనిచేఁ ♦ గాలదో సాలంబు, గాలునీ సాలంబు ♦ గాల్చెనో కనిఁ
దునియునో పరశుచేఁ ♦ దునియదో వృక్షంబు, తునియునీ వృక్షంబు ♦ తునిమెఁ బరశు
గీ. వనుచుఁ దమలోనఁ జర్చించు ♦ నమరవరుల, కభిమతార్థఫలార్థమై ♦ యుండవచ్చుఁ
పారిజాతంబు నా మ్రోలఁ ♦ బండియుండె, నందఁగంటి నాకోర్కుల ♦ నందఁగంటి.
ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 176.

సీ. జయ విరూపాక్ష యీ ♦ శ్వర దివ్యలోచన, జయ వజ్రహస్తది ♦ శానివాస
జయ పినాకేష్వాస ♦ శాశ్వత నిత్య య, నిత్య నిత్యానిత్య ♦ నిరుపమాన
జయ చింత్య జయరుద్ర ♦ జయ మహాదేవయ, చింత్య చింత్యాచింత్య ♦ చిత్స్వరూప
జయ పాదభక్తార్తి ♦ సంహారకారణ, జయ ముకుందప్రియ ♦ జయగిరీశ
గీ. దివసమాసార్ధమాసస ♦ ద్విశ్వరూప, కల్పయుగవత్సరాధ్వన ♦ కాలఖేట
రుండ బహురూప చండీశ ♦ దండపాణి, జయ నమస్తే నమస్తే ప్ర ♦ సన్నమూర్తి.
హరవిలాసము, ఆ 6 పద్య 72.

సీ. శ్రీభీమనాయక ♦ శివనామధేయంబుఁ, జింతింప నేర్చిన ♦ జిహ్వ జిహ్వ
దక్షవాటీపురా ♦ ధ్యక్ష మోహనమూర్తి, చూడంగ నేర్చిన ♦ చూపు చూపు
దక్షిణాంబుధితట ♦ స్థాయిపావనకీర్తి, చేనింప నేర్చిన ♦ చెవులు చెవులు
తారకబ్రహ్మవి ♦ ద్యాదాతయౌఁదల, విరులుపూన్పఁగ నేర్చు ♦ కరము కరము
గీ. ధవళకరశేఖరునకుఁ బ్ర ♦ దక్షిణంబు, నర్థిఁ దిరుగంగ నేర్చిన ♦ యడుగులడుగు
లంబికానాయకధ్యాన ♦ హర్షజలధి, మధ్యమున దేలియాడెడు ♦ మనసు మనసు.
సీ. గరళకూటవినీల ♦ కంఠాయ శంభవే, మదనాంతకా యోన్న ♦ మశ్శివాయ
కాద్రవేయాధిప ♦ గ్రైవేయభూషాయ, మఘభిత్సఖా యోన్న ♦ మశ్శివాయ
కుంభినీధరసుతా ♦ కుచకుంభ పరిరంభ, మహాలోలుపా యోన్న ♦ మశ్శివాయ
వేదాదినిశ్శ్వాస ♦ విద్యావధూమౌళి, మణికపాలా యోన్న ♦ మశ్శివాయ
గీ. గంధదంతావళజలంధ ♦ రాంధకారి, విబుధపరిపంథివాహినీ ♦ నిబిడవర్గ
బంధఘోరాంధకారసం ♦ భారకిరణ, మాలినే శాశ్వతా యోన్న ♦ మశ్శివాయ.
భీమేశ్వరపురాణము, ఆ 3 పద్య 197, 210.

ఉ. వాలినభక్తి మ్రొక్కెద న ♦ వారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరి ♦ జాముఖపద్మమయూఖమాలికిన్
బాలశశాంకమౌలికిఁ గ ♦ పాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిముని ♦ ముఖ్యమనస్సరసీరుహాలికిన్. 1841
భాగవతము, స్కం. 1 పద్య 2.

ద్విపద. శ్రీగిరిజాధీశు ◆ శ్రీగిరినాథు, నాగచర్మాంబరు ◆ నాగకేయూరు
బాణవత్సలుఁ బంచ ◆ బాణసంహారు, వాణీశవినుతు గీ◆ర్వాణేశవంద్యు
గంధర్వకిన్నర ◆ గాంధర్వలోలుఁ, గంధరశ్యామల ◆ కంధరోదారు
దారుణాంధకదర్ప ◆ దళనప్రచారుఁ, జారుజాంబూనద ◆ శైలకోదండుఁ
గారుణ్యజలధిగం◆గాధరు నభవు, శారదాచందన ◆ శారదాంభోద
మల్లికాకర్పూర ◆ మాలికాయశుని, మల్లికార్జునదేవు ◆ మహితప్రభావు
భూపాలనేపట్ల ◆ మువ్వేళలువేల్పుఁ, బాపాళిఁబాపస◆ద్భక్తిఁబూజించి. 1842
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. ఆ 1.

సీ. కడలేనిసంసార◆జలధిలోమునిఁగిన, జనులపాలిఁటినావ ◆ శంభుసేవ
కడుదూరమైయున్న ◆ కైవల్యసీమకుఁ, జక్కనిపెనుత్రోవ ◆ శంభుసేవ
యతిభోగభాగ్యంబు◆లనుమూర్తియంబుల, సతులఁగూర్చినకోవ ◆ శంభుసేవ
సకలాగమజ్ఞాన ◆ సారమహీజాత, జాతంబులోచేవ ◆ శంభుసేవ
గీ. నిరవధిఘోరపాతక ◆ దురపగాహ, గహనదహనసముద్రద ◆ గంధవాహ
సఖశిఖావాలికలకేవ ◆ శంభుసేవ, సద్గుణాలకాంతములతీవ ◆ శంభుసేవ. 1843
రాజశేఖరచరిత్రము.

ఉ. కడుకఠినంబు లద్రులు జ◆గంబున నందున సంభవించి పెం
పడరునిసుం గరంప వశ◆మా యని నన్నిపుడంటవేకదా
వడిఁ గనకాద్రిచాపముగ ◆ వంచిననీకు హిమాద్రిజాతయా
పడఁతిఁ గరంచుటెంతయును ◆ పార్వతి మెచ్చు శివుం దలంచెదన్. 1844
అప్పకవీయము, ఆ 1 పద్య 20.

ఉ. వనితరొ కొండకొండ నెల◆వంకలు పెక్కు వహించెఁ జూచితే
యని సరసోక్తిఁ దా ననిన ◆ నచ్చెరుగందపుఁబూఁతగుబ్బజా
ణిన నునుఁబైఁటకొంగు సవ◆రించుచు నవ్వనగౌరిఁగౌఁగిటం
దనిపెడు చంద్రశేఖరుఁ డు◆దారకృపన్ మముఁ బ్రోచుఁ గావుతన్. 1845
ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 3.

# బ్రహ్మస్తుతి.

చ. అమితరజోగుణస్ఫురణ ♦ నాపహమైపరమేశుదక్షిణాం
గమునజనించిభక్తిఁజిర♦కాలము సద్విధిఁగొల్చితత్ప్రసా
దమున నజాండలోకజని ♦ తత్త్వను వేదకళాగమాది వి
శ్వము సృజియించిప్రోల్చునజు♦వాగ్విభు సంస్తుతిచేసి సన్మతిన్. 1846

కుమారసంభవము, ఆ 1 పద్య. 5.

ఉ. ఆతతసేవఁ జేసెద స♦మస్తచరాచరభూతసృష్టివి
జ్ఞాతకు భారతీహృదయ ♦ సౌఖ్యవిధాతకు వేదరాశిని
ర్ణేతకు దేవతానికర ♦ నేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిల ♦ తాపసలోకశుభప్రదాతకున్. 1847

భాగవతము, స్కం. 1 పద్య. 3.

ఉ. నాలుగుమోముల న్నిగమ♦నాదము లుప్పతిలం బ్రచండవా
తూలహతిన్ జనించురొద ♦ తోడి గుహావళి నొప్పు మేరువుం
బోలెఁ బయోజపీఠముని ♦ ముఖ్యులుగొల్వఁగ వాణిఁగూడి పే
రోలగ మున్నధాత విభ♦వోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 1848

మనుచరిత్రము, ఆ 1 పద్య. 3.

చ. తనజనికారణంబయిన ♦ తామరకున్ హితుఁ డౌటచే విక
ర్తనునకు వేయిచూపులిడి ♦ దానికి శత్రుఁడు గాన నేణచి
హ్నునకు బదేనుజేసి యఖి♦యున్ శిఖిభానుముఖామరాళిచే
గొనమొక టప్పగైకొనను ♦ దిష్టనుజేయు విధాతఁ గొల్చెదన్. 1849

అప్పకవీయము, ఆ 1 పద్య 18.

చ. అలిఁగి శచీపతీసతి ని♦జాంఘ్రియుగ్ములపై నిటలంబుఁ జేర్చి యం
దలపడు యావకాంకములు ♦ హల్లకసాయకసాయకక్షతో
కలనముగాఁ దలంచి దయఁ ♦ గౌఁగిటఁ జేర్చుచు సంతసిల్లు న
బ్జలయభూసూతి మా కొసఁగు ♦ సమ్మతభూతి చిరాయురున్నతుల్. 1850

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య. 5.

చ. కరిరథవాజిముఖ్యములు ♦ గాక మరాళము మాకు యానమై
పరగుట కేమి హేతు వన ♦ భారతి నీగమనంబుదీనికిం
దొరకుట మాకు నిచ్చలు న♦నూనము పేర్మిమనిపల్కు ధాతయా
దరమున నిచ్చుఁ గాకనిర♦తంబు మదీయమనోరథార్థముల్. 1851

మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది: పద్య 3.

చ. భువనములం బ్రసిద్ధిఁ గని ♦ భూరితరోర్మివరప్రభావ మొం
దీ విధునిరాక కుబ్బుచు న♦దీర్ఘగుణాంచిత రత్నరాశియై
కవులు సమాశ్రయింపఁదగి ♦ కర్బురగర్భతశ్రీగురుత్వముం
దవులు సరస్వతీశ్వరుఁ డు♦దారతమాకుఁ జిరాయు వీవుతన్. 1852

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 5.

ఉ. తవరన్ హోమముల నిల్చి పల్కు చెలియు♦క్త ప్రౌఢి సూచించుటన్
ఘనులన్ విష్ణుపదప్రవేశులుగ సం♦కల్పించి యుత్కృష్టప
ద్మినులం దావుల నెప్పుడున్ నరసులం♦దేలించి చెన్నొందు న
వ్యవజాతాసను విశ్వనిర్మితకళా♦వ్యాపార మూహించెదన్. 1853

నృసింహవిలాసము; ఆ 1.

చ. ప్రజలసృజించి వారలపు♦రాకృతకర్మఫలానుభూతులన్
నిజముగ ఫాలదేశముల ♦ నెమ్మి లిఖింపఁగ నేర్పు గల్గు వా
రిజభవుఁ డష్టనేత్రుఁడు వి♦రించి సురాసురమానిసన్నుతుం
డజుఁడు విభుండు మా కొసగు ♦ నాయువు శ్రేయము సర్వసిద్ధియున్. 1854

బ్రహ్మోత్తరఖండము; ఆ 1.

ఉ. జాతునిరస్తసర్గవిధి ♦ జాతుని పీడితభక్తలోకజీ
వాతుని దానవాంబుధర♦వాతుని తోషితదేవమౌని సం
ఘాతు నిరాకృతేంద్రియవి♦ఘాతుని నిర్జరపూజ్యవత్సరో
జాతుని విష్ణునాభినల♦జాతునిఁ జేతులు మోడ్చి మ్రొక్కెదన్. 1855

రాఘవపాండవయాదవీయము; ఆ 1.

చ. అనుపమమైనయాత్మచతు♦రాననరూఢికిఁ దోడు సత్యవ
ర్తనము మెఱుంగుపెట్ట విబు♦ధప్రకరంబుల కెల్లఁ బెద్దయై
మనుమనిన స్తవాకలన ♦ మానితుఁ జేసినసద్దయార్ద్రహృ
ద్వనరుహుఁ డా మహామహుఁ బి♦తామహుని న్నుతియింతు నెంతయున్. 1856

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 5.

# హరిహరస్తుతి.

సీ. యజ్ఞరక్షకుఁడును ♦ యజ్ఞవిధ్వంసియు, నై లోకనుతులఁ బెం♦పారువారు
కందర్పజనకుండుఁ ♦ గందర్పదర్పక, దమనుండు, నై లీలఁ ♦ దనరువారు
భువనసంభర్తయు ♦ భువనసంహర్తయు, నన నాప్తగుణకృత్యు♦లైనవారు
భూధరోద్ధారియు ♦ భూధరావాసియు, నగుట నిత్యప్రీతి ♦ నెగడువారు
గీ. విషధిజాతంబులగు రత్న♦విషములురముఁ, గంఠతంబుఁగా సేయ♦నొప్పువారు
భుజగశయనుండుభుజగవి♦భూషణుండు, నెపుడుఁగరుణతో వరదులు♦ యొప్పెదరు మాకు.

హరివంశము, ఆ 6.

సీ. అభ్రంకషంబైన ♦ యాలపోతునితండు, త్రుంచినాఁడీతండు ♦ పెంచినాఁడు
సాధుసమ్మతముగా ♦ సామజంబునితండు, గాచినాఁడీతండు ♦ ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై ♦ పర్వతేశునితండు, దాల్చినాఁడీతండు ♦ వ్రాల్చినాఁడు
ఘనపరంపరతోడి ♦ పన్నగేంద్రు నితండు, మెట్టినాఁడీతండు ♦ చుట్టినాఁడు
గీ. నేఁడు నాఁడనునాఁడును♦ నేఁడు ననక, యీ పఁజెవ్వంగఁ జెప్పంగఁ♦ జూడఁగలిగె
ననుచుఁ గొనియాడుసంయమి♦ జనులకొప్పె, రజతగిరిమీఁదహరిహరా♦రాధనంబు.

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 180.

సీ. బవరాననూతుఁడై ♦ పాథనకాలఁడు, నచ్చినాఁడీతండు ♦ మెచ్చినాఁడు
పంచత్వప్రాప్తిఁ♦బంచాస్త్రునాతండు, పెంచినాఁడీతండు♦నొంచినాఁడు
శేషపన్నగరాజు ♦ సెజ్జగా నాతండు, వ్రాల్చినాఁడీతండు ♦ దాల్చినాఁడు
హాలాహలముఁ బూని♦యల్లంత నాతఁడు, చెంగినాఁడీతండు ♦ మింగినాఁడు
గీ. నక్రియాతండు వసుమతీ♦చక్రియైయతఁడు, నవనవగుణాంతఁడీతఁడు♦హరిణపదుఁడు
కళ్యమయుఁడాతఁడీతండు ♦ కర్మనాథుఁ, డనుచు హరిహరనాథుల♦నభినుతింతు.

నవజ్ఞానదీపిక.

# శ్రీకృష్ణస్తుతి.

సీ. ప్రాణంబుతోఁగూడ ♦ రక్కసిచన్నులఁ, బాలుద్రావిన ప్రౌఢ♦ బాలుఁడితఁడె
పేర్కొడిఁ గానారు ♦ వితతివిలోకములపైఁ, బ్రోచిన యాజగ♦జెట్టి యితఁడె
దుర్వృత్తుఁడగుకంసుఁ ♦ దునిమి యాదవతండ్రిఁ, బట్టంబుగట్టిన♦ప్రభుఁడితండె
సత్యభామకుఁ బారి♦జాతంబునైఁగల, కోర్కెదగ్గిన రసి♦కుండితండె

గీ. వెన్నలును గోపికాచిత్త ♦ వృత్తములును, నరసి ముచ్చిలనేర్చిన ♦ హరి యితండె
శ్రుతిశిరోభాగములఁ దన ♦ శుభగచరణ,సరసిజామోదమును గూర్చు ♦ చతురుఁ డితఁడె.
భారతము, ఉద్యో, ఆ 3 పద్య 175.

శా. ఓ నారాయణ! యో మురాసురహరా! ♦ యో భక్తచింతామణీ!
యో నీలాంబుదవర్ణ! యో గుణనిధీ! ♦ యో లోకరక్షామణీ!
యో నీరేరుహపత్త్రనేత్ర! కృప నా ♦ యుల్లంబులో నుండవే
యో నావేభవబంధముల్ చెఱుపవే ♦ యో దేవకీనందనా! 1861

శా. గోవిందాయ నమోనమో భగవతే ♦ గోపాలభర్త్రే నమో
దేవేశాయ నమోనమో మురభిదే ♦ దిక్పాలకర్త్రే నమో
భావజ్ఞాయ నమోనమో మహాత్మతే ♦ పాపప్రహర్త్రే నమో
శ్రీవత్సాయ నమో యనంగ శుభముల్ ♦ చేకూర్చు మా కెప్పుడున్. 1862
ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 129, 130.

శా. శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై ♦ చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళా ♦ సంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలస ♦ ద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు మహా ♦ నందాంగనాడింభకున్. 1863
భాగవతము, స్కం. 1 పద్య 1.

సీ. వీఁడటే రక్కసి ♦ విగతజీవగఁ జన్నుఁ, బాలు ద్రావినమేటి ♦ బాలకుండు
వీఁడటే నందుని ♦ వెలఁదికి జగమెల్ల, ముఖమందుఁ జూపిన ♦ ముద్దులాఁడు
వీఁడటే మందలో ♦ వెన్నలు దొంగిలి, దర్పించి మెక్కిన ♦ దాపరీఁడు
వీఁడటే యాలయించి ♦ వ్రేతలమానంబు, చూఱలాడిన లోక ♦ సుందరుండు
గీ. వీఁడు లేకున్న పుర మట ♦ వీస్థలంబు, వీనిఁ బొందని జన్మంబు ♦ విగతఫలము
వీనిఁ బల్కని వచనంబు ♦ విపరీతము, వీనిఁ జూడని చూడ్కులు ♦ వృథలు వృథలు.
భాగవతము, స్కం. 9 పద్య 1249.

మ. జయ గోవింద! ముకుంద! చక్రధర! కం ♦ సద్వేషి! సాత్రాజితీ
ప్రియ! నారాయణ! కౌస్తుభాభరణ! కుం ♦ భిత్రాణపారీణ! కా
ళియదర్పఘ్న! విహంగవాహ! వనమా ♦ లీ! కృష్ణ! వైకుంఠశౌ
రి! యశోదాత్మజ! భక్తవత్సల! మురా ♦ రీ! గోపికావల్లభా. 1865
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 56.

సీ. కొఱమాలి విసమిష్టఁ గఱకుఱక్కసిఁ జెండి, పఱపుమీఱెడు బండిఁ బిఱుగఁ ద్రొక్కి
వెఱగొప్ప వేల్పుల మొఱఁగి వెన్నలు మెక్కి, తఱమూఁది మద్దులఁ బెఱికివైచి
యఱచేతఁ గొండఁ జూఁ పఱుపోగడఁగఁ బూని, నెఱిగిబ్బెతల వేల్పు ముఱియడంచి
చిఱుతపాయపుఁ గొల్లఁ దెఱపల వలపించి, మఱపకపనులఁ బల్మఱును గాచి
గీ. వెఱపెఱుంగక మధువున నుఱికి కడిమి, మొఱయఁ డక్కఱి విసదారిఁ బిఱునుఁ డఁదెవి
మఱిగుఱిఁ జేరఁగు తులువల నుఱుము చేసి, పఱులు కఱవేల్పు నెపకెంతు గుఱిదలఁక్క.
సీతాసుందరీపరిణయము, ఆ 1.

శా. శ్రీవైదర్భివివాహవేదిక విభుం జిత్తాంబుజారాత్రిదిబిం
బావిర్భావసమస్తభూషణమణీ హారప్రభాహారిద్యో
యావేశన్ దరమాయఁ ద్రోసియు నిజ వ్యాకారతన్ నోఁచు స
ద్భావం బెన్న వెలుంగు కృష్ణుఁడు కృపన్ బాలించు మమ్మెప్పుడున్. 1867
యాదవరాఘవపాండవీయము, ఆ 1.

మ. పరపుంభావకళానిరూఢి ధరణీ వామాక్షి క్రీడించి యం
త రతిక్రాంతిని వ్రాల వక్షమునఁ దత్స్వాంతప్రవిస్ఫూర్తిమే
దురమై నెమ్మియయందునిండ విలసద్దూర్వాంకురగ్రాహియా
హరినీలం బనఁ బొల్చు కృష్ణుఁడు మదీయాభీష్ట మిచ్చుం గృపన్. 1868
భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 3.

శా. శ్రీలక్ష్మీజలజాక్షి యంశములచేఁ జెల్వొందువారిం బదా
ర్వేలస్త్రీల ననేకరూపములచే శ్రీమీఱ నుద్వాహమై
యాలోలాక్షుల నేకరూపమగు సౌహార్దంబుతో నేలు గో
పాలుం డెప్డు వసించు మామకమనః పద్మాంతరాళంబునన్. 1869
మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది. పద్య 1.

శా. శ్రీరాధాధరబింబమున్ దొరయు రాచిల్కన్ నిజోరస్స్థలీ
తారాజన్మణికాంతి రాఁ బిలిచి తద్రాకేందుబింబాననా
స్మేరాంకూరముచేఁ గృతార్థుఁ డగుచుం జెల్వొందు గోపాంగనా
జారగ్రామణి కృష్ణుఁ డీవుత మహైశ్వర్యంబు మాకెప్పుడున్. 1870
ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 1.

తూవాలంబగు సాపత్రిగ్రహయుగం◆బన్యోన్యవార్ధంబునన్
సేవింపందగు రామచంద్రుఁడు శుభ◆శ్రీలిచ్చు మాకెప్పుడున్. 1874

హరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 1 పద్య 1.

శా. శ్రీరామాంశజయైనజానకి యురః◆సీమాంతరాత్యంతవి
స్తారప్రోజ్జ్వలహారనాయకమణిం◆ సందర్శితంబౌ నిజా
కారం బారసి యన్యకాంతయను శం◆కం బొందునం జెంచి త
ద్వారీత్నము నంకపీఠి నిడు సీ◆తాభర్త నన్ బ్రోవుతన్. 1875

హంసవింశతి, ఆ 1 పద్య 1.

చ. కనుఁగొనఁ జేరెడుం బడమి◆ కానుపు చన్నవకుంక మద్యుతిన్
జ ...గొను ... ము ...యాపుర◆ పేరు సముజ్జ్వలసాంధ్యరక్తిమం
బెనసినతారకావళిన◆ నింపెసలారు దినేంద్రవంశపా
వనుఁడగు రామచంద్రుఁడు దయా◆సదృష్టిఁ బ్రోచుతన్ 1876

శకుంతలాపరిణయము, పె. నా. ఆ 1 పద్య 8.

శా. శ్రీసీతాసతికేలియాం దఘిముఖా◆సీనప్రియారోగ్యనలో
ద్భాసిపరిస్ఫుటహారరత్నకళికా◆స్వచ్ఛాంగనీక్షించి య
న్యాసందేహముఁ జెందఁ దా శ్రమునఁ◆దాహారముం బూన్చు శ్రీ
కౌసల్యాతనయుండు మత్తమగదా◆ కిగ్సిద్ధతుల్ మాన్పుతన్. 1877

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 3.

శా. శ్రీగంజిల్లనొనర్పుఁ గావుత శిలా◆జీవప్రధానప్రథా
స్ఫారంధర్వ్యముఁ గాంచి దారుశకల◆ద్వంద్వంబునుం బాదుకా
కారంబూని భజింప భూభరణభా◆గ్యస్ఫూర్తిఁ గల్పించు సీ
తారామాంఘ్రియుగంబు మాకు స్వసుఖో◆దారాయు రైశ్వర్యముల్. 1878

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 1.

ఉ. శ్రీకమనీయదర్శనుఁడు◆ సేవకమానసమోదకృద్ఘనా
లోకుఁడు రమ్యతారకుఁడు◆ లోకచయాభయదాంబకుండు భ
వ్యాకృతిభావిభాసితుఁడు◆ నై తనరారెడు రామచంద్రుఁడ
స్తోకకృపాకటాక్షములఁ◆ జూచి సదా మముఁ బ్రోచుఁ గావుతన్. 1879

నయనోల్లాసము, ఆ 1 పద్య 1.

## లక్ష్మణస్తుతి.

మ. నిజనిద్రాలసతాపిగాన మెడల♦న్నిర్నిద్రితావృత్తిఁ బూ
ని జగత్పాలనభ్రాతృపరిపాలనముడుగ♦న్విశ్వావనోత్సాహియై
యజరారాతివిఘాతికిన్ వనవిహా♦రాధారమై పొల్చు నూ
ర్జితప్రస్తుతశేషభావనిరతున్ ♦ శ్రీలక్ష్మణుం గొల్చెదన్. 1880

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 4.

ఉ. కంటికి ఱెప్పవోలెఁ దన♦కంటెను మున్నెవ్వరు సేవకుల్గలా
రంటకుఁ బాత్రమై వదిన ♦ యన్నయు సంతసిలంగ భారము
న్నింటను దానె పూని కడు♦నెమ్మదిఁ గావఁగఁ గొల్వదంటయున్
బంటును నైన లక్ష్మణునిఁ ♦ బ్రార్థనఁ జేసెద నిష్టసిద్ధికిన్. 1881

నయనోల్లాసము, ఆ 1 పద్య 3.

## భరతస్తుతి.

ఉ. అంచితరాజ్యరక్షకఖి♦లావనపావన రామపాదుకల్
గాంచినమేటిగావునన ♦ కంటకకోమలతాయుతాత్మని
శ్చంచలభావనాసరణి ♦ సారెఁ జరింపఁగ నమ్మహాత్మ సం
ధించితదాత్మతప్దగు సు♦ధీనిరతున్ భరతున్ భజించెదన్. 1882

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 3.

మ. భగవద్భక్తియుఁబోలె భాగవత సే♦వాయుక్తి భక్తాళికిం
దగు నన్మాటకు సాటిగాఁగ భగవ♦త్సంబంధమౌ పాదుకా
యుగళం బాదలయందుఁ దాల్చికొని యా♦ర్యుల్మెచ్చఁ బూజించి భ
వ్యగుణశ్రీగణనీయుఁడైన భరతుం ♦ బ్రార్థింతు నశ్రాంతమున్. 1883

నయనోల్లాసము, ఆ 1 పద్య 4.

## శత్రుఘ్నస్తుతి.

మ. లవణోదాత్తతరప్రకర్షహృతిఁ గీ♦లాంధరగారాచలా
శనమాత్మప్రతిరామభద్రపదర♦క్షాలక్ష్మియుం గార్ముకా

రవనిర్భర్త్సిత మేఘనాదతయుఁ బో♦రంబూని త్రైలోక్యసం
స్తవనీయాగ్రభవత్రయీచరితుఁడౌ ♦ శత్రుఘ్నుఁ బ్రార్థించెదన్. 1884

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 5.

శా. స్వామింగొల్చుటకంటెఁ దచ్చరణదా♦సశ్రేణి సేవించుటెం
తే మేలంచుఁ దలంచువాఁ డగుటచే ♦ భృత్యానుభృత్యత్వసు
స్థేమక్షేమతనొప్పుదా భరతునం♦స్థిన్ సాహచర్యక్రియా
సామీచీన్యమునన్భజించు ఘనుఁడౌ ♦ శత్రుఘ్నుఁ బ్రార్థించెదన్. 1885

నయనోల్లాసము, ఆ 1 పద్య 5.

## ఆంజనేయస్తుతి.

సీ. తరుణార్కఫలకబళనో♦ద్ధతిఁ జూపె నెవ్వాఁడు, రుచులచే ఫలహా ♦ రుచులచేత
నకలంకరామ ము♦ద్రిక గొనె నెవ్వాఁడు, శయముచే ప్రత్యుత్కో♦శయముచేత
మున్నీరు పల్వలం♦బుగదాఁటె నెవ్వాఁడు, జపముచే గుణగణా♦ర్ణవముచేత
సత్కీర్తిప్రౌఢి ♦ నలరారె నెవ్వాఁడు, రణముచే నియమధా♦రణముచేత
గీ. ధరణి నెవ్వాఁడు దానవ♦ద్విరదపటలిన, విస్ఫూర్తిఁ దనకేసరికిశోర♦వ్యక్తిఁ దెలిపె
నతనిమత్కావ్యభవ్యవా♦గమృతఘటన, మంజులస్వాంతు హనుమంతు♦మదిఁ దలంతు.

వసుచరిత్రము, ఆ 1 పద్య 8.

చ. కమలదళాక్ష భక్తుల క♦గాధభవార్ణవ మింతబంటియ
ప్రిమణఁగటిస్థలంబునఁ గ♦రంబిడి రాముఁడె సర్వదైవతో
త్తముఁడని చాటుచుండెడి వి♦ధంబున దక్షిణపాణి నెత్తి ని
త్యమును బ్రతాపముద్రి నల♦రారు సమీరకుమారుఁ గొల్చెదన్. 1887

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 8.

ఉ. తిరముగ వింట వేవెలుఁగు♦దేవుని గన్గొని పట్టియూస ని
బ్బరముగ నేఁగి చేఁగడిమిఁ♦బట్టినఁ బ్రావరి నేలఁ జెల్లకహా
తురిచెలువంపు లోనియెడ♦తుందుడుకెల్లను దీర్చినట్టి యా
శరువలిపట్టి నాదుమది♦గల్గినకోరిక లెల్ల నీవుతన్. 1888

బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 8.

ఉ. పాయక కొల్తు రామజన♦పాలుఁడు జానకిఁ జూడ నంపుచోఁ
దోయధిగోష్పదంబుక్రియఁ♦దోఁపఁ జవాలున దాఁటి లంక క
త్యాయతలీలఁబోయి దివి♦జారుల దోషులఁబోలెఁ బట్టి బా
హాయతశక్తిఁగొట్టి సతి♦వారసి తద్వ్యథఁగన్న మారుతిన్. 1889

అప్పకవీయము, ఆ 1 పద్య 15.

ఉ. ఎక్కడ రామకీర్తన మొ♦కించుకయే విననైన వేడ్కఁ దా
నక్కడ వచ్చి రంజిలి కృ♦తాంజలియై ప్రమదాశ్రుపూరముల్
పిక్కటిలంగ మైఁ బులక♦బృందము జాదుకొనంగఁ బాడుచున్
జొక్కుచు నాడు నయ్యనిల♦సూనుఁ బ్రభాసతభానుఁ గొల్చెదన్. 1890

వాల్మీకిచరిత్రము, ఆ 1.

ఉ. దంతనిశాతహేతినిరు♦దంతనిశాచరకోటిధాటిదు
ర్దాంతనితాంతవిక్రముని♦దాంతుని శాంతనిశాంతమానసున్
సంతతభక్తి మద్వనన♦సంతునికాంతసుకీర్తి నెంతయున్
మంతుకునెక్కువీరహను♦మంతుఁ దలంతు నిరంతరంబుగన్. 1891

తారాశశాంకవిజయము, ఆ 1 పద్య 16.

సీ. వనరాశిభంగంబు♦ గనఁజేసె నెవ్వాఁడు, కరముచేఁ బర్వతో♦త్కరము చేత
ఘనవలాహకశక్తిఁ♦ గరఁగించె నెవ్వాఁడు, రుషముచే వేగమా♦రుతము చేత
వరిపురవిస్ఫూర్తిఁ♦ బరిమార్చె నెవ్వాఁడు, హేతిచే నిజనఖ♦హేతిచేత
తతమహోమిత్త్రివ♦ర్ధన మూన్చె నెవ్వాఁడు, క్షణముచే మధురవీ♦క్షణము చేత
గీ. నవని నెవ్వాఁడు జానకీ♦స్వాత్మసూచ, నాంజనాత్మజవిఖ్యాతి♦ నధిగమించె
నతనిమామకకృతిచమ♦త్కృతికిఁ దలఁతు, మహితధీమంతు హనుమంతు♦ మానసంతు.

చంద్రికాపరిణయము, ఆ 1 పద్య 8.

సీ. శైశవంబున నె భా♦స్కరు గ్రమింగె నితని తే,జమునకే ఘనుఁడింక♦సదృశుఁడనుచు
సానుశటోద్ధతిస్రజ♦మడచె నీతనిశను, దధిము కేమింకఁ బోల్పఁ♦దగునటంచు
మరుభాటిఁ గడలిలో♦ ముంచె నీతని గభీ,రతకు నెయ్యదియింకఁ♦ బ్రతియటంచు
సింహాగ్రమున గిరుల్♦ ద్రాల్చె నీతని స్థైర్య, సంపదకింక నెవ్వ♦ సాటియనుచు
గీ. జానకీరామచంద్రులే♦ శౌర్యవంతు, పటుగుణస్ఫూర్తులప్పట♦ప్పటికి నెంతు
రా మహాశాంతు నతిదాంతు♦ సకృపరాంతు, నతులమతిమంతు హనుమంతు♦ నభినుతింతు.

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 8.

ఉ. తావకపాదపద్మముల ♦ తాఁకిన మ్రొక్కుటెపెక్కు సేవనల్
గావు మదీయప్రాణులకుఁ ♦ గావునఁ జూడము వీనినంచు నీ
తావిభుమౌళినిల్చి ప్రమ♦దంబునఁ జూపెడురీతి మోడ్పుఁగే
ల్పావనభక్తిఁ బూనెదు కృ♦పావని పావని నెంతు నామదిన్. 1894

హంసవింశతి, ఆ 1 పద్య 7.

సీ. ఏవీరవర్యుని ♦ హీనప్రతాపంబు, తాపంబుఁ గల్పించె ♦ దైత్యతతికి
నేమహామహు దివ్య♦నామసంతానంబు, తానంబుగా జగ♦త్త్రయముఁ బాడె
నేజిష్ణుపాదపం♦కేరుహరాగంబు, రాగంబు భక్తవి♦రాజి కొసఁగె
నరవినేకత్వకు♦జ్జ్వలదళహారంబు, హారంబుఁ జూపె ను♦దారభంగి
గీ. నట్టిగుణవంతు సామంతు♦నరికృతాంతు, దాంతుహరిపదస్వాంతుని♦దాంతశాంతు
రక్షితసమంతుభువనవి♦శ్రాంతుఁ గాంతు, నచలపరికుంతుహనుమంతు♦నాశ్రయింతు.

నృసింహవిలాసము, ఆ 1.

మ. ఉదయాస్తాచలసీమల న్నిలిచి య♦య్యుష్ణాంశునిం జేరి నె
మ్మది నాచార్యునిగా వరించి సకలా♦మ్నాయాదివిద్యాఢ్యుఁడై
కదనక్షోణిని దైత్యవీరవరులన్ ♦ ఖండించి శ్రీరామకా
ర్యదయాళుండగు నాంజనేయుని దగన్♦ బ్రార్థింతు నశ్రాంతమున్. 1896

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

సీ. శోషితాంభఃపూర ♦ ఘుంఘదంభోధిరా,డ్జంబాలపరిలుఠ♦జ్జలచరములు
తతడపీయఃప్రేషి♦తామితవ్యర్ణ్యస్త, సంచరగ్రహగణా♦ధ్యంచితములు
బంభ్రమ్యమాణదు♦ర్భరకందుకచ్ఛటా,దభ్రవిభ్రమభూమి ♦ ధరవరములు
భూనభోంతరపరి♦స్ఫుటచలన్మక్షికా, పరికరాయమాణధా♦రాధరములు
గీ వనధిలఘునసమయభా♦స్వన్మసత్తు,మారజంఘాసముద్భూత♦మారుతములు
ప్రాగ్భవారబ్ధదుర్భర♦పరికరతూల, విసరములనెల్లఁ దూలంగ♦విసరుఁ గాత 1897

కృష్ణభూపాలీయము, పద్య 6.

సీ. కలుము లీనోపఁడే ♦ కమలాప్తసుతరాజ్య, సంఘటనోపాయ ♦ చతురమంత్రి
యుష్టాగము లొసంగఁ♦డే జానకీంఘు, వార్త్యాన్యకుశలవా♦ర్తైక దూత
చిరతరాయుర్వృద్ధిఁ ♦ జేయఁజాలండె లక్ష్మణజీవదానవి♦భవయుండు
కళల నీనేరఁడే ♦ ఘనజగాని సంపూర్ణ, రామ సద్భైక పా♦రాణికుండు

గీ. పావనాకృతి శైవాంశ♦భవుఁడు శ్రీహ,రిస్వరూపుఁడు భావివి♦రించనుండు
నిరవధికకీర్తియగు నాంజ♦నేయమూర్తి, తత్ప్రసేవనములు జగ♦త్పావనములు.

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 7.

సీ. త్రిజగద్విభుత్వవ♦ర్ణితచరిత్రస్ఫూర్తి, దగు నమరేంద్రుఁ డె♦ద్దానిఁ దెచ్చె
సర్వజంతువ్రాత♦చైతన్యహేతువై, తగుజగత్ప్రాణుఁ డె♦ద్దానిఁ దెచ్చె
లోకభీకరదైత్య ♦ లుంటాకపటిమచేఁ, దగు రాఘవేంద్రుఁ డె♦ద్దానిఁ గొనియెఁ
బ్రథితసంపూర్ణసం♦పత్ప్రదానఖ్యాతి, దగు మహీతనయ యె♦ద్దానిఁ బడసె

గీ. నట్టి హారంబు నలుతప♦ట్టాభిషేక, సమయసత్కారముగఁ దాల్చి ♦ యమరునట్టి
యాంజనేయుండు రామరా♦యాధిపతికి, భోగబలవిక్రమైశ్వర్య♦ములనొసంగు.

రామవంశముక్తావళి, ఆ 1 పద్య 8.

# గరుడస్తుతి.

ఉ. ఆయతచండతుండనిహ♦తాహినికాయుని దప్తహాటక
చ్ఛాయుని సర్వవేదమయ♦సన్నుతకాయుని దేవదానవా
జేయుని నప్రమేయుని న♦శేషవిహంగకులాధిపత్యధౌ
రేయునిఁ బ్రస్తుతింతు సుచ♦రిత్రవిధేయుని వైనతేయునిన్. 1900

శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 3.

గీ. నామదిఁ దలంచెద సుపర్ణ♦నామధేయు,మురహరవిధేయు నమరస♦మూహగేయుఁ
గనకనిభకాయు భక్షిత♦కాద్రవేయు, వక్త్రకాంతిజితాత్రేయు♦వైనతేయు.

అప్పకవీయము, ఆ 1 పద్య 13.

చ. తన తనుకాంతి కాంచనకృ♦తంబులరీతి రహించ మూరుతా
శనవరభూషణౌఘముల♦సారెఁగనుంగొని చేయిసాఁచి కై
కొనఁ బటు పూత్కృతుల్ నిగుడ ♦ ఘోరభణావలు పెత్త భీతిచా
లనమువహించు వైజనతు♦లం గని నవ్వ సుపర్ణు వేఁడెదన్. 1902

హంసవింశతి, ఆ 1 పద్య ౩

మ. జననీశాపముఁ బాపఁగాఁ దలఁచి యి♦చ్ఛన్ కచ్ఛపేభంబులం
దనకాళ్ళందవిలించి మానికులజా♦తస్ఫీతభూజాతశా
ఖను యుక్తస్థలిడించి దైవతపతిం ♦ గంపింపఁగాఁజేసి గ్ర
క్కున దివ్యామృత మూర్విపైనునుచు తా♦ర్క్ష్యు న్భక్తితోఁ గొల్చెదన్. 1903

భాగ్యవపురాణము, ఆ 1.

శా. దానుండై సఖుఁడై ధ్వజంబయి సము◆ద్యద్వాహమై యాసనం
బై సద్వ్యజనమై వితానమయి య◆య్యబ్జాలయాకాంతు ను
ల్లాసం బొప్ప భజింపుచుండినమహా◆త్రయ్యాత్మకు న్విద్విష
త్త్రాసాపాదిబలున్ బ్రశాంతుని గరు◆త్మంతు న్దలంతు న్మదిన్. 1904
రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 4.

మ. అరవిందప్రభవాండభాండనికరం◆బబ్రింబుగన్ దుందుకం
దగమందూని మెలంగు శ్రీరమణు ను◆ద్యల్లీలమై పేర్వునన్.
సరవిం దాల్ప నవల్పశక్తిగల యా◆ఛందోమయాకారుఁడౌ
గరుటామంతుఁడు సూర్యరాయధరణీ◆కాంతాగ్రణిం బ్రోవుతన్. 1905
యతిరాజవిజయము, ఆ 1 పద్య 8.

## సుదర్శనస్తుతి.

సీ. దైతేయమతవతీ◆ధమ్మిల్లములతోడ, విరుల నెత్తావికి ◆ వీడుకోలు
దనుజకృశాంతకాం◆తాకటాక్షములతోఁ, గలికికాటుకలకుఁ ◆ గానినావి
దానవమానినీ◆ స్తనకుంభములతోడఁ, బసుపుఁబర్యోడలకుఁ ◆ బాయు తెరువు
దైత్యసరోధన◆దయితాధరములతో, సొబగువీడెములకుఁ ◆ జుక్కయెదురు
గీ. చేసి సురసుందరీకరా◆గ్రతాల, వృంతచలితాంతకుంతల◆విలసదింద్ర
కులవధూటీలలాటికా ◆ కుంకుమంబుఁ, బదిలపఱుపఁ జక్రంబ నీ◆ భరమకాదె.

మ. సతతంబు న్నుతియింతు జంతుమయసం◆సారక్రియారక్షణా
క్షతశౌర్యస్ఫురితారిపక్షమగుటన్ ◆ సంగ్రామభీమభ్రమా
గతగోహాంతికదీర్ఘకాతటలుత◆త్కుంతచ్ఛిదాచ్ఛాదన
క్షతజచ్ఛాలికేళితామరసర◆క్షశ్చక్రిముం జక్రమున్. 1907
ఉత్తరహరివంశము, ఆ 3 పద్య 147, 149.

చ. అడరు గళాగ్రధారలు మ◆హాముఖ వాంత సుధాంబుధారలు
న్బొడవగు పక్ష్మకీలములు ◆ పొంగుసుగాఁ బెఱ దైత్యకోటికి
న్బొడిచిపుఁ గిన్కతో నెసరు ◆ వెట్టిన పెద్ద పసంటి వోలె నె
క్కుడు వెస రాహు మస్తకము ◆ గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. 1908
ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 9.

మ. హరిపీనోన్నతబాహుదండకృతసా◆హాయ్యంబునం దుర్నిరీ
క్ష్యరయస్ఫూర్తులతో నవిభ్రమమును◆మించంగా నరిప్రక్ష్యయు

ర్వగఁ జెల్వార నజాండభాండతతి న♦వ్యగ్రంబుగాఁ జేయు సు
స్థిరచక్రంబు మదీయ దుర్దశల సం♦క్షీణంబుగాఁ జేయుతన్. 1909

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 13.

మ. అనువేలంబుననంతకోటి హరిద♦శ్వాభాసమాహానుమే
యనితాంతప్రభ తాసముజ్జ్వలసహ♦స్రారక్రప్రదీప్యచ్ఛిఖా
ఘనమై శత్రుకరాళమయ్యు హరిభ♦క్త శ్రేణికిల్లన్ సుద
ర్శనమై యార్తులఁబాపు చక్రమొసఁగున్ ♦ సౌఖ్యంబు మాకెప్పుడున్. 1910

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 6.

చ. అనువుగ దేనిఁ బూని వన♦జాక్షుఁడు సజ్జనరక్షణంబు దు
ర్జనగణశిక్షణంబును ని♦రంతరముం బొనరింపుచుండు న
య్యనుపమతేజమౌ బుధజ♦నైకనుదర్శనమైన శ్రీసుద
ర్శన మొనగూర్చు సూర్యమహి♦జాని కనూనజయోచ్ఛ్రయంబులన్. 1911

యతిరాజవిజయము, ఆ 1 పద్య 3.

## పాంచజన్యస్తుతి.

మ. హరిపూరింపఁ బదాస్యమారుత సుగం♦ధాకృష్టమై హాళిపం
కరుహాక్రోడమిళింబబృంద మెదురే♦క్రూరం మషిక్రియాపంక సం
కర దైత్యాసు పరంపరం గముచు రే♦ఖం బొల్చు రాకా నిశా
కర గౌర ద్యుతి పాంచజన్య మొసఁగుం♦గళ్యాణ సాకల్యమున్. 1912

ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 5.

మ. దినమున్ మ్రొక్కెద దుష్టపంచజనదై♦తేయోదరచ్ఛేదన
త్రిని జన్మించుట దుష్టపంచజనదై♦తేయోదరచ్ఛేదనం
బెనయుంజూడ మముం గలంచుటదినీ♦కేధర్మమంచాడురే
ఖను గొండల్ ప్రతిమ్రోయఁగా మొరయుశం♦ఖశ్రేణికామోళికిన్. 1913

ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 14.

మ. కమలావల్లభుఁ డుల్లమం దలరువే♦డ్కం దన్నుఁబూరింపఁ ద
త్కమనీయామలసస్మితాధరసుధా♦ధారన్స్ఫురత్ఫేనపుం
జమొకో నా విలసిల్లుచుం బుధులకున్ ♦ సౌఖ్యంబులం గూర్చు శం
ఖము మాకీవుత సంతతం బఖిలమాం♦గళ్యంబులత్యాదృతిన్. 1914

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 7.

క. ధన్యం బై హరిపూనుట, మాన్యం బై సకలసకల ♦ మండలికి నహా
మాన్యమగు పాంచజన్యము, జన్యములం గెలుపు సూర్య ♦ జనపతి కొసఁగున్.
యతిరాజవిజయము, ఆ 1 పద్య 6.

# కౌమోదకీస్తుతి.

ఉ. యాదవ సార్వభౌమ భయ♦దాయత బాహునియుక్తిఁ జేసి యం
దే దనుజేంద్ర సాళ్వపుర ♦ హేమమణీచరణంబు సంగతం
బై దివి నాత్మ కంకణము♦లందొక కంకణ మయ్యె నట్టి కౌ
మోదకి మోదకీలిత స♦ముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్. 1916
ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 7.

మ. ప్రిణదత్త్వ చనకింకిణీగణఘనా ♦ రావంబు గర్జించము
... ముకుంద మురారివారిదమనా ♦ భాసిల్లఁ దర్దోర్మరు
... రులవ♦జ్రప్రక్రియంగాఁకి గీ
టణఁగంజేయు గదాయుధంబు దచు ను♦ద్యన్మద్దదోస్థిత్యమున్. 1917
ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 15.

ఉ. సాదరలీల నాత్మనయ ♦ నాంచలచాలనసంజ్ఞ నేసమా
సాదితవేగమై యమర ♦ సంఘము లుబ్బఁగ లేచి శత్రువ్యా
చ్ఛేదన మాచరించి హరి♦చిత్తము నుల్లసిల్లఁగఁజేయు కౌ
మోదకి మమ్ము నిత్యముఁ బ్ర♦మోదిత చిత్తులఁజేసి ప్రోవుతన్. 1918
రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 8.

క. అరిదగళలనాప్పదమై, హరిగౌమోదవకరసరోరు♦హంబువితానం
బఱఁగెడు నల కౌమోదకి, నిరతముఁ గృతిపతి కొసంగు ♦ నిఖిలశుభంబుల్.
యతిరాజవిజయము, ఆ 1 పద్య 4.

# నందకస్తుతి.

మ. వరితతోద్గ్రాధరభాగ పీఠ యుగళీ ♦ భాస్వత్త్సరుస్తంభ సం
స్థితిఁ దీండ్రించెడు జాళువా మొనలివా ♦ దీప్తార్చిగా కజ్జలా
న్వితధూమాసిత రేఖ పైయలుగుగా ♦ విజ్ఞాన దీపాంకురా
కృతి నందం బగు నందకం బఘు లతో ♦ శ్రేణిచ్ఛిదం జేయుతన్. 1920
ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 6.

మ. తనునీలాభసమిత్ప్రధూమితవిధూ♦ద్యద్వ్యోమహోధూమకే
తునితాంతోత్థితధూమరేఖగతి స్వ♦స్త్రిర్ధామకేతుద్యుతిన్
గవి రక్తాభతదుద్ధతార్చియన మం♦గ్రింబయ్యెఁ దా నందకం
బవఁ జేర్కొన్న మహాద్భుతాసిమదరి ♦ వ్యాపాదముం జేయుతన్. 1921

ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 16.

ఉ. స్పందితచిత్తదుష్టరిపు♦సంచయకంఠవిలుంఠనక్రియా
నందితదేవతార్పితఘు♦నస్ఫుటకల్పక పుష్పమాలికా
బృందసుగంధయుక్తమయి ♦ పెంపువహించు సమస్తసజ్జనా
నందకమైన నందక మ♦నారతమున్ మముఁ గాచుఁ గావుతన్. 1922

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 9.

క. బృందారకబృందావన, సందర్భవినిర్భరైక ♦ శక్త్యాకరమా
నందకము విహితమహితా, నందక మొగుఁ గాత సూర్య♦వరనాథునకున్. 1923

యతిరాజవిజయము, ఆ 1 పద్య 5.

## శార్ఙ్గస్తుతి.

చ. పిడికెడు కానుఁ గొప్పఁ గని ♦ పేర్మిఁ ద్రివక్ర సమాంగి జేసి తేఁ
బిడికెడు కానుఁ గొప్పఁబయిఁ ♦ బెచ్చు గుణంబును గంటి నంచు నే
ర్పడక నిజత్రివక్రతయుఁ ♦ బాఁపఁగ మ్రొక్కెడునాను వాలిపైఁ
జడిగొన నమ్ములీనుహరి ♦ శార్ఙ్గ ధనుర్లత గాచుఁ గావుతన్. 1924

ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 8.

మ. ఋజుభావాదృతమయ్యు వక్రిమగుణో♦పేతాత్మకంబై పర
వ్రజజీవైకవికర్షణక్రియకళా ♦ పరివ్యక్తమయ్యున్ సదా
నిజజీవైకవికర్షణక్రియకళా ♦ విర్నిద్రమౌ తచ్చతు
ర్భుజశార్ఙ్గంబు మదంగసంగతమహా ♦ భూరివ్యథల్ మాన్పుతన్. 1925

ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 17.

ఉ. ఖండనకేళిచండతర ♦ భావవిజృంభణశైలవిద్విష
త్ఖండనలోల విష్ణుకర♦తామరసంబున సారయుక్తమై
తాండవమాచరించు విబు♦ధప్రమదావహమైన శార్ఙ్గకో
దండము మాకు నిత్యసుఖ♦దం బగుచున్ విలసిల్లుఁ గావుతన్. 1926

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 10.

చ. ధృతిసెడ నాత్మచిత్తము జ♦యించిన కల్మలక్ష్మాలుగంటి భ్రూ
లతికల సామ్యముం గని చె♦లంగుట గెల్వ ఘటించు నంచు సం
తతమును శౌరి కోరికను ♦ దాలుచు శార్ఙ్గ మురుప్రతాపదీ
పితునిగఁ జేయుఁగాత నుక♦విస్తవనీయుని సూర్యరాయనిన్. 1927

యతిరాజవిజయము, ఆ 1 పద్య 7.

# ఆదిశేషస్తుతి.

మ. శయనంబై యుపధానమై నిలయమై ♦ సచ్ఛత్రమై పాదుకా
ద్వయమై మంగళపీఠమై మృదులవ♦స్త్రంబై సమస్తోచిత
క్రియలం జక్రికి నిత్యసన్నిహితమూ♦ర్తిన్ బొల్చు శేషాహి న
క్షయ మేధానిధిఁ గావ్యలక్షణకళా♦చార్యున్ బ్రశంసించెదన్. 1928

శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 2.

మ. హరినాభిన్ జనియించు నబ్జజుఁడు బా♦ల్యక్రీడనాసక్తి బం
ధురభోగాగ్రిచిరత్నరత్నరుచిసం♦దోహైకవాంఛాప్తి త
ద్ధరణోద్యుక్తతచే రచించినఫణా♦వ్యాసక్తపద్మప్రిగా
భరణశ్రీరహిఁ జెందు శేషుఁడు వచః ♦ ప్రాగల్భ్య మిచ్చుం గృపన్. 1929

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 8.

మ. స్థిరదీపప్రతిసీరలౌ మణిఫణ♦శ్రీదీప్తులన్ భోగమం
దిరలీలారతి లక్ష్మివల్లఁగొను దై♦తేయారికిం లజ్జనొం
దు రమాదేవికి మోడ మల్కయు మదిన్ ♦ దోడ్తోడఁ బర్యాయవృ
త్తిరహింజేయు ఫణీంద్రుఁ డీవుత మహా♦గీర్వైభవోన్మేషముల్. 1930

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 10.

మ. ఘనశయ్యాసనపాదుకాంశుకసమ♦గ్రచ్ఛత్త్రిముఖోల్లస
త్తనువేషంబులచే రమాధవునకున్ ♦ దా శేషమైయుండుటన్
జనులెల్లం బను శేషుఁడంచు వినుతిం♦చన్మించు నత్యంతశాం
తు ననంతు న్నరభక్తిమంతు ఫణికాం♦తుం గొల్తు నశ్రాంతమున్. 1931

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 1.

ఉ. ఇలనుభరించు నెవ్వని య♦హీనఫణాఫలకంబు లేనిమే
నలరుల సెజ్జయై యలరు♦శౌరికి కట్టెయనంతమూర్తి ని

స్తులతరకీర్తి పూర్తి నిడి♦తోరపుఁగూరిమిఁ బ్రోచుఁగాత ని
ర్మలనుగుణాంకు వేంకటకు♦మారమహీపతి సూర్యరాడ్విభున్. 1932

యతిరాజవిజయము, ఆ 1 పద్య 6.

## విష్వక్సేనస్తుతి.

క. శ్రీరమణచరణసేవా,చారనియోగావదాను ♦ సత్కీర్తిజయ
శ్రీరాజమానుదానవ, వీరఖగస్యేనుఁదలఁతు ♦ విష్వక్సేనున్. 1933

శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 4.

ఉ. త్యాజ్యజనాఘశాసనవి♦ధానముహుశ్చలనక్రియామహా
ప్రార్జితగణ్యవేత్రము క♦రంబునఁదాల్చి యజాండభాండసా
మ్రాజ్యధురంధరుండయి ర♦మావరభుక్తవిముక్తశేషమే
భోజ్యముగా గ్రహించుహుత♦భుగ్ద్యుతి సైన్యపతి న్భజించెదన్, 1934

రుక్మిణీకల్యాణము, జ. వేం, రం. ఆ 1 పద్య 5.

మ. ఇభవక్త్రాదికపారిషద్యపటలం ♦ బెల్లప్డు నుద్యత్తటి
త్ప్రభ పాణిప్రచలత్సువర్ణమయవే♦త్రప్రాప్తసంజ్ఞన్ జగ
త్ప్రభవద్విఘ్ననివారణార్థము హరి♦ద్భాగంబులం బర్వ స
త్ప్రభ నన్వర్థసమాహ్వయంబు గను వి♦ష్వక్సేను సేవించెదన్. 1935

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 9.

## వీరభద్రస్తుతి.

ఉ. కేలు మొగిడ్చి గొల్చెదను ♦ గేవల దీనజనావనక్రియో
ద్వేలదయాసముద్రు రిపు♦వీర మహాప్రళయోగ్రరుద్రు భ
క్తాళిగృహీతభద్రు రుచి♦రాత్మముఖోపరిలగ్నభద్రికా
శీలలనాకపోలయుగ ♦ లీనహరిద్రుని వీరభద్రునిన్. 1936

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

## రవిస్తుతి.

చ. అనుపమదివ్యమూర్తియును ♦ నంతియకాదు భవాష్టమూర్తులం
దును వరమూర్తిదాన ప్రభ♦తోడ జగజ్జనరాజి కెల్ల నిం

జనయము దాన దృష్టియను ♦ నంతియకాదు త్రిలోచనాదిలో
జనములు దానయైన రవి ♦ చారునిజప్రభవాకు నీవు తన్. 1937

కుమారసంభవము, ఆ 1 పద్య 6.

## కుమారస్తుతి.

క. తనజనకుఁ డురుస్థాణువు, జననియపర్ణాఖ్య దా వి♦శాఖుం డనఁగాఁ
దనరియు నిఖిలమతఫలముల, జనులకు దయ నొసఁగుచుండు♦షణ్ముఖుఁ గొలుతున్.

కుమారసంభవము, ఆ 1 పద్య 8.

## మల్లికార్జునస్తుతి.

మ. అమలజ్ఞానసుదీపవర్తిఁ గొని వృ♦ద్ధాచారుఁడై వేదశా
స్త్రములందున్న సదర్థ మొల్లఁ గొని వి♦ద్వత్ప్రీతిఁ గావించు వా
ని మహాత్మ్యంబనఁబొల్చు పుణ్యనిధి వా♦ణీముఖ్య సర్వజ్ఞ జం
గమలింగంబగు మల్లికార్జును సదా ♦ కల్యాణుఁ గీర్తించెదన్. 1938

కుమారసంభవము, ఆ 1 పద్య 15.

## హయగ్రీవస్తుతి.

శా. క్షీరాంభోధిలసత్తరంగపటలీ ♦ శీతీకృతోత్తాపదో
దారాశ్వత్థమహీజమూలమునఁ బ♦ద్మస్థాయియై శిష్యుల
త్యారూఢస్థితిశాస్త్రముల్ చదువఁగా ♦ వ్యాఖ్యానముద్రాన్వితుం
డై రాజిల్లు హయాననుం గొలుతు వి♦ద్యాజాలప్రోద్యానమున్. 1940

మ. అకలంకస్థితి శంఖచక్రవిలస♦ద్వ్యాఖ్యానముద్రానుపు
స్తకయుక్పాణి చతుష్టయుండు వరప♦ద్మస్థుండు శుభ్రాంశుమం
డ్యక్కృతోపాసుఁడు జ్ఞానదుండు హయవ♦క్త్రస్వామి నిత్యంబుమా
మకచిత్తంబుననిల్చి కూర్చు మృదుశుం♦భద్వాక్య సందర్భమున్. 1941

రుక్మిణీకల్యాణము, జ. వేం. గం. ఆ 1 పద్య 11, 12.

## విఘ్నేశ్వరస్తుతి.

చ. తను వసితోంబుదంబు సిత♦దంతయుగం బచిరాంశు లాత్మగ
ర్జన మురుభర్జనంబు గర♦సద్రుచి శక్రశరాసనంబు నై

చన మదవారివృష్టి హిత♦సస్యసమృద్ధిగ నభ్రభేల నాఁ
జను గణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్టఫలప్రదాత గాన్. 1942

కుమారసంభవము, నన్నె. ఆ 1 పద్య 7.

ఉ. అల్లన తుండమెత్తి శివు♦నౌఁదలయేటిజలంబు పీల్చి సం
ఫుల్లతఁ బాదపీఠమున♦పొంతనయున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకుశల♦సంహతిఁ బ్రోత్సహ సేయునట్లు శో
భిల్లు గజాననుండు మద♦భీప్సితసిద్ధికరుండు గావుతన్. 1943

విజయసేనము, ఆ 1.

ఉ. గ్రక్కున నేత్రయుగ్మము క♦రద్వితయంబున మూసిపట్టి యా
మిక్కిలికంటికిం దనదు♦మిక్కిలిహస్తము మాటుచేసి యిం
పెక్కుడు బాలకేళిఁ బర♦మేశ్వరుచిత్తము పల్లవింపఁగాఁ
జక్కిక ముద్దునం బొలుచు♦దంతిముఖుం గొలుతున్ బ్రసన్నుఁగాన్. 1944

దశకుమారచరిత్రము, ఆ 1 పద్య 5.

చ. తనరఁగఁ గ్రుచ్చి యంబిక ము♦దంబునఁ గౌఁగిటఁ జేర్చుచో ఘన
స్తనయుగకుంభయుగ్మములు♦దార్కొని యొప్పనకై యనూయపైఁ
జెనకి కనంగ నొండొకటిఁ♦జేరినలాగున నుల్లసిల్లఁ బెం
పెనసినవానిఁ బ్రీతి నుతి♦యించెద నేనికమోమువేలుపున్. 1945

నృసింహపురాణము, పీఠిక. పద్య 5.

చ. పరముఁడు కంధరస్థలము♦పై నిడి వేడుక ముద్దు లాడఁగాఁ
గరమునమౌళి గంగయుద♦కంబులఁ జెల్వునఁ బీల్చి యాఁదిశీ
కరములు భూషణేందునకు♦గౌరవతారకలీలఁ జేయు త
త్కరివదనుండు మత్కృతికిఁ♦దానుముఖస్థితితోడఁదోడగున్. 1946

విక్రమసేనము, ఆ 1.

శా. జేజే యంచు భజింతు నిష్టఫలసం♦సిద్ధుల్ మదిం గోరి ని
ర్వ్యాజప్రౌఢకృపావలంబునిఁ గట♦ప్రస్యందిదానాంబునిం
బూజాతత్పరదేవదానవకదం♦బున్ బాలకేళీకళా
రాజత్కౌతుకరంజితోరగపతి♦ప్రాలంబు హేరంబునిన్. 1947

శృంగారనైషధము, ఆ 1 పద్య 4.

సీ. కలితశుండాదండ♦గండూషితోన్ముక్త, సప్తసాగరమహా♦జలధరముల
ప్రకిరియాకేళి♦వశవతీర్ణసుపర్ణ, మేదినీధరరత్న♦మేఖలములు

శక్యజంబూఫల♦ప్రకటసంభావనా, చుంబితభూభృత్కట♦దంబకములు
వికటకండూలగం♦డక దేహమండలీ, ఘట్టితబ్రహ్మాండ ♦ కర్పరములు
గీ. శాంభవీశంభులోచనో ♦ త్సవకరములు, వాసవాద్యమృతాశన ♦ వందితములు
విఘ్నరాజమదోల్లాస ♦ విభ్రమములు, మించి విఘ్నోపశాంతిఁ గా♦వించుఁ గాత.

హరవిలాసము, ఆ 1.

ఉ. ఆదర మొప్ప మ్రొక్కెదను ♦ నద్రిసుతాహృదయానురాగసం
పాదికి దోషభేదికిఁ బ్ర♦సన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి న♦శేషజగజ్జననందవేదికిన్
మోదకఖాదికిన్ సమద♦మూషకసాదికి సుప్రసాదికిన్. 1949

భాగవతము, స్కం. 1 పద్య 5.

మ. తొలుమ్రొక్కుల్ గొనువేల్పుఁ గొల్తు శశభృ♦త్కోటీరుఁ గోటీరట
త్కలభూషాంకితగాత్రు గాత్రమరసం♦ఘుస్తోత్రవేళానిర
ర్గళధారాళకటప్రదానతటినీ♦రజ్జద్విరేఫాలికా
కలికాలోలవిచారుఁ జారుహరిభు♦క్ప్రాలంబు లంబోదరున్. 1950

జైమినిభారతము, ఆ 1 పద్య 4.

ద్విపద. పారంబుగా వేడ్క ♦ సముకొల్పు బీజ, పూరంబువలకేలఁ ♦ బొలుచురత్నాల
హారంబు డాకేల ♦ నాదిత్యముకుట, హీరంబు నెదఁగల్గు ♦ హేరంబుఁ బొగడి.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన.

ఉ. అంకముఁజేరి శైలతన♦యాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున ♦ నవ్వలి చన్గబళింపఁబోయి యా
వంకకుచంబుఁ గాన కహి♦వల్లభహారముఁ గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గ♦జాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్. 1952

మనుచరిత్రము, ఆ 1 పద్య 4.

చ. అరుదుగ వామభాగలల♦నాకలనాచలనాత్ముఁడైన యా
హరు గురుఁ గాంచి తానును ద♦దాకృతియాగతి నేకదంతుఁడై
కరికరిణీగుణంబులు మొ♦గంబునఁ దాల్చి జగంబు లేలు నాం
తరకరుణాసనాథు గణ♦నాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్. 1953

నరసభూపాలీయము, పద్య 6.

సీ. చంద్రఖండకలాపుఁ♦జారువామనరూపుఁ, గలితచంచలకర్ణుఁ ♦ గనకవర్ణు
మోదకోజ్జ్వలబాహు♦మూషికోత్తమవాహు, భద్రేభవదను స♦ద్భక్తసదను

సన్మునిస్తుతిపాత్రు◆శైలసంభవపుత్త్రు, ననుదినామోదు ఘ◆న్యాప్రసాదుఁ
బరశువరాభ్యాసు ◆ బాశాంకుశోల్లాసు, నురుతరఖ్యాతు నా◆గోపవీతు
గీ. లోకసన్నుతగుణవంతు ◆ నేకదంతు, నమితహేరంబు సత్కారు◆ణావలంబు
విమలరవికోటితేజు శ్రీ◆విఘ్నరాజుఁ, బ్రథితవాక్ప్రౌఢి కెప్పుడుఁ◆బ్రస్తుతింతు.

మొల్లరామాయణము, ఆ 1.

మ. నిజదంతప్రసవంబు హస్తమధుపో◆న్మేషంబు హారావళీ
భుజగవ్రాతలతాసమేతము మదాం◆భోనారమారందమున్
భుజశాఖాశ్రుతిపత్త్రిముల్ ఘటఫలం◆బుల్ గల్గి సొంపొందు నా
గజరాజానన కల్పభూజ మొసగుం ◆ గళ్యాణసాఫల్యమున్. 1955

బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 7.

చ. తమఁ గని మ్రొక్క యెత్తునెడ ◆ దక్షజయు న్నిటలాక్షుఁడు న్మదం
బున నిరుచెక్కులుం గదిసి ◆ ముద్దు గొనంగ నొకింత నెమ్మొగం
బనువుగ వెన్కకుం దిగిచి ◆ యత్నవిహీనపరస్పరాస్యచుం
బనములు దల్లిదండ్రులకుఁ ◆ బన్నుగఁ గూర్చు గజాస్యు నెన్నెదన్. 1956

అప్పకవీయము, ఆ 1 పద్య 22.

ఉ. ఒండురదంబు వోవిడిచి ◆ యుక్కునఁ జక్కని మొక్కలీఁడనన్
రెండవ కొమ్ము తొండమున ◆ నేర్పున మాటి మతంగశృంగవే
దండములన్ గ్రహించి తన ◆ దాసుల కీఁబరికించి హస్తివ
క్త్రుండయి మాయబోయదొర◆నుం గొడుకై తగు వేల్పుఁ గొల్చెదన్. 1957

పాంచాలీపరిణయము, ఆ 1.

ఉ. మోదకహస్త హస్తిముఖ ◆ మూషకవాహన యేకదంత లం
బోదర తప్తకాంచనస◆ముజ్జ్వలవిగ్రహ బాలచంద్రరే
ఖాధృతమౌళి యంచుఁ దను◆వచ్చపుభక్తిఁ దలంచు వారలన్
మోదమువీఱఁ బ్రోచు గణ◆ముఖ్యుని విఘ్నపతిం దలంచెదన్. 1958

వాల్మీకిచరిత్రము, ఆ 1.

ఉ. మ్రొక్కులొనర్తుఁ గేలుఁగవ◆మోడిచి జొక్కపుఁగొక్కుజక్కిపై
నెక్కెడుబల్వజీరునకు ◆ నిమ్ముగ నమ్మినవారి మేల్పనుల్
చక్కఁగఁజేయు దేవరకు ◆ జక్కెర గొబ్బెరపండు లుండ్రముల్
మెక్కెడు పాపజందెముల ◆ మేటికి బత్తిని మాటిమాటికిన్. 1959

నీలాసుందరీపరిణయము, ఆ 1.

మ. హరజూటాటనటదాపగాంబుఝురిఁ దుం♦డాగ్రంబునం బీల్చి సా
దరితం దజ్జలజంబు తల్లికి సము♦ద్యత్పుష్కరాకృష్టసా
గరగౌర్యగ్రజకంధరాంతరఫణి ♦ గ్రైవేయకం బద్భుత
స్ఫురణం దండ్రి కొసంగి ముద్దుఁగొను దే♦వుం డిచ్చు నిర్విఘ్నతన్. 1960

తారాశశాంకవిజయము, ఆ 1 పద్య 17.

మ. కలుషీభావళిసాఁప నంకుశము వి♦ఘ్నక్ష్మాధరశ్రేణి ప్ర
క్కలు గావింప వరస్ఫురత్కులిశమున్ ♦ గర్వప్రమత్తారివీ
రుల బంధింపఁగఁ బాశమున్నతమనో♦రుగ్రేణువుల్ మాన్పఁ బు
ష్కలదానాంబువు లూను జెల్వడఁచు మ♦త్కావ్యాంతరాయచ్ఛటల్. 1961

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 7.

ఉ. సంతత మేను లోఁ దలఁతు ♦ సంతస మొప్పఁగఁ గాంతిఁ బద్మినీ
కాంతుని పాలితత్రిదశ♦కాంతుని సర్వకళాతి కాంతునిన్
శాంతుని భక్తహృన్నలిన♦శాంతుని నిష్ప్రతిపాదకోక్తి వే
దాంతునిఁ గీర్తిపూర్ణహరి ♦ దంతుని దంతుని నేకదంతునిన్. 1962

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

సీ. విలసితాబ్జధరాతి ♦ కలనాభిచర్యుండు, వరవినతానంద ♦ వర్ధనుండు
రాజితానందాభి♦రణతతచర్యుండు, మహితామలినతుండ ♦ మండితుండు
కళ్యాణధామస్వ♦ఘనపక్షనుస్ఫూర్తి, వర్ణనీయసుముఖ ♦ వత్సలుండు
విదితవేగాభోగ ♦ బిలపదచరణుండు, సమరసోత్కటదాన ♦ సౌరభుండు
గీ. నగుచు నగణితసుగుణత ♦ నతిశయముగ, వలరునట్టి వినాయకుఁ ♦ డస్మదీయ
నిర్భరగ్రంథసందర్భ ♦ నిఖిలయుక్తి, పటిమఘటనాగరిష్ఠుఁడై ♦ పరఁగుఁగాత.

కృష్ణభూపాలీయము, పద్య 5.

సీ. తనకర్ణయుగ్మచా♦లనవిలాసంబులు, చామరాందోళన ♦ సరణిఁ జెనుపఁ
దనరదనాగ్రిము♦ద్దామతరైకాత, పత్రిమహోన్నైభ♦వంబుఁ జొనుపఁ
దనపుష్కరాగ్రంబు ♦ ధారాప్రవాహంబు, లమితరాజ్యాభిషే♦కములఁ దన్నుపఁ
దనగణనాయక♦త్వము సంగరాభంగ, చతురంగసైన్యప్ర♦శస్తి మనుపఁ
గీ. దన ప్రథమపూజ్యభావంబు ♦ ధరణివలయ, నాథ లోకవరాగ్రగ♦ణ్యత్వ మనుప
ననుపమ పేరిమ హేరంబుఁ♦డనిశ మొసఁగు, రామరాయేంద్రరాజకా♦ర్యములఫలము.

రావువంశముక్తావళి, ఆ 1 పద్య 7

# సరస్వతీస్తుతి.

క. వేదాగమరూపమున మహాదేవునపారగుణ మ♦హాసంస్తుతిసం
పాదితయగుభారతినేఁ, యాదిగ మత్కృతికి నెలయు ♦ నది గాక దయన్. 1965

కుమారసంభవము, ఆ 1.

చ. కరకమలంబెసంగఁబటి♦కంపుఁ గమండలువంటికాంతిభా
సురమగు మౌక్తికంపుజప♦సూత్రముదాల్చుట బ్రహ్మవాదమై
పరగిన హంసమున్ బిలిచి ♦ బాలమృణాళముఁజూపుచందమై
సిరితిలకింపనొప్పు బుధ♦సేవితమూర్తిఁ దలంతు భారతిన్ 1966

నృసింహపురాణము, పీఠిక. పద్య 6.

సీ. సింహాసనము చారు ♦ సితపుండరీకంబు, చెలికత్తె జిలువారు ♦ పలుకుఁజిలుక
శృంగారకుసుమంబు ♦ చిన్నిచుక్కలరాజు, పసిఁడికిన్నెరవీణె ♦ పలుకుఁదోఁడు
నలువనెమ్మోముఁద♦మ్ములు కేళిగృహములు, తళుకుటద్దంబు స♦త్కవులమనము
వేదాదివిద్యలు ♦ విహరణస్థలములు, చక్కనిరాయంచ ♦ యెక్కిరింత
గీ. యెపుడు నేదేవి కాదేవి ♦ యిందుకుంద, చంద్రచందనమందార ♦ సారవర్ణ
శారదాదేవి మామక♦స్వాంతవీథి, నిండువేడుక విహరించు ♦ చుండుఁ గాక.

శృంగారనైషధము, ఆ 1.

సీ. రాజీవభవువిగా ♦ రాపుఁబట్టపుదేవి, యంచబాబానెక్కు ♦ నలరుఁబోణి
పసిఁడికిన్నెరవీణెఁ ♦ బలికించునెలనాఁగ, పదునాల్గువిద్యల ♦ పట్టుఁగొమ్మ
యీరేడుభువనంబు ♦ లేలు సంపదచేడె, మొలకచందురుఁ దాల్చు ♦ ముద్దరాలు
వెలిచాయకోదమ రా♦చిలుకనెచ్చెలికత్తె, ప్రణవపీఠికనుండు ♦ పద్మగంధి
గీ. మందరాచలకందర♦మథ్యమాన, దుగ్ధపాథోధిలహరికా ♦ ధూర్తయైన
లలితసాహిత్యసౌహిత్య ♦ లక్ష్మినొసఁగు, వరద యై మాకు వినతగీ♦ర్వాణివాణి.

భీమేశ్వరపురాణము, ఆ 1.

ఉ. క్షోణితలంబు నెన్నుదురు ♦ సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ ♦ సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ ♦ చిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుక♦వారిజపుస్తక రమ్యపాణికిన్. 1969

భాగవతము, స్కం. 1 పద్య 6.

సీ. ప్రణవపీఠమున మం◆త్రపరంపరలు గొల్వ,నుండు నేదేవి పే◆రోలగంబు
భావజ్ఞులకుఁ బరా◆పశ్యంతిమధ్యమా, వైఖరులే దేవి ◆ వర్ణసరణి
జపహారకీరపు◆స్తకవిపంచిసమంచి, తంబు లేదేవి హ◆స్తాంబుజములు
కుందేందుమందార ◆ కందళీబృందంబు, చంద మేదేవి యా◆నందమూర్తి
గీ. కాంచె నేదేవి కాంచన ◆ గర్భచతుర, పూర్వదంతకవాటవి◆స్ఫుటమనోజ్ఞ
చందరికాంతశిరోగృహా◆స్థలవిహార, మమ్మహాదేవి వాగ్దేవి ◆ నభినుతింతు. 1970

జైమినీభారతము, ఆ 1 పద్య 5.

ద్విపద. వల్లకీమృదుపాణిఁ ◆ వరనీలవేణిఁ, బల్లవారుణపాణిఁ ◆ బరమకళ్యాణిఁ
జారుహారశ్రేణి ◆ సైకతశ్రోణి, వారిజాసనురాణి ◆ వాణిఁ బ్రార్థించి. 1971

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన.

సీ. చేర్చుక్కగా నిడ్డ ◆ చిన్నిజాబిల్లిచే, సిందూరతిలకంబు ◆ చెమ్మగిల్ల
నవతంసకుసుమంబు◆నందున్న యెలదేఁటి, రుతికించిదంచిత ◆ శ్రుతుల నీన
ఘనమైన రారాపు◆చనుదోయి రాయిడి, దుంబీఫలంబు తుం◆దుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ ◆ దంతపుసరికట్టు, లింగిలీకపువింత ◆ రంగు లీన
గీ. నుపనిషత్తులఁ బాటలై ◆ యొలగింపఁ, బుండరీకాసనమునఁ గూ◆ర్చుండి మదికి
నించువేడుక వీణవా◆యించుచెలువ, నలువరాణి మదాత్మలో ◆ వెలయుఁ గాత.

మనుచరిత్రము, ఆ 1 పద్య 5.

శా. కాసారంబులు సాహిణంబులు సరి◆త్కాంతుండు పూఁదోఁట వి
ద్యాసీమంబులు రచ్చపట్లు సురకాం◆తాలోకసీమంతభూ
షాసిందూరము పావలాత్మజయగు భా◆షాదేవి మత్ప్రౌఢజి
హ్వాసింహాసన మూనుఁగాతఁ గృతియు◆క్తాలంక్రియాహంక్రియన్. 1973

కవికర్ణరసాయనము, పీఠిక. పద్య 5.

మ. రమణీయాత్మసరాకృతిం బోలుచు వ◆ర్ణశ్రేణివీణానులే
పము చేతం గరఁగించి యందునిజబిం◆బంబొప్ప నచ్ఛామృత
త్వము స్వాత్మప్రతిపాదకత్వమును ద◆ద్వర్ణాళియందెల్లఁ బూ
ర్ణము గావించినవాణి నిర్మలమహా◆రామోక్తిఁ బొల్చుం గృపన్. 1974

వసుచరిత్రము, ఆ 1 పద్య 4.

సీ. ఒకటి యక్షరవిలా◆సోల్లాసమున మించ, నొకటి తాళప్రౌఢి ◆ నుల్లసిల్ల
నొక్కటి సారికా◆శ్రోణ్యున్నతిఁ దాల్ప నొ,క్కటి గోస్తనీగుచ్ఛ ◆ కలనఁ బసర

నొకటి సువృత్తభా♦వోన్నతి నొంద నొక్కటి వల్లకీతుంబి ♦ కలనఁ జెలఁగ
నొకటి హారవశేష♦యుక్తి బెంపొంద నొక్కటి గిరీశమతాను ♦ కారిగాఁగ
గీ. వసమసాహిత్యసంగీత ♦ రసము లనెడు, గుబ్బపాలిండ్లుదాల్చు వ♦ల్కులవెలంది
సరసగుణహారునోబయ ♦ నరసధీయు, నవ్యకృతినాయకునిఁగా నొ♦నర్చుఁ గాత.

నరసభూపాలీయము, ఆ 1 పద్య 4.

మ. పరమప్రౌఢిన శేషవర్ణరచనా ♦ పారీణుఁడౌ భర్తృహ
త్సరణిన్ దాయుదు సేన రమెన యను నో♦జన్ వర్ణసంధానభా
స్వరవృత్తిన్ స్వనుమూర్తులై యొరయునా♦సంగీతసాహిత్యబం
ధురవక్షోజము లాను తల్లిని భజిం♦తుం దత్ప్రసాదాప్తికిన్. 1976

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 4.

శా. వీణాతంత్రలసద్గుణంబులు ముదా♦విర్భావముం జేయఁగాఁ
బ్రాణంబున్బలె ఆమ్రేడించుకసుధా ♦ ప్రాయానులాపంబులన్
వాణింగూర్చుచు సారెసారెకు రుచు♦ల్వాటింపఁ బల్కించు న
వ్వాణీదేవి నటించు మద్విమలజి♦హ్వారంగమధ్యంబునన్. 1977

వైజయంతీవిలాసము, ఆ 1 పద్య 8.

శా. శ్రీచింతామణిమంత్రదేవతజగత్ ♦ క్షేమంకరాపాంగవీ
క్షాచంద్రోదయ భక్తశేవధిమహా ♦ సంగీతసాహిత్యవి
ద్యాచారుస్తనకుంభశారద ముదీ♦యస్వచ్ఛజిహ్వాస్థలిన్
వాచానృత్యము సల్పఁగావుతఁ గవి♦త్వస్ఫూర్తి వర్ధిల్లఁగన్. 1978

కవిరాజమనోరంజనము, ఆ 1 పద్య 6.

చ. తనహృదయాంబుజాతమునఁ ♦ దార్కొనునాథగతానురాగవా
హిని వెలిఁగ్రమ్మఁ జేసినొకొ ♦ యాగతి నాఁగ విధాలెసెంగటన్
దనరి జపాప్రసూనసవి♦నస్ఫటికాకృతిరక్తిఁ గుల్కువా
గ్వనజపళాక్షి మాకొసఁగుఁ♦గాత వచోరచనాచమత్కృతుల్. 1979

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 6.

గీ. వాణి నజురాణి ఘననీల♦వేణి మధుర,వాణిఁ బల్లవసంకాశ ♦ పాణిఁ బృథుల
సైకతశ్రోణి నాత్మలో ♦ సన్నుతింతు, సుమధుమధురసుధావచ♦స్స్ఫూర్తికొఱకు.

హంసవింశతి, ఆ 1 పద్య 5.

ఉ. చే విలసిల్లు రాచిలుక ♦ చెచ్చెర బింబమనీయ నొక్కఁ గొ
మ్మావిఁ దలిర్పఁగంటునలు ♦ మోములవేలుపుఁ గాంచి నవ్వఁ జే

ప్రాద్యుఁ బ్రకాశసామునొ♦నరంబొనరించి విమర్శరూపమై
నూద్యత పీఠయస్పశర ♦ శోభితయశా నల వాణి నెంచెదన్. 1987

విశ్వేశ్వరీయము, బింబ. 1 పద్య 133.

సీ. ఘననీలముల చొప్పు♦లనుబోలఁగలకొప్పు, చిన్నిజాబిలిపున్వ ♦ చెన్నువిూఱఁ
గపురంపుమగమాని♦కపురంపునగుమేని, తళతళజ్జిలుఁగువె♦న్నెలలుగాయ
నరవిందతతబృంద ♦ వరసుందరతనిందఁ, బరచుకన్గవ తెల్వి ♦ బాదుకొల్వ
పసమించు నలమంచు ♦ హసియించఁ దలపించు, తెలిపట్టుపుట్టంబు ♦ తేటగులుక

గీ. నల పనలువైననలువాలఁ♦జెలువు మెఱయ, విలువగానున్న పలుకుల♦వెలఁదిమిన్న
కవ రఘూనాథుఁడగు రామ♦నృపతివర్యు, రసనకసమాన సరసవా♦గ్విసర మొసఁగు.

రఘువంశముక్తావళి, ఆ 1 పద్య 6.

## లక్ష్మీస్తుతి.

ఘనరూపు ♦ దోఁప సేవాసన్న, కాంతాంతరమనీష ♦ గప్పుకరణి
గాన భూ♦జనుల కన్యయసౌఖ్య, విభవంబు లిమ్మని ♦ వేఁడుకరణి
వేళ సం♦ధిలు ననంతో చంద్ర, మణి భూరివిభ్రాంతి ♦ మడఁపుకరణి
ములు మాని ♦ యమృతకరపద్మికా, శోన్న తోజ్జ్వలములు గై♦కొన్నకరణి
దుకూలచేలాంకి ♦ తొంకపాళి, నంబుజోదరునుపల్లి♦వంబు లుంచి
మనసంవాహ మొనరించు♦కలిమిచెలువ, చిరతరైశ్వర్యములు మాకుఁ♦జేయు గాత.

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 2.

కమలగర్భాండభాం♦డము లఖండజ్యోతి, నెనయు బంగరుబొమ్మ ♦ రంబ్లు గాఁగ
నీ రేడులోకంబు♦లెడ నెడఁ జెన్నారు, పన్నారుదొంతుల ♦ బాగు గాఁగ
బ్రహ్మాదిసర్వగీ♦ర్వాణసంఘము లెల్ల, నాడించు బొమ్మల ♦ జాడ గాఁగఁ
జాహ్నవీభారతీ ♦ పద్మముఖాదిశక్తులు, ప్రియమిచ్చు చెలిమిక♦త్తియలు గాఁగఁ

గీ. దలఁపుసజనకు నింట ను♦దారమహిమ, బాలలీలలు సలిపె దే♦భామ యట్టి
రత్నగర్భయనుంగుగా ♦ రాపుఁబట్టి, మమ్ముఁ జేపట్టి సుశీల ♦ మనుచుఁ గాత.

వాల్మీకిచరిత్రము, ఆ 1.

ఉ. కమ్మని తెమ్మెరల్ దెమ్మెరలు ♦ గ్రమ్మగ నిమ్మగు తమ్మిమేడలోఁ
దుమ్మెదకొమ్మలెమ్మెలను ♦ దూఁకొని నీటుగఁ బాటఁ బాడఁగా
గొమ్మని పూవుఁదేనియలఁ ♦ గూరిమి నామెత లిచ్చి నిచ్చలున్
నెమ్మది నుండు పాల్కడలి ♦ నెయ్యపుఁగూఁతురు మమ్ముఁబ్రోవఁగలన్. 1941

నీలాసుందరీపరిణయము, ఆ 1.

మ. తతబాహాపురుహూతరత్నరుచిర♦స్తంభస్ఫురత్కౌస్తుభ
ద్యుతిసంతానవితానహారలతికా♦ప్రోద్యత్సుమస్నిగ్ధమా
పతివక్షంబునఁ బొంది యుండెడు రమా♦పంకేజపత్రాక్షి మా
కతులైశ్వర్యము లిచ్చుఁ గావుత దయా♦వ్యాపారపారీణతన్. 1992

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 4.

సీ. కస్తూరితిలకసం♦కలితాననాబ్జంబు, జాయమానశశాంక ♦ శంకనీయ
నతిరాగయుగదృ♦గ్వ్యాధరాధరసీమ, మహితపవిత్రాశ సా♦మగ్రిచూప
నతికృశోదరభాగ ♦ గౌరవఘనచయంబు, సరసిజపీఠికా♦పంబుఁగూర్చ
నేకాంతిమిళితాక♦దకమందహాసంబు, సముదస్తకేశపా♦శములు మెఱయఁ
గీ. చిత్రసమాత్మస్వరూపయై ♦ యతులభాగ్య, లక్షణముఁగన్న శ్రీమహా♦లక్ష్మి కమల
నేత్రి వక్షస్స్థలనిత్య♦నిలయ యెప్పుడు. తిరముగ వసించు మద్గృహాం♦తరమునందు.

మార్కండేయోపాఖ్యానము, కృత్యాది. పద్య 4.

సీ. పుష్కరవిహారణ♦స్ఫురణంబు వహియించి, యచలానుగుణవృత్తి♦ యవధరించి
యూర్ధ్వశీగత్వసౌ♦కర్యంబున రహించి, సకలహిరణ్యవ♦ర్ణనత మించి
త్రిభువనాంచితరూప♦విభవంబు ప్రాపించి, భృగుకులంబు పవిత్ర♦ముగ జనించి
యంభోధిభంగిలీ♦లాసక్తి వర్తించి, కామపాలపరీతి ♦ ఖ్యాతిఁ గాంచి
గీ. పుణ్యజనముల పూజన♦ములు గ్రహించి, కలికి రిన మొందు నిట్టిది ♦ గలదె యనఁగఁ
జెలువుపెలువు పునవలుపొందు♦కలిమి చెలువ. మెచ్చి నిచ్చలు మాకోర్కు♦లిచ్చుఁ గాత.

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 2.

సీ. ఏసుందరాంగి పా♦లేటిరాచూలన, నమృతంబుతోఁగూడ ♦ నవతరించె
నేభామినీకటాక్ష♦ మెసఁగి వనజసుద్రుడు, మఘవుల కబ్బె సా♦మ్రాజ్యపదవి
యేచకోరేక్షణ♦ కే హార్దిగ శ్రీవిష్ణు, వక్షస్స్థలంబు ని♦వాస మయ్యె
నే దేవి భవనంబు ♦ హేమమణిఁ గావింపఁ, జలియించి లేములు ♦ తొలఁగిపోవు
గీ. శారదయు శంభురాణియు ♦ శక్రసతియు, నేజగన్మాతసఖ్యంబు♦ నిచ్చగింతు
రట్టి విష్ణువధూటి భా♦గ్యములపేటి, శ్రీమహాలక్ష్మి మమ్ము ర♦క్షించు గాత. 1995

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

సీ. అబ్జారిధారుండు ♦ నబ్జారిధారుండు, మగఁడును మనుమఁడై ♦ మిగుల వెలుఁగ
హైమవతీసతి ♦ హైమవతీసతి, చెలికత్తె కూఁతురై ♦ చెన్నుదనరఁ
గమలసంభవుఁడును ♦ గమలసంభవుఁడును, దోబుట్టు కొడుకునై ♦ తోడరు మిగుల
విషధరనాథుండు ♦ విషధరనాథుండు, బావయు సెజ్జయై ♦ పసఁబొసంగఁ

గీ. దమ్మిపూ యిక్కువైయె కడుఁ ♦ దనరుచుండ, నెల్లజగములకును దానె♦తల్లి యనఁగ
నలయకలయములచెలి మది♦యాలయమున, నొప్పుగా నెల్లకాలంబు ♦ నుండు గాత.

కవిచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 2.

ఉ. అంచలవిల్తుతల్లి చర♦ణాశ్రితపోషణకల్పవల్లి ని
ర్మలగుణరత్నరత్నముల ♦ రాసులగల్లి నిజార్చనాకుతూ
హలితసుగీమతల్లి కడు♦నక్కటికంబులపాలవెల్లి వే
ల్పులకు దగుతల్లితల్లి మన♦గారమునందు వసించుఁ గావుతన్. 1997

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

మ. అకలంకస్థితిచే నజస్రమనుకాం♦తాలింగనారంభకా
ముకకుంభద్ద్విజకాశినీసకలస♦ద్భోజంబునందిచ్ఛమీ
ర(?) కుచస్ఫారగుణప్రగ్గై పెరుగు నా♦లక్ష్మీమహాకల్పవ
ల్లిక మమ్మెప్పుడు సత్కృపాభరితదృ♦గ్లీలం జూచి రక్షించుతన్. 1998

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 1.

చ. లలితపరాక్రమక్రమము♦లాసకలాసమువాయభోగభా
గలఘుతరాచ్ఛలక్షణము ♦ లారసి యారసి కుండె యార్యుఁడం
చెలమిని రామరాడ్విభవ ♦ కేంద్రిర సుందర మందిరంబుల
న్నిలిచి యనేకరాజ్యపద ♦ నిర్మలగొలుక్తి ఘటించుఁ గావుతన్. 1999

రామవంశముక్తావళి, ఆ 1 పద్య 2.

## పార్వతిస్తుతి.

చ. మునిమనుజానురాహి సుర♦ముఖ్యులు మున్నుగ సర్వజీవులన్
దనవశ మర్థిఁ జేసి మరు♦డన్నకు నోర్వక నీలరాగిఁ జి
ద్ఘనతను నిత్యనాత్మశుభ♦గర్భిణి మైవెలుగు న్గనారిఁ జే
సిన నగజాత మత్కృతిని ♦ జేకొని తత్సుభగత్వ మీవుతన్. 2000

కుమారసంభవము, నన్నె. ఆ 1.

ఉ. అమరనదీసమేత కమ♦లాప్తభవాదుల శేఖరభూషణో
త్తమరమణీయనీలజల♦దద్యుతి నైజశరీర వెల్లదీవిపై
నమరిన సింధురాజతన♦యాధిపదీపిత దీప్తి మీఱుచున్
రమణిని యర్ధదేహమున ♦ రంజిలు గౌరి శుభంబు లీవుతన్. 2001

బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 4.

చ. పరిణయవేళ యందుఁ దన♦పాదముఁ బట్టియు సన్నెకంటిపైఁ
దిరముగ నూపి కంతునకుఁ ♦ దీఱఁగ దాపగ యంచు నీలకం
ధరుఁడు దరస్మితుం డగుటఁ ♦ దద్వలయాహిఫణాగ్రరత్నమం
దరముకురంబునం గని యెఁ♦ద న్ముదమందు భవానిఁ గొల్చెదన్. 2002

అప్పకవీయము, ఆ 1 పద్య 21.

చ. పరిణయవేళ నాఘనిక♦పర్ణముపైఁ దెలిమించు ముత్తెముల్
కరముల నించి నించి యొడి♦కంబడగన్ దలఁబ్రాలు వోసి యా
హరుమెయిజాలుచో నలిను♦రాపగసిగ్గున డిగ్గ నంచులోఁ
బరిహాసనంబొసర్చు నల ♦ పార్వతి మాకు శుభంబు లీవుతన్. 2003

వాల్మీకిచరిత్రము, ఆ 1.

సీ. అలరుఁ బెంగడిమితోఁ♦టలనాడు పూఁబోఁడి, పూపవెన్నెల తేనిఁ ♦ బూనుచాన
కోరి యేనుఁగువోముఁ ♦ గొడుకుఁ గాంచినతల్లి, చిలువదాలుపువేల్పు♦వలపుటింతి
తెలిబొబ్బమెకపు మే♦త్తేజి నెక్కెడి దంట, చెదుగురక్కసిమూఁకఁ ♦జిదుముదిట్ట
తోలుపల్కుగిల్కుటం♦దెలు గల యేలనాఁగ, యెల్లమేల్తెంకియై♦యొసఁగుచాన
గీ. యొనరఁ జెంగంటి తెరవల ♦ యుడిగములకు,నదరియుడివోనిబలుసిరు♦లిడెడునట్టి
గట్టుదొరపట్టియైనలేని♦కనికరమునఁ,బొదలుచునుమమ్మనయంబు♦బ్రోచుఁగాత.

నీలాసుందరీపరిణయము, ఆ 1.

శా. శ్రీవాణీకరచామరద్వయరుచుల్ ♦ చెన్నొందువక్త్రిస్ఫుర
ల్లావణ్యాఖ్యపయోధివీచికలలీ♦లన్ జాల రాణింపఁగా
శైవాంకస్థలభద్రపీఠవసతిన్ ♦ సౌఖ్యోన్నతిం గాంచు నా
ర్యావామాక్షి యొసంగు మా కతులవి♦ద్యైశ్వర్యసత్కీర్తులన్. 2005

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 1.

ఉ. గాంగపయోరుహోత్పలముఁ ♦ గన్గొని వాలినిగూఢమైనయ
వ్యాంగన నేత్రిలక్ష్మియని ♦ యగ్గిన నీశుఁడు తావకీనదృ
క్పంగివిక్లిన్నకాంతియిది ♦ సత్యము కన్నులు మూయుఁ బాయు నాఁ
బొంగుచు నట్లుచేసి నగు♦భూధరకన్యక నన్నుఁ బ్రోచుతన్. 2006

మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది. పద్య 5.

ఉ. ఊరక చుట్టుకొన్నఁ గమ♦లోత్పలపంక్తులు వాఁడు నంచునో
యేలును గూర్చి చుట్టితివ ♦ యెంతటిజాణవు మేలు మేలు నీ

నేరుపు మెచ్చవచ్చు నని ♦ నిచ్చలు మచ్చిక శంభుఁ గేరునీ
హారగిరీంద్రకన్యక ద♦యామతిఁ గోర్కులు మాకొసంగుతన్. 2007

ఉత్తరరామాయణము, పీఠిక, పద్య 4.

క. హార్యనుకంపాముదితమ, హార్యను నిజజనకశీత ♦ లాహార్యను సౌం
దర్యకళార్ధాంగిభవ, దర్యను గుణవర్య నార్య ♦ నాత్మఁ దలంతున్. 2008

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

ఉ. స్నానజలంబు ధాతవస♦నంబనులేపన మోగిరంబుఁ దా
నే నెఱిఁగూర్చి నాథు నెనఁ♦యించును బెండిలికూఁతు రంచు సం
ధ్యానముఁ బూని యవ్వరుని ♦ యవ్వనటంచు నటించు భృంగిచం
దానకు నెచ్చెలుల్ నగిన ♦ నవ్వెడు శాంకరి మమ్ముఁ బ్రోవుతన్. 2009

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 4.

సీ. సర్వమంగళ గాన ♦ సర్వమంగళదాన, చాతురీకలనంబు ♦ సంతరించి
దుర్గ గావున మహా♦దుర్గావనస్పృహ, నిరతతాత్పర్యశ్రీ♦స్ఫురణఁ గాంచి
యార్య గావున సమ♦స్తార్యసేవాక్రమ, స్థిరతత్పరత్వప్ర♦వృత్తిని ఘటించి
యచలాత్మభవ గాన ♦ యచలాత్మభవమాన, నీయసంపదగరు♦ణించిమించి
గీ. రాజరాజేశ్వరీదేవి ♦ రామపురామ, రాయరాణ్మౌళికి నిరంత♦రాయరీతి
రహిదగ నితోధికాఖండ♦రాజ్యలాభ, ములనొసఁగుఁ గాత భూభవ్య♦మోదయగుచు.

రావువంశముక్తావళి, ఆ 1 పద్య 4.

## జానకీస్తుతి.

సీ. సకల లోకాభినం♦ద్యకలాకలాపంబు, నోరయు నెమ్మోమునుచం♦దురునితోడ
బహుదివ్యఫలపరి♦పాకసౌభాగ్యంబు, నేర్పుకెమ్మోవిమా♦నికముతోడ
నవవయశ్శ్రీనిధా♦నంబులై తగునురో, భవనుధాపూర్ణకుం♦భములతోడ
నమ్లానసుమమాలి♦కాభిరూప్యముఁ దాల్చు, లలితభుజాకల్ప ♦ లతలతోడ
గీ. నడరి జనకాబ్ధిసీమరా♦మాభిధాన, హరికహీనగుణశ్రీత♦హానశరాస
గిరిమథనయత్నమునఁదోఁచు♦సిరియశేష, రాజ్యములొసంగుఁదిరుమల♦రాయమణికి.

వసుచరిత్రము, ఆ 1 పద్య 2.

సీ. నిఖిలలోకానంద♦నీయస్థిరోద్యుతిఁ, బొలుచున నాద్యతాం♦భోజపాణి
యంభోధిమథనాస♦హాయశౌర్యవరాప్తిఁ, జాలమించుననాప్త ♦ సంఖ్యశీల

పంకదూరకృపీట ♦ భవనివేశప్రౌఢిఁ, బరగునపత్రిపన్న ♦ భంగధామ
యతిలాలితాక్షీణ ♦ నుతసంపదఁదనర్చు, నకళంకినహజక ♦ ళాధిపసతి
గీ. సుదతులు నుతింపనభినవ ♦ సురుచిరమణి, యొనయకుండనిజాధీశ ♦ హృదయపీఠి
వెలయు సీతాభిధాన న ♦ వీనలక్ష్మి, నిశ్చలైశ్వర్యములు గరు ♦ ణించుఁగాత. 2012

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 3.

ఉ. కాలికిఁ గేలుసాఁచి యుడి ♦ గంబున మ్రొక్కుము రాచమిన్నయ
ప్రాలికి నాడ్డమైన జన ♦ రాలికి దోసపుదీరుతొల్పుపెన్
గాలికి జోగిసూటునని ♦ గారపు డెందపుఁదమ్మిజంటము
క్కాలికి పేరమిరాఁడు జ ♦ గంబుల మేలికి నేలచూలికిన్.

అచ్చతెలుఁగురామాయణము, యుద్ధ. పద్య 470.

చ. తనకిది కేళిసద్మమయి ♦ తక్షియుఁ బద్మనహించి తొల్లిలో
చనముఖహస్తపాదయుగ ♦ సామ్యముఁ జెంది సుగంధసంపదన్
దనరఁదొడంగె నిష్పదని ♦ తాఁ యమిఁ జెలఁగఁ జేతఁ బట్టె నో
యన వనజాతపాణియగు ♦ నట్టి మహీసుత మమ్ముఁ బ్రోచుతన్. 2013

హంసవింశతి, ఆ 1 పద్య 2.

సీ. మున్నిటినెంచలనూలి ♦ ముగుదగర్భముచొల్లి, నిదియన్నయెన్నికఁ ♦ బొదలఁ జెంచె
కొంపైడు లేరుల ♦ దండిరాతొలిచూలి, కనుప్రగా నిలుకేని ♦ తనము నిలిపె
కనకంటి దోటింట ♦ చిగ్రుపలు దనసి నుం,కువయని జగమాడి ♦ కొనఁగ వెలసెఁ
దానేమేన నోఁచు నో ♦ ములపంటనాకిది,యని తండ్రితనుఁగొని ♦ యాడ మెఱసె
గీ. మెఁగులు తెగఁ బాయుని మెఱుఁగు ♦ మెంతి మటులు, మగనిడాచక్కి వెలసె నే ♦ సా
గనుఁదమ్మి
గీముదారసాని యు రాము ♦ గన్నురాలు, ఘడమికానుపు సిరులిచ్చి ♦ ప్రోచుఁ గాత.

శకుంతలాపరిణయము, పె. నా. ఆ 1 పద్య 4.

మ. వినరస్ ధాత్రి జనించి సంభృతినయః ♦ ప్రోల్లాసముం గాంచి స్వ
ర్ణనమాత్రోల్లసితాసమాంబకధను ♦ స్సంభావితా మోదవ
ర్ధనదివ్యాగమసంస్తవాన్వితమహా ♦ రామాభియోగాప్తి మిం
చిన నైదేహి యొసంగుఁగావుత బల ♦ శ్రీసంభృతారోగ్యముల్. 2015

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 4.

ఉ. వసుధ జనించి యోగజనక ♦ వంశము నయ్యానవంశ మింపుసొం
పెసఁగ సమున్నతత్వము స ♦ హింపఁగమించిన సీత శీతదృ

కృపాసరణము ల్సుధారస ప♦రంపరలై యలరారఁ గాత నేఁ
డసదృశదోహదస్ఫురణ ♦ నస్మదభీష్టలతాఫలాప్తికిన్. 2016

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 2.

చ. సుకవులవాక్కులన్ నృపుల ♦ చూడ్కుల సాధ్వుల మోములందు గో
పతికరములం బయోజవన♦వాటికలందునుబోలె లీల మా
మకమగు మందిరంబున స♦మగ్రముదాస్పదయై వసించి జా
నకియగు లక్ష్మి మమ్ముల న♦వారతసంపద లిచ్చి ప్రోవుతన్. 2017

నయనోల్లాసము, ఆ 1 పద్య 2.

# దశావతారస్తుతి.

మ. గురుపాఠీనమవై జలగ్రహమవై ♦ కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై ♦ క్ష్మాదేవతాభర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణగణో♦దారుండవై లోకముల్
పరిరక్షించిననీకు మ్రొక్కెద మిలా♦భారంబు వారింపవే. 2018

భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 100.

సీ. నీటిలోఁ జొరకక♦నిలిచి క్రమ్మఱుపూన్కిఁ, గఠినకర్పరపుఁజొ♦క్కానుబిగువు
దంష్ట్రనెత్తినమహీ♦తలపుగాడుపుఁజీర, యురుదారుకలనయం♦దుదయ మగుట
పరులకుఁ దనపట్లు ♦ బలిమిచూపువిధంబు, పుడమిన నేత్రుగు♦గ్గిలపునూనె
ద్వీపాంతరమునకుఁ ♦ దొగుపమైఁ జను పెంపు, చేముట్టునాఁగంటి♦జీనుతగులు
గీ. సౌగతాగమమాలిమి ♦ శాస్త్రసరణి, పల్లవల్లవచిత్రిగా♦వనముగల్గు
నిన్నుఁ దరిచేసి భవవార్ధి♦నిస్తరించి, దరిఁ దటియుకున్నఁ గలద మో♦ద మమురారి.

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 66.

క. భువనగకచ్ఛపకిటిమా,నవసింహాద్యభృగుజ♦నరాఘవయా
దవబుద్ధకల్కులను గే,శవుపదిరూపములు మది న♦జస్రముఁ దలఁతున్. 2020

అప్పకవీయము, ఆ 1 పద్య 9.

మ. సరసుల్ మెచ్చఁగ మీనమై కమఠమై ♦ సత్పోత్రియై మర్త్యకే
సరియై వామనుఁడై త్రిరామతనుఁడై ♦ సర్వజ్ఞుఁడై కల్కియై
ధర జన్మించి భయంబు మాన్చి భువన♦త్రైలోక్యదీక్షాధురం
ధరుఁడై యొప్పెడు దైవతంబొసఁగు భ♦క్తశ్రేణికిన్ సౌఖ్యముల్. 2021

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 1 పద్య 2.

# మత్స్యావతారస్తుతి.

క. మీనయి తౌనతలగతం, బైనిగమచయంబుఁ దెచ్చి ♦ యజునకు నొసఁగం
గా నేర్చిన సుమనస్సమ్మానితవిగ్రహు భజింతు ♦ మత్స్యత్వహరిన్. 2022
భారతము, శాంతి. ఆ 2 పద్య 39.

గీ. కపటమత్స్యంబవై నీవు ♦ గడలినడుమఁ, బుచ్ఛ ముల్లార్ప నెగసిన ♦ భూరిజలము
మింటఁ గడుఁదెల్లనై పాలు ♦ చుంటఁ జూచి, యభ్రనదియంచు వర్ణించు ♦ నఖిలజగము.
శృంగారనైషధము, ఆ 8 పద్య 120.

ఆ. ప్రకటమకరవరుణ ♦ పాశంబులందుల, జలములందు నెందుఁ ♦ జొలియకుండఁ
గాచుఁ గాక నన్ను ♦ ఘనుఁ డొక్కఁడైనట్టి, మత్స్యమూర్తి విద్య ♦ మానకీర్తి.
భాగవతము, స్కం. 6 పద్య 301.

చ. మిత్తి గడపం దిమింగిలత ♦ మెమ్మెయి నెంచిననీదువాతఁగు
త్సితపలలాశియైన చిఱుఁ ♦ జేఁపది చెల్లుటనీవు మ్రింగు చే
శ్రుతులగు నూరుపుల్ మగుడఁ ♦ జొచ్చుతతి న్భవదేధనైధనై
దితిజవశక్తి నీడ్చుకొని ♦ తెచ్చుటకాక తదల్పతాల్పతన్. 2025
ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 19.

ఉ. వాలము తాఁకున న్విగులు ♦ వజ్రినిపాతము సంస్మరింపఁ బెన్
వాలుగవై మహార్ణవము ♦ నం దొలుఁబల్కుల దొంగరక్కసున్
వాలికనంక వాఁడిగతి ♦ వ్రచ్చి వెసన్నిగమాలిఁ దమ్మిపూ
చూలికిఁ దెచ్చియీవె త్రిద ♦ శస్తోనియాడ మురాసురాంతకా. 2026
పారిజాతాపహరణము, ఆ 3.

చ. విలయతమిస్రవేళ నతి ♦ వేలమహాంబుధి నూర్ధ్వలోకవా
సులు నతులై కనుంగొనెడు ♦ చూడ్కుల కోర్వహుతాశనక్రియా
కలితగతిన్ వెలుంగు ఘన ♦ కాయవిజృంభణఁ జోఅమీనవై
కలయఁగఁ గ్రాలు నీ వెడఁద ♦ కన్నులు ప్రోచు మమున్ మురాంతకా. 2027
మనుచరిత్రము, ఆ 6 పద్య 106.

*చ. మొదమున సోమకాసురుఁడు ♦ మ్రుచ్చిలి యచ్చలమూరఁగొన్న ప్రాఁ
జదువులు తెచ్చి తజ్జఠర ♦ సాంద్రతరాంత్రములంటనంటు బల్

గదుకుదోలంగఁ గీర్తియను ♦ గంగఁ దోలంచి విధాతృవిస్ఫుర
ద్వదనసరోజగంధలలి♦తంబులు చేసితి గా జగన్నిధీ. 2028

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 56.

సీ. మొగము శంఖము మీస♦ముల్లదాఖడ్గము, ల్వాలనుచక్రమువాల♦మునుతశార్ఙ్గ
మునుబూని మగమీన♦మూర్తివై మెఱసి పా, తాళ మొఱసి తట♦స్థలి దొఱసి య
రసి "స్వయంతీర్ణః ప♦రాంస్తారయతి" యని, నోజగానీఁది "యత్♦త్యుచ్ఛ్రియఃప
తనహేతు" వనిసోమ♦కునకుఁ దెల్ప గుభాల్గు, భాల్గుభాల్న నెగసి♦పడుచుఁగడలిఁ
గీ. గ్రిచ్చుకొనివచ్చుమ్రిచ్చుమై♦ వచ్చిశ్రుతులు, దెచ్చివిధికిచ్చినట్టినీ♦ హెచ్చువినుతి
సేతు వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 102.

మ. ప్రళయాపూర్ణజలార్ణవాంతరవివ♦ర్ణాకీర్ణధానత్తిమిం
గిలయాత్రానుగతస్వతాలుయుగళీ♦ క్షేపాంబునిర్ఘోషని
ర్గళితామ్నాయ సనత్పునః పఠనకృ♦ద్భ్రాంతిప్రదాత్మస్వరూ
పలసత్ప్రాభవమూర్తి మద్గురు ఘర♦బ్రహ్మాంబపీవేహరీ. 2030

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

మ. హితమత్స్యాకృతిఁదాల్చి యబ్ధిఁబడి వెం♦పేపారదోర్వీర్యవి
శ్రుతరుద్భానురసోమకాసురు గతా♦సుంజేసి మున్నంచిత
శ్రుతికాంతామణి నుద్ధరించినగతిన్ ♦ శుంభద్బలారాతిసం
హతిఖండించి ననుగ్రహింపుము మహా♦త్మా దేవకీనందనా. 2031

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 4.

## కూర్మావతారస్తుతి.

క. అమృతమథనమున మంథన,గములీలోద్ధరణకేళిఁ ♦ గైకొనిసురసం
ఘమునకు ప్రియ మొనరించిన, యమేయుఁగూర్మాత్ము నంబు♦జాక్షుం గొలుతున్.

భారతము, శాంతి. ఆ 2 పద్య 40.

క. గతభువనసర్గసముదయా, ధృతభూవలయాంకసదృశ ♦ దృఢచరమతనూ
వితతబహుచక్రచిహ్నముఁ, బతగధ్వజకపటకచ్ఛ♦పమునినుఁగొలుతున్. 2033

శృంగారనైషధము, ఆ 8 పద్య 121.

మ. జలపూరప్లవమానమృణ్మయమహీ♦సంరక్షకై గారయీా
బలె, ముక్తామణిశుక్తిశంఖనికురం♦బం బెల్లఁ జూర్ణంబుగా

బలభిద్వజ్రసదృఙ్నిజోదరిపరి♦భ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టిఘరట్టమైనకమఠ♦స్వామి న్నిన్నుం గొల్చెదన్. 2034

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 20.

చ. చటుల కృపీటసంస్థితర♦సాస్థలిపీఠికయుండ గారయి
చ్చుటఁబనుబోలె శంఖమణి♦శుక్తికదంబము నుగ్గుగా విశం
కటచరమాంగమంథగిరి♦ఘట్టనఁజేసి ఘరట్టమైకృపా
పటిమ జగంబుఁబ్రోచు నల♦ప్రాక్కమఠంబు నినున్ భజించెదన్. 2035

మనుచరిత్రము, ఆ 6 పద్య 107.

ఉ. కోపనశాతనవ్యశిఖి♦గోర్మసఁగం గసుగందిమ్రంది త
త్తాపము నాఁపలేక తివి♦ధామజలభ్రమిఁగూలి తూలుజం
భాపహరాజ్యలక్ష్మి వెర♦వారఁగఁదేల్పవె యీతకాయమా
పైపృథుకర్పరంబమర♦నాశ్రితరక్షణదక్షిణేక్షణా. 2036

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 57.

సీ. అమృతవారాశి ఘ♦టము మందరముఁ గవ్వ,ము ఫణి రజ్జువుఁజేసి♦పూర్వదేవ
తలు దేవతలుఁ బట్టి♦తరుపగా ఘుమఘుమ, ధ్వనుల బ్రహ్మాండము♦తల్లడపడ
నపుడు "పరోపకా♦రార్థ మిదం శరీ,ర" మని కూర్మావతా♦రమునఁగ్రుంగి
నగిరిక్రిందనిలచి♦"నానోన్దకసముదా,న" మని యింద్రాదుల♦కమృతమిచ్చి
గీ. నిరుపమానలక్ష్మీరమ♦ణీమణీమ,ణులు గొలువ విలసిల్లితో♦నలఘుదాన
శీల! వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 103.

మ. సుచిరాలబ్ధమధూళగూహనకళో♦త్సుక్యార్ణవస్వర్ణదీ
ద్విచరుష్కైకరసార్ద్రకేళివిధిసౌ♦ధీభూతమందాచలో
ర్ధ్వచరద్రుస్థరధూర్వహోద్భగసుధాం♦ధస్స్వాధనాపధ్యదా
ప్రచనాఘట్టఘురట్టపృష్ఠకమఠ♦బ్రహ్మాంబ వీవే హరీ. 2038

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

చ. విగతరజస్తమోనుతుఁడు♦విశ్వమయుండు ననాది రూపుఁడై
నెగడినయెవ్వఁడీశుకతుల♦నేర్పడలిర్ప సృజించిమించె ని
జ్జగతి నజస్రముం గమఠ♦సత్త్వముఁడై భరియించె నెవ్వఁడ
య్యగనిలయప్రియున్ హరి న♦నంతుని నే శరణంబు వొందెదన్. 2039

కృష్ణాభ్యుదయము, పద్య 50.

మ. అసురాదిత్యకృతోరుమంధరమహీ♦ధ్రాలోడనోద్యత్పరివృ
త్త్యసకృద్భూరివికర్షణభ్రమితదు♦గ్ధాంభోధిమధ్యోద్ధత
వ్యసుధోత్తుంగతరంగసంగతమహా♦వర్తోద్భవన్ లక్ష్మినిం
పెనఁగన్ గైకొనినట్లు చేకొనుము న♦న్నీశా సముల్లాసివై. 2040

రుక్మిణీకల్యాణము, జగ్గా. వేం. రం. ఆ 4.

## వరాహావతారస్తుతి.

క. వారాహరూపమునఁ బెం, పారినదనదంష్ట్రనొకట ♦ నవనిసగిరికాం
తారంబుగ నెత్తినయా, శౌరిం గ్రోడాత్ముఁ దలఁతు ♦ సమ్యగ్భక్తిన్. 2041

భారతము, శాంతి. ఆ 2 పద్య 41.

శా. క్రూరుండైన హిరణ్యనేత్రుఁడను ర♦క్షోవీరుఁ దక్షోభ్యుఁడై
వేమాఱేదఁగఁ గ్రుంగఁ ద్రొక్కిన మహా♦విశ్వంభరాచక్రమున్
వారాహాకృతి నుద్ధరించి సుచిరా♦వాప్తిం బ్రతిష్ఠింపఁగా
గారుణ్యంబొనరించి తెవ్వనికి శ♦క్యం బిట్లు క్రీడింపఁగన్. 2042

హరివంశము, పూర్వ. ఆ 6.

గీ. చించి వెడలిన తనురుహ♦శ్రేణిచేతఁ, బద్మజాండంబు కడపపూ♦బంతిఁ బోలఁ
బెరిఁగియున్నట్టి కిటిరూప♦ధరుని నిన్ను, ఘురచతుష్టయబిలచతు♦ష్కరథిఁ గొలుతు.

శృంగారనైషధము, ఆ 8 పద్య 122.

చ. అరయఁగ నెల్లలోకములు ♦ నంకిలి నొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్నమైనధర ♦ నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టియా
కిరిపతి యగ్నికల్పుఁ డురు♦ ఖేలుఁడు నూర్జితమేదినీమనో
హరుఁడు కృపావిధేయుఁడు స♦దాధ్వముల న్ననుఁ గాచుఁ గావుతన్. 2044

భాగవతము, స్కం. 6 పద్య 804.

చ. ఒకమతి బుడ్డగింప విల♦యోదకము ల్పయికుబ్బి చిప్పవ్రి
చ్చుకొని మహాభ్రవీథిఁ జన ♦ సూకరతన్ మయి వెంచి వెండి క్రిం
దికిఁ గయివ్రాలు తత్సలిల ♦ నిర్మలధారవతః పరస్ఫుర
త్ప్రకృతికి నీయజాండమును ♦ బంగరుముంగఱగా నొనర్పవే. 2045

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 21.

ఉ. ఆపెనువెల్లిఁ దెల్లు మక♦రాకరమేఖల నీవు దేర్చి యు
ష్ట్రాపదటంకవిభ్రమవి♦డంబినియా నిజదంష్ట్రఁ గూర్చి తే

ద్రూపము దీపితంబగు స♦రోరుహాలోచన ! సప్తజిహ్వాజి
హ్వోపరిభాగధూమవల♦యోపమమై విలయోపలబ్ధులన్. 2046
పాండురంగమాహాత్మ్యము, ఆ 5 118.

సీ. హిమగిరిఁ గేరుదే♦హముపజ్రములతీరు, రోమములుఁ బ్రళయా♦ర్కులసరి కనుఁ
గవయు బ్రహ్మాండముఁ♦గబళించుముట్టెపా, తాళముఁ బెకలించు♦దంష్ట్రయొప్పఁ
గ వరాహమూర్తివై ♦ కదిసి హిరణ్యాక్షు, గర్భనిర్భేదివై♦భూర్భువస్సు
వర్భయచ్ఛేదివై ♦ వారాశిమగ్నభూ,గ్నవసుంధరోద్ధర♦ణపరిమోది

గీ. వై జగతి "యతో ధర్మస్త♦తో జయ" యను, వచనము నిజముఁ జేసిన♦వర్ధమాన
కీర్తి ! వైకుంఠనాథ ! ల♦క్ష్మీసనాథ, రక్షణపరాయణుండ ! నా♦రాయణుండ.
రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 104.

మ. ఖరకృద్దన్యహిరణ్యదైత్యహరణో♦గ్రప్రక్రియాకల్పకో
ద్ధరణాంభోజభవాండభాండరచనా♦గస్వీకృతస్వర్ణమృ
ద్వరపిండోపమమేరుమండితదిగం♦తక్షోణిచక్రాద్యని
ర్భరశంకూకృ[illegible]కాంచురకిటి ♦ బ్రహ్మంబ వీవే హరీ. 2048
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

చ. నురరిపు[illegible]♦చున్ ఫణివాసము డాసియున్న యి
ద్ధరణి సముద్ధరింప నిశి♦తక్షురనిష్ఠురభీకరస్ఫుర
త్ఖురనికరక్షతిన్ దనుజ♦కోటులమీటి కిటీంద్రరూప మే
హరి! ధరియించె నయ్యజున ♦ నంతుని నే శరణంబు నొందెదన్. 2049
కృష్ణాభ్యుదయము, పద్య 51.

# నరసింహావతారస్తుతి.

ఆ. నారసింహవపురు♦దారభావమునొంది, ఘనుహిరణ్యకశిపు ♦ ఖరనఖముల
వ్రచ్చిదీప్తమూర్తి ♦ వరలునృసింహాత్మ, నాత్మభవుని భక్తి ♦ నాశ్రయింతు.
భారతము, శాంతి. ఆ 2 పద్య 42.

క. మెచ్చి ప్రియభక్తునకునై, వ్రచ్చితి ఖరనఖరముల హి♦రణ్యకశిపు న
య్యచ్చెరువు నృసింహాకృతి, యిచ్చఁ దలఁచి తలఁచి కొలుతు♦మేము నిను హరీ.
హరివంశము, పూర్వ. ఆ 6.

మ. అతిగంభీరహిరణ్యదైత్యహృదయా♦హంకారకూపోదరా
పతితస్వర్గరమా నువర్ణకలశ♦ప్రత్యుద్ధృతిప్రక్రియా

యతపంచాంగుళలోహయంత్రమగునీ ♦ హస్తంబువర్ణింతును
ద్ధతకంఠధ్వనికుంఠతారిహృదయో♦త్కంఠా నృకంఠీరవా. 2052

శృంగారనైషధము, ఆ 8 పద్య 123.

ఉ. అడవుల సంకటస్థలుల ♦ నాజిముఖంబుల నగ్నికీలలం
దెదరుల నెల్ల వాకు మతి ♦ కెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం
హుఁడు సురశత్రుయూథపవ♦ధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవి♦ధూతదిగంతరుఁ డప్రమేయుఁడై. 2053

భాగవతము, స్కం. పద్య 303.

మ. అనురేంద్రాశయకుండికాచ్ఛరుధిర♦వ్యాప్తస్వకచ్ఛాయఁగాం
చినసముద్యత్ప్రీతిసింహమత్సరమిళ♦చ్చేష్టన్ దదుద్దామదీ
ర్ఘసటాఝూటముఁ బెల్లగించుగతినాం♦త్రశ్రేణిఁగిక్కించెరం
జనితక్రూరభవన్నఖావళులు ప్రో♦చున్నర్త్యపంచాననా. 2054

మ. మునుమున్ దెల్పును దూఱఁదూఱ నతికెం♦పున్వొందియుందూఱగం
దనగాయంగల నల్పుఁదోఁపనఖకో♦ణశ్రేణిచే విక్రమ
బునవాఁడుగ్రతఁగొన్నయట్టి విలస♦న్మూర్తిత్రయీ
గొనులీలన్విదళింపవేయసురవ♦క్షోభిత్తిమిథ్యాహరీ. 2055

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 22, 23.

ఉ. అలఘుజగద్విపద్విపఘు♦టాంకుశశాతనఖాంకురాగ్రలాం
గలములమున్న నీవసుర ♦ ఘస్మర ! వైరిభుజాంతరాళజాం
గలముహిఁజాలువట్టిపయిఁ ♦ గ్రమ్మెడు నెత్తురు నీరువెట్టి యం
దలతకవెక్కీర్తిపూర్తికల♦మాంకురమిందిరమాఫలార్థివై. 2056

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 59.

సీ. ఎంతఁ జదివిన ర♦వంతకులాచార, ధర్మ మెఱుఁగడని♦తనకుమార
కుఁడయిన ప్రహ్లాదు ♦ నొడిసిపట్టి తెగన,బకవచ్చినట్టి హి♦రణ్యకశిపు
కట్టెదుట నిమష♦కంబము పటపటఁ, బగులఁబొగ లెగయ ♦ భగభగ మను
మెనుమంటఁ జిటజిట♦మనుమిడుఁగురులు బ్ర,హ్మాండము నిండ బ్ర♦హ్మాదులు గడ
గీ. గడ వడఁక నల్గడ లడల♦ జడలి కెవ్వ,నార్చి రిపునేర్చి వటు నేలి♦నట్టి శ్రీనృ
సింహ ! వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 105.

మ. సదసత్సంశయవాదభేదనపరీ♦క్షారంభకుం ... ... ...
భదయస్తంభనిగుంభితాత్మసుఖచి♦త్ప్రహ్లాదగుర్వత్యయా
స్పదదోస్సారవిచారలోకసదస♦చ్ఛబ్దార్థనిర్దర్శిత
త్వద్దృఢీభూతయుగప్రభావనృహరి ♦ బ్రహ్మాంబ వీవే హరీ. 2058

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

ఉ. ప్రోదిచెడన్ హిరణ్యకశి♦పుక్రతుభుగ్రిపురాట్ప్రతారధా
రాదృతవక్షు మగ్రనఖ♦రప్రకరంబుల గ్రుచ్చివ్రచ్చి ప్ర
హ్లాదున కేదయానిధి హి♦తావహుఁడయ్యె నృసింహమూర్తియై
యాదనుజవ్రజాంతకు న♦నంతుని నే శరణంబు నొందెదన్. 2059

కృష్ణాభ్యుదయము, పద్య 52.

మ. చటులస్ఫూర్తి విశంకటప్రకటదో♦స్సారస్ఫురత్ప్రౌఢిమో
త్కటితస్తంభవినిర్గమోద్భటమహో♦దీప్యన్నృసింహాకృతిన్
పటుబాహాబలుఁడౌ హిరణ్యకశిపున్ ♦ భంజించి ప్రహ్లాదనూ
త్కటసద్భక్తి రమన్ గ్రహించుగతినన్ ♦ గైకొమ్ము లక్ష్మీశ్వరా. 2060

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 4.

## వామనావతారస్తుతి.

క. వామనరూపంబునను,ద్దామబలున్ బలినడంచి ♦ త్రైలోక్యాతి
క్రామత శేర్చిన యద్భుత, ధాముంగ్రాంతాత్ముఁ దలఁతు ♦ దామోదరునిన్.

భారతము, శాంతి. ఆ 2 పద్య 43.

క. వామనరూపంబున నీ, వామెయి బలివేఁడఁ జనుట ♦ యటవిూఁద మహో
ద్దామమహిమ యటఁజూపుట, దామోదర మాదృశులకుఁ ♦ దరమె నుతింపన్.

హరివంశము, పూర్వ. 6.

గీ. భోగి సహవాససంబంధ♦ములు భజింతు, భువనదారహస్తంబునఁ♦బోయుమనుచు
కొంటమాటల బలిఁ బ్రతా♦రించినట్టి, దంభవామన మామన♦స్తాప ముడుప. 2063

మ. తటిసాక్రాంతసమస్తలోకబలిదై♦త్యధ్వంసి యోదేవ నీ
యఱకాలుద్ధతి రాహుమండలము బ్ర♦హ్మాండంబుతో నొత్తినం
గుఱుగుల్గొంచెడసంది బిట్టొరలు న♦గ్గోరాహి నీయంఘ్రికిన్
గిఱుఁజెప్పైనవిధంబు నామనములోఁ ♦ గీలించినట్లయ్యెడున్. 2064

గీ. తిరిగెఁ గాటు జాంబవంతుండు ♦ దేవనీకు, దైత్యబంధనవేళఁ బ్ర♦దక్షిణంబు
దద్భ్రమీచక్రవలయంబు ♦ దంభపటుక, యుచితబంధనరజ్జునై ♦ యుండకున్నె.

శృంగారనైషధము, ఆ 8 పద్య 124, 125, 126.

క. వటుఁడు సమాశ్రితమాయా, నటుఁడు బలిప్రబలశోభ ♦ నప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు, చటులస్థలమందు నన్ను ♦ సంరక్షించున్. 2066

భాగవతము, స్కం. 6 పద్య 302.

మ. బలిదైతేయ భయాంధకారభరిత ♦ బ్రహ్మాండగేహంబులో
వలఁ బ్రేమం డెడు తత్ప్రతాపమయదీ♦పజ్వాల డిందన్ గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయు సు♦ద్యత్తన్మహాచ్ఛాయనాఁ
గలనీలాంగము శింశుమారమొరయం♦గాఁ బెంపవే వామనా. 2067

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 24.

క. దండితబలినై జగములు, నిండఁ బెరుగుచున్నవేళ ♦ నీయడుగున భూ
మండల మతిసూక్ష్మాకృతిఁ, గొండిక మచ్చయనుఁ బోలెఁ ♦ గొమరొందు హరీ.

పాండురంగమాహాత్మ్యము, ఆ 11 పద్య 60.

సీ. అదితికశ్యపునకు ♦ "నంగుష్ఠమాత్రఃపు,రుష"యనువచనము ♦ రూఢిసేయ
వామనమూర్తి న♦వతరించి వడుగనై, గొడుగు జందెముఁ బచ్చ♦గోఁచిపంచె
పంచశిఖలు మౌంజి ♦ పాలాశదండము, కృష్ణాజినము చెంబు♦నిట్టివేష
మమర "నణోరణీ♦యాన్మహతో మహీ,యా" నన్న వేదవా♦క్యము ప్రసిద్ధి
గీ. వడ బలికడను బుడమి మూఁ♦డడుగు లడిగి, త్రిభువనములాక్రమించువ♦ర్ధిష్ణువనిభ
జింతు వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 106.

మ. కృతదీక్షాధ్వరదేశకాలఫలము♦క్తిజ్ఞానసత్పాత్రస
త్కృతిదానప్రదదానవేంద్ర విభవ♦శ్రీమూర్ధబుద్ధోద్భవా
మితతత్పుణ్య యశోలతాసముదయో♦న్మేషస్వవేషోత్సవ
వ్రతసంవర్ధిత విశ్వశాశ్వతవటు♦బ్రహ్మంబ వీవే హరీ. 2070

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

ఉ. వేలుపుఁ బోరులు నేలుట క♦వేలపులీల వొసంగ వామనుం
డై లఘురీతి నబ్బలిగృ♦హంబున కేఁగి త్రిపాదమాత్రమీ

క్ష్మాతలనాథ మేచకక◆చాకుచహారమృణాళనాళసం
ఘాతము నూతనైణమద◆కర్దమవర్ధన సంప్రభూతమున్. 2078

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 61.

మ. జరతాభావ మహోత్తరూపమవపు◆శ్శాఖాసహస్రాంకుర
త్వరితాంకావహబాహుబాహుజకులో◆త్తంసప్రశంశాతివీ
రరసావేశరసైకవింశతికప◆ర్యాయాపహృద్విశ్వరా
ట్పరశుస్వీకృతమార్గభార్గవపర◆బ్రహ్మంబ వీవే హరీ. 2079

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

సీ. జమదగ్నిగర్భవా◆సమునఁ బుట్టి వివిధ,విద్యాతపోధను◆ర్విద్యలకధి
పతివై ప్రబలి "ఇదం ◆ బ్రాహ్మ్య మిదంక్షాత్రి", మనిముని రాజచి◆హ్నములశాప
చాపనైపుణిఁ జూపి ◆ పాపభూపతుల శ, తారికఠోరకు◆ఠారధార
నస్రధారాప్రవా◆హములు గా శతధా స,హస్రధా ఖండించి ◆ యానదులను
గీ. దర్పణముభూమి భూదేవ◆తార్పణముగఁ, జేసినపరశురామవే◆షి వని నిను భ
జింతు వైకుంఠనాథ ! ల◆క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా◆రాయణుండ !

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 107.

చ. క్షితిపతులం బరశ్వథము◆చే వధియించుచుఁ బత్క్షితీశ్వర
క్షతజజలంబుచేతఁ బిత్రు◆కర్మ మొనర్చి తనర్చె నెవ్వఁ డ
ప్రతతపరాక్రమాకరు న◆వేలవిభావిజితప్రభాకరున్
హతనతపాపసంతతిన◆నంతుని నే శరణంబు నొందెదన్. 2081

కృష్ణాభ్యుదయము, పద్య 54.

మ. నతసంరక్షక తొల్లి భార్గవకులీ◆నఖ్యాతిచే నేకవిం
శతివారంబులు హైహయప్రముఖరా◆జన్యాతమున్ ద్రుంచి యం
చితదోశ్శక్తి త్రిలోకసన్నుతజయ◆శ్రీఁగొన్నమాడ్కిం ద్విష
త్ప్రతతిన్ మాన్పి ననుంగ్రహింపుము జగ◆త్ప్రఖ్యాతి వాటిల్లఁగన్. 2082

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 4.

# రఘురామావతారస్తుతి.

క. క్షత్రాత్ముఁ గొలుతు దశరథ, పుత్త్రున్ శ్రీరాముఁ డనఁగఁ ◆ బొలిచిన దేవున్
శత్రుభయదు రావణు నొక, మాత్రం దునుమాడినట్టి ◆ మధుసూదనునిన్. 2083

భారతము, శాంతి. ఆ 2 పద్య 45.

చ. నిలిపితి సేతు వర్ధి నవి◆నీతు దశాస్యు సబాంధవంబుగాఁ
గలహమునం బ్రదీప్తపటు◆కాండములం గడతేర్చి తెల్లవా
రలకు వినంగఁ జెప్ప నభి◆రామము నీరఘురామజన్మమం
గళగుణమై భవంబు బహు◆కల్మషపంకపయోధి మాధవా. 2084

- హరివంశము, పూర్వ. ఆ 6.

సీ. తనుసృజించినవిధా◆తకుఁ బూర్వరాముండు, లీలాభ్యసనహస్త◆లేఖనముగఁ
దనవిశ్వభూషణ◆త్వముతోడ ఖరదూషణచ్ఛిదాకేళియ◆న్వయము నొందఁ
దన్నుఁ జింతించున◆ధ్యాత్మవేదులు రావణానీకహృన్మోహ◆మానపడఁగఁ
దనఖడ్గధారఁ ద్రెం◆చ్చినశంబుకునికీర్తి, కదలికంబుకదంబ◆కంబు గెలువ
గీ. దివ్యనామసహస్రప్ర◆తినిధి యనఁగఁ, దారకబ్రహ్మమనఁ దన◆పేరు మొఱయ
నతిశయిల్లిన నీసప్త◆మావతార, మహరహంబును వర్ణింతు ◆ నాదిపురుష. 2085

సీ. జనకాజ్ఞకును లోక◆జనవాదమునకుఁగా, నుర్వీజయగు లక్ష్మి◆నుజ్జగించి
తజునిఁ బుత్త్రినిఁజేసి◆తట్టి నెయ్యముపొందె, నజునిపౌత్త్రిండవై◆యనతరీతి
ధాత్రి నిత్యోత్సవసం◆తతినుత్సవంబొంది, యాశ్రయించినవారి◆కమృత మిత్తు
వాలాయముగ విశ్వ◆పనుకూర్మికన్నెను, విశ్వవస్త్వముగూర్చ ◆ వేడ్క పడితి
గీ. పెద్దకాలంబు వానితి ◆ ప్రియవధూటి, ననుజానొకనాఁడువాసి దేహంబుదొఱఁగి
తెన్నఁడెఱుఁగును నీచంద◆మిట్టి దనఁగ, రాజితానేకగుణభద్ర◆రామభద్ర. 2086
గీ. కామసమ్మోహితకాం◆క్షఘాతమునకు, వగచి నీచాటుకవిచెంచు◆వానిఁ
గామమోహితయగునింతిఁ◆గస్తిపఱుప, ననుఁగుఁ గురికొల్పితిదినీకుఁ◆

శృంగారనైషధము, ఆ 8 పద్య 128, 129, 130.

సీ. తాటక మర్దించి ◆ తపసిజన్నముఁ గాచి, హరువిల్లు విఱిచి వై◆ష్ణవమున మెఱసి
ప్రబలులైనట్టివి◆రాధకబంధాగ్రి, ఖరదూషణాద రా◆క్షసులఁ దునిమి
వానరవిభు నేలి◆వాలిఁ గూలఁగ నేసి, జలరాశి గర్వంబుఁ ◆ జక్కఁజేసి
సేతువు బంధించి◆చేరి రావణకుంభ, కర్ణాదివీరులఁ ◆ గడిమిఁ ద్రుంచి
గీ. యలవిభీషణు లంకకు◆నధిపుఁ జేసి, భూమిసుతఁ గూడి సాకేత◆పురమునకు
రాజ్యసుఖములనొందె రా◆మవిభుఁడు,వరుసననుఁ ద్రోచుచుండుఁ బ్ర◆వాస

భాగవతము, స్కం. 6 పద్య 3

మ. పవిధారాపతనంబుఁ గైకొనని య◆ప్పౌలస్త్యుమైసప్తధా
తువులందూఱఁ బరిశ్రమంబునకును◆ద్యోగించెనా సప్తసా

ద్భయరూపాపయశోపహ ప్రకృతి సీ♦తాదర్శనోపాయ ని
ర్ణయలీలావాల సాధనోజ్జ్వల పర♦బ్రహ్మాంబ వీవే హరీ. 2102

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

ఉ. హంసబకాఘకంసనర♦కాది నృశంసవతంస సంఘ వి
ధ్వంసన మాచరింప యదు♦వంశమునం జనియించెఁ గృష్ణుఁడై
హంసనవచ్ఛవిప్రవిక♦చాబ్జరుచి ప్రచురాస్యుఁ డెవ్వఁడా
హంసమునీలసద్యశు న♦నంతుని నే శరణంబు నొందెదన్. 2103

కృష్ణాభ్యుదయము, పద్య 57.

మ. ధరణీకాంతభరంబు మాన్పుటకు నీ ♦ ధాత్రీస్థలిన్ దేవకీ
వరపుత్త్రిత్త్వముఁ దాల్చి మించి త్రిజగ♦ద్వామామనోహారి సుం
దరరూపంబుననున్న నీదు ఘన సౌం♦దర్యంబు వీక్షించి యే
తరుణుల్ నిన్ను వరింపకుందురు ముకుం♦దా! కృష్ణ పద్మేక్షణా! 2104

రుక్మిణీకళ్యాణము, జ॥ వేం॥ గం॥ ఆ 4.

## బుద్ధావతారస్తుతి.

గీ. బుద్ధ, నీగట్టిహృదయ సం♦పుటముఁ దాకి, కుంఠితము లయ్యె మరునంప♦కోల లెల్ల
మొద్దువోయికదా యిప్పు ♦ మురవిరోధి, యలరు లెల్లను వర్తులా♦స్యంబు లయ్యె.
గీ. ముఖ్యచతురాననుఁడ వీవు ♦ మునిశరణ్య, గౌణచతురాననుండల ♦ కమలభవుఁడు
నీవు సర్వజ్ఞుఁడవు బుద్ధ♦దేవ నిజము, శంభు సర్వజ్ఞుఁ డనుట లౌ♦కికవృత్తి.

శృంగారనైషధము, ఆ 8 పద్య 138, 140.

మ. తరుణత్వోత్సుత బాణపంచకమునం ♦ దైత్యాబలాశ్రేణిత
ద్వరసందోహము యుష్మదాత్మకజర♦ద్బాణంబొకంట న్జెడన్
ద్వరఁగావించితి వేటికో యహహా బు♦ద్ధంబయ్యె నీభావ మ
త్తరుణీశీలతనుత్ర మేరికి నసా♦ధ్యంబౌటఁగా కేశవా. 2107

ఆముక్తమాల్యద, ఆ4 పద్య 30.

చ. ప్రతిదినకేశలుంచనపు♦రాయిడి నెట్టన బట్టఁగట్టి పైఁ
బుతపుతమంచునున్న కుఱు♦బోడతలన్ ధరియింప నోడియున్
సతముగ సొమ్ముగాన నిడఁ♦జాలవుగా శిఖిపింఛవల్లి సా
గతమతధుర్య! దానిఁ గటిఁ ♦ గట్టుము పుట్టము మిన్న కేటికిన్. 2108

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 64.

సీ. త్రిపురదైత్యులను మి◆త్తి కి బుత్తిఁ జేయఁ దలఁచి తదీయాంగన ◆ లయతిజృంభ
కుచకుంభపరిరంభ ◆ గుంభనరంభాత, రుస్తంభకుంభదూ◆రుఘనజఘన
బింబబింబాధర ◆ పీడనతాడన, దంతక్షతనఖక్ష◆తప్రముఖ ర
తుల నతులగతులఁ ◆ గలసి మెలసిఖిల,పిత తదవ్రతక్షతిఁ ◆ జేసి జేసి
గీ. కంటిగొంటమ్మవైమింట ◆ గంటకతి9,పురచరులఁ గాల్చికాల్చిన ◆ బుద్ధ!గుణస
మృద్ధ! వైకుంఠనాథ, ల◆క్ష్మీసనాథ, రక్షణపరాయణుండ! నా◆రాయణుండ.
రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 119.

మ. త్రిజగద్భిత్తి9పురాశ9వా(శితకుల ◆ స్త్రీలోకలోకోత్తరా
త్మజిత ప్రాగ్వ9త భంగసంగర సమ◆గ్రస్పర్ధసర్వార్థమో
హజుగుప్సోదయ ధర్మకర్మబలని◆ర్యత్పుణ్య చైతన్య దా
ర్ఢ్యజయార్చిప్పరిశుద్ధ బుద్ధతను భృ◆ద్బ్రహ్మంబ వీవే హరీ. 2110
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6

# కల్క్యవతారస్తుతి.

క. కలకాలచలితధర్మము, నిలుపంగలయట్టి విష్ణు◆నిం గల్క్యాత్ముం
దలఁతుఁ దురగవాహను మ్లేచ్ఛుల నెల్లం గీటడంచు ◆ శుభచారిత్రున్. 2111
భారతము, శాంతి ఆ 2 పద్య 48.

గీ. జ్ఞానకర్మేంద్రియోపాధి ◆ సంప9భూత, దశమహాకల్కనీహార ◆ దళశతాంను
దశమదివ్యావతారు న◆త్యంతనియతిఁ, గల్కిదేవుని నినుఁ గొల్తుఁ ◆ గైటభారి.
క. విశ్వవ్యాప్తయశోని,త్యైశ్వర్యసమృద్ధి విష్ణు◆యశుఁడను నామం
బీశ్వర కల్కిసమాహ్వయ, విశ్వసదర్థమయి చెల్లు ◆ నీజనకునకున్. 2113
శృంగారనైషధము, ఆ 8 పద్య 141, 142.

శా. ఘోరాపారమహాఘపంచకముఁ జె◆క్కుల్సేయఁగా నేర్ప నా
ధారాపంచకధావనం జెలఁగు గం◆ధర్వంబుఁ ద్రొక్కించుబల్
బీరంపున్నెఱరాతు కీటకశరా◆ళీ వారవాణీభవ
ద్ఘోరుద్భా9ంత కృపాణికాద్వితయ వి◆ద్యుద్గ్రంథి నిం గొల్చెదన్. 2114
ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 31.

చ. కలి హిమవేళ శోభనపుఁ ◆ గమ్మవిరుల్ సకలంబు దుల్చి భూ
వలయవనంబుఁ గప్పికొని ◆ వర్తిలు జాడ్యాకృతిఁ దః పర్వగాఁ

త్కులజుఁడు; వీఁగోకంజ్రాకనిఁతోఁ గలహింప సహించి తెల్లొకో ?
వలపలి లోచనాబ్జమును ♦ వామదృగబ్జము వేఁడి యచ్యుతా. 2120

శృంగారనైషధము, ఆ 8 పద్య 133.

ఉ. ఆయత యుష్మదాకృతి క♦రాగ్రనగాంచలవాంతవారిధా
రాయుత చంద్రకాంత ఫల♦కావళిబింబితమై వెలుఁగ నా
రాయణమూర్తి మత్కుపచ♦రత్నము చేఁ బరిరక్షఁ గాంచె నా
నో యదువీర వృష్టిఁ బసి♦యూఁడఁ బ్రోవవె సప్తరాత్రియుల్. 2121

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 29.

సీ. బ్రహ్మను గన్న పఁరబ్రహ్మమూర్తివై, యాద్యంత శూన్యుండ♦వయ్యు "ధర్మ
సంస్థాపనార్థాయ♦సంభవామి యుగే యుగే" యటంచును దేవ♦కీతనయుఁడ
వయి బల రామస♦హాయుఁడవై శిష్ట, రక్షణమును దుష్ట♦శిక్షణమును
సలుపుచు రుక్మిణి ♦ సత్యభామ సుదంత, భద్ర కాళింది జాం♦బవతి మిత్ర
గీ. వింద లక్షణయనుబడా♦ దేవులనుర్వ, గంగనలు గొల్వ వెలయుకృ♦ష్ణా హ్వయప్ర
సిద్ధ! వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 129.

ఉ. శ్రీధర చక్రపాణి సర♦సీరుహపూర్ణసువర్ణ నేత్రి స
త్వాధిప గోపికామదన ♦ తత్త్వమయాత్మక దాసదాస ము
ద్రాధిని కంధరాగ మగ♦ధాధృతమోక్షనిదానయోగ వి
ద్యాధర రాజసాన్య వన♦తత్ప సప్ప మార్గవాంఛితా. 2123

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

# కవిస్తుతి.

క. వాక్స్వామపఙ్క్తిక పితా, మూక్తిక మయ కావ్య హేమ♦మండనులగుత
త్సూరిక్తనసుకవుల నియమా, త్యస్తుల శాల్మీకి కాళి♦దాసులఁ గొలుతున్. 2124

దశకుమారచరిత్రము, ఆ 1 పద్య 9.

శా. సందీప్తార్కసమప్రకాశజలద♦శ్యామాంగుఁ గీర్తిప్తాఖిల
చ్ఛందోబృందవిభాగుఁ బావనయశ♦స్స్పందోహునస్పందధీ
సందర్భాంచితు భారతాగమకథా♦సద్భావు లోకత్రయా
నందప్రాప్తికరుం బరాశరసుతున్ ♦ సర్వజ్ఞుఁగీర్తించెదన్. 2125

మ. చతురోద్యన్మతివాతపోతకమహా♦సాంయాత్రికుండై తగన్
జతురామ్నాయపయోధుల న్మొలఁగి భా♦స్వద్రత్నముల్ రామస
న్నుతిరూపంబుగఁ గూర్చి విశ్వజగమున్ ♦ భూషించె నేధన్యుఁ డా
ప్రతిముఖ్యుండు ప్రసన్నుఁ డయ్యెడుఁ గృపన్ ♦ వాల్మీకి మాకెప్పుడున్. 2126
హరివంశము, పూర్వ. ఆ 1.

ఉ. భాసురభారతార్థముల ♦ భంగులు నిక్క మెఱుంగ నేరమిన్
గానట బీసటే చదివి ♦ గాథలు ద్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసమునిప్రణీత పర♦మార్థము తెల్లఁగఁ జేసినట్టి య
బ్భాసనకల్పులం దలఁతు ♦ సాధ్యుల నన్నయ తిక్కనార్యులన్. 2127
నృసింహపురాణము, పీఠిక. పద్య 9.

సీ. వ్యాస వాల్మీకి సం♦యమివాక్సుధాంభోధి, లోలోర్మిపంక్తుల ♦ నోలలాడి
భట్ట బాణ మయూర♦భారతీ సందర్భ, సౌభాగ్యగరిమంబు ♦ సంగ్రహించి
భాస సౌమిల్లిక ♦ ప్రతిభాసమున్మేష, హేలావిశేషంబు ♦ నిచ్చగించి
మాఘ భారవి వచో♦మకరంద నిష్యంద, మాధుర్యమునకు స♦మ్మదము నొంది
గీ. కాళిదాసుమనంబులోఁ ♦ గాంచి మ్రొక్కి రాజశేఖరుఁగవిరాజుఁ ♦ బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యుని ♦ తిక్కయజ్వ శంభుదాసుని గరమర్థి ♦ సన్నుతించి. 2128
శృంగారనైషధము, ఆ 1 పద్య 7.

మ. వనజాక్షోపమ వామలూరుతనయున్ ♦ ద్వైపాయనున్ భట్టభా
ణుని భాసున్ భవభూతి భారవి సుబం♦ధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిన్ ♦ జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జే♦రం గొందున్ వచశ్శుద్ధికిన్. 2129

ఆ. వ్యాసగదిత భార♦తామ్నాయ మాంధ్రభా,షగ నొనర్చి జగతిఁ ♦ బొగడుఁగనిన
నన్నపార్యుఁ దిక్క♦నను గృతకృతు శంభుదాసు నెఱ్ఱనకవిఁ ♦ దలఁతుభక్తి.
మనుచరిత్రము, ఆ 1 పద్య 7, 8.

సీ. భువిఁ గవితాకన్యఁ ♦ బుట్టించె నెవ్వాఁడు, బడిసాగమము లెల్ల ♦ నడపె నెవ్వఁ
డేను నీవనుమాట ♦ లెనయించె నెవ్వాఁడు, కోమలపదలీలఁ ♦ గూర్చె నెవ్వఁ
డనఘు తులాకోటి ♦ నలరించె నెవ్వాఁడు, నిఖిలగుణంబులు ♦ నేర్పె నెవ్వఁ
డినకరసంప్రాప్తి ♦ నెసఁగించె నెవ్వాఁడు, రహినించె నర్థగౌ♦రవము నెవ్వఁ
గీ. డట్టి వాణీగురుత్వమ♦హత్త్వఘనుల, ఘనులఁ బ్రాచేతసవ్యాస ♦ కాళిదాస
దండిభవభూతిమాఘస♦త్కవిమయూర, భారవులభారవులనాత్మఁ ♦ బ్రస్తుతింతు.

మ. మహి మున్వాగనుశాసనుండు సృజియిం♦పం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీ♦నాథుండు పోషింప న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయిం♦పన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ ద♦త్ప్రాగల్భ్య మూహించెదన్. 2132
వసుచరిత్రము, ఆ 1 పద్య 9, 10.

సీ. ఎవ్వాఁడు మొదలఁ దా ♦ నిలకు భారతిడించెఁ, దగ భగీరథుఁ డభ్ర♦తటినిఁ బోలె
భ్రమరకీటన్యాయ♦భాతి నేకవిరాజు, వాగ్దేవి దానయ్యె ♦ వన్నెకెక్కె
వరవృత్తములు మాని ♦ వాణి యెవ్వానికై, వలచి నానాశ్లేష♦ములకుఁ జిక్కె
నెవ్వాని వాఙ్మాత్రతి♦మినుని ధాత్రికిఁ దెచ్చి, పేర్మితోఁ గరముల♦ర్పించుకొనియె
గీ. నట్టి మహిమాధికులఁ గొల్చి ♦ యఖిలమునిప, సోనుపమశక్తిభృతపురా♦ణార్థవితతు
లనుఁగుఁదనుఁగను భవ్యది♦వ్యాంజనమునఁ, గనుఁగొనఁగఁజేయు నాంధ్రస♦త్కవులఁ
నరసభూపాలీయము, ఆ 1 పద్య 8. (దలఁచి.

ఉ. ఏయెడ నర్థగౌరవస♦మృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరగ ♦ నాంధ్రవచస్థితి భారతంబు రా
మాయణమున్ రచించిన మ♦హాత్ముల నాత్మఁ దలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిఁ ♦ దక్కనుధీమణి నెఱ్ఱసత్కవిన్. 2134
రాఘవపాండవీయము, పీఠిక, పద్య 4

క. పుట్టినఁ బుట్టెడు వేళం, దిట్టపు నునుపచ్చి పుట్ట♦తేనియచవితోఁ
బుట్టె నన నమృతముట్టెడు, పుట్టనినున్న సత్కవిత్వ♦ములు వర్ణింతున్. 2135
క. ఇట్టాడరాని యాగమ, ఘట్టమునకు నడవ యచ్చు♦కట్టిన మునిరా
ట్పట్టాభిషిక్తుఁ దపముల, పుట్టిన నెలవయిన వ్యాస♦ముని వర్ణింతున్. 2136
గీ. వ్యాస వాల్మీకి ముఖసూక్తి ♦ వైభవముల, నేర్పుమీరంగ నిజకార్య♦దర్పణములు
సరసమానసముల నేలు♦పలుచుకీర్తి,ధవుల నన్నయ భట్టాది ♦ కవులఁదలఁతు.
పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 10, 11, 12.

సీ. శారదోన్మేపంబు ♦ జగతి సంధించియుఁ, బరమనారదమైత్రిఁ ♦ బరగుసుకృతి
నుపమైకధన్యుఁడై ♦ యొనరియు ననుపమ, ప్రఖ్యాతిఁ గాంచిన ♦ భవ్యచరితు
ననమబాణాంకత♦నలరారియు నలిక, నేత్రుమెప్పించిన ♦ నిర్మలాత్ము
ఘనశబ్దవిస్ఫూర్తిఁ ♦ దనరియు హంసస,మాగమశ్రీఁ గాంచు ♦ ననఘశీలు
గీ. మఱియు నగణితసుమనస్స♦మాజమునకు, నత్య రావృతధారార్హ♦సార్పణమున
నామెతల నిచ్చలునొనర్చు! ♦ నలఘుమహిమ, నెఱిపినపవిత్రిసత్కవిశ్రీ ♦ నిధులఁదలఁతు.
చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 5.

సీ. ఘననాకభవభుజం♦గపరిఖ్యాతం బెన్ని, శుకతాతబింబసం♦శుద్ధి వొగడి
యలకాళిదాసుని ♦ యార్యసన్నుతి చేసి, దండివంశస్థవృ♦త్తము గణించి
యిల మయూరకుమారు♦లలితసంగతి మెచ్చి, బాణపుష్పితలతఁ ♦ బ్రస్తుతించి
భవభూతిశశికళా♦భానురత్వం బెన్ని, మఱి ధనంజయు వసు♦మతి నుతించి
గీ. శౌరిఁ గాంచుకవిత్రయీ♦ప్రణవమహిమ, సార్వభౌమునిపృథ్వీభా♦స్వరునికాంతి
భీమునత్తైభబలమును ♦ సోముహరిణి, నటులనమరేశ్వరుని వజ్ర♦పటిమఁ దలఁతు.
బహులాశ్వచరిత్రము, ఆ 1.

ఉ. శ్రీకరరామభారత వి♦శేషకథాజలరాశిఁ దేలి య
స్తోకపదార్థరత్నములు ♦ దోరముగా బుధకోటి కిచ్చి సు
శ్లోకరుచుల్ దిగంతముల ♦ లోకములన్ బ్రసరింపఁజేయు వా
ల్మీకి పరాశరాత్మజుల♦ మేటికవీంద్రులఁ బ్రస్తుతించెదన్. 2140
దశరథరాజనందనచరిత్రము, ఆ 1 పద్య 7.

సీ. ఎవ్వాఁడు సాహితీ♦హేతుభూతుం డయ్యె, నెవ్వాఁడు శ్రుతిచిక్కు♦ లెడలఁజేసె
నెవ్వాఁడు కావ్యంబు♦లిలకుదుర్గ్రనఁబూన్చె, నెవ్వాఁడు గసవృత్తు♦లెలమిఁ బఱచె
నెవ్వఁ డాంధ్రకవిత్వ♦మిల వెలుంగఁగఁ జేసె, నెవ్వాఁడు తజ్జాతు♦ లిరువు గొల్పె
నెవ్వాఁడు శృంగార ♦ మిదియని తెలిపించె, నెవ్వాఁడు పదశయ్య ♦ లేర్పరించె
గీ. నట్టి వల్మీకజుని వ్యాసు ♦ ననఘు కాళి, దాసు బాణుని నన్నార్య♦తత్కృతిపరు
లైపథాధారు పెద్దన ♦ నతులభక్తి, నరసి సేవింతు ప్రార్థింతు ♦ నభినుతింతు.
శంకరవిజయము, ఆ 1.

సీ. వాక్యనిర్జితశేషు ♦ వాల్మీకి వాల్మీకి, హరిభక్తియుక్తధీ♦ వ్యాసు వ్యాసు
ఘనభావకాళిదా♦సును గాళిదాసును, జారుమాధుర్య వా♦చోరుఁ జోరు
దివిజేంద్రధనదవై♦భవభూతి భవభూతి, ధర్మబుద్ధి నవీన ♦ దండిదండిఁ
గవితాభరిహృష్టమా♦ధవమయూరు మయూరు, భానురాకృతిపుష్ప♦బాణు బాణు
గీ. మానితాచారమథితాఘ ♦ మాఘు మాఘు, ధ్యానబద్ధమురారి ము♦రారి గాత్ర
పటువిభారవి భారవిఁ ♦ బ్రస్తుతింతు సర్వశబ్దార్థవిజ్ఞాన ♦ సరణికొఱకు. 2142
హంసవింశతి, ఆ 1 పద్య 10.

సీ. పదపదార్థజ్ఞాన ♦ భాషావిధానముల్, వ్యంగ్యనానావస్తు ♦ వర్ణనములు
బహువిధాలంకార ♦ భావక్రమంబులు, శబ్దప్రయోగర♦సజ్ఞతలును
ఛందోవిశేషలక్షణలక్ష్యభేదముల్, కవిసమయముచమ♦త్కారములును
గ్రహాళతుర్మిత్ర వ♦ర్గగ్రహాఫలములు, రీతిశయ్యాపాక ♦ నీతివిధులు

గీ. గద్యపద్యచతుర్భద్ర♦ఖడ్గచక్ర,మురజగోమూత్రికానాగ♦ముఖ్యబంధ
కావ్యరచనల నెఱిఁగిన ♦ ఘనుల నాది, కవుల నభినుతిఁజేసి త♦త్కరుణ మెఱసి.

వైశ్యపురాణము, ఆ1.

సీ. శబ్దశాసను శబ్ద♦శాసనుం డని కుండ, లీంద్రుని మెఱిఁగి కుండ♦లీంద్రుఁ డనియు
శ్రీనాథకవిచంద్రు ♦ శ్రీనాథుఁడని భాస్క,రుని దగభాస్కరుం ♦ డనియు రంగ
నాథుని శ్రీరంగ♦నాథుండనియు మల్లి,కార్జును లలిమల్లి♦కార్జునుఁ డని
రామభద్రకవిని ♦ రామభద్రుండని, సోమకవీంద్రుని ♦ సోముఁ డనియు
గీ. నవనిఁ బెద్దన్నఁ బెద్దని ♦ యలరు ధూర్జ,టికవి ధూర్జటియని యనం♦తకవి నల య
నంతుఁడని యమ్మహాత్ముల ♦ నెంతు మదిని,నేఁ బలుకుకబ్బ మవనిపై ♦ నెగడుకొఱకు.

ఓఘవతీపరిణయము, ఆ 1 పద్య 16.

సీ. రామలీలాభివ♦ర్ణనలించె నెవ్వాఁడు, పగధర్మగుణశీలఁ ♦ దాల్చె నెవ్వఁ
డోగి సత్కళారుచి ♦ నొప్పారె నెవ్వాఁడు, విజయాగ్రిజఖ్యాతి ♦ వెలసె నెవ్వఁ
డార్యానుకూలుఁడై ♦ యలరారె నెవ్వాఁడు, పృథివీక్షమావాప్తిఁ ♦ బరగె నెవ్వఁ
డగ్రసంగ్రహణక్రి♦యలమీఱె నెవ్వాఁడు,ఘనవిభ్రమముఁగాంచి ♦ దనరు నెవ్వఁ
గీ. డట్టి భాస్కరభానుసో♦మాఖ్యభీమ, సూరిశంకరశ్రీనాథ ♦ చోరకవి మ
యూరులను సారవచనప్ర♦చారులను సు,ధీరులను దారులను భక్తి♦మీఱఁ దలఁతు.

కవిచకోరచంద్రోదయము ఆ 1.

చ. కవులురచించు గ్రంథములు ♦ గన్గొని తద్గుణముల్ సభ న్మహా
దవమున నేర్పరించి యప♦రాధము లున్న గుణంబుగా గ్రహిం
చి పనధిజాతచంద్ర విమ♦శేఖరభోగ్యపదార్థశోభియా
శివునిగతిం జెలంగు, కవి♦శేఖరులం గొనియాడఁగాఁ దగున్. 2146

భార్గవపురాణము, ఆ 1.

శా. వ్యంగ్యాలంకృతి వృత్తిరీతి గుణశ♦య్యాపాకనానాభిదా
ఖంగ్యాసిద్ధమనోజ్ఞవాక్యము నద♦భ్రప్రజ్ఞవీక్షించి స
మ్యంగ్యాసమ్మతి మానటంచు రసయో♦గ్యత్వంబుచే దోషసై
సంగ్యంబొప్పెడు సత్కవీశ్వరులకున్ ♦ సన్మానముం జేసెదన్. 2147

శ్రీరంగమాహాత్మ్యము, నల్లా. చ. నృ. ఆ 1.

సీ. వల్మీకజవ్యాస♦వాగభ్రగంగామ, హోర్మిమాలికలలో ♦ నోలలాడి
కాళిదాసమురారి ♦ కావ్యనవ్యామృత, ధారాపరంపరల్ ♦ దనియఁ గ్రోలి
భవభూతిమాఘభా♦రవిచోరచనాచ,మత్కారములకు స♦మ్మదముఁ గాంచి
బాణమయూరసు♦బంధుప్రబంధమ,రందసాప్తికా♦నంద మొంది

గీ. భానుసోమిల్లబిల్హణ ♦ ప్రతిభ మెచ్చి, సారమతి నన్నయార్యుని ♦ శంభుదాసు
దిక్కయజ్వుని శ్రీనాథు ♦ ధీరుఁ బెద్ద,కవిని భీముని సోమభా♦స్కరులఁ దలఁచి.

కృష్ణకళ్యాణము, ఆ 1.

సీ. ప్రకటతరాహీన♦పద ధురంధరుఁడైన, యనఘువల్మీకజా♦తుని భజింతు
వరశక్తి జాతి వి♦స్ఫురిత తేజఃపరా,శరసముద్భవుని కం♦జలియొనర్తు
లాలిత్యాత్యుపమోజ్జ్వ♦లాలంక్రియాభివ,ర్ణితకాళిదాసధీ♦నిధిఁ దలంతు
రహిసకలార్థగౌ♦రవ పారదర్శితా, తతభారవికి నమ♦స్కృతులొనర్తు
గీ. జితవిమతబాణు,బుధజన♦హితమయూరు, ఘనునిదుర్వచోపహృతిదం♦డినినితాంత
కలితభవభూతిసుగుణమా♦ఘులఁ దలంతు,సూరినిమురారినిభజింతు ♦ సొంపుమీఱ.

కృష్ణభూపాలీయము, పద్య 7.

మ. కవనాఖ్యోత్తమవనంబునాటి జగతిం♦ గాండోన్నతిం బెంచి ప
ర్వవితానస్థితిసంఘటించి రససం♦పన్మాధురీసాధురీ
తివిశేషంబు రసజ్ఞజాలమునకుం ♦ దెల్లంబుగాఁ గూర్చి గౌ
రవముం జెందినవారి భక్తిఁ దలఁతుం ♦ బ్రాచేతసవ్యాసులన్. 2150

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 9.

చ. గురురుచి మూఁడుమూర్తులును ♦ గూడి త్రయీమయమూర్తిఁ గోఁచిన
ట్లురుదుగ ముప్పురుం గలసి ♦ యంచితపంచమవేదభారత
స్ఫురణముఁ జూపినట్టి పరి♦శుద్ధుల నెన్నెద నన్నయార్య భా
స్వరమతి నెఱ్ఱప్రెగ్గడను ♦ జక్కఁగఁ దిక్కనసోమయాజినిన్. 2151

రామరాయవిలాసము, ఆ 1 పద్య 10.

## కుకవినింద.

చ. పలుకుల పొందులేక రస♦భంగము సేయుచుఁ బ్రాఁతవడ్డ మా
టలఁ దమ నేర్పుచూపి యొక♦టన్ హృదయం బలరింపలేక యే
పొలమునుగాని యట్టిక్రమ♦ముం దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరింత్రు కుక♦వుల్ ధర దుర్విటులట్లు చూడఁగన్. 2152

నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 6.

చ. వెస వసుధాస్థలంబునఁ గ♦వీంద్రులు గొందఱు శేముషీమషీ
రసము మనఃకటాహకుహ♦రంబుల నించి కలంచి జిహ్వికా
కిసలయ తూలికం గొని లి♦ఖింతురు కబ్బము లెన్నఁగా మహా
వ్యసనముతో నిజాననవి♦యత్త్థలతాళపలాశరేఖలన్. 2153

భీమేశ్వరపురాణము, ఆ 1 పద్య 12.

ఉ. కొల్లిటి సత్కవుల్ కృతులు ♦ దొంతులు పేర్చినమాట లూఁతగా
జల్లిపదంబు లూఁదుకొని ♦ సంధులు దూఁటుచు నొక్క జాదుగా
నల్లిన కబ్బముల్ సభల ♦ నార్యులు నవ్వఁ బఠించు దుష్కవుల్
మొల్లము వారిచేతఁ గద ♦ ముట్టునె భవ్యములైన కావ్యముల్. 2154

శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 16.

మ. భరమై తోఁచు కుటుంబరక్షణకుఁగాఁ ♦ బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళసంపుటస్రికరకాం♦తారంబునం దర్థపుం
దెరువాటుల్ దెగికొట్టి తజ్జ్ఞపరిష♦ద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱతం బడుం గుకవి పృ♦థ్వీభృత్సమీపక్షితిన్. 2155

మనుచరిత్రము, ఆ 1 పద్య 9.

శా. భావం బెక్కడలేక వృత్తనియమా♦పాయంబుఁ జింతింప కెం
దే వర్తించి పరార్థవంచనలచే ♦ దీపించి మూర్ఖాళిసం
భావింపం గుకవిప్రణీతకృతి సా♦మాన్యాకృతింబూని పై
పై వన్నెల్పచరింప దానిఁ దిలకిం♦పంబోరు ధీరోత్తముల్. 2156

వసుచరిత్రము, ఆ 1 పద్య 11.

ఉ. పైకొను కాంతిచేఁ దగిలి ♦ పల్కులభీకరలోభిగేహవ
ల్మీకములందుఁ బోయని య♦మేయమదోద్ధత దుష్కవీంద్రద
ర్వీకరరాజికి న్వివిధ♦విశ్రుత కావ్యకళావిశేషదీ
క్షాకుశలార్యతంత్రములు ♦ గారుడమంత్రము లెందు నారయన్. 2157

హరిశ్చంద్రోపాఖ్యానము, శంకర. ఆ 1 పద్య 14.

సీ. శబ్దదరిద్రుఁడై ♦ శారదాభ్రముఁ బోలుఁ, బ్రాసంబువిడిచి సం♦త్రాసిఁ బోలు
నపహృతాన్యాలంక్రి♦యతఁ దస్కరునిఁబోలుఁ,బృథులార్థ దూరుఁడై♦ పేదఁబోలు
విగళితౌజస్కుఁడై ♦ పగలింటినెలఁ బోలు, నవిదితధ్వనికుఁడై ♦ చెవిటిఁబోలు
పద్యానభిజ్ఞతా♦భంగిఁ బంగువుఁ బోలు, భిన్నమాధుర్యుఁడై ♦ పిస్విఁ బోలు
గీ. ముక్తసూక్తప్రసాదుఁడై ♦ మూర్ఖుఁ బోలు, జీర్ణపాదత నదియోర♦చెట్టుఁ బోలు
లుప్తసముదాయభావుఁడై ♦ లోభిఁ బోలు, సుకవివాసరధవదివాం♦ధకవి కుకవి.

బహులాశ్వచరిత్రము, ఆ 1.

గీ. ఛంద మెఱుఁగుట శబ్దశా♦స్త్రముచదువుట, బహునిఘంటుపరిజ్ఞాన♦పాటవంబుఁ
గాదు కుకవులకవితకుఁ♦గారణంబు, లుచిత లజ్జాపరిత్యాగ♦మొకటిగాని. 2159

సీమంతినీకల్యాణము, ఆ 1.

మ. పరపాకంబులఁగోరి యొందుకయినం ◆ బ్రాల్మాలివృత్త్యర్థమై
యొరుపాదంబులనంటి యార్థకులపా◆యోగంబు లేమి న్నిరం
తరచింతన్ జగురీతిద్రోఁచక వివ◆ర్ణత్వంబునన్ దీనులౌ
నరులంజూచి నుదృగ్జనంబు రసవ◆న్నరోత్కృష్టులం బల్కునే. 2160

తారాశశాంకవిజయము, ఆ 1 పద్య 20.

గీ. జల్లు పొల్లుల నొకపద్య◆మల్లుఁగాని, తవిలికృతి చెప్పఁగలఁడె కా◆కవి తృణాంకు
రములు గైకొని యొకకులా◆యముఘటించుఁ, గాని గిజిగాఁడు మాఁడువు◆గట్టఁగలఁడె.

విజయనందనవిలాసము, ఆ 1.

చ. గొనకొని జల్లుపొల్లులొనఁ◆గూర్చి యొకానొక పద్య మల్లనే
ర్చిన కుకవీంద్రుఁ డంచితవి◆శేషరుదార్థసమృద్ధిఁ గావ్యక
ల్పన నుతిఁగాంచునే పుడమి◆పైఁ బులుఁబోఁచలగూఁ డమర్పఁబూ
నిన గిజిగాఁడు గట్టఁదగు◆నేమణికాంచన సౌధరాజముల్. 2162

వేదాంతరసాయనము, అవతారిక. పద్య 7.

గీ. సత్కవీశ్వరు లెలుఁగంగ◆జాలకవలఁ, జెందుకూఁత లెకూయును◆జెనఁటి మొఱకు
మత్తకరికుంభవిదళనో◆ద్వృత్తహరిని, మెనయలేకను గుక్కలు ◆ మొఱుగునట్లు.

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 13.

శా. సంధులుజాఱి సత్కవుల◆సంగతిఁ గానక హీనవృత్తిసం
బంధముతో చెూసర్చుచుఁ గు◆పంకిలజీవనరూఢిఁగాంచి హృ
ద్బంధుర సౌమనస్య పర◆పాటియొకింతయుఁ గాంచరన్నశు
ష్కాంధులె నిక్కమౌనరసు◆లా తలఁపం గుకవీంద్రు లెందునున్. 2164

మానసపద్మా పరిణయము, ఆ 1 పద్య 15.

గీ. మహితవిక్రమపదనియా◆మం బెఱుఁగక, శబ్దరూపంబులందు సౌ◆ష్ఠవము లేక
నుదరవివశైకపూర్తికై ◆ యొదిగి తిరుగు, కవులు వివరించిచూచినఁ◆గవులుగారె.

మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది.

ఉ. నిబ్బరమైన యక్కరము ◆ నేర్చినవారలపోలె వట్టిత
బ్బిబ్బులునాలుగల్లి తమ◆భీకరవేషవిశేషపుష్టికై
యుబ్బి భ్రమల్గొన న్గదిసి ◆ యొంటరిపాటున మూఢసన్నిధిన్
డబ్బులుగొట్టు దుష్కవులు ◆ డాయఁగనోపుదురే రసజ్ఞులన్. 2166

రంగారాయచరిత్రము, ఆ 1.

గీ. సతము శబ్దాపశబ్ద మెం◆చకను రంధ్రములను వెదకుచు నస్వార్థ◆ములగ్రహించి
ప్రాపముల వోసమొందుచుఁ◆బరగు కుకవి, చోరుల నిరాకరించెద◆సారిదిమదిని.
కవిజనచకోరచంద్రోదయము, ఆ 1.

క. విటుసంప్రాప్తాభరణ, స్ఫుటనం దనరారువేడ్క ◆ వూఁబోఁడివలె
న్నటియింతురు కుకవులు తొ, ల్లిటిసత్కవిరాట్ప్రబంధ◆తస్కరవృత్తిన్. 2168
నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 1.

గీ. శుభ్రవర్ణలసత్పద◆స్ఫురితగతులు, సుకవిమణివోలెఁ గాకవి◆నూపఁగలఁడె.
శుభ్రవర్ణలసత్పద◆స్ఫురితగతులు, కుకవిమణివోలెఁ గాకవి ◆ నూపుటెట్లు.2169
కృష్ణకళ్యాణము, ఆ 1.

చ. వికలవచఃప్రగుంభనల◆వేమఱు మూర్ఖజనాళికెంతయున్
బ్రకటముదంబుసేయుచును ◆ బండితనిందితమైనయట్టి యా
కుకవిసమాఖ్యఘూకతతి ◆ కోవిదుఁడౌ కవిభానుఁ డొప్పవో
నొకనిముసంబునున్ దనదు ◆ కుగ్రిరఁ జూపుచు నిల్వనేర్చునే. 2170
కృష్ణామాహాత్మ్యము, ఆ 1 పద్య 12.

సీ. రమణీయశబ్దస్ఫు◆రణపదరీతి చ,మత్కారసత్కృష్ణ ◆ మహిమ యెన్న
నతులితసరసభా◆వగభీర్ధ్యపరి,పూరహితసత్ప్రసం◆చదలకళిమి
మలినహీనసుపద్య◆తి లలితపగమితాం,సావళితోడ స◆ఖ్యగతిలేమి
తమినిగళానిధిఁ◆దాము జూడఁగలేక, కుజనులతోఁ బొందు◆గోరుకతన
గీ. బహుమృదులదర్శనాభావ◆పటిమపలనఁ, దప్తఘటితపటుప్రబం◆ధమఘనస్వ
శక్తిహీనతసభలోన◆చలితగతిని, కావుకాపను కవులుకా◆కవులెచూడ. 2171
కౌసల్యాపరిణయము, ఆ 1.

చ. గడియకుఁ గావుకావుమనఁ ◆ గాపని దోలినఁ దూలిపోవుచుం
గడు మలినత్వ మొంది గుణ◆గౌరవమందక నేకదృష్టిచే
నుడుగక దోషకీటముల ◆ నొద్దిక నేర్చుచుఁ బక్షపాతమె
క్కుడఁదగఁగల్గి దూఱుపడు◆కాకవికాకములం దలంతురే. 2172
ఆ. ఇంటియింటికేఁగి ◆ యెనురుచుఁ గిచకిచ, హాసమొదవఁగాఁ బ◆దార్థములను
సంగ్రహించి సుకవి◆జనులపై దుముకు వానరులుగారె కుకవు ◆ లయిలు పలుప.
భార్గవపురాణము, ఆ 1.

మ. తమకావ్యాదుల సత్కవుల్ "సుకవినిం◆దంజేసి" యంచొక్కభా
గముఁగల్పించి రకారణంబ యది ని◆స్సార్కర్షణ్యమాత్సర్యభా

ఁమె కాకోఘను లుండకున్న వలదే◆వానాంధ్రప్రియాశ్రేణికే
ల్లమరుం గీర్తివిశేషపూర్తి యిలఁ గా◆వ్యాసారపూరోత్థమై. 2174

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 11.

మ. ధ్వనినాఁ జక్కఁదటంచు శయ్యయనఁ ద◆ల్పంబంచు దోషంబనా
గనుబాపంబను చర్థమన్న సమభా◆గంబంచుఁ బాకం బటం
చనిన న్వంటయటంచు వృత్తియనినఁ◆ న్వ్యాపారమానంచు నే
ఘనబుద్ధుల్వివరింతు రక్కవుల వ◆క్కాణించఁగా నేటికిన్. 2175

రావువంశముక్తావళి, ఆ 1.

## —◆ సప్తసంతానములు. ◆—

క. తనయుఁడు చెలువును గావ్యం,బు నిధానము గుడి వనంబు ◆ భూదేవస్థా
పనమును ననునియ్యేడును, జను శాస్త్రములందు సప్త◆సంతతు లనఁగన్. 2176

అప్పకవీయము, ఆ 1 పద్య 15.

సీ. శిఖిసాక్షిగాఁ బ్రోడ◆సఖియైన కులకాంత,యందు నౌరసపుత్త్రిఁ◆ గెంగుటయును
మధువైరికైన మ◆న్మథవైరికైన మం,దిరము సుందరముగ ◆ నిలుపుటయును
శ్రోత్రియద్విజవర్య◆పుత్త్రిఁ బావనగుణాం,చితచరిత్రునిఁ బెండ్లి◆సేయుటయును
పూర్వమహారాజ◆పుణ్యకథాలీల, వెలయఁ గావ్యంబు ని◆ర్మించుటయును
గీ. ధనము పాఁతుట పుణ్యసా◆ధనముగాఁగ, వనము నిల్పుట పుణ్యజీ◆వనముగాఁగఁ
జెలువుఁదప్పించుటయనఁగ న◆చ్చెరువుమీఱు,సప్తసంతానములుజగ◆త్సంస్తుతములు.

సీమంతినీకళ్యాణము, ఆ 2.

## —◆ కావ్యప్రశంస. ◆—

క. ధర్మములలోన నుత్తమ, ధర్మము కావ్యము నిజంబు ◆ ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు సు,ధర్మను వసియించుఁ జెక్కు ◆ దైవత యుగముల్.
గీ. దుష్కృతము లెన్ని చేసినఁ ◆ దుదినిసప్త, సంతతులలోనొక్కటి◆సలుపునతఁడు
మతుకమానఁ దననూటొక్క ◆ కులమువారి,నరకములఁ బాపిముక్తి◆నదుపునిజము.
క. ఇల సప్తసంతతులలో,పలఁ గావ్యము దక్క దేవ◆భవనవనాదుల్
స్థిరము లగుఁ గొన్నివర్షం,బుల కని చంపువు రచించె ◆ భోజుం డెలుకన్. 2180
గీ. నిలిపి రెక్కడ నచటనె ◆ నిలిచియుండు, నగ్రహారాదిసంతతు ◆ లరసి చూడ
కవియుఁగృతిముఖరచనచే◆నఖిలదిశల, నెగడుఁగావునఁగావ్యమ◆న్నిటికిఁదొడవు

క. పురివఱపనీరు గోదా, వరిఁ గలసిన యోగ్య మైన ♦ వడువునఁ గడు దు
శ్చరితుం డైనను గావ్యాం, తరమునఁ జెప్పఁబడి పాప ♦ నచరిత్రుఁ డగున్. 2182
క. క్షితి నెవ్వని నామము స, త్కృతి నెన్నిదినంబు లుండు ♦ దివి నాపుణ్య
వ్రతుఁ డంతకాలముండును, ధృతి నింద్రద్యుమ్ను నునికి ♦ దృష్టాంతముగాన్.
క. తనకు హితార్థము లెఱిఁగించు నఘంబు లడంచు ధనము ♦ శోభనము యశం
బును గూర్చు నఖిలసురలన్, గనఁబడఁ గాఁజేయు నెపుడుఁ ♦ గావ్యము కవికిన్.
గీ. మేటి బ్రహ్మర్షి యయ్యె వ ♦ ల్మీకభవుఁడు, గాంచె రవినిమయూరుండు ♦ గడియలోన
హరిణశోకము వాసె శ్రీ ♦ హర్షణునకుఁ, గావ్యమునఁ జెందరాని స ♦ ద్గతులుగలవె.
చ. అలరఁ బురాణకావ్యముల ♦ నార్యులు చెప్పినవారు దక్కఁగాఁ
దెలియఁ జతుర్యుగంబులను ♦ దీవుల నేఁడిట నెంద తెంపఁటో
యిల జననంబు నొంది మని ♦ యేఁగిరి పుణ్యచరిత్రు లందులో
పల నిపు డొక్కఁడేనియును ♦ బ్రస్తుతి కెక్కు టెఱుంగ మెక్కడన్. 2186
గీ. రామకథలోనఁ గపులు వా ♦ రాశిఁ గట్టి, రనుచు వాల్మీకి చెప్పంగ ♦ నఖిలజనులు
సేతు వనుచు నెఱింగిరి చెప్పకున్న, నదియు లోకసాగదీవి య ♦ టండ్రు గాదె.
క. వివరించె యజుర్వేదము, కవి యగువిప్రుండు శుచి జ ♦ గంబుల నేత
త్ప్రివిముల కావ్యము మిక్కిలి, పవిత్ర మగుఁ గపిలగోవు ♦ పాల తెఱఁగునన్. 2188
ఆప్పకవీయము, ఆ 1 పద్య 14,16,17,18,19,20,21,22,23,24,25.

## —♦ కవితాప్రశంస. ♦—

గీ. విబుధలోకంబు "కవితైన ♦ విద్య" యనుచుఁ, జదువుపచనార్థమునను సం ♦ శయముగలదె
విద్యలను నెల్ల నుత్తమ ♦ విద్య కవిత, దానిఁ దెలియుట విశ్వ మం ♦ తయునుగనుట.
క. ధారుణి నాకుజమారుతి, పారాశర్యులు చరించు ♦ భావుకశిష్టా
చార మవశ్యక మని కవి, తారతమతులైరి కాళి ♦ దాసప్రముఖుల్. 2190
మ. జననాథాగ్రిణి యాత్మరాజ్యమున ని ♦ చ్చల్ పూజ్యుఁ డాసీమఁ బా
సినఁ దా గవ్వయుఁ జేయఁ డన్నికడలన్ ♦ శ్రేష్ఠుండు విద్వాంసుఁ డా
యనకన్నం గవి మేటి యా "సుకవితా ♦ యద్యస్తి రాజ్యేన కిం"
మ్మనువాక్యంబు నిజంబు దీనిఁ గని కా ♦ వ్యంబుల్ రచింపం దగున్. 2191
క. వనితయుఁ గవితయుఁ దానై, చను దెంచుట గలుగు నేని ♦ సరసం బగు ధా
త్రిని బల్మికోలఁ గావించిన విరసం బగు నటంచుఁ ♦ జెప్పిరి విబుధుల్. 2192

క. ఛందోలంకారాదుల, యందలిపొల్లెల్లఁ దుదిని వ్యర్థము గావే
సుందర మగువాక్యంబుల, పొందెఱిఁగి రచించుబుద్ధి పుట్టకయున్నన్. 2193
క. విరచించుశక్తి పుట్టని, పురుషునిచదువులు ప్రకాశములు గావు వసుం
ధరఁబరహితసదనాంతరమున రేయిఁ బడియున్న ద్రవ్యరాసుల కరియన్. 2194
గీ. ఆశుధారాకవిత్వంబు లందు శయ్య, లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁగాన
నెంతయోజించినను బద్య మంత సార, వంత మగుఁగాననిలుకడ వలయుఁ గృతికి.
అప్పకవీయము, ఆ 1 పద్య 53, 54, 55, 56, 57, 58, 59.

## కావ్యభేదంబులు.

సీ. ఉచ్చారణక్రియ నొప్పారు వర్ణంబు, వర్ణసంచయమున వఱలుఁ బదము
పదవితానముచేత భాసిల్లు వాక్యంబు, వాక్యభేదమున నివ్వటిలు నర్థ
మర్థపరంపర నమరును భావంబు, భావసంగతిఁ గనుపట్టు రసము
రసపరిశస్తిచేఁ బొసఁగును బద్యంబు, పద్యరాశిని గూర్పఁబడును గావ్య
గీ. మట్టికావ్యంబు ద్వివిధమై యతిశయిల్లుఁ, బరువడిఁ బ్రబంధచాటుప్రబంధములన
సర్గములసంస్కృతమున నాశ్వాసములను, దెనుఁగునఁ బ్రబంధమనునది తనరుఁ గృష్ణ.
సీ. పురమును ఋతుషట్కమును బ్రయాణంబును, శైలంబు పేరేరు సాగరంబు
మానీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు, దూత్యంబు పిదప సద్భూతరణంబు
విజయంబు మద్యపానజలకాఁగంబును, వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరా, భ్యుదయంబు విప్రలంభోదితంబు
గీ. పద్మమిత్రోదయంబును బరిణయంబు, సురతమును నౌత్సాదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి, చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస.
క. కనుఁగొన సంఖ్యాబద్ధం,బు నసంఖ్యాకంబు నాఁగ భువి నిరుదెఱఁగై
తనరారుఁ బూర్వకవిమత,మున నాచాటుప్రబంధములు జలజాక్షా. 2198
గీ. సాల్గుదెగలయుదాహరణములుముక్త, కాదిపంచాదశమును సంఖ్యాన్వితములు
గద్యరగడద్విపదదండకములు మంజ,రులునుసంఖ్యారహితచాటువులునృసింహ.
అప్పకవీయము, ఆ 1 పద్య 27, 28, 29, 30.

## సుకవిమాహాత్మ్యము.

క. మణివలనఁ గంకణమును గంకణమువలన
మణియును బ్రకాశ మగునట్లు మదిఁ దలంచ

సుకవివలన నాయకుఁడు నా♦యకునివలన
సుకవియుఁ బ్రసిద్ధిఁ గాంతురు ♦ సకలదిశల. 2200

తే. నాకుజాతునిచే రఘు♦నాయకుండు, వ్యాసుచేఁ బాండవులు కాళి♦దాసుచేత
భోజుఁడు ప్రసిద్ధినొందిరి ♦ భువినిదమదు, నడక తెల్లను గథలుగా ♦ నుడువ నకటన.

క. ఇమ్మహిని మునులచే పెల,సె మ్మను గావ్యములు "నానృ♦షిః కురుతే కా
వ్య" మ్మనువచనార్థంబే, సమ్మతి గలిపేళ సుకః♦జనుతే మానుల్. 2201

అప్పకవీయము, ఆ 1 పద్య 41, 42, 43.

—♦ సత్కవిలక్షణము. ♦—

క. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు, గురుభక్తుఁడు శుచియుఁ గల్ప♦కుఁడు పూర్వకవీ
శ్వరవాక్ప్రయోగదక్షుఁడు,గరుణామతి యెవ్వఁడతఁడు ♦ కవియనఁ బరగున్.

క. శ్రుతిశాస్త్రాంగపురాణ, ప్రతతియు నితిహాసకావ్య♦భరతాగమముల్
స్మృతిసంగీతరతికళా, గతుల నలంకృతుల నెఱుఁగఁ♦గాఁ దగుఁ గవికిన్. 2203

అప్పకవీయము, ఆ 1 పద్య 44, 45.

—♦ సప్తవిధకవులు. ♦—

ఆ. వినుతిఁ గాంతు రిల వి♦వేకివాచకరాచి, కార్థశిల్పభూష♦ణార్థు లనఁగ
మార్గనానుగతేస♦మాహ్వయుఁడు ననంగఁ, గవులు సప్తనామ♦కములతోడ. 2204

సీ. గణవర్ణశబ్దార్థ♦గుణదోషనికరంబుఁ, బరికించి కూర్పఁ గ♦బ్బము వివేకి
బహుతరానుప్రాస♦పదబంధనియమంబు, వదలక కృతిసేయు♦వాచకుండు
మృదుమధురోక్తులు ♦ వెదకి కావ్యంబెల్ల, రచియించుఁ బదపడి ♦ రాచికుండు
మితశబ్దములలోన ♦ నతివిపులార్థంబు, నిమిడించు నర్థాఖ్య ♦ నెసఁగునతఁడు

తే. సెప్పుయమకంబులెప్పట్ల ♦ శిల్పకుండు, పొంకుపఱుచునలంకృతుల్ ♦భూషణార్థి
సరళపదవిరళార్థవి♦స్ఫురణముగను, జూపు రస మొందు మార్గవ♦స్ఫుటకరుండు.

అప్పకవీయము, ఆ 1 పద్య 46, 47.

—♦ వాచికుఁడు. ♦—

క. ఛలవర్ణగుచ్ఛపిచ్ఛిల, లలితపదాడంబరావ♦లంబనకవితా
సులభవిరచనాచతురుం, డలవడు వాచికుఁడు నా సు♦పద్రగపాత్రిధిన్. 2206

—♦ అర్థుఁడు. ♦—

క. మితశబ్ద మయ్యు నర్థము, పతతవ్యాఖ్యానలాల♦సక్షమవిపుల
స్థితి నొప్పఁ గవిత సెప్పెడు, నతఁ డార్థుం డనఁగ నెగడు ♦ నార్యులసభలన్.

—♦ శిల్పకుఁడు. ♦—

క. మహితనుశబ్దార్థంబులు, బహువిధయమకార్థబంధ ♦ బంధురరచనా
విహితవిచిత్రములై చన, విహరించున్ శిల్పకుండు ♦ విశ్రుతకృతులన్. 2208

—♦ రౌచికుఁడు. ♦—

క. ఒదవెడుకృతిపైఁ గలసొబ, గదలక యుండఁగ నిష్ట♦మగు నందాఁకన్
మృదుమధురరచన నువిశా,రదుఁడై సాగించునతఁడు ♦ రౌచికుఁ డెందున్. 2209

—♦ భూషణార్థి. ♦—

క. తివుటవడి నొడువునప్పుడు, వివిధాలంకారసరణి ♦ విడువక చవి గా
నవహితుఁడై కృతిచెప్పెడు, కవి యెందును భూషణార్థి♦కడుఁ బొగడొందున్.

—♦ మార్దవానుగతుఁడు. ♦—

క. సరళము లగుశబ్దములను, విరళము లగునర్థములను ♦ వీనుల కింపం
దరళత లేక రసౌఘము, లడుగఁ గృతి చెప్పు మార్దవ♦వానుగుఁ డెపుడున్.

—♦ వివేకి. ♦—

క. శ్రుతశాస్త్రాలంకార, ప్రతిభుఁడు శబ్దాదిదోష♦పటుగుణఘటనా
చతురుఁడు వివేకి నాఁ జను, నతఁడు మహాకవిశతంబు♦లందుఁ జరించున్. 2213

కావ్యా॥ చూడా॥ ఉల్లాస॥ 3 పద్య 81, 82, 83, 84, 85, 86, 87.

—♦ అష్టాదశవర్ణనలు. ♦—

మ. పుర వారాశి మహీధరర్తు శశభృ♦త్సూర్యోద యోద్యాన పు
ష్కరకేళీ మధుపాన మోహన వియో♦గ క్షేమయాన స్వయం
వర పుత్త్రోత్సవ మంత్రి దూత్య రణదో♦ర్వైక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశవర్ణనాన్వితము త♦త్కావ్యంబు భవ్యం బిలన్. 2214

కావ్యాలంకారచూడామణి, ఉల్లా॥ 3 పద్య 92.

# కవితాపాకములు.

క. పాక మనంగా నర్థని,రాకులగంభీరయుక్తి♦యది యిరుదెఱఁగై
లోకమునఁ బేర్చు ద్రాక్షా, పాకంబును నారికేళ♦పాకము ననఁగన్. 2215

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస॥ 4 పద్య 55.

ఉ. పాక ముదీరితార్థపరి♦పాక మనం దగు నందు గోస్తనీ
పాకము నారికేళఫల♦పాక మనన్ ద్వివిధంబు గోస్తనీ

పాకము సంవృతార్థపరి◆పాకనివేద్యము నారికేళ పా
కాకలనంబు గూడి నిబి◆డార్థవిచార్యము వీనిలక్ష్యముల్. 2216
నరసభూపాలీయము, ఆ 2 పద్య 85.

క. తెలియఁగ ద్రాక్షాపాకము, కలితంబుగనర్థబోధ◆కంబై తగనా ;
నిల నారికేళపాకం, బలరును మతిగూఢభావ◆మై కృష్ణనృపా. 2217
కృష్ణభూపాలీయము, పద్య 106.

## ద్రాక్షాపాకము.

శా. లీలా మన్మథ మంథరంబులుఁ గచా◆లీ లాలిత భ్రూలతా
కూలశ్రీలుఁ గపోల ఖేల దుచి తా◆కూతానురాగంబులున్
సాలస్యంబులు నైనకాతుకపరీ◆తాలోకజాలంబులన్
బాలారత్నము గీలుకొల్పె ముద మొం◆ప్పన్ విశ్వభూపాలుపై. 2218
కావ్యాలంకారచూడామణి. ఉల్లాస॥ 4 పద్య 57.

క. వాలిక లై వెలిదమ్ముల, పోలిక లై చందమామ◆పులుఁగులకును దా
మేలిక లైననిరీక్షణ, మాలికల నృసింహుఁ జూచె◆ మదవతి వేడ్కన్. 2219
నరసభూపాలీయము, ఆ 2 పద్య 86.

మ. అపురా వాతెఱ తేట ఖూబు పిఉ దొ◆య్యారంబు ముఖ్జారె గ
న్నవతళ్కుల్ భళి దంతకాంతు లరరే◆ కన్బొళ్కు లప్పప్ప కో
ప్పువిలాసం బహహా తనూరుచి బలా◆బో మ్కంద మయ్యారె యూ
రువికాసంబు సెబాసు చెల్వ మని పే◆ర్కొంగల్గె నిక్కామినిన్. 2220
ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము.

క. అందములై, వెలిదమ్ముల, చందములై, కుసుమచాప◆ సరసవిలాసా
మందములై తగువీక్షణ, బృందములను గలికి కృష్ణ◆విభు వీక్షించెదన్. 2221
కృష్ణభూపాలీయము, పద్య 107.

## నారికేళపాకము.

శా. వ్యాజాతుండు నటుండు నోలె వచి ◆శ్వేళక్షమాభర్తకున్
లజ్జాకాండపటంబుచాటున వధూ◆లావణ్య లాస్యంబులన్
సజ్జాతంబులఁ జేసి చూపెడు లస◆త్సాంగహారాళిచేఁ
బజ్జం గొండలు కామినీమణులు కు◆ప్యద్దర్పలై చూడగన్. 2222
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస॥ 4 పద్య 58.

మ. వరభూపాదులపై మనంబిడక దృ♦గ్వ్యాపార మెంతేఁ బరా
పరసందర్శననాతిభిన్న మయి చూ♦పట్టంగఁ గార్యాంతర
స్మరణం బేమియు లేక నిశ్చలత నీ♦సాంగత్యముం గోరి మా
హరిణీలోచన యాత్మయందు నరసిం♦హా నిన్నె భావించెరా. 2223

నరసభూపాలీయము, ఆ 2 పద్య 87.

సీ. సారవత్ప్రవరో♦జ్జ్వలదంఘ్రిశృంగార, నూపురం బలిబిలి ♦ గోపురంబు
గణనదుర్లభమణీ♦గణఘృణిచుంబిత, గోపురం బలిబిలి ♦ గోపురంబు
ఘనమునిజనచిరం♦తనపుణ్యసరణికి, జాఁపురం బలిబిలి ♦ గోపురంబు
కీర్తిలతాహాస్య♦కృత్పక్ష్మలాక్షికిఁ, గాఁపురం బలిబిలి ♦ గోపురంబు
గీ. కాంతచిత్రవర్ణనితాంత♦కాంతియుతవ, నీపథమధులిట్పికపిక♦నికరకలక
లారవావృత వృషభాచ♦లాగ్రమునకు, మూఁపురంబైన యలిబిలి ♦ గోపురంబు.

శా. బంధుద్వేష దవాగ్ని గంధవహముల్ ♦ పాపావలంబాజ్ఞతా
గ్రంథుల్ సంచితవిత్తభూరుహకుఠా♦రంబుల్ సుసంసారజీ
ర్ణాంధుపరిస్ఫుటపాతహేతువులు వే♦దాంతజ్ఞ ధైర్యాబ్జినీ
గంధేభంబులు వారకామినులవీ♦క్షల్ నీ వపేక్షింతువే. 2225

సీ. ఉత్తముం డురుతత్త్వ♦వేత్తయు నిర్జితేంద్రియుఁడు దుర్గనజయా♦ధికుఁడు సర్వ
శాస్త్రార్థపారగుఁ♦డస్త్రశస్త్రవినోది, సకలభూతహితుండు ♦ శాంతచిత్తుఁ
డతిథిపూజాపరుం♦డార్తావనుఁడు దయా,శాలి సముండు సు♦జ్ఞాననిష్ఠుఁ
డర్థవంతుండు స♦దాచారసంపన్నుఁ, డీపరాత్రయదూరుఁ♦డింగితజ్ఞుఁ
గీ. డన్నదానచణుండు మ♦హానుభావుఁ,డు పితృభక్తికల్పుండు ని♦ష్కపటగుణుఁడు
సత్యవచనుండు నిఖిలల♦క్షణతనుండు, శౌరికీర్తనయుతుఁడు స♦జ్జనుఁడు గాని.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 22, 681, 682.

మ. హరికాండాంచితకాండజాల పటుకాం♦డావార్యవిస్ఫూర్తికిన్
హరికాండపరిధితావతంసకరకాం♦డాభంగురప్రౌఢికిన్
హరికాండస్ఫురితప్రచారముల కో♦హో ఖిన్నయై యున్న మా
హరిణీలోచన నేలుకొమ్మ గుణహో♦రా కృష్ణభూవల్లభా. 2227

కృష్ణభూపాలీయము, పద్య 108.

—♦ కదళీపాకము. ♦—

శా. వేదోద్ధారకవేణునాదకుతుకా♦వేల్లత్కృపావీక్షణా
వేదాంతాటన వేదసాపరహితా ♦ వేత్రకృతాభీష్టలా

వేదిత్రిశోణిరమేశవేషదశకా ♦ వేదస్ఫురద్విక్రమా
వే(ధోం)డావన వేంకటాచలపతీ ♦ వేదండరక్షాకృతీ. 2228

మ. కరిసంరక్షణకామపాలనహితా ♦ కంజాక్షకాశోదరే
శ్వరతల్పాకమనీయరూపకనకా ♦ క్షుధ్వంసకారుణ్యసా
గరకళ్యాణమయాంబరాంతకటిభా ♦ గాకంపసంహారకా
తరసందోహభయాపహారికలితా ♦ తార్క్ష్యాఖ్యగోత్రాధిపా. 2229

చ. శరధిశయాన శార్ఙ్గధర ♦ శంఖశశాంకదివాకరాక్షశం
బరహర శౌరి శక్రమణి ♦ భాసురభాసిత తాటకేయశం
కరసఖశాశ్వతాశరవి ♦ ఖండితవాసవిశౌర్యధుర్య శం
బరజభవాండపాలక శ ♦ మప్రిపభద్రిమహీంద్రవల్లభా. 2230

చ. నరసఖ నవ్యరూప నర ♦ నాథశరీరగనక్రికుండలా
ధర! నగాత్మజావినుత ♦ పావననామక నందనందనా
నరహయమిత్రిచాపహర ♦ నారదగానసకౌతుకానతా
దర నవనీతచోర నయ ♦ దానవినోదర నాగభూధరా. 2231

చ. వరద వరాహరూప వసు ♦ వాసవశీకృత లోకవార్ధిభూ
వరవరుణాలయోన్మదని ♦ వారణవందితమౌనిజాలవా
సరమణిపుత్రికావ్యాదయ ♦ శాసన సోదరవాసుదేవవా
ర్ధరతనుకాంతిశోభివన ♦ దంత్యవనావరనీలశైలపా. 2232

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 379,380,381,382,383.

# కవిత్వము.

చ. సరళముగాఁగ భావములు ♦ జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి ♦ పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమ ♦ దుత్వరసంబునఁ గండలింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ ♦ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్. 2233

కుమారసంభవము, ఆ 1 పద్య 35.

క. తెలుఁగుకవిత్వము చెప్పం, దలఁచినకవి యర్థమునకుఁ ♦ దగియుండెడుమా
టలుగొని వడులుం బ్రాసం,బులు నిలుపక యొగిని బలిమి ♦ పుచ్చుట చదురే.

క. అలవడ సంస్కృతశబ్దము, తెలుఁగుబడివిశేషణంబు ♦ తేటపడంగాఁ
బలుకునెడ లింగవచనం,బులు భేదింపమికి మెచ్చు ♦ బుధజనము కృతిన్. 2235

గీ. ఎట్టికవికైనఁ దనకృతి ♦ యింపుపెంపఁ, జాలుఁ గావునఁ గావ్యంబు ♦ సరసులైన
కవులచెవులకు నెక్కినఁ ♦ గాని నమ్మఁ, డెందుఁ బరిణతిగలుగు క ♦ వీశ్వరుండు.
నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 7, 8, 9.

సీ. పొసఁగ ముత్తెపుసరు ♦ ల్ప్రోహళించినలీలఁ, దమలోన దొరయుశ ♦ బ్దములు గూర్చి
యర్థంబు వాచ్యల ♦ క్ష్యవ్యంగ్యభేదంబు, లెఱిఁగి నిర్దోషత ♦ నెసఁగఁ జేసి
రసభావములకు న ♦ ర్హంబుగ వైదర్భి, మొదలైనరీతు ల ♦ మ్మొగ నమర్చి
రీతుల కుచితంబు ♦ లై తనరారెడు, పాకంబు లింపుగాఁ ♦ బాదుకొల్పి
గీ. యమర యుపమాదులును యమ ♦ కాదులు నగు, నట్టియర్థశబ్దాలంక్రి ♦ యలు ఘటించి
కవిరఁ జెప్పంగ నేర్చు స ♦ త్కవివరునకు, వాంఛితార్థంబు లొసఁగని ♦ వారుగలరె?
కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 186.

మ. తనగన్ వ్యాకరణజ్ఞుఁ డండ్రియనుచుం ♦ దర్కజ్ఞునిం బ్రాతయం
చును మీమాంసకునిన్ నపుంసకుఁ డటం ♦ చు న్వ్రీడి దూరంబునం
గని యస్పృశ్యుని బోలె నుండదనుని వే ♦ డ్కం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరిం ♦ చున్ భావగర్భంబునన్. 2238
ముకుందవిలాసము, ఆ 2 పద్య 227.

చ. అరసి విశుద్ధశబ్దములు ♦ నర్థములన్ ధ్వనివైభవం బలం
కరణము రీతివృత్తులును ♦ కల్పన పాకము శయ్యయున్ రస
స్ఫురణము దోషదూరత యు ♦ చుంబితభావము లొప్పు చిత్రవి
స్తరమధురాశులీలకవి ♦ తల్ రచియింపఁగ నేర్చె నంతటన్. 2239
తారాశశాంకవిజయము, ఆ 3 పద్య 54.

సీ. సకలాగతత్త్వజ్ఞ ♦ శబ్దశాస్త్రజ్ఞునిఁ, గన్నతంబ్రౌఢిగ నెంచి ♦ గౌరవించు
ఘనతరసాహిత్య ♦ కల్పకు లైనట్టి, తార్కికులందు సో ♦ దరత నిల్పుఁ
బరమపుణ్యామ్నాయ ♦ పఠనశీలుర నంట, రానివారిని గదూ ♦ రతఁ జరించు
మహితధీయుతుల మీ ♦ మాంసశాస్త్రజ్ఞులఁ, బుంస్త్వహీను లటంచు ♦ బుద్ధి నెంచు
గీ. భూరినాటకకావ్యశృం ♦ గారభావ, కనదలంకారశబ్దల ♦ క్షణము లరయు
వానికడఁ జేరి మదిలోన ♦ వలపులూరఁ, దోడరి వరియించుఁ గవితావ ♦ ధూలలామ.
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

ఉ. ఆశుకవిత్వమన్న నది ♦ యా గణికాకృతి చిత్రకావ్యమో
పేశలచిత్రలేఖనమ ♦ వింతగు గర్భకవిత్వ మన్ననో

కోశగతాస్థిశోధన మ♦గుం గనబంధమెబంధమండమే
కేశవసంభవాపగగఁ ♦ గీర్తితనూర్ధ్వనికావ్య మేకమే. 2241

బిల్వేశ్వరీయము, బింబ. 1 పద్య 199.

# కావ్యము.

చ. పరగ సువర్ణబంధమృదు♦భావము గల్గియు లోనుచూడఁగాఁ
బొసఁగు చిత్రియాబమును♦బోలె నసత్కవికావ్య మిమ్మహిన్
బరగు సువర్ణబంధమృగు♦భావవిశేషము లొప్పు దెల్వులన్
సరియగు రత్నపుత్రికయు ♦ సత్కవికావ్యము నొక్కరూపమై. 2242

కుమారసంభవము, ఆ 1 పద్య 37.

క. లోకోత్తరగుణపుణ్యా, శ్లోకకథామధురిమధుర♦శుభవాఙ్మయర
త్నాకల్పం బగు కావ్యం, బాకల్పంబగుఁ గృతార్థుఁ ♦ డగుఁ గవివరుఁడున్.

శ్రీరంగమహాత్మ్యము. ఆ 1 పద్య 13.

గీ. తరుతటాకాదిసంతతు♦ల్ధరణి నెచట, నిలిపి రచటనె యుండు వా♦నికిని గృతిము
ఖంబునను విశ్వవిఖ్యాతి♦గానఁ గృతియె, సంతతివతంస మదిమాకు♦సంఘటింపు.

ఉ. కేవల కల్పనాకథలు ♦ కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వాపిరి పుట్టు రత్నము ల♦వారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు ♦ సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథ♦గా నొనరింపుము నేర్పు పెంపునన్. 2245

వసుచరిత్రము, ఆ 1 పద్య 18, 19.

మ. పరమజ్ఞానలతాలవాలము జగ♦త్ప్రఖ్యాత విఖ్యాతసా
గరచంద్రోదయ మిష్టసంఘటనరే♦ఖాదివ్యదేహాత్తనుం
బుధకార్పణ్యదశానిశాదినముఖం♦బుద్వేలనిర్వాణభ
వ్యరసాస్వాదరసాయనం బనిన గా♦వ్యం బెన్న సామాన్యమే. 2246

నరసభూపాలీయము, ఆ 1 పద్య 26.

సీ. తనయన్వయమునందు♦మును జనించినవారి, చరితమంతయుఁ బ్రశ♦స్తముగఁ జేయుఁ
దనమాతృవంశంబు ♦ జనుల పౌరుషలీల, లాస్థానవర్ణనీ♦యములు సేయుఁ
దనకు సద్బంధులై♦తనరెడువారి స,ద్వృత్తంబు లన్నియు ♦ వెలయఁ జేయుఁ
దానొనర్చిన మహో♦త్తమపౌరుషంబులు, ధరలోనఁ దగఁ బ్రసి♦ద్ధములు సేయు

గీ. వివిధశబ్దార్థచాతురీ♦విన్నయంత, కవిజనులు మెచ్చు కావ్య మె:♦క్కటియ కాదె
యట్టికావ్యంబు రచియించు♦నత(డె విపుల,భాగ్యవంతుండునిజవంశ♦పావనుండు.
సీమంతినీకళ్యాణము, ఆ 1.

సీ. రాజవిద్వత్సభా♦రంజనం బగు నెద్ది, పరదేశసంతత♦బంధు వెద్ది
సకలసంపద్బహు♦సౌఖ్యదం బగు నెద్ది, ముక్తిసాధనశుభ♦మూల మెద్ది
పాపపుణ్యజ్ఞాన♦భాజనం బగు నెద్ది, తలుగువోనిమహాప♦దార్థ మెద్ది
పటుతమోజలదప్రి♦భంజనం బగు నెద్ది, తనుభూషణంబయి ♦ తనరు నెద్ది
గీ. అట్టి యనవద్యహృద్యవి♦ద్యావిశేష, మెలమి(గని కవితాలీల ♦ నలరుచున్న
సుకవికావ్యము విరచించి♦శుభచరితు(డు, శ్రీకళత్రుని కొస(గర♦క్షింపలే(డె.
కౌసల్యాపరిణయము, ఆ 1.

మ. తెను(గుం గావ్యము( జెప్పవయ్యా మృదువై♦దేశీయమై భావమై
వినవింపై పరసత్వమై విరళమై ♦ విఖ్యాతమై కీర్తియై
జనితామోదకహృద్యపద్యకరమై ♦ సద్ధర్మమై చోద్యమై
తనరం బల్కు వె చింతయేల యనుచుం ♦ ధర్మజ్ఞ భాషింపవే. 2249
వైశ్యపురాణము, ఆ 1.

ఆ. భువి యశంబును దివి♦భోగంబు నిచ్చును, సరసకావ్యకన్య ♦ వరకవులకు(
వదనువల్లభునకు( ♦ దండిప్రికి నిహపర, వివిధసుఖము లొస(గు ♦ వెల(ది వోలె.
నారాయణాచలమాహాత్మ్యము, ఆ 1 పద్య 13.

ఉ. ద్వైతముభాతి(బెంపుగనె ♦ పట్టివెవంగక బాహ్యవృత్తిన
ద్వైతమురీతిస్వీయమను♦భావమె మాన మటంచు సంగ్రహం
బూ(తగ(బట్టకందుపయి ♦ దూదకయేదక సాంఖ్యపద్ధతిన్
ఖ్యాతిగ(జేయుకావ్యమె జ♦గన్నుతమౌ హితసత్యసంపదన్. 2251
విశ్వేశ్వరీయము, వింబ. పద్య 204.

——♦ నవరసములు. ♦——

క. ధర శృంగారము హాస్యము, కరుణయు వీరము భయాన♦కముబీభత్సం
బురురౌద్ర మద్భుతము శాం,తరసంబును రసము లన(గ ♦ దనరుం గృతులన్.
సీ. మరకతానీకదం♦భమున శృంగారంబు, హాస్యంబు ముక్తాఘ♦లౌఘరుచుల(
గరుణవిద్రుమవర్ణ♦గౌరవచ్ఛలమున, రౌద్రంబు కురువింద♦రత్నకలన
వీరంబు గోమేధి♦కారోపితస్ఫూర్తి, భయము వైడూర్యశో♦భామిషమున
భీభత్స మింద్రనీ♦లాభాగుణంబున, శాంతి నిర్మలహీర♦కాంతిగతుల

తే. నద్భుతము పుష్యరాగరా♦గావదేశ, విలసితంబున సాకార♦వృత్తిఁ గాంచి
నవరసంబులు వొల్చునీ♦భవనవీథిఁ, బ్రబల నుబలనృసింహ యో♦బయనృసింహ.

నరసభూపాలీయము, ఆ 3. పద్య 6, 153.

——♦ శృంగారరసము. ♦——

ఉ. ఇల వలరాజురూపునకు ♦ నెక్కువ యయ్యెడు విశ్వమేదినీ
లలనునిరూపయౌవనవి♦లాసములం జెలిమాటు చేరి య
గ్గలికపుసిగ్గు వేడుకల♦క్రందున కష్టపడంగ నిమ్ములన్
మెలఁతుక వాలుఁజూపులకు ♦ మేపులు పెట్టెడుఁ జూచితే సఖీ. 2254

——♦ హాస్యరసము. ♦——

క. లీనాచారుల బహుళా,లీనాత్ముల సతతసవ్య♦లీకులఁ జూడం
బూనెడు విశ్వేశ్వరుని న,వీనదరస్మితము లచ్చ♦వెన్నెలఁ బోలున్. 2255

——♦ కరుణారసము. ♦——

క. అనిఁ దృణము గఱచి జే యని, నినదించుచుఁ బొరలు విమత♦నికరముఁ గరుణన్
గనుఁగొని కాచుట నైజము, గొనకొని యరిరాయగండ♦గోపాలునకున్. 2256

——♦ రౌద్రరసము. ♦——

క. రుద్రుం డగు విమతనరో,పద్రవకరణములఁ గుపిత♦బలభద్రుఁ డగున్
ముద్రణితకదనగతి న,న్నిద్రాకృతి విశ్వమేది♦నీపతి చూడన్. 2257

——♦ వీరరసము. ♦——

క. అరివీరుల నమరావతి, కరిగించుచు వివిధ ధనము ♦ లర్థివరులకై
యురవడి నొసఁగుచుఁ బరఁగెడు, నిరతోత్సాహంబు విశ్వ♦నృపునకు యొప్పున్.

——♦ భయానకరసము. ♦——

క. రిపునృపులు విశ్వనాథ, ప్రపటుధ్వజదంష్ట్రిఁ జూచి ♦ పరఁగినభీతిన్
విపినవరాహంబుల నిల, నిపుడుం గనుఁగొనఁగ వెఱతు♦రెట్టితలఁపులో. 2259

——♦ భీభత్సరసము. ♦——

మ. అతిదృప్యత్పరగండభైరవభుజో♦ద్యత్ఖడ్గకృత్తాహిత
చ్యుత భూరిక్షతజప్రవాహములలో ♦ శుండాలరుండావలీ
కృతలీలాచరయానపాత్రములలోఁ ♦ గ్రీడించు నాయోధన
క్షితి భూతంబులు మజ్జమాంసరసమ♦స్తిష్కప్రవృత్తింబులై. 2260

—◆ అద్భుతరసము. ◆—

క. సమధిక మగు నచ్చెరు వచ్చముగా విశ్వేశుదాన◆జలధారాపూ
రముచేతఁ జేతి కందును, విమలాంబర కనకహారులు ◆ విద్వత్తతికిన్. 2261

—◆ శాంతరసము. ◆—

క. విశ్వేశుమహిమ విని కని, విశ్వంభర విడిచి మదము◆వీడ్కొని విమతుల్
శశ్వద్దమశమయుక్తిన, నశ్వరులై నిలుతు రమర ◆ సగముల నదులన్. 2262
కావ్యా.చూడా. ఉల్లా॥ 5 పద్య 60, 61, 62, 63, 64, 65, 66,67, 68.

# కృతిసమర్పణము.

సీ. ఆయురారోగ్యని◆త్యైశ్వర్యములుగల్గి, విభవంబుతో ధాత్రి ◆ వెలయుకొఱకు
ధనమునకై నరా◆ధముల సన్నుతి సేయఁ, బొడమినపాపముల్ ◆ చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశ ◆ పదపంకజములందు, నిశ్చలవృత్తితో ◆ నిలుచుకొఱకు
గౌరవంబులఁబాసి ◆ రయమున వైకుంఠ, సదనంబునకు వేడ్కఁ ◆ జనెడుకొఱకుఁ
గీ. బరమవైష్ణవజనులెల్లఁ ◆ బ్రస్తుతింప, మత్కృతంబయ్యు హరికథా◆మాన్య మగుచు
నుత్తమం బగు విష్ణుధ◆ర్మోత్తరంబు, రంగనాథున కర్పింతు ◆ రాణమెఱసి. 2263
మత్స్యపురాణము, ఆ 1 పద్య 7.

సీ. వరతరోత్ప్రేక్షాల◆వక్రమోదాత్తవి,భావనాలంకార ◆ పటిమతోడ
శయ్యాచమత్కార ◆ శబ్దస్ఫురణపదా,వృత్తి పాంచాలికా◆రీతితోడ
నుపమానపదగోప◆నోక్త్యన్నతనవయ,మకగతదీపక ◆ మహిమతోడ
నురసప్రధానవ◆స్తుప్రధానపదార్థ,పక్వముద్వ్యఫల◆పాళితోడ
గీ. సకలశృంగారలీలాభి◆సరణితోడ, వృద్ధిబొందినకృతికుమా◆రిక వివేక
హీనధనిభూతమున కిడఁ ◆ బూనుటెన్న,బూడిదెనుబోయుపన్నీరు◆పోల్కి గాదె.
కౌసల్యాపరిణయము, ఆ 1.

సీ. మత్తేభగామిని ◆ మత్తకోకిలకంఠి, శ్రీకర్ణపరసర◆సిరుహవదన
పృథివీతతనితంబ◆బింబ చంపకనాస,లలితపదాలాప◆జలదవేణి
యుత్పలగంధి ః◆ద్యున్మాలికాంగి శ్రీ,ఫలవృత్తవక్షోజ◆పాళితరళ
నయనమదన దర్ప◆ణ కపోలతలశంఖ,గళభుజంగోరువి◆గ్రహరుహాళి
గీ. యగుచు విలసిల్లుకావ్యక◆న్యకను సుకవి,లసదలంకారశయ్యార్థ ◆ లలితహర్ష
కలనఁ దేలుసరసున కీ◆వలయుఁ గాన కృతిపతినిజేతు నీమహో◆న్నతసుకృతిని.
ఓఘవతీపరిణయము, ఆ 1 పద్య 71.

# ఆశుకవితానిరసనము.

క. నిరలంకృతియును నసరస, వరపాకప్రక్రియాని♦వారితశయ్యా
విరహాకృతిబాధహీనము, ధర నాశుకవితదనరు ని♦ధవకాంతవలెన్. 2266

ఆ. ఆశుకవితయందు ♦ హావభావాదులు, శ్లేషకల్పనలును ♦ జేరకుండఁ
జేసి కవులశక్తి ♦ వాసి దొలంగును, అటులఁగామి కీర్తి ♦ యధిక మగును. 2267

క. ఆశుకవిత్వంబందున, సౌశబ్ద్యం బుండ దెపుడు ♦ సభలో దానన్
బ్రాశస్త్యహానిగలుగదె, యాశసముండైన వాని♦కెప్పుడు భువిలోన్. 2268

క. ఆలోచించని కవనం, బాలోచించంగవలయు ♦ నందఱు విబుధుల్
ఆలోచించినకవనం, బాలోచించంగవలయు ♦ నాలోచించన్. 2269

క. స్వవనము కవనము కవులకు, సువిచారతకలిగెనేని ♦ శోధింపంగన్
స్వవనము స్వవనము కవులకు, సువిచారతకలిగెనేని ♦ శోధించంగన్. 2270

(?)గీ. రసము లేనట్టి కవిత వ్యర్థంబు గాదె, ఫలమురీతిని కూపంబు ♦ పగిది గాన
రసము కలిగిన సుకవిత ♦ తానుభవము, గలిగియుండును ధరణిశ్లా♦ఘ్యంబుగాదె.

క. మండనమిశ్రినియంతటి, ఖండితపరునకునుయతియొ ♦ ఖంగం బయ్యెన్
కుండలిపతులా మఱి యా, ఖండలగురులా దలంప ♦ కవులాధునికుల్. 2272

సావిత్రీపరిణయము, పీఠిక.

# ఆశీర్వచనము.

సీ. శ్రీరస్తు శుభమస్తు ♦ ధీరస్తు విజయోస్తు, పుత్త్రరంజనమస్తు ♦ పుణ్యమస్తు
ధనమస్తు ధాన్యమ♦స్త్వనవద్యసుఖమస్తు, చిరతరసంకల్ప♦సిద్ధిరస్తు
సత్యమస్తు మహోస్తు ♦ శౌర్యమస్తుయశోస్తు, స్వస్త్యస్తు సుగుణోస్తు ♦ శక్తిరస్తు
సామ్రాజ్యమస్తు శా♦శ్వతధర్మఫలమస్తు, వృద్ధిరస్తు మహాప్ర♦సిద్ధిరస్తు
గీ. జ్ఞానమస్తు శ్రీయఃపతి ♦ ధ్యానమస్తు, గురుచరణభక్తిరస్తు స♦త్కుశలమస్తు
శాంతిరస్తు నిరంతరై♦శ్వర్యమస్తు, భాగ్యమస్తు మహాసార్వ♦భౌమ నీకు. 2273

హంసవింశతి, ఆ 1 పద్య 47.

సీ. కలశాబ్ధికాంతసం♦తతుసుండు తపనుండు, రంజితసద్ద్విజ♦రాజు రాజు
ఘటితమహోసుమం♦గళుఁడు మంగళుఁడు సం,పూజితపృథులవి♦బుధుఁడు బుధుఁడు
చితనభస్సంచార♦జీవుండు జీవుండు, దృఢదళదామ్నాయ♦భృగుఁడు భృగుఁడు
నఖిలాభ్యుదద్రిమ♦హాశనిశనిసుక,ర్మనిహితసత్పరి♦గ్రహము గ్రహము

గీ. నీతపరిపూర్ణనుజనతా♦శేతుశేతు, వెలమిఁ దగనిల్చి బ్రోతుర♦హీనరాజ్య
పూసపాట్యన్వయాబ్ధిరా♦కామధాంశు, విజయరామావనీంద్రుడు♦ద్విభవసాంద్రు.
కౌసల్యాపరిణయము, ఆ 1.

# కుశలప్రశ్న.

సీ. మా తాతముత్తలం డైన♦మనశూరుఁడున్నాఁడె, మంగళమే మన♦మాతులునకు
మోదమే నలుగురు ♦ ముగురుమేనత్తల, కానందమే వారి♦యాత్మజులకు
నకూ్రరకృతవర్మ ♦ లాయుస్సమేతులే, జీవితుఁడే యుగ్ర♦సేనవిభుఁడు
కళ్యాణయుక్తులే♦గదసారణాదులు, మాధవులమ్ములు ♦ మానధనులు
గీ. నందమేమనసత్యక♦నందనునకు, భద్రమే శంబరాసుర ♦ భంజనునకుఁ
గుశలమే బాణదనుజేంద్రు♦కూఁతుపతికి, హర్షమే పార్థమునలికి♦హాలికిబలికి.
భాగవతము. స్కం. 1 పద్య 347.

సీ. శౌనకా సుఖమె వి♦శ్వామిత్ర్రలెస్సలా,కణ్వ మంచిదియె భా♦ర్గవశుభంబె
సుత వరిణామంబె ♦ సుతిపసంతోషంబె, చ్యవన సేమమెపరా♦శర శివంబె
కపిల మంగళమె మా♦ర్కండేయ కుశలమే,వత్స సౌఖ్యమెకాత్స్యా♦యుత్సవంబె.
మాండవ్య భవ్యమే♦మైత్రేయ భద్రంబె, సుబలమేలె వశిష్ట♦శోభనంబె
గీ. శ్రితుభరద్వాజగౌతమ♦కశ్యపాత్రి, కలశసంభవ కౌండిన్య♦గర్గమంద
పాల జాబాలి రోమశ♦ప్రముఖులార, యీరలానందముగ నున్న♦వారెయిచట.
వాల్మీకిచరిత్రము, ఆ 1.

# వందనము.

సీ. చేమోడ్పులగునీకు ♦ శేషశయాన జో,హారులునీకుఁబ♦రాపరేశ
వంధనంబులునీకు ♦ వాసుదేవ, రమేశ, దండముల్ నీకు వే♦దండవరద
ప్రణతులునీకు శ్రీ♦రంగరాజముకుంద, సాష్టాంగములు నీకు ♦ సృష్టినాథ
దాస్యముల్ నీకు స♦దాస్యనిర్జితచంద్ర,నడియఁడనీకు భ♦వాభవేశ
గీ. చేరిసేవించెదము నిన్నుఁ♦జిదచిదీశ, యంజలులు నీకు సర్వహృ♦దబ్జవాస
కడునమస్కారములునీకు♦కమలనాథ,మ్రొక్కులొనరించెదమునీకుఁ♦జక్రనయ్యా.
భార్గవపురాణము, ఆ2.

సీ. చక్రపాణికి నమ♦స్కారంబుఁ గావించి, శార్ఙ్గపాణికిఁ గరాం♦జలి ఘటించి
కుంభేశ్వరునకు మ్రొ♦క్కులుగూర్చి యలసోమ, నాథులకభివంద♦నములు సేసి

సోగనాథునకుఁ బ్రణామంబు సవరించి, విశ్వనాథునకును వినతి సలిపి
అవిముక్తశివునకు సాష్టాంగదండంబు, లాచరించి మఱియు నచటఁ గలుగు
సీ. దేవతాతతికెల్లను భావశుద్ధి, చెలఁగుచుండ నమోవాకమలవరించి
యభ్రసభఁజూచు కుతుకమందభ్రలీల, నలర నష్టానిపుంగవులవలదాఁటె. 2278
వాల్మీకిచరిత్రము, ఆ 2.

# గురుఁడు.

క. గురుఁడే తల్లియుఁ దండ్రియు, గురుఁడే దైవంబు బంధుకోటియు హితులుం
గురుఁడే యని నమ్మిన సుస్థితభావుల కన్య మున్నదే చిక్కన్నా. 2279
నీలకుంతలావిలాసము, ఆ 2.

క. గురుఁడే యుత్తమదైవము, గురుఁడేగతి పాపములను గూల్చుం గురుఁడే
నరుల కది గాన సద్గురు, నరసి ప్రయత్నమున నమ్మనగు నిరతంబున్. 2280
వేంకటాచలమాహాత్మ్యము, దా॥ చిన॥ వేం॥ ఆ 3 పద్య 209.

క. విద్యోపదేశగురుఁ డన, వద్యమతినుబోధకత్వపద్ధతి వైశా
రద్యుఁడు జాతివయోమహి, మాద్యున్నతిఁ గంటనీయుఁడై యొనరవలెన్. 2281
మహేంద్రవిజయము, ఆ 2 పద్య 32.

# శిష్యుఁడు.

చ. వినయవిధేయవర్తనుఁ డవిస్మృతిశాలి యసంశయాశయుం
డనితరసక్తమాననుఁ డపార్థవిదూరుఁ డధీతపాఠవిం
తనపరుఁడున్ సుఖగ్రహణధారణగణ్యుఁడు సూక్ష్మబుద్ధి సు
ప్రసన్నుఁడు గురుప్రియుండు నగువాని నె శిష్యునిగాఁ గొనం దగున్. 2282
మహేంద్రవిజయము, ఆ 2 పద్య 33.

# గురుధర్మము.

కామహంకార వంచక, ద్వేషవిద్యా చోరదూషకులకు
పతితకార్యకృతఘ్న, కలహప్రియ విషయగర్వితులకు
నాటనమారణ, వశ్యకూహకవిద్య వాదులకును
నావ్యాకరులకు, వేదకార్యనియుక్తి సోమరులకు

గీ. వినయభయభక్తి విశ్వాస♦ఘనతచేత, గురులశుశ్రూష చేయని ♦ క్రూరులకును
స్వస్వరూపోపదేశంబు ♦ సార్వభౌమ, యెన్నివిధములకైన ని♦య్యంగరాదు. 2283

శ్రీరామస్తవరాజము, ఆ 2.

క. నరగుణ శిష్యుల పాపము, పరిహరణమొనర్చి తృప్తి♦భావము నిచ్చి స
త్కరుణను ధన్యులఁజేయుట, ధరణిని గురువ్రులకు సహజ ♦ ధర్మము గాదే. 2284

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 4.

## శిష్యధర్మము.

సీ. జడివానబట్టిన ♦ చాడ్పున వాదించు, వట్టి చదువుపోరు ♦ గట్టిపెట్టి
యుదరపోషణకొఱ♦కొండిగట్టినట్టియా, భయరూపముల నెల్లఁ ♦ బయటఁగలిపి
నానావిధన్యాయ ♦ నటనలు తనచేసె, గాన నెయ్యుండౌరులది♦గాని దెలిఁగి
యేలోకసుఖములు ♦ నైలుపచారము, లోను లోతారమన్ ♦ లోఁ దెలింగి
గీ. దేహవర్ణాశ్రమాచార♦దేశకాల, రూపరేఖాభిమానముల్ ♦ రోసి విడిచి
చిన్నపెద్దతనంబులు ♦ పిండి గలిపి, యాగ్యశుశ్రూష సేయ మో♦క్షార్థిఁ దగును.

శ్రీరామస్తవరాజము, ఆ 2.

## గురుశుశ్రూష.

సీ. నాల్గుశుశ్రూషల ♦ నడకల వేర్వేఱ, విభజింతు వినవయ్య ♦ విమలచరిత
ఆర్యాభిమతపదా♦ర్థానుకూలము సేయు, నది యాత్మశుశ్రూష♦యండ్రు బుధులు
ఆపాదమస్తకా♦భ్యంజనాతిథ్యము, లంగడున్ శుశ్రూష♦లనఁగ నొప్పు
క్షేత్రగుహారామ♦సీమలవరయుటల్, స్థానమన్ శుశ్రూష♦జాడ లాయె
గీ. తాత దైవంబు తల్లియుఁ ♦ దండ్రి కర్త, యేడుగడయును గురుఁడంచు♦నెంచి
సేయ సద్భావశుశ్రూష♦సిద్ధమిట్టు, లెఱిఁగి నడుపంగవలయును ♦ గురునిఁ

శ్రీరామస్తవరాజము,

## —♦ విద్య. ♦—

సీ. కమనీయవిద్యదాఁ♦గామధేనువుభంగిఁ, గామితార్థంబులఁ ♦ గఁ
సజ్జనవిద్వాంస♦సంఘంబులోపల, మానుగాఁ దను బెద్ద♦మాన
నెన్నిదేశంబుల♦కేఁగిన సాయమై, తల్లిచందరంబునఁ ♦ దన
బన్నుగాఁ దనపుణ్య♦పాపము లెఱిఁగించు, సాధించు

క. నగ్నిఁ గాలదు రాజుల◆కలవి గాదు, నీళ్ల నానదు చోరుల◆పాలు గాదు
అన్నదమ్ములపాళ్లకు ◆ నలవి గాదు, చెలఁగి విద్యాధనమునకుఁ ◆ జేటు లేదు. 2287

పంచతంత్రము, దూ॥ నా॥ ఆ1 పద్య 56.

ఉ. హర్తకు గాదు గోచర మ◆హర్నిశమున్ సుఖపుష్టిఁ జేయు స
త్కీర్తి ఘటించు విద్య యను ◆ దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ◆బోదు యుగాంతపువేళనైన భూ
భర్తలు తద్ధనాధికుల◆పట్టున గర్వము మాను టొప్పగున్. 2288

ఉ. భూషలు గావు మర్త్యులకు ◆ భూరిమయాంగద తారహారముల్
భూషితకేశపాశమృదు◆పుష్పసుగంధజలాభిషేకముల్
భూషలు గావు పూరుషుని ◆ భూషితుఁ జేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము ◆ భూషణముల్ నశియించు నన్నియున్. 2289

ఉ. విద్య నిగూఢగుప్తమగు ◆ విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి◆విద్య గురుండు విదేశబంధువున్
విద్య విశిష్టదైవతము ◆ విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము ◆ విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే. 2290

భర్తృహరిసుభాషితము, ॥ఏ॥ ల॥ నీతి. పద్య 14, 16, 17.

## విద్యలు-కళలు.

సీ. వేదంబు వాదంబు◆వీణాదివాద్యంబు, లాలేఖ్యకర్మంబు ◆ లాగమములు
మంత్రతంత్రంబులు ◆ మందులు మాయలు, సింధురగంధర్వ ◆ శిక్షణములు
జూదంబు ముచ్చిమి◆జోస్యంబు గానంబు, ధర్మార్థకామశా◆స్త్రములు కవిత
కావ్యనాటకములు ◆ కథలు పురాణంబు, లాయుధనైపుణ◆మంజనంబు
లాదిగా నన్నివిద్యలు ◆ నన్నికళలు, నభ్యసించిరి యౌవన◆మమరె నలరి
కుమారులఁ గనుఁగొని◆యవ్విభుండు, సమ్మదాంబుధిలోఁ గేళి◆సలుపుచుండె.

దశకుమారచరిత్రము, ఆ 2 పద్య 116.

ఋగ్యజు◆స్సామాదివేదంబు, లధికరించెను తద్ర◆హస్యజాత
లక్ష◆ణానీకముల నెల్ల, నధిగమించెను షడం◆గాంగములను
వాద◆భాష్యమీమాంసలు, తెలిసె వ్యాసమతంబు◆ తేఁటపడఁగ
యోగ◆ములమర్మములెల్ల, నాకళించెను పురా◆ణాదికముల

గీ. నేర్చెఁ జెల్లముగా దండ♦నీతిశాస్త్ర, మరసె నాద్యంతముగను వై♦ద్యాగమంబు
నెఱిఁ గసాంగధనుర్వేద ♦ మెల్లనపుడు, సోముఁ డుద్యత్కళాస్తోమ♦ధాముఁ డగుచు.

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 53.

## ధనుర్విద్యానైపుణ్యము.

చ. దోనపయిఁ బాయకెప్పుడును ♦ దూపు లెడల్పుచు నున్నరీతిఁ దాఁ
జనుమరచేర్పు నందెపుడు ♦ జారక యమ్మరిఁ బోనియున్న చా
ద్పున శ్రవణాంతసీమ నెపు♦డున్ వలయీకృతచాపమై నశిం
చినగతిఁ దోఁచెఁ దత్కరముఁ ♦ జిత్రరయంబునఁ జెక్కురూపునై. 2293

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 122.

## శకునవిద్యలు.

సీ. గౌరిపంచాంగంబు♦గౌళిపంతులపంచ, పక్షులశకునముల్ ♦ పైడికంటి
పలుకులరీతులు♦ప్రశ్నభాగంబులు, గల్యాలు నాయంగఁ♦గలుగు మేలు
కీడునుబోఁ చిళ్ళ♦జాడెఱింగడి నేర్పు, దిక్కువిదిక్కులు♦దెలిసినుడువు
దుష్కృతలక్షణములు ♦ తోడరు కాకిరవంబు, సాముద్రికస్థితి ♦ జతురగమహిమఁ
గీ. గలుగునేర్చిన యొకమహా♦ధీరవరుఁడు, శకునవిద్యావిచక్షణా♦ధికుఁడు సాంప్ర
మార్యరేఖలమాగట♦మారుఁడైన, యవనదిపజుండు మతిమంతుఁ♦డనెడివాఁడు.

హంసవింశతి, ఆ 4 పద్య 46.

## విద్యాహీనుఁడు.

ఉ. గద్యము పద్యముం జెనపఁ♦గైకొనుటొండె ధురీణప్రబంధసం
పద్యుతుఁ డౌటయొండె మృదు♦భాషల పొద్దులు పుచ్చుటొండె లో
లోద్యమలక్షణం బెరుఁగ♦టొండె గడున్ భజియించుఁ గాక యే
విద్యలు నేరఁడేని పసు♦వాతఁడె గాడె గణించి చూడఁగన్.
శా. సంగీతంబుఁ గవిత్వతత్త్వమును సౌ♦జన్యం ప్రభావంబు స
త్సాంగత్యం బెఱుఁగంగ డేని భువి నా♦శ్చర్యంబుగా వాలమున్
శృంగద్వంద్వము లేని యెద్దతఁ డనన్ ♦ జెల్లుం దృణం బాతఁడ
య్యాంగీకంబున మేయఁడా పసులభా♦గ్యం బిచ్చటం గల్గు

ద్వాత్రింశతాఁ

——♦ గురువులేనివిద్య. ♦——

ఆ. తల్లిదండ్రిలేని ♦ తనయుని పోలిక, సతికి పతియు లేని ♦ చందమునను
గురువులేనివిద్య ♦ కూడ దెందులకైన, నజునకైన నిజము ♦ యరసిచూడ. 2297

శ్రీరామస్తవరాజము, ఆ 2.

## కరణము.

చ. తెలితలపాగ చొక్కమొల♦తిత్తి భుజంబునఁ జల్వపచ్చడం
బల చిటివ్రేలిముద్రిక యొ♦య్యారము మీఱఁ బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి ప♦దాబ్జయుగంబున ముచ్చెలొప్పఁగా
నల విభుఁ డంత గ్రామకర♦ణం బటకై చనుదెంచి వేడుకన్. 2298

హంసవింశతి, ఆ 3 పద్య 93.

## కుమరి.

సీ. ఆదివరాహంబు♦మేదిని యెత్తిన, మాడ్కిఁ జొప్పడఁగఁ దా♦మన్ను మోయుఁ
బ్రథమవేళల సృష్టి♦బ్రహ్మ చేసినయట్లు, ఘటకోటు లుత్సాహ♦గరిమఁ జేయు
విష్ణువు చక్రంబు♦వేడుకఁ ద్రిప్పెడు, చాడ్పునఁ బలుమాఱు♦సారె ద్రిప్పు
బయలిపురంబులు♦భర్గుండు గాల్చిన, డంబు సూపట్టనా♦వంబుఁ గాల్చు
గీ. గపివరుఁడు పర్వతంబులు ♦ గమిచి తెచ్చి, కుప్ప లిడురీతిఁ గుండలు♦కుప్ప వెట్టు
నవి దివ్వియు ధాత కాండంబు♦లడఁచుసరణి, సాధుపదవర్తి ఘటకార♦చక్రవర్తి.
గీ. తీర్చు ఘూదెలు కులుకులు♦ త్రేటగట్లు, గరలమురువులు వడికట్లు ♦ కెరుదుకట్లు
బొద్దుటీనలు నునువులు♦మొదలు గాఁగఁ, బనులు నిర్మింపఁ గుండరీ♦సైనతండు.

హంసవింశతి, ఆ 5 పద్య 10, 13.

## గొల్లలు.

ఉ.

తెల్లనిపట్టెనామములు ♦ దీఁగెల నెట్టెములుం బడింబలన్
చెప్పులున్ జెవులఁ ♦ బింఛములున్ మొలనున్న క్రొంబ్రాకం
వన్నెగాఁ బెరుగుఁ ♦ బాలును నేతులు వీఁక వంకకా
చి శౌరిఁ గన♦వచ్చిరి కొందఱు గొల్ల లర్థితోన్. 2301

కొండ♦గోఁగుఁబువ్వలచాయ, దీవన్నెగొప్పడఁ♦బెట్లు గలిగె
చాయ♦మించు నీ తెల్లని, గురువిందపే ర్లేఁదుఁ♦గూర్పుకొంటి

నిగుఱుగప్పనిపంద్రి ♦ విప్పుకైవడి నున్న, దీకొడ్గిపూస నీ ♦ కెవ్వఁ డిచ్చెఁ
బొలసిన గబ్బుకం ♦ పులు సోఁడుముట్లైఁడు, నీనల తిరునామ ♦ మెచట దొరకె
గీ. జడలు మెడమీఁద వ్రేలెడు ♦ జల్లితోఁక, నేఁడసవరించుకొంటివి ♦ బోఁడకోడె
యనుచు నాఁడెదుమూఁధనా ♦ క్యములకలరి, శ్రీధరుఁడు హారిఁగృపనాద ♦ రించెనపుడు.

జైమినిభారతము, ఆ 3 పద్య 71, 74.

సీ. కిఱ్ఱుచెప్పులు గొప్ప ♦ గిరునామంబులు, మొలచెక్కుకత్తులు ♦ నిలువు సిగలు
కుడిముక్కుఁ గ్రమ్ములు ♦ గురువింద పేరులు, పిల్లగ్రోవులు మేటి ♦ వల్లెత్రాళ్ళు
లోరగట్టుపంచెలుఁ ♦ బెరసుఁబచ్చడములు, గారొక్కన్నులోవంక ♦ కత్తియొడళ్ళు
గుండపోగులు చిప్ప ♦ గొడ్డండ్లు సెలగోల, లొప్పారు పలువంక ♦ యుంగరములు
గీ. గలిగి వాటంబుగా నెల్ల ♦ కడలనుండి, పెల్లువిరియఁగ గిబ్బల ♦ పేడ మడఁచి
కొట్టె లిగురొత్తఁ గస్నెఁజే ♦ కొనెద మందు, మొల్లముగఁ జేరిరచటికి ♦ గొల్లలెల్ల.

నీలాసుందరీపరిణయము, ఆ 3.

సీ. కంబళి తలదుడ్డు ♦ కవ్వము మజ్జిగ, బానగొడ్డలి నుచ్చు ♦ పాఁతలగుది
కావడి యుట్లు చి ♦ క్కము సందికడియంబు, నూకలతోఁప పొ ♦ గాకుతిత్తి
బొప్పి మజ్జిగముంత ♦ బొటమంచిపిల్లల, గూఁడు దామెనత్రాడు ♦ కోఁతకత్తి
తొల్లుగట్టియుఁ జల ♦ దుబ్బ చిల్కుదుగుంజ, బూజబింబెలు వెన్న ♦ పూసచట్టి
గీ. పాలబుడిగలు వడిసెల ♦ ప్రాతమెట్లు, మలపమందులపొడిబుఱ్ఱ ♦ మన్నెముల్లు
తోలుకుళ్ళాయితొడుపును ♦ దొడ్డికంప, చుట్టుచపిరెయుఁ గొమరొప్ప ♦ సాలయునతఁడు.

హంసవింశతి, ఆ 2 పద్య 75.

## సుద్దులగొల్లలు.

ఉ. కొమ్ములు పీరణాలుజిగిఁ ♦ గుల్కెడువాత్రిల కృష్ణలీలలం
గ్రమ్మగు డాల్లు పీరుఁడగు ♦ కాటమరాజుకథానులాపముల్
బమ్మెరపుస్తకాలు ముఖ ♦ పట్టికకట్టురుమాలలు న్నెటా
సొమ్ములు నామముల్వెలయ ♦ సుద్దులగొల్లలు వచ్చి రెంతయున్.
సీ. ఘళఘళపీరణాల్ ♦ ఖళిపెళివాయించి, పోటుబోకొమ్ములు ♦ నాటన
దొనకొండగంగను ♦ దోలుత సన్నుతిఁజేసి, కృష్ణున కతిభక్తిఁ ♦ గేలు
యాదికాలపు గొంద్ర ♦ నందఱఁ గొనియాడి, తాతతండ్రులపే
బిరుదులనరుదుగాఁ ♦ జేర్కొని మోడయించి, దీపించి వీర

గీ. కులముపెద్దలకథ లామి • కొనఁగఁ జెప్పి, శివము పుట్టించి పుత్త్రిలఁ • జెందఁగలరు
వీరులను గొల్వఁ దని తెల్పి • వీడుకొల్ప, జనిరి సుద్దులగొల్లలు • సంతసిల్లి. 2308

హంసవింశతి, ఆ 2 పద్య 87, 88.

—• చండాలుఁడు. •—

సీ. నడునెత్తిఁ గొప్పుఁ గ • ర్ణములఁ గీలించిన, తెల్లనిముడుసుఁ జెం • దిరపుఁ జొట్టు
మొలఁగాసెఁ బోసెన • ముతికిపాఁతయు నందు, నడుముబిగించిన • నరపవాలు
దలనిట్టనట్టుగా • నలపియొల్లమిగాఁగఁ, జెనచిచుట్టినకావి • ప్రేలికయును
బైద్రిప్పికప్పిన • పాఁదోలుపాయయుఁ, జేనున్ననీలయా • ష్టియునుగలిగి
గీ. కోరి పసరపునంజుటి • గుదియుఁ గల్లు. బుంగయునుఁ బూనితనమేని • పోలనుకంపు
లలముకొన వీరబాహును • నాహ్వయమున, గపటచండాలవేషసం • కలితుఁ డగుచు.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక ఆ 4 పద్య 218.

—• చాకలి. •—

ద్విపద. మాసినవస్త్రముల్ • మఱివోసికొనుచు, వేవుజామున నేఁగి • వేఱొక్క రేవు
గాంచి యుదుకుచు • గడియలు చేసి, శస్త్రసమేతుఁడై • సద్భక్తి వితతి
వస్త్రముల్ రజత ప • ర్వతభాతిఁ దాల్చి, మరిగొనివచ్చుచోఁ • బురవీథిఁ బ్రజలు.

బసవపురాణము, పా॥ సో॥ ఆ 4.

ఉ. వేళ మె కోడికూతయగు • వేళలఁ జగ్గిభుజించి బండ్లుగం
గాళముకూడునిరుచవు • కారముఁ దేవిడియంపుఁ జొక్కుతో
మైలలమోపు వీఁపున స • మర్చినరేవు గుటాని నెక్కి వ
య్యాళిగఁబోవు వాఁడు విమ • లావతటాక సమీపభూమికిన్. 2309

శుకసప్తతి, ఆ 3.

—• చెనువిద్యార్థి. •—

సీ. నన్నయ్యవారలో • నామాలు దిద్దుకొ, మ్మనినవోఁ గడుపు నొ • ప్పనుచు నేడ్చి
దండమ్ము నను గుణిం • తము పెట్టరమ్మన, నంగుళిప్రణమాయె • ననుచు జుణిఁగి
ప్యాలచేఁ గాలు • సేతులు గట్టించి, తెచ్చి పద్యముఁ జెప్పఁ • దెమల కుండి
వారియును నటించు • బడి కెగ్గుకొనిపోవ, బలపంబు లేదని • పలక కుండి
చేనుండ బుగ్గలు • నులిమిటిట్టి, తొడలు నడిపెట్టి కోదండ • మదరఁ గట్టి
కట్టఁబట్టించు • ఓపుమాపుఁ, గొట్టుపెట్టుగసజ్జన • కోలడగను. 2310

సీ. గద్దించి వడి దిట్టి ◆ దిద్దుమంచును వ్రేలు, వెట్టింప నచట నే◆ బెట్టి కుందుఁ
బలుమాఱు లోయని◆పల్కుమంచును గొట్టి, చెప్పిన శిలవృత్తి ◆ దప్పకుండు
నొకటికి సెలవియ్య ◆ నుఱికి చీకటిదాఁక, జనులగాపరుల వెం◆బడిన పోదు
జనని యడుక్కొని ◆ చదువుకోఁ బొమ్మన్న, వినక వేమఱు వెక్కి◆వెక్కి యేడ్తు.
గీ. సారెపద్యపుఁబలుకపైఁ◆జముగుపూఁతు, నెప్పుడును బెద్దపలకపా◆ క్షైత్త్రఁ జేతు
బాలరామాయణముపుస్త◆కాలు దాఁతు, నేయుసజ్జనకోలలు ◆ విఱిచినైతు. 2311
క. చరికుండ పగులఁగొట్టుదుఁ, బరువడిసూత్రంబు త్రెంచి ◆ పారగనైతు
నృత్తిమఱి బలపములిచ్చినఁ, బొరి దినమును బగులఁగొట్టి ◆ పోయెనటందున్.
గీ. నన్ను బింగిలుపెట్టించు◆నాఁడె యయ్య, వారు నిద్రింపఁగాఁ జూచి ◆ చేరి యచటఁ
జింతవ్రేల్లొక్కమ్మనంచుక ◆ సిగనుగట్టి, పిడిచియుటికిటినవుగారు ◆ మిడికికూయ.
హంసవింశతి ఆ 3 పద్య 141. 142, 143, 144.

—◆ చోరుఁడు. ◆—

ఉ. పాయిదలనీలిదిండొలిపి ◆ బూడిద ముండులబంతి గాలచీ
రయు సెలగోలకత్తి భ్రమ◆రమ్ములక్రోలులు మైలమందుగో
య్యయు నురిగొ్రింకి నారసము ◆ సాదిగఁ గల్గిన సాధనంబుల
న్నియు సమకూరఁజేసికొని ◆ నేర్పున నేఁగితి ముచ్చుప్రొద్దునన్. 2314
దశకుమారచరిత్రము, ఆ 5 పద్య 72.
ద్వి. మొఱకువెండ్రుకలును ◆ ముదురుమీసములుఁ, గఱకునల్లనిమేనుఁ◆గలచోరునొకని
డడయక పుట్టించి ◆ ధాత్రీతలేశు, పడఁతిఁ గొంపింప ను◆పాయంబుఁ గఱపి
పొరిఁబొరిఁ బొమ్మన్నఁ ◆ బోయితల్గాఁకి, చిరముండ్లబంతియు ◆ సెలకట్టెకత్తి
బలపంబు భ్రమరాలఁ ◆ బట్టినకోవి, యొలికిలోపలిధూళి ◆ యొగిమైలమందు
కుఱునీలికాసెయుఁ ◆ గొంకినారసము, నొఱపుగాఁ బూని వాఁ◆డుక్కున నేఁగి
యావారణాసిపు◆రాధీశునగరు, వావిరిఁ గన్నంబు ◆ వడివేసి చొచ్చి. 2315
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భా. 2.
క. మొలనీలికాసెయును బద,ములనోరచ్చులు ధరించి ◆ మునుము దలిర్పన్
సెలగోలయు ముండ్లబంతియు, బలపముఁ గత్తియును బూని ◆ పటుసాహ
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక ఆ 5 పద్య
సీ. కలుకైనకన్నపు◆కత్తియు బలపంబు, వన్నెమీఱినయట్టి ◆ సన్న
మాటయుంతలముల్లు ◆ ముసుకు నల్లనిచేలు, కుక్క పాకట్టులు ◆ న

### —♦ తైర్థికుఁడు. ♦—

సీ. కావడిపైఁ జంటఁ♦గట్టిన యొక కావి,కాటికంబళియాత్ర♦సంచి యలర
నేతిలక్ష్మీగన్నె♦లించిన సొఱకాయ,బుఱ్ఱ లిర్వంకలఁ♦ బొసఁగి యుండ
సెగసెత్తి కుఱుచగా♦బిగియఁగట్టిన పంచె,పై బిగించినపాఁతఁ♦బట్ట యొప్ప
కుక్షిఘర్మము లట్టోపి♦ముణుఁగఁజుట్టినపట్టె,కోనల మారుతలోల్య♦మునహరింప
గీ. గానజపమున నుత్త్రాడఁ♦గావడదరి, కిఱ్ఱుకిఱ్ఱని భుజమునఁ♦గేలి సల్ప
గొప్పరుద్రాక్షమాలిక♦లక్కుంఠసీమఁ, దనరవచ్చెను దేశ్యా న♦తైర్థికుండు. 2321

హంసవింశతి, ఆ 2 పద్య 172.

### —♦ బలిజసెట్టి. ♦—

చ. సరిపెనతోడి సజ్జ పలు♦సందిటి తాయెతు లంగవస్త్రముల్
సరిగచెఱంగుపాగ విల♦సన్మణిముద్రిక లంచుకమ్ములున్
మెఱుఁగులుగుల్కు దోవతియు♦మిన్నగు నీలపుఁబోఁగుజోడు బి
త్తరపువిభూతిరేఖ లలు♦కన్ రుదురాక్కులు గల్గి భాసిలున్. 2322

హంసవింశతి, ఆ 5 పద్య 95.

### —♦ బుడబుడుక్కవాఁడు. ♦—

సీ. నొసలిపైఁజుక్కల♦మిసిమినామపురేఖ,లనువొందు భుజముపై♦నసిమి సంచి
పాలుపీనులగాజు♦నీలాలపోఁగులు, పైనొప్పుపప్పళి♦పచ్చడంబు
మెలిగొనఁ జుట్టిన♦తలపాగ చేఱఁగుంచి, పైటపేటాచుట్టు♦పట్టుసేలు
కడిఁదిమీఱఁగఁ జంక♦నిడిన బొట్టియకోల, డాకమోగెడు దుబా♦డక్క కేల
గీ. వఱల దిక్కుల నెంచి దు♦ర్వ్యాగమైన, కీడు మేలును దెల్పుచుఁ♦గేక లిడుచుఁ
గెర్లికొనుచును దనపేరు♦కేరికొనుచు, వచ్చె నచటికి దుబుడక్క♦వాఁడొకండు.

హంసవింశతి, ఆ 2 పద్య 28.

### —♦ మల్లురు. ♦—

సీ. కంబము కౌఁగిలిం♦గనుడొల్ల తాటిదం,డెములు త్రోయంగ రె♦ట్టలగవ
సంగడాల్ ఫూన బా♦జాలపురాయంబు, బరిలోడు ద్రిప్పు మేల్♦బరు
బలుగోతమఱురళిఁ♦బఁగ నురంబులఁటోకు,పడితాళములు సేయు
మెఱపుగ తిరుగుసై♦కురుచ లెత్తఁగ పోఁచ,ములలాడ

గీ. బలిమి గనిపెట్టి గంధపు◆ట్టై లెలిమట్టి, కావితివకాశదట్టులు ◆ గావుబొట్లు
మొల్లసరులొప్ప చరితాళ్రిటి◆పిల్లజాట్లు, పెద్దచేత్రాళ్లుగలజోడు◆బిరుదుజెట్లు.
గీ. కడఁగి దిశలుపగిలిధ్వనుల్ ◆ బొడముసటులు, గామిగులుమల్లజఱచిస◆లాముఁడుమ
ముందఱను నిల్వఁగాదన◆దందితక్క,రమ్ము లిరుగేలఁబూని హ◆రాకటంచు. 2325
చ. పిడిచినయంత మల్లు లటు◆వెన్కకుఁజెంగునఁబంగడింపుచున్
బడిబడిమీసలంటి మెలిఁ◆బట్టుచు దండలవిల్చి కమ్ముచున్
బిడికిసు లూదిపట్టుకొని ◆ బిట్టుగఁగేకలు వేయుచున్ బొమల్
ముడిగొనఁ బండ్లు గీటుచు స◆ముద్ధతిచేఁ జెయిసోక మీటుచున్. 2326
క. భాయీ యిదెయొకనుడిలో, మాయనుపించెదను చూడు ◆ మాయనికరిమై
చాయఁగని యొమ్మగుప్తన, చాయగగుప్తుటను పెట్టు ◆ సరిగాఁ దాకెన్. 2327
సీ. అర్తిఁ గలఁబడి◆బిత్తరులను పాత్తి, చేతులదట్టుకొ◆సెలనుజేర్చి
సుడిగాలితిరిగెడు◆వడువునవడిఁజుట్టు,కొంచుమైకొనలా◆గించివేగియు
వేగిటుంగోలాగించి◆వేగిపినమమ్ముగాఁ, బడమిమైఁబడియుంట◆లిడకలేచి
మెడలపైఁ గర్వౄరు◆లిడి పులుల్ పలెతాగిటఁ, జిక్కిపఖమ్ములఁ◆జిమ్ముకరణి
గీ. రెమ్మచుకు పొంచములు గూర్చి◆రెండుకడల,నిరికిగిళక తైరలుగట్టు◆తైటఁగికపాడ
తిరుగఁబడి కుమలతగగుల్ ◆దీకొనుగతి, నురిగితలఁదల:దాకించు◆నొకరొకరు.

ఉ. కొక్కెసచేబిగింప మెడ◆గొబ్బునకేల్వడిఁ నెట్టి దీసి మే
లొక్కెక్కితబట్టి త్రిప్పి చెయి◆గాపునదుమ్మక గొడుప్రక్కలన్
డొక్కరసందువేగియఁ దొడ◆నొక్కుచు సందెడఁజేసి త్రోసి వెన్
జక్కనురొటమెక్కి పడి◆జాతికడంబడఁ బెంకఁ బొర్లఁగన్. 2329
సీ. వడిగకర్లమునడు◆వచ్చి చక్కఁగకాళ్లు, వెనుకకు నినుడింప◆వెంబడిగను
మోకాళ్ళవంచి తె◆గ్నానబోటవ్రేళ్ళచే, తిరుకాళదూర్చి యొ◆త్తి పొరలించి
పరసుకయొరారొఁ◆బరిబడి పొరలించి, యొకకేలఁగుత్తుక ◆ నొడిసిపట్టి
ముడిగిగడ్డముకిందు ◆ ముష్టియూనించి యుం,కిణిగొట్టి సీసాన ◆ కినిసినిలువఁ
కలను చేతు లునిచి పై◆చక్కి నెత్తి, తలకు సందిలితప్పించి ◆ తొలఁగిలేచి
కాయించఁజూచి యా◆వీరజెట్లు, కెలమి బిరుదులొసంగి వీ◆డ్కొలిపియంత.
(ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, 82—88.

గలుపల ◆ బెడిదంపు గతినవే, పరకుసేయని యుర◆స్సులలతోడ
◆ కంబాలతో మాలు, మలయుబాహువులయ◆గ్గలికతోడఁ

బరమల్లజయలబ్ధి ♦ బిరుదమాల్యములతోఁ, బరగు ముంజేతుల ♦ గరిమతోడ
నగధాతువస్త్రప్రక్రి♦యాశోభిగజలీల, నగు నెన్నడుముల ♦ గరిమతోడఁ.
గీ. బొలుపు మీఱుచు నెగుభుజం♦బులకుఁగట్టి,జమిలిమూఁపురములతోడ♦నమరుమల్లు
రంపుటాఁబోతులును బోలెఁ ♦ జెంపమీఱు,జెల్లుచను దెంచిరా నృపు♦సేవకాళి.

పరమయోగివిలాసము, ఆ 3 పద్య 48.

## —♦ మాస్టీఁడు. ♦—

సీ. తలపాగపారమీఁదఁ ♦ జెలఁగెడు నాయుధా,ర్చన సల్పినట్టినా♦సనపుఁబూవు
నెడమచే గోలునును ♦ దోడపుఁగత్తియుఁ బూల, బిరుసోందు కుడికేలఁ♦బెద్దకత్తి
దట్టితోఁ జెక్కు_ని♦ద్దావంకి కునుమపూ,వన్నియదుప్పటి ♦ వల్లెవాటు
భుజములు విరులచేఁ ♦ బూజించు బోడిక,ల్కురునైన ముందటి♦బిరుదుడవిణ
గీ. దండహంవీరతలగుండు ♦ గండడాచుచుఁ, బద్యము పఠించుశీతంబు♦బంట్లుఁ జూడ
మాగికొను పౌరజనులగుం♦పులు జెలంగ, నతఁడుదొరకొల్వుచేసె గే♦హమునకరుగ.

శుకసప్తతి, ఆ 3.

## —♦ రాజసేవకులు. ♦—

చ. అలఘుతరాఘదోగ్రకలి♦యందును నైజపు ధర్మపద్ధతిన్
నిలిచి పవిత్రత న్వదలి ♦ నిశ్చలబుద్ధిఁ బరోపకారులై
చెలిమి బహుప్రజావనము ♦ సేయుటయందు నె బద్ధదీక్షులై
కొలుతురు వీరు రాజుల న♦కుంఠితసౌఖ్యనిరాసభావులై. 2333
సీ. అవికలంబైనసం♦ధ్యావిధి వీరికి, లేశమాత్రింబైన ♦ లేదు మిగుల
నచ్యుతసంగంబు♦నైనలేదు కణంబు, స్వస్వకాలమునందు ♦ సవననియమ
ముల నొనర్చుటలేదు ♦ తలఁపనొకప్పుడు, వేదాధ్యయనచింత ♦ లేదు చూడ
సన్నపానాదులు ♦ నాఁకటిసమయాన, నవకాశ మేచాల ♦ దాహరింప
గీ. నిలిచి సుఖనిద్రఁ గావింప ♦ నిమిషమైన, సమయమేకల్గకుండు నే♦సమయమందు
నిష్టులనుజూచి భాషించు♦టేఱుపడదు, మహిపతులసేవఁ గావించు♦మానవు

విశ్వగుణాదర్శము, ల. బుక్క_. చిన.

## —♦ రెడ్డి. ♦—

సీ. కమ్మిపచ్చడమును ♦ గంటేలపోఁగులు, మొలఁజీటికమ్ములు ♦ మ
నిండుచల్వచుమాలు♦రెండొంకుటుంగరం,బులుఁజుక్క_బొట్టు

గందంపునునుఁబూఁత ♦ కర్ణయుగంబున, నేర్పుగాఁ జెమ్మగ♦ న్నెనుపూలు
కత్తెరగండంబు ♦ గజ్జెలు నందెలు, నాదించుజిగిపక♦లాకెతిత్తి
గీ. పాదములఁ గిల్కుకిల్లని♦పలుకుమెట్లు, గుమ్మటద్దాలుచేపట్టు♦గోల యమర
రెడ్డిప్రియురాలివాకిటఁ♦జేరి నిలిచి, వాకిలి సడల్పుమనుచుఁబి♦ల్వంగనపుడు.

హంసవింశతి, ఆ 3 పద్య 90.

## —♦ దరిద్రుఁడు. ♦—

సీ. చేయప్పులనుచునిచ్చినవారు కటువుగా, నడుగ నుంకించి నో♦రాడ కరుగ
నెవరైనచుట్టాల♦మనుచు వచ్చినవారు, బడలిక చేతఁ జె♦ప్పకయె చనఁగ
నాయవారంబున♦కనుచుఁ జేరినవారు, పరిహసింపకము న్నె ♦ తిరిగిపోవ
నెక్కలెడగోగంచు ♦ నేతెంచువారు మా,టాడిమాడక వేగ♦మవలి కేగ
గీ. శిశువు లెల్లను గలవాని♦చిన్నవాండ్రు, తినెడిదిఱుతిండిగని యది♦తెమ్మటంచు
గీజుపోరుట కెడఁ బెల్ల♦గిల్లఁబొగిలిపొలఁతియూరార్పనతఁడు కాఁ♦పురము సేయు.

శుకసప్తతి, ఆ 3.

## —♦ దాసరి. ♦—

సీ. చేమాకుతాళము♦చెల్లలగ గొండుల జేసు,లుంచి యందఱ వెక్కి♦రించుకొనుచుఁ
బుగ్గధూపమున దీ♦పపుఁగోలరాఁజహా,స్తము సాఁచి జేగంట ♦ చఱచికొనుచుఁ
డలయోరిగిలఁ గుచ్చికి ♦ తప్పెటగతికి వా,యుంచి గంగెద్దు నా♦డించుకొనుచుఁ
దిరువడిసానుల బెరసిగంటలు మోగ, బోడచప్పగముల♦ నాడికొనుచుఁ
గీ. ద్రోవఁగూర్చుండిబొంతలు♦ద్రోలఁబఱచి,యుదురుబెండలకోరఁ గా♦ముసుఁగుఁజేర్చి
ఊర్కిదండలు మెఱయించి ♦ పాడుకొనుచు, నలరు దాసర్లు నీక్షించి♦యూరికడను.

చంద్రభానుచరిత్రము, ఆ 5 పద్య 45.

## —♦ చెడ్డపుత్రుఁడు. ♦—

కడిమిరాఁదఁ బడురావి♦కడిలోని చెడు గీఁగ, పుణ్యనదీతీర్థ♦మునను మొసలి
కిలోఁ గొఁదెవెంట్రు♦కయు రచ్చముజ్జని, బ్రిహ్మరాక్షసి కాపు♦రమ్ము సేయు
మను దాఁచు♦పాము కల్పకుజంబు, కడ గచ్చపొదపాల ♦ కడలివిషము
జిచ్చు డి♦వ్యౌషధికినిఁ బుప్పి, ఖ్రితువు బాలెడునింటఁ♦బరశురాము
నగుద్రిడ్డు సౌస్యమున మల్లె,జీవితతికి రోగంబు ♦ చెఱకు వెన్ను
పునందు♦మూర్ఖంబు,పుట్టుచందానఁబుట్టెను♦పుత్రుఁడొకఁడు.

రయొట్టిచుట్టం బేని ♦ యింటికి కేతేర రెం,డవసూతకముఁ దెల్పి♦ యవలఁ జోనుపు
మును పరిత్రిశితము చే♦సినపైఁడిరాకున్న, ముచ్చిచ్చునను వేఁగు ♦ వచ్చు దనుక
గీ. వనరు "శాకాయలవణాయ♦వా" యటంచు, జెనఁగుఁ ధూళీశపరగృహాద♦పి యనువాసు
ముంచియాగనుఁగాటుపా♦మునకుబలియు, నొసఁగఁడనిభర్త్రికి పాక్కు♦నుపిరమదిని.

పాండురంగమాహాత్మ్యము, ఆ 4 పద్య 220.

## —♦ లుబ్ధబ్రాహ్మణుఁడు. ♦—

సీ. సంతలోఁ బిత్తి ద♦ప్పము లెత్తి నూటొలు, వగల జన్నిదములు♦ వడికి వడికి
నికట కానన భూము♦లకు నేఁగి మత్స్యయా,కులు దెచ్చి విస్తళ్ల్ ♦ గూర్చిగూర్చి
శాకపురీషముల్ ♦ పల్లె బోవులకీరు, చేఁదిపోయుచు పైరు♦ చేసిచేసి
వేకువ సంగళ్ళ♦కు క్రియావేళల, జాఱిన మిరియంబు ♦ లేఱియేఱి
గీ. యన్నియునువిక్రయించిభా♦ర్యాకుమార, ముఖ్యులాఁకటఁ గ్రొగ్గిన♦ మొగము జూడఁ
డాసపడి యేమికోరిన♦ నాగ్రహించు, బందెములు తెంచుకొనిదబ్బ♦జన్మశీలుఁడు.

శుకసప్తతి, ఆ 4.

## —♦ లుబ్ధవైశ్యుఁడు. ♦—

గీ ద్వాదశీనమానసంక్రాంతి♦శతినిగ్రహణ, మవ్యతీపాతయమహోద♦యములనొక్క
కాసు భూసురునకనీఁడు♦ గానిగడన, గోరుధనవంతుఁడె వైశ్యన♦య్యారు జాండు.
క. ఆదాయమునకుఁడగినది, లేదాయెనె వెచ్చ మంత♦ లేదాయెనెమా
టాదాయొదనిధియను, తేదాయ గడయ్య యక్క♦తినచిత్తునకున్. 2347
ఉ. కట్టఁడు యోగ్యశాటిఁ బొడ♦ కట్టఁడు రాచనగళ్ళకుం జెవిం
బెట్టఁడు కీర్తి తోరమిడి ♦ పేర్కొనుచో నరకాసు బేరముం
బెట్టఁడు ధర్మచింత సరి♦ పెట్టఁడు గట్టిమనంబు దిట్ట డ
క్కట్టిడివైశ్యుఁ డన్యుల క♦గణ్యముగాఁగఁ గణించె రొక్కమున్. 2348
వ మొక కూర గాని మఱి♦ తేఁకుఁడు శాకము లంచుఁ బల్కు వం
పలు గూరఁ గాంచి ఖగ♦ డింపఁగఁ దోచ్చునటంచు వాని నొం
జియింపఁ జెట్టి కడ♦ నిచ్చు భుజించెద రింటివార ల
శాకసూపకల♦ మాన్నఘృతాదుల నాఁడేయుంగమిన్. 2349
క్రమి టెకని, కసరు నెన్నయిగొనఁడు పఁడుగి♦ను గొయ్యకూరే
గల్గరు, మసరుంగనఁ గిలనిలోభ♦ మున కేమండున్. 2350

క. పచ్చనియాకుం దానికిఁ, బుచ్చినగొంటొకటి నములుఁ బోవెంటఁ బూనం
దెచ్చి మాయనొయని తెలి, పచ్చడ మటువెట్టి యింటి పంచెన తిరుగున్.

మ. కరఁగుండాఁబొరుగమ్మకాన కెదురం గళ్ళం గొనంబోవ దృ
క్కురసంజ్ఞన్ మగలించి వారలకిడున్ గాపెచ్చుగా బేరముల్
తెరవాటిందటి వీడు వెచ్చమునకున్ లేకున్న నేమాయె ని
త్తురుగా కొయ్యన నంచుఁ బోక యాడకొత్తుం జేతి కిచ్చున్వడిన్. 2352

మ. పడికొంచెంబుగ రాచు నుప్పుడులకుం బొసీయ మర్పించుఁ ద
క్కెడ గట్టుం దిన మెచ్చు గుందులుగఁ బూన్కెన్ నేతిలోనూనియల్
మిడుచు న్నానియ నాముదంబుఁ గలపున్ మేలాముదంబందు నె
ల్మిడి నించుం గదియించుఁ బ్రిఁదపడు హాళిం గొత్తబియ్యంబునన్. 2353

క. తా బేదఁకప్పు వెట్టెడి, గోఁబొతిక వడ్డిఁగొలుచు నుమ్మడ్డుగకున్
బ్రాఁచిచ్చపడిని గాసక, టేఁబోఁడీతఁడుగ వెచ్చ మిడుగుదు వడుగున్. 2354

క. కాంతుల సొమ్ములు వెలచేఁ, గొంత పడిం గొంత కొలను గొంత హుణాచిన్
గొంత హరించుఁగువాళిపు, దొంతర నైష్యందు పశ్యతో హరుఁడుగదా. 2355

గీ. క్రొత్త తిరువాదిఁగని ప్రాత మూకయంచుఁ, బ్రాతహాణఁ జూచి నాడెంపుఁ బణమటంచు
నాణె మొరయుంచు నొరయైన నాగరంబు, ధవళి నెడవెట్టటంచు వట్టంబుఁ దినియు.

బహులాశ్వచరిత్రము, ఆ 5.

## —♦ ముష్టిబ్రాహ్మణుఁడు. ♦—

సీ. దేవురించుచువాజె జే జెడు మొగమును, బడఁ బొలుచుండెడి బడుగుటొడలుఁ
బొలుపేది మెదుకకంపునుసీను సిగయును, బల్లమీసములును బిల్లికనులుఁ
జీంబోతుగడ్డంబుఁ జెడ్డచూపులుఁ జాలఁ, జిపికినకోలయుఁ జింపిగోడుగు
బాఁతదోవతులును బంచాంగమును ఫాలఫలమునఁ బట్టెవర్ణనముఁ గలిగి

గీ. ముష్టియెత్తిన ధాన్యముల్ ముడిచినట్టి, ముఱికిబట్టలు మూఁపుపైఁ దఱచు వేఁ
సేవ మొనరించు మాయామహీసురప్పఁ, గాలకౌశికుఁ జూచె భూపాలకుండు

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 4 పద్య.

## —♦ వైదికుఁడు. ♦—

సీ. అఱుతఁ గీల్కొన్న ముత్యరములతావళి, యంసాగ్రమునగోనె
కట్టిన ముతకనీరు కావిధోవతియు నాపై బిగించినయతి

తలచుట్టుకొన్న చిం◆పులపైరవాసంబు, చెమటచేఁ గరఁగెడు ◆ నేసబొట్టు
మూరెడుబుఱ్ఱలో ◆ మంత్రాక్షతంబులు, పదముల జిడ్డోడు ◆ పాదరక్ష
గీ. లాడిపిపంచాంగ మొకకేలఁ ◆ బొడుపుఱ్ఱవేల, వెండియుంగరమును మెడ◆ ఱ్ఱవేలునుతికి
జందెములు నవ్యయాచ్యుత◆స్మరణయును, నీవుఁ గనుపింపఁ బాఱు తెంచెఁ◆జేనికడపు.

శుకసప్తతి, ఆ 2.

## —◆ నింద్యవైదికుఁడు. ◆—

సీ. పంచాంగములు సెప్పి ◆ బాజారుబోపల, రంజిల్ల యాయవా◆రంబు లెత్తి
తలనీరుఁ దమంత్రతౌక్ష◆తములుంచి కలకాఁపు, టిండ్ల పుణ్యాహవా◆చనము సెప్పి
గ్రహణసంక్రమణకా◆కాలంబులను రొంపు, నగరు లాశ్రయించి దా◆నములు పట్టి
తిలలు దర్భలు పూని ◆ తీర్థసన్నిధి మంత్ర, ములు సెప్ప నీటుకా◆నులు గడించి
గీ. జన్మదినములమిత్ర గ్రహశాంతి◆జపముఁ జేసి, శవములను మోచి దుర్దాన◆సమితి కొగ్గి
పచ్చిపాదాయములు గ్రాస◆వాసములకు, గాఁగ దినములు గడపె న◆క్కాలమునను.

హంసవింశతి, ఆ 2 పద్య 152.

## —◆ పేదనియోగి. ◆—

గీ. పరకతలగుడ్డ యొకపాటి ◆ పచ్చడంబు, ముఱుక నీర్కావిపంచె వలి◆ మొలనుసంచి
తిత్తి వెండుంగరము వ్రేల ◆ హత్తియుప్ప, నుండు శనుఁడచు పేదని◆యోగి యొకఁడు.
సీ. క్షేత్రభూతంబుల◆స్థితులు వర్ణించి, పావ్యగణితోక్త◆సంఖ్య జేసి
మిశ్రితగణితార్థ ◆ మిళితమునన్ముఁడై, శ్రేఢీప్రకీర్ణక◆గణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంత◆సారాంశము గ్రహించి, కూటగణితముఁ ◆ జొచ్చి కలఁచి
మఱిభిన్నగణితంబు◆మార్గ మెల్లను గాంచి, పరగణితంబులు ◆ పారఁజూచి
గీ. నిఖిలసిద్ధాంతసూత్రము◆ లేర్చి జగతి, గణకకులసార్వభౌముఁడై◆గణనకుఁ దగి
గణితమర్మజ్ఞుఁడితఁడని◆ఘనులు మెచ్చఁ, దెలిసియతఁడెంత లెక్కైనఁ◆దేటపఱచు.

హంసవింశతి, ఆ 5 పద్య 26, 27.

## —◆ శైవబ్రాహ్మణుఁడు. ◆—

సీ. పంచాక్షరీపూత◆భసితత్రిపుండ్రాంకి, తాంకభాగములు సొ◆సాక్షశిఖయుఁ
క్రమకృతగ్రంధిసూ◆త్రవాపితరుద్రాక్ష, భూషణంబులు శైవ◆భావనములు
సాగుల్ఫలంబమా◆నాంబుకోణంబైన, తోత్రంబు నుపవీత◆సూత్రయుగము
గగన్మహీతాభిషే◆కక్షీరసంపూర్ణ, భాండంబుఁ బుష్ప◆పేటకంబుఁ

గీ. గుండభొజ్జయు నొకపాటి ♦ గుజ్జురూపు, నుత్తరీయంబుఁ బసరంగ ♦ యోగిహృదయ
గోచరునిఁ గొల్వ శివచిహ్న ♦ గోచరాంకుఁ, డొకఁడు వచ్చె శివబ్రాహ్మ ♦ ణోత్తముండు.
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 94.

—♦ ముగ్ధుఁడు. ♦—

సీ. మెలిఁబెట్టి చుట్టిన ♦ తెల్లిపైఠిణీపాగ, చెవిసందిపాగలోఁ ♦ జెక్కుకలము
దొడిగిన చెఱిచల్వ ♦ నడుము నంగీజోడు, జీరాడు నడికట్టు ♦ చెఱఁగు కొనలుఁ
బదతలంబుల నెఱ్ఱి ♦ పాఱు పాపోసులు, టెక్కుగాఁ జంకఁ జీ ♦ టీఖలీతి
నడికట్టులో మొల ♦ నిడిన కలందాను, హస్తాగ్రమున వేళ్లు ♦ దస్త్రంబు
గీ. మించు బాహుపుమీఁదఁ గా ♦ శ్మీరశాలుఁ, జెవులను త్యాలపోగులుఁ ♦ జెలువు దనర
నలఁతి నీర్కావిధోవతి ♦ యమర నటకుఁ, బానుపత్యంబు సేయు వ్యా ♦ పారి వచ్చె.
హంసవింశతి, ఆ 2 పద్య 29.

—♦ వేదోపాధ్యాయుఁడు. ♦—

సీ. పదవర్ణస్వర ♦ ప్రకటనం బెంతయు, నింపు మీఱంగ రు ♦ క్స్వచ్ఛి యిచ్చి
తగనుదాత్తాదిభే ♦ దములు గంటకపర్వఁ, గను బొమ్మ చేష్టలఁ ♦ గఱపి కఱపి
యొడనెడలఁ గవ్వఁ ♦ దడబడకుండంగ, గుఱుతులు మదిఁ బాదు ♦ కొలిపి కొలిపి
నిజశిక్షలోఁ బ్రబ్బి ♦ నిలకడ విస్వరములు, పలికిన బుగ్గలు ♦ నులిమి నులిమి
ఆ. యొక్క మండపమున ♦ నుజ్జ్వలబ్రహ్మవ, ర్చసముతోడ బ్రహ్మ ♦ చారులకును
బరమనియమవృత్తిఁ ♦ బరఁత వేదముఁ జెప్పు, చున్నయట్టి యొక్క ♦ యొజ్జఁ గంటి.
కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 41.

—♦ వైష్ణవులు. ♦—

సీ. శ్రీమహితాష్టాక్ష ♦ రీమంత్రజపపరా, యణుల నారాయణ ♦ ధ్యానపరుల
దేవతాంతరచింత ♦ నావిదూరులఁ గామ, రోషాదిరహితుల ♦ రూఢమతులఁ
జిదచిదీశ్వరతత్త్వ ♦ విదులఁ ద్రైలోక్యపా, వనచరిత్రుల బుధ ♦ వంద్యపదుల
నకలంకశీలుర ♦ నఖిలశ్రుతిస్మృతి, శాస్త్రపురాణవి ♦ జ్ఞానఘనులఁ
గీ. దమకుఁ జక్రికి నిత్యసి ♦ ద్ధంబులైన, శేషశేషిత్వములు చింత ♦ చేసికొనుచు
నతనిదాస్యంబు గతి గాఁగ ♦ నరయు పరమ, వైష్ణవులఁ గంటి సభయై ప ♦ రివర్తిలంగ.
కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 33.

సీ. కరుణాసముద్రులు ♦ కమనీయమూర్తులు. ఘనజననుతులు జ ♦ గత్పవిత్ర
చరితులు దేవతాం ♦ తరభక్తిరహితులు, సర్వైకకైంకర్య ♦ చతురమతులు

శ్రీమదష్టాక్షరీ♦నామమంత్ర జపాళి,రాములు సద్గుణ♦ధాము లమల
చారులు శ్రీమతే♦నారాయణాయన,మో యని సతతంబు ♦ గేయముగను
గీ. బల్కువారలు ద్రావిడ♦బ్రహ్మతత్త్వ,బోధకులు శేషశేషిత్వ♦పూర్తికలిత
జీవపరమాత్మవేదులు ♦ చిదచిదీశ్వ,రజ్ఞు లైనట్టి వైష్ణవా♦గ్రణులు వేడ్క. 2366

భార్గవపురాణము, ఆ 4.

—♦ సాతాని. ♦—

సీ. పట్టెంబుట్టముఁ జుట్టి♦నట్టి బోడిశిరంబు,పై నొప్పు నకే యం♦పాళి పిన్నకటి
యిరుకక్షములలోని ♦ తిరునామములపుస్త,కమునను దాళవృం♦తమున రెండు
కాంద్రకటీప్రాంత ♦ శునకభీతినిగుడి,కేలఁదాల్చిన తిరు♦కోలనొకటి
దాచేతిదారుఖండ♦డపుఁ దాళయుగి రెండు, స్వపవిత్రీకంబులఁ ♦ బడియు రెండు
గీ. గుణ నష్టాదశోర్ధ్వపుం♦డ్రములుదమకు, నమరనత్యర్థవైష్ణవ♦త్వము ఘటిల్ల
శికిర మొత్తంగ సాతాని ♦ పిండు దిరుగుఁ,వగ ధనుర్మాసవాసరాం♦తముల నపుడు.

మహేంద్రవిజయము, ఆ 2 పద్య 100.

—♦ సువర్ణవర్తకుఁడు. ♦—

ఉ. మైనపుటంటుపల్లెగల ♦ మచ్చులచాలొరగల్లుకట్టెలున్
దూనికనాలు నేన్బొరల♦తోఁ దగువస్త్రములోన నున్న నా
నానగిరోప్యకంబులను ♦ నాణెము లుండెడునంచిఁగొంచు బే
రానకువచ్చు నన్నయధు♦రంధరుఁ డంగటికిం గణింపఁగన్. 2368

శుకసప్తతి, ఆ 1.

—♦ స్వర్ణకారుఁడు. ♦—

చ. కమటముకట్లపంచి యొర♦గల్లును గత్తెర సుత్తె చిర్రముల్
ధమనియుఁ శాణవణంబు మొల♦త్రాసును బట్టెడ నీరుకారు శా
ణము పలుకారు మూస బలు♦నాణెపరీక్షలమచ్చు లాదిగా
నమరఁగ భద్రకారక స♦మాహ్వయుఁ డొండొకఁ డుండు నచ్చరిన్. 2369
చ. కరుఁగను బోతఁ బోయఁగను ♦ గ్రాఁచి కదించను గమ్మిదీయఁగా
నొరయఁగ వన్నెయ ల్మిగుల ♦ నుండఁగఁ జూపఁగ బూడగట్టురే
కరయఁగనీరఁ జెక్కఁబడి ♦ యచ్చునవేయఁగ సుద్దగించఁగా
సొరిదివిచిత్రచిత్రముగ ♦ సొమ్ములుసేయు నతండు నేరిచెన్. 2370

హంసవింశతి, ఆ పద్య 181 182.

సీ. దంటైనగర్భగృ♦హం బంతరాళికం,బును ముఖమంటపం♦బును జెలంగ
గాలిమంటపము ప్రా♦కారంబులోలిలు, బోదెలు చుట్టలు ♦ పొందుపడఁగఁ
గప్పుటచట్టము♦ల్గనగోపురమ్ములు, జగతియుఁ జప్పట♦ల్గానగనుగులుక
గచ్చుగోడలు రాతి ♦ కంబము ల్వాలసు,న్నము సువర్ణముద్వార♦సమితి వెలయు
గీ. దృష్టిపాత్రిపుబొమ్మలు ♦ దేజరిల్ల, నులుకుసింగంబులంగూర్పు♦ మెలుఁగుఁదోర
ణములు చిత్రవ్యాఘ్రంబనుల్ ♦రమణకెక్క, దేవళము మించెనత్యంత♦దివ్యముగను.

హంసవింశతి, ఆ 1 పద్య 180.

సీ. రూఢిగాబహువిధ♦రుద్రసూక్తంబుల, శివునభిషేకంబు ♦ సేయువారు
గంధపుష్పాక్షతా♦గరుధూపదీపనై, వేద్యంబులిచ్చి సే♦వించువారు
శివునిసన్నిధిఁ బ్రద♦క్షిణపూర్వకంబుగా, మునుకొని పలుమాఱు♦ మ్రొక్కువారు
స్కాందపురాణాది ♦ శైవాగమము లెల్ల, వీనులకింపుగా ♦ వినెడువారు
గీ. నీలగళుపాటవినుచుమై ♦ సోలువారు, శంఖమర్దళధ్వానముల్ ♦ సలుపువారు
నగుటఁ గని చోరుఁ డలరుల♦కరుగుచోటిని, లలితమైనట్టి యాశివా♦లయమునందు.

శివరాత్రిమాహాత్మ్యము, లో. సో. ఆ 2.

ఉ. నీలకవాటము ల్మెఱుఁగు ♦ నిద్దపుపచ్చలమెట్లు రిక్కరా
రాలహారంగుగూర్చు మగ♦రాళ్ళగులం దవులించుమట్టుపే
టాలు జగావెలుంగుపగ♦డా ల్గుడుకంబము లొప్పుట్టి దే
వాలయ మొక్కటిమ్ముగ ధ♦రాధవుఁ డత్తఱిఁ గాంచె మెచ్చుచున్. 2539

శకుంతలాపరిణయము, పి. వేం. ఆ 2.

సీ. శుంభత్స్వర్ణమయా♦స్తంభగుంభితశాల, కుంభపాంచాలికా♦సంభకాంతి
దుర్వారపర్వాప్తి ♦ నిర్వానిర్వాపం, ఘూర్వాహచ్ఛలౌఘ్య♦ఖర్వోల
డిండిరఘనఖండ ♦ మండలీఖండనో,ద్దండముక్తోల్లాభ♦మండలాభ
కాంచనమంటప♦సంచయాఢ్యంబిది, చంచలలోచనా ♦ చంచలమది
గీ. వెలయఁ జెలువందుకోవెల ♦ నలరు సకల, సురవరనికరసంతత♦వరదుపళిత
జలజదళతులితనయను♦జగదధీశుఁ, గని నుతించి మునీంద్రులు♦ననిరి వేడ్క. 2540

సర్వకామదాపరిణయము, ఆ 2.

## —♦ గ్రామదేవతాలయము. ♦—

సీ. కాఁపుగుబ్బెతలు పొం♦గళ్లువెట్టినపాల, కడవచారికలపో♦క్కళ్లతోలు
వారలుదెప్పించి బం♦తులుగట్టి యర్పింపు, పాకెట్ల నెత్తుర♦బుగదిరొంపి

కొక్కెచేఁ గ్లనభుజంగు లొసంగఁజెఱికిన, కుక్కుటపటలంబు కొక్కెగుంపు
మంత్రిముల్ ఫలియింప మాంత్రికుల్ పయిచేతి,వన్నెయుంచినపంచవన్నెకోళ్లు

గీ. పరిగ గుగ్గులగురుధూప పరిమళంబు, శాకినీడాకినీభూత సంభ్రమంబు
చరదితపాణిమృత్తికా తురగచయము, నలమఁ గాగంగగుడిఁజేర నరుగునపుడు.

శుకసప్తతి, ఆ 2.

## జాతర.

క. ఆతఱిఁ దన్నగరీపతి, జాతరసాటించెఁ బశువిసర మవితరసా
ధ్యాతతవాతామయని, ష్ఠాతాహాతిఁ దూల గాలి గంగల కెల్లన్. 2542

సీ. గోర్వచ్చచమురంటుకొని రిమస్తకముల, జలక మాడిరి నిశామిళితవారి
కట్టిరి చిఱుతచౌకముల క్రొంబట్టముల్, కాటుకదీర్చిరి కన్నుఁగవల
దిద్దిరి సిందూరతిలకంబు బటువుగా, నిక్కఁగొప్పులవిరుల్ నుఱికి రర్థి
నింబపత్రిహారమాల్యంబులు దాల్చిరి, చిట్టిపొట్టిగరించి రిట్టునట్టు

గీ. తరుణధావన దగధగద్దర్శనములు, హాటకోర్మిక పరివేషకవ్యములడాలు
పర్వదినములఁ జామరప్రమదలుదిత, నియమసంభాషనారంభనిభృతబుద్ధి. 2543

క. ఎద్దెలనపుగయి సెతల, రద్దులు నడచిరి పురస్సరద్భాగ్యముగా
గుద్దంబుచక్కిఁ గట్టం, బద్దమహాశక్తి దివ్యభవనంబునకున్. 2544

సీ. అంభోదరముక్రిందనసియాడు నక్షత్ర,తియుఁబోలె పిడివేత్రిఁదేజన యోర్చు
చెందమ్మికోలన రంజిల్లునంచయుఁబోలె, నిగ్గులీనంజిరిందె నెలఁతమోర్చు
తొలుసంజయుఁజున్దిలునంచయునుబోలె, నిగ్గఁబందిరిగుండమింతి యోర్చు
చలినీటిపై నెక్కుకలువమొగ్గయుఁబోలె, ననటూకునర్తించె నతివ యోర్చు

గీ. కాంతయొక్కర్తు మాపునగండ లిచ్చె, మారుగాలిచ్చె నొకసుధామధురవాణి
లలనయొక్కర్తు నోరితాళంబు లిచ్చె, శక్తిజాతరసద్భక్తి శక్తు లెసఁగ. 2545

క. బత్తులు నునువాకత్తుల, మొత్తిరి పశునమజముండములు చండముతో
నెత్తురుధారలు ఘూర్ణిలి, పత్తిమిరనవానుప్రభలు ప్రబలంగన్. (దఁగెఁదమును

గీ. పిలుచఁ గలుచొక్కు, చెలువల తలకు నెక్కఁ,దోనదిక్కుల తల కెక్కఁ దో
దేవిగుడిలోనదొక్కక్క నివిడదోఁపఁ,దోనదొక్కక్కచుక్కయుఁదోఁచెమింట.

పాండురంగమాహాత్మ్యము, ఆ 3 పద్య 73-79.

సీ. శోభనదేవతల్ సొంపుగానందండ, వాద్యభేదములజవ్వాడిచెలఁగ
పసిఁడికొమ్ములవారు బారలుదీరిరి, భూతొక్కరరపముల భోరుకొలుప

నాటకాంగనలు క♦ర్ణాటకంబులధీరి, ధిమితధిత్తాధిమి♦ధిమితయనఁగ
వరుసగొల్లలుదల♦వంచి చేకేళ్ళతో, చెటచెటధ్వనులుకు♦చ్చించిసేయ
గీ. కనకతప్పెటనాదముల్ ♦ గ్రిందుకొనఁగ, తగనగారాలధణంధణాం♦ధణం యనెలఁగ
వరుస నూహారిమూఁకల♦వారుకూడి,సంభ్రమముఁజూడనొప్పెనా♦సమయమందు.

బృందావనవిహారము, ఆ 2.

## ఆకాశగమనము.

సీ. బడిపాయకిలనగ♦పత్రితతితో జివ్వన, నెగిరిన ట్లైతోఁచు ♦ మగువలార
పైపైసమీరణా♦ఘటిని నింగిబోరున, నఱచిన ట్లైతోఁచు ♦ నతివలార
నిఖిలభూములు జవ♦నికవాని దారున, నెడరిన ట్లైతోఁచు ♦ నింతులార
చనఁజన వెడఁదయై ♦ శశిమేను గ్రక్కునఁ, జెరిఁగిన ట్లైతోఁచుఁ ♦ దరుణులార
గీ. కొండలచ్చనగండ్లయి ♦ నిండుచెఱువు, లెల్ల నద్దంపుబిళ్ళలై♦యేర్లుముత్తి
యంపుసరులై యరణ్యంపు♦గుంపులెల్ల, నారులై తోఁచుఁ జూడనో♦వారులార.

వసుచరిత్రము, ఆ 4 పద్య 59.

## కోళ్ళపందెము.

క. అంతటనితాంతహర్ష, స్వాంతయుతద్యూతజనక♦వక్షఃస్థితసారి
స్వాంతిశుభ్రితైషు నగర, ప్రాంతంబున కోడిపదువు ♦ పందెము సాగన్. 2551
గీ. కావిపాగ్రంతలు దారాలు♦కట్టుముట్లు, ముష్టులును నీళ్ళముంతలు♦మూలికలును
గత్తులపొదుళ్లు మంత్రము♦ల్కట్టుపసరు, లెనయ వచ్చిరి పందెగా♦ళ్ళపురేఁగి.
గీ. డేగ నెమలి పింగళి కోడి ♦ డేగకాకి, పస్నలై గింటికిరులందు♦పస్నెలందు
రాజ్యభోజనగమనని♦దాగ్రిమరణము,లను విచారించి యుపజాతు♦లను వచించి.
చ. చొరఁబడికాంచిప్రాఁతలును♦చుట్టియుఁ గత్తులు వేసి సందిటం
బెరయఁగఁబట్టి చెక్కు గఱ♦పించి గి రేర్పడ గీచి నిల్చి కో
క్కొరయఁగ జూచి పందియపు♦టెంకున దిగ్గుచుఁ జిక్కువేసి స
ళ్ళరి మటివో యటంచునుశ♦శీపెళిపుంజులు పన్ను లాడఁగన్. 2554

హంసవింశతి, ఆ 3 పద్య 211, 212, 213, 216.

## కుక్కుటనామవిశేషములు.

సీ. పట్టైజుట్టుది మైల♦పుట్టమిట్టుది గూబ, చిలుకజుట్టుది మూఁగ♦బిట్టుకోడి
పట్టుమూర్పది యుర♦జుట్టుది బోరది, బూడిదెవన్నెది ♦ పాపది నెల్ల

కాలుది గుజ్జుది • గాజులగాడునో, గలది పండెజ్జుది • గద్దకోళ్ళ
డెజ్జునిదురగలి • దీకెలదారెము, నల్లది కొప్పుది • తెల్లయురగ

గీ. పిల్లవేళ్ళది మొద్దుది • నల్లయురగ, లసఁగెఁదగు కత్తి కాల్పురజు•లందులోనఁ
బసపుపావఛ్ఛు కాలండె•లెసఁగునట్లు, రావిరేకలుబిరుదులు • లీవి గలుగు. 2555

సీ. గరుడండు శరభంబు • కంచాసవారము, గణభేరి కార్చిచ్చు • రాతిబొమ్మ
రాముబాణము మిత్తి • రాహుత్తి ఓడుగు హ,ప్పీయండు పుంజుల • వేరువిత్తు
గండగత్తెర గుండె•గాలంబు మాస్తెఁడు, పట్టభద్రుఁడు బెట్టి•భైరవుండు
కత్తులపొది సింహ•నారి భేతాళుండు, పసులపాతర పాద•రసము చిలుక

గీ. టమ్మ సుడిగాలి చక్రంబు • నలుజనసరి, శూలము పిరంగి వెలినక్క•సాలువంబు
కాళరాత్రింతతుఁడుపండె•గాంద్రుఁడు మెచ్చులనెడు పేరులపుంజాల•గొనుముగించి.

హంసవింశతి, ఆ 3 పద్య 214, 215.

—• స్వారిగుఱ్ఱము. •—

సీ. పచ్చనిహురుముంజి•పనివాగెపక్కెర, పారసిపల్లంబు • పట్టమయము
రాణ నొప్పారు హై•రాణంబు సింగిణి, తపుకులకోరుల•తరకసంబు
మిహిపసిండిపరుంజు•మొహదా కెలంకుల, తావుగుజ్జరిసేత•కేవడంబు
డాకెలంకునసిరా•జీకరాచురకత్తి, కుఱుఁగటఁ గ్రొవ్వాఁడి•గోరకలపొది

గీ. పీలికుంచెతలాటంబు•బేగజంబు, ముఖాలమొగముట్టు వన్నెసా•హిణి యొకండు
కర్తయొదుటికిఁ గొనివచ్చె • గంధవాహ, బాంధవంబగునొకమహా•సైంధవంబు.

మనుచరిత్రము, ఆ 4 పద్య 28.

సీ. వినుకెంపు నడకెంపు•నునుకెంపు పల్లంబు, దీపించు పచ్చరాగ•పృష్ఠిసంద
కళుకనీలంపుసిం•గంపుఁదలాడంబు, దండిపైదూర్యంబు • నిండువాగె
నిగరంపుఁబగడంపు • జిగిదొట్టు మొగముట్టు, రంగారుమదిరిఁజీ•సింగిణీలు
గోమేధికంబులఁ • గొమరొందుకళ్లెంబు, వజ్రాలమేలంక•వన్నెయలునఁ (సములఁ

గీ. గొత్తముత్తెంపుఁదెఱలఁ ద•ళ్కొత్తుజాన, మురుమరకతాళి మెఱుఁగొందు•తరక
బసిఁడితఱటునుగలిగిసొం•పెసక మెసఁగ, నుత్తమాశ్వంబుఁగొని తెచ్చె•నొక్కసాది.

ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 397.

—• గుఱ్ఱపుస్వారి. •—

చ. జడలు మలంచి చొళ్ళెముగ • సన్నపుఁబాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ బని•లంబుగఁ గట్టిసమట్టికాసెలం

బిడియము లంటఁదోఁపి పృథు♦భీషణబాహుల సాహసంబులన్
దడవి కరల్చుచుం జనిరి ♦ నాథుని మ్రోల నృపాలనందనుల్. 2579

మనుచరిత్రము, ఆ 4 పద్య 30.

చ. తనహృదయంబు వెంబడిన ♦ తప్పక ఘోటక మంత్రమంత నే
పనుపడ నిల్పి ముందటికిఁ♦బాఱి కెలంకులమం దొలంగి తా
వెనుకకు నేఁగుదెంచి కడు♦వేడ్క యొనర్పఁగ బంతి యాడ నె
మ్మిని గనకంపుఁగోల నడి♦మింటనెత్రిమ్మరఁ దారి కొట్టుచున్. 2580

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 29.

చ. ఎగురఁగ వైచి కొట్టు టది♦యెంతభరం బని బంతి యుగ్రగా
మిగ వడిఁ బాఱవైచి పుడ♦మిం బడనీకయె దాని మీఱి చి
త్రగతి హయంబుఁ దోలుచును ♦ గ్రమ్మఱ మీఁదికిఁ గొట్టె యాడె విం
తగఁ దనచేతిరత్నమయ♦దండము కాంతులు గ్రాఁడి పాఱఁగన్. 2581

సీ. తొలుదొల్త నయ్యేక♦తురగంబు మండల, గతిచారి యగుచు ని♦క్కంబు దోఁచె
నావెనుకను సహ♦పాశ్వాలి చెదరక, చక్రాకృతిని బర్వ♦సరణిఁ దోఁచె
నంతట ననతిస్ఫు♦టావయవంబుగా, నెనసి యేకాంగవే♦ష్టనత దోఁచెఁ
దుదఁ దద్విభూషణ♦ద్యుతి రాజిమాత్రంబె, కొఱవిఁ ద్రిప్పినరీతి♦ మెఱసి దోఁచె

గీ. నంతకంతకు నతివేగ ♦ మగ్గలింప, రాఁగ వాగె యొచ్చరిక ప♦రాకు జియ్య
యనుజనులు బిచ్చపడితమ♦పని మఱవఁగ, బరగు నమ్మేటి నెఱరాతు♦ ప్రౌఢికతన.

ఉ. ఉరుజవశాలి యత్తురగ♦ముల్ముకచక్రనయావలంబియై
తిరుగు రయంబుచేత నెడ♦ తెర్వక కుమ్మరిసారెచాడ్పునన్
బరగెఁ గడున్ ధృతాభినవ♦భాండతఁ దగ నుక్కుబట్టు దాఁ
దరలక పైని పద్మమణి♦దండగతిన్ హరిపుత్త్రుఁ డొప్పఁగన్. 2583

క. వల్గితముఖగతి పంచక, వల్గువిహారముల సైంధ♦వము నలయించెన్
వల్గావిభాగకుశలత, వల్గత్కుండలమరీచి ♦ వల్లరు లెసఁగన్. 2584

శా. నానావీథిగతిప్రభేదవిహృతిన్ ♦ సంతృప్తుఁడై కంతుఁడిం
పూనన్ వాగె గుదించినన్ బురపక♦ప్రోన్నమ్రపూర్వాంగమై
కానం గాఁబడియెన్ మరుజ్జవనమా ♦ గంధర్వమర్కాశ్వసం
తానస్పర్ధను మిన్నువ్రాఁకెడుక్రియం♦దా నెంతయుం జూడ్కికిన్. 2585

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 31, 34, 36, 37.

మ. అని చింతింప యశ్వచ్ఛ నచ్చెలువ తన్నాన్న వేళ నీక్షించినన్
ఘనసైన్యంబులు గొంతమించఁదన తుత్థాణంబు తేజీఁజివు
క్కునఁ దాటించి గుఱించి చిత్తరువుబాగుల్మీఱ నాడించె శో
భనతద్వల్గనవల్గదగ్రఖురుచిస్ఫాయత్కిరీటంబుతోన్. 2566

కళాపూర్ణోదయము, ఆ 5 పద్య 111.

ఉ. పక్కరలొక్కడంబిగియ బాగగు తంగు లమర్చి వానిపై
నెక్కటిసల్లముల్మిలిపి యింపెసఁగ న్మొగపట్టలుంచి పెం
పెక్కన కత్తలానిగము లెక్క ఖలీనము లూని చేతుల
న్వెక్కుచు వచ్చి రత్తటిని వేలకొలందిగ సాదిసంఘముల్. 2567

కౌసల్యాపరిణయము, శ్రీ. వేం. ఆ 2.

—— నెత్తము. ——

సీ. కయ్యాధికంబుగఁ గల్లసారెలునైచి, యొక్కదాయంబుల యెడలు గడపి
యనునైనడాలుక నినము పాసికలను, వలసినదాయంబు నైచికొనుచు
తప్పనాడినఁగని తప్పార్పవచ్చిన, లేదు లేదని తుది వాదువెట్టి

... ... ... ... ... ...

గీ. ఘాపునకుఁ దెగినంతియు సంభ్రమించి, సత్యములు చేసి సభికుల సాక్షి గోరి
యంతఁబోవక తన్నేదు లైనవారిఁ, బాడియడుగుచు మండట లాడియాడి.

సీ. బలిమిఁ జోడిన ధనములుగొనఁజాలక, పుడుకున్మాఁకనియూసయుడుఁగువారు
సనదలు గెలిచివారడిగిన నేమియు, విడువక ధనములు వడయువారు
నోడినధనమింక నాడినంగాఁకియేఁ, బెట్టఁజూపొమ్మని పెనఁగువారు
గెలిచినధనమెల్లఁ బలకపైనవ్వుడ, పెట్టక పోనీక కట్టువారు

గీ. బొత్తుగా నాడి కూటమి పొత్తువారి, మీఁద లెక్కించి పంచన మెఱయువారు
లంచములు గొని యెడఁబొర లంగఁబలికి, పెద్దవలయాటదెగ గెలిపించువారు.

దశకుమారచరిత్రము, ఆ 5 పద్య 64, 65.

ఆ. వాగులానితోడ వాట్లేనితోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ
వటమటీనితోడ నడియరితోడను, వెలకు నెత్తమాడ వెరవు గాదు. 2570

సీ. జేనెడి గొనరి వైసిక వెట్టి పలకపై, సారెలు వోయించి సరముచూచి
తనకు లాగయినతెత్తంబుఁ గైకొని సన్ని, పాసిక దాళించి పాఱటింగి

లోహటంబులుమాని♦లులిఁ గన్నఁ బడకున్నఁ, బరదారి మనిపోవుఁ♦బలుకయిచ్చి
తప్పార్తుఁ జూ రెండు♦దాయంబులును గని, వారింపకుము పోటు♦వాఁ్రిలఁగలవు
గీ. పంతమడిగిననీవలె ♦ భాగమింత, బోరఁ బెద్దదాయంబాడి ♦ బోరుపుచ్చి
వైచునదిదనమునికిపో♦వచ్చు ననుచు, బేరుకొని పాటుతజెనరి♦ చేసి యడిగె. 2571
క. అత్తివంచిత్తిగ దుగ, సత్తా దచ్చాక వంచ ♦ చావం చీర్రై
దత్తిగ యిద్దుగబ్రదలు, చిత్తంబునఁ దలఁచినట్లు ♦ చేతికిఁ దెచ్చున్.   2572
సీ. దుగుణంబుసేపిన♦తోడ నీ మూఁడని, వారించి లేదని ♦ వలును సేసి
యూరకెత్తకు దాయ♦ముగ్గడించినఁగాని, పట్టివేయకుమని ♦ పటితలించి
విడలినసారెలు ♦ వెనుకముందఱచేసి, యొత్తినపారిపో♦నీకయార్చి
సమమాయెరమ్మని♦సరసవారికినిచ్చి, గెలుపునమాళంబు ♦ గెరలఁజేయ
గీ. బడిసియూరైదుపూజించి♦పలకమీఁద,బలుపమునవాఁ్రిసివిలిర్వాయిఁ♦దోలఁగనైచి
పన్నిపంచియొక్కటినాడఁ♦బంచివాఁ్రిలుఁ,దప్పనోపతఁ్రినయమునఁ♦దానగెలిచె.
సీ. చేయదు దుగుణంబు ♦ పెలవు లేకుండిన, నెక్కినపలుకఁ బో♦నిచ్చుఁగాని
పలుకదు రోషించి ♦ పడసిపాసికలతో, నవదాయ మైనను ♦ నాడుఁ గాని
యొల్లదు గోపించి ♦ యొండునెత్తము వన్న, నెచరంబు నేర్పని♦యెన్నుఁగాని
వదుఁకదు వంచించి♦నయ మెక్కు డడిగిన, నిలుత మింతేట నన్న♦నిలుచుఁ గాని
గీ. పలకదలుమక బైపిక♦పల్లటిలక, బోఁటి దూఱక యూతావు♦పుచ్చుమనక
క్రిందగెలిచినవాఁ్రిలు లెక్కింపు మనక, తప్పు నాడక తొల్లింటి♦దాక పడక.
సీ. ఒకదాయ మాడిన ♦ నున్నదాయం బాడు, మనక వాటులు రెండు♦గొని చెలఁగి
కానియాటఁదాఁ♦గడచిపోయినఁజెప్ప, నెత్తంబు వడదని ♦ నేర్పెరిగడి
యొకదాయమునకును ♦ నొంటిదాఁకినఁబోయి, యింకనైచెదనని♦యినుమడించి
పోయెడి నని వేఁ్రియఁ♦బూఁచిన వారించి, చూచిపో నిమ్మని ♦ నూట వెటిచి
గీ. సారెమోపును బారలును ♦ సదరనిదర, మెఱిఁగి లాగైనఁగైకొని♦యింపుకంతె
పాసఁగ కుండినరుక్మిణి♦బొంకుబొంక, శౌరిఁ బలుమఱు గెలిచెనా♦సత్యభామ.
ఉత్తరహరివంశము, ఆ 3 పద్య 112—128.
గీ. వాహనంబులుసారెలు♦వాఁడిశరము,లూర్జితాక్షములనువులె♦యొడ్డనములు
గాఁగఁబోరెడునీద్యూత♦కర్మమందు,నెసఁగజయముదునపజయ♦మెవ్వఁడెఱుఁగు.
భాగవతము, స్కం. 6 పద్య 414.
ఉ. ఆడితె నీదుపంచె మని♦హస్తనఖప్రసరచ్ఛవిచ్ఛటా
మేఁ్రిడితపాండురద్యుతి స♦మృద్ధి గరం బమరఁగఁ బాచికల్

వేడుకతోడఁ బుచ్చుకొని ♦ వ్రేళ్ళను నిట్టు నటుస్ బొరల్చి వి
భ్రాజితకళంకకంకణవి♦రావము మీఱఁ గదల్చివైచుచున్. 2577

సీ. నిలుమహోంబోంకకు♦నెత్తికమ్మయంచుఁ, బక్షులు లెక్కడునోయ్యఁ♦బలుకుమనుచు
జిక్కె నీసారె వా♦చేవంచుఁ జిక్కెనా, దీనిపాలిటికూడు ♦ దిన్ననుచు
నదె దుగ తిలకుమీ!♦ సుదతి నీవంచునా, నిదె సారెదాఁకె నీ♦యిచ్చయంచు
నినుమాటుదంచిన ♦ కెనటిపోఁతలటంచు, నానట్ల దయుడికెడుఁ♦గానియంచు

గీ. నిట్టి దంటమాటలు నేర్చి ♦ తెచట ననుచు, దంటనేనాట నీసంగ♦తమున నంచుఁ
దమపరస్పరసరసవా♦క్యములు దనర, నెలఁత తనవిభుఁడును దాను ♦ నెత్తమాడె.

చ. కుచఁ గవ వావికుందుటను ♦ జక్కవజోళ్ళమనోనురాగ మే
ల పొగడ నక్షపాతిశయ♦లబ్ధమసంగమశారికల్ క్షణం
బళుడ వియోగ మొంది యహా♦హా జెనఁ జావఁ దొడంగెఁ దుల్యరా
గపుఁబనయూనె జరిస్ఫుటము ♦ కాదెటదీయమ యెల్లవారికిన్. 2579

ఉ. పారెకుఁబోటు దాఁకినను ♦ జాడ్యము నొందక జోడు విచ్చి పో
సారెఁగదంకతోఁ బొడిచి ♦ చాటుచుఁ దీవ్రరణస్ఫురన్మహా
శారిఫలప్రిఘట్టవలఁ ♦ జాలఁగ నుచ్చరమెక్క నయ్యెడిన్
వారలు జోదులంబలె నొ♦నర్చిరి జూదపుఁబోరు మీఱుచున్. 2580

కళాపూర్ణోదయము, ఆ 6 పద్య 119—122.

సీ. వినుచక్కపగడాల♦కును జగడాలేటి, కవుదె నతాహార♦వైతి వబల
తీవంచయరఁగుపై ♦ నీవన్నెచూడనె, యెంతభారామచ్చ♦రించినదువ
బద్దుగానీమాట ♦ పాటింపఁజెల్లునే, యిత్తిగంబలుకదే♦మెత్తు నిన్ను
బదిలంబుగావాడు♦పట్టుపాటెఱుఁగవ, యిఁకఁదొమ్మిదేటికే ♦ యింపుగాదు

గీ. ఇచట నీదుంటగము చాఁగ♦నిత్యనింక, నెరయుదచ్చొక మన యాట♦సరికివచ్చె
ననుచు సల్లాపములు షరి♦హాసగతులు, వెలయుజూదంబులాడిర♦వ్వేలఁదు లెలమి.

పట్టాభిషిక్తచరిత్రము, ఆ 8 పద్య 70.

సీ. జోడుకట్టిన గెల్తు♦సుదతిరో నిను లీల, పైజోడు గూఁడిన♦ప్రతిన దగునె
సారె పండఁగ మేలు♦సమకూరు మాకింత, కాయక పందుటే ♦ కరణిఁ గలుగు
నిమ్మియిఁ గుంకుమ ♦ యిది యంటె వాల్గంటి, పెనఁగొద నలుపుల♦విడువ నేను
మేలుగ నత మాయెత్తిమీఁటి పోఁజూడకు, కొనరక ముందుగాఁ ♦ గూడి పత్తు

గీ. ననుచు నర్మోక్తిచాతుర్య ♦ మమరనపుడు, కవరలురరత్నకంకణ ♦ రవ మెసంగఁ
బందెములుగోరి వైచుచుఁ ♦ బగడసాల, తారతో నాడు హరిణాంకుఁ ♦ జేరి మ్రొక్కి.
తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 166.

## —♦ అశోకవృక్షము. ♦—

సీ. అరుణపుష్పావళి ♦ నగ్నిగా సంధించి, యలులనల్లెలుగాఁగ ♦ నావహించి
దండడి వీతెంచు ♦ దక్షిణపవనంబు, భస్త్రినిలంబుగాఁ ♦ బరిఢవించి
చిలుకలుఁ బికములుఁ ♦ జేదోడు సేయఁగ, మాధవుఁ డనెడి క ♦ మ్మరి కడంగి
యంగజాండను పతి ♦ యానతిఁ బనిపూని, మొగడలమ్ములుకుల ♦ మొనలుచఱచు
ఆ. కొలిమియొక్కొ యనఁగఁ ♦ గురియుపరాగంబు, విస్ఫులింగములుగ ♦ విరహులలుక
సేచిపూచియున్న ♦ యీయశోకమహీరుహంబుఁ గంటె మాళ ♦ వాధినాథ. 2583
విక్రమసేనము.

## —♦ మఱ్ఱివృక్షము. ♦—

సీ. తనవులాశ్రేణి ♦ ధర కంతటికిఁ బచ్చ, పట్టుఁబుట్టంబు మే ♦ ల్కట్టుగాఁగఁ
దన యూర్ధ్వశాఖావి ♦ తానంబు సురలకు, మరకత రచితహ ♦ ర్మ్యములు గాఁగఁ
దన వ్రేలుఁగొమ్మలు ♦ మునులకుఁ గల్పిత, పర్ణశాలాకలా ♦ పములు గాఁగఁ
దన నిశాంతభ్రాంత ♦ ఘనవిటపచ్ఛాయ, వలయాద్రివిహరిణశా ♦ ద్వలము గాఁగ
గీ. వాలఖిల్యమునీశ్వరా ♦ వాసమైన, రోహణమురీతి పిత్రుముక్తి ♦ దేహ మగుచు
గయఁ బ్రసిద్ధివహించు న ♦ క్షయవటంబు, చందముననున్న యొకమఱ్ఱి ♦ క్రిందికేఁగి.
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 198.

సీ. సద్విజరాజసం ♦ శ్రయమహాస్పదలీల, శాఖలు కకుబంత ♦ చయముఁ బ్రాఁక
సాంద్రవర్ణక్రమ ♦ స్థాయిత్వమునమించు, జటలనంతావాప్తి ♦ సటిమ మెఱయ
విష్ణుపదార్పిత ♦ విహితవృత్తిఁ దనర్చ, నగ్రిమ ల్పస్తాళ్వ ♦ ననుకరింప
నహిలోకరాడ్భూప ♦ ణాధారమై యొప్ప, మూలంబు కుండలి ♦ ముఖ్యుఁ దొరయఁ
గీ. దన మహాగమవిఖ్యాతి ♦ ధరణిలోన, నఖిలజనులకు నద్భుతం ♦ బావహిల్లఁ
దేటపడఁ గానుజూపెడు ♦ తెఱఁగుదోఁప, మలసిచూపట్టెఁ బథినొక్క ♦ మఱ్ఱిచెట్టు.
హంసవింశతి, ఆ 2 పద్య 116.

## —♦ శమీవృక్షము. ♦—

సీ. నెగసినకొనలేచి ♦ నింగి యంతంతకు, నవులఁ ద్రోవఁగఁ దన ♦ రారుదానిఁ
జాఁగినశాఖలా ♦ శాచక్రమునకొలం, దు[illegible] బారివెట్టంగఁ ♦ బొల్పు దానిఁ

గవనులొండొంటితోఁ గదియుచు నెడములు, గ్రమింగి క్రుబ్బఁగ సొంపు మిగులు దాని
లోనిజొంపము పవలును బెనుఁజీకటి, నొదవించి పొదలంగ నొప్పు దాని
గీ. గనిరి యొకపుష్పించు చెలువ వర్తనకళాను, వర్తిఁ గాకఘూకారవస్ఫూర్తిజాత
భీతిచరిపరవర్తి నానాఖిలభుజగ, చండమూర్తి శమీతరు చక్రవర్తి. 2586

భారతము, విరా. ఆ 1 పద్య 162.

—♦ జంబూవృక్షము. ♦—

మహాస్రగ్ధర. అటఁ గాంచెన్ మనస్సాబ్జంబలరను రనగప్రాంత సంక్రాంతజంబూ
ఫుటదాయాదప్రభావాంకురిత కిసలయాకుంచి స్వాత్మీయశాఖా
పటలచ్ఛాయాకులాయద్యుకటిత కురరీగాంధవాయాతకీర
స్ఫుటవాక్ఛాతుర్యధుర్యోద్భుతమగు నొక జంబూధరిత్రీరుహంబున్. 2587
సీ. ఛాయామనోహరసౌభాగ్యమున హెచ్చి, భాస్వదాకృతి చేతఁ బ్రబలుటరుదె
లాలితానేకపల్లవవిలాసముఁ గాంచె, విటపశేఖరరూఢి వెలయుటరుదె
ఘనపత్త్రివైభవఖ్యాతిఁ జెన్నలరారె, రాజమానోన్నతిఁ గ్రాలుటరుదె
అత్యంతసమగ్రలీలల నొప్పె నలవిష్ణు, పదసేవ నేప్రొద్దుఁ బొదలుటరుదె
గీ. యనివినుతి సేయఁదగు లతాంతామరక్త, ఛదలదాయాద నిజవిభాభాసమాన
ఫలరసాస్వాదసంతోషభరిత భూరి, శారికాకీరవార మాభూరుహంబు. 2588

వాసవదత్తాపరిణయము, ఆ 2 పద్య 18, 19.

—♦ సవారి. ♦—

సీ. ఘటితంబులగు తళుక్కుపటికంపుఁ బిడిగుబ్బ, లలరొందు పొల్పుతల్పుల బెడంగు
వ్రాసిన మృగపక్షి ఫలపుష్పతరులతా, ప్రతిమలతోడి యప్రతిమభంగి
ముత్తెంపు మొత్తంపు గుత్తుల గుత్తంపు, జాలరుల్ వ్రేలు నస్తరులడంబు
నుద్దిగానఁగరాని నిద్దంపుటద్దంబుఁ, గవగూళ్ళ ముంగిటికడ హొరంగుఁ
గీ. బైకి దోసిన గవిసెన పసిఁడిమొసలి, వాలదండెలు బాలీసు పరుపుదిండ్లు
జాళువా సంబెలయును గూజాకటారిఁ, బరగు నొక కొత్తరంగు సవారిఁ దెచ్చి.

రామరాయవిలాసము, ఆ 2 పద్య 35.

—♦ పల్లకి. ♦—

మ. తళుకుం గెంపుల పైఁడి యడ్డలును నిద్దాపచ్చ డాల్దండెలుం
గిలుకుం దంతపుఁ గోళ్లు వింతపని చక్కిల్పెంజరిపింజరి

బలు రాయంచగరు ల్చెలంగు పరుపుం ♦ బాలీసునుం గూర్చి పె
స్తలు కళ్యాణముఁ బల్లకీనిలిపిరం♦తఃకక్ష్యయం దయ్యెడన్. 2590

రామరాయవిలాసము, ఆ 3 పద్య 142.

— ♦ తూఁగుటుయ్యెల. ♦ —

సీ. బంగారుగొలుసులు ♦ పవడంపుఁదరమైన, కోళ్ళును వింతబొం♦గులబొగడలు
రత్నంపుఁజిలుకలు ♦ రాయంచప్రతిమలు, పసిఁడిపువ్వులవ్రాఁత♦పనులసొబగు
వివిధంబులగు చిత్ర♦విరచనలును దనర, లీనూలుపట్టెయ♦ల్లిక బెడంగు
పలు తెఱంగులపట్టు ♦ తలగడబిల్లలు, మవ్వంపుఁగుంకుమ ♦ పువ్వుపఱపుఁ
గీ. గలిగి మెఱుఁగులుదిక్కులఁ♦గడలుకొనఁగ, మించుదంతపుటుయ్యెల♦మంచమునను
బొలుపుమీఱుచుఁదనయంతి♦పురముసతుల, యూడిగంబులు గైకొంచు♦నున్నశౌరి.

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 15.

చ. అలఁతిగ నంటెనం బొలుచు ♦ నారజపుంజగజంతరీరోధల్
గులుకు మెఱుంగుఁ గెంపుతటి♦గోళ్ల నమర్చిన నాగవాసపుం
గొలుకులజాళువాగొలుసు♦గోళ్లఁ దగుల్కొని వ్రేలు పచ్చరా
చిలుకలతూఁగుమంచమున ♦ శ్రీరమణుండు వసించు నత్తఱిన్. 2592

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 91.

— ♦ డేరాలు. ♦ —

చ. సమముగ మిట్టపల్లములు ♦ చక్కఁగఁ జేయుచుఁ జుట్టి నీరువా
టముఁ గని నాల్గువంకల గు♦డారము లెత్తిరి చీనిపట్టుప
గ్గములు బిగించి గూటములఁ ♦ గట్టినరాతులగూర్చి ముందటం
గొమరగు పైఁడితీవపని ♦ కుట్టులచప్పరము ల్చెలంగగన్. 2593

వాల్మీకిచరిత్రము, ఆ 3.

— ♦ పొదరిల్లు. ♦ —

గీ. క్రొవ్వి కలహించు తుమ్మెద ♦ కొదమకదుపు, రాయడినిగడుదళముగా♦రాలిపట్టి
పత్రిపవదళములు పఱవని♦పఱపు లగుచు, దెసఁగ నింపొందునాపొద♦రింటిలోన.

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 196.

— ♦ కంచరసామగ్రి. ♦ —

సీ. ఘర్ఘరకలును బీం♦గాండ్లు తాబాణాలు, గిన్నెలు తబుకులుం♦గిండ్లు తపర
పాత్రలు చట్లును ♦ బానపాత్రలు మేలు, చట్టువంబులు మంచి♦మట్టుగిండ్లు

సంపుటంబులు గొప్ప♦స్థాలీలు తబుకులు, కంచము ల్ట్రొల్లు గం♦గాళములును
పైఠంబులు పడిగముల్ ♦ చిప్పలు హస్తావ,ళులు కంకణములు ఘం♦టలును గజ్జె
తే. లాదిగాఁగల్గు దీవుల♦యందు వలయు, కంచరపుజాతివగవగ♦ల్మించఁ జేసి
నట్టిసామగ్రిబహువెల♦ల్వెట్టికొనియెఁ, గాంతభూకాంతమణులకు♦గాన్కఁ జేయ.
హంసవింశతి, ఆ 5 పద్య. 353.

## —♦ గొఱియలు మేఁకలు. ♦—

చ. కుఱుబలిదోరచారనల♦గుం డ్లెఱగొండిలి మూలబొల్లిగిన్
నఱిగివి నట్టుజోడు వులి ♦ నల్లని వెఱ్ఱివి పుల్ల చిల్లవిన్
బఱిగివి మొఱ్ఱివిన్ గరక♦పల్లవి నాఁదగుపేళ్ల నొప్పెడున్
గొఱియలు వేవవేలు గల♦గుంపు లసంఖ్యము లుండు వానికిన్. 2596
సీ. ఖోడ పొడపుట్టినామంబు ♦ జొల్లిపూరి, జాలనల పుల్లవెరబట్ట♦చార బఱిగి
కఱకు గడ్డము తెలిమొఱ్ఱి ♦ గారదోర, వసెడు పేరుల మేఁకగుం♦పతని కుండు.
గీ. మట్టిచేమటి కరపస్స♦మైలబట్ట, కోరతలభూజ వెఱ్ఱని♦చార పోడ
పొడకపిలె కన్నె బొలిచుక్క♦పుల్లవియను, పేళ్లనొప్పారిమందలోఁ♦బెక్కుగలవు.
హంసవింశతి, ఆ 2 పద్య 76, 77, 78.

## —♦ గోవులు. ♦—

సీ. నానాసహస్రసం♦ఖ్యానంబులై సంత,తానంద విగతభ♦యత్వలీల
నక్కాననమున నే♦దిక్కు సూచిన నతి, సంకులంబుగఁ గుంద♦శంఖచంద్ర
హారనీహారడిం♦డీరపటీరము,క్తాహారహీరసం♦కాశములును
గాదంబకాలేయ♦కాదంబినీనీల, జాలతమాలికా ♦ సన్నిభములు
గీ. పాత్రిఘబంధూకపల్లవ♦భాసితములు, వికచకాంచనచంపక ♦ విస్ఫుటములు
నైనవర్ణంబు లొప్ప నే♦త్రాభిరామ,భంగి నలరారు గోకదం♦బములఁ గనియె.
భారతము, ఆర. ఆ 5 పద్య 375.

ఉ. పాయనివేడ్కతో నునికి ♦ పట్టులకుం జని గోవు లెల్ల నం
బేయని చీరి హుమ్మనుచుఁ ♦ బేరిచి మూర్కొని పంచితిల్లి పై
బ్లైఘలిరేకపై పొదుగు♦లం దెడలేక స్రవించు చున్నపా
లారెడ నాకుచున్ సుముఖు♦లై యొసగెన్ నిజవత్సకోటికిన్. 2598
చ. ముదమున హుంకరించుచును ♦ మూఁపులపై మెడ లెత్తి చాఁచుచుం
బవములు నాల్గు రెండయిన ♦ బాగునఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్

వదనములన్ విశాలతర♦వాలములన్ వడి నెత్తి పాఱి యా
మొదవులు సన్నులం గుడిపె ♦ మూఁతులఁద్రిప్పి పిడికిభంగి సాకుచున్. 2599
భాగవతము, స్కం. 10 పూర్వ 518, 522.

## —♦ వృషభములు. ♦—

క. పోగరెక్కిన మూఁపురములుఁ, దగగల వాలములు శైల♦దేహంబులు భూ
గగనములు నిండు అంకెలు, మిగుల మెఱయు వృషభగణము ♦ మెల్లన నడచెన్.
భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 896.

ద్విపద. అని పిడుకొలిపిన ♦ నంతంతవారు, పేరువేరున వానిఁ ♦ బిలిచిరీరీతి
నందిలబసువన్న ♦ యాదిసాఘుండ, నందులపిడి ఘంట ♦ నాగవాసయ్య
గోవుల విటకాఁడ ♦ గోఁగుబయ్యన్న, వంటరిపులిజంకు ♦ వరపెదమాళ్ళ
కట్టనికలుకోట ♦ కరినందిఅంకె, అకలంకగాత్రుండ ♦ అంబుధిశయన
బిరుదుగరుత్మంత ♦ భీమునిగజము, గోవర్ధనాచల ♦ గోపాలదేవ
కరినందిబసువన్న ♦ కంచివరదుఁడ, నెలబాలచంద్రుండ ♦ నీలవర్ణుండ
జల్లుల దర్దజ ♦ జయకంఠనాద, వైకుంఠవానుఁడ ♦ వాసుదేవయ్య
పుట్టంభూపతి ♦ పుంజెల్లుపెద్ద, ఇందునివజని ♦ యిప్పగిరీశ
గోఁగుభైరవమూర్తి ♦ గోవిందరాజ, చెంచులరోబయ్య ♦ చెన్నమల్లయ్య
కంచి యేకాంబర ♦ కాళికానాథ, మధురాపురిప్రియా ♦ మానందినాథ
రాముఁడా సోముఁడా ♦ అంకెలుసలుపు, మిటువలెఁ బిలిచిన ♦ నేపుమీఱంగ
వచ్చినయెద్దుల ♦ వరుసఁజూచి, వన్నెలు చిన్నెలు ♦ వడిఁజెప్పికొనుచు
నెత్తురుకొమ్ముల ♦ నేర్పైనవాని, గణుపులోఁకలుగల ♦ కరిజోల్లివాని
నచ్చగాఁగరివన్నె ♦ లమరినవాని, మూఁపురంబులతోడ ♦ మొనసినవాని
నుదుటఁ జుక్కలుగల ♦ నునుపైనవానిఁ, దెల్లనివన్నెలఁ ♦ దలిపైనవానిఁ
బచ్చని వన్నెలఁ ♦ బ్రబలినవాని, నిటువంటి యెద్దుల ♦ నెంతయుఁ జేర్చి
గంటలు గజ్జలు ♦ గణగణమ్రోయ, గరికుచ్చులయెద్దులఁ ♦ గాండ్లఁగట్టించి
మోఁకులబంధించి ♦ ముందుగానపుడు, ... ... ... 2601
పలునాటివీరచరిత్రము.

## —♦ మహోక్షము. ♦—

ఉ. తోరకసీదుపట్టమొగ♦ముట్లతలాటము జల్లు వేరుచిం
బోరయఁ గంచుకుప్పెలును ♦ బూదెలగొల్సును బెద్దగంట సిం

గారపుదృష్టి దండి మెడ♦గజ్జెలపేరులు నందె లొప్ప లా
వేరిన దొక్కపస్నె యొకి♦రింతమహోక్షము పొల్చు వానికిన్. 2602
హంసవింశతి, ఆ 5 పద్య 96.

## — ♦ మనుబోతులు. ♦ —

గీ. నల్లసీసపుగుండులు ♦ నడచినట్లు, మంపుగొని మేయుచుంగక ♦ మలసిమలసి
సెనరువారికినుఱుకంగ♦నొక్కమన్నుఁ, బోతులెడచొచ్చెదాఁ బెడు♦పొదలువోలె.
ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 26.

గీ. వలను కుక్కల ఁదువంగ ♦ వలవదేయ, నడచి మొలపిడియమ్మ్రనఁ♦బొడువవచ్చుఁ
బంకము గొరిజ దిగఁబడఁ♦బఱవలేవు, మన్నులివ్వేళ రేగటి♦మన్నులందు. 2604
మనుచరిత్రము, ఆ 4 పద్య 20.

## — ♦ లేళ్లు. ♦ —

సీ. రుచిరమై దూర్వంబు ♦ మాపార నచ్చున, పచ్చినవిధమున ♦ పదన మమర
భర్మనిర్మితపద్మ♦పత్త్రింబు లలవడ, నుత్తనకిరియఁ గర్ణ♦యుగము మెఱయ
లలితమాణిక్యశ♦లాకలలాగు మై, కొనమర్చినభంగిఁ ♦ గొమ్ము లొప్ప
నింద్రనీలములబా♦గేర్పడ ద్రచ్చినై, చినగతి గొరిజలు ♦ చెలువుమిగుల
గీ. నుదుర నిందుబింబద్యుతి ♦ నుల్లసిల్లఁ, గనక కేసరాంకురరోమ ♦ కాంతి నిగుడ
నొక్కమాయాకురంగమై♦యొయ్యనొయ్యఁ, జనియెనిలుచుచు నాపర్ణ♦శాలకడకు.
సీ. నెలలోని యిఱ్ఱికి ♦ నీలకంఠుని చేతఁ, బోలు పాయు లేడికిఁ ♦ బుట్టెనొక్క
యాజుఁ డిన్నిరత్నంబు♦లంగునుం గలుగు క్రొం, విమ్రంచులదీనిఁ గ♦ల్పించెనొక్క
రోహిణాచలము మే♦గుపుఁ గూఁడియు నుతర, ప్రభలనీహారిణంబుఁ♦బడసెనొక్క
శౌరికొక్కరు మెఱుఁగులుఁ♦జుక్కలయొఱపును, గలసియీమృగమయి♦వెలసెనొక్క
గీ. దీనిఁబోలంగి జంతువుల్ ♦ త్రిభువనముల, యందుమతికలవొకొ యని♦యాత్మ మెచ్చి
ప్రీతి వనదేవతలు సూడ♦ సీతదృష్టి, మార్గమున కల్లఁజేరె న♦మ్మాయయిఱ్ఱి. 2607
భాస్కరరామాయణము, ఆర. ఆ 2 పద్య 24, 25.

గీ. నీర ముంచిన సొగకాయ ♦ నెగసినట్లు, పేరుకొనివైచు తెల్లంటి♦చీరవోలె
నుంకుపొంపుఁధంబున ♦ నుత్తరించు, తములపాకు నిక్కుడుకిరియ ♦ దాఁటె నిఱ్ఱి.
ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 27.

ఆ. చలమాలొదవ ముండ్లు♦గలభ్రమాఁకుదీములఁ, గెరలి తాఁకి కొమ్ము♦లురులఁదగిలి
వాని రేవ నీడ్చి ♦ కానకేకొనిపోవుఁ, బోతరించి యిఱ్ఱి♦పోతు లచట. 2608
మనుచరిత్రము, ఆ 4 పద్య 22.

సీ. నవఫేనరుచినవ్వు ♦ ధవళాననంబును, నల్లఁగల్వలఁ గెల్చు ♦ నయనములును
బద్మరాగపరిభం♦బగటు కర్ణంబులు, కాంచనదీధితి♦మించు తనువు
మౌక్తికకాంతుల ♦ మఱపించు వాలలు, తుహినంబుతోడుత♦దొరయు కడుపు
మరకతదీప్తులఁ ♦ బురడించుఖురములు, వచనంబుఁ దలకించు ♦ పటుజవంబు
గీ. గలిగి లీలావిహారంబు♦కారణముగ, నవనిఁ జరయించు పంకరు♦హారి యొక
మృగముగతినుండుటయునంయ♦మీశ్వరుండు, దానిఁగన్గొనికడుసమ్మ♦దంబుఁబొంది.
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 2 పద్య 41.

—♦ దుప్పులు. ♦—

క. పొదనెదరి బోదచఱచిన, యొడళ్ళతో నాల్గు రెండు ♦ నొకటియుఁ బ్రంగల్
వెడలిన కొమ్ములబరువున, నడు గిడఁగా లేవు జలిసి ♦ యందలి దుప్పుల్. 2610
మనుచరిత్రము, ఆ 4 పద్య 169.

—♦ వానరులు. ♦—

చ. మదమునఁ దూఁటి పాఱి పెను♦మ్రాఁకుల బ్రాఁకుదు రిట్టునట్టు డాఁ
టుదురు లతాంతగుచ్ఛములు ♦ డుల్తురు ముందటి గండశైలముల్
పదములఁ బాఱఁజిమ్ముదురు ♦ పార్వంతమహీరుహశాఖలం బెనం
గుదురొగి నుప్పరం బెగసి ♦ కూలఁగఁబాఁతురు శైలశృంగముల్. 2611
క. ఒకరొకరిమూఁపు లెక్కుదు, రొకనిపయిం దొర్గు రొకని ♦ నొక్కఁడుదినుపం
డొకఁ డొడిసికొనఁగనడుమున,యొకఁడెపడనడుచనదియు♦నొక్కఁడుమ్రింగున్.
ఉ. పండినభూజము ల్వెతికి♦పట్టి ఫలంబులు దించు నన్యుఁ డ
వ్వండులు వేఁడినం దనదు ♦ పండ్లిగిలించు నొకం డొకండు చే
పం డటు చూపవాఁడు కర♦పల్లవ మల్లనఁ జూపఁ మిగ్రింగి బ్ర
హ్మాండముఁబోలె నున్న తన♦యంగిలిసూపుచుఁబోయెఁ బొమ్మనున్. 2613
సీ. పృథులహాసంబులు ♦ పెన్నురువులభంగిఁ, బఱపువాలములు ప్రవాళలతల
కైవడిఁ జెలువార ♦ ఘనబాహుశాఖలు, బహుళవీచీపరం♦పరలకరణి
విలసిల్ల నుద్భట♦వీరసంచారము, ల్కుటిలతరగ్రాహ ♦ ఘోరగతుల
చాడ్పున నొప్పార ♦ సందడిపలుకుల, యులివఖండధ్వని♦యోజ నిగుడ
గీ. వివిధవాహినీసంగతి ♦ వెలయు నినజు, నాజ్ఞ చెలియలికట్టయై ♦ యడరరామ
చంద్రునుదయముదంచితో♦త్సవముఁజేయ,నొప్పెఁగపిబలోద్ధతివార్ధి♦యుద్ధియగుచు.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 25, 26, 27, 31.

—♦ బావురుఁబిల్లి. ♦—

ఉ. మీఱినమిట్టిగ్రుడ్లు దలి♦మీసలమొత్తము నిక్కువీనులున్
గోరలు దీర్ఘవాలమును ♦ గోల్పులిచాఱలు గల్గి ధాత్రిఁ బ
ల్మాఱును ద్రువ్వుచుం బదత♦లంబున బావురుఁబిల్లిరూపుతోఁ
దాఱుచు గోచరించె నల♦దైత్యుఁడు కన్నియరూపుఁ బాయుచున్. 2615

విజయనందనవిలాసము, ఆ 3.

—♦ సర్పము. ♦—

ద్విపద. కాలకంఠకఠోర♦కరకంపితోగ్ర, శూలాగ్రనిర్గత♦స్థూలకీలాభ
లోలజిహ్వారుణ♦లోచనం బగుచుఁ, గాఱెడుఫణము భీ♦కరముగా ముడిచి
యాలోన నడఁగిన ♦ యమ్మహాభుజగ, మాలోహితాస్యుని ♦ నదరంటఁ గఱచె.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌర. భాగ 2.

మ. ప్రళయారంభకృతాంతభీకరకరా♦బ్జస్థూలపాశంబుతోఁ
దులఁదూఁగం గలయాకృతిం బొదివి వా♦తూలాశనస్వామి నా
ల్కలు వెల్లార్చుచుఁ బుట్టలో వెడలి యు♦గ్రస్ఫూర్తిమైఁ గోప మ
గ్గలమై పర్వఁగ రాసుతుం గఱచె ఫూ♦త్కారంబు తోరంబుగన్. 2617

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 5 పద్య 34.

—♦ అడవిపందులు. ♦—

సీ. ప్రబలదంష్ట్రాగ్రప♦ర్యస్తముస్తాస్తంబ, జంబాలశబలవే♦శంతపంక్తి
ఘనఘనాఘననీల♦ఘనవనపరిఘాత, ఘనఘూర్ణనావభ♦గ్నద్రుమంబు
ఘురఘురారవఘోర♦ఘోణాపరిఘూర్ణవి,దారితచ్ఛదాచ్ఛన్న♦కాంతలతము
శ్వసనఘుశాత్కారి♦ఖరఖురోత్పాతతతి,హల్యధాత్రీధ్వస్త♦యవసరాజి
గీ. ఘోటభటభావనోద్భటా♦ఖేటచటుల, కుటిలకటుకటాక్షేక్షణ♦క్షోభబధిర
మతిరభసభాసమానయా♦నాభిమాన, రామవిక్రియాకులము వ♦రాహకులము. 2618

ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 24.

సీ. కందూతికై రాయఁ♦ గర్కశంబగుతుంటెఁ, బీఁటవెట్టినమ్రాను♦పెల్లగిల్లఁ
జెవిఁదార్చివిని చీమ♦చిటుకన్న నొకపారి, సెలవి వెంపరలాడు♦జిట్టతెల్లఁ
జప్పరించువెదుళ్ల♦సటలుబ్బదంష్ట్రిగ్ని, చొంగపైఁబడి చుంయి♦చుంయిమనఁగఁ
జంద్రనివ్వాలువోలెఁ♦దిండిరించుకనుమించు, లెసఁగనొండొంటిపై♦నెక్కఁబా

గీ. వెట్టదినముల మడుఁగుల♦మట్టిగలఁప. బుడబుడధ్వనివెడలు బు♦ద్బుదములందు
జిలుపచిలుపని సేతులు♦జిడ్డుదేలు, నేమి చెప్పఁదుఁ గ్రొవ్వెన ♦ యేకలములు.
మనుచరిత్రము, ఆ 4 పద్య 17.

క. పొడిచినకైదువునకుఁ జమురిడఁగా వల దగ్గి కాఁక ♦ యింముక యిడినం
జెడుగట్టులఁగ్రుచ్చినసం,జొడు మంటలఁ దగిలి నెయ్యి♦జొటజొటవడియున్. 2620
మనుచరిత్రము, ఆ 4 పద్య 19.

సీ. జంభారిభిదురసం♦రంభంబు వీక్షించి, జరుగునంజనమహా♦శైల మనఁగ
ఝంఝూపవిభంజనా♦స్ఫాలనంబునకుల్కి, యరుగుసంవర్తకా♦లాభ్ర మనఁగఁ
గఠినకంఠేకాల♦కంఠమూలమువాసి, వెస వచ్చు నుజ్జ్వల♦క్ష్వేళ మనఁగఁ
గలుషధూర్వహాఖులో♦త్కరము పైఁ బఱతెంచు, దండధరక్రూర ♦ దండ మనఁగఁ
గీ. ఘుర్ఘురారావసంఘాత♦ఘూర్ణమాన, సప్తపాథోధిపాథఃప్ర♦చండనక్ర
తిమితిమింగలమగుచున♦భ్రమునుమహియుఁ,గ్రమ్ముకొనివచ్చునొక యేక♦లమ్ముఁగనియె.
మనుచరిత్రము, ఆ 6 పద్య 87.

సీ. ధరణిపై స్నేహంబు♦బెరయించె నన నేయి, యడుగువెంబడిబడి♦వడియు చుండఁ
దోడు రమ్మని హరి♦క్రోడంబుఁబిలిచె నా,ఘుర్ఘురారావంబు♦గుబ్బతిలఁగ
వడిఁ గ్రొవ్వు సెలవుల♦వెడలెనో యన నర్థ, చర్వితవదనము♦స్తములు చెదర
బంటుతనంబునఁ ♦ బాటిల్లుకీర్తుల, చెలువునఁ గొమ్ముల♦జిగి దలిర్పఁ
గీ. గాంతపాషాణయుతనూచి♦కలవిధమునఁ,గప్పుగందంపుఁగొనవెండ్రు♦కలుదనర్పఁ
బదరుచూపులమిణుగుర్లు♦పాఱఁజిమ్ము, వీఁక గల యేకలమ్ముల♦మూఁక యొకటి.
సుదక్షిణాపరిణయము, ఆ 3 పద్య 188.

—♦ వ్యాఘ్రము. ♦—

ఉ. గబ్బుసమక్షికంబయి మొ ♦ గంబడువన్దరుపర్ణముల్పడం
ద్రొబ్బుచుఁ గార్కొగిళ్ల రొద ♦ తోఁ బురడించెడుబొబ్బిరింతగా
డ్పుబ్బివిసంజ్ఞగాఁగఁ జెవు ♦ లూదినవల్లవుఁడుర్వ్రిఁగూలఁగా
బెబ్బులిగొంతుకోల్గిఱచి ♦ పెల్లున మాశ్మిడ ద్రెళ్లదాఁటుచున్ 2625
ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 19.

సీ. జాఠరశిఖిశిఖా♦జాతధూమంబుల, చాడ్పున నల్లని ♦ చాఱ లెసఁగఁ
గ్రోధదుర్మాగ్రసం♦రూఢపల్లవముల, చెలువున నిక్కిన ♦ చెవులు దనర
సకలమృగానీక♦శాసనోద్ధతవేత్ర, వల్లికచందాన ♦ వాల ముమర
వాస్యగహ్వరరస♦సాహీందవిషలతా,చ్ఛటలునాఁగఱుమి ♦సలు వడంక

గీ. నావురించుచు గబ్బున ♦ కడగు నీఁగ, మూఁకఁ గమియుచు సెలవులు ♦ నాకికొనుచు
భూరిభీకరభాంకృతు ♦ ల్పొదలఁ గొన్ని, పొదలనడుచక్కి బెబ్బులి ♦ గదిసెనొకటి.
చంద్రభానుచరిత్రము, ఆ 2 పద్య 39.

సీ. కులిశధారలఁబోలు ♦ కోఱలుగలనోరు, దెఱచినఁ జూపఱు ♦ దిగులు బొంద
ముచ్చన్నెచాఱల ♦ మొదుకవకెనమైన, మేనిచాఁ పత్యుగ్ర ♦ మైనటింప
దండధరోద్దండ ♦ డిండిమధ్వనిబోలు, రవలిరొప్పులసృష్టి ♦ చెవుడుపడఁగఁ
గొలిమిగూఘులవంటి ♦ ఘోరంపుఁగన్నుల, జోరున నిప్పులు ♦ కారుచుండఁ
గీ. జేర్చి కుప్పించి వాల ము ♦ల్లార్చి నేల, గగ్గలిల్లంగ నిజపాద ♦ ఘట్టనమున
వాలునాఁకటికినుక శా ♦ ర్దూల మొకటి, ధాటి వెన్నాడు నొకచిన్న ♦ లేటిబోటి.
సుదక్షిణాపరిణయము, ఆ 5 పద్య 58.

## —♦ సింహము. ♦—

చ. నృపవర చూడు మల్లదె ద ♦ రీకుహరాంతరదంతదంతుర
ద్విపనిపత న్మృగేంద్రమతి ♦ దీర్ఘభయంకరవాలమున్నట
ద్విపులసటాభిరామతను ♦ దీధితిభవ్యము దీనిరూపు ని
శ్చపలత వ్రాసిచూడఁగ న ♦ శక్యము చిత్రపటాంతరంబునన్ 2626
మ. అదిగో వేఱొక సింహశాబకము దం ♦ ష్ట్రాభీలలీలన్ సట
ల్గదలించె న్గతురక్తదృష్టభయదా ♦ కారంబుతోఁ దిన్ననై
పదము ల్మీఁదికి నెత్తి నాద మెసఁగన్ ♦ భద్రేభరాజంబుపైఁ
బొదవెం గ్రౌర్యముతోడ దీనివిధము ♦ ల్బాభిమీశ కన్గొంటివే. 2627
వాసవదత్తాపరిణయము. ఆ 2 పద్య 13, 14.

సీ. క్ష్వేళాధ్వనులచేత ♦ క్షితిధరమ త్తేభ, ములు గుహాముఖముల ♦ మొర లిడంగ
రూక్షేక్షణంబుల ♦ నత్యుగ్రతరతిమి, రద్విరదంబు లూ ♦ రక యడంగ
దంష్ట్రానఖచ్ఛవిఁ ♦ దాపింఛవనగుప్త, వారణంబులు గడు ♦ భయ పడంగ
సంచలద్ఘనసటా ♦ చ్ఛటల గాలినిదూలి, కయిగలమొగములు ♦ గుయి లిడంగ
గీ. వాలహస్తాహతులఁ బృథ్వి ♦ వడి చెడంగ, నల్లనల్లనఁ జెరలాడ ♦ నటఁ గడంగ
నన్ని మెకములు నోలము ♦ నం దడంగ, నల్లసింగంబు వెలుఁగొందె ♦ నగపడంగ.
బిల్హణీయము, బింబ. 2 పద్య 98.

## —♦ భల్లూకము. ♦—

మ. భల్లూకంబులఁ జూచితే తిమిరసం ♦ పల్లాలితాంగప్రభో
ద్యల్లీలన్ ఘన నీలనీలఘన సం ♦ ఖ్యం బెప్పుడుం జేయఁగా

వల్లీవేల్లిత వామలూరువులకే శ్రీవం గొంటుజుంటేఁగలం
డెల్లంగుయ్యిడఁ దేనియల్గొనెడు భూ♦మీశావిచిత్రంబుగన్. 2629

వాసవదత్తాపరిణయము, వ.పీ. ఆ 2పద్య 15.

## —♦ చిలుకలు. ♦—

క. శుక మొకటి చంచుజితకిం, శుకమై హరిహయ శరాస ♦ నురుచిర వపురం
శుకమై తనుమారకరకిం, శుక మానందమున నంద ♦ నుతుగుడిఁ బెరుఁగున్. 2630

పాండురంగమాహాత్మ్యము, ఆ 4 పద్య 220.

చ. అడుగులు గెంపుతాఁ గిలుకు ♦ టందియలందము బచ్చతా మెఱుం
గడలఁగఁ ద్రొక్కు టెక్కులప ♦ యింగలరంగు బలాశకోరకం
బడుగునఁ ద్రోయఁ జాలిన ము ♦ ఖారుణకాంతియుఁ జూచి నెమ్మది
న్గడుఁ బ్రియ మావహిల్లఁ జిలు ♦ క న్వెసఁ బట్టి కొనందలంపుచున్. 2631

విజయానందనవిలాసము, ఆ 2.

సీ. గగనలక్ష్మీచారు ♦ కరతలవిన్యస్త,కాంచనమయకందు ♦ కం బనంగ
మధ్యాహ్నకాలార్య ♦ మణిభిన్నమం దేహ,మస్తకచ్యుతహేమ ♦ మకుట మనఁగ
హరిసభానాట్యవి ♦ హారరంభాపద,గళితజాంబూనద ♦ కటక మనగఁ
నందనోద్యానవ ♦ నస్థచంపకభూజ,సంత్యక్త కుసుమగు ♦ చ్ఛం బనంగ
గీ. పూషతురగనికాపింఛ ♦ పుష్యరాగ, సురభుగురుతనుకాంతివి ♦ స్ఫురణఁ దనరి
మిన్ను దిగజాఱి పద్మిని ♦ మేడకడకుఁ,దేజ మలరంగ వచ్చె నా♦రాజశుకము.

పద్మినీపరిణయము, ఆ 3 పద్య 147.

గీ. నీ లసద్వేగము సువర్ణ ♦ లీల నలరు, నీ లసన్మూర్తియు సువర్ణ ♦లీలనలరు
నీ లలితసూక్తియు సువర్ణ ♦ లీలనలరు, నీసువర్ణతద్విజలీల ♦ నెఱపు టరుదె.2633

ఇందుమతీపరిణయము, నృసిం. ఆ 3 పద్య 15

సీ. అపరంజి మెఱుఁగుటం ♦ దపుముఖద్యుతిసంచు, జలజరాగచ్ఛాయ♦ నెళవుసేయఁ
గలికిచిన్నారిచో ♦ క్కుపుటెక్కులబెడంగు,మరకతాళిచ్ఛాయ ♦ నెఱుకసేయ
నాకంఠహృదయప ♦ ర్యంతకాంతిచ్ఛటల్, పుష్యరాగచ్ఛాయ ♦ పొందుసేయ
నలుదిక్కులీక్షించు ♦ నయనమరీచికల్, చక్రనీలచ్ఛాయ ♦ చనువుసేయ
గీ. దివ్యమణిమయమో యనాఁ ♦ దేజరిల్లు, సుందరస్ఫూర్తిఁగమఁగొన్నఁ♦జూచువార
లౌ ననంగ జగన్మోహ ♦ నాంగమైన, యొక్క రాచిల్కఁగనియెదా♦మోదరుండు.

ముకుందవిలాసము, ఆ 2 పద్య 5.

సీ. కందుండు చైత్రుండు ♦ పందెంబువెట్టి జో,కగసాదుపచ్చబం♦గరము లనఁగఁ
మరుఁడును రతియు స ♦ మ్మదమున నాడెడు, పచ్చలుగూర్చిన ♦ బంతు లనఁగఁ
గదలఁబాలుటచేతఁ ♦ గానకన్నియమిన్న, సిగజాలుమరువంపుఁ ♦ జెం డ్లనంగఁ
గప్పకమునఁబండ్లు ♦ గైకొనరాలిపి, త్రోయంగఁబడుపచ్చి ♦ కాయ లనఁగ
గీ. దెరువరులమూఁకపైకినే♦డ్తెఱనుజేసి, దర్పకుఁడుదోలుగుత్తాల ♦ దం డనంగ
మిగులఁగ్రొవ్వనమింటికి ♦ సెగసిడిగుచు, నున్నచిలుకలమొత్తంబు♦నువిదచూడు.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 3.

## —♦ హంసలు. ♦—

సీ. విలసితజంబాల♦పులినభాగమున నుద్దండపద్మాతప♦త్రింబునీడఁ
గమలకాండకఠోర♦కంటకాంకురపంక్తి, నొయ్యనఁగంధరం♦బొరసికొనుచు
నొంటికాలనె నిల్చి♦యూర్మిమారుతములఁ, జిగురుటెక్కలరేకు♦లెగయుచుండ
విశదమైపక్షతి♦ద్వితయంబులెడజాఱఁ, జంచులోకించుకా♦కుంచితముగ
గీ. వరుణరాజునకిడినచా♦మరమువోలెఁ, బొడుపుమిగిలిన వెలిదమ్మి♦పువ్వుఁబోలె
నిబిడనిద్రాభిముద్రిత♦ నేత్రమైన, రాజహంసంబుఁ గాంచె సా♦రాజసుతుఁడు.

శృంగారనైషధము, ఆ 1 పద్య 98.

సీ. మరునశ్వగతి మెచ్చి♦సురలునైచినపైఁడి, వ్రాఁతక్రొమ్ముఁగుదు♦వ్వాలువలనఁగ
దర్పకునెఱరౌతు♦తనముపేర్మికిఁగ్రుమ్మ,కొను సతేజఃకీర్తి♦ఘనము లనఁగ
హాయఫేనధావళ్య♦యాభ్యాగ్రమైవ్రాలు, తటిదనుగతసితా♦బ్దంబు లనఁగ
వాజివిభ్రమజితా♦వర్తతఁ దొలఁకుది,ఫ్యాలమేటిసాబ్జరే♦ఖూర్మ్ము లనఁగఁ
గీ. గనకరేఖలతోడి టెఁ♦క్కలబెడంగు, చూపఱకుఁ గనుపండువై♦సొంపుమీఱ
జలదపథమునసుండిభూ♦స్థలికి డిగ్గి, హంసములు వర్ణనాసీమ♦నతకరించె. 2637
సీ. ఇట్లు గన్పట్టుచు ♦ నేతెంచి యంచలు, వసుధచేరువ నేట♦వాలుగాఁగ
వతివిశ్చలపరిసా♦రితపతత్రింబులై, డిగుచుఁ గామునిముంద♦టికిని గొంత
సరిఁగడవఁగఁ బాజి♦మఱలిబోరలుదట్టి, గిలనొక్కకడపంచి ♦ మలపుదిరిగి
యొక్కలంతటరెండు♦ నెఱయఁజక్కఁగఁజాఁచి,యపనిగాల్మోపి టెఁ♦క్కార్చిముడిచి
గీ. మొగములోకవింత యొయ్యార♦ముగమలంచి, యీఁకనువిదిర్చికొనుచునొ♦క్కిం
త దడవు
హైమరేఖావిచిత్రని♦జాంగరుహవి, నిర్మలతఁజాడ్కులకునింపు ♦ నింపుచుండె.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 41, 42.

సీ. మొనరెండుగాఁగఁదె◆వ్వినవిద్రుమద్రుకం,దము నేలు ముక్కునఁ◆దడవితడవి
మొగవిచ్చు పసిఁడిగే◆దఁగిఱేకుగమి మించు, విశదచ్ఛదములను◆విదిర్చివిద్రిచి
నగుమొగంబులదాస◆నపుఁగ్రొవ్విరులనవ్వు, చిగురాకునడుగులఁ◆జిమ్మిచిమ్మి
నిద్దంపుఁ బండువె◆న్నెలగుత్తి కడకొత్తి, మలయుమైముంపులఁ◆గలఁచికలఁచి
గీ. శార్ఙ్గసౌధప్రఘాణకా◆సారసార, సారసామోదమేదుర◆వారిఁ దేలి
వచ్చియాయంచగుడిలోనఁ◆జొచ్చెనొక్క, నాఁడుపవలింటిబీఱెండ◆వేఁడిఁదలఁకి.
పాండురంగమాహాత్మ్యము, ఆ 4 పద్య 220.

చ. పగడపుఁజాయముక్కులును ◆ బాదయుగంబులుఁ బైఁడిఱెక్కలున్
జిగినునుసోగవెన్నెలలఁ ◆ జిమ్మెడుమేనులు మించ నంచలీ
గగనతరంగిణీవికచ◆కాంచనకంజవనీ గృహంబులన్
సొగసి రమింపుచున్నయవి ◆ చూచితె చారుచకోరలోచనా. 2640
వాల్మీకిచరిత్రము, ఆ 3.

—◆ గరుత్మంతుఁడు. ◆—

మ. హరిదంతద్విపదంతకుంతశిఖరా◆హంకారనిశ్చింతని
ర్జరరాజార్జితవజ్రజర్జరితవి◆చ్ఛాయైకరోమచ్ఛవి
స్థిరవిద్యుత్ప్రతిపక్షపక్షుఁడయి వ◆చ్చెన్ వైనతేయుండు భా
స్కరబింబప్రతిబింబమంబరము మ్రిం◆గం బోలుచందంబునన్. 2641
ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 105.

సీ. వజ్రంబునకు నీఁక◆వయిచినబలశాలి, గజకచ్ఛపాశన ◆ ఘాతుకుండు
జననిదాస్యంబు నీఁ◆గినకులశ్రేష్ఠుండు, దుర్లభామృతవశ్య◆తోహరుండు
కమలాప్తసారథి ◆ గారాబు దమ్ముండు, కశ్యపకృతపుణ్య◆కర్మఫలము
సకలశకుంతౌఘ ◆ సామ్రాజ్యధౌరేయుఁ, డహిమృగయావ్యస◆నాకులుండు
గీ. మింటిపాశెంబులేర్చు ము◆క్కంటితూపు, గతినిపాతితరోహిణ◆స్కంధుఁ డనిల
మానసాతీతవేగసం◆పన్నుండు, తార్క్ష్యుఁ డేతెంచె దానవ◆ధ్వంసికడకు. 2642
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 72.

సీ. కుప్పించు మరవడిఁ◆గుంభిని వడిఁ గ్రుంగి, సర్వాధిపతితలల్ ◆ సదియు నదుమ
నెగయు నూఁకున మీఁది◆కెత్తిపాటిన తరు, శ్రేణులు చుక్కలఁ◆జెదర నదువ
నెఱకలు జాడించు◆నేపునఁ గడలెత్తి, యేడువారాసులు ◆ నెడము లొత్తఁ
బలుమ బల్వడి నక్షత్ర◆పంక్తులు నుడిగొంచు, వలమునంపుఁ గొంపోయ◆ప్పలికిఁ దూలఁ

ఆ. బర్హ్యశ్మములు పదఁక♦బ్రహ్మాండకోటర, మదురువ గగనవీథి♦నరుగుడెంచె
రఘుకులేంద్రబంధ ♦ విఘటనత్వరితాంత, రంగుఁ డగుచు నవ్వి♦హంగవిభుఁడు.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 625.

సీ. శ్రీమహోన్నహా♦శిఖరోపమానమై, డాలించుమణికిరీ♦టంబుతోడ
సతులఘృణామణి♦ద్యుతులచే నసియాడు, పన్నగకుండల♦ప్రభలతోడ
నాజానుదీర్ఘబా♦హాగ్రవమరకత, కమనీయమణికంక♦ణములతోడఁ
గాంచనాచలముపై♦మించుబాలాతప, శ్రీలీను చెంగావి ♦ చేలతోడఁ
గీ. జకచకలు జల్లుముత్తెపు ♦ సరులతోడ, నాత్మమణిమేఖలావల♦యంబుతోడఁ
గనకమంజీరచరణయు♦గ్మంబుతోడ, నక్షరుఁడు తార్క్ష్యుఁడపుడు ప్రత్యక్షమయ్యె.
శ్రీరంగమాహాత్మ్యము, క. వ ఆ 1.

సీ. అదె సుధాకరబింబ♦మానొకో కాదొకో, కాదు చక్రాసి నమేత్ర♦గంబు గాని
అదె పక్షయుతమేరు♦ వౌనొకో కాదొకో, కాదు సందీప్త వి♦గ్రహము గాని
యవె కల్పతరుశాఖ♦లౌనొకో కావొకో, కావు మహాభుజా♦గ్రములు గాని
యవె మణిస్తంభంబు♦లౌనొకో కావొకో, కావు స్ఫారోరుయు♦గ్మంబు గాని
గీ యనుచు జగములు గొనియాడ♦నాక్షణమున, శౌరి దనుబంపఁ జపనాతి♦జవనరేఖ
నైనతేయుండు పరమపా♦వనవిధేయుఁ, డరుగుదెంచె వసుంధరా♦స్థలికడకు.
సుదక్షిణాపరిణయము, ఆ 4 పద్య 113.

—♦ పావుగము. ♦—

సీ. సౌధకేతనపటాం♦చలవాతధూతని, ర్గతగాంగడిండీర ♦ ఖండ మనఁగ
సితమహానిపూర్వాస♦సితభూపునర్లిప్త, మగతేంద్రనాగల♦తాంత మనఁగ
నవహారసంఘట్ట ♦ నక్షత్రపతియూథము, గగనలక్ష్మీహారకాంతి♦కం బనఁగ
మధ్యందినానంత♦మణిలూనమందేహ, సంధ్యాక్తఓరుగైక ♦ శంఖ మనఁగఁ
గీ. పంకరుహసంభవకళత్రి♦పత్రిపుత్రి, సురకులధురీణకంఖాణ♦కరకృపాణ
రమ్యధావళిజైత్రపా♦రావతంబు, రాఁచోడఁగఁ జెక్కఁగెగిపడ్డ♦క్రమముదోఁప.
సారంగధరచరిత్రము, చే. వేం. ఆ 1 పద్య 127.

—♦ డేగలవేఁట. ♦—

గీ. కణుజు సాళుపమును జల♦కక్కె లగుడు, జాలి డేగయు మొదలైన ♦ మేలిడేగ
తెగలఁదగ నేర్పరించియ♦త్తెములనుంచి, కదలె నృపునెంబడినయూడి♦గములగములు.
ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 402.

సంపంగిపొదరింటి◆చక్కి గోరంటఁ గాంచి, యనురంచుమగిడినో◆రూరునవియుఁ
గలిగొట్టుపసరు మెఱుఁ◆గ్గులఁ గోర్కి పొలివోయి, మునుపటి మొల్లల◆మూఁగునవియు
ఆ. తగుచుఁ దేఁటికదుపు◆లామనిఁ దలసూపెఁ, జూపుదనుక నెల్ల◆చోట్లఁదోఁట
యందుఁ దామ యగుచు◆నమ్మరు నెలగోలు, పొఁజులనఁగఁజూడ్కి◆వందువగుచు.

పారిజాతాపహరణము, ఆ 3 పద్య 51.

చ. కరకరి గూఁటఁ గఱ్ఱియిడఁ◆గా మొఱవెట్టెడులీల బాలభా
స్కరకరకాండకందళి వి◆ఘట్టన నించుకవాయివడ్డ తా
మర మొఱవెట్టిపెట్టి పలు◆మాఱును వాఁకిలిదాఁటి యూఁగుచున్
మొరయ విపంచిమీటుగతి ◆ మ్రోసి యళుల్ వెడలెం గొలంకులన్. 3651

మనుచరిత్రము, ఆ 3 పద్య 60.

చ. అదరు నవీనభానుకిర◆ణానల మంటినఁ గూడుకొన్నపు
ప్పొడికొలు చెల్ల మోచికొని◆పోయెడిసంభ్రమ మొప్పఁ గంటివే
పడఁతి భవద్విహారవన ◆ పద్మసరః కుముదాలయంబులన్
వెడలుమిళిందబృందములు ◆ పీఁపుపిశంగిమకైతవంబునన్. 2652

మనుచరిత్రము, ఆ 3 పద్య 61.

క. కమలిని పూజ రొనర్పఁగ, సమకట్టి దివాకరునకు ◆ సద్భక్తిని ధూ
పము లొసఁగె ననఁగఁ దనరెం, గమలములను దిరుగు తేఁటి◆గము లయ్యెడలన్.

వాసవదత్తాపరిణయము, వ. పీ. ఆ 4 పద్య 24.

ఉ. గూఁటను గఱ్ఱఁ బెట్టినను ◆ గోయని మొఱ్ఱలుసేయుభంగినిన్
సూటిగ భానుదీధితులు ◆ సోఁకిన పంకజగర్భసుప్తులౌ
తేఁటులు వెక్కలార్చుచును ◆ దీయని పువ్వురసంబుఁ గ్రోలుచున్
బాటలు పాడఁగాఁ దొడఁగె ◆ భాసుర దివ్యసరోవరంబులన్. 2654

పద్మినీపరిణయము, ఆ 4 పద్య 70,

—◆ చక్రవాకములు. ◆—

చ. కొలకొలఁ గూయుఁ బైనొఱగుఁ ◆ గుత్తుకఁ గుత్తుకఁ జొట్టుఁ బొలుచి
ల్వాలక్రియఁ గానరాని గతు◆లన్ మయిమైఁ బెనుచున్ జనించున
క్రులఁబుత నెత్తు సోలు నిలు◆చున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలఁపవు కంటె పాసినవె◆తల్ దలఁపించుచుఁ గోకదంపతుల్. 2655

మనుచరిత్రము, ఆ 3 పద్య 62.

—♦ చక్రవాకి—వియోగిని. ♦—

సీ. ఏవిహంగముఁగన్న ♦ నెలిఁగించుచునుసారె,కును సైకతంబులఁ♦గూడఁదారుఁ
దారికన్గొని యది ♦ తన జోడుగాకున్న, మెడయెత్తి కలయంగ ♦ మింటనరయు
నరసికన్నీటితో ♦ మరలితామరయొక్క, వదనమెండఁగసరో♦వారిసద్దు
వద్దిరా వఁగసైఁప ♦ కట్టిట్టుగన్గొని, ప్రతిబింబ మీక్షించి ♦ భ్రమసియుబుకు
గీ. నుఱికి యొఱకలుదడియ వే♦టొక్క తమ్మి, కరుగునరిగిరవంబుతోఁ♦దిరుగు తేంట్లఁ
బొడుచుముక్కునమఱియును♦బోవువెదక, సంజఁబ్రియుఁబాసిపగనొక్క♦చక్రవాకి.

మనుచరిత్రము, ఆ 3 పద్య 15.

—♦ జలచరములు. ♦—

సీ. నీరుకుమ్మరపుర్వు ♦ నీరిఁగె తలకప్ప, తెలిజెమ్మకరివేళ్ల ♦ పాలికె నత్త
గుల్ల చుట్టుడుగుల్ల♦కురిమింద నాచుడు, గవ్వ మురుండము ♦ కాకిచిప్ప
నులిగుల్ల యెఱబిల్ల ♦ పురుగు గోదురుగప్ప, కప్ప కత్తెరి యెండ్రి♦కాయ జెలగ
గులకరింతయు నీరు♦గుట్టు శంఖనఖంబు, పలుకాసినసిమిరి ♦ బంగపురువు
గీ. పెలుక నిర్ఘాత కోచు తాఁ♦బేలు పిడక, మొసలిశింశుమారము పెద్ద♦మొసలినీరు
పాప నీరెన నీర్చలి♦ప్రాచిపురువు, లాది కొఱగానిజంతువు♦లన్నివిడిచి. 2657
సీ. కొరదు దాసరికొయ్య ♦ కొఱ్ఱమీ నులస ము,చ్చంగి బేడిస జెల్ల♦చారమీను
వాలుగు ముకుదొమ్మ♦వల్లికతట్ట పు,త్తడికాను పూమేను♦కడిసెలంబు
పక్కె చిత్తర నీరు♦పాపెర మలుగుమీ,నరిజె యిల్లెపుచేఁప ♦ యాకుజెల్ల
మిసికల్లు రుజా తేలు ♦ మేను తొల్లికజాతి, గొరక మాపురమును ♦ గుంటముక్కు
గీ. మోర పక్కెర దొండును♦గూరముక్కు, పుల్లరుజు గెజ్జె గెండయు♦బొమ్మిడాయ
యల్లెద మ్మత్స్యపుచేఁపయు♦గొల్లదొందు,పరిగెరొయ్యాదియగుమీలఁ♦బట్టునతఁడు.

హంసవింశతి, ఆ 4 పద్య 186, 187.

# దేశములు.

సీ. పాంచాల పాండ్య బ♦ర్బర కిరా తాభీర, కురు విదేహ విదర్భ♦కుకుర గౌళ
గాంధార మగధ కొం♦కణ కళింద పుళింద, సింధు సౌవీ రాంధ్ర ♦ చేది చోళ
సాముద్ర సాల్వ కో♦సల కళింగ కుళింగ, వత్స సౌరా ష్ట్రాంగ ♦ వంగ మత్స్య
నూరసేన సుదేష్ణ ♦ సుహ్మ కాశ కరూశ, లాట కర్ణాట మా♦ళవ వరాట

గీ. కుంత లావంతి ఘూర్జర ♦ కుహ్మక త్రిగర్త బహుధాన యవన కొం♦కణ దశార్ణ
పుండ్ర బాహ్లీక ద్రవిడ కాం♦భోజ హూణ, కేకయ వసాతి కాశ్మీర♦కేరళములు.

ఉత్తరహరివంశము, ఆ 5 పద్య 144.

సీ. ద్రవిళ విదేహ మా♦ళవ మత్స్య మళయాళ, కొంకణాంగవిదర్భ♦కురుపుళింద
చేది టంకణ వత్స♦సింహళ కర్ణాట, మగధ ఘోట కళింగ♦మద్ర యవన
కుకురు బాహ్లీక పౌండ్ర ♦ ఘూర్జర నేపాళ, శక వంగ కాంభోజ♦సాల్వలాట
సౌరాష్ట్ర చో ళాంధ్ర ♦ శబర పాండ్య వరాట, కుంతల కేక యా♦వంతి కాశి
గీ. నాట కరహాట [illegible] సింధు [illegible] కేక [illegible] పాంచాల♦శూరసేన
కోన లోత్కల [illegible] హూణ బాహ్లీక సర్వదే♦శములు జూచి..

మా [illegible]ంశతి, ఆ 4 పద్య 14.

## —♦ ఆంధ్రదేశము. ♦—

సీ. కొత్త బియ్యము కాయ♦గూర లొబ్బట్లు నై,సంపు బూరెలు పంచ♦దార యావ
వడలు నల్లంబు మీ♦గడలు బియ్యని పెర్గు, కమ్మని సిరిపాలు ♦ గసగసాలు
చిఱు సెన్నపప్పును ♦ తేఱుచు పిష్టంబులు, కంబళ్లు నంబళ్లు ♦ కంచుకములు
ఇంగువ జిలకఱ్ఱ ♦ నెనసిన మిరియంబు, మడము వాసన నెయ్యి ♦ మాటనురును
గీ. లనుచు రణశీల మొప్పగం♦ధాక్షతముల,నందమిం పొందు శిఖులు వో♦య్యారి వడలు
గలిగి కాంతలు పురుషులు♦గలిగి సిరుల,జెలగు నయ్యాంధ్రదేశంబు♦ చెలువు గాంచి.

ఒడయనంబిపిలాసము, ఆ 5.

ఆ. మహిమ నుశోభనక ♦మకరంబులను జీవ,నార్థజనత సేవ్య♦మగుచు మధ్య
మస్థబాడబాతి ♦ మహితమౌ నబ్ధినా, నాంధ్రదేశలీల ♦ లతిశయించె. 2662
శా. ఊరూరం దొక కూర్గుడే యధిపుడై ♦ యొప్పం జిరం బొత్తనిన్
మీఱం జాలక లెక్క జెప్పుదురు సా♦మ్రాజ్యంబున న్వీపురిం దుం
డీరీతిం దగు నందుం దామరుతలం♦బందుండు కాసార మ
ట్లారూఢాద్యయనాధికారియగు శ్రీ♦ప్రాగ్వీసరుం డున్నద
త్పైత్రికపంబున హీనవర్ణనమునన్ ♦ విస్తృష్ట్యగూర్చెనమున్. 2663

విశ్వగుణాదర్శము, తి. బు. చి. తా. పుట 33.

## —♦ ఘూర్జరదేశము. ♦—

ఉ. చెక్కులపచ్చబొట్లు మృదు♦చేలములం గల గూడకట్లు సొం
పెక్కనదివ్యగాత్రములు ♦ నింపు జెలంగు విశాలనేత్రముల్

చిక్కరలీనుమూపులు కుచంబులు గానఁగరాని కీవులన్
జక్కఁగఁగల్గి వర్తిలెడు చానల ఘూర్జరభూమిఁ జూచుచున్. 2664

క. చిలుసెనగపప్పు నూనెయుఁ, గరముగ తీపైన పెరుఁగు కడుసైదముతోఁ
దొరసినఖజ్జము లల్లము, గురుతరముగఁ గుడిచి రపుడు ఘూర్జరభూమిన్. 2665

ఒడయనంబివిలాసము, ఆ 5.

## ——కళింగదేశము.——

ఉ. పొక్కిలిక్రిందికట్టు పరిపూర్ణములైన కుచద్వయంబునుం
జిక్కని కప్పుకొప్పులును జేరలమీఱు విశాలనేత్రముల్
జక్కనిహస్తపద్మములు సౌఖ్యము లిచ్చెడు దేహవల్లులున్
మక్కువగల్గు కాంతలను మానిని చూడు కళింగధారుణిన్. 2666

సీ. జొన్నకండెలును దేనె సన్నపంటకములు, లాజిలుకుఁడ పెల్లంబు కొండ
కంద [illegible] పచ్చళ్లు, [illegible] పోకని పాలు నిమ్మరసము
వేప [illegible], [illegible] సఫుప్రూలుగల్గు బల్లటాలు
[illegible] కమ్మలు గడునువగలు
గీ. [illegible] ఖిలఘనములు మధురభక్ష్యములుపచ్చ
[illegible] గొలును గళింగావనీస్థలి ననుభవించి. 2667

ఒడయనంబివిలాసము, ఆ 6.

## ——కర్ణాటదేశము.——

చ. పరిఖనగరంబున న్వనులు భాసిలు నిందుఁ దలంచిచూడఁగాఁ
బరిఖవనులందుఁ బూగములు పక్వములై విలసిల్లువానితోఁ
బ్రబలిపనుమంబున న్మృగి [illegible] పరిలస్మై న్ప్రవియించుచుండు నీ
పరిభ నిరంతరంబుగను భాసిలుఁ గన్నడదేశ మంతయున్. 2668

విశ్వగుణాదర్శము, తి. ఋ. చి. తా. పుట 35.

## ——మహారాష్ట్రదేశము.——

మాలినీవృత్తము. అతిమధురజలాఢ్యం బద్భుతాద్రిప్రకాశం
బతిసురపురసామ్యంబౌ మహారాష్ట్రదేశం
బతులవిభవసంపన్నాఢ్యు లిచ్చోటి గృహస్థుల్
సతతవిబుధపూజాసంయుతుల్ సద్గుణాఢ్యుల్. 2669

విశ్వగుణాదర్శము, తి. ఋ. చి. తా. పుట 29.

## —♦ జిల్లాలు. ♦—

సీ. కుంభకోణము కన్ని♦కోట కర్నోలు బళ్ళారి చిత్తూరు సే♦లంబు కడప
కబడాల బందరు ♦ కనరామధుర తిర్నె,వల్లియు తిరిచెనా♦పల్లిమఱియుఁ
గోయముత్తూరు మంజ ♦ కుప్పంబు నాఁగఁజెం,గల్పట్టు నెల్లూర♦నల్పపటిమ
వఱలు గుంటూరు బం♦దరును రాజమహేంద్ర,వరము నాఁగవిశాఖ♦పట్టణంబు
గీ. సనఁగ శ్రీకాకుళము గంజ♦మనఁగఁబరఁగు,నిరువదియురెండుజిల్లాల♦కిరవుమీఱు
రాజకార్యంబులకు నెల్ల♦ రాజధాని, యాపురప్రాభవము భువి♦నసదృశంబు. 2870

చెన్నపురీవిలాసము, మహిమప్రకరణ. పద్య 2.

## —♦ గ్రామములు. ♦—

సీసమాలిక. రాయదుర్గము గుత్తి♦రాయవేలూ రాసె,గొందిమాహురికాపి♦గోలకొండ
ముంగిపైఠిణి డిల్లి ♦ ముఖువాయజాబురా, బారుమబ్బా మహా♦మూరు మచిలి
బందరు సూరతు ♦ చెందెరు గోవేరు, శ్రీరంగపట్టంబు ♦ చెంజి కాంచి
బాదయు నౌరంగ♦బాదు దౌల్తాబాదు, కర్పూర నాగర ♦ గదుగు బిదిలి
కోట కళ్యాణము ♦ గోందానమహముదా, నగరంబు బంగాళ ♦ నరసగోన
పన్నాళ చదరంగ♦పట్నంబు గలగల, గజరాజధాని బం♦గాపురంబు
కాంబాగర ప్రియా♦గ ద్వార కాయోధ్య, లక్ష్మేశ్వరంబు సో♦లాపురంబు
మధుర కొల్లాపురి ♦ మగధ మా యావంతి, కాపురాణపురముల్♦కాబలగయు
నాదవేని కళింగ ♦ మానూరు వినుకొండ, కొండవీడును నేల♦కొండపల్లి
పాదిలె తంజాపురం ♦ బుదయగిర్ కైనూరు, మైసూరు పెనుగొండ♦మంగళగిరి
బనువపట్నము సీర్పి ♦ భద్రాచలము పాల, వంచ నిజాంపురి ♦ వందవాసి
కుందిర్పి బెల్లము♦కొండ దేవరకొండ, రాచర్లమునిమడ్గు ♦ రాయపురము
సైదాపురము ధ్రోవ ♦ సాళ్వాక దూపాడు, రాపర్తి మాచెర్ల ♦ రాచవీడు
బనగానిపల్లెకం♦భము పోరు మామిళ్ల, ధారాపురము చీని ♦ తాడిపర్తి
నంద్యాల చిరువళ్ళి ♦ నందవరము కందు,కూరు రామయపట్న♦మారుబండ
హంపి విరూపాక్షు ♦ మారణి వెంపలి, కాంపిల్యనగరంబు ♦ కందనూరు
కడప సిద్ధవటంబు ♦ గండికోట కనూరు, సింహాద్రి పుట్లూరు ♦ చింతగుంట
గయ చెన్నపట్నంబు ♦ గండవరం బోరు,గల్లు దామెనచెర్వు ♦ వెల్లటూరు
కల్లూరు కలువాయి ♦ నెల్లూరు వేలూరు, రాచూరు చదుమూరు ♦ రాచకొండ
కనిరికూటాగుళ్ల ♦ గంగేరు శృంగేరు, రామళ్లకోట వ♦జ్రగిరి నునుము

నూఁగూరు చోబాడ ◆ బాగూరు కొళ్ళాల, గుడిబండ బళ్ళారి ◆ కొత్తకోట
గుమిలేనిపాళెంబు ◆ గొబ్బూరు బల్లాపురము పుంగనూరాకు◆రామటెంకి
మానవ కాతాళ ◆ మానుకొండ డైనూరు, జలపూరు పెదవలి ◆ జల్లికోట
కుంభకోణము కోట◆కొండ తంజావూరు, పెరవలి దువ్వూరు ◆ బెంగుళూరు
నోత్తూరు చిత్తూరు ◆ హుణి చిర్తనాపల్లి, రాజవో ల్గద్వాలు ◆ రాచవగరు
చిరుతని కాళహ◆స్తి సినూరు మధ్యార్జునము తిరునామల ◆ నామకొండ
పాకఁ కావేరి◆పాక మోహనగిరి, చదుకూరు మల్లూరు ◆ చాదుకొండ
పాగొండ వాపిలి ◆ నాగోలు తాళ్లూరు, మైలాపురము బెద్ద◆మంగళంబు
రామసముద్రంబు ◆ రామాపురము జట, పోలూరు వెల్లాల ◆ భువనగిరియు
హరిపనల్లి బేద ◆ నరవారి గొండాపురము గౌరి మాయూర ◆ మమర వీడు
నడిగల్లు కొక్కల్లు ◆ కడవకోలయు రత్నగిరి వెలిగోడు తం◆గిళ్ళదర్శి
కంగొంది తనుకొండ ◆ గడవ నెల్లిము దూస్తి, నివనగాళ్లవళంది ◆ సింగళంబు
మన్నారుకోవెల ◆ సొన్నగలు చిదంబరము వాగెనగరి పు◆రాణపురము
పడియూరుపాళెంబు ◆ నుడిపి సుబ్రహ్మణ్య, ముజ్జంగి మండువా ◆ మోసవగలు
రామనాథపురంబు ◆ మాముగోళ్ళ జెడంద, ధర్మవరంబును ◆ దాడిగోళ్ళ
మవణికె మండెము ◆ మారకపురి కుంభి, హాదంగ ముజ్జారి ◆ హాలికె హల్లి
రెట్టిహాళి కురంజి ◆ రేవణి సన్నకి, బాగూరు గుజ్జరి ◆ పాలువాయి
రామచంద్రపుర ◆ మామూరు బెజవాడ, కొండవీరు కాంచూరు ◆ కోటకొండ

గీ మొదలుగాగల్గు జనపద◆మ్ములను దుర్గములను బేటలఁ బాళెలఁ◆బురులవెలయు
వర్తకులు వచ్చి గిచ్చలి◆వస్తుతతులు, బేరసారంబు లాడెదు ◆ పేర్మి మెఱసి.

హంసవింశతి, ఆ 5 పద్య 35[illegible].

—◆ వేఁగినాడు. ◆—

ఉ. వేఁగిననాడు పల్లవుల◆పుత్రుత మయ్యాది వేఁగినా డనన్
వేగులు రాచకార్యముల ◆ వేగులు మాటల వేఁగినా డనున్
వేఁగు లనంగవ్యాఘ్రములు ◆ భీకరు లట్టిరు శూరసూరులే
చాగుల వేఁగినా డనుచు ◆ సన్నుతిఁ జెందెడు వేఁగినా డొగిన్. 2672

కుమారనృసింహము, ఆ 2.

—◆ పాదసంవాహనము. ◆—

క. రాగమునఁ గొంత మేల్ నారాయణ మీ మనసుకంటె ◆ రహిఁ నిఁక నెప్పుడున్
వీయింత దడవెడ దయని, యూయంగన యనెనిపెంచ◆మ్మన పల్కెన్. 2673

ఉ. పట్టి యొకింత యొత్తుచును ♦ పాన్పుకడన్ వెసఁ గూరుచుండి హొం
బట్టున నొప్పు నూరువుల ♦ పై నిడి యొత్తి తదంఘ్రి యంతఁ జ
న్కట్టుపయిం ఘటించుచును ♦ గన్నులు చేరుచుకొంచుఁ జెక్కిటన్
గట్టిగ నద్దుకొంచుఁ బెన ♦ గాటపుఁగూరిమిఁ జెల్వ మిక్కిలిన్. 2674

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 115, 116.

## —♦ ప్రణయతాడనము. ♦—

మ. జలజాతాసన వాసవాది సురపూ ♦ జాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరము ♦ చ్చో వామపాదంబునం
దొలఁగన్ద్రోచె లతాంగి యట్లయగు సా ♦ ధుల్ నేరము ల్సేయఁ బే
రలుకం జెందినయట్టి కాంత లుచిత ♦ వ్యాపారముల్ నేర్తురే. 2675

పారిజాతాపహరణము, ఆ 1 పద్య 121.

క. ఘనమంజీరము ఘల్లన, వనజజరుద్రాదివిబుధ ♦ వరసేవ్యంబై
తనరు హరిశిరమునచ్చో, వనజేక్షణ ద్రోచె వామ ♦ పాదముచేతన్. 2676

రాధికాసాంత్వనము, ఆ 4.

## —♦ పాదతాడనము. ♦—

శా. కైలాసాచలసన్నిభం బగుమహా ♦ గంభీరగోరాజముం
గాలక్రోధుఁడు దండహస్తుఁడు కృపా ♦ కారుండు క్రూరుండు జం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం ♦ గారుణ్యనిర్ముక్తుఁడై
నేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా ♦ నిర్ఘాతపాదాహతిన్. 2677

శా. ఆలోలాంగక నశ్రుతోయకణజా ♦ లాక్షిన్ మహాంభారవన్
బాలారూక్షతృణావళీకబళలో ♦ భవ్యాప్తజిహ్వాగ్రనాం
దోళస్వాంతనజీవసత్వనుదయా ♦ దుఃఖాన్వితన్ ఘర్మకీ
లాలాపూర్ణశరీర నా మొదవు ను ♦ ల్లంఘించి తన్నె న్వడిన్. 2678

భాగవతము, స్కం. 1 పద్య 411, 413.

## —♦ పాన్పు. ♦—

సీ. జీవదంతపుజగా ♦ జీనినఖాసు మేల్త్రఘుకుటద్దపుబిళ్ళ ♦ బెళుకురవలు
వింతసంతనఁ జేసి ♦ విప్పుగా దాపిన, హురుమంజపూసల ♦ మెఱుఁగుకుచ్చు
లునిచి తీర్చినసొంపు ♦ మినుకైనకెంపురా, మొనముక్కులూడెడు ♦ ముద్దుగులుకు
ఘుకుఁగ్రొంబనిపచ్చ ♦ చిలుకలు రహిమించు, తొగరాచలుపరాల ♦ సొగసులొసఁ

గీ. గలవగలనిండుపచ్చని ♦ జిలుగుప్రతిమ, కతల నిరవొందు చిత్తర్వు♦కప్పురంపు
మెప్పు మేల్కట్లుచవికెలో♦ మెఱయుహంస,తూలికాతల్పమునఁజేర్చి♦తోయజాక్షి.
హంసవింశతి, ఆ 4 పద్య 109.

చ. నిగనిగ లీనుచున్నహరి ♦ నీలపుఁబట్టెలు గూర్చినట్టి పెన్
బగడపుఁగోళ్ళమీఁద జిగి♦వాఱఁగఁ దాఁచిన కొప్పుముత్తెపుం
బొగడలపట్టెమంచమునఁ ♦ బొల్చు కళాపురిపట్టుపాన్పు వన్
భుగభుగ తాఁగుబ్బురోను ♦ పూవులపైఁ బవళించి వేడుకన్. 2680
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 99.

చ. పగడపుఁగోళ్ళఁజందనపుఁ ♦ బట్టెలఁ జెన్నయి పద్మరాగపుం
బొగడల వంటి కెంపుజిగిఁ ♦ బొల్పగువ్రాఁతల మేలుకట్టుతో
సొగసగు పందిరింగళికి ♦ శోభిలి మానసభూనిధానమై
భుగభుగ తావులీనుకొను ♦ పూవుల పానుపుమీఁద నున్నెడన్. 2681
వాసవదత్తాపరిణయము, ఆ 5 పద్య 93.

సీ. సొగసైన జిగిమించు ♦ పగడంపునునుఁగోళ్ళ, బలితంపుతమ్మికెం♦పులబరిణలు
మేలినీలంపునన్♦ గొలగంబములు, నందమౌ చంగిరౌ ♦ పందిరిగూను
క్రొత్తసామ్ముత్తెంపు♦ కుచ్చులబలుజాలు, జాలువాఁడాల్పుల ♦ చాదినియును
నిద్దంపుటద్దమ్ము ♦ లద్దినపట్టెలు, పరపైనహంసంబట్టు♦పట్టెపెయును
గీ. కుందనపుబొమ్మలునుగల్గి ♦ యందమమరు,నొక్కపువ్వులపాన్పుపై♦యొడలుఁజేర్చి
విరహశరనిధిఁ గరిజేర♦వెరవులేక, తరుణి నిట్టనితలఁచు డెం♦దమున నతఁడు.
కవిచకోరచంద్రోదయము, ఆ 2.

—♦ విండ్లు. ♦—

గీ. విల్లుపట్టిన సెలపది♦నాళ్ళలోన, పీఁకకలిగిన తడవిల్లు ♦ వెదురువిల్లు
సెలనువిల్లును మొదలైన ♦ చేఁగవిండ్లు,చులకఁగాఁదీసిశబరేంద్ర♦సూనుఁడేయు.
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 35.

—♦ బాణములు. ♦—

సీ. పిడుఁగులొకో కావు ♦ పొడతేవుఘనము లు,ల్కాసహస్రంబులో ♦ కావు ధరణి
యూపలదు కాలస♦ర్పావళులొకో కావు, పాతాళవివరంబు ♦ బయలుపడదు
తీవ్రమైన మృత్యుకంటి ♦ కంటిమంటలొ కావు, జగదవసానంబు ♦ జాడలేదు
కాలకూటార్చులో ♦ కావు మందరసూత్ర, మానిశాహీనుఁడు ♦ గానఁ బడఁడు

ఆ. మొదలె తెలియంగరాదు ♦ మునుకొనిపుట్టిన, చెప్పఁ దెలియరాదు ♦ చూడనెచట
వని కబంధుఁడిలిచ్చె ♦ లాజిఁదల్లడమందె, రెండుదెఱుఁగుతూపు ♦ లేపురూప. 2684

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 939.

—♦ బావి. ♦—

మ. అమితానర్ఘ్యనిబద్ధశుద్ధశశికాం ♦ తాయామసోపానసం
గమ మంబుగ్రహణాగతోరుపథికా ♦ క్రాంతస్ఫురత్కుట్టిమం
బమలాంభోరుహషండపాండుకుముదా ♦ చ్ఛామోదసంవాసితం
బమృతప్రాయజలాభిపూర్ణ మగుచు ♦ న్నా బావి యొప్పుం గడున్. 2685

హంసవింశతి, ఆ 1 పద్య 185.

—♦ ఆయుధనామవిశేషములు. ♦—

సీ. భిండివాలాసికో ♦ దండధల్లాతకి, నారాచగోహణ ♦ నఖరవజ్రి
ముష్టిముద్గరశూల ♦ ముసలభుసుండిక, ప్రాసపట్టికార్ముక ♦ క్రపటకటారి
కాగరాణ్మోదండ ♦ కణయకుంతాంతళ, పరశుతోమరచక్ర ♦ పరఘుపట్టి
సములుపంకిణికాది ♦ సబళంబు చివ్వఁటె, కెలకట్టె యాదిగా ♦ నిల నుతింపఁ
గీ. దనరుముప్పదిరెండాయు ♦ ధములు మఱియుఁ, బలుతెఱంగ్యమ్ముగండక ♦ త్తెరతుపాకి
కొరకను సుగాలమును గ్రద్ద ♦ గోళ్లు బల్లె, చూరిబాణాధరించున ♦ క్ష్వాకుఁ డెపుడు.

హంసవింశతి, ఆ 1 పద్య 205.

—♦ ఘటనామవిశేషములు. ♦—

గీ. కాఁగు మజ్జిగముంతయుఁ ♦ గడవ గూన, బాన వెసలయు బుడిగెలు ♦ పరపు చట్టి
కడవముంత కరిగె దుత్త ♦ పిడతగురిగి, కుండ సటికయు మూఁకుడు ♦ బిందె ప్రమిద.
చ. చెవులపెనంబు గోలమును ♦ జిల్లుల సిబ్బియు దోనితొట్టియుం
గుపిచిలుమూఁతమూలయును ♦ గుమ్మెత యండపుధూపపాత్రిమై
సవరని బూజిపెందొనయు ♦ సానికె యొప్పు కమండలంబు వే
డొవతెవకంబిదుత్తె నెర ♦ దుల్చియుఁ గప్పెరపంటు లాదిగన్. 2688

హంసవింశతి, ఆ 5 పద్య 11, 12.

—♦ భూషణవిశేషములు. ♦—

సీ. కుప్పెరాగిడిబిళ్ల ♦ కుంకుమరేఖపాపటబొట్టు కమ్మలు ♦ బావిలీలు
లలిసూర్యచంద్రవం ♦ కలు నూసకము కెంపు, రవలపల్లేరుఁబూవు ♦ రావిరేక

బొగడలు నానుఁగ్రోవులు తీఁగ మెడనూలు, కుతికంటుసరపణ • గుండ్లపేరు
సరిగె ముక్కఱ బన్న • సరము నుత్తుండాలు, కంకణంబులు తట్లు • కడియములును
గీ. సందిదండలు నొడ్డాణ • మంద మైన, ముద్రికలు హంసకంబులు • మ్రోయఁగజ్జె
లలరుబొబ్బిలికాయలు • గిలుకుమట్టె, లాదియగుసొమ్ము వాల్చియ • య్యబల మెఱయు.

హంసవింశతి, ఆ 2 పద్య 190.

సీ. రతనంబుకీల్జడ • రవిరేకొప్పుగొలుసులు, శశిపువ్వు రాగిడీ • చంద్రవంక
పాపిటబిందీలు • పచ్చబొట్టు హొరంగు, కమ్మలు బవిరెలు • గుమ్మటీలు
బొగడలు ముత్తియంపు • మెఱుంగుముక్కఱ, పగడాలపేరులు • జిగివెలుంగు
బాజుబొందులు జిల్కు • పనికీల్కడెంబు పో, చీలు బటువు లుంగ • రాలు చిన్ని
గీ. గంట లొడ్డాణ మందియల్ • గజ్జెలందె, మైనమట్టెలు పిల్లెండ్లు • నాదిగాఁగఁ
దొడవు లెల్లను మైనిండఁ • దొడిగి దర్పణమునఁ దననీడఁ జూచియూ • వండ మెుంది.

శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 3.

ద్విపద. కుసమించుముత్యాల • పాపటబొట్టు, పొజులకమ్మలు • పల్లేరుపూలు
రాజిల్లురత్నాల • రాగిడి నెట్టి, కెంపులముక్కర • గిలకసరంబు
సొంపుతో పల్లజాల • జోడుహారములు, బంగారుపట్టెడ • బన్నసరములు
రంగుపచ్చలయుంగ • రంబులు మెఱయ, నబ్బురం బయ్యెడి • మొలనూలు తాళి
గుబ్బచన్నులమీఁద • గునిసియాడంగ, సందిటి తాయతుల్ • జరలుదూగాడ
గందుబొల్లని పైఁడి • కంకణంబులును, ఘంటల మొలనూలు • కాలిగజ్జెలును
దంటమెట్టెలువింత • దళుకొత్తుచుండ,... ... ... ... 2691

సారంగధరచరిత్రము, శంభు. ఆ i.

## —• ధాన్యాదులు. •—

సీసమాలిక. బంగారుతీగెలు • గంగాజలమ్ములు, కస్తూరినిగరాలు • కటకసరులు
నిప్పపూరాజనా • లేనుంగుకొమ్ములు, మల్లె శ్రీగంధులు • మదనగంధు
లేలికరాజనా • లీశ్వరప్రియములు, రావిపూరాజనాల్ • రత్నసరులు
కుసుమపూరాజనా • బుత్తిబల్లుత్తులు, కస్తూరిపట్టెలు • గంధసరులు
మందిగంద్రలు నాగ • మల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు • వెలువడాలు
మన్మథబాణాలు • మరువంపుమొలకలు, సన్నమణింగెలు • జున్నుఁద్రాలు
పొన్నశ్రీరాజనా • లుప్పునుఁగురాజనములు, ముద్దుపాలిరాళ్లు • ముత్తుసరులు
సన్ననూదులు పచ్చ • గన్నేర్లు గోదండ, రామును లేకసన్న • రామసన్న

చందిరవంకలు జీని♦సరులు కాంభోజాలు, వంగారు బొడసులు ♦ పొంగుఁబొంతలు
జిలకఱ రాజనా ♦ ల్చింతపువ్వులు గోరు,రాజనా ల్బొదపోల్కి ♦ రాజనాలు
రామబాణాలు కె♦క్కాములు వెన్నముద్దలు జిల్కబుడములు ♦ దాసవాలు
గొబ్బికామలు జలు♦గుత్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు ♦ కామదార్ల
కెక్కపాలలు కాకి♦ కెక్కలు పుష్పమంజరులు సీతాభోగ♦సరులు గౌరి
కుంకుమల్ రణపెండ్లి♦కొడుకులు పిచ్చుక, గోళ్ళుప్రయాగలు ♦ గొజ్జుఁబ్రాలు
గరుడసరు లొప్పెతు♦గంటరాజనములు, మోఁదుగతొడిమలు ♦ ముదుకసరులు
పచ్చపరుల్ రెడ్డి♦పాలవంకెలు సుఖ, భోగులు పచ్చక♦ర్పూరసరులు
నివ్వరు ద్దైబ్బస ♦ లీన్నరుకావులు గాజు, కప్పెర ల్కుఱుపడా ♦ ల్కుంతసరులు
సాలంక లలుగురా♦జనములు సంఘావు, లవసరదార్లమో♦హనపుసరులు
మణిసరు ల్మసరులు ♦ మంకెన ల్పగడంపు, తీఁగెలు మడ్డప్రాలు ♦ దేవసరులు
లత్తుకబొత్తులు ♦ లక్ష్మిమనోహరా, ల్నారతీసేసలు ♦ బాహుపురులు
వజ్రపుఁదప్పుకులు ♦ వాసనరాజనా, ల్తనావ్జివంకెలు ♦ గవ్వసరులు
సంపంగిపూపద్దు ♦ జాజిరాజనములు, గంబూరరాజనా ♦ ల్కుస్తెసరులు
తమ్మిపూరాజనా ♦ లమ్ముడుకొణిగెలు, జేనువముక్కలు ♦ చిలుకముక్కు
లేదుకట్టులు వంకె ♦ సినుకరాజనములు, పులిగోర్లసంకెలు ♦ బొగడసరులు
గీ. జిలితోఁగలరాజనమ్ములు ♦ నలవరులును, డొల్లనల్లచెన్నంగులు ♦ దివసరులు
నాది యగుపేర్లగలుగువ♦స్తతనియింట,నుండుశతకోటిపుట్టులో♦క్కొక్కదినుసు.

హంసవింశతి, ఆ 5 పద్య 128.

సీ. శ్రీరామవంకియుఁ ♦ జిటిబలుగుత్తియు, శ్రీకేసరియు శక్తి ♦ శ్రీదసంబు
నీశ్వరప్రీతియు ♦ నేసుఁగుకొమ్మను, బోడసంపంగియు ♦ నోడవరియుఁ
గస్తూరినికరంబు ♦ గర్పూరభోగియు, కావలికాంభోది ♦ కనకగిరియు
దేవాన్నమెలిమియు ♦ దేవడన్నియకొట్టి, సిరుచంచలియు శృం♦గారభోగి
గీ. వంకిప్రాసంగిసంపంగి ♦ వారణాశి, కామధేనువునారేళి ♦ గందరిగోళి
వెదురుమలయంబుబుడమయు♦ తెల్లువడంబు,రాచమెచ్చునుములువంకి♦రాజనములు.

క. సనిగెయు గోధూమంబును, మినుములు ముద్గంబు కంతి♦ మెంతియు మిరియం
బనుములు మొదలగు సస్యముఁ, గొనగొని శిక్షకరుణకొండ♦కోటులుపండున్.

వైశ్యపురాణము, ఆ 5.

## —♦ వృక్షదోహదము. ♦—

సీ. నీరెత్తువేళల ♦ నీరెత్తఁ బోదుపో,దునకుఁ గాలువలు పోం♦దుగ నమర్చి
త్రివ్వటంబులతటిఁ ♦ ద్రివ్వటంబులవెట్టుఁ, దగునట్లుకట్టుగు♦ద్దలి గడించి
యెరువుఁ జల్లెడువేళ ♦ నెరువుఁ జల్లుగ తాభి, మానుఁడై గంపలఁ♦దాన తెచ్చి
యంట్లొత్తుపదనున ♦ నంట్లొత్తు నెలమిఁ గా,న్పించు లేఁగొమ్మలు ♦ వంచివంచి
గీ. నారువోయంగవలయుచో ♦ నారువోయుఁ, గొమ్మినాటంగఁదగునెడఁ ♦ గొమ్మినాఁటు
నొకటివినువక యంతకం♦తకును హెచ్చు,హాళతోడను శాలీయుఁ♦డవిరతంబు. 2895

లయగ్రాహి.
అంగపరిచ్ఛేదము నె♦ఱుంగ కతఁ డీగతిఁ గ♦నంగి తులసీవనముఁ♦ జెంగలువలుం గే
దంగులును జంపకము♦లుం గురువకంబులు ల♦వంగములు జాదులును♦లుంగతతులుం గో
జ్జంగులును మల్లెలును♦ రంగములుఁ బాటలము♦లుం గదళి కాచయముఁ♦ దుంగతతులున్ నా
రంగములు నాదిగధ♦రంగలగు నట్టిహృద♦యంగమబహూద్రుమకు♦డుంగములఁ బెంచెన్

సీ. తోరంపుఁజనుదోయి ♦ తుళ్లింతల నిడంగఁ, దగుచోట్లు గుద్దంటఁ♦ ద్రివ్వి త్రివ్వి
వేఁగ్గైనపిఱుఁదుబం♦ల్విడిఁ జలింపంగను, వడినిట్టునట్టును ♦ నడచి నడచి
యడుసుతుంపురు చెక్కు♦టద్దంబులను బర్వ, మళ్లకు మడవలు ♦ మార్చిమార్చి
నడుము లేదేవియా ♦ నకనకల్ గుడువ నిం,పునఁ దగు మోఁపులు ♦ మోసిమోసి
గీ. చిఱుచెమటఁ జేర్చువింతశ్రమ♦మ్మెఱుఁగుతోడఁ, గొమరు మేనొప్పసారెకుఁ♦ గొప్పవదల
నేమిటికి నైనఁ దామున్న ♦ యేఁగియేఁగి, యెల్లపనులు నొనర్చెనిం♦ పెసక మెసఁగ.
కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 78, 78, 98.

## —♦ వృక్షజాతులు. ♦—

సీసమాలిక. రావి మామిడి కొండ♦రావి మేడియు బ్రహ్మ,మేడియు జీడిమా♦మిడియుఁ జింత
పులిచింత మోదుగు♦ములు మోదుగును వెల్గ, పుల్లవెలగ వట్టి♦బిల్ల చిల్ల
బూరుగ కలుగొట్టు ♦ భూతపాపిరి కుక్క, బూరుగ చిటిగొట్టి ♦ భూతనెరిద
నేరేడు మఱి యల్ల♦నేరెడు పాదిరి, తెడగూబ తెడతేకు ♦ కడపబట్ట
కడపకొడిసె పాల♦కొడిసె ట్టిలొద్దుగు, చిఱుతేకు లొద్దుగు ♦ జీడిపాల
కలుజువ్వి వావిలి ♦ గందువావిలి యేరు, మద్ది మద్దియును నే♦లొద్దిరొద్ది
తెల్లకాంచనము తుం♦డిల నొల్లికాంచన, ముప్పి తెల్లుప్పి నీ♦రుప్పి యిప్ప

తాండ్రిచందన మేపి ♦ దాసాన మొల్లదా,సానము బందుగ ♦ జారజేన
మఱ్ఱివిరికి తొండ్లి ♦ మఱ్ఱితూ కిచ్చెడ, పెద్దవిరిగి వక్కి ♦ గద్దనెల్లి
కాకితూ కందుగు♦కానుగు వరగోఁగు, గోఁగుబొట్టుకచిక్కి।♦ గోఁగుకొంప
గోఁగుపొగడములు ♦ గోరంటలును బెద్ద, వెలగ సుంకేసరి ♦ వెఱ్ఱిచిక్కి
సారుప సురపొన్న ♦ వారిజములు బొన్న, నెల్లి మూలుగబిల్లు ♦ నెమలియడుగు
కొండగుమ్ముడు రేఁగు ♦ గొరవి సంపఁగికొండ, సంపెంగ మారేడు♦సరళదేవ
దారు గుమ్ముడు మోవి ♦ తపసియుఁ గుమ్మర, పోల్కిగుగ్గిలమెట్ట♦పోల్కి వేగి
దేవదారుసిరికె ♦ తిలకము తెల్లన, గిరి వేఁప కరివేఁప ♦ తురకవేఁప
వేరుపనస గుత్తి ♦ వెఱ్ఱిసారువ రేల, పనస కరకకొమ్మి ♦ పలుకరేణి
బండచింతయు నల్ల♦బలుసు సురభి చీకి, రేని కూకుడు నెమ్మి ♦ పేరింఖణమ్ము
భూతాంకుశ మశోక ♦ భూర్జపత్రమ్ములు, బోళము మంకెన♦పులినుగంగ
రేఁగు తక్కిలి ములు♦వేగి భూశర్కర, మొక్కస కొక్కస ♦ ముల్లమ్రాను
హనుమంతబీర మం♦కెన గిరికర్ణిక, పెడమల్లె కొండము♦క్కిడియుఁ గోల
ముక్కదాడిమ బీర ♦ మొగలింగ గోదాడు, నేదాడు, ఖర్జూర ♦ మీఁత నేల
తాడి బగిస పోఁక ♦ తాడు కొబ్బరచెట్టు, పెద్దమాను పతంగి ♦ బెండగలుగు
గీ. కణుదు రిరుకుడు కాలుగ ♦ కాస్గ సన్న, విరిగి సోమింద గున్నంగి ♦ దిరిసెనంబు
మొదలుగాఁ గల్గు బహువిధ♦భూరుహములు, నిండియుండెడు కానల♦పిండులరసి.

హంసవింశతి, ఆ 4 పద్య 11.

ద్విపద. చందనఖర్జూర ♦ జంబుజంబీర, మందారబూరుగ ♦ మహిసాలతరులు
మద్దిపాలయుకొడ్డి ♦ మారేడువెలగ, బొద్దిపామరజమ్మి♦పులిమేడి మేడి
పొడిగి పెన్తంగేడు ♦ భూతాంకుశంబు, కడిగిచింతయుకల♦గట్టురంగారు
అరటికొమ్మయు పన్స ♦ యల్లనేరేడు, కరకయు వెలగయుఁ ♦ గానుగు తాడి
మఱ్ఱి జువ్వియు నెమ్మి ♦ మామిడి జీడి, బల్రక్కసియు రేగు♦పాలగోరంట
మోదుగకలబువ్వ ♦ మొగిలిసంపెంగ, గేడంగియును నారి♦కేళవారిజము
దేవదారువు కలి ♦ దేవకాంచనము, హాపిరిరేలము♦వ్యంచుపంచాది
పొటుకురు పుసిరిక ♦ పోకనారింజ, కడుకురుగుమ్మడి ♦ కస్తూరితుమ్మ
చిరుమారుబూరుగు ♦ చిల్లచెన్నంగి, కోడిసెముష్టియుగొండ ♦ గోఁగువాక్కిలివి
బలునుముల్ మోదుగ ♦ పచ్చారెయారె, వలిచంద్రములుచంద ♦ వాడగన్నేరు
నలుదుమ్మపొగడపు♦నాగవృక్షములు, ... ... ... 2699

సారంగధరచరిత్రము, శంభు, ఆ 2.

## —♦ చిఱుచెట్లు. ♦—

సీసమాలిక. జిల్లేడు వెంపలి ♦ జిడ్డువెంపలి పైఁడి, తంగేడు తంగేడి ♦ తగిడి ముస్తె
ములువెంపలి ములుస్తె ♦ గలిజేరు గుంటగ,లేరును దంతిబం♦దారి నేల
తంగేడు మెట్టి బం♦దారి దుండుగ బ్రిహ్మ, దండి ధూతులసెజ్జ♦దొండి చల్ల
పిల్లిమాడుపు చార ♦ పిల్లడు చిత్రిమూ,లము నల్లతీఁగె కో♦లాకుపొన్న
ముయ్యాకు పొన్నయు ♦ మొగబీఱ తుత్తెర, బంకదుత్తెర హంస♦పాది గంటె
కామ జిలుగు మెట్ట♦దామర సెజ్జిసె,నగ జంబిరము కాచి ♦ నల్లకాచి
శ్రితులసియు సంబ♦రేణు నేలుసిరి కీ,శ్వరి నేలవే మూటి ♦ చల్లగడ్డ
సహదేవి జుట్టుప ♦ చలిపిండి చిటిముటి, పెన్నేరు విషబొద్ది♦పిండి దొండ
నెనుటాయి గొలిమిడి ♦ నీరుబచ్చలి ప్రబ్బి, వేయ గన్నేరాఁడు ♦ బీఱ నేతి
బీఱ పేరా ముట్టి ♦ పీచరములు గొలి,మిడి చేదుపొట్ల యు♦మెత్మత్త తిప్ప
తీఁగె విష్ణుకాంత♦తీం డెత్రి చిత్రమూ,లము దొండతీఁగెము♦ల్లంగి గొల్ల
బీడెద్దు మట్టేకు ♦ చేగొష్ట చంద్రకాం, తెజ్జనియబ్బెంద ♦ రేజ్జతుమ్మి
కుప్పి సూర్యక్రాంత ♦ ముష్పడు నరవండు, గాడిదెకడపర ♦ కన్నెకొమర
నల్లగెంటెనపూలి ♦ తెల్లగెంటెన యూత్త,రేణు గుబ్బిరి సంబ♦రేణు బండి
గురిగింజ గురివింద ♦ తురతపత్త్రియుఁ బత్త్రి, తలదిడ చబ్బంద ♦ నులియుచీకె
వెలగ విషముదారి ♦ వెజ్జికుండెన ముంచి, కుండెన కలబంద ♦ గువ్వగుత్తి
మామెనయును నేల♦మామెన యటకమా,మిడి దూల గోవెల ♦ మేఁకమేయు
గీ. పాకు నల్లేరు నులిజెము ♦ డాకుఁజెముడు, నేలతటుకకసిందెయుఁ ♦ గోలచెముడు.
బొంతచెముడుల్లియునుసదా♦ముష్టి మొదలు, గాఁగలుగునట్టిచిఱుచెట్లఁ♦గాఁచియంత.

హంసవింశతి, ఆ 4 పద్య 10.

## —♦ కాయగూరలు. ♦—

గీ. దొండకాయ ములుకకాయ ♦ తొట్లకాయ, జంబికాయయు నెజ్జల♦సందకాయ
వెలయునుస్తెకాయయు రాము♦ములుకకాయ, మేడికాయ కాచరకాయ♦గూడనింక.
సీ. రామగుమ్మడి యొంబ♦రాజాగుమ్మడి చార,గుమ్మడి బూడిదె♦గుమ్మడులును
గిండిసొఱయు దీఁగె ♦ కిన్నరసొఱయును, బీఱ సముద్రపు♦బీఱ నేతి
బీఱ పిచ్చుకపొట్ల ♦ పెద్దపొట్లెనుఁగు, దంతపుఁబొట్లలు ♦ తంబలు వెలి
కాకర పొట్టికా♦కరలు మేఁకచెవి చిక్కుడుపాలుగుఁజప్రల♦గోరుచిక్కు

గీ. దులు సుగంధాలు బొంతసం♦టులు సురభులు, గంజిపందిటీకపురపాం♦కాయతరులు
బూజుపచ్చకుఁ గాసాని♦పుచ్చ బెద్ద,దోస నక్కదోసలు వాని♦తోఁటఁగలవు. 2702

ఆ. చేమ కంద గెనుస ♦ చిటిగోరు పెండ్లము, పొనఁగు తెల్లగెనుసు ♦ భూతగెనుసు
ఉల్లి ముల్లి పసపు ♦ ముల్లంగి వెల్లుల్లి, గాజరయును మొదలు♦గాఁగఁ గలవు. 2703

చ. గురుగెఱ బొద్దిచెంచలియు ♦ గుచ్చలి చిత్తి తగిర్స తుమ్మికు
ప్పరి బలుగూటిబొద్ది నెలి ♦ చక్మలి పల్లెరు రూకపాతెక్క వె
ల్వరిగెసు మున్గ వెల్గ చెవి ♦ పావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరవంజిచేత రస♦దాపయు గోఁగులికొండ పిండియున్. 2704

గీ. పాలవా మింటతక్కలి ♦ బచ్చలి కోయి,గూర చక్రవర్తము చిల్క♦కూర గోళి
కూర దుంప బచ్చలి తోఁట♦కూర కొతిమి, రాకుసోపు మెంతాకుచు♦క్కకుఁగలదు.
హంసవింశతి, ఆ 4 పద్య 129—133.

## —♦ ఫలజాతులు. ♦—

సీ. పనస సీతాఫలా♦ల్చినిమ్మ గజనిమ్మ, దూదినిమ్మయు నార♦మాదిఫలము
నారదఖర్జూర ♦ నారికేళాదులు, రామఫలంబులు ♦ జేమఫలము
లలరారు బొంతకి♦త్తళియుఁ బోఁకయుఁ బోఁక, పిప్పలి నేరెడు ♦ పెద్దవెలగ
రామావళియు గము♦రకజీడిమామిడి, బాదంగి పెనురేఁగు♦పాల ఫలము

గీ. చెట్లు పండెడితోఁటలు ♦ చిట్టుగొట్టు, చెఱకు రసదాళిచెఱ కెఱ్ఱ♦చెఱకు నల్ల
చెఱకుతోఁటలు కలుజొన్న ♦ సీర్పి దినుసు, కారపా కాకుతోఁటలు♦గల వతనికి.
హంసవింశతి, ఆ 4 పద్య 134.

## —♦ ఊరుగాయలు. ♦—

సీ. మామిడికాయలును ♦ మారేడుగాయయుఁ, గొండముక్కిడికాయ ♦ కొమ్మికాయ
గరగుకాయయు వెల్గ♦కాయ యంగుగుకాయ, లుసిరికెకాయలు ♦ నుస్తికాయ
లేకరకాయయు ♦ వాఁకుడుకాయయుఁ, జిటినెల్లికాయయుఁ ♦ జిల్లకాయ
కలబంద గజనిమ్మ♦కాయ నార్దబకాయ, చిననిమ్మకాయయు ♦ జీడికాయ

గీ. కొండవసపుఁగొమ్మ మామెన♦కొమ్ముబుడమ,కాయయల్లము మిరియంపుఁ♦గాయబీఱ
కాయ కంబాలు కరివేప♦కాయ లాది,యైన యూరుఁగాయలు గల♦పతనియింట.
హంసవింశతి, ఆ 4 పద్య 135.

## —♦ తీగజాతులు. ♦—

సీ. పిల్లపీచర నక్క♦పీ టెల్కచెవి గొట్లు, పాలలంబును మేఁక♦పాలలంబు
బుడ్డకాసరియాట్లు ♦ బొంకివొంతిరలంబు, మాడుపుగురుగును ♦ మదనకట్టె

వము లలరారు కేలఁ దవి♦పర్వఁగ దోఁ జనలేక చిక్కు న
ర్యమకిరణాళిఁ బట్టి యిరు♦లప్పురిఁ గారలఁ బెట్టెనోయనన్. 2712

మ. ప్రిజవర్ణింపఁ బ్రితోళికాపణికా♦పణ్యాపణాట్టాలక
వ్రజమం బంబరవీథిఁ బాసి నగరిం ♦ బాపించు తారాగణం
బుజగల్మీఁ నిశాముఖంబులఁ బురిం♦బోల్చున్ దివారాత్రిఘృ
ష్టిజసంధ్యానలవిస్ఫులింగశకల♦శ్రేణుల్ ప్రదీపావళుల్. 2713

చెన్నపురీవిలాసము, సన్నివేశపత్రిక. పద్య 5, 6.

## —♦ ధూపవిశేషములు. ♦—

ద్విపద. అతిసుగంధంపుద♦శాంగమానంగ,నతియు సురభియు నా♦గర్తధూపంబు
మలయానిలంబును ♦ మహిసాక్షి మష్టి, కలహంసధూపంబు♦గామికామోద
మును మనోహరధూప♦మును దివ్యధూపమును జనవల్లభా♦మోదధూపంబు.

పండితారాధ్యచరిత్రము, పర్వత. ప్రక. పుట. 368.

## —♦ సుగంధద్రవ్యములు. ♦—

గీ. చాదు శ్రీగంధ మగరు కే♦సరి కదంబ, మత్తరు పునుంగు జవ్వాది♦హరిణమదము
బుక్క యత్తరు కోవగం♦బూర బోలు, చట్ట కలపంబు పన్నీటఁ♦జాది పూసి.

సీ. తప్పుకొట్టంపుర్త♦ద్దపునిల్వుటద్దముల్, దంతంపుదువ్వెనల్♦తావు లొలుకు
నత్తరుఁ బునుఁగును ♦ నంబరు గోరోక,మాచ్రయముల్ నఖయు గం♦బూరచోవ
జల్లిసవరములు ♦ జిల్లరసము కదం,బము గోవజవ్వాది ♦ పచ్చిపునుఁగు
కురువేరు పచ్చక♦ప్పూరము పన్నీరు జే,డెము మలాకిలు కుంకు♦మమును మంచి

గీ. బుక్కకస్తూరిపీణెలు ♦ చొక్కటంపు, టగరు సంపెంగనూనెలు ♦ నాదియైన
మెచ్చఁగల దీవులందుండి♦తెచ్చినట్టి, వివిధపరిమళవస్తువుల్ ♦ నుంకుఁ దీసి. 2716

హంసవింశతి, ఆ 5 పద్య 140, 352.

## —♦ బాణసంచు. ♦—

శా. తారాజువ్వ లవాయిగొట్టము లగా♦దల్ జిచ్చుబుడ్డుల్ గడున్
దారామార్గమునెంటనంటను శత♦ఘ్నుల్ (? జల్లుపాకు ల్మహా
దారారామములర జెలంగఁగను వి♦స్తారంబు లై చక్రముల్
బాణంబాణ నవారబాణములతో♦భల్మీఁ నింపారఁగన్. 2717

నరసభూపాలరాజీయము, ఆ 1.

## —♦ వాద్యవిశేషములు. ♦—

భేరులు తమ్మటల్ ♦ జల్లునిస్సాణముల్, బూరగొమ్ములు కంచు♦వీణములును
మకిలక్రోవులు వీర♦మద్దెలల్ గిడుగిళ్లు, పేరైనతప్పెటల్ ♦ పిల్లఁగ్రోళ్లు
తారలు చిమ్మట♦తారలు శంఖముల్, కాహళాల్ పసిఁడిడ♦క్కలును బిడులు
గాలికొమ్ములు డోళ్లు♦కైవస్య. ఝంజలు, ఛత్రిసంఘంబులు ♦ చామరములు
గీ. బోరుకలఁగంగ దిక్కులు ♦ బూరటిల్ల, దనుజవర్గంబు లిరుసంకఁ♦దవిలికొలువ
వెడలె సన్నాహ మడరంగ ♦ వీరరవము, కరువుగట్టినచందంబు♦గానఁబడఁగ.
మొల్లరామాయణము, యుద్ధ. ఆ 3 పద్య 26.

సీ. ఢక్కలు మురజులు ♦ డంకాలు కాహళు,ల్బూరలచాల్ దండు♦బూర లోలయు
దుడుములు డప్పులు ♦ దోరంబురుంజలు, బాజా ల్సనాయీలు♦బారు లోలయు
తాషాలు మరపలు♦దగురామడోళ్లను, డోళ్లను తమ్మటల్ ♦ గౌళ్లుదాఁట
భేరులగము లర♦బ్బీబాజలును మద్దు, డిండిమంబులచాలు♦గండుమిగులఁ
గీ. గంచుమద్దెళ్లు మతివీర♦కాహళులును, మెఱయుమండరమఖిలభా♦సురపయోధి
రావమునుమించి మిక్కిలి♦రేవ మెఱయఁ, దరలివచ్చెను పెండ్లికి♦ధరణిపభుఁడు.
నరసభూపాలరాజీయము, ఆ 1.

## —♦ వస్త్రనామవిశేషములు. ♦—

ద్విపద. కెంజావళియు జయ♦రంజియు సంచు,పుంజంబు మణిపట్టు♦భూతిలకంబు
శ్రీవన్నియయు మహా♦జీనియు జీని, భూవజతిలకంబు ♦ పచ్చనిపట్టు
రాయశేఖరమును ♦ రాజవల్లభము, వాయుమేఘము గజ♦వాళంబు గండ
పడము గాపుకసరి♦పట్టునుహంస, పడియుఖీణావళి ♦ పల్లడదట్టి
నారణాసియుజిక♦వాయి గెందొగరు, గౌరీగనయమును♦క్షీరోదకంబు
పట్టును రత్నంపు ♦ పుట్టును శంకు,పట్టును మాకత♦పట్టు పొంబట్టు
నెఱపట్టు నెరిపట్టు ♦ నేతరింబుపట్టు, మరితపరాజంబు♦మాండోదరవియు
చందారితపంబును ♦ సాంధ్యరాగంబు, నిందరాగంబు మ♦హేంద్రభూషణము
పన్నసడంచును ♦ శరధియు మేఘు,పన్నియు రుద్రాక్షు♦వన్నె కాంభోజి
పులిగోరుపట్టను ♦ భూపతిరుద్ర,తిలకంబు సరిపట్టు♦మలయజసిరియు
కోలని మేఘము గజా♦వళి హయావళియు, వలిపంబు సరిదమ్మి♦తెలుపుదివ్యాంబ
రంబును నుదయరా♦గంబు దేవాంబ, రంబు పాత్తియు గుజ♦రాష్ట్రింబుపట్టు
మానితవస్త్రంబి♦తానముల్ గలవు, ... ... ... ...
జనవపురాణము, పి. ప్ర. ఆ

సీ. సంపంగికావులఁ ♦ జంగురుకావులు, జిలిపట్టు పుట్టముల్ ♦ వేఁటచాల్లు
జిలుగుబొమ్మంచుల♦చీరలు నాచులు, నుదయరాగంబులు ♦ నుడుతవన్నె
లొప్పుముయ్యంచుల ♦ పుష్పాళ్ళహాన్నంచు, వలుపలుఁ గరకంచు♦వస్త్రతతులు
ముత్యాలపందిళ్లు ♦ నుత్తరగోగ్రహణములు నిగమగోచ♦రములుఁ బద్మ
గీ. పుఁడిలకలునిండువన్నెలు ♦ బోడలు బచ్చలును హారిణవల్లి హంసవ♦ల్లులునురంగ
పట్టె బొదలును సామంత♦వదులునసఁగఁ, దనరెడుపసందుపటములు♦గొనిరొ వెలకు.

హంసవింశతి, ఆ 5 పద్య 355.

—♦ చామరపరిచర్య. ♦—

సీ. కుచకుంభములమీఁది ♦ కుంకుముతోరాయు, హారంబులరుణాంబు♦లగుచు మెఱయఁ
గరపల్లవము సాఁచి ♦ కదలింప నంగుళీ,యకకంకణప్రభ♦లావరింపఁ
గదలిన బహురత్న♦కలితనూపురముల, గంభీరనినదంబు ♦ గడలుకొనఁగఁ
గాంచనమణికర్ణికామయూఖంబులు, గండపాలికలపై ♦ గంతు లిడఁగఁ
గీ. కురులు నర్తింపఁ బయ్యెద♦కొంగుదూఁగ, బోఁటిచేనున్న చామర♦పుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి ♦ చేర నరిగి, వేడ్క లిగురొత్త మెల్లన ♦ వీవఁ దొడఁగె.

భాగవతము, స్కం 10 పూర్వ పద్య 1685.

—♦ దధిమథనము. ♦—

సీ. కరకమలారుణ♦కాంతిఁ గవ్వపుఁద్రాడు, పవడంపునునుదీవ ♦ పగిది మెఱయఁ
గ్రమముతో గజ్జె నా♦కర్షింపఁ బాలిండ్లు, పిన్నవి యొండొంటి♦వీఁకనొత్తఁ
గుచకుంభములమీఁదఁ♦గొంగుజాఱఁగఁ జిక్క,పడుచు హారావళు♦ల్వ్రయలుపడఁగఁ
బోడమినచెమటతోఁ ♦ బొల్పారు నెమ్మోము, మంచుపైపడినప♦ద్మంబుఁ దెగడఁ
గీ. గాను నులియంగఁ గంకణ♦క్వణనమెసఁగ, దుఱుముబిగివీడఁ గర్ణికా♦ద్యుతులు మెఱయ
చాలునంకించిపాడెడి ♦ పాటవలనఁ, దరువులిగురొత్తఁ బెరుఁగింతి♦దరువఁ జొచ్చె.

భాగవతము, స్కం పూర్వ. 10 పద్య 355.

—♦ సవతులకయ్యము. ♦—

సీ. ఒట్టు సుమీ యన్న ♦ నొట్టు సుమీ యంచు, నేమేమి యనిన నే♦మేమి యనుచుఁ
గానీగదే యన్నఁ ♦ గానీగదే యంచు, నింకేల యనిన నిం♦కేల యనుచు
నోసి పోవే యన్న♦నోసి పోవే యంచు, నౌ నంటి వనిన నౌ♦నంటి వనుచు
మఱవకు మిది యన్న♦మఱవకు మిది యంచు, నెవతె యనిన నె♦వతె యనుచు

గీ. వారిజాక్షుని నాపగ ♦ వారివెంట, ననుప గోరంత ధ్యాసను ♦ మనసు లేదు
నందుఁ దనుపగఁగని మన♦మందు కట్టు, లొంటితడసేయరాదని ♦ యుంటిఁగాని.

ఆ. కట్టఁ దేలుకట్టి♦కన్న కన్నుఁ రబూచి, తోసిరా జటంచుఁ♦గ్రోచఁ జెలియ
దానిఁబ్రేలుఁదీసి ♦ దానికన్ను పొడిచి,నటుల తనియకున్న ♦ నగునె చిలుక. 2733

ఆ. తగరుకొండమీఁదఁ ♦ దాఁకఁగోరినదారి, నెదిర్చినన్నుఁ దెలియ ♦ కింతి పలికె
నెంతమీనువచ్చి ♦ యెంతమీనును మింగెఁ, గాని బ్రతుల్లి నెద్దె♦గంత మోచు, 2734

సీ. ఆశుకవిత్వంబు♦లల్లితే నే సరా, చిత్రప్రబంధముల్ ♦ సేయవలదె
గోటిచేతను వీణె♦మీటితే నే సరా, గొంతుకరాల్ గరఁ♦గించవలదె
పదచాళి రాగముల్ ♦ పాడితే నే సరా, హితవొప్ప వర్ణంబు♦లెత్తవలదె
అలనాట్యభేదమ్ము ♦ లాడితే నే సరా, నటనటుల నంటి ♦ నడువవలదె

గీ. వింతవింతగఁ గలసిన ♦ యంగసౌరు, నెమ్మికానిమనోభావ ♦ మెఱుఁగవలదె
యేమి నేరనినిన్నంటె ♦ యెంత మేటి, నన్నుఁ డనాడనాకోరె ♦ చిన్నిచిలుక.

గీ. కానిపదరకు మిఁకమీఁద ♦ దానిమోము, గనఁగవల్దని కోరిని ♦ కట్టిపెట్టి
బింకములుకూలనలుకాలఁ♦జెట్టినేల, రాఁగుకున్నను నాపేరు ♦ రాధగాదు. 2736.

## స్నానపద్ధతి.

ఉ. అంగసుఖంబు దుర్గుణము ♦ లారయఁ బొందనిమందు మేనికిన్
రంగు సుపోషణంబు సుక♦రంబుగఁ బ్రాప్తియును మళ్లివచ్చు న
భ్యంగన మాచరించుటకు ♦ నర్హదినంబగు సుప్తనారిఁ జే
యంగడు నొప్పు నాల్గు గడి♦యల్ జలకంబు యథావిధిన్ దగన్.

సీ. పుణ్యనిర్మలతోయ♦ముల నొందె నుష్ణోదకముల నొందెను బ్రయ♦త్నమునఁ జేయు
తానంబు వలయుఁ బ్రాత♦స్స్నానమునఁ జేసి, తొమ్మిది చిల్లుల♦దొరగు చున్న
యేహ్యంబు పట్టగ♦నిమ్మను శుచి యగు,నంతియ కాదు నా♦హ్యాయనంబు
శౌచంబు బలమ్ము దు♦స్స్వప్న నాశంబును దేజంబు రూపు కాం♦తియును కృతము

గీ. నాయు రభివృద్ధియును గల్గు♦నంత మీఁద, సంధ్య నారాధనము చేసి♦సవిత్రుఁ గొల్చి
యగ్ని దేవు నుపాసించు♦టర్హవిధము, నిజకులాచారమార్గిక ♦ నిరతులకును

చారుచర్య, పద్య 9, 10.

క. తల నిమ్మపండ్లు మొదలుగఁ, బులుసులు పట్టించి పుష్ప♦ములు నంజనమున్
జెలువొప్పఁ బూని కడు నిర్మలహృదయముతోడ నుదక♦సంధ్యం బునదున్,

క. దానములు చేసి యట స,స్నానంబున దేవపితృస◆మభ్యర్చనముల్
పూని యొనరించి పిమ్మటఁ,గాని చనఁగ వలదు భుక్తి◆కార్యంబునకున్.

క. కులకాంతచేతఁ దగుక్రియ,నలంకృతం బైన భోజ◆నాగారములో
నెలమిఁ దనుబంతిఁ జుట్టలుఁ, జెలులుం దగ భోజనంబు◆సేయఁగ వలయున్.

క. పెక్కండ్రు లేకయున్నను, నొక్కఁ డిరువు రైనఁ బంక్తి◆నొగిఁ గుడువక తా
నొక్కండ భుక్తిఁ గొను టది,యెక్కుఁడు నింద్య మని చెప్పి◆రిద్ధచరిత్రుల్.

క. ఇష్టఫలసిద్ధి చేకుఱుఁ, దుష్టి గలుగుఁ గలిమిపేర్మి◆దొరయును సుజనో
త్కృష్టుఁడగు భోజనము వి,స్పష్టముగాఁ జేయు నేని◆బహుజనములతోన్.

చ. గొనకొని కొండముచ్చులఁ జ◆కోరములన్ శుకశారికావలిన్
బెనుతురు భూపతుల్ విషము◆పెట్టినయన్నము చూచి యోలిఁ జ
య్యన నవి వెండ్రికల్ విడున◆నక్షులు మూయఁగఁ గూయుచుండఁగా
గని కుటిలప్రయోగములు ◆ గాంచుటకై నృపమంత్రిశేఖరా.

గీ. మునుపు తియ్యఁగూరలు రుచి◆గొనుట లెస్స,నడుమ నొగరులు చేఁదులు◆నంజ మేలు
పులుసులాస్వాదనము సేయ◆వలయుఁ బిదప,భోజనము సేయునప్పుడు◆భూమిపతులు

క. అతి మధుర మదీపనకర,మతి లవణము నయనకాంతి ◆ హర మాహారం
బతి తిక్తామ్లము ముదిమికి, నతిశయహేతు వని చెప్పి ◆ రాయుర్వేదుల్.

గీ. దప్పికుడకంబు మాఱుకూ◆డొప్పదుగొన, క్షుధకుఁ గూటి మాఱుగ నీరు◆గ్రోలఁ జనదు
గుల్మ మగు భగంధరమునాఁ◆గురుపు పుట్టుఁ, జెలఁగి యీ రెండు నేరక◆చేసి రేని.

గీ. కుడుపఁ దొణఁగుచు నీళ్లను ◆ గ్రోలె నేని, దీపనము చెడుఁ దద్దయు◆దేహ మలుగు
భుక్తి మధ్యోదకముఁ గొంత◆పుష్టి సేయుఁ, బిదప పానీయ మానుట◆పెద్ద మేలు.

గీ. కడుపు నాలుగు పాళ్లను◆గా నెఱింగి, రెండు పాళ్లన్నమునను బూ◆రింప వలయుఁ
బానమున నింపఁగా నొక◆పాలు వలయు,వాయుచలనకు నొక పాలు◆వలయు నెడము.

గీ. కుడిచినప్పుడు శయనింపఁ ◆ గడుపు పెరుఁగుఁ, గదల కెచ్చోటఁ గూర్చున్నఁ గ
లుగు సుఖము, అల్ల నడయాడ నాయువు◆నగ్గలించు, దూరము రిగిన మృత్యువుఁ◆దోన
యరుగు.

క. కడుపు కడుఁ బిక్కటిల్లినఁ, బొడమును మఱి దప్పిహీన◆భోజనుఁ డైనన్
బడు గగుఁ గావున సమ మగు, కుడుపున నే తెవులు లేక ◆ కొలఁది యొడ లగున్.

క. కుడుచునతం డైనను జె,ప్పెడునాతం డైన నప్పుడు ◆ డెందము రెండై
కడుఁ గోపముతో నుండినఁ, గుడిచిన యన్నంబు కాల◆కూటముఁ బోలున్.

క. కుడిచిన పిమ్మటఁ జేతులు, దుడిచి నియతి వార్చి మగుడ♦ తోయము నియతిన్
విడిచికొన వలయుఁ గన్నులఁ, బొడమఁగ రా దక్షిరోగ♦ముల కగ్లైనన్.

క. దళముగఁ గ్రోలుచునుండిన, జలమేమియు సానకున్న ♦ జఠరము శిఖిదు
ర్బలమగు నన్నం బఱుగదు, పలుమఱు నగు నల్పవారి♦పానము సేయన్.

చారుచర్య, పద్య 30, 33-48.

గీ. అవనినాయక యన్నార్థు♦లైనవృద్ధ, బాలకుల గర్భిణుల దుఃఖ♦భాజనులయుఁ
గోర్కి దీర్పక తా నొంటిఁ♦గుడిచె నేని, వాఁడు కడుఘోరమగు రౌర♦వమునఁ గూలు.

ఆ. అన్నకాంక్షులైన ♦ యఖిలజనంబులఁ, దనిపి గాని కుడువఁ♦దగదుఁ జనదు
మును పె దా భుజించి♦ వెనుక నతిథి కిడు, వాఁడు గూలు రౌర♦వంబు నందు.

సీ. స్నానమును దర్పణంబును ♦ సంధ్యయును జపహోమములైన దేవపూజహో♦మంబు వైశ్వ
దేవమును మఱి యతిథిపూ♦జావిధంబు, మానిభుజియించు టెల్లను♦ మలముఁ దినుట.

గీ. మునుపు మధురాన్నములు చవి♦గొనియె నేని, నడుమ లవణామ్లతిక్తముల్ ♦ నంజె నేని.
పిదపఁ గటుకార్ద్రిభోజనం♦బొదవె నేని, బలము నారోగ్యమును జాలఁ♦గలిగియుండు.

విష్ణుపురాణము, అ 4.

# భక్ష్యభోజ్యభోజనాదికము.

సీ. పట్టాంశుకములపైఁ ♦ బన్నీరు ప్రోక్షించి, చెయ్యార్చి చేపట్లు♦ సేయువారు
మక్కళించిన తావు ♦ మంజిళ్ళ పెందెగ, లుంగరంబులఁ బట్టి♦ మోత్తువారు
నగరుధూపము పట్టి ♦ యభ్యంతరంబైన, గగనావకాశంబుఁ ♦ బొగపువారు
వెండియొడ్డనలపై ♦ వెలచి తెచ్చినపైఁడి, పళ్ళెంబు లాయత్త ♦ పఱచువారు

గీ. రంకు మృగరోమ కృత నూత్న♦రత్నకంబళాది నానావిధాభ్యర్హ్య♦ తోసనములు
పెట్టువారును నైరిందు ♦ బింబవదన, లుభయబాంధవభోజన[illegible]యోగవేళ.

సీ. గోధూమసేవికా♦గుచ్ఛంబు లల్లార్చి, ఖండశర్కరలతోఁ ♦ గలపి కలపి
గుజ్జుగాఁ గాఁచిన ♦ గోక్షీరపూరంబు, జనులిమండెఁగలపైఁ♦జల్లి చల్లి
మిరియంబుతోఁ గూడ ♦ మేళవించిన తేనె, తోరంపులడ్వాలు♦ద్రోఁచి త్రోఁచి
పలుచఁగా వండిన ♦ వలిపెంపుఁజాఁపట్లు, పెసరపప్పులతోడఁ♦బెనఁచి పెనఁచి

గీ. గోవజవ్వాదిఁ గస్తూరిఁ♦గొఱఁత పఱుచు, వెన్నపడిదెంబు జొబ్బిల♦విఱిచి విఱిచి
వారయాత్రికులను మోద♦వంతులగుచు, వలచి భుజియించిరొగిఁ బిండి♦వంటకములు.

చ. తరుణులు చంచలా లతలు ♦ తత్కర భాండ నికాయ మంబు దో
త్కరములు, పాలుఁ దేనెలు ఘృ♦తంబులు వాన, లఖండ ఖండ [illegible]

ర్కరలును ద్రాక్షపండ్లు వడ♦గండ్లును, శోభన భుక్తి వేళఁ దొ
ల్కరిసములయంబు పేరెలమిఁ ♦ గైకొనకుండునె భోక్తృసస్యముల్. 2749

గీ. పచ్చతామానికంబుల ♦ పళ్లెరములఁ, బచ్చగందనికూర లే♦ర్పడమిఁ గాంచి
పెట్టరని పెండ్లిపెద్దలు ♦ పెదము వెట్టఁ, బెట్టుటకు వంగనలకును ♦ బట్టెఁ దడవు.

క. అయిదుగ నవు డోర్కాకయెడ, మరకతమణిపాత్రిగగన ♦ మండల మయ్యెన్.
జిరుపడముల పాసిము శశ, ధరుఁ డయ్యెం జుక్క లయ్యె ♦ ద్రాక్ష ఫలంబుల్.

సీ. అమృత రసోపమం ♦ బైన కమ్మని యావ, వాల పాయసము జం♦బాల మయ్యె
మంచు లప్పల మించు ♦ మండెంగ మడుపులు, పారలి తెట్టువగట్టె ♦ నురువులయ్యెఁ
గప్పురంబుల యొప్పుఁ ♦ దప్పు వట్టెఁగఁ జాలు, ఖండ శర్కరలు సై♦కతములయ్యె
గరుడ పచ్చల చాయఁ ♦ గల పచ్చ గండని, కూరలు శైవ లాం♦కురము లయ్యె

గీ. నొలుపుఁ బప్పుల తీరంబు ♦ లూరలఁ బడఁగ, బూరియలు లడ్డువంబులు ♦ పొరలిపొఱ
విమల శాల్యోదనంబుపై ♦ వెల్లినూపు, నాజ్య ధారా ప్రవాహ సా♦హస్రములకు.

ఉ. ఆదరణంబుతో నభిన ♦ వాజ్య విపాండుర ఖండ శర్కరా
క్షోద సమన్వితంబుగ వి♦శుష్క హిరణ్మయ భాజనంబులం
బైదలు లర్థిమై నిడఁగ ♦ బంధుజను ల్భజియించి రన్నపూ
ర్ణా దర హాస చంద్రికిర♦ణంబులఁ బోలెడు పాయసాన్నముల్. 2752

క. సేవించి రొకటి దొలఁగం, దోవక జంబీర రసము♦తో నూనియతో
నావం బెట్టిన కిటి ము, ద్రావలయము లమృత మధుర ♦ రస ఖండంబుల్. 2754

క. ఆమిష మనామిషముగ న, నామిష మామిషము గాఁ గు♦హాక మార్గ కళా
పార్థ్యంబునఁ జేసిన, తేమనములు మనములం ప్ర♦తిష్ఠించె రుచుల్. 2755

చ. అపమ సుధా రస హ్రదము♦వందలి రొంపు లనంగ మంచునం
బిసికిన పంచదార లనఁ ♦ బేరన మీఁగడతో మనంబులం
బసి గొన[illegible]య వాహారిపు ♦ బహ్వయటే దధి పిండ ఖండముల్
మెసవిరి కంఠదఘ్నముగ ♦ మిక్కిలి వేడుక వారయాత్రికుల్. 2756

గీ. మిసిమి గలపుల్ల పెరుఁగుతో ♦ మిళిత మైన, యావపచ్చళ్లు చవిచూచి ♦ రాదరమునఁ
జుట్టుమన్నీ మూర్ధములు దాఁకి ♦ యెల్లుఁదనముఁ, బొగలు వెడలింప నాసికా ♦ పుటములందు.

శృంగార నైషధము, ఆ 6 పద్య 108-139.

చ. సహములరీతిఁ గ్రొన్నెలల ♦ జాతి బిసంబుల భాతిఁ బద్మకే
సరముల భంగిఁ దాఁకల ♦ సంగతిఁ దార్పుల మాడ్కిఁ బుప్పపుం
జయిలవిధంబునన్ మణుల ♦ చాడ్పునఁ బెక్కులు గంధ తైలపా
కరచితముల్ విచిత్రములు ♦ కమ్మని సైఁదపుఁ బిండివంటలున్.

జైమిని భారతము, ఆ 8 పద్య 199.

గలిగించుఁ గర్పూర♦కలితతాంబూలంబు, కఫవాతపైత్త్యంబు ♦ కాఁచు ఖేది
రక్తపైత్త్యహరంబు ♦ రతిసౌఖ్యదము నాసి, కాగదసంక్షయ ♦ కారణంబు
గీ.కన్నులకు శైత్యమొనరించుఁగంఠమునకు,మధురరుచిఁజేయుఁబొందించుమంగళములు
దగ్గులుగుజిహ్వచెడదెట్టి♦దప్పియైన, తిమ్మఁబడుఁ గప్పురముతోడి♦తమ్ములమున.
ఆ. క్షయము రక్తపైత్త్య♦గతి వెట్టి భ్రమ పాండు,రోగ మక్షిగదము♦రొమ్మునొప్పి
కడుపునొప్పి గ్రహణి ♦ క్షయ కాస గలిగిన,వారు తమ్ములమ్ము ♦ వలదు చేయ.

చారుచర్య, పద్య 47—55.

చ. కలికి వరాటరా జపుడు ♦ గప్పుర వీడెము వెట్టె నవ్వుచు
న్నలు నడపంబు వానికి ఫ♦ణాధర వల్లి దళాంతరంబునన్
బలితపుఁ దేలు మైనమునఁ ♦ బన్ని యతం డది చూచి భీతిఁ ద
మ్ముల మిల వైచిన న్నగిరి ♦ మూఁగిన రాజకుమారు లందఱున్. 2808

శృంగారనైషధము, ఆ 6 పద్య 141.

చ. చికిలికికిటిపచ్చగవి♦ చెక్కడపుంబని కీలుఁ జిల్కతో
రికమగు పైఁడియాకుపడ♦గంబున నుంచిన పండుటాకు లి
చ్చకపు టొయారము ల్వెలయ ♦ సల్యకగంబునఁ బూని వేడ్క నొ
క్కొక మడుపు పొయ్య నిచ్చుచు మృ♦దూక్తుల నిట్లనియె న్మురారికిన్. 2809

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 92.

చ. తిన్నఁగఁ దెల్లనాకుఁగడ♦ తేఁకఁగఁ జీలిచి క్రొత్త గోరునన్
నున్నము రాచి చుట్టి నును♦ చుట్టకడల్ తగుపాటిఁ ద్రుంచి తా
వెన్నెలరాచరాబరటి ♦ పిదుమ్రరక్తము నిక్కవక్కలా
కన్నె యొసంగె నవ్వలిమొ♦గంబయి రాట్పవిపాణిపాణికిన్. 2810

బహులాశ్వచరిత్రము, ఆ 4.

ఉ. నున్నపుఁగాయకత్తెరయుఁ ♦ జొక్కడకొత్తును వక్క లాకులు
న్వన్నగజాలపట్టిక ల♦వంగము లాదిగఁ గూర్చి నేర్పుతోఁ
జెన్నగు బొట్టెసేవకుఁడు ♦ చేరికగా నడపంబుఁ దాల్చి తా
నన్నరపాలుఁ డేగఁ దన♦యందుఁ దగ న్మరిపెంబు దేఱఁగన్. 2811

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 95.

గీ. కుందనపుమిహీ వెల్ల నం♦దందరత్న, సంకలితలీలఁ గ్రాలి వి♦స్తారమైన
యడపమునసున్నకపురంబు♦టాకుమడుపు,లందుకొనియిచ్చెమునిచంద్రుఁ♦డవనిపులకు

కౌసల్యాపరిణయము, ఆ 2.

గీ. పండుటాకులకర్పూర ♦ భాగములను, చొక్కమానట్టి మౌక్తిక♦చూర్ణమమర
గూర్చి మడుపులపూఁబోణి ♦ గోపభామి, నీరమణి యతనికినిచ్చె ♦ నేర్పుతోడ.

గయోపాఖ్యానము, ఆ 1.

సీ. వినిమోద మెసఁగంగ♦వనజాక్షి తములంబుఁ, గొని చెంతనిలుచుండి♦కోమరుమిగులఁ
దనగళంబునకిది ♦ దగునె సాటి యటంచు, ఖండమ్ము గ్గావించి ♦ క్రముకములను
తనకక్షముల కిది ♦ యనయంబు తుల్యమై, పంచుకొను తమల♦పాకుల నొగిఁ(?)
దలఁద్రుంచుచునీని♦యలు దీసి తుదవుచ్చి, ముక్తామణీచూర్ణ♦ము వెలయ నిడి
గీ. చంద్రశకలలవంగముల్ ♦ చాలఁ బెట్టి, దిట్టతనమునఁ గట్టిగాఁ ♦ జుట్టిమట్టు
లేనిప్రేమ నొసంగెను ♦ మేనఁ బులక, లొదవ నత్తటి నతనికి ♦ నొప్పుమీఱ.

రంభానలకూబరవిలాసము, ఆ 5.

## —♦ అభ్యంగనాదికము. ♦—

ఉ. కంపనలీలమై వసుదుఁ ♦ గొ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమ♦రింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెస లాడఁ గంకణమ్ము♦దుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనె యంటె నొక ♦ చంద్రనిభానన కంసవైరికిన్. 2815

ఉ. తామరదోయిలోఁ దగిలి ♦ దాఁటెడు తేఁటులఁ బోలఁ బెన్నెఱుల్
ల్వేమఱుఁ జేతుల న్విడిచి ♦ విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలి ♦ గొజ్జఁగినీ రెడఁజల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొక ♦ యంగన కాళియనాగభేదికిన్. 2816

మ. చెలువ ల్గొందఱు హేమకుంభములతోఁ ♦ జేసేనొసంగ న్వీని
ర్మలదోర్మూలరుచుల్ వెలింబొలయఁ దో♦రంబైనచన్దోయిసం
దోలయ న్వేనలి జాఱ నిక్కి యరమో ♦ నొయ్యారమై వ్రాలఁగా
జలకం బార్చె లతాంగి యొర్తు యదువం♦శస్వామికిన్ వేడుకన్. 2817

పారిజాతాపహరణము, ఆ 2 పద్య 9, 10, 11.

చ. తెలు లరనిక్కఁ బూఁతనెఱ ♦ తావియచిక్క నవాంగ మాలికల్
మెఱుఁగులు గ్రిక్క నూనెపుల ♦ మేలిమిఁదేఁటులు చొక్క హారముల్
కుఱుచలు వ్రొక్క ముంగురులు ♦ గ్రొంజెమటం బద నెక్క వేలుపుం
జెలువ యొకర్తు చేడెజగ♦తీపతికిన్ శిరసంటె వేడుకన్. 2818

సీ. భ్రమరకంబులచిక్క ♦ వాపవేయననింక, భ్రమరకంబులచిక్క♦ వాయుననుచుఁ
బృథులకుచంబు లు♦బ్బింపకేయనఁ బృథు,లకుచప్రకాశకా♦లం బటంచుఁ
గరఁగెఁబో పరతిల♦కం బన నుస్నేహ, కలనఁ గరఁగు వర♦తిలక మనుచుఁ
గడు మెఱయింపకే♦కటకంబులనఁ బ్రియుఁ, గటకముల్ శుభరత్న♦గరిమ ననుచు
గీ. జెలి పలుకుఁ గేరడించుచుఁ♦ జికిలిగోళ్ళ,సొగసుసోఁకులఁ గళలునిం♦చుచు మెఱుంగు
ముంగురులు గూడదువ్వుచు♦ ముడికి దార్చి, మజ్జనపువేళ తడవేల♦ మహిపయనుడు.
గీ. సింహగతిమీఱు వసురాజు♦ చెంత నొక్క,తోయధరవేణిపాదములొ♦దుడిచి మెట్లు
వెట్ట నొకకన్య హస్తమ♦ర్పింపవచ్చె,సలిలభవనంబునకుఁ బ్రజో♦త్సవము మెఱయ.
చ. పతియభిషేకవేళఁ గర♦భావితకుంభకురంగభృన్మణి
ప్రతిమలు నిర్ఝరీముఖ♦భావముఁ గన్గొని నీరు వంచి య
ద్యుతివలు సిగ్గునం గనలి♦యాస్యము వంచిన నూరకుండె న
ప్రతివరసంజ్ఞ రత్నపరి♦పాకము లిట్టివి గావె ధారుణిన్. 2822
మ. ఘనచాంపేయకవాససావివశభృం♦గశ్రేణిఁ జేపట్టి చ
ల్లనిపూఁదేనియ చల్లి తేర్చు మధువే♦శాలక్ష్మిరోనాఁగ సో
గసెఱుల్సంపఁగినూనె నిగ్గుసడలం♦గాఁ బైపయిన్ దువ్వి చే
ర్పున గంధామలకంబువెట్టె నొకయం♦భోజాక్షి భూజానికిన్. 2823
చ. కరముల నుజ్జ్వలాభినవ ♦ గైరికకుంభము లంటగూర్చి పు
ష్కరములు కంకణప్రకర♦సంభ్రమ మొప్పఁగ వంచి రాజకుం
జరునకుఁ గుంభినీభరణ ♦ సమ్మదశాలికిఁ బద్మినీపరం
పర పరమానురాగమున ♦ మజ్జన మార్చెఁ బయోగృహంబునన్. 2824

వసుచరిత్రము, ఆ 5 పద్య 75—80.

సీ. కంకణగోమేధి♦కచ్ఛాయ డొలుదొల్తఁ, దేటనూనియనిగ్గు ♦ నీటు నెఱపఁ
దరళవక్షోజము♦క్తాధారబడిబడి, జాఘువాబిందెల ♦ జాలు పఱుపఁ
గమనీయనిశ్వాస ♦ కందళం బెడనెడ, సురటివటుప్రవగాలి ♦ సొగసు దెలుపఁ
దరుణారుణాంగుళీ ♦ కిరణముల్ పయిపయిఁ, జెంగల్వ రేకుల ♦ చేరు చెలువ
గీ. మున్నుగా నాత్మశృంగార♦ముతో లతాంగి,మంగళస్నానవిభవసా♦మగ్రిఁ గూర్చ
గమ్మనవిసాళివలపులు♦ గుప్పరించు, కమ్మజవ్వాదిఁ దలయంటెఁ♦ గలికి యొకతె.

వసుచరిత్రము, ఆ 5 పద్య 108.

క. చెలువకు సంపెఁగనూనెం, దల యంటె సుగంధవాసి♦తములగు చూర్ణం
బుల నలుఁగు వెట్టె గంధా, మలకం బిడి చమురు దిగిచె ♦ మజ్జన మార్చెన్. ✓

చ. చెలికి మెఱుంగుఁబావడల • చేఁ దడి యార్చెను ధూపవాసనల్
దలకొలిపెన్ బ్రసూనసద • లంకృతి మీఱఁగ వేలువేల మె
చ్చు లరసికీలుగంటుజడ • సొల్లెము వేసెలుదుఁగొప్ప మూఁడుమూ
లలబిగికొప్ప పెక్కుగతు • ల న్నిలిపెం బలుమారు విప్పుచున్. 2827

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 129, 130.

సీ. తలయంటె నొకచాన • కలికిగోరులదువ్వి, యాకులఁ దేనియల నొ•లార్చెననఁగ
లేమయొక్కతె గంధ•లేపంబు మైనూన్చె, నెలతొకఁ బొదువుడిం•డీర మనఁగ
నంకలనోర్తు గం•ధామలకము నించె, నిరులవెన్నెలఁ గది•యించె ననఁగ
జలకంబుఁ గావించె • నల కంబుగళ యోర్తు, కంతుకటారిపు•ల్కడిగె ననఁగ
గీ. మేనితడియొత్తె నపు డోర్తు • మీననయన, కనకపుత్త్రికకొకవన్నె•యూన్చెననఁగ
నవదుకూలంబునందిచ్చె • నాతియొకతె, క్రొమ్మెఱుంగున వెలిమొగు•ల్గూర్చెననఁగ.

సుదక్షిణాపరిణయము, ఆ 5 పద్య 139.

ఉ. వలయవ్రాతము పైకిఁద్రోఁచి పదము • ల్వాటంబుగా నూఁది లే
జిలుఁగుం బయ్యెదకొంగుఁ జెక్కు యలఁతిం • జేమార్చుచు న్నమ్రియై
బెళుకుంగొను గురు ల్సలింపఁగ సఖీ•ల్పంపిళ్లు గూయం దమిం
దలయంటెం జెలి యోర్తు వేడ్కనలఁగం•టం జొక్కరౌ చూడ్కికిన్. 2829

చ. కెలన నొకర్తు బంగరపు • గిన్నియఁ జందన మాని నిల్వఁగాఁ
గలయఁగఁ బెన్నెఱు ల్విలిమి • గందము పైఁదలికించి గోరము
క్కుల దిగదువ్వి చేఁ బిడిచి • కోమలియొక్క కరాంబుజద్వయీ
లలితసువర్ణకంకణక•ల్ధ్వని వీనులవిందు సేయఁగన్. 2830

మ. తఱుకుమ్బయ్యెద జాఱఁ జన్నుఁగవ చెం•త న్మించు డాలీను కు
చ్చెల కొంగు ల్గుదియించి లంబుగలఁ జే•సేఁగొంద అందీ నొడల్
కలయ న్వేపధువూన నూర్పు లడరం•గా వేడ్కతో నొక్కతె
చ్చెలి కంసాంతకసూతికిన్ జలకమా•ర్చెన్ గాంగతోయంబులన్. 2831

క. కడకొంగు ముడిచి తలపా,వడ యొకచెలి చుట్టె నొక్క • వనిత తనువునం
దడియొత్తెఁ జలువదుప్పటి, నడఁతియొకతె యొసఁగె నాన్ని•పాలాగ్రిణికిన్.

ఉ. ఒక్కలతాంగి కైయొసఁగె • నొక్కవధూటి కిరీటిపచ్చటా
ముక్కలిపీఁటవెట్టె నొక • ముద్దియ కుంచియవైచె వెండ్రికల్.

చిక్కఁడరించె నొక్కఁకల♦కీకుచ తొయ్యలియూర్పు జాఘుపా
చక్కనిజెజ్జపున్ బరణి♦సందుల ధూపము గొల్పె మెల్పునన్. 2833

సీ. కుటుచకచంబులు ♦ గూడఁగూడఁగ దువ్వి, యొఱపుగా సిగవైచె ♦ నొకవధూటి
పలుదెఱంగుల కదం♦బపుఁబూవుటెత్తులు, చుట్టెఁ జుట్టుగ నొక్క♦సూనగంధి
జీవరత్నంబులు ♦ చెక్కిన సంపెంగ, మొగ్గతాయెతు లొక్క♦ముదిత చేర్చెఁ
బన్నీటఁ బదనైన♦పైగోవకస్తూరి, తిలక మొయ్యన నొక్క♦తెఱవ దీర్చె

గీ. వెలఁది యొక్కతె కుంకుమ♦కలపమలఁదెఁ, దరుణి యొక్కతె గొజ్జంగి♦నురటి విసరెఁ
మగువ యొక్కతె జిలుఁగుధూ♦ప్రంబుఁ జిలికె, నువిద యొక్కతె నునుసోగ ♦
యొంటె లిడియె.

క. చెలి యొకతె పచ్చపట్టెల్, బలసిన బిదుహొళి పెసరిగె♦పనిపైగానీ
చలువయఱచట్టఁదొడిఁగెన్, సలలితగతి నొకతె కడక♦శలుముడివైచెన్. 2835

గీ. రమణి యొక్కతె పీతాంబ♦రపుఁగుళాయిఁ, బెట్టెనంతంబుదబ్బచేఁ♦బెట్టె నొక్క
చెలి నెఱుల్ చక్కఁగాఁద్రోఁచె♦లలనయొర్తు, కేలనపరంజిగొలుసులు♦గీలుకొలిపె.

క. నీలంపుమేను మూత్రపు, గాలకనుంగవయుఁ బాప్య♦నాగపుఁదేనుల్
గ్రోలెడి చొక్కపుఁదుమ్మెద, తాలియ నొకతేమ పేరె♦ద న్నెలకొలిపెన్.

గీ. కట్టికమ్మగేఖురాల్నముఃఖా యనంగ, నొకతె గొబ్బునఁ గైదండ♦యొసఁగ లేచి
నిలుచుటయుఁ బైఁటచెఱఁగుల♦జిలుఁగుచంద్ర,కావిపచ్చడమతనికిఁ♦గట్టె నొకతె.

క. క్షితినాథుని ముంగల నొక, చాతిపయుఁ దా మంచినిలువు♦టద్దము నిలిపెన్
లతకూన యొకతె యాదవ, పతినుతునకుఁ గప్పురంపు♦బాగా లొసఁగెన్.

చంద్రభానుచరిత్రము, ఆ 5 పద్య 148—158.

సీ. చెలువ మున్నేఁచిన♦యలరుసంపెఁగ తేనె, నానుచు గతి నొర్తు♦నూనె యంటెఁ
గలికి యొక్కతె మరు♦కైదువుఁజల్లికూఁ, కటిగింజ లిడుగతి ♦ నటక లిడియెఁ
గనపబంగరు కలా♦కను జాజు వట్టించు, పగిది నొక్కతె మేనఁ♦బసుపుఁ బూసె
నెలఁదీవె పాదుగ ♦ నిలిపి నీ రార్చులా,గున నొక్కలేమ మ♦జ్జన మొనర్చె

గీ. నెలమిఁగుముదినిమారార్చ♦వలసిజిలుఁగు,జంద్రికలఁజేర్చుగతినొర్తు♦చలువలొసఁగె
గలికిపురినెమ్మినిడుసోగ♦♦గఱులునివురు,చెలువునొకర్తు పెన్నెఱు♦ల్చిక్కుపుచ్చె.

క. తెలిగనునెలపులుఁగుంబిలు, కలుబొదలన్ మేఁతమరపఁ♦గా వడుమం గొ్రి
న్నెలమొలక నిలిపెనో యనఁ, దిలకము కపురమున నొకతె ♦ దీర్చెం జెలికిన్.

చంద్రభానుచరిత్రము, ఆ 5 పద్య 163, 164.

సీ. ఫాలభాగమున వ♦జ్రాలపాపటబొట్టు, తళుకుతళుక్కని ♦ తాండవింపఁ
గరసరోజముల బం♦గారు గాజులు రత్న, కంకణమ్ములు గల్లు♦గల్లు మనఁగఁ
జెమటచే జాఱిన ♦ చికిలి కస్తూరిబొట్టు, ఘుమఘుమత్తావులఁ ♦ గుమ్మరింప
మెఱుఁగారు కమ్మలు ♦ మృదుకపోలములపై, ధళధళత్కాంతులఁ♦దళుకులొత్తఁ
గీ. గొప్పముడి పీడ నుదుట ముం♦గురులు గూడ,గుబ్బచనుదోయి హారము♦ల్గునిసియాడ
నీటువగమీఱ వన్నెకా♦నికి మిటారి, దమక మెదనంటసంపెఁగ♦తైల మంటె.
గీ. చెండ్ల గెలిచిన మెఱుఁగు పా♦లిండ్లతోడ, బీరములు చూపవచ్చుజం♦బీరములను
జించి సారస్య మంతయు ♦ వంచినట్లు, నిమ్మపండ్లరసంబుల ♦ నెలఁత యంటె.
మ. తరుణీరత్నము బాల కైతకదళో♦దంచన్న ఖాగ్రింబులన్
గురులన్ మెల్లనఁజీఁటి పాయ లిడి చి♦క్కుల్ పాయఁగాఁబ్రాయుచున్
గరపంకేరుహరత్నకంకణ ఝణ♦త్కారంబు తోరంబుగా
వర గంధామలకంబుఁ బెట్టెనుసుధా♦వారాశి తొల్పట్టికిన్. 2844
ఉ. జాఱుపయింటఁ జెక్కి బిగి ♦ చన్గవ నిక్కఁగ బాహుమూలశృం
గారరుచుల్ వెలిం బొలియఁ♦గా నగుమోము చెమర్ప రత్నకాం
చీరవముల్ సెలంగ నభి♦షేక మొనర్చె లతాంగి వానికిన్
మారునిమాఱుసాగర కు♦మారునిఁ బట్టము గట్టెనో యనన్. 2845
సీ. పసమించు మాదర♦పాక పోరువలచేఁ, దడియారనొత్తి కుం♦తలము లార్చి
సాంబ్రాణిధూపవా♦సన నించి జవ్వాది,చే నంటుచును కురు♦ల్చిక్కు దీర్చి
ఆరవిరి విరిజాజి♦విరులు జుట్టిన జాఱు, పిగను జంటరుమాల ♦ సొగసుపఱిచి
తళుకునిచ్చలపుపె♦త్తమ్మిపూల బవంతి, పుట్టంబు హొయలుగాఁ ♦ గట్టనిచ్చి
గీ. కమ్మకస్తురిచేఁ దిల♦కమ్ముదీర్చి, యొంటివజ్రంపుబావిలీ ♦ లుంగరాలు
చేసరాలును సరిపెణల్ ♦ చిలుకతాళి, పంకజేక్షణ వాని క♦లంకరించె. 2846

తారాశశాంకవిజయము, ఆ 3 పద్య 9—13.

చ. నడు మసియాడఁ జన్నుగవ ♦ నాట్యము సల్పఁగ రత్నహారముల్
దడఁబడి డోలికాకలనఁ ♦ దార్కొన వేణిచలింప నెమ్మొగం
బొడలును జెక్కుటద్దములు ♦ నొయ్యఁ జెమర్పఁగఁ గంకణంబు లే
ర్పడి రవ ముప్పతిల్ల నొక ♦ భామ తలంటెఁ గవీంద్రమౌళికిన్. 2847

బిల్హణీయము, ఆ 3 పద్య 20.

ఉ. కంకణనిక్వణంబు ఘలు♦ఘల్లన మ్రోయఁ గపోలపాళిఁదా
టంకరుచుల్ వెలుంగ నుదు♦టం జెఱు చెమ్మట గ్రమ్మ హారముల్

కుంకుమ గంధపు స్వలపు ♦ గుబ్బలపై నటియింప నొక్కయే
ణాంకనిభాస్య భూపతికి ♦ నంటె సుగంధపు నూనె నత్తఱిన్. 2848

కవిరాజమనోరంజనము, ఆ 5.

క. సంపంగినూనె యంటెన్, శంపాంగి కిరీటి కొకతె ♦ చనుదోయి పిసా
ళింపం గిల్లెడ కటి నటి, యింపన్ గిటకిటని కాకొ♦కింత చలింపన్. 2849

క. కలశస్తని మణికంకణ, కలశస్తనినాద మొలయఁ♦గా నొకతె వడిన్
దలఁ బ్రామి పసిఁడి కొప్పెర, జలములు చెలు లంది యొసఁగ♦జలకం బార్చెన్.

విజయవిలాసము, ఆ 3 పద్య 79, 80.

ఉ. కురు లరవీడ దివ్యమణి♦కుండల రోచులు గండ భాగ భా
స్వురముల నోల లాడఁ గుచ♦శైల యుగంబున ఘర్మవాఃకణో
త్కరములు గూడ మధ్యమప♦థం బసియాడ ముదంబుతోడఁ జా
తురిఁ దగు నొక్క ప్రోడ యల♦తొయ్యలికిన్ శిరసంటె నూనియన్. 2851

చంద్రికాపరిణయము, ఆ 6 పద్య 15.

సీ. గురుకుచంబులఁ జెనఁ♦గొన్న హారావళు,ల్పయ్యెదవెలువడి ♦ బయలురాఁగ
నరచందమామతో ♦ సరివచ్చు నిటలంబు,పైఁ గుంతలంబులు ♦ పరుగులెత్త
దిటముచాలక గిట♦గిటమను కౌఁదీఁగె, యంబరావృతి నసి♦యాడుచుండ
శ్రమసముద్భూత♦నిశ్వాసానిలము తావి,గొన భృంగములు గుంపు♦గూడి చేరఁ
గీ. జెలఁగి నెమ్మొకమునఁ జిఱు♦చెమటలూరఁ, గలితకంకణఝుణఝుణ♦త్కారమెసఁగ
మానవతియోర్తు సంపెంగ♦నూనెయంటె, నతిముదంబునఁ బొంగియ♦య్యతివకపుడు.

సీ. కపురంబుజవ్వాది ♦ కమ్మకస్తురి హరి,ద్రయుఁగూర్చి నలుఁగిడె ♦ రమణియొకతె
గమ్మనవలచు చో♦క్కపు మంచిగంధంపు, టటకలివెట్టె వా♦మాక్షియొకతె
సలిలకాలకుఁ దెచ్చి ♦ చలువరాపలకపై, నిలిపె మక్కువతోడ ♦ లలనయొకతె
బంగారుబిందెలఁ ♦ బన్నీరు దొరలించి, జలకమార్చెఁ గడంక ♦ నెలఁతయొకతె
గీ. జిలుఁగు దువ్వల్వ ♦ కెంగేల నలవరించి, కదిసి తడియొత్తె నొక్కపం♦కజదళాక్షి
వ్రేలఁ జెఱఁగుల చెంగావి♦వలువఁ గట్టి, నిచ్చెనొకబాలికామణి ♦ యిందుముఖికి.

ఉ. నలినదళాంతవృంత పవ♦నంబులచేఁ దడియార్చి పెన్నెఱు
ల్గలయఁగ దువ్వచుం గుసుమ♦గర్భముగాఁ జెలియోర్తుకై శికం
బలవఱుపం బయోజముఖి ♦ యాస్యము చూడఁగ నొప్పె నయ్యెడన్
లలితమిళిందబృంద పరి♦లక్షిత ఫుల్లసరోజమో యనన్. 2854

ఉ. పంకరుహాక్షికి న్నిటల♦భాగమునం గొనగోరఁ దిన్నఁగాఁ
గుంకుమ రేఖదిద్దె నొక ♦ కుంజరయాన సరోషచిత్త మీ
నాంకధనుర్విముక్త దళి♦తాఖిలపాంథశరీర శోణితా
లంకృతవిభ్రమాశుగము♦లక్షణలక్షితలీలఁ బోల్పఁగన్. 2855

క. ఉడురాజబింబవదనకుఁ, గడఁకం గడకన్నులందుఁ ♦ గజ్జెలమిడె న
య్యెడ నొకపడంతి చెలువల,రెడు చాతుర్యమున సొగను ♦ రెట్టించంగన్. 2856

చ. పొలఁతు లమూల్యదివ్యమణి ♦ భూషణ పేటికఁ దెచ్చి యందులోఁ
గల మణిభూషణావళులు ♦ గన్గొని కాంచనపద్మపత్త్రి మం
జులమగు లేమ మై సొబగుఁ ♦ జూచి సఖీమణి మేని కాంతితోఁ
దులగన వీవిభూషణత♦తు ల్నిజ మంచు వచించి రయ్యెడన్. 2857

క. అద్దముఁ జూపెను జెలికొక, ముద్దియ సఖి నీదు ముద్దు ♦ మోము సమమునం
గద్దఱిశశిఁ దెచ్చితి నీ, వద్దికి నిదె చూడుమనుచు ♦ వచియించుగతిన్. 2858

ఉ. అంగనయోర్తు పీఁటయిడె ♦ నంబుజలోచనయోర్తు రాజమౌ
ళిం గడు వేడ్క నం దునిచె ♦ లేమ యొకర్తు నృపాలదత్త ర
త్నాంగద ముఖ్యభూషణము ♦ లందుకొనెం గలకంఠియోర్తు తె
చ్చెం గనకస్థ సౌరభవ♦శీకృత తైలముఁ బైఁడిగిన్నియన్. 2859

చ. కులుకుమిటారి గబ్బిచనుఁ♦గొండల హారలత ల్నటింపఁగాఁ
గలనినదంబుతోడఁ గర♦కంకణము ల్మొరయంగఁ జూర్ణకుం
తలములు ఫాలభాగమునఁ ♦ దాండవమాడఁగ సంతసంబుతో
నళికులవేణియోర్తు శిర♦సంటె నృపాలక చక్రవర్తికిన్. 2860

చ. గిటగిటఁ జేదకొను వడఁ♦కింపుచుఁ గస్తురి వల్గువెట్టె ను
త్కటకటకధ్వనుల్చెలఁగఁ ♦ గామినియోర్తు శిరోరుహాంబులం
దటకలివెట్టె గందమున ♦ నంగనయోర్తు కటీతటీనట
త్పటయగుచున్ రయంబున నృ♦పాలకమౌళికి సంతసంబుగన్. 2861

క. కైదండయొసఁగె నపుడొక, పైదలి నడపించె సలిల♦భవనంబునకున్
వేదండయాన యొక్కతె, యాదరమున నవ్వసుంధ♦రాధీశ్వరునిన్. 2862

చ. అనుపమరత్నపీఠమున ♦ నద్ధరణీవిభునుంచి యొక్క మా
నిని మణిపూర్ణకుంభముల♦నించిన గొజ్జఁగినీరుముంచి మ
జ్జనమొనరించె నొక్క నవ♦సారసలోచన జిల్గుదుప్పటం
బునఁ దడియొత్తెఁ బెన్నెఱులు ♦ భూపవరాగ్రణికిన్ రయంబునన్. 2863

క. జలజాస్యయొకతె జిలుఁగుం, జలువలు దెచ్చి యొసఁగె నొక ♦ సతిగట్టియిడెన్
గలకంఠియొకతె కస్తురి, తిలకముఁ గొనగోర దిద్దె ♦ ధీరాగ్రణికిన్. 2864
వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ ౫ పద్య 36—50.

సీ. చెక్కుటద్దములపైఁ ♦ జెమటబిందువులూరఁ, గస్తూరి తిలకంబు ♦ గరఁగి జాఱఁ
గరకంకణంబులు ♦ ఘల్లుఘల్లని మ్రోయ, నలువంక బసిఁడి వె♦న్నెలలు గాయ
స్తనభారమోర్వక ♦ దనుమధ్య మసియాడ, నిండుమోహంబుతో ♦ నీవి వీడ
గబ్బిసిబ్బెపుటుబ్బు ♦ గుబ్బచన్గవపొంగ, బాహుమూలోజ్జ్వల ♦ ప్రభలెసంగఁ
గీ. గటితటంబున గీల్జడ ♦ నటనమాడ, ఘనతరంబైన నిట్టూర్పు ♦ గాడ్పుతోడఁ
డాలిగుబ్బొప్ప సంపెంగ ♦ తైలమంటెఁ, దమకమెదనాటహరికి రా ♦ ధావధూటి.
గీ. చెలుల చేలాగుగొని లేచి ♦ కలికియిడిన, పాదుకలు మెట్టి రాజస ♦ ప్రౌఢి మెఱసి
మేటిమగరాలముక్కాలి ♦ పీఁటమీఁద, శౌరి కూర్చుండె మజ్జన ♦ సదనమునను.
క. లికుచకుచ శౌరికత్తఱి, లికుచరసంబిడియు నఖర ♦ రేఖలచేనొ
క్కొక్కటెగఁ జిక్కుదళింపుచుఁ, బ్రకటితఘననీలకేశ ♦ పాశంబందున్. 2867
క. కుంకుమునలుఁగిడె నాచెలి, పంకజదళనేత్రి మేన ♦ భాగములోనన్
గొంకగు ననురాగరసం, బంకెఁగ వెలదిసి ప్రభున ♦ కర్పించె ననన్. 2868
క. గంధామలకము వెట్టెను, గంధేభసమానయాన ♦ గని పరికరముల్
గంధతిలలంది యియ్యఁగ, గంధవతీభవున కప్పుడు ♦ గరమొదలిర్పన్. 2869
గీ. పసిఁడి గిండుల చేముంచి ♦ వడఁగుబియ్య, జలకమార్చెను జెలువగో ♦ జ్జంగినీట
రమణునకు రాధవిధవసా ♦ మ్రాజ్యమునకుఁ, గొలఁగిపట్టాభిషేకంబుఁ ♦ జేసెననఁగ.
సీ. కురులార్చెనొకలేమ ♦ సురటినొక్కతె వీవ, పరిమళసూనధూ ♦ పములనుంచి
సిగవైచె నొకభామ ♦ నిగనిగతాయెతుల్, గీలించె జంటయ ♦ మాలుగట్టె
విరులచే నొకరామ ♦ విదళించి పన్నీట, పదనిచ్చి గోవజ ♦ వ్వాదిఁ జమిరెఁ
బటమిచ్చె నొకవాన ♦ యటవిచ్చె నలఁగఁగ, నొకతె తాఁగలుగట్టె ♦ నెరికగట్టి
గీ. తిలకవతియొక్తె కస్తూరి ♦ తిలకముదిద్దె, గంధగజయాన యొక్కతె ♦ గంధములఁ దె
తొడవుతొడవొర్తు రత్నాల ♦ తొడవు లిడియె, శౌరికినిబాలనయ్యలఁ ♦ గాంచె వేళ.
రాధికాసాంత్వనము, ఆ 1.

చ. కురులలికంబుపై నెనయఁ ♦ గ్రొంజెమటల్ జనియింప ముత్తెపున్
సరులు పెనంగులాడఁగఁ గు ♦ చంబులు నర్తనసేయ నిద్దపున్
మురువున నాసికాగ్రమణి ♦ మోవిని జిందులు ద్రొక్క నేర్పునన్
శిరసునఁ బైఁడిమంటె నొక ♦ శీతకరానన చంద్రమౌళికిన్. 2872

స్ర. అనసూయారుంధతులను, వనితామణు లిర్వురును సు♦వర్ణఘటయుగం
బును గొని తోయము నించుచు, ననుపమగతిఁ జేసి రతని ♦ కభిషేకంబున్. 2873

క. తడి యొత్తె నొక్క కోమలి, పడఁతి యొకతె యిచ్చె మృదుల♦పరిధానంబుల్
మృదుమేన నొక్క భామిని, కడఁకం గర్పూరయుత సు♦గంధం బలఁదెన్.

ఉ. కన్నులు రెండెకావు వెద♦కన్మఱి యొక్కటి యున్నదో చెలీ
యెన్నఁడుఁ జూడ మమ్మ యిఁక ♦ నించుక కాటుకఁ దెమ్మటంచు నా
సన్నుత దేవతాళికిని ♦ జంద్రకిరీట సమేత మాళికిన్
గన్నియ యోర్తు కన్నులను ♦ గాటుకఁ దీర్చెను సూటిమీఱఁగన్. 2875

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 8.

సీ. కస్తూరియును పచ్చ♦కర్పూరమును గోవ, జవ్వాదియును మంచి ♦ చందనంబు
పన్నీటఁ బదనిచ్చి ♦ పంకంబుగాఁ జేసి, యంచుల నటకలి ♦ యమరఁ బెట్టి
గంగాజలంబులఁ♦గలయ మజ్జన మార్చి, పంచవర్ణాన్నంబు ♦ పడసినైన
దివ్యాంబరంబుల ♦ దేహంబు తడి యొత్తి, కురులు నున్నగ దువ్వి♦కొప్పు వెట్టి
గీ. ధాళధళ మగు బహు పుష్ప♦దామకములు, నెరయ కబరీభరంబున♦నిండ దుఱిమి
నొసల మృగమదతిలకంబు ♦ పొసఁగ వెట్టి, చెందుమణిదర్పణంబును♦జేతి కిచ్చి.

వైశ్యపురాణము, ఆ 8.

చ. సరులు పెనంగ లేఁజెమట ♦ జాలుగొనంగఁ గురు ల్వీడంగఁ గ్రొ
వ్విరు లురలంగఁ బైఁటచెఱఁ♦గింపుగ నోరిపిలంగ గుబ్బచ
న్మెరుగు లెఱుంగఁ గౌను జవ♦మించు కెసంగ నగల్ మెలంగఁగా
గురుకుచ యోర్తు బిల్వాఖున♦కుం దల యంటె ననేకభంగులన్. 2877

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

సీ. సూటికాటుక సోగ ♦ మీటువాల్గన్నుల, సొగసైనకెంగంటి♦చూపు లొలయ
బలు కెంపు బాజుబం♦దులు డాల్ మెఱయుముద్దు, గులుకుచంకలు మేలి♦తళుకులీన
నునుబోటి చనుదోయి ♦ నెన లేని బరువున, నలరి గౌ నల్లల♦నాడుచుండ
సన్నంపుమేల్ బురు♦సారంగుచీరపై, ముత్తరుల్ సరులతో ♦ నెత్తమాడఁ
గీ. జొక్కతోఁగూడుచందురు♦సొబగుదెల్పు, ముత్తియపుఁజేరుచుక్కబల్♦ముంగురులను
జిందులాడంగసేసఁబ్రాల్♦శిరముననిడి, యెలమిఁదలయంటెదొరకొక్క♦యిందువదన.

క. నలుఁగిడె మెయి నొక రమణి, తిలకము జలకంబు లార్చె ♦ తీరుగ నొకరా
చిలుకలకొలికి మిటారము, గులుకం దడియొత్తె ముద్దు♦గుమ్మ నృపునకున్. 287

క. చెందిరపుం దిలకం బొక, మందగమన యిడె లలాట♦మధ్యంబున వా
నందమున నొక్క సుందరి, యంద మమర నెదుట నిల్వ♦బద్దము నిలిపెన్. 2880
కవిచకోరచంద్రోదయము. ఆ 1.

క. తలయంటె నొక్క యలికుం,తల సంపెఁగనూనె రఘువ♦తంసున కిందో
పలఖచిత కనకమయ శ[illegible], వలయ ఝుంఝుణరవంబు ♦ వలనుగఁ జెలఁగన్.

క. నిటలతటవి[illegible],[illegible] [illegible]లక యగుచు నొక చ♦కోరదృశ సము
త్కటహార[illegible] [illegible] గండపు, టటకలి వెట్టెం బ్రభాక♦రాన్వయమణికిన్. 2882

చ. జలక మమర్చె నొక్క జల♦జాతవిలోచన యొక్కనీలకుం
[illegible] [illegible]త్తె [illegible] [illegible]వస♦నం బిడె నొక్కసుధాకరాస్య వి
చ్చలపడి పైఁడిగద్దియ యొ♦సంగె వెలందుక యోర్తు పెన్నెఱుల్
మెలఁత యొకర్తు దువ్వె నెల♦మిం గొనగోరుల రామమూర్తికిన్. 2883

సీ. కమనీయనవరత్న♦ఖచితకోటీరంబు, శిరమున ఘటియించెఁ ♦ జెలువ యొకతె
వికసితమణిబద్ధ ♦ మకరకుండలములు, వీనులఁ గీలించె ♦ వెలఁది యొకతె
గొనబువన్నియమీఱు♦కనకకేయూరముల్,భుజములనెలకొల్పెఁ♦బోలఁతియొకతె
రాణించు తెలితళ్కు♦టాణిముత్తెపుఁ బేరు, లురమున నొనఁగూర్చె♦నువిదయొకతె

గీ. వీరవిజయాంకమన్నెకు♦మారబిరుద, మైన ఘనగండపెండేర♦మంద మలరఁ
బాదములఁ బాదుకొల్పెను ♦ బడఁతియొకతె,నిండువేడుకరఘువంశ♦మండనునకు.
రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 2 పద్య 119—122.

చ. ఒక యినుకై వివాదము మ♦హోద్ధతి గ[illegible]నఁ జక్రివాకు లూ
రక యనిఁ జేయఁ జెటి కొగి♦రాఁ దమ గూడులఁ దొక్కులాడు మా
డికి అవికం గుచంబులు గ♦డించిదితనంబునఁ జిందు లాడఁ [illegible]
యక యొక యింతి తీని తల♦యం టెను సంపఁగినూనెతో రహిన్. 2885

సీ. ముంగురుల్ చెదరిమో♦మున నాడఁ దమ్మిపూ,పైనాడుబంభర♦పాళిఁ దెలుప
బిగువైనకంచెలఁ ♦ బింపిళ్ళుగూయు చ,న్నవపలఁ బడ్డ జ♦క్కవలఁ దెలుపఁ
[illegible] నున్నకడియముల్ ♦ గలుగల్లుమని మ్రోయ,సుమచాపమార్వస్వ♦నములు దెలుపఁ
జెక్కిలిదోయినిఁ ♦ జెమటజాలఁగ శశి, శిలఫలకసా[illegible]♦ములను దెలుపఁ

గీ. జిన్నిముక్కెరముక్కునఁ ♦ జిందులాడ, మేలిపయ్యెదజాఱ ధ♦మ్మిల్లమూడ
లలితచంపక కుసుమతై♦లంబుతోడఁ, జక్కఁగా రాణితలయంటె♦నొక్కప్రోవ.

గీ. గమగమయటంచుఁ దావులు♦గ్రమ్మ కొనఁగఁ, జెలఁగుకస్తూరియంగునఁ♦జిక్కఁ ఖంబు
మెదిపి యారామెడయని నును♦మేననొక్క,కలువకంటుల మేల్బంతి♦నలుఁగులిడెను.

క. వనితా పల్కులు నలుగుల, పనికోర్వనటంచు నెంతొ ◆ బడలితివిగదే
కనలకయిపుడేటులనిలుతు, వని రాణికి నొక్క మగువ ◆ యటకలి నిడియెన్.

గీ. ఇరువురను వేఱువేఱుగ ◆ గరుడుసాల, లోకిఁదోడ్కొనిపోయి త◆ప్కులపసిండి
గద్దియలనుంచి నురుగున ◆ రుద్దికురుల, గిరుచును పైసగొ గి ◆ సీరుబోసి. 2889

సీ. నిడుదపెన్నెఱులను ◆ దడియొత్తె నొకయింతి, తోడఁ పైఁగలఁడి ◆ దుకిచెనొకతె
విదిలించి కీల్గంటు◆వేసెనొక్కవెలంది, ముడియందుఁ బూవ్వల ◆ ముడిచెనొకతె
నిలువుటద్దము ద్రోల ◆ నిలిపెనొక్కపడంతి, తీఁకగాను మోమునఁ ◆ దీర్చెనొకతె
యత్తరుజవ్వాజి ◆ నలఁది నొక్కపడంతి, కొల్లగాఁ ... గుఁ ◆ ...

గీ. రవణముల మేనఁ గీలించె ◆ రమణి యొకతె, పూలసుంటలవీ చెఱఁ ...
సింగపుంబీఁటలను వేసె ◆ చెలియయొకతె, కుసుమఁగా ... ◆ ...
కవిజనచకోరచంద్రోదయము, ఆ 4 పద్య 16 —173.

ఉ. సంపెఁగనూనె నంటి పెలు◆చన్ బసపూనఁగ నల్గు పెట్టె మే
ల్కెంపుల నత్తు సొంపు దుల◆కింపఁ బునుంగు చనుంగవం గుబా
ళింప మెఱుంగు ముంగురులు ◆ లేఁజెమటం బడ నై నటింప నై
లింపవధూసమాన యొక ◆ లేమ మురాసురమర్మభేదికిన్. 2891
భద్రాద్రిపరిణయము, ఆ 4 పద్య 52.

ఉ. అంతట నొక్క రాజముఖి ◆ యంతిపురంబున రాజనందను
న్వింతచొకాటపుంబనుల ◆ పీఠికపై నివసింపఁ జేసి తా
సంతస మాత్మ నుప్పతిల ◆ సంపఁగె నూనియ నంటెఁ బెన్నెఱుల్
కంతు కుణంబు లిట్టటు ఘొ◆లంగకయుండఁగ మందుఁ బ్రామెనాన్. 2892

ఉ. కోమలియోర్తు రామతున◆కున్ మృదు సుందరమైన మేన గం
ధామలకంబు పెట్టె నొక ◆ యంగనయుం జతురోక్తి రూఢిగం
ధామలకంబు చేతనె నృ◆పాత్మజు నేనభిషిక్తుఁ జేయుదున్
లేమరొ యంచుఁ బల్కి యటు◆లే పచరించె సమంచితంబుగన్. 2893

ఉ. కుంతలముల్ నృపాత్మజున◆కుం దడియార్పఁ గడంగి యొత్తె సీ
మంతిని యోర్తు నేర్పుమెయి ◆ నద్దిన కొంగున నద్దకుండ న
త్యంతము సన్నపున్వలిపె ◆ మల్లనఁ జొన్పినకేల యామినీ
కాంత ఘనాంతరంబునకుఁ ◆ గౌముదిఁ బర్వఁగఁ జేసినట్లుగన్. 2894

సీ. ఒయ్యారమొలయంగ◆నోరగాసిగవైచి, పువ్వుటెత్తులుచుట్టెఁ◆బొలఁతియొకతె
నుదుటఁ జెన్నుదలిర్పఁ ◆ గుసురుగాఁ గళ్యాణ, తిలకంబలపరించెఁ◆గలికియొకతె

మెలపుతో నలపుతోఁ ♦ గలపంబు నెమ్మేనఁ, బొలపంబుగ నలందె ♦ వెలఁది యొకతె
రతనంబుల హారంగు ♦ జతనంపుటపరంజి, రవణముల్ గయిసేసె ♦ సువిద యొకతె
గీ. తలను బాగయు మహతాబు ♦ నిలువుటంగిఁ, బచ్చపూవన్నెల షరాయి ♦ పావడోయి
చేరుమాలును మెఱుఁగుకై ♦ జారుఁబతికి, సకియలు ధరింపఁగ నొసంగి ♦ రొకతె యొకతె.

రామరాయవిలాసము, ఆ 3 పద్య 143—146.

సీ. కురులు చిక్కులు తీసి ♦ క్రొత్త సంపెఁగనూనెఁ, దలయంటె జిలుకల ♦ కలికి యొర్తు
పచ్చకప్రముచాయ ♦ పసుపున మేదించి, నలుఁగిడె నెమ్మేను ♦ నాతి యొర్తు
మంచిగందపుఁ దావి ♦ మించి గుబుల్కొన, నటకలి తల నిడె ♦ నతివ యొర్తు
బంగారు బిందెలఁ ♦ బన్నీరు గొని వచ్చి, జలకంబు లాడించెఁ ♦ జెలువ యొర్తు
గీ. నీరు ముమ్మాఱు తలచుట్టు ♦ నెఱయఁ ద్రిప్పి, తడవు మను మని దీవించెఁ ♦ బడఁతి యొర్తు
రతనముల పీఁట దొర దిగి ♦ రాఁగ నెదుట, నిలిపె బంగరు పావలు ♦ నెలఁత యొర్తు.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 72.

—♦ పురాలంకారము. ♦—

సీ. ఘనసారచందన ♦ కలితజలంబుల, లలి మణివేదిక ♦ లలుకువారు
దారాగణోదర ♦ తారమౌక్తికములఁ, జెంపార ముగ్గులు ♦ పెట్టువారు
మణిమరీచులు నభో ♦ మణిదీధితులఁ గప్ప, నెలమిఁ గేతన తతు ♦ లెత్తువారు
సుకుమారపిప్పల ♦ చూతపల్లవములఁ, గడఁగి తోరణములు ♦ గట్టువారు
గీ. సౌధవాతాయనంబుల ♦ సరసమొదవ, మంచి ధూపంబు లెలమి న ♦ వర్చువారు
జారు మంగళ ధీర ఘో ♦ షములు వెలయ, మించి తూర్యములాగి నివా ♦ యించువారు.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2562.

సీ. స్వర్ణపరిచ్ఛద ♦ స్వచ్ఛకుడ్యద్వార, లాలితగోపురా ♦ ట్టాలకంబు
ఫలపుష్పమంజరీ ♦ కలితరంభాస్తంభ, పూగపోతాదివి ♦ భూషితంబు
ఘనసారకస్తూరి ♦ కాగంధజలబంధు, రాసిక్తవిపణిమా ♦ ర్గాంచితంబు
మానితనవరత్న ♦ మయరంగవల్లివి, రాజిత ప్రతిగృహా ♦ ప్రాంగణంబు
గీ. శుభనదీజలకుంభసం ♦ శోభితంబు, తండులస్వర్ణలాజాక్ష ♦ తప్రసూన
ఫలబలివ్రాతకలితవి ♦ భ్రాజితంబు, నగుచు సర్వతోలంకృత ♦ మైనపురము. 2898

భాగవతము, స్కం. 4 పద్య 315.

సీ. [illegible] ♦ బహుసంఖ్యలకొలంది, చంద్రసూర్యాకల్ప ♦ శతముతోడ
వాటర హరిచంద ♦ నసగంబు లెన్నని, నధికాయమానరఁ ♦ భాళితోడ

పైశాచి కోపిదన♦భర్తృపుత్త్రులయందు,నిస్నేహ గృహకార్య ♦ నిపుణ గాదు
గీ. కలహశీల రాక్షసి సయి♦కంబు లేదు, బొంకు పల్కు నెప్పుడు నిద్ర♦పోవు పిత
లజ్జ యుందదు వాదుకు♦లంబువారి, దురిత మొందించి పోదురు ♦ నరకమునకు.
ఆ. ఎఱుక గలిగి పిదప ♦ నేనియుఁ బతిభక్తి, గలిగి ధర్మమాపి ♦ చలిపి శాంతి
గలిగియున్న మున్ను♦గలపాపములు వాసి,పురుషుతోడదివికిఁ ♦ బోవఁగందురి.
ఆ. అట్లుఁగాక పతుల ♦ యంతిమసమయంబు,నందుఁ జింత దక్కి♦యనుమరణము
సేసి లేని సుగతి♦సిద్ధించుఁ బతిసమే,తంబు గాఁగ నన్ని♦తంబినులకు. 3174
క. ద్విజభామినికి సధర్మము, ప్రిజఁ గాంచినపిదప నయ్య♦పత్యము శోకో
ద్విజితయుఁ బతిభక్తియు నై,త్యజించి యనుమరణనియతి♦యగుట మహేశా.
అను, ఆ 5 పద్య 292-302.

## స్త్రీధర్మములు.

క. ఎట్టి సౌభాగ్యలకును ♦ బుట్టినయింట్లను, ద్దిక్కాల మునికి ♦ తప్ప తగదు
పతులకడన యునికి ♦ సతులకు ధర్మవు, సతుల కేమగడయుఁ ♦ పతుల చూపె.
క. పతిహీన లయినభామిను, లతిధనవతు లయ్యుఁ గులజ♦లయ్యును నసలం
కృత లయ్యెదు మాంగల్యర,హిత లయ్యెడుఁ గృపణవృత్తి♦నిదియు మొదలుగాన్.
భారతము, ఆది. ఆ 4 పద్య 85, 228.
సీ. ఇది మొదలుగా సతు♦లెన్నండుఁ బరపురు,షార్థినుల్ గాఁ జన♦దన్యపురుష
సంగమంబునఁ జేసి ♦ సకలపాతకములు, నగుఁ బరిగ్రహాభూత♦లయినసతుల
కిట్టి మర్యాద ♦ యిమ్మనుష్యుల కెల్లఁ, జేసితి లోకప్ర♦సిద్ధి గాఁగ
నని ధర్మ్య మైనమ♦ర్యాదమానవులకుఁ, దద్దయు హితముగా ♦ ధర్మమూర్తి
ఆ. యజ్ఞభవసమానుఁ♦డగు శ్వేతకేతుండు, నిలిపె నదియు ధారు♦ణీజనంబు
నందు లోకపూజ్య♦మై ప్రవర్తిల్లుచు,నుండె శిష్టసంప్ర♦యుక్తిఁ జేసి. 3178
క. పురుషులచే ధర్మస్థితిఁ, బరిగ్రహింపంగఁ బడిన♦భార్యలకు నిరం
తరము నిజపురుషభక్తియుఁ, బరపురుషవిసర్జనంబుఁ ♦ బరిచిత మయ్యెన్. 3179
గీ. భర్తచేత నియోగింపఁ♦బడక సతికి, నెద్దియును జేయఁగాఁదగ ♦ దద్దియైన
భర్తచేత నియోగింపఁ♦బడినదానిఁ, జేయ కునికి దోషం బని ♦ చెప్పె మనువు.
ఆదిపర్వము, ఆ 5 పద్య 85-88.
ఆ. పురుషుకంటె మున్ను♦పరలోక మేఁగిన, సతియ నోఁచినదియు ♦ సతులలోనఁ
బరమహీనయైనఁ ♦ బరమపతివ్రతయ యయ్యు, జగముచేతఁ ♦ బ్రయ్యఁ బడడు.

ఆ. పడినయామిషంబు ◆ పక్షు లపేక్షించు, నట్లు పురుషహీన◆యయినసుదతిఁ
జూచి యెల్లవారుఁ ◆ జులుక నపేక్షింతు, రదియుఁ బాప మనక ◆ హీనమతులు.
ఆ. పతివిముక్త యయినఁ ◆ బతికిఁ బునర్దార, సంగ్రహంబు సేఁత ◆ శాస్త్రమతము
పతివిముక్తుఁ డయిన◆సతి కన్యపురుషసంగ్రహము సేఁత లోక◆గర్హితంబు 3182
ఆదిపర్వ, అ 6 పద్య 253-255.

క. పతిమనను నాఁచికొనియెడు, చతురోపాయంబునీకుఁ ◆ జపలాక్షి సుని
శ్చితమతిఁ జెప్పెద విను మూర్జితమును ధర్మాన్వితము స◆శీలంబును గాన్. 3183
చ. పతిఁ గడవంగ దైవతము ◆ భామల కెందును లేదు ప్రీతుఁ డై
పతి గరుణించెనేని కుల◆భామిని భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము ◆ విశ్రుతిసంతతియున్ యశంబు స
ద్గతియును గల్గు నొందుమెయిఁ ◆ గల్గనె యిన్ని తెఱంగు లారయన్. 3184
ఆ. కరము దుఃఖపడినఁ◆గాని యొక్కింతసౌఖ్యంబు ధర్మగతియుఁ ◆ గలుగ దెందుఁ
జూడు మబల ధర్మ◆శుశ్రూషఫలము సంతతసుఖంబు నంద ◆ ధర్మ్య వడవు.

క. కావున నిత్యము సమ్యగ్భావము ప్రేమంబు నెరవు◆భక్తియుఁ బ్రియముం
గావింపుము నీప్రియునెడ, భావ మెఱిఁగి యతఁడు దాస◆పైఁబడిమరఁగున్. 3186
మ. వనజాక్షుండు గడంగి నీదగుగృహ◆ద్వారంబు సేరంగ వ
చ్చె ననంగా విని లెమ్ము సంభ్రమముతోఁ ◆ జెన్నొందునభ్యంతరం
బునకున్ వచ్చిన నాసనాదికరణం◆బుల్ దీర్పఁ దత్పూజనం
బు నియోగించితి నందు మండక ప్రియం◆బుల్ సేయు మీవుం దగన్. 3187
చ. తిరి మురారి నాకుఁ గడుఁ◆దీపుగఁ జెప్పినపల్కు గల్గినం
గువలయనేత్ర నీమనను ◆ గూడినవారికి నైన నెప్డుఁ జె
ప్పవలదు దాన నొండొక నె◆పంబు ఘటింతు రెఱింగి రేని నీ
సవతులు కృష్ణుబుద్ధి విరసం బగు నీదెసఁ దప్రియోక్తి చేన్. 3188
చ. పతికి ననుంగు లైనతగు ◆ బంధుల మిత్రుల భోజనాదిస
త్కృతముల నాదరించుచు స◆త్కృతిమభక్తివిశేషసంతతో
ద్ధతమతి నై చరింపుము తి◆దీయహితేతరవృత్తు లైనవా
రలిన భవత్సహృజ్జనము ◆లైనను గైకొన కుండు మేర్పడన్. 318
క. విను ప్రద్యుమ్నాదిభవత్తనయులగోడ నైన నేక◆తంబున నేకా
సనమున నుండుట దూష్యం,బని యెఱుఁగుము సతులచరిత◆లతి దుష్కరముల్.

క. కులపతులును సతులును నిర్మలమతులును నయినయట్టి ♦ మగువలతోడం
జెలిమి యొనరించునది దుర్వ్యాలసితవనితాభియుక్తి ♦ విడువుము తరుణీ. 3190

అరణ్యపర్వము, ఆ 5 పద్య 313–321.

గీ. బాల్యమునఁ దండ్రియౌవన♦ప్రాప్తి మగఁడు,వార్ధకంబునఁదనయుఁడువామనయన
నరసి నడపన కాకెందు♦నంగనలకు, వలసినట్టులు సేయఁగా ♦ వచ్చునెట్లు. 3191

అనుశాసనికపర్వము, ఆ 2 పద్య 22.

సీ. మామకు నత్తకు ♦ మాఱ్పల్కు దేవపి,తృతిథిపూజనముల♦యందు సొలయ
నిలువడిఁ దలవాకి♦లెప్పుడు నెలుఁగక, పిలుచ నవ్వక శుద్ధి♦వెలయ విప్ర
భిక్షు యోపిక గల్గి ♦ పెట్టుచు నర్తింతు,వలయుకార్యములకు ♦ వెలఁది మగుడఁ
బతివచ్చునప్పుడు ♦ భక్తియు నేదుఁయుఁ, బాదుల నాసనపాద్య♦ములను సముఖ
ఆ. భావమునను సేవ♦వాటింతు ఁజ్జల, శిక్ష వనలఁ దిట్టఁ ♦ జెట్టఁ గనియు
నాకు వేఱ ప్రియము♦నఁగ లేదు పతి మెచ్చు, వంటకముల చేసి♦వండి యిడుదు.
చ. వముఁ డొకవెంట నెన్నఁడు ప్ర♦వాసగతుం డగు నాటఁ గోలె స
త్పురుషుడు వచ్చునంతకును ♦ బూవులు పూఁతలు మేలిచీర లా
భరణము లెక్కుడుంజవుల ♦ పాకవిశేషము లాదరింప నె
ప్పరమునఁ గొల్చెఁ గుఱ్ఱదుదున ♦ బంధులకుం దగ నెమ్మి సల్పుదున్. 3193
క. గోవులు మొదలగు తిర్యగ్జీవులనుభవృత్తు లరసి♦చెల్లింతు గృహ
శ్రీవర్ధనంబునకుఁ బతి,భావము సంకటపడంగఁ ♦ బలుక నొకటియున్. 3194
గీ. అగ్ని యొంరక్షింతు ర♦హస్యమైన, దాని వెలిపుచ్చ గర్వంబు♦దాల్చియున్న
యాప్రుదు నాచప్పలెల్లను ♦ నవులఁ బెట్టి,దానికెయ్యది పథ్యముల్♦వానిఁ గొందు.
క. అని చెప్పి యట్టిచందం,బున నడచినసతికి లోక♦ములు నందును సౌ
ఖ్యనిమాధి యొసఁగుఁ బొగడొం,దు నరుంధతివోలె సర్వ♦భూతి నరేంద్రా.

అనుశాసనికపర్వము, ఆ 4 పద్య 358–362.

సీ. బుఱుమతి గాక శు♦ష్కతయుఁ గర్వనయింతి, కన్య నత్పతియు ♦ శరణమునకు
నొదయుఁలవినుశక్తి♦యునుదండ్రియునుదండ్రి,తోఁబుట్టినతఁడుమా♦తులుఁడుసోద
రుండును యోగ్యవ♦రునిఁ జూచి వారిలో, నెవ్వరైనను బ్రీతి♦నిచ్చువారు
పతి యంతనుండియుఁ ♦ బ్రిభుప్ప దానికి నట్లు, గాన నాతండ♦రైన మునుచు
గీ. నతనిమతి మూఁడి దేవతా♦పితృసమర్చ,నములు నతిథిపూజనము స♦త్కృతిసమాచ
రించుమను బతిహితముగా♦నెంచి నడపు, సతి పతివ్రత యిహమున♦సౌఖ్యమహిత.

క. పతిహితము గోరక ధర్మము, సతిచ నడపు టొప్ప దింక♦నైనను బతికిన్
హితములగువానిఁ జేసిన, నతనిఁ గలయుఁ దనినఁ జనియె ♦ నదియునుమరలన్.

క. లలన యిలువాడి నాథుఁడు, వలచినచవివంటకములు ♦ వండి యిడి తనుం
గలయుఁ దలంచిన మోయిలోని. యెలమిం గయిసేసి హృదయ♦మీ పలయు శివా.

గీ. పనులయెడ మాఱు పలుకక ♦ యనవధానుఁ, డైనపతిఁ దలపించి ధ♦ర్మార్థకలిత
కృతులు నడపుచు సవతి గ♦ల్గినను బోరి,తంబు లేకొక్కటైయున్కి ♦దగవు సతికి.

క. సవతాలికిఁ బతి వలచిన, నవుఁ గాకని యతనియిచ్చ♦కనుగూపము గాఁ
దివిరి నడచుసతి దైవము, శివ యది దగు నెల్లజనము♦చే మ్రొక్కు గొనన్. 3202

క. తనచేతికి నిచ్చినవ,స్తునికాయము నిల్లురుపున♦చొప్పున మగుడం
గొన వచ్చి భార్య పతి దె,మ్మనినప్పుడ యిచ్చు టొప్ప♦నకపటవృత్తిన్. 3203

క. పతి దనకు నేమి యిచ్చిన, పతిముదమునఁ బొంద వలయు ♦ నాత్మజుఁ డైనన్
మతిఁ గొంకక యేకాంత,స్థితి నేకాసనత నున్కి ♦ నెట్టు ప్రమదకున్. 3204

క. ధని యధనుఁడు రూపసి యొ,ప్పనివాఁ డపవేకి మూఢ♦భావుఁ డరోగుం
డనుగతరోగుఁ డనక యం,గన పతిఁ బాటింప వలయుఁ ♦ గామాధ్వంసీ. 3205

క. బలి భిక్షము గడపకిడ,న్వలయును దేవపితృపూజ♦నంబులకాలం
బులఁ బతి శుభ మందుటఁ ద,త్ఫలంబు గాఁ గోరు టొప్పి♦దము సతికి శివా.

క. గతి పతియు చుమ్మె భార్యకు, నతనిఁ గడచినట్టిసత్ప♦రాయణము కృపా
యుత కలదే కావునఁ దా,నతనికి ధర్మ యగు టిమ్ము ♦ సఖిలశుభంబుల్. 3207

అను, అ 5 పద్య 285-207.

తే ఒక్కమన్ననతోనున్న♦నొల్లకున్నఁ,గరము నెయ్యుఁ డై యున్నను♦ గాకయున్న
మగఁడు ప్రియతముఁ డనియుండు♦మానవతికి, నెల్లలోకసుఖంబులు♦ నెదురువచ్చు.

క. నడవడి యొప్పక యుండినఁ,గడు నిర్ధనుఁ డయిన పతియె♦గతియును విను మె
క్కుడు బంధుండు ప్రియుఁడుం,బడఁతులకుం బరమగురుఁడుఁ♦బరదేవతయున్.

తే. ఇంతిశీలదోషంబుల♦నిట్టి పతికి, నతివ లెవ్వారు ప్రతికూల♦లయి చరింతు
రమ్మహాపాపవతులు దు♦ర్యశము నొంది, కూలి కాంతు రఘోలోక♦ఘోరగతుల.

క. పతిపరిచర్యాపరిణత, గతి లోకము మేలుకీడు ♦ గనియుండు పతి
వ్రతలు నిజుఁ బోని గుణవతు,లతులితసుఖకీర్తు లెందు ♦ నందుదు రబలా. 3211

ఉ. నాపుడు బత్నికిం బతియు♦నమ్మినబంధుఁడు నిష్టదైవముం
గా వివరించి మజ్జనని ♦ గారవ మారఁగ మున్ను సప్పె నా

కంథ మత్తగారుఁ గృప♦యేర్పడ నానతి యిచ్చి రిష్టమీ
చే విని ధన్య నైతి విల♦సల్లె మనంబు మహాతపస్వినీ. 3212

ఉ. సత్యము లైన జన్మములు నూఱును వేములు సేసినం దప
స్సత్యశమక్షమాదిగుణ♦సంపదతోడ వనైకవాసులై
నిత్యసమాధియోగమున ♦ నిల్చిన వేరికిఁ బొందవచ్చు నే
పత్యనుకూలలైనకుల♦పాలిక లందెదు పుణ్యలోకముల్. 3213

చ. పతియెడ రెండు లేక కుల♦భామలు తా రతఁ డెట్టిఁ డైన స
న్మతిఁ జరియించు టొప్పు నని♦నం గమనీయచరిత్రుఁడుం గృపా
న్వితుఁడు జితేంద్రియుండు నతి♦నిర్మలధర్మయుతుండు సూనృతో
క్తియుఁడును రాముఁ డీరఘువ♦రేణ్యుని నేగతిఁ గొల్చు టొప్పదే. 3214

క. విను కౌసల్యకుఁ దక్కన, జనముల కతిభక్తి నొక్క ♦ సరియై నడచుం
జనపతి యొకపరి ముట్టిన, వనజాక్షులఁ దల్లి నొక్క ♦ వడువునఁ జూచున్.

క. గుణవతి సావిత్రియు స,త్ప్రణుతయరుంధతియు ధర్మ♦పరిణత యారో
హిణియుఁ గనుట పతిశుశ్రూ,షణమునన కదా సదా య♦శస్సౌఖ్యంబుల్.

భాస్కరరామాయణము. అయోధ్య, 291-300.

మ. గురు వన్నన్ ధన మన్నఁ బుణ్య మనినన్ ♦ గోత్రోదయం బన్న దే
వర యన్నన్ మన మన్నఁ దుష్టి యనినన్ ♦ వాత్సల్య మన్న న్నిడే
శ్వరుఁ డన్నం బరమోపకార మనినన్ ♦ సర్వంబు నన్నం దలో
దరి నీకున్ నిషధాధినాథుఁడె సుమీ ♦ తథ్యంబుగాఁ జెప్పితిన్. 3217

సీ. పాటించి కొలువుము ♦ భువనదైవంబుల, సవతులఁ గొనియాడు ♦ సఖులఁ బోలె
నారాధనము సేయు ♦ మత్తమామల కెప్డు, పరిజనంబులమీఁదఁ ♦ గరుణ గలిగి
యలుగకు కోపించి♦నపుడు నాథునితోడ, మదిలోన నుబ్బకు♦ మన్ననలకుఁ
దోఁడికోడండ్రతోఁ♦గూడి యాడి చరింపు, దాసీజనముఁ బ్రోవు ♦ తల్లికరణి

గీ. బ్రాహ్మణులయందు గురులందు ♦ బంధులందు, భక్తివిశ్వాససౌహార్ద♦పరత నెఱపు
భవ్యపతిదేవతాచార ♦ పరమపుణ్య, ధర్మ మేమఱకుండుమీ♦తల్లికాన. 3218

శృంగారనైషధము. ఆ 7 పద్య 8, 9.

సీ. ప్రాణేశుఁ డారగిం♦పక భుజింపవు భర్త, నిద్రింపకయమున్న♦నిద్ర వోవు
నాథుండు మేలుకో♦నకమున్న మేల్కాంచు, [illegible] కేమి కొన్నఁడు ♦ గనఁడు [illegible]

ధవుఁడు ప్రోషితుఁ డైన♦తతి వాడియుండుదు, పతికి నెప్పుడు హాయి♦పలుక వీవు
పురుషునికి నల్ప ♦ మనక సంతోషింతు, మొగ మెత్త నేరవు ♦ మగనియెదురఁ

గీ. తెలుఁగు మాసిన మూన్నాళ్లు ♦ సిగ్గుతోడఁ, బతివిలోకనమార్గంబుఁ ♦ బరిహరించి
సవిత్రుఁ డుదయింప నాల్నాళ్ల♦జలక మాడి, చూడ వెవ్వారిఁ బురుషుని♦జూచి కాని.

మ. పసపుం గుంకుమ కజ్జలంబు నునుగో♦ర్వాసంబు తాంబూలముల్
గుసుమంబుల్ కబరీభరంబు చెవియా♦కుల్ మంగళాలంకృతుల్
విను వొక్కింతయు లేక తాల్పవలయున్ ♦ వీనిన్ సదాకాలము
న్యసిఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై ♦ నాళీకపత్రాక్షికిన్. 3220.

గీ. రజకితోడను ద్యక్తతో ♦ శ్రమణతోడ, విధవతో నాథుతో రాయు♦వెలఁదితోడఁ
జెడిపెతోఁ జాలఁ బోరామి♦ సేయఁ జనదు, ప్రాణసంకటములనుబు♦న్యాంగనలకు.

సీ. పతి పిల్వఁబంచినఁ ♦ బనియేమి యనివచ్చి, చెప్పినయుడిగంబు♦సేయ వలయు
భర్తయానతి లేక♦పరికృతిబంధున కైన, సేవదార్థంబును ♦ నీగి పెట్ట
జీవితేశ్వరుఁడు డిం♦చినయోగిరంబులు, గుత్స సేయక భుక్తిఁ♦గొనుట తగవు
మథునుప్తుఁ డగు నిజే♦శుఁ బ్రబోధ మొనరింపఁ, గా దనుస్థానభం♦గమునఁ దప్ప

గీ. నొంటి నెచ్చోటి కరుగుట ♦ యుక్తి గాదు, తడుపు గట్టక నీళ్లాడఁ♦దగవు గాదు
కడపమీఁదను మతిసన్న♦కంటె మీఁద, జక్కిమీఁదను గూర్చుండ♦జాడ గాదు.

క. నాగరికత్వము వాచా, ప్రాగల్భ్యముఁ జూపఁ జనదు ♦ పతిముందట సం
భోగక్రీడావిభవో, ద్యోగంబులఁ దక్క పతికి ♦ నుత్పలనయనా! 32 2

క. ఇది ధర్మం బిది యాలువ, ఇది వ్రత మిది సద్వివేక♦మిది యాచారం
బిది దేవపూజ యధిపతి, యుచితం బాలంబు సేయ♦కుండుట సతికిన్. 3224

క. కాంతుఁడు సంతోషించిన, సంతోషింపంగవలయు ♦ సతి కతఁ డాత్మన్
సంతాపించినపట్టున, సంతాపింపంగవలయు ♦ జలజేక్షణకున్. 3225

సీ. చీకటితప్పుచే♦సినసరోరుహనేత్ర, గూబయై వసియించుఁ ♦ గోటరమున
వింతవానిఁ గటాక్ష♦వీక్షణంబునఁ జూచు, కిసలయోష్ఠి వహించు♦గిల్లకస్త్రు
మగఁడు దన్నొర్తిన ♦ మార్మొత్తునలివేణి, వ్యాఘ్రియై జనియించు♦వనములోనఁ
జెలుతిండి తనవారి♦ మొఱఁగి యాహారించు, నతివ సూకరజాతి♦యందు బుట్టు

గీ. నధిపుఁ గోపించి హుంకార♦మాచరించు, పడతి మూఁగవు పవతి సౌ♦భాగ్యలక్ష్మిఁ
జూడఁ జాలక మదిలోన♦సూయ సేయు, భామ దుర్భగయగు నన్య♦భవములందు,

ఉ. దూరము వోయి యెండఁ బడి ♦ దూపిలి వచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటగేహళుల♦దాఁక నెదుర్కొని తీర్థ మార్చి యా

హారముబెట్టి నీడ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరువు లొత్తి చిత్తమునకుబ్బొనరించుట ధర్మ మింతికిన్. 3227

గీ. తగవు పాటించి యల్పంబు తండ్రి యిచ్చు, నల్పమల్పంబ భ్రాతయు నాత్మజుండు
ప్రార్థితంబైన ధన మనల్పముగ నిచ్చు, ప్రాణనాథుని సరియె యేబంధువులును.
కాశీఖండము, ఆ 2 పద్య 72-82.

సీ. నిలయము పాటించి నిర్మలదేహ యై, శృంగార మేప్రొద్దుఁ జేయ వలయు
సత్యప్రియాలాప చతురయై ప్రాణేశు, చిత్తంబు ప్రేమ రంజింప వలయు
దాక్షిణ్యసంతోష ధర్మమేధాదుల, దైవత మని ప్రియుఁ దలఁప వలయు
నాథుఁ డేపద్ధతి నడచు నాపద్ధతి, నడచి సద్బంధుల నడప వలయు
ఆ. మార్గవమునఁ బతికి మజ్జనభోజన, శయనపానరతులు జరప వలయు
విభుఁడు పతితుఁడైన నెఱిఁగి పాతివ్రత్య, మహిమఁ బుణ్యఁ జేసి మనువ వలయు.

క. తరుణి దనప్రాణవల్లభు, హరిభావముగా భజించి యతఁడును దానున్
సిరికైవడి వర్తించును, హరిలోకమునందు సంతతానందమునన్. 3230

క. ఉపవాసంబులు వ్రతములుఁ, దపములు వేయేల భర్త దైవత మని ని
ష్కపటతఁ గొల్చిన సాధ్వికి, నృపవర దుర్లభము లేదు నిఖిలజగములన్. 3231
భాగవతము, స్కం. 7 పద్య 416, 417, 418.

క. నడవడి గొఱగాకున్నను, బడుగైనఁ గురూపియైనఁ బామరుఁ డైనన్
జడుఁడైన రోగి యైనను, విడుచుట మరియాదగాదు విభు నంగనకున్. 3232
భాగవతము, పూర్వ. పద్య 976.

గీ. బాల్యమునఁ దల్లిదండ్రులు ప్రాయమున ధవుండు వార్ధకమున నందనుండుఁ జెప్పి
నట్లు చేయంగఁ దగుఁగాని యరసిచూడఁ, దెఱవలకు నెందుఁ దమయిచ్చఁ దిరుగఁ జనదు.
జైమినిభారతము. ఆ 2 పద్య 37.

సీ. జీవితేశ్వరుఁ బాసి చిరకాలవసతిగాఁ, బుట్టినింటనె యున్కి బుద్ధి గాదు
పొరుగిండ్ల నిరుగిండ్లఁ బ్రొద్దుపోకలనైనఁ, బలుమాఱు నరుగుట పాటి కాదు
దాసీజనులతోడఁ దఱచుగాఁ గూడి తిరస్కారమాట లాడుట తగవు గాదు
తనకాంతయాప్తుఁడైనను నన్యపురుషసంసర్గంబుఁ జేయుట జాడ గాదు
గీ. జనకగృహమున నైనను మనసు వఱపి, కూరనారకుఁ బంపుట గుణము గాదు
హాస్యకథలందు గీతవాద్యములయందుఁ, బ్రీతి నెఱపుట మగనాలిరీతి గాదు.

సీ. జలక మాహారము శయనసౌఖ్యము భర్త, కంటెను మున్నుగాఁ గాదు సేయ
విభుఁ డారగించిన వెనుక తద్భాజనంబునఁ జేయ నర్హంబు భోజనంబు

ప్రియుఁ డల్గి తనుఁజేరఁ ♦ బిల్వ కుండినభూమి, నింపుతోఁ దుతఁబవ్వ♦ రింపుటొప్ప
వ్రతములు దేవతా♦ర్చనలు కాంతుఁడు సమ్మ, తింపక చేఁత యెం♦తేనికలుష
గీ. మప్రియాంబులు చేసిన ♦ నధిపుమీఁదఁ, జిన్నఁ బోవక మది సంత♦సింపవలయు
మంచి దైనను ప్రాణేశు♦మనసు రాని, పనులు మానుట భద్రంబు ♦ వనితలకును.
శా. ఏభంగిన్ శుచినాథునో పతిమనం♦బే భంగి రంజింతునో
యేభంగిం గులకీర్తి దాఁ గలుగునో ♦ యేభంగి వర్తింతునో
యేభంగి న్నడి రాక యుండఁ గలదో ♦ యేణాక్షులందంచు నా
యాభంగి న్మతియించుచుండఁ దగుఁ బు♦ణ్యస్త్రీకి నెక్కాలమున్. 3236
ఉ. కంచెలయుం బటీరతిల♦కంబును బాపట చెందిరంబు ఫా
లాంచలసీమ లేఁ బసుపు♦టచ్చతబొట్టుఁ జెవాకు గాజులుం
గొంచెపు పీడ్యము న్విరులు ♦ కొప్పున నొప్ప నొనర్ప నెప్పుడుం
జంచలనేత్రి యుండఁ దగు ♦ సంతతభర్తృఫలాభివృద్ధికిన్. 3237
సీ. జలమాడి మడుఁగువ♦స్త్రముఁ గట్టి కైచేసి, కొనికానికవయఁబోఁ♦జనదు ప్రియుని
మునుపు మేల్కాని భర్త♦మోముఁ గన్గొనికాని, కాఁ గాదు వీక్షింపఁ♦గా నితరుల
గడపమీఁదను సన్న♦కల్లున ఱోటిమీఁ, దను నున్కి చేతను ♦ దఱుఁగు యశము
తడికాళ్లతో పీడు♦దలతోడఁ గర్ణప, త్రములతో నిద్రింపు♦న్యాంబు దఱుఁగు
గీ. సందెఁ దలయంటుకొనుట వ♦స్త్రంబు లేక, మజ్జనము చేఁత విరియాకు♦మట్టగించి
తాల్పుటయు విరుగేలను ♦ దల పుణుకుట, భర్తగలభామినుల కశు♦భప్రదములు.
క. వ్రతములు నుపవాసంబులు, మతియింప నిరర్థకములు ♦ మానవతులకున్
బ్రతివాసరమును సేవల, పతిభక్తియె చాలు నిహముఁ ♦ బరము ఘటింపన్.
చ. తెఱవకు వల్లభుండు పర♦దేశము వోయిన వన్నెమానితో
నఱిలికి నల్లపూసలును ♦ నచ్చతబొట్టును మట్టెవన్నెగాఁ
గుఱుమణుగైనపుట్టమును ♦ గూడఁగ దువ్వని మైలకొప్పునై
మఱుగిడి యింటిలోఁ బతిస♦మాగము నన్మతియింపు టొప్పగున్. 3240

శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 4.

సీ. మాఱుమాటాడదు ♦ మఱచియైనను గురు, వ్యాపారమున కీ య♦హార్యతనయ
యానమ్రగతిఁ బూను ♦ మానంపుసవతు లెం, తైన నీదివ్యర♦త్నానుజాత
జాఁగరై మేరమీఱ ♦ దొకప్పుడును ఘన, శ్రీలఁ బొంగియును నీ♦సింధుకన్య
యేకాకృతి వహించు♦ ననురాగవృత్తికి, నపరాగవృత్తికి♦ యబ్జవదన

తే. యచ్చెరువువింతయుబ్బురం♦బరిదియనుచు,విశ్వధాత్రీశ్వరులు మెచ్చ♦వెలయవమ్మ
యమ్మ భవదీయచిత్రగు♦ణాతిశయము,వలన మాకెల్ల వన్నెరా♦ మెలఁగ వమ్మ.

చ. పతివ్రతధర్మకౌశలము♦ పట్టునఁ దోఁడగు వారి నారి దాఁ
బతిశరణపరిచింత మదిఁ♦బెట్టక యీశనివేశితాత్మ యా
సతి పతి రాశి కెక్కి యిన♦ సత్కృతిఁ గైకొను కన్య కన్య శా
శ్వతమతి నిట్లుగా మనని♦ వాఁడియె వామ నుమమ్మ కోమలీ. 3242

ఉ. తమ్ములఁ బంపుదున్ మణిశ♦తమ్ములఁ బంపుదు రాజహంసపో
తమ్ములఁ బంపుదున్ బరిచి♦తమ్ములఁ గాననదేవతాళి జా
తమ్ములు బంపుదున్ గ్రుతగ♦ తమ్ముల నేనుసారణీపరిపా
తమ్ములవత్తు విశ్వవిది♦తా ముదతో మది తాప మేటికిన్. 3243

వసుచరిత్రము, ఆ 6 పద్య 56, 57, 60.

సీ. మఱచి తప్పియు నన్య♦ మహిమ విమర్శింప, జూడ వీవన్యుని♦సొబగు వేడ్కఁ
బతిభక్తియొందుఁ గీ♦డ్పడనీవు వేఁడుదు, తత్పృష్టియే దైవ♦తంబు గనిన
నధిపుఁడుపాసింప♦ పాసింతు చింతింపఁ, జింతింతు చిక్కునఁ♦ జిక్కు దపుడు
గడుఁ జన విచ్చినన్♦ గర్వింపకయుం,డిన భేద మొందవు♦ డెందమునను

ఆ. నిండుఁగడవరీతి♦నుండు దపుడునాగం,ధీరతకుఁ గలఁగి♦ చేరనీక
పతిపరివాసవేళఁ♦ బాటించుకొనవు నె,మ్మేన గరగరికలు♦ మెఱుఁగుఁబోఁడి.

చ. పగునకు నెద్దియుం బడ ను♦వర్ణనగాఁగఁ దద్ప్రియం బస
చ్చరితము గాఁగ నెన్నుదు ని♦సర్గమునాకిది మానరాద యీ
శ్వరుఁడును వేదమున్ గురుఁడు♦ సర్వము భర్తయ యేఁ దదాజ్ఞను
స్థిరమతిఁ జేయుచున్ విధిని♦షేధము లెవ్వియుఁ గైకొనం బుదిన్. 3245

క. విను మెయ్యదియు నిషిద్ధం,బని విడుచుటలేదు విహిత♦ముని సేయుట లే
దనుమానింపక యెద్దియుఁ, బెనిమిటియొల్లనిది విడుతుఁ♦ బ్రియ మొనరింతున్.

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 120, 185, 186.

చ. అలుకలు దువ్వరాదు సర♦సాన్నములన్ భుజియింపరాదు మై
కలప మలందరాదు తిల♦కంబురకంబుగదిద్దరాదు సొ
మ్ములు గయిసేయరాదు సుమ♦ముల్ ధరియింపఁగ రాదు సాధ్వియా
వరిసపళ్లాయ తాక్షికిని♦ నాథుఁడు చెంగట లేకయుండినన్. 3247

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 156.

సీ. సర్వస్థలంబుల ♦ సరస మాడఁగ రాదు, వలసినప్పుడు గతి ♦ గలయ రాదు
బంధభేదంబుల ♦ పరీక్ష చూపఁగ రాదు, గళరవంబులఁ బూని ♦ కలియ రాదు
కెమ్మోవిమీఁదను ♦ కెంపు లుంచఁగ రాదు, చెలఁగి నఖాంకముల్ ♦ చేయ రాదు
కూర్మి నిష్ఠాగోష్ఠి ♦ కూడియుండఁగ రాదు, సారిద వాక్ప్రౌఢిమ ♦ చూప రాదు
గీ. మఱియు సంగీతసాహిత్య ♦ మహితముఖ్య, విద్యలనొక్కొక్కయును చూపి ♦ విభవ మెనయ
కళలు రంజిల్ల వేడ్కగా ♦ మెలఁగరాదు, ధాత్రి వైదంపతులకెల్లఁ ♦ దలఁపఁ బోఁడి.

హంసయానంబివిలాసము, ఆ 2.

సీ. వంశధర్మనిరూఢి ♦ వదలించె నీవారి, మహితశాస్త్రార్థగ ♦ మంబు కలిమి
గురుతరులకు వన్నె ♦ గూరిచె నీశ్యామ, ఘనమనోజ్ఞక ♦ సనము చేత
నినుముదయానున ♦ నెసఁగు నీపద్మిని, మంజులామోదసా ♦ మగ్రి మీఱయ
ద్విజరాజిఁ బోషించి ♦ దీపించు నీకొమ్మ భాసురఫలదాన ♦ పటిమఁ బూని
గీ. యనుచు జగమెల్ల నుల్లాస ♦ మున నెసఁగ, సంతతము మెచ్చుచును మఱ్ఱి ♦ కి మాకు జన్మ
పదమనఁ దనర్చు వంభోజ ♦ పాణి జీవ, నమ్మ జీవన మనియెంచు ♦ మమ్మ కొమ్మ.

చంద్రికాపరిణయము, ఆ 6 పద్య 99.

క. మానమె ధనముం దేహము, మానమె సర్వంబు మాఁడ ♦ మానవతులకున్
మానము బోయినవెనుకం, బ్రాణముతో నుండ వలెనె ♦ పద్మదళాక్షి. 3250

రాధికాసాంత్వనము. ఆ 4.

సీ. అవఘుప్రాతఃకాల ♦ మున లేచి రాత్రి వస్త్రము విచ్చి ధౌతవ ♦ స్త్రంబుఁ గట్టి
మునుకొని పతిపాద ♦ ములకు నర్మిలి మ్రొక్కి, సంతసమొప్ప హ ♦ స్తవ మునర్చి
యవ్వల గృహకార్య ♦ మరుదారఁ గావించి, సలలితాంబువుల మ ♦ జ్జనముఁ జేసి
సుచిరపరిశుద్ధ ♦ శుక్లాంబరముఁ గట్టి, రమణీయశుక్లపు ♦ ష్పములచేత
గీ. బతినిఁ బూజింప వలయు స ♦ ద్భక్తితోడఁ, బూతజలముల నర్ఘ్య మ ♦ న్నాతుఁ జేసి
ధౌతవస్త్ర మొసంగి త ♦ త్పాదయుగళ, మంచితమ్ముగఁ దడియొత్తి ♦ యాదరమున

కృష్ణజన్మఖండము, ఆ 6.

సీ. అల బ్రహ్మనారసిం ♦ హలఁ బట్టి మలపట్టి, మారుమీఁది తమిఁ బాసి ♦ యలరెనయ్య
విబుధసంయమినుతు ♦ ని గూను సావిత్రి, తండ్రిమాటకు జన ♦ దాఁటెనయ్య
అవని బ్రాహ్మణపుత్రి ♦ యయ్యు లోపాముద్ర, యొక తాపసి వరింపఁ ♦ గొండెనయ్య
ముందు గాననుకొన్న ♦ పురుషుఁ గాదని సతీ, తిలక మెప్పటె యన్య ♦ వలచెనయ్య
గీ. అని జనకుండు పిమ్మట ♦ నధిపుఁ డవలఁ, దనయుఁ డుమశానసకుల్యదా! ♦ వనితకుర్వి
నెన్నఁ జైలియు స్వాతంత్ర్య ♦ మున్నదయ్య, కావనీయాన నెటు దాఁటు ♦ దాననయ్య.

గీ. నెన్నిజన్మంబులందుఁ బ◆ద్మేక్షణలకుఁ, బతిహితంబునకంటె శో◆భనముగలదె
ఇహపరములిచ్చుహృదయేశు◆మహిమదెలియ,కధిపుతో వాదులుడువఁగా◆నర్హమగునె.

రుక్మాంగదచరిత్రము, ఆ 4 ప 82-91.

## శిశుపోషణము.

ద్విపద. దొంగిళ్లపై నుండి◆ లింగమూర్తికిని, అంగన గావించు◆ నభ్యంగనంబు
మఱి కొత్తుఁ జెక్కొత్తు◆మఱికన్నుఁబ్రేలుమ,నక్కొత్తు కడుపొత్తు◆నట వీపునివురు
పెరుఁగంగ వలెనని◆ తరుణి వీపొడఁగ, చరణముల్కరములు◆ జాగంగఁ దిగుచు
నలుగులు నలుచు న◆ర్మిలి గట్టిపెట్టి, జలములు వీపునఁ◆ జఱచు నందంద
వెగచి బెగడకుండ◆ వెన్ను వ్రేయుచును, నొగి మస్తకమున నీ◆రొత్తు దోయిటను
పదనంబుఁజొచ్చునో◆ యుదకంబు లనుచు, నడుమ బొట్టన నోటి◆కడ్డంబు వెట్టి
చెన్నుగాఁ బసపార్చి◆సేయు మజ్జనము, కన్నులు చెవులును◆ గాడంగ నూఁదు
నంగుడు ముల్లొత్తు◆ నందంద వ్రేల, దొంగిళ్లఁ గార్చిరు◆ దోనెత్తి పిడుచు
పడతిచేనీరుదూ◆పడచి పెట్టుచును, మడతి యంగుష్ఠంబు◆ మన్నింత మెదిపి
కడపనంటినయట్టి◆ పిడకవిభూతి, యడరఁ బుత్రునినొస◆లారంగఁ బూయు
నెత్తి కుఱింగెడునని◆ గొత్తంగ వెఱచి, యొత్తిన్ని ఘనమున◆నున్న నడుము
కాటుక యిడు నల◆కన్నగు ననుచు, గాటుక యిడుమూడు◆కన్నులగలయఁ
జన్నిచ్చుఁ బతులఁ◆ జననీదు మీఁద, నన్నాతి గొండిన◆వెన్నయుఁ బెట్టి
చెక్కిలిగిలిడు◆ చెలఁగి యేడ్వంగ, నొక్కవ్రేలిడిపోయు◆ నొకకొన్ని పాలు
యుగ్గులు వేడఁగ◆ నువిద సంప్రీతి, నగ్గించు నగ్గించు◆ నట బుజ్జగించు
ముద్దాడు నగియించు◆ ముద్దులు వేఁడు, నద్దిరో పీ రెప్ప◆నయ్యారో యనుచు
పన్నుగా నుదరంబు◆ పాన్పుగాఁ జేసి, సన్నజోచఱచుచు◆ సన్నుతిఁ బాడు.

బసవపురాణము, పి. సో ఆ 3.

సీ. అలఁదు నలుంగు దే◆హమున వెణ్ణీళ్ళార్చుఁ, దడియొత్తు మెత్తని◆ ధవళవస్త్ర
మునఁ గాలి వ్రేలిమ◆న్నున బొట్టు పెట్టుఁ గ,న్గవఁ బెట్టుఁ గాటుక◆ కడుపునకును
బెట్టుఁ బొత్తులమీఁద◆ బొట్టుఁ జన్నిచ్చుజో,కొట్టుఁ జోలలుపాడు◆ముక్కుపఱచుఁ
దలయంటుఁ జిట్టాము◆దమున రక్షార్థంబు, మసిఁడికోలలు మంచ◆మున నమర్చుఁ

గీ. ద్రాటనులిగాయఁ గూర్చి పా♦దములఁ గట్టు, నుప్పువేఁపాకు పైఁజల్లు♦నిప్పులతివ
దిప్పియిడు దృష్టిదోషంబు♦దీర వీథిఁ, బ్రేమ మీఱంగ బిడ్డలఁ♦బెంచునపుడు.
కాళహస్తిమాహాత్మ్యము, ౩

సీ. తల నంటి మేనఁ బొ♦బ్బిలఁగఁ జమురు పూసి,సకలాంగములు దిద్ది♦చక్కనొత్తి
జలకముల్ గోర్వెచ్చ♦జలములచే నార్చి,తడి పోవ కర్ణరం♦ధ్రముల నూది
చలువసన్నపుఁబొట్ట♦ముల మేనఁ దడియొత్తి, పట్టుపొత్తుల మెత్త♦పడక నునిచి
నును పైనకాటుక♦కనుఁదమ్ముల ఘటించి, బొమలు దీరిచి చుక్క♦బొట్టుఁ బెట్టి
గీ. పొదిగిటను జేర్చి పాలిచ్చి♦బుజ్జగించి, కెంపు రవచెక్కడంపుని♦ద్దంపుసొంపు
నింపు నుయ్యెలలోన ని♦ద్రింపు మనుచుఁ, బాటఁబాడుచునూచు రా♦పట్టినపుడు.
తాలాంకనందనీపరిణయము.

# స్త్రీశుద్ధాంతవాసము.

(ఘోషా)

క. సీగలు గృహములఁ దగుప్రా,కారములును దగిన తెఱలుఁ♦గాపులు మఱవే
నారీజనులకు సవ్యాగు,దారం బగు చరిత మొకటి♦దప్పింపంగన్. 325
క. వ్యసనంబులఁ బరిణయముల, వసమములగు సంగరముల♦యాగంబులఁ బో
ల్లసదుత్సవముల మఱువులు, బిసరుహనయనలకు వలదు♦వృషులవిచారా. 3263
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2324, 2325.

# స్త్రీవిద్య

చ. ఉవిదలు తాము బాల్యమున♦యుక్తముగాఁ జదు పభ్యసింపకే
యవని మెలంగు చుండిన న♦నర్హము లౌ పను లాచరించుచుం
బవివిమలభావముం గనక♦కన్నన మూర్ఖతపాలుగా రొకో
యవుఁగద విద్య నేరని జ♦నావళి కేఁటివివేకసంపదల్. 3264
క. రాతిరికి నిండువెన్నెల, చేతం దమ మెడలి వెలుఁగు♦చేకుఱురీతిన్
నాఁతికిని విద్యచేత మ,హాతమముం దొలఁగి తెలివి♦యలవడును గదా. 3265
శా. పాతివ్రత్యముచేత నెట్టిఫలముల్♦ప్రాపించునో యెట్టివి
ఖ్యాతం బైతగుపుణ్యముల్ శ్వశురసే♦వాసక్తిచేఁ గల్గునో

నీతిం దప్పకయున్న నెట్టి సుకృతా◆నీకంబుఁ జేకూరునో
యేతద్ధర్మము లెల్లఁ దెల్లమగుఁ గా◆దే విద్యచే? స్త్రీలకున్. 3266

చ. ఇహపరసౌఖ్యహేతువగు◆నింతులకున్ బతిభక్తి దానికిన్
మహితవివేకసంపద ఘ◆నంబగుకారణ మౌను దానికిన్
సహజవిమూఢతం గెడపఁ◆జాలినవిద్యయె ముఖ్యమూలమై
మహి వల రొందుఁ గాన నది◆మానినికిం దగు నభ్యసింపఁగన్. 3267

ఉ. ఎయ్యది యౌర్వమిం గెడపు◆ నెయ్యది పాపము బాపవర్తనం
బెయ్యది తామసం బణఁచు◆ నెయ్యది రూపఱఁ జేయు సాహసం
బెయ్యది సత్స్వభావ మిడు◆ నెయ్యది గూర్చును సూనృతవ్రతం
బయ్యనవద్యవిద్య వల◆దా యిలఁ దారతివల్ పఠింపఁగన్? 3268

నయనోల్లాసము, ఆ 1 పద్య 95-102.

—◆ గద్య. ◆—

శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ సుకవితావిలసిత చాగాజకులసంజనిత,
దాసరి కొండయాఖ్యసుజనసుత, పీఠికాపురప్రభుపోషిత, సకల
జనవిధేయ, లక్ష్మణనామధేయ సంకలితంబైన
వర్ణనరత్నాకరమునందు ద్వితీయభాగము
సంపూర్ణము.







# పరబ్రహ్మము.

సీ. అమలమై స్వచ్ఛమై ♦ యాద్యంతశూన్యమై, శుభ్రమై ఘనసంప♦దభ్ర మగుచు
నిత్యమై సత్యమై ♦ నిర్మలాకారమై, యందమై యానంద♦కంద మగుచు
పూర్ణమై దివ్యమై ♦ బోధస్వరూపమై, బుద్ధంబునై స్వత♦స్సిద్ధ మగుచు
నమితమై నిర్వేద్య♦మై నిరంజనమై పరంజ్యోతియై మహా♦రమ్య మగుచు
గీ. సద్వయబ్రహ్మచైతన్య♦మై వెలుంగు, నట్టిబైటను నేమి గ♦న్పట్టు బెట్టు
లైన నిబ్బంది తెల్విక♦లేనికే కలిగె ననవలసె రజ్జుస♦ర్పగతి ననఘ.

మ. కనకం బొక్కటె నేకభూషణములై ♦ గాన్పించుచందంబునన్
ధ్వని దా నొక్కటి వాద్యభేదముల భే♦దంబైనచందంబునన్
మననాకారవిచిత్రదృశ్యతఁ బ్ర♦హ్మాభాసతేజంబు తాఁ
గనుపట్టు న్సకలంబు నౌచు నిజమో♦క్షశ్రీ వివాహోత్సవా.

శ్రీరామస్తవరాజము, ఆ 2.

గీ. దండముమహాత్మ నెవ్వాని ♦ నందలేవు, కాంతు రెవ్వానిదహరపు♦ష్కరమునందు
పరమయోగీంద్రులధికతా♦త్పర్యలీల, నట్టి నీకు నమస్కార♦మఖిలవంద్య!
సీ. బుద్ధ్యహంకారరూ♦పుని భజింతుము నిన్నుఁ, బంచతన్మాత్రరూ♦పా భరింపు
పంచకర్మేంద్రియ ♦ పంచబుద్ధీంద్రియా,త్మక! మనోరూప! యే♦మఱకు మమ్ము
క్షిత్యాదిపంచకా♦కృతి! మమ్ము రక్షింపు, విషయాత్మకా! మమ్ము♦విడువవలదు!
బ్రహ్మాండరూప! మా♦పాలిపెన్నిధి వీవు, ప్రాణఘనముఁ దద♦భ్యంతరస్థ!
గీ. కొలుతు మర్వాక్పరాగ్రూపుఁ♦గోరి నిన్ను, విశ్వరూపుని నిన్ను సే♦వింతు మెపుడు
నవధరింపుము నిత్యస♦త్యస్వరూప!, సదసదీశ్వర! యుభయహ♦స్తంబు నూపు!
సీ. నిగమత్రయంబు నీ♦నిశ్వాసపవనంబు, నీమూర్తిభేదంబు ♦ నిఖిలజగము
నీయంఘ్రి మేదిని ♦ నీమూర్ధమాకాశ, మంతరిక్షము నాభి♦యందు నీకుఁ
జంద్రుండు హృదయంబు ♦ చక్షు వ్వహీనుండు, తనురుహవ్రాతంబు♦దరులు నీవ
నీవు సర్వంబును ♦ నీయందు సర్వంబు, స్తోతృస్తుతి స్తవస్తో♦త్ర విరూప

గీ. మొ్రొక్కెదము నీకునని మహా♦మునులు సురలు, నలికతలమున సేవాంజ♦లులు ఘటించి.

\+ + + + + +

కాశీఖండము, ఆ 2 పద్య 3-7.

సీ. ఏకమై పరమై వి♦శోకమై సత్యమై, లోకమై వ్యాపకా♦లోక మగుచు
జ్ఞానమై జగదధి♦ష్ఠానమై ముక్తి నిదానమై మాయావి♦హీన మగుచు
నందమై కేవలా♦నందమై సంతతా, స్పందమై శ్రుతిపద్మ♦కంద మగుచు
సారమై చిదచిదా♦కారమై యతినిర్వి, కారమై......సం♦సార మగుచు
తే. జిలుఁగుమేలుసులకలఁకలు♦గాగికొనుచు, మెలఁగు ప్రకృతినిఁదగులక♦మిగిలి వెలుఁగు
వెలుఁగువెలుఁగంగఁజేయుచుఁ♦గలయ వెలుఁగుఁ, బరమపరిపూర్ణ నిర్గుణ♦బ్రహ్మమనఘ.

సీతారామాంజనేయసంవాదము, ఆ ౩ పద్య 6.

సీ. బ్రహ్మంబు నిజము ప్ర♦పంచంబు సత్యంబు, బ్రహ్మమే జీవుఁడ♦ పరగుచుండు
బ్రహ్మవిజ్ఞానంబు ♦ ప్రభవించ జీవుండు, బ్రహ్మమై భాసిల్లు ♦ పట్టుమీఁఱ
నామరూపగుణాదు♦లేమియు లేవు బ్ర,హ్మంబున కవి యెల్ల♦మధ్యకాల
కల్పితంబులు ధర్మ♦కర్మాదు లను బెల్ల, భ్రాంతిచేఁ బుట్టును ♦ బ్రాణులకును
గీ. ఘటకుటీరాదినభములు ♦ ఘటముఖములు, చెడిన పూర్ణనభంబునఁ ♦ జేరుభంగి
జీవము లుపాధివదలంగఁ♦జెందు బ్రహ్మ,మందు నవటంచు ననియె నా♦యజ్ఞమూర్తి.
సీ. బ్రహ్మంబునకుగుణా♦భావంబుఁ జెప్పరో, హేయగుణాభాస♦ మేయనఁదగు
జీవేశ్వరైక్యమే ♦ చెప్పిన బ్రహ్మంబు,నకుఁ బరాత్పరత చే♦కకవసించు
నది గాక నీకునఁ♦కుదయాంతములు చెప్పు, నిగమతత్త్వంబున ♦ కగు సకలత
నంతియు గాక ని♦త్యానందసుజ్ఞాన,ములు బ్రహ్మమందుసం♦చలత నొందు
గీ. నామరూపాదికములకు ♦ లేమిఁ జెప్పు, పట్ల ప్రాకృతనామరూ♦పములు లేవు
దివ్యనామాదినాకృతు♦ల్తెలియ బ్రహ్మ,మునకుఁ గలవంచుఁ జెప్పుట♦ముఖ్యమరయ.

భార్గవపురాణము, ఆ 8.

# విగ్రహారాధననిరసనము.

గీ. తామ్రమృద్దారుశిలలను ♦ దలఁపుతోన, యీశ్వరుం డని పూజింప♦నేమి ఫలము
తనమదినయుండు నీకుండు♦తన్ను దాను, తెలియ నేరనివానికి♦దెరవు లవియు.

శ్రీరామస్తవరాజము, ఆ 1.

# ఏకేశ్వరోపాసనము.

సీ. పరిమళద్రవ్యంబు ♦ బహుళమై వర్తింపఁ, జని కర్దమముఁ బూసి♦కొనినయట్లు
సరిలేని రత్నభూ♦షణములు వర్జించి, గురువెందసరములు ♦ గోరినట్లు
సరసాన్నభక్ష్యభో♦జ్యములు విసర్జించి, మించి శాకమున కా♦శించినట్లు
వన్నెమీఱినపట్టు♦వస్త్రముల్ విడనాడి, కంబళిచేలముల్ ♦ గట్టినట్లు
గీ. అఖిలజగదేకనాథుఁడ♦వైన నిన్ను, దలఁప నొల్లక దేవతాం♦తరములందు
భక్తిసంపన్నులగునట్టి ♦ పాపరతులు, పొందుదురు రౌరవంబుల ♦ భువనవంద్య.

మత్స్యపురాణము, ఆ 4 పద్య 144.

# స్త్రీపునర్వివాహప్రశంస.

క. నాపత్నిని గొంపోయిన, పాపాత్ముని తలలు దుంచి ♦ పరువడిఁ బ్రా
రాపరిణయముం జేయుట, కై పూనితి మానికాల♦ము జ్ఞాతముగా.
ఉ. కావున నీవు సాహ్యపురా♦కష్టుని కిచ్చుట గూడ దంక న
ద్భావుఁడు కోపియుండు మిత♦భాషి విభీషణుఁ డెన్నిభంగులన్
శ్రీనిధియుండు వాని నినుఁ♦జేర్చుట నాకు శుభం బటంచు నా
భూవిభుఁ డానతిచ్చినను ♦ బుష్పసుగంధి వచించె నత్తఱిన్.
ఆ. అనఘ మున్ను రాక♦ణానురుభాగ్యనై, సుతులఁ బడసి యిప్డు♦శిరా పురుష
పరిణయంబు గొనిన ♦ ధరలోన నగుదురు, గాదనీ వెలుంగ♦వే సగాఢ.
సీ. అనిన భూపతి పల్కె ♦ నతివ నాకమునకు, పతు లెందఱైనను ♦ భాగ్యయుక్త
శచి బొల్పడదె సుర♦జాతుల కొక సర,స్వతి పరివర్తించదే ♦ చంద్రసురుల
కేకమై శక్తిదా ♦ నెలమి వర్తింపదే, పదిపట్టునల కొక్క ♦ పద్మగేహ
కులసతి యగుచు సం♦కోచంబు మానదే, ప్రియముతో నిపు డి♦భీషణునను
గీ, భార్య వైనను బ్రతినిష్ఠఁ ♦ బాయకుండు, సతులలో నగ్రగణ్యవై ♦ సౌఖ్యసిద్ధి
నొందెదవటన్న నాదర♦ మొనగ మయుని, పుత్రికరములు మోడ్చిభూ♦భుజునికనియె.
క. నలినాసనసురముఖ్యులు, దలఁపఁగ నీచిత్తవృత్తి ♦ దప్పగలేరో
జలజాక్ష యేనుబాయం, గలనటవే నెంతగానఁ ♦ గరుణావార్ధీ.

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 6.

## వనవాసనిరసనము.

సీ. నిలయంబు విడిచి కా♦నల కేఁగినంతనే, చెడదు కామంబు ని♦శ్శేష మగుచు
గురుజరాభారంబు ♦ ధరియించినంతనే, యుడిగిపోవదు క్రో♦ధ మూన మగుచు
కందమూలాదిభ♦క్షకుఁడైనయంతనే, చనదు లోభంబు ని♦స్సార మగుచు
సంతతవ్రతజపా♦సక్తి నున్నంతనే, విడువదు మోహంబు ♦ విరళ మగుచు
గీ. నజినవల్కలములు గట్టి♦నంతమాత్రి, మదము చెదరదు మత్సరం♦బెదుగ కుండ
దనఘ ! యటుగావవనవాసి♦యైనయంత, భూరినిర్వాణసౌఖ్యంబుఁ♦బొందవశమె
గీ. చిత్తశుద్ధిఁగన్న ♦ యుత్తమచరితుండు, నిలయమునవసింపఁ♦గలుగుముక్తి
హీరమెన్నిచోట్ల ♦ నేరీతినున్ననో, కింతయైనవికృతి ♦ నేలఁగాంచు.

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 2.

## జాతిభేదము.

సీ. మహితమేదశ్చర్మ♦మజ్జాదికములైన, సప్తధాతువు లేక ♦ సరణిగాను
సకలజంతువులందు ♦ సమకూడియుండఁగా, హెచ్చుతక్కువజాతు♦లేర్పరించు
విధమేమి భైరవ ♦ విపులశాసనమున, మాతృగర్భమునసె♦మ్మది జనించి
మలయు దేహమునకే ♦ మందుఁ డేనియు నుచ్చ, నీచంబు లెంచునే♦ నెమ్మనమున
గీ. నట్లగుట జాతిసంగతు♦లపరిమాణ, మని తలంపరు జాతిద్వ♦యంబు గలదు
యువిదలోకజాతి మగవా♦ళ్లొక్కజాతి, దానస్త్రీజాతియెక్కువ♦దలఁచిచూడ.

శంకరవిజయము, ఆ 4.



భవ్యపదాకరము! భావసుధాకరము!! పరిమళకుసుమాకరము!!!

# వర్ణనరత్నాకరము

3, 4, భాగములలో ముద్రింపఁబడుచున్న విషయములు.

బ్రహ్మవిష్ణుమహేశ్వరస్తుతి
వాణీలక్ష్మీపార్వతీస్తుతి
శ్రీవేంకటేశ్వరస్తుతి
నృసింహస్తుతి
దత్తాత్రేయస్తుతి
భీమేశ్వరస్తుతి
మహేంద్రస్తుతి
గంగాస్తుతి
బ్రహ్మ
విష్ణువు
ఈశ్వరుఁడు
శేషశాయి
వటపత్రశాయి
శ్రీరంగశాయి
శార్ఙ్గపాణి
అర్ధనారీశ్వరుఁడు
రాముఁడు
కృష్ణుఁడు
కూర్మావతారము
పరశురాముఁడు
నృసింహమూర్తి

వరాహమూర్తి
దశావతారములు
వామనుఁడు
మాధవుఁడు
వీరభద్రుఁడు
విశ్వరూపము
వేంకటేశ్వరుఁడు
భీమేశ్వరుఁడు
రామేశ్వరుఁడు
విశ్వనాథుఁడు
వరదరాజులు
వృషభేంద్రుఁడు
[illegible]రిప్రుఁడు
అష్టదిక్పతులు
ఇంద్రుఁడు
కుబేరుఁడు
యముఁడు
యమకింకరులు
బలిచక్రవర్తి
క్షేత్రపాలకుఁడు
నారదుఁడు
విశ్వామిత్రుఁడు

వసిష్ఠుఁడు
వాల్మీకి
వేదవ్యాసుఁడు
మార్కండేయుఁడు
అగస్త్యుఁడు
మనవాళమహాముని
సప్తర్షులు
ప్రహ్లాదుఁడు
విప్రనారాయణుఁడు
ఆంజనేయుఁడు
సూర్యుఁడు
చంద్రుఁడు
తక్షకుఁడు
కలిరాజు
కాముఁడు
క్రోధుఁడు
మోహము
లోభము
రావణుఁడు
కుంభకర్ణుఁడు
వాలి
సుగ్రీవుఁడు

కబంధుఁడు
హిరణ్యకశ్యపుఁడు
నరకాసురుఁడు
సారంగధరుఁడు
పాండవులు
ధర్మరాజు
అర్జునుఁడు
దశరథుఁడు
రాజశ్రేష్ఠులు
దేవతలు
బ్రాహ్మణకవి
పద్మనాయకులు
లక్ష్మి
పార్వతి
విశాలాక్షి
జగన్మోహిని
రతీదేవి
అప్సరసలు
రంభ
ఊర్వశి
మేనక
మోహిని
అహల్య
చిత్రాంగి
దేవదేవి
మధురవాణి
పూతన
తాటక

కుబ్జ
మునికన్యలు
స్వర్గలోకము
వైకుంఠము
కైలాసము
సత్యలోకము
ఇహపరలోకతారత
మ్యము
స్వర్గమునఁగలదోషము
పుణ్యలోకము [లు
నిర్ఋతిలోకము
వరుణలోకము
ఈశానలోకము
సూర్యలోకము
చంద్రలోకము
బుధలోకము
అంగారకలోకము
బృహస్పతిలోకము
శనైశ్చరలోకము
నరకలోకము
అలకాపురము
పాతాళలోకము
కాశీపురము
జగన్నాథము
శ్రీరంగము
కాంచిపురము
గయ
ద్వారకాపురము

కాళేశ్వరము
శ్రీవిలుబుత్తూరు
పీఠికాపురము
సర్పపురము
దక్షారామ
పల్వెల
బొబ్బిలి
బ్రహ్మసభ
ఈశ్వరసభ
ఇంద్రసభ
రామసభ
కృష్ణసభ
వరుణసభ
కుబేరసభ
మయసభ
యమసభ
శ్రీశైలము
అహోబలశైలము
వేంకటాచలము
వీరభద్రాచలము
హిమవత్పర్వతము
మేరుపర్వతము
మందరపర్వతము
వింధ్యపర్వతము
సింహాచలము
బదరీవనము
అగస్త్యాశ్రమము, నైమి
తీర్థసేవ [శము

సాంఖ్యయోగము
తామసయోగము
రాజసయోగము
సాత్వికయోగము
అధ్యాత్మవిద్య
యమనియమాదులు
ఆత్మరక్షణము
నిర్గుణము
సంగవిరక్తుడు
సమాధి
వేదాంతము
వైరాగ్యము
తత్త్వోపదేశము
సంచారములు
సాముద్రికము
(భాగ్యలక్షణములు)
బ్రహ్మవిష్ణాని
శ్రద్ధాభక్తులు
తలిదండ్రులు
పితృభక్తి
మాతృభక్తి
ఋణపత్రము
(ప్రామిసరీనోటు)
దొంగసాక్షి
దొంగసన్యాసి
దంతధావనపద్ధతి
భూషణధారణపద్ధతి
వస్త్రధారణపద్ధతి

పుష్పధారణపద్ధతి
చందనచర్చాపద్ధతి
వృక్షపుష్పఫలలక్షణము
గోశకునలక్షణము
పక్షిశకునలక్షణము
విత్తనములుచల్లుట
గృహలక్షణము
కాలమానస్థితి
మేఘవిషయము
ఉఱుమువిషయము
మెఱుపువిషయము
ఇంద్రధనుర్విషయము
బాలగ్రహములు
ఫలగ్రహాఖ్యాత
ధనవినియమము
నవరత్నములు
నివాళులు
జోలలు
మేలుకొల్పులు
లాలిపద్యములు
దారిద్ర్యము
క్షామము
అనావృష్టి
గ్రహణము
నౌబత్తు
కోలాటము
సుపుత్త్రుడు
పుత్త్రగర్హణము

గురువులు
శిష్యులు
రాజకన్యకాగురుడు
రాజస్వప్నము
రాజనజరులు
ఆసనభేదములు
నాడులు
చక్రములు
కాయసిద్ధి
మనోనిశ్చలత
ఎఱుక
స్వప్నాదులతెఱంగు
మరణము
క్షీరసాగరమథనము
విప్రధనాపహరణము
పరదారాగమనదోషము
విష్ణుపట్టాభిషేకము
రామపట్టాభిషేకము
భాగవతమహిమము
గజేంద్రమోక్షము
ప్రహ్లాదచరిత్ర
వామనచరిత్ర
వేణుగానము
గోపికావస్త్రాపహరణము
ద్రౌపదీవస్త్రాపహరణము
రుక్మిణీకల్యాణము
కృష్ణలీలలు

పుష్పమాలికాబంధము
గోమూత్రికాబంధము
పద్మబంధము
కంకణబంధము
అష్టదళపద్మబంధము
తలకట్లకందము
గుళ్లకందము
ఏత్వములకందము
ఏకాక్షరకందము
ఓష్ఠ్యము
ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరము
అచలజిహ్వము
ద్వ్యక్షరికందము
ద్విరుక్తికందము
త్రిప్రాసకందము
ముక్తపదగ్రస్తము
సర్వతఃప్రాససీసము
సర్వలఘుసీసము
ద్వంద్వప్రాసకందము
యతిభేదకందము
శబ్దచిత్రసీసము
పాదభ్రమకందము
పాదయమకము
వృత్తకందగర్భసీసము
ఆంధ్రగీర్వాణభాషాశ్లేషము
నవగ్రహరత్ననిధానసీసము
పాదాంతపాదాదిముక్తపదగ్రస్తము
సింహావలోకనముక్తగ్రస్తము
వృత్త్యనుప్రాసము
లాటానుప్రాసము
ఉభయభాషాకందము
అనులోమము
సగర్భకందగీతము
గర్భితకందము
గర్భగీతము
చతుర్విధకందము
నాగపంచమీసము
సంవత్సరముక్తసీసము
ఫలశ్రుతి
మంగళము

---

ఇట్టింకను వందలకొలఁది ననేకవిషయములు ముద్రింపఁబడుచున్నవి. మఱియు ననేకచాటుపద్యరత్నంబులును, సమస్యలునుగూడ నిందుఁ జేర్పఁబడుచున్నవి.

వెయ్యేల! భారతభాగవతరామాయణాదిసద్గ్రంథములయందును, దక్కిన ప్రబంధంబు లన్నిఁటియందునుఁగల వర్ణనలు, నీతులు, ధర్మములు, భక్తివైరాగ్యాది సమస్తవిషయంబు లీగ్రంథమువలన నామూలాగ్రముగ గ్రహింపవచ్చును.

వెల రు 3-8-0 లు మాత్రమే. 4 భాగములొకేసారి కోరువారికి రు 6--0--0 లకే పంపఁబడును. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

 వాసిరిలక్ష్మణస్వామి.

పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా.

## ఈగ్రంథకర్తవలన రచింపఁబడిన యితరగ్రంథములు



# విజయవిలాసనాటకము.

ఇది చేమకూర వేంకటకవికృతమగు విజయవిలాసములోని రసవంతములగు పద్యములఁ జేర్చి రచియింపఁబడిన నాటకము.

### బలరాముని సందేశము.

సీ. ముని వేసము ధరించి ♦ ముగుదను గొంపోవు,ట గన వీరులకును ♦ మగతనంబె
ఒరున కీఁదలఁచిన ♦ యువిదకై కాంక్షింపఁ, బార్థివోత్తములకుఁ ♦ బౌరుషంబె
వీట నెవ్వరులేని ♦ వేళఁ గన్గొని ముచ్చు,రీతి నిల్లెగుట ♦ నీతి యగునె
అడ్డువచ్చినసేవ ♦ కావలిఁ గడిమిమై, మట్టుపెట్టుటలు స♦న్మార్గమౌనె
గీ. అర్జునా క్షత్రియుండ వీ♦వగుదువేని త్రప,లేదె? యానురులపైనాశ♦లేదె? నుంత
యేలచచ్చెద వర్పింపు ♦ మింతిఁదెచ్చి, వేఁడికొమ్మిప్డె క్షమియింతు♦వేగనిన్ను.

### పార్థుని ప్రత్యుత్తరము.

సీ. పడఁతులఁగాంక్షించి ♦ బల్మిఁగొంపోవ నీ,తమ్ముఁడే నేర్పిన ♦ ధర్మమనుము
తన్నుఁ బ్రేమించిన ♦ తన్వి కేల్ గైకొంట, నృపసత్తములకిది ♦ నీతియనుము
అనురాగవతియు మే♦నత్తకూఁతురెగాన, ముచ్చుఁదనంబనఁ ♦ బోలదనుము
క్షత్రియుండనొ నేను♦గాక పాలికుఁడనొ, చేచాయఁజూచినఁ ♦ జెప్పుననుము
గీ. బావమఱఁది పైదయనుంత♦వలపుమనుము, వ్యర్థమాదురాచారంబు♦వదలుమనుము
బుద్ధిగనకున్న యుద్ధమే♦సిద్ధమనుము, జాగుసేయక భద్రివే ♦ వేగచనుము.

వెల 10 అణాలు.

# భర్తృహరిప్రబోధము.

ఈనాటకమునందు (1) కన్యాశుల్క వరశుల్క నిరసనము (2) స్వయంవరణ (3) గృహస్థవిధులు (3) సంసార వివేచనము (5) గురుపదుపదేశము (6) జ్యోన్నాని దుర్మతము (7) వార్ధక్య విచారము (8) భగవత్సేవా విధానము (9) పతివ్రతాధర్మములు (10) నిర్వేదము మున్నగు విషయములు గలవు.

# భర్తృహరిప్రబోధము.

సీ. కుసుమకోమలులకుం ◆ గొంగు మేలిమియగుఁ, బ్రాణనాథుని పాద ◆ పద్మసేవ
కుటిలకుంతలులకు ◆ కోటినిధానంబగుఁ, బ్రాణనాథుని పాద ◆ పద్మసేవ
కలభాషిణులపాలి ◆ కల్పవృక్షంబగుఁ, బ్రాణనాథుని పాద ◆ పద్మసేవ
కిసలయాధరలపా ◆ లిటకామధేనువు, ప్రాణనాథుని పాద ◆ పద్మసేవ
ఆ. వె. కరిగమనలదుఃఖ ◆ కలుషాపహరణంబు, ప్రాణనాథుని పాద ◆ పద్మసేవ
సతుల కతులవితత ◆ సౌభాగ్యవహంబగుఁ, బ్రాణనాథుని పాద ◆ పద్మసేవ.
సీ. పన్నగాధిపుఁడును ◆ పక్షీంద్రుఁ డొకవేళ, వరమైత్రిఁ గనఁ జూడ ◆ వచ్చుఁ గాని
యిభరాజు మత్తసిం ◆ హేంద్రుఁడు నొకటఁ బట్యంబుఁ జెందుటఁ జూడ ◆ నగును గాని
సతిశీతకరుఁడు సూర్య ◆ కిరణంబు లొకవేళఁ, గలసియుండఁగఁ జూడ ◆ గలుగు గాని
కలువయుఁ బద్మినీ ◆ కాంతయు నొక్కట మైత్రి, చెలంగుటఁ జూడఁ ◆ జెల్లు గాని
గీ. యాచకుండును యాచకుం ◆ డరియు నరియు, పంతువాసికిఁ గలహించు ◆ వైశ్యజనులుఁ
బరమమైత్రి నుండఁగఁ జూడ ◆ వచ్చుగాని, సవతులందు సఖ్యతఁ జూడ ◆ జగతి నగునె

వెల 10 అణాలు.

# వేశ్యాసహవాసఫలితము.

సీ. అగ్నిసాక్షిగఁ బెండ్లి ◆ యాడినసతి విడి, వేశ్యల దరిఁ జేరు ◆ వెఱ్ఱులార
సానియింటను యున్కి ◆ సౌఖ్యంబుగాఁ దలఁ, పోయుచుండెడు పశు ◆ ప్రాయులార
పూర్వార్జితంబులఁ ◆ బూని మీఱఁగ వెల, యాండ్ర పాలొనరించు ◆ నధములార
కమనీయ దేహంబు ◆ గణికాంగనారతి, సంకటపడఁ జేయు ◆ జారులార
గీ. బంధుజనబోధనల రోసి ◆ పగలు రేయి, రోవెలందులఁ గూడెడు ◆ క్రూరులార
కులము మర్యాదలను గూల్చు ◆ కూళలార, యాలకింపుఁడీ హితము మో ◆ హాంధులార
మ. ధనమే ప్రాణము దివ్యసంగ్రహణమే ◆ ధర్మంబు, వశ్యప్రపీ
డనమే నిష్ఠ, యసత్యమే చరితము, బల్ ◆ డంబంబె విజ్ఞానమౌ
చనమా రోఁ జెలికట్టె దానికయి యా ◆ శం బొందఁగా నేలనో
మనమా! స్వస్థతఁ జెంది యింక మనుమా ◆ మార్గ్యంబుఁ బోనాడుమా.
మ. అనపత్యం బొవఁ గూడుటొక్కటియు, న ◆ న్యాయంబుగా నింటభా
ర్యను నేడ్పించుట రెండు, రోగచయమా ◆ రాశిందగులొక్కంట మూఁ
డును, వారాంగనఁ గోరునారలకు మూఁ ◆ డుంగాన యోజించి యో
మనమా స్వస్థతఁ జెంది యింక మనుమా ◆ మార్గ్యంబుఁ బోనాడుమా.

వెల 4 అణాలు.